

సదాశివ సమారంభాం
గురు దక్షిణామూర్తి
గురు వేదవ్యాస మహర్షి
గురు శుక మహర్షి
గురు నారద మహర్షి
గురు వాల్మీకి మహర్షి
గురు శ్రీకృష్ణ
శంకరాచార్య మధ్యమాం
గురు దత్తాత్రేయ
గురు బాబాజీ
గురు గౌతమ బుద్ధ
గురు ఆదిశంకరాచార్య
గురు రామానుజాచార్యులు
గురు జ్ఞానేశ్వర్
గురు రవిదాస్
గురు కబీర్ దాస్
గురు చైతన్య మహా ప్రభువు
గురు నానక్
గురు రాఘవేంద్ర స్వామి
గురు వీరబ్రహ్మేంద్ర స్వామి
యోగి వేమన
అస్మదాచార్య పర్యంతాం
గురు త్రైలింగ స్వామి
గురు లాహిరి మహాశయ
గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి
గురు వివేకానంద
గురు సాయి బాబా
గురు అరబిందో
గురు రమణ మహర్షి
గురు యోగానంద
గురు భక్తివేదాంత ప్రభుపాద
గురు మళయాళస్వామి
గురు విద్యాప్రకాశానందగిరి
గురు చంద్రశేఖర పరమాచార్య
వందే గురుపరంపరాం..

నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి. కనుక తమవంతుగా భక్తి, జ్ఞాన, ధర్మ ప్రచారార్ధం మహానుభావులైన శ్రీ సప్తగిరి వెబ్ సైట్ వారు ఉచితంగా విలువైన మాసపత్రికలను ఆన్ లైన్ ద్వారా eBOOK(PDF) రూపంలో అందిస్తున్నారు.వారు చేస్తున్న జ్ఞాన యజ్ఞానికి సాయి రామ్ కూడా తమవంతుగా సహాయం చేసే కార్యక్రమంలో భాగంగా వారి గ్రంధాలను సాయి రామ్ ద్వారా కూడా అందచేస్తున్నాము, ఇందుకు మేము వారికి కృతజ్ఞత తెలియచేసుకుంటున్నాము. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం చేసిన ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in),మైక్రోసాఫ్ట్ సైట్(http://www.microsoft.com) వారికి కూడా మేము ఋణపడివున్నాము. ఈ మాసపత్రికలు క్రొత్తవా లేక పాతవా? అని చూడకుండ, అందులోగల రత్నాలలాంటి విషయాలను తెలుసుకోవటానికి ప్రయత్నం చేయగలరు అని మనవిచేసుకొంటున్నాము..

ఈ మాసపత్రికలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) సప్తగిరి వెబ్ సైట్: https://www.scribd.com/search?query=sapthagiri
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంధ వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.



**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాధ పాద సమర్పణమస్తు *

## సప్తగిరి వారి వెబ్ సైట్

**https://www.scribd.com/search?query=sapthagiri**



# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని జళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014




### జైలులో....

నా పేరు సత్తి శ్రీనువాసరావు, నేను క్షణికా వేశంవల్ల తప్పుచేసి రాజమండ్రి సెంట్రల్‌జైలులో శిక్ష అనుభవిస్తున్నాను. ఎంతోబాధతో ఉన్నాను.

2012, డిసెంబరు 'సప్తగిరి' సచిత్రమాసపత్రికను నా తోటి సహోదరులు నాకు ఇచ్చి చదవమన్నారు. నాకు శ్రీవారిపాదసన్నిధిలో ఉన్నంత ఆనందం కలిగింది. ఒక్కమాటలో చెప్పాలంటే సప్తగిరిపత్రికను ప్రతిపేజీ చదవాలి అనిపించి పుస్తకం మొత్తం చదివాను. నిజంగా ఆ తిరుమల శ్రీవారే ప్రత్యక్షమైనట్టు అనుభూతి చెందాను. 'సప్తగిరి'పత్రికను ఇంకా ఇంకా చదవాలని ఆధ్యాత్మికజ్ఞానాన్ని నేర్చుకోవాలని ఎంతో ఆశగా ఉంది. కాబట్టి నాయందు మీరు దయ ఉంచి మీ పత్రికను పంపిస్తారని ఎదురు చూస్తూ ఉంటాను. మాది సామర్లకోట మండలం, పనసపాడు, తూ.గో.జిల్లా. నేను జీవితఖైదిగా 2 సం॥ లుగా జైలు శిక్ష అనుభవిస్తున్నాను. మీపత్రిక చదివి ఇంకా ఎన్నో విషయాలు తెలుసుకొని ఆధ్యాత్మికంగా ఎదగాలని ఉంది. మీ సప్తగిరిపత్రిక కోసం ఎదురుచూస్తూ ఉంటాను. జైలులో ఉన్నందువల్ల చందా పంపించలేకపోతున్నాను!!

***– సత్తి శ్రీనువాసరావు, సి.టి.నెం.8824,***
***వైనతేయ బ్లాక్ (జి–5), రాజమండ్రి సెంట్రల్ జైలు,***
***తూ.గో.జిల్లా – 533103.***

**☛ మీ స్పందనకు ధన్యవాదాలు. రాష్ట్రంలో ఉన్న అన్ని జైళ్లకు 'సప్తగిరి'ని ఉచితంగా పంపుతున్నాము. దయచేసి చదవండి. మీ సహచరులతో చదివించి శ్రీవారి దయకుపాత్రులవ్వండి.**
**– ప్రధానసంపాదకుడు**

ఓం నమో వేంకటేశాయ!

'సప్తగిరి' ఫిబ్రవరి సంచిక మా ఇంట్లో పాఠకులను ఎంతో ఆకట్టుకుంది. ముఖ్యంగా మీరు ప్రచురించిన సూర్యాష్టోత్తర శతనామావళిని జాగ్రత్తగా భద్ర పరుచుకున్నాం. రథసప్తమి విశిష్టతను చాలచక్కగా తెలియజేశారు. అలాగే శ్రీవారికి నిర్వహించే సప్తవాహన సేవల్ని ఫోటోల రూపంలో బాగా ఇచ్చారు. ఒక్కమాటలో చెప్పాలంటే ఆది నుంచి అంతంవరకు వ్యాసాలు అద్భుతంగా ఉన్నాయి. సంపాదకవర్గానికి అభినందనలు.

— 'అభిచంద్ర'
సూర్యారావుపేట, విజయవాడ-2

### ధన్యవాదాలు!!

జనవరిసంచికలో శ్రీమతి కె.విజయలక్ష్మి రచించిన మేల్‌మరువత్తూరు ఆలయవిశేషాలు మమ్మల్ని ఎంతగానో ఆకట్టుకున్నాయి. ఆక్షేత్రాన్ని వెంటనే దర్శించాలనే కుతూహలాన్ని కల్గించింది. ఇలాంటి మరెన్నో ఆలయవిశేషాల్ని అందించగలరు.

***– ఉరిటిభవానీ, ఆదర్శనగర్, రాజాం.***

మీ మాట

వేంకటాద్రిసమం స్థానం బ్రహ్మాండే నాస్తి కించన,
వేంకటేశసమో దేవో న భూతో న భవిష్యతి.



## శ్రీరామరక్ష - సర్వజగద్రక్ష


గౌరవ సంపాదకుడు :
ఎల్.వి. సుబ్రహ్మణ్యం, ఐ.ఏ.ఎస్.,
కార్యనిర్వహణాధికారి, తి.తి.దేవస్థానములు.

ప్రచురణకర్త-ప్రధాన సంపాదకుడు :
డా॥ సి.శైలకుమార్

సంపాదకుడు : డా॥ కె.రాధారమణ

ఉపసంపాదకుడు : డా॥ కె.రవిచంద్రన్

ముద్రాపకుడు : వి.సాంబశివరావు, డి.పి.టి., మేనేజరు, ముద్రణాలయం, తి.తి.దే.

డి.టి.పి. : ప్రధాన సంపాదకులవారి కార్యాలయం, తి.తి.దే., తిరుపతి

వర్ణచిత్రాల లే-అవుట్ : పి.శివప్రసాద్



***వివరాలకు :***
ప్రధాన సంపాదకుడు,
సప్తగిరి, తి.తి.దేవస్థానములు,
తిరుపతి - 517 507.
ఫోను : 0877-2264543, 2264359



సప్తగిరి మాస పత్రిక

విడి ప్రతి : రూ. 5/-
సం॥ చందా : రూ. 60/-
జీవిత చందా : రూ.500/-
విదేశాలకు సం॥చందా : రూ. 850/-


# సప్తగిరి

**తిరుమల తిరుపతి దేవస్థానముల సచిత్ర మాసపత్రిక**


**సంపుటి : 43 ఏప్రిల్, 2013 సంచిక : 11**




**ముఖచిత్రం : వసంతచందనశోభిత శ్రీమలయప్పస్వామి**
**చివరి పుట : నిత్యకల్యాణచక్రవర్తి సేవలో పదకవితాచక్రవర్తి**

సంపాదకీయం

# కొండలరాయని సన్నిధిలో కృష్ణరాయడు

'**నా**విష్ణుః పృథివీపతిః' కనుక విష్ణ్వంశ లేనిదే చక్రవర్తి కాజాలడు. శ్రీకృష్ణదేవరాయలు విష్ణ్వంశసంభూతుడు గనుకనే అతనిలో పరిపాలనదక్షత, తేజఃపరాక్రమాలు, ధైర్యసాహసాలు, దాతృత్వ, నీతిజ్ఞతలు వెల్లివిరిసాయి. జన్మాంతరసంస్కారంవల్ల అతనిలో విష్ణుభక్తి శ్రీవేంకటేశ్వరభక్తిగా పరిణమించి, తిరుమలరాయనిసేవలకు పాత్రుణ్ణి చేయడమే గాక ఆలయప్రాంగణంలో విగ్రహమూర్తిగా నిలిచే మహాభాగ్యాన్ని చేకూర్చింది. కేవలం భౌతికమైన, దాంభికమైన భక్తిగాక పరమాత్మునితో కూడిన కైంకర్యరూపనిర్మలభక్తి రాయల హృదయాన్ని అమృతాభిషేకంతో పునీతం చేసింది. కనుకనే ఏడుకొండలవాణ్ణి ఏడుమార్లు దర్శించి, అనేకఅనర్ఘ్యవస్తువులు స్వామికి సమర్పించి, తనకైంకర్యాన్ని ఆదర్శవంతం చేశాడు. ఏడుమార్లు దర్శించడంతో సప్తజ్ఞానభూమికలు దాటి, పైనున్నపరమాత్మను సాకారసద్గుణతత్త్వాలతో దర్శించినమనీషి, ధన్యజీవి శ్రీకృష్ణదేవరాయలు.

ఎందరోరాజులు ఎన్నిసేవలు చేసినా, ఎన్నిబహుమానాలు ఇచ్చినా రాయలకీర్తిచంద్రికను అతిక్రమించలేకపోయారు. ఆ విష్ణ్వంశ రాయలవారిజీవితకాలంలో తక్కువకాలమే శోభించినా, అతని కీర్తి, లోకంలో అనంతంగా ప్రకాశిస్తూ ఉంది. రాయలు శ్రీవారిని దర్శించి, ఇప్పటికి ఐదువందల ఏండ్లయింది. అయినా ఈనాటికీ స్వామి హృదయంలోనే గాక భక్తులహృదయాల్లోకూడా శ్రీకృష్ణదేవరాయలు చెరగని ముద్రతో వెలుగుతున్నాడు. రాయలు శ్రీవారికి గావించిన సేవలు తర్వాతిరాజులకు మార్గదర్శకాలై వారిజీవితాలపై కూడా ఎంతో ప్రభావాన్ని చూపాయి.

రాయల ప్రతివిజయంవెనుక శ్రీవేంకటేశ్వరునికృపాశౌర్యమూర్తి అండదండలుగా ఉన్నదని ప్రగాఢవిశ్వాసం. రాయలహృదయంలో శ్రీవేంకటేశ్వరుడు పరిపూర్ణంగా వ్యాపించి ఉండబట్టే సర్వత్ర విజయశోభితు డయ్యాడు. అలాంటి విజయాలకు కారణమైన శ్రీవారినీ, శ్రీకృష్ణదేవరాయల్నీ ఈ 'విజయ' సంవత్సరప్రారంభంలో– ఆనాటి విజయనగర సామ్రాజ్యాన్నీ, పరిపాలనవైభవాన్నీ, సాహిత్యచంద్రికల్నీ మనం స్మరించుకోవడం మన విజయసోపానాలుగా ఉంటాయనేది తథ్యం! పెద్దల అడుగుజాడలు తర్వాతివారికి మార్గదర్శకాలుకదా! రాయలఅదృష్టం భౌతికంగానూ, ఆధ్యాత్మికంగానూ సదా శ్రీవారిసన్నిధిలో ఉండే మహాభాగ్యానికి పాత్రుణ్ణి చేసింది. శ్రీవేంకటేశ్వరుడు రాజాధిరాజపరమేశ్వరుడు గనుక భూపాలురందరూ ఈ స్వామిదయవల్లనే తమ పదవులలో లబ్ధప్రతిష్ఠులు అవుతున్నారు. కనుకనే శ్రీవారిబ్రహ్మోత్సవాలలో సర్వభూపాలురు వాహనరూపంలో ఉండి స్వామిని సేవించే ఉత్సవకైంకర్యం ఏర్పడింది. దీన్ని 'సర్వభూపాల వాహనోత్సవం' అంటారు. ఈ పల్లకిలో ఉన్న సర్వభూపాలురలో మన శ్రీకృష్ణదేవరాయలుకూడా అదృశ్యరూపంలో ఒక భూపాలుడై స్వామిని దర్శిస్తూ, వహిస్తూ, స్తుతిస్తూ, నతిస్తూ భక్తుల్నికూడా దర్శిస్తూ, ఆనందిస్తున్నాడని భావిద్దాం!!

**గొప్పదేవుడికి గొప్పభక్తుడు రాయలు**

**ఉగాది** మారితే యుగం మారుతుం దనేది తెలుగు సామెత. యుగం మారితే మొగం మారుతుంది. కొత్తదనాన్ని దర్శించడానికి ప్రారంభమే ఉగాది. ఇదే తెలుగు సంవత్సరాది.

బ్రహ్మదేవుడు సృష్టించడం మొదలుపెట్టిన దినం యుగాది. "యుగస్య ఆదిః యుగాదిః". తెలుగుభాషలో 'య'- కారంతో మొదలయ్యే పదాలు లేవు. అందువల్ల యుగాది అనేది- 'ఉగాది' - అని పిలువబడుతున్నది. తెలుగుప్రజల వ్యవహారంలో యుగం - అంటే సంవత్సర మని అర్థం. కాలాను సారంగా యుగాది - ఉగాదిగా మారింది. ఈ దినమే నూతనసంవత్సరానికి ఆరంభం. కాబట్టి దీన్ని 'సంవత్సరాది పండుగ' - అని వ్యవహరిస్తారు. ఇది అచ్చమైన తెలుగు ప్రజల మొట్టమొదటి పండుగ. ఈ పండుగ తరువాతనే తెలుగువారి పండుగ లన్నీ ఒక్కొక్కటిగా విచ్చేస్తాయి.

ప్రకృతిపరవశించే కాలమే-ఉగాది. ప్రకృతికిఆధారం- పరమాత్మ. శ్రీనివాసుడు దివ్యవైకుంఠపదవి వదలి, తిరుమలపై పుష్కరిణీతీరంలో నివసించడం- భక్తజనులను ఉద్ధరించడానికే.

భూ, భూమి- పదాలకు జలమునుండి పుట్టింది- అని వ్యుత్పత్తి. నారాయణుడు నీటిని నివాసంగా గలవాడు. కాబట్టి భూలోకం శ్రీవారినుంచి ఏర్పడింది. పంచభూతాలు, మనస్సు, బుద్ధి, అహంకారము - ఈ ఎనిమిది - శ్రీహరిఅష్ట మూర్తులు. విశ్వమే విష్ణువు, విష్ణువే విశ్వం- కాబట్టి శ్రీవారు భూలోకానికి విచ్చేయడం, తన 'భూమి' రూపాన్ని చూచుకొని, ఆనందించ డానికే! 'సర్వం వాసుదేమయం"- కనుక, చరాచరాత్మకప్రకృతి అంతా - తనమూర్తే!

"కాలః కలయతా మహమ్"-అని గీతాభగవానుడు వచిం చాడు. కాలం అన్నింటికంటే గొప్పది. విశ్వంలోని అన్నింటినీ అణిచివేస్తుంది. గణించేది-ప్రేరేపించేది కాలమే! విశ్వానికి, ప్రేరణం, కారణం, విష్ణువే! రూపంలేని అనంతకాలాన్ని భగ వంతుడిగా భావించి, సంవత్సరాత్మకరూపంతో, ఆరాధించడం- ఉగాదిపండుగవిశేషం. ఈ దినం చంద్రుడు అశ్వినీనక్షత్రంలో ఉంటాడు. మేషరాశికి అధిపతి- కుజుడు. ఆతనితేజస్సు ఎరుపు. ఈ రంగు ప్రేమకు చిహ్నం. చెట్లు చిగురిస్తాయి. ఓషధులు నవనవోన్మేషంగా ఉంటాయి. చైత్రశుక్లపాడ్యమి సంవత్సరాది అని బ్రహ్మపురాణం వివరిస్తున్నది. ఆంధ్రప్రదేశ్, కర్నాటక, మహా రాష్ట్రాలలోని ప్రజలు చైత్రశుక్లపాడ్యమిరోజున - ఉగాది పండుగ చేసుకొంటారు.

తొలుత- ఉగాదినాడు ప్రారంభమైన బ్రహ్మసృష్టి, ఇప్పటికీ, అవిచ్ఛిన్నంగా కొనసాగుతూ ఉంది. అందువల్ల ఈ దినం కొత్తగా లెక్కలు మొదలుపెట్టడం, వ్యాపారాలు ప్రారం భించడం ఆచారమైంది. ఈ శుభదినాన తైలాభ్యంగనం, నూతన వస్త్రాభరణాలు ధరించడం, వేపపూత పచ్చడి తినడం, ప్రపా దానం (త్రాగడానికి మంచినీళ్లు ఇవ్వడం), పెద్దలను, గురువు లను, గౌరవించడం వసంతనవరాత్రికార్యక్రమాలు జరుపు కోవడం ముఖ్యమైనవి.

ఈ కాలంలోనే వసంతనవరాత్రివేడుకలు జరుగు తాయి. సూర్యుడు తనలోని సంపూర్ణశక్తిని, భూమిమీదికి



ప్రసరింపజేసేశుభసమయం ఇదే! శ్రీమహావిష్ణువు తనసహస్ర కిరణాలతో భూమాతను స్పృశించడంవల్ల– అంతకు మునుపు భూమిలో అణురూపంలో దాగిన జీవశక్తి చైతన్యవంతమై అనేక రూపాలతో, ప్రకృతిమాత నూతనోత్తేజంతో, సుందరంగా, దర్శన మిస్తుంది. చిత్రానక్షత్రంలో చంద్రుడు కలసి, పూర్ణిమ వచ్చుటచే, ఈ మాసం 'చైత్రమాసం' అయింది. చిత్రనక్షత్రానికి అధిపతి ఇంద్రుడు. ఉగాది– యుగాదిగా, నవవసంతచైతన్యకాంతులతో శోభిల్లుతుంది.

మానవులకు అత్యవసరమైంది ఆరోగ్యం. ఇది సూర్య నారాయణునిఅనుగ్రహంవల్ల చేకూరుతుంది. అందుకే "ఆరోగ్యం భాస్కరా దిచ్ఛేత్"– అనే సూక్తి జనవ్యవహారంలో ఉంది. సూర్యుడు ఆరోగ్యప్రదాత అని దీనిభావం. కాబట్టి మానవు లందరూ సూర్యోపాసకులు కావాలి. ఆరోగ్యం మనం తినే ఆహారంపై ఆధారపడి ఉంటుంది. ఈ పండుగనాడు మనం గ్రహించే వేపపూతప్రసాదంలో మంచిఔషధగుణా లున్నాయి. వేప పువ్వుతో కూడిన ఉగాదిపచ్చడిని, పూర్ణిమవరకు తింటే సంవత్సరమంతా విషజనితఅనారోగ్యాలు రా వని, ఆయుర్వేద గ్రంథాలు సెలవిస్తున్నాయి. ఉగాదిప్రసాదం, వాత, పిత్త, శ్లేష్మాల వల్ల వచ్చేవ్యాధులనుండి రక్షిస్తుంది. మనకు ఆరోగ్యా న్నిచ్చే వృక్షరాజం వేపచెట్టు. స్వర్గంలోని 'అంబ్రోసియా' వృక్షఅంశతో, భూమిపై వేపచెట్టు పుట్టిం దని మహారాష్ట్రసంప్రదాయం. వేపపూత, వేపచెట్టు నీడ, దానిగాలి, ఎంతో ఆరోగ్యప్రదమైనవి.

### ఉగాదిపచ్చడి పదార్థాలు

ఉగాది పచ్చడిలోని 1)వేపపూత, 2)ఇంగువ, 3)బెల్లం, 4)ఉప్పు, 5)కొత్తచింతపండు, 6)మిరియాలపొడి, 7)వాము, 8)జీలకర్ర, 9)పసుపు – ఈ పదార్థాల సమ్మేళనం–దివ్య ఔషధరసాయనం. వీటిలోకి కొబ్బెరముక్కలు, మామిడిముక్కలు కలుపుతారు. ఈ ప్రసాదం ఆకలిని పెంచుతుంది. చర్మ వ్యాధులను నివారిస్తుంది. చింతపండువల్ల వాతం తగ్గుతుంది. ఇంగువ క్రిములను నిర్మూలిస్తుంది. ఉప్పు (సైంధవలవణం) దప్పికను తగ్గిస్తుంది. కాబట్టి, ఉగాదిపచ్చడి తిని, మన ఆచారా లను సంస్కృతిని రక్షించుకుందాం.

### ఇష్టదేవతారాధన

ఉగాదినాడు, తమ తమ ఇష్టదేవతలను ఆరాధిం చడంతో "ఈ సంవత్సరమంతా మాకు దైవానుగ్రహం పూర్ణంగా ఉంటుంది. ఏ కార్యమైనా విజయవంతంగా చేయగల" మనే ధైర్యం, ఆత్మవిశ్వాసం ఏర్పడతాయి.

వేపపూతప్రసాదాన్ని గ్రహించడంవల్ల నూరేళ్లఆయుస్సు, వజ్రసమానమైన శరీరం, సకలసంపదలు కలుగుతాయి. సంవ త్సరమంతా ప్రజలు సుఖంగా జీవిస్తా రని తెలుగుప్రజల విశ్వాసం. ఉగాదినాడు మఱ్ఱి–మామిడి–నేరేడు–మేడి–జువ్వి– ఆకుల్ని, నీళ్లలో నానబెట్టి, ఆ నీటితో తలస్నానం చేయాలి. దీనివల్ల కంటికి, మెదడుకు చాలమంచిది.

### ఉగాదినాడు చేయవలసినకార్యక్రమాలు

1) ప్రతిగృహాన్ని మామిడాకుల తోరణంతో అలంకరించాలి.
2) అందరు అభ్యంగనస్నానం చేయాలి.
3) క్రొత్తవస్త్రాలు ధరించాలి.
4) ఇష్టదేవతారాధనను విధిగా చెయ్యాలి.
5) వేపపూత ప్రసాదాన్ని ఆరగించాలి.
6) పంచాంగప్రవచనం – శ్రవణం జరగాలి.
7) ప్రపాదానం (మంచినీళ్లు ఇవ్వడం) చేయాలి.
8) సద్గురువును దర్శించి పూజించాలి.
9) వసంతనవరాత్రి ఉత్సవాలు జరుపుకోవాలి.

కొద్దిమందిమాత్రమే పై కార్యక్రమాలను పాటిస్తారు. సామాన్యులు కొన్నింటినిమాత్రం చేస్తారు.

### తెలుగువారిప్రత్యేకత

ఉగాదిపండుగనాడు ప్రాతఃకాలమందే లేచి, తలంటు స్నానం చేయాలి. దీనివల్ల దేహంలోని ఇంద్రియా లన్నిటికీ ఉత్తేజం కలుగుతుంది. సుఖనిద్రపడుతుంది. శాంతిహోమం చేస్తే దుఃఖాలన్నీ తొలగుతా యని శాస్త్రాలు ఘోషిస్తున్నాయి.

ఉగాదిపచ్చడిని దేవునికి నైవేద్యంపెట్టి, ప్రసాదంగా స్వీకరించాలి. ప్రాతఃకాలమందే దీన్ని గ్రహించాలి.

ఉదయం స్నానంచేసి, పిండివంటలతో కూడిన నైవే ద్యాన్ని దేవునికి నివేదించి, ప్రసాదంగా స్వీకరించాలి. సాయం కాలం పంచాంగశ్రవణంచేయడం అధికఫలప్రదం. పంచాంగం అంటే 1)తిథి 2)వారం 3)నక్షత్రం 4)యోగం 5)కరణం–అనే అయిదు అంగాలు కలది. కొత్త సంవత్సరంలో వీటి ఫలితాల్ని

ముందుగా తెలుసుకోవచ్చు. కాబట్టి ఈ కొత్త సంవత్సరపంచాంగాన్ని పూజించి, ఉగాదినాడే దేవాలయంలో వినిపించి, తాము కూడా వినాలి.

**తిథి**

తిథి సంపదను, వారం ఆయుస్సును, నక్షత్రాలు పాపాలను పోగొట్టడం.

**యోగం**

వ్యాధినివృత్తిని, కరణం కార్యానుకూలంలో విజయాన్ని చేకూరుస్తుం దనే విశ్వాసంతో దైవజ్ఞులు పంచాంగాన్ని విన్పిస్తారు. ప్రజలు తమ, భవిష్యజ్జీవనాన్ని తెలుసుకొని, తగిన విధానాలు రూపొందించుకొంటారు.

**ప్రపాదానం**

ఉగాదిపండుగనుండి వేసవి (ఎండాకాలం) మొదలవుతుంది. కనుక ప్రపాదానం ప్రారంభించాలి. ప్రపాదానం అంటే చలువపందిరి వేసి, చలివేంద్రాలు పెట్టి, త్రాగడానికి మంచి నీళ్లిచ్చి దాహం తీర్చడం. ఉగాదిపండుగనాడు, గురువును దర్శిస్తే శ్రేయస్సు కలుగుతుంది. మన శ్రేయస్సు కోరేవారిని దర్శించి, వారిఆశీస్సులు పొందడం తెలుగువారిఆచారం. నేడు శాస్త్ర సాంకేతికపరిజ్ఞానం అభివృద్ధి చెందింది. అందువల్ల ఫోన్‌ద్వారా నయినా పెద్దలకు, గురువులకు ప్రణామాలు చేయాలి. సమానులకు శుభాకాంక్షలు తెల్పాలి.

తెలుగుసంవత్సరాదినాడు కలశస్థాపన చేసి, నాటి నుండి 4 రోజులు దేవీపూజలు చేస్తే – అపమృత్యుభయం ఉండ దని ధర్మసింధువు తెలియజేస్తుంది. శరద్వసంతఋతువులు మృత్యుదేవతకోర లని శాస్త్రం. కనుక అపమృత్యుభయకాలంనుండి గట్టెక్కడానికి, వసంతంలో శ్రీరాముణ్ణీ, శరత్తులో దుర్గాదేవినీ పూజించా లని పెద్దలు సూచించారు. అందుకే ఉగాదినుండి తొమ్మిదిరోజులు శ్రీరామోత్సవాలు నిర్వహించి, శ్రీరాముణ్ణి పూజించేవిధానం ఏర్పడింది. ఈ ఉత్సవాలకు అధిపతి వసంతుడు. ఈ తిథిని ఆరాధిస్తే, కాలాత్మకుడైన, పరమేశ్వరుడు, సుప్రసన్ను డౌతాడు. కాలవిజ్ఞానాన్ని, ప్రభావాన్ని గ్రహించి, మానవులు ధర్మకార్యప్రవర్తకులై ప్రవర్తింతురుగాక! **పాఠకులకు 'విజయ' సంవత్సరశుభాకాంక్షలు.**

# శ్రీరామనవమి

టి.ఎస్.జగన్మోహన్

చైత్రమాసంలో శుక్లపక్షనవమినాడు పునర్వసునక్షత్రంలో శ్రీరాముడు జన్మించాడు. శ్రీరాముడు జన్మించినరోజునే మనం 'శ్రీరామనవమి' అని అంటున్నాం. శ్రీరాముడిఆలయం లేనిఊరు మనతెలుగునాట ఉండదు. అయితే కేవలం తెలుగువారే కాక తమిళులు, మలయాళీలు, మహారాష్ట్రీయులు, దక్షిణభారత దేశంలో వివిధప్రాంతాలవాళ్ళూ రాముణ్ణి పూజిస్తారు. అలాగే అటు బెంగాలీవాళ్ళు, బీహారీలు, ఉత్తరప్రదేశ్, మధ్యప్రదేశ్ వంటి ఉత్తరభారతదేశంలోని వివిధప్రదేశాలవాళ్ళూ శ్రీరాముణ్ణి ఆరాధిస్తారు.

ఈ విధంగా మన భారతదేశంలో విశేషంగా పూజ లందుకునే శ్రీరాముడు–ప్రపంచంలోని వివిధప్రాంతాలవాళ్ళకూ ఆరాధ్య దైవంగా ఉంటున్నాడు అంటే మనకు ఆశ్చర్యంగా ఉంటుంది. కానీ, ఇది నిజం! దక్షిణఅమెరికాఖండంలోని 'రెడ్ ఇండియన్స్' సంవత్సరానికి ఒకసారి సీతారాములఉత్సవాలను జరుపుతారు. ప్రాచీనఈజిప్టురాజులలో ఒకడైన 'రామెసిస్' పేరు 'రామ'శబ్దం నుంచే వచ్చింది. ఆఫ్రికాలో ప్రాచీనకాలంనాటి పాలకులు తమ వంశమూలపురుషుడు 'రాముడు' అని పేర్కొనట్లుగా చారిత్రకాధారా లున్నాయి.

బర్మా, మలయా, లావోస్, కాంబోడియా, ఇండో నేషియా, జావా, సుమత్రా, నేపాల్వంటి వివిధప్రదేశాలలో కొన్నిమార్పులతో 'రామాయణం' ఉంది. ఆగ్నేయాసియా దేశా లలో ప్రధానభాష అయిన 'కవిభాష'లోకి కూడా రామాయణం అనువదించబడింది. మలయాలోని లిగర్ దేవాలయం, జావా లోని డింగ్పీఠభూమి, రాజోగ్రాగ్ దేవాలయాలలోని గోడలపైన రామాయణగాథలు అనేకం ఉన్నాయి. జపాన్ప్రజలకు 'ఆంజ నేయుడు' చాలానచ్చినపాత్ర అయితే, జావాప్రజలకు 'త్రిజట' పూజనీయురాలు. సోవియట్రష్యాలో గతంలో పది హేను సంవత్సరాలపాటు, ప్రతిరోజూ రామాయణగాథను నాటకంగా ప్రదర్శించారు. ఆ నాటకాన్ని ప్రజలు ఎంతగానో ఆదరించారు.

## శ్రీరాముడిప్రత్యేకత

మానవులు ఆదర్శప్రాయంగా జీవించడానికి శ్రీరాముడు చక్కనిమార్గం చూపించాడు. ఒక కొడుకు తల్లిదండ్రు లను ఎలాగౌరవించాలో శ్రీరాముడు మనకు నిరూపించాడు. ఒక అన్నయ్య తనతమ్ముళ్ళతో ఎలా మసలుకోవాలో రాముడు మనకు వివరిస్తాడు. అదేవిధంగా ఒక భర్త భార్యపట్ల ఎలా ప్రవర్తించాలో రాముడు మనకు చాటి చెప్పాడు. గురువును ఎలా గౌరవించాలో తెలిపిన ఉత్తమశిష్యుడిగా, స్నేహానికి ఎంత విలువఇవ్వాలో పేర్కొన్న మంచి మిత్రుడిగా, ప్రజలమాటకు విలువను ఇచ్చే చక్కనిపరిపాలకుడిగా – ఇలా రాముడు వివిధవిధాలుగా మానవాళికి తగినప్రబోధం చేశాడు.



శ్రీరాముణ్ణి తల్లిదండ్రులు, తమ్ముళ్ళు, భార్య మాత్రమే కాక, పడవ నడిపే గుహుడు, మహర్షి అయిన వాల్మీకి,

శబరకులానికి చెందిన శబరి, వానరుడు అయిన అంజనేయుడు, రాక్షసుడు అయిన విభీషణుడు, ఇలా చాలామంది అభిమా నించారు. పక్షి అయిన జటాయువు, ఉడుత– వంటి జీవులుకూడా గౌరవిం చాయి.

కొందరిలో వీరత్వం ఉంటుంది. కొందరిలో దయాగుణం ఉంటుంది. మరి కొందరిలో జ్ఞానం ఉంటుంది. ఇలా ఒక్కొక్కరిలో ఒక్కొక్కగుణం స్పష్టంగా కనిపిస్తూ ఉంటుంది. కాని సత్యం, ధర్మం, దయ, క్షమ, ఔదార్యం, వినయం, అభి మానం– ఇలా ఎన్నెన్నో సుగుణాలు రాముడిలో మూర్తీభవించాయి. అందుకే ఆయనను 'సుగుణాభిరాముడు' అన్నారు. ఇన్ని మంచిగుణాలు ఉండడం వల్లనే అందరూ ఆయనను అభిమానించారు, దేవుణ్ణిగా ఆరాధించారు.

**శ్రీరామనవమి జరుపుకొనేపద్ధతి**

శ్రీరామనవమిని ఎవరిఇంట్లో వాళ్లు జరుపుకోవడం ఒక సాధారణపద్ధతి. ఇలా కాకుండా సామూహికంగా ప్రజలు అందరూ కలిసి జరుపుకోవడం ఇంకొక విశిష్టమైనపద్ధతి, ఒక్కొక్కప్రాంతంలో ఒక్కొక్కవిధంగా ఈ పండుగను జరుపు కుంటారు.

ఉగాదిపండుగనుండి శ్రీరామ నవమివరకూ 'వసంతనవరాత్రులు' జర పడం తెలుగునాట ఒకసంప్రదాయం. వీధులలో పందిళ్లు వేసి, మంటపాలు ఏర్పాటుచేసి, ప్రతిరోజూ సీతారాములకు పూజలు నిర్వహిస్తారు. ప్రతిరోజూ రాత్రి హరికథలూ,బుర్రకథలు, నాట్యప్రదర్శనలు,

## భక్తి వెలుగు - అన్నమయ్య

**అన్నమయ్య 'పదాలు' ముక్తిమార్గంలో నడిపించే 'పాదాలు'**
**అన్నమయ్య పదాలు అచ్చ తెనుగులో అనువదించిన 'వేదాలు'**
**అన్నమయ్య పదాలు 'సామాన్య జనజీవన వేదాలు'**
**పదకవితా విశారదునికి శారద-నారద దీవెనలు**
**అన్నమయ్య 'కీర్తనలు' గోపబాలుని లీలానర్తనలు**
**అన్నమయ్య 'కీర్తనలు' భక్తిభావనల విరివానలు**
**అన్నమయ్య 'పదం' మనకు బ్రహ్మపదం, శ్రీహరికి 'ముదం'**
**అన్నమయ్య ఆలాపన అలౌకికానందం**
**అన్నమయ్య పదకీర్తనం పారలౌకికానందం**
**అన్నమయ్య 'పదం' ఆధ్యాత్మిక ఉద్దీపనం**
**అన్నమయ్య 'అచ్చతెనుగుదీపం'**
**అన్నమయ్యకు అచ్చతెనుగు అపురూపం**
**అన్నమయ్య సాక్షాత్తూ తెలుగుతల్లి స్వరూపం!**
**అన్నమయ్య తెలుగునుడికారానికి 'విశ్వరూపం'**
**అన్నమయ్యసాధన 'తెలుగు అక్షరాల' బోధన**
**తెలుగు 'అన్న'మయం**
**'భక్తి వెలుగు' అన్నమయం**
**అన్నమయ్య సామాజిక 'అసమానతల అమావాస్య'ను**
**పారద్రోలే 'పూర్ణచంద్రుడు' - అభినవ వేంకటేశుడు**
**అన్నమయ్య అంతరంగం విశ్వమానవ 'నికేతనం'**
**అన్నమయ్యకీర్తనం - విశ్వశాంతి 'కేతనం'**
**అన్నమయ్య 'గేయనిధి' - విశ్వశాంతికి వారధి**
**'మానవత్వాన్ని' ముందుకు నడిపే 'సారథి'**

*బి.ఎం.పి.సింగ్ (సాయిప్రసన్న)*

సంగీతకచ్చేరీలు, భజనలు, నాటకాలువంటి సాంస్కృతికకార్యక్రమాలు ఉంటాయి. పిల్లలూ, పెద్దలూ అందరూ రాత్రుళ్లు ఈ పందిళ్లలో హాయిగా కాలక్షేపంచేస్తారు. నవమిరోజు మధ్యాహ్నం వేళ, సీతారాముని కల్యాణాన్ని జరుపుతారు. నాన పెట్టిన పెసరపప్పులో నిమ్మరసం పిండి, పచ్చిమిరపకాయ ముక్కలు, కొబ్బరితురుము వేసి, తాలింపు పెట్టిన వడపప్పును, మిరియాల పొడి వేసిన బెల్లంపానకాన్ని దేవుడికి నివేదన చేస్తారు. ఆ తీర్థప్రసాదాలను పందిళ్లలో భక్తులకు ఇస్తారు. సీతారాముల కల్యాణాన్ని కళ్లారా చూడడం అనేది ఆనందం కలిగిస్తుంది. అయితే, ఇది భద్రాచలంలో 'భక్తరామదాసు' ఏర్పాటుచేసిన ఆచారం. శ్రీరాముడు తనవనవాసకాలంలో అధికభాగం ఆంధ్రప్రదేశంలోనే గడపడంవల్ల ఆంధ్రులందరికీ ఆరాధ్యదైవం అయినట్లే, రామదాసు నెలకొల్పిన ఆచారంకూడా ఆంధ్రదేశం అంతా వ్యాపించింది. ఇళ్ళల్లో శ్రీరామనవమినాడు సీతారాములను పూజించి, ఇరుగుపొరుగులకు పానకం, వడపప్పు తీర్థప్రసాదాలుగా ఇస్తారు. కొందరు తాంబూలంతో పాటు తాటాకు విసనకఱ్ఱలనుకూడా ముత్తయిదువులకు ఇస్తారు.

మహారాష్ట్రీయులు శ్రీరామనవమిరోజున మధ్యాహ్నం పన్నెండుగంటలకు శ్రీరాముడు పుట్టినట్లుగా భావించి, ఉయ్యాలలో శ్రీరాముని విగ్రహాన్ని ఉంచి, ఉయ్యాలఊపుతూ జోల పాటలు పాడుతారు. పంచదార, శొంఠిపొడులను కలిపి, భక్తులకు ప్రసాదంగా పంచిపెడతారు. 'శ్రీఖండపూరి' అనే వంటకాన్ని చేసి, రాముడికి నైవేద్యం పెడతారు.

ఉత్తరభారతదేశంలోని వివిధప్రాంతాలలో శ్రీరామనవమిఉత్సవాలలో భాగంగా 'రామాయణ కథాగానం' జరుగుతుంది. తమిళనాడులో 'శ్రీరామనవమి' వ్రతాలను జరపడం ఆనవాయితీ. శ్రీరాముడికి పూజలు జరిపి, ఉపవాసం ఉండడంతో పాటుగా, జాగరణకూడా చేస్తారు. శ్రీరాముడి విగ్రహాలను దానం ఇస్తారు.

ఇలా ఒకొక్కప్రాంతంలో తమతమ సంస్కృతులను ఈ పండుగలో మేళవించి, అత్యంతఉత్సాహంగా ఈ పండుగను ప్రజలు జరుపుకుంటూంటారు.

### శ్రీరామనవమి – వైజ్ఞానికదృష్టి

శ్రీరామనవమినుంచి ఎండలు ముదురుతాయి. వాతావరణంలో ఉష్ణోగ్రత పెరిగి రకరకాల జ్వరాలు, జబ్బులు మొదలవుతాయి. శ్రీరామునిప్రసాదాలుగా స్వీకరించే పానకం, వడపప్పులు మానవదేహాలకు చలువ కలిగిస్తాయి. వడదెబ్బను తగులనీయవు. ఇంకా కరెంటు కష్టాలతో మునిగి ఉండే పల్లెవాసులకి విసనకర్రను దానం ఇవ్వడమంటే వారికి చేతనైనంత సాయపడటమే అవుతుంది. మానవుడిగా అవతరించి ఇది దేవుడుగా చేసుకుంటున్న పండుగ అంతేకాదు మనల్ని మానవత్వం నుంచి దైవత్వానికీ తీసుకెళ్లేపండుగకూడా!

# వసంతపుష్పశోభ

డా॥ పుల్లూరిఉమ

ప్రకృతిలోని చిదచిద్వస్తువులయందు అంతర్నిహితంగ ఉన్నజీవశక్తిని బహిర్గతంచేసే కాలం వసంతఋతువు. పచ్చని కొమ్మలు, చిగుళ్ళు, పూలు, పిందెలు, కాయలు, రంగురంగుల కాంతులతో కనిపించేకాలం కాబట్టి చిలుకలు, కోకిలలు, వివిధజాతులకు చెందిన పక్షులు ప్రకృతిసౌందర్యానికి ఉప్పొంగి పోతూ అవ్యక్తమధురనినాదాలను చేసేసమయ మిది. కవులు సాహిత్యరసావిష్కరణకు హితమైన వసంతప్రకృతిసంపదను చూచి, తమకు తోచినకావ్యరచనలు చేసి, పాఠకలోకానికి అంది స్తుంటారు. ప్రకృతిరమణీయదృశ్యానికి ముగ్ధులై జీవులు రసమయజగత్తులో లీనమై, పరవశించేకాల మిది. ఇవన్నీకూడ లౌకికవిషయకేంద్రాలే.

ఆధ్యాత్మికపరంగ భావిస్తే నిద్రాణంగా ఉన్నజీవులకు జాగ్రదవస్థను కలిగించే శుభసమయమే వసంతకాలం. పరమాత్మ జీవులను సమీపించేసన్నిహితకాల మిది. భగవంతుడు తన వ్యాపకత్వాన్ని నిరూపించేకాల మిది – కాబట్టే కృష్ణుడు గీతలో

**బృహత్సామ తథా సామ్నాం, గాయత్రీ ఛందసా మహమ్**
**మాసానాం మార్గశీర్షో౽హం ఋతూనాం కుసుమాకరః**
**(విభూతి.35)**

వసంతఋతువులో తనస్థితిని గుర్తించు మని ప్రబోధిం చాడు. ప్రబంధకవులు వసంతఋతువుకు ప్రముఖస్థానాన్ని కలిగించారు. సామాన్యప్రజలకుకూడా వసంతకాలార్చనను చేసుకొనేభాగ్యాన్ని భగవంతుడు ప్రసాదించాడు.

వసంతకాలంలో మన మేనగరవాసంలో ఉన్నా – మనకు ప్రత్యక్షమయ్యేకాలసంకేతం పువ్వులు. నిత్యజీవితంలో ఆకర్షణను, ఆనందాన్నీ కలిగించేవి పువ్వులు. "సుమనః, పుష్పం, ప్రసూనం, కుసుమం, సుమం" అనేవి పువ్వులకు సంస్కృత పదాలు. సుమనస్సు అంటే మనస్సును ఆకర్షించేది. సుప్రీతం మనః అని అర్థం. 'పుష్ప వికసనే' అంటే 'వికసించునది కాబట్టి పుష్పం' అంటారు. 'ప్రసూయత ఇతి ప్రసూనం' పుట్టేది కాబట్టి ప్రసూనమైంది. భ్రమరాలతో కూడి ఉండేది కాబట్టి కుసుమం, కుస్యతి భ్రమరాదినా శ్లిష్యతి. సుమం అనేది పాళిభాష, ఈ విధంగ సంస్కృతంలో పువ్వు అనేది అనేకములైన పేర్లతో వ్యవహరింపబడుతున్నది. మల్లెలు, జాజులు, చామంతులు, మందారాలు, పారిజాతాలు, కలువలు, గన్నేరులు, తామరలు– ఇలా ఎన్నో పువ్వుల్ని మనం చూస్తున్నాము. నిత్యజీవితంలో ఉపయోగిస్తున్నాము. వాసనలేకపోయినా రంగురంగులతో కళకళలాడుతూ కవ్విస్తాయి కనకాంబరాలు, బంతిపూలు ఇలా ఎన్నో! అన్నివేళల్లోను ఆకర్షించేగుణం పువ్వుల కుంది. కంటి కింపుగ ప్రతివ్యక్తికి నేత్రానందాన్ని కలిగిస్తాయి. సున్నితమైన పువ్వుల్ని తాకుతున్నపుడు ఆ రేకుల్లోని పేశలత్వం స్పర్శేంద్రియా నికి పరవశత్వాన్ని ఇస్తుంది. పరిమళాన్ని వెదజల్లుతూ ఘ్రాణేంద్రియానికి తన్మయత్వాన్ని కలిగిస్తుంది. కమ్మనితేనె జల్లుల్ని చిలికిస్తున్నప్పుడు ఆ మాధుర్యాన్ని హాయిగా అనుభవిస్తూ జిహ్వేంద్రియం మధురానుభూతిని పొందుతుంది. అందలి తేనెల్ని గ్రోలడానికి వచ్చే తుమ్మెదలఝుంకారాలు మంజులగీతాలై శ్రవణేంద్రియానికి హాయిని చేకూరుస్తాయి. అంతఃకరణాలను ఒకే సమయంలో ఆకర్షించేపువ్వులు జీవితానికి వసంత సందేశా లను అందిస్తున్నాయి. ఐహికాముష్మికఉపదేశానికి, లౌకికాలౌకిక సమున్మేషానికి పువ్వులు కేంద్రబిందువులు.

పూలు పూయడంలో ఉండే ఒకవిచిత్రగతిని నన్నె చోడుడు –

**పొన్నలుపూచె, పొన్నలొగి పూవకముందర పూచె గోగు, లా**
**పొన్నలు కొండగోగులును పూవకముందర పూచె బూరువుల్,**
**పొన్నలు కొండగోగులును బూరువులు న్నొగిపూవకుండగా**
**మున్న వనంబునం కలయ మోదుగులొప్పగ పూచె, నామనిన్**
**(కు.సం.4.91)**

ఇలా పువ్వులు ఒకదానితో ఒకటిపోటీపడుతూ పూచా యని చమత్కరించాడు.

లౌకికజీవితంలో పూలు అలంకారానికి ఆధారాలు. నేటికీ వివాహంలో వధూవరుల్ని పువ్వులతో అలంకరిస్తారు. సంతతసౌభాగ్యాలను పొందా లని పువ్వులతో ఆశీర్వదిస్తారు – పెళ్లిపెద్దలు. పువ్వులులేనివేడుకలూ, వినోదాలూ మనకు లేవు.

ఉపన్యాసాలలో రంగవేదికల్ని, ప్రాంగణాన్ని రంగురంగుల పువ్వుల్తో అలంకరిస్తాం. ఈ విధంగా మానవుని నిత్యజీవితంతో పువ్వులు ముడిపడి ఉన్నాయి. జీవితకాలంవరకు దేహాన్ని దేవాలయంగా చేసుకొని ఉన్నఆత్మ దేహాన్ని విడిచినవెంటనే ఆ మృతకళేబరాన్ని పువ్వులతో అలంకరించి, గౌరవిస్తాం. ఇవన్నీ లౌకికవిషయసంబంధాలు.

సృష్టిలో మొదటమొగ్గగా ఉన్నపుష్పం వికసించిన కొంత కాలంలోనే, రేకులు రాలి, దానిఅందాన్ని కోల్పోయి, పిందెగ ఫలాన్ని అందిస్తుంది. విత్తనాలుగ పరిణతి పొంతుతుంది. ఉన్నస్వల్పకాలంలో వాటిల్ని మానవుడు తన ఉపయోగం కోసం వాడుకుంటున్నాడు కదా- అని విషాదగీతాలను ఆలపించిన వారూ లేకపోలేదు. పువ్వుల్లాగ నిత్యనూతనంగా పరార్థంకోసం జీవితాన్ని గడపా లనేసందేశాలను అందచేశారు. ఇవన్నీ ఒక ఎత్తు!



లౌకికజీవితంనుండి అలౌకికానుభూతిని ప్రసాదించే మార్గం పంచవిధభగవత్స్వరూపాలలో అర్చాస్వరూపంలో సులభ ప్రాప్తం. దారుశిలాలోహాదినిర్మితమైన అర్చామూర్తులందు మంత్రానుష్ఠానప్రభావమూలంగా ప్రాణప్రతిష్ఠాదులు జరిపి, సర్వేశ్వరసాన్నిధ్యాన్ని సాధించుకోవచ్చు. ఇట్లు సగుణోపాసకుడైన భక్తుడు గృహంలోని అర్చామూర్తిని త్రికరణశుద్ధితో అభిగమ్యం, ఉపదానం, ఇజ్య, స్వాధ్యాయం అనే మార్గాలలో భక్తితో సమీ పించి, ఫలపుష్పాదులు సమర్పించి, అనన్యభావంతో పూజిస్తే సర్వేశ్వరానుగ్రహం కలుగుతుంది అనేది ప్రమాణవచనం. పువ్వ లతో అర్చామూర్తిని అరాధించడం షోడశోపచారవిధానంలో ఒకటి. ఆవాహనం, ఆసనం, పాద్యం, అర్ఘ్యం, ఆచమనీయం, అభిషేకం, వస్త్రం, యజ్ఞోపవీతం, గంధం, పుష్పం, ధూపం, దీపం, నైవేద్యం, తాంబూలం, ప్రదక్షిణం, నమస్కారం-అనేవి షోడశోపచారాలు. ఈసపర్యలలో పువ్వులతో పూజచేయడంవల్ల మహోన్నతఫలం లభిస్తుంది. "హం ఆకాశతత్త్వాత్మనే పుష్పం సమర్పయామి" అనేది సంప్రదాయం!

**పుష్పములు గొని సురపూజ లొనర్చిన**
**మానవులకు మంచిమనసు కలుగు**
**నట్లు గావున సుమనోభిధానము పుష్ప**
**ములకు నయ్యె ద్రవ్యపూజ లిచ్చు**
**నరుల కోర్కులు సుమనస్కృత తీర్చుట**
**నమరులు సుమనస్కు లనగ చనిరి**

**(భార.అనుశా-4-5)**

అనింది - పంచమవేదమైనభారతం! పువ్వులతో దేవతార్చనలు చేసేవారికి మంచిమనస్సు కలుగుతుంది. కాబట్టే పువ్వులకు 'సుమనః' అనేపే రేర్పడింది. దేవతలు ఆపూజల నందుకొని, వారికోర్కెలను మంచిమనస్సుతో నెరవేరుస్తారట! కాబట్టి వారికి సుమనస్కులు అనే పేరు వచ్చింది. మంచిమనస్సు సుక్షేత్రంలోని పంటలాగ యమనియమాదిఅష్టాంగాలకు భూమిక అవుతుంది. వీటివలన శౌచం, సంతోషం, స్వాధ్యాయం, ఈశ్వర ప్రణిధానం అనేవి సులభంగ ప్రాప్తిస్తాయి. విక్షిప్తదశలో ఉన్న చిత్తం ఏకాగ్రతను పొందుతుంది. ఈ నిశ్చలతత్త్వమే జీవన్ముక్తి ఘడియ అనడంలో సంశయంలేదు.

# తులసీదాసు

డా॥ షేక్ మౌలాఅలి

**గోడ్ గంవార్ నృపాల్ మహి, యమన మహామహిపాల్ ।**
**సామ్ న దాన్ న భేద కలి, కేవల దండకరాల్ ॥**

దేశఆర్థికపరిస్థితి దిగజారింది. ప్రజలు తమబాధ్యతలు మరచారు. యువకులు తల్లిదండ్రులను ఆదరించడంలేదు. వర్ణాశ్రమధర్మాలు కుంటుపడినందువల్ల సమాజంలో కర్మాచరణ లోపించింది. వేదధర్మాలు గ్రంథాలకే పరిమితమైనాయి. ధార్మికంగా, సాంస్కృతికంగా, ఆర్థికంగా సమాజం పతనావస్థలో ఉంది. సమాజంలో ఏర్పడిన 'ధార్మికగ్లాని' నుండి ప్రజలను ఉద్ధరించడానికి 'లోకనాయకుడై'న తులసీదాసు ధృవించాడు.

తులసీ ప్రాచీనభారతీయసాహిత్యంద్వారా జాతిని సన్మార్గంలోకి తీసుకురావా లని భావించాడు. అందుకు శ్రుతి సమ్మతమైన 'రామకథ', లోకరక్షకుడు, మర్యాదాపురుషోత్తముడైన శ్రీరామునిచరిత్ర ఔషధంగా పనిచేస్తుందని నమ్మాడు. జ్ఞానం, కర్మ, భక్తి భావాలసమన్వయంతో భక్తిప్రధానమైన 'రామచరిత మానస్' రచించాడు. సమాజంలో 'రామభక్తి' అనే సురనదీ ధారను ప్రవహింపచేశాడు.

జడచేతనాలకూ, గుణదోషాలకూ నెలవైన ప్రపంచానికి తులసీదాసు రామరసాన్ని ఆస్వాద్యంగా ఇచ్చాడు.

లోకంలో ఆత్మధర్మం, శరీరధర్మం అని ధర్మం రెండు విధాలుగా చెప్పబడుతున్నది. శరీరధర్మంమీద ఆత్మధర్మం విజయం సాధించినప్పుడు ధర్మసంస్థాపన జరుగుతుంది. రావణత్వంమీద రామత్వవిజయాన్ని నెలకొల్పటమే రామచరిత మానస రచనోద్దేశం. రాముడు ఆత్మధర్మానికి ప్రతీక అయితే– రావణుడు శరీరధర్మానికి ప్రతీక. తులసీ రామచరితమానస్‌లో శీలం, శక్తి, సౌందర్యాల అమృతధారను ప్రవహింపచేశాడు. అణువణువున పరమాత్మతత్త్వాన్ని ప్రతిబింబింపజేశాడు.

రామకథ భారతీయసంస్కృతికి ఉజ్జ్వలమైన జ్ఞానశిఖ. ఆదికాలంనుండి ఋతం, సత్యం, శమం, దమం, అహింస, ధర్మం, క్షమ, ఉదారత, అనాసక్తి, ఇంద్రియనిగ్రహం, శుచి, మర్యాద మొదలైన తత్త్వాల సమాహారంతో భారతసంస్కృతి విలసిల్లుతుంది. ఈ సర్వతత్త్వాలను సాక్షాత్కరింపజేసుకొని సర్వ తత్త్వసమన్వయస్వరూపమైన, నానాపురాణనిగమాగమ సమ్మతమైన రామచరితమానస్ రచించాడు మహాకవి గోస్వామి తులసీదాసు.

తులసీదాసు కాలం చాలా విశృంఖలతలతో నిండి ధార్మికఅస్థిరత నెలకొని ఉంది. వివిధధార్మికసంప్రదాయాలు తమతమ ప్రచారసరళిలో ఉన్నాయి. నాథపంథీయోగుల 'అలఖ్' సంప్రదాయం అశిక్షితప్రజలమీద ప్రభావం చూపెడుతూంది. మరోవైపు కబీరుదాసు కులమతాలను దుయ్యలుట్టసాగాడు. శాక్తేయులు వామాచారంవైపు మొగ్గుచూపారు. శైవవైష్ణవ విభేదాలు పెచ్చుమీరాయి. తిరిగి వైష్ణవసంప్రదాయంలో రామ, కృష్ణ భక్తులు విభేదించసాగారు. అద్వైత,విశిష్టాద్వైత,ద్వైత సంప్రదాయాలలో పరస్పరవైరుధ్యం పొడసూపింది. ఫలితంగా భారతీయసనాతనసంప్రదాయం కొంత కుంటుపడింది. విదేశీ పరిపాలనవల్ల నిజమైన కలికాలం (పాపపుయుగం) వచ్చింది.



**ధారావాహిక 27**

# మందార మకరందాలు

**కాననివాని నూఁతగొని, కాననివాఁడు విశిష్టవస్తువుల్**
**గానని భంగిఁ, గర్మములు గైకొని, కొందరు కర్మబద్ధులై**
**కానరు విష్ణుఁ; గొంద ఱటఁ గందు రకించన వైష్ణవాంఘ్రి సం**
**స్థానరజోఽభిషిక్తు లగు సంహృతకర్ములు దానవేశ్వరా!**

విష్ణువు సర్వాత్ముడు. జీవులు కర్మబద్ధులు. వెలుతురులో ఉన్నా చీకటిలోనే ఉంటారు. చూస్తున్నా మనుకుంటున్నా చూడలేనిస్థితిలో ఉంటారు. 'కానని' అనే మాటను మూడునాలుగుసార్లు ప్రయోగించి. ఆ జీవులఅంధతను, అజ్ఞతను నొక్కిచెప్పినాడు- పోతన్న. మరికొంద రున్నారు- వారు ఈ కొందరివంటివారు కారు. సంహృతకర్ములు. భాగవతుల పాదధూళితో పవిత్రులైనవారు. వారే విష్ణువును కనగలిగేవారు. కర్మబద్ధులకు విముక్తకర్ములకు ఉన్నభేదాన్ని తేటమాటలతో తెలిపిన పద్య మిది.

**- జ్ఞానపీఠఅవార్డు గ్రహీత, పద్మభూషణ్ డా॥ సి. నారాయణ రెడ్డి**

ప్రజలకు రామరసాన్ని ఆస్వాదింపజేసి, ఉత్తరభారతావనిని రామ మయం చేసిన తులసీ 'ఆత్మసుఖా'న్ని పొందాడు.

రామభక్తి, రామభజన, రామస్మరణ ముక్తిప్రదా లంటాడు తులసీ. శ్రద్ధతో రాముణ్ణి సేవిస్తే ఆయనహృదయం ద్రవిస్తుంది. రామునికృపలేక స్వప్నంలోకూడా శాంతిలేదు. ఈ కలికాలంలో రామునిపావనగుణగానంవల్ల సంసారసాగ రాన్ని తరింపవచ్చు. తులసీ ప్రతిపాదించినభక్తి, వేదసమ్మతమై, వైరాగ్యయుక్తజ్ఞానసంపన్నమైనది.

కవి సువర్ణయోగి, సమాజాన్ని హిరణ్యమయం చేద్దా మని అతనితపన, తులసీ పండితులకు విశ్రాంతిప్రదమై, సర్వమానవులకు ఆనందప్రదమై, కలియుగపాపాలను నశింప చేసే 'రామకథ' రచించాడు.

రామకథను నిర్మలమందాకినీనదిగా, నిర్మలచిత్తం చిత్రకూటంగా, మనోహరమైనస్నేహం సీతారాములు విహరించే రమ్యమైనవనంగా భావిస్తాడు-తులసీ. శ్రీరామచంద్రునిచరిత్ర ముక్తి, ధనం, ధర్మం, పరమధామం ప్రదానం చేసే సుందరచింతామణిగా చిత్రిస్తా డాయన.

ఉపనిషత్తుల బ్రహ్మావాదం, గీత యందలి అనాసక్తియోగం, శైవవైష్ణవుల అనురాగవైరాగ్యాలు, శంకరునిఅద్వైత వాదం, రామానుజుని ప్రపత్తి, నింబార్కుని ద్వైతాద్వైతం, మధ్వునిరామోపాసన, వల్లభుని బాలరూపఆరాధన, చైతన్యుని ప్రేమతత్త్వం, కబీరాదులనామజపం అన్నింటిని మేళవించి, గోస్వామితులసీ దాసు శ్రుతిసమ్మతమైన రామచరిత్రను తన వాణిని పవిత్రం చేసుకొనుటకై వ్రాశాడు.

**నిజగిరా పావని కరన కారన**
**రామ జసు తులసీ కహియో ।**

ఇక్కడ తులసీ మీద కాళిదాసు రఘు వంశచ్ఛాయ కన్పిస్తుంది.

**క్వ సూర్యప్రభవో వంశః క్వ చాల్పవిషయా మతిః ।**
**తితీర్షు ర్దుస్తరం మోహా దుడుపే నాస్మి సాగరమ్ ॥**

అవ్యక్త, అవినాశి, చిదానందమైన వ్యాపకనిర్గుణ పర మాత్మ రాముడుగా అవతరించాడు. తులసీరామాయణరచన అయోధ్యలో సాగింది. కొంతభాగం విశేషించి- కిష్కింధాకాండ కాశీలో జరిగింది. రామాయణం పరిసమాప్తి అయిన పిదప ఆయన ఎక్కువకాలం కాశీలోనే వసించేవాడు. మధుసూదన సరస్వతి అనే ప్రసిద్ధవిద్వాంసుడు తులసీదాసును కాశీ అనే ఆనందవనంలో విహరించే తులసీమొక్కగా, ఆయనకావ్య మంజరిమీద రామభ్రమరం పరిభ్రమిస్తున్నట్లుగా అభివర్ణిం చాడు.

తులసీదాసు కవి, భక్తుడు, పండితుడు, సమాజ సంస్కర్త, లోకనాయకుడు, భవిష్యద్ద్రష్ట. కొంద రాయన్ను 'కలి యుగవాల్మీకి' అన్నారు. ఈ మహాకవి లోకనాయకుడు. కనుకనే హిందీసాహిత్యంలో 'లోకనాయక్ తులసీ' అనే నానుడి ఏర్ప డింది.

# సందేహాలు? సమాధానాలు!!

విద్వాన్, డా॥ పమిడికాల్వ చెంచుసుబ్బయ్య

**అ)గోవిందనామాల విశిష్టత ఏమిటి?**

**ఆ)'స్త్రీ పుం రూపా గోవిందా!' అనే నామానికి ఆధ్యాత్మిక అర్థ వివరణ ఏమిటి?**

**- జోగి మహంతి సుధాకరరావు, కాకినాడ.**

☛ అ) "శ్రీవేంకటేశ్వర గోవిందనామములు" రూపొందించిన మహాభక్తునిపేరు తెలియదు. ఎక్కడా ముద్రితం కాలేదు. కానీ చాలాకాలంగా సామాన్యులేకాక - మాన్యులుకూడా ఈ మహాశక్తిమంతాలైన నామావళిని నిత్యం పఠించి, ఎన్నో లాభాలు పొందుతున్నారు. భవిష్యత్తులోకూడా పొందుతారు. ఇందులో ప్రతినామంచివర 'గోవిందా' అనే దివ్యనామం అనుబంధంగా, విధిగా ఉంటుంది కనుక వీటిల్ని 'గోవిందనామాలు' అంటున్నాం. గోవిందునియొక్క 108 నామాలు కనుకనూ ఇవి 'గోవింద నామాలు' అయ్యాయి. ఇవి విశేషించి-శ్రీవేంకటేశ్వరునిరూపాన్నీ, గుణాలనూ, ధర్మసంస్థాపననిష్ఠనూ, దశావతారమూలతత్త్వాన్నీ, శ్రీపద్మావతీప్రియత్వాన్నీ, ఇలా అనేకకోణాల్లో శ్రీవారిని వర్ణించి, కీర్తించడం ఇందలివిశిష్టత! పాటగా, తాళలయాత్మకంగా భజన రూపంలో అందరూ కీర్తించడానికీ, అష్టోత్తరశతనామావళి స్తోత్రంలాగా పారాయణం చేసుకోవడానికీ ఇవి అనుకూలంగా ఉన్నాయి. ఇందులో మొత్తం 134 పాదా లున్నాయి. వాటిలో "గోవిందా హరి గోవిందా! గోకులనందన గోవిందా!" అనే రెండుపాదాలు-13 మార్లు వస్తాయి. కనుక ఇవి 26 పాదాలు. ఇవిగాక ప్రత్యేకంగా ఉండేవి 108. ఈ గోవిందనామావళి భజనపద్ధతిలో తాళలయాత్మకంగా పాడేటప్పుడు నిజంగానే మాటల కందని ఒక దివ్యానుభూతి భక్తులకు అలవోకగా చేకూర్తుంది. మనోనేత్రంతో శ్రీవారిని దర్శించినఅనుభూతి సిద్ధిస్తుంది. శ్రీవేంకటేశ్వరుని - విష్ణుత్వం ఈ గేయంలో సర్వత్ర గోచరిస్తుంది. భక్తుల పాలిటికి ఈ స్తోత్రం కల్పవక్షం!

ఆ)"స్త్రీ పుం రూపా గోవిందా!" అనేది శ్రీవారిదివ్య చైతన్యశక్తిని స్ఫురింపజేస్తుంది. వేదాంతం ప్రకారం - చరాచరాత్మకమైన ఈ ప్రకృతిఅంతా స్త్రీరూపం. భగవంతు డొక్కడే పురుషుడు. ప్రకృతి భగవంతుని వ్యక్తమైనరూపం. ప్రకృతిని భరించి, పోషించి, రక్షించేవాడు భగవంతుడు కనుక - ఆయన ప్రకృతికి భర్త. ప్రకృతి భార్య. ఈ విధంగా స్త్రీతత్త్వమైన ప్రకృతిగా, దాన్ని భరించేతత్త్వమైనపురుషుడు-అంటే భగవంతుడుగా ఉన్నవాడు పురుషోత్తముడైన శ్రీనివాసుడే! కనుక శ్రీవారిని 'స్త్రీపుంరూపా' అని నుతించడం జరిగింది. ఇంతేకాక- శ్రీవారిమూర్తిని స్త్రీగా, పురుషుడుగా - భక్తులు అనేకమూర్తులుగా భావించడమూ వింటున్నాము. "యే యథా మాం ప్రపద్యంతే తాం స్తథైవ భజా మ్యహమ్"- 'ఎవరెట్లు భావించి, సేవిస్తే - వారి కట్లే గోచరించి, ఫలాలు ఇస్తా' నన్నాడు కదా గీతా భగవంతుడు! కనుక 'వేంకటేశ్వరి, వేంకటేశ్వరుడు' - రెండూ తానే అయిన మహత్తత్త్వం శ్రీనివాసుడు. ఇక అవతారాల దృష్ట్యా శ్రీ వేంకటేశ సహస్రనామావళిలో 78వ నామం "ధృతసమ్మోహినీ వపుషే నమః" అని ఉంది. 'మోహినీరూపాన్ని ధరించినవానికి నమస్కారం' అని అర్థం. క్షీరసాగరమథనంలో ఆవిర్భవించిన అమృతాన్ని దేవరాక్షసులు పంచుకొనేవేళ పొత్తుకుదురక చింతిస్తున్న సమయంలో, విష్ణుదేవుడు మోహినీరూపాన్ని (స్త్రీ) ధరించి, అక్కడ నిల్చి, అందర్నీ మోహింపజేసి, యోగ్యులకు మాత్రం అమృతాన్ని అందించాడు కూడా! ఇందుకు సంకేతంగా శ్రీవారి బ్రహ్మోత్సవాలలో మోహినీరూపంతో స్వామివారు ఉత్సవ మూర్తియై భక్తుల్ని అనుగ్రహిస్తున్నారు కదా! మరోమారు తన మోహినీరూపంతో శివుణ్ణీ మోహింపజేశాడు. 79వ నామంగా 'హరమోహకమాయావినే నమః'-అని ఈ వృత్తాంతమూ చెప్పబడింది. ఇలా స్వామి రెండుమార్లు మోహినీరూపాన్ని ధరించారు. నిర్గుణపరమాత్మగా భావించినపుడు ఈ 'స్త్రీ పుం రూపాదికం ఆ బ్రహ్మతత్త్వానికి అన్వయించదు. "స్త్రీరూపధారీ, పుంరూపధారీ" రెండుశక్తలూ శ్రీవారిరూపాలే కనుక ఈ నామావళిలో "స్త్రీపుం రూపా! గోవిందా!"అని నుతించడం గొప్ప విశేషంగా పేర్కొనదగింది. 'గోవిందశబ్దం - విష్ణువుకు, కృష్ణునికి, శ్రీనివాసునికి, పరమాత్మకూ - అన్వయించే మహత్తర నామం. కలియుగంలో 'గోవిందనామస్మరణ ఇహపరసుఖదా యకం'. ఈ స్తుతిలో 'గోవింద'నామం-147 మార్లు వస్తుంది. 'గోకులనందన' నామం 13 మార్లు వస్తుంది. 'హరి'నామం 16 మార్లు వస్తుంది. ఇలా

ఎన్నో మహత్తరశక్తి ప్రభావా లున్న గోవిందనామస్తోత్రం–ఇది. ఈ స్తోత్రం ప్రస్తుతం అన్నిభాషల్లోనూ యథాతథంగా ముద్రితమై, భక్తులకు పారాయణస్తోత్రంగా శోభిస్తూంది.

**అయ్యా! విష్ణుసహస్రనామస్తోత్రాన్ని ఒకరోజుకు ఎన్నిమార్లు అయినా పఠించవచ్చునా? లేక ఇన్నిసార్లు, ఫలానా వేళలో మాత్రమే పఠించవలె నని నియమం ఏదైనా ఉన్నదా? తెలుప గలరు? – వై.కె.సుందరరాజన్, బెంగళూరు.**

ఏ సహస్రనామస్తోత్రా న్నయినా – ప్రత్యేకంగా ఒక సంకల్పదీక్ష నియమించుకొన్నప్పుడు తప్ప – తక్కినకాలంలో రోజుకు ఇన్నిమార్లే, ఫలానావేళల్లోనే పఠించా లనేనియమం లేదు. శ్రీవిష్ణుసహస్రనామస్తోత్రం ఉత్తరభాగంలో "నిత్యం భక్తి సమన్వితః", "శ్రద్ధాభక్తి సమన్వితః", "ఫలే ద్య ఇచ్ఛేత్ పురుషః శ్రేయః ప్రాప్తుం సుఖానిచ", "సోఽహ మేకేన శ్లోకేన స్తుత ఏవ నసంశయః" – అనే వాక్యా లున్నాయి. వీటిభావం – శ్రద్ధా భక్తులతో నిత్యం పఠించవచ్చు ననీ, అంతాకాకపోయినా–కనీసం ఒక్క శ్లోకా న్నయినా భక్తితో పఠించినా– నిస్సంశయంగా వాళ్లు సుఖశాంతులతో హాయిగా ఉంటా రని కదా! భగవంతుడు భక్తి ప్రియుడు. భగవన్నామపారాయణానికీ, స్మరణకూ దేశకాలాది నియమాలు అప్రధానం. నిర్మలమైన అంతఃకరణమే ప్రధానం. భగవచ్చింతనవిషయంలో సంకల్పం కల్గినవెంటనే అది కార్య రూపం ధరించాలి. వాయిదాలు వేయరాదు. మొత్తం స్తోత్రం పఠించలేనివాళ్లకోసం సులభమార్గాన్ని "శ్రీరామ రామ రామేతి రమే రామే మనోరమే। సహస్రనామ తత్తుల్యం రామనామ వరాననే!" మూడుమార్లు 'రామ, రామ, రామ' అని భక్తితో పఠిస్తే అది వేయిమార్లు పల్కినంతటి ఫలమిస్తుం దని ఈశ్వరు డన్నాడు కదా! మంత్రసంఖ్యాశాస్త్రాన్ని బట్టి 'రా', 'య' వర్గంలో రెండవది. 'మ', 'ప' వర్గంలో ఐదవఅక్షరం కాగా రామ= 2×5=10. రామ× రామ×రామ=10×10×10=1000 అవు తుంది. ఇలా మహాత్ములు–భగవన్నామశక్తి అనంతం, అనూహ్యం, సర్వకాలసంసేవ్యం అని పేర్కొని ఉన్నారు. నియమం అనేది అవసరాన్నిబట్టి మనం ఏర్పరచుకొంటాం! భగవంతుడు 'విశ్వవ్యాపి' కనుక మనభౌతికనియమాలు ఆయనకు కాబట్టవు.

**చతుష్షష్టి (64) కళలు ఏవో తెల్పండి? – మాదేటి శంకరరావు, సాలూరు.**

'కళ' అంటే పనులయందలి నేర్పు. చిత్రలేఖనం మొదలైనవాటిల్ని అందంగా చేస్తే – వాటిల్ని కళలు అంటాం. ఈ కళలు చతుష్షష్టి (64) అని పెద్దలు నిర్ణయించారు. ఈ 64లో చేరేవాటివిషయంలో నిఘంటువులలో కొన్నితేడాలు న్నాయి.. ప్రస్తుతం 'శబ్దరత్నాకరం' అనే తెలుగు నిఘంటువులో– రచయిత బహుజనపల్లి సీతారామాచార్యులవారు పేర్కొన్న ప్రకారం ఇందు తెల్పడమైంది.

1)ఇతిహాసం 2)ఆగమం 3)కావ్యం 4)అలంకారం 5)నాటకం 6)గాయకత్వం 7)కవిత్వం 8)కామశాస్త్రం 9)దురోదరం 10) దేశభాషాలిపిజ్ఞానం 11)లిపికర్మం 12)వాచకం 13)అవధానం 14) స్వరశాస్త్రం 15)శాకునం 16)సాముద్రికం 17)రత్నశాస్త్రం 18)రథాశ్వగజకౌశలం 19)మల్లశాస్త్రం 20)సూదకర్మం 21)దోహదం 22)గంధవాదం 23)ధాతువాదం 24)ఖనివాదం 25)రసవాదం 26)జలవాదం 27)అగ్నిస్తంభనం 28)ఖడ్గస్తంభనం 29)జలస్తంభనం 30)వాక్స్తంభనం 31)వయస్స్తంభనం 32)వశీకరణం 33)ఆకర్షణం 34)మోహనం 35)విద్వేషణం 36)ఉచ్చాటనం 37)మారణం 38)కాలవంచనం 39)పరకాయప్రవేశనం 40)పాదుకాసిద్ధి 41)వాక్సిద్ధి 42)ఘుటికాసిద్ధి 43)ఇంద్రజాలవిద్య 44)అంజనం 45)దృష్టి వంచనం 46)స్వరవంచనం 47)మణిమంత్రౌషధాదిసిద్ధి 48)చోర కర్మం 49)చిత్రక్రియ 50)లోహక్రియ 51)అశ్మ(శిలా) క్రియ 52)మృత్ (మన్ను) క్రియ 53)దారు(కొయ్య)క్రియ 54)వేణు (వెదురు) క్రియ 55)చర్మక్రియ 56)అంబర (వస్త్ర) క్రియ 57)అదృశ్యకరణం 58)దూతీకరణం 59)మృగయ(వేట) 60)వాణిజ్యం 61)పశుపాలనం 62)కృషి (వ్యవసాయం) 63)ఆసవకర్మ 64)ప్రాణిద్యూతకౌశలం

**మనవి:** నేర్పుగా, అందంగా చేసేటివన్నీ కళలే అయినా– వీటిలో చోరకర్మ=దొంగతనం మొదలైనవి కొన్నిపాపకర్మలూ ఉన్నాయి. కనుక 64 కళలలో మంచివే గ్రహించాలి.

# శ్రీరామచంద్రుడు

డా॥ అప్పజోడు వేంకటసుబ్బయ్య

ఆర్షధర్మానికి, సాహిత్యానికి అవినాభావసంబంధం. ధర్మం వేదమూలం. వేదధర్మం ప్రభుసమ్మితం. ప్రభుసమ్మిత మైన వేదధర్మం ప్రజల అవగాహనకు దూరమైనపుడు కాంతా సమ్మితమైన కావ్యపద్ధతిలో వేదధర్మాన్ని లోకానికి అందించిన ఆదికావ్యం శ్రీమద్రామాయణం. అందుచేతనే వాల్మీకిమహర్షి ప్రోక్తమైన ఆ రామాయణం వేద మని, వేదవేద్యుడైన ఆ పరమాత్మ దశరథాత్మజు డని పేర్కొనటం జరిగింది.

"రామో విగ్రహవాన్ ధర్మః" ధర్మస్వరూపుడైన ఆ మహా పురుషునిజీవితచరిత్రమే శ్రీమద్రామాయణం. పుత్రుడుగా, సోదరుడుగా, మిత్రుడుగా, భర్తగా, ప్రభువుగా ఆయనజీవితంలో ఎదుర్కొన్న ఎన్నోకష్టాలు, అనుభవించిన కొన్నిసుఖాలు, అను సరించినఅనేకధర్మాలు రసమయంగా, మానవజాతికి మార్గ దర్శకంగా రామాయణమహాకావ్యంలో చిత్రించబడ్డాయి. ధర్మాతుడైనదశరథాత్మజుడు ఆదర్శపురుషుడేగాక ఆరాధ్య దైవ మయ్యాడు. అయితే శ్రీరాముని కేవలదైవస్వరూపునిగా స్వీకరించి రామాయణం చదివితే ప్రయోజనం తక్కువ. ఆయన నొక మానవమాత్రునిగానే భావించి, ధర్మావలంబంవల్ల మానవు డెంతటి మహాత్ముడుగా ఎదుగగలడో దర్శించినట్లయితే ప్రయో జనం ఎక్కువ. రామాయణంలో రామునిరూపం, గుణం అన్నీ మనోహరాలే, మహనీయాలే!

శ్రీరాముడు సుందరసురుచిరశుభాంగుడు. ఆజాను బాహువైన ఆయన సమున్నతవిగ్రహం, నీలమేఘశ్యామలవర్ణం, ప్రసన్నవదనం, సుందరమందహాసం, సువిశాలనేత్రాలు, సుదీర్ఘ నాసిక, నుదుటి కస్తూరిబొట్టు, అందమైన ఆ ఉంగరాల జుట్టు, కోదండమండిత బాహుదండం – ఆనాటి కౌసల్యాదశరథుల మనస్సులనే గాదు, అయోధ్యారాజ్యంలోని ఆబాలగోపాలాన్నే గాదు, ప్రతిభారతీయహృదయాన్ని అప్పటినుండి ఇప్పటిదాక ఆకర్షిస్తూనే ఉన్నాయి. ఎప్పటికీ ఆకర్షిస్తాయి.

వాల్మీకి వర్ణించిన రామునిగుణాలు మహోన్నతాలు. మానవజాతికి ఆదర్శాలు. రాముడు ధర్మజ్ఞుడు. కృతజ్ఞుడు, సత్యసంధుడు, ప్రజాహితరతుడు, యశస్వి, జ్ఞానసంపన్నుడు, శుచి, వశ్యకాముడు, స్థిరచిత్తుడు, ఆర్యుడు, సమదర్శనుడు, చంద్రునివలె ప్రియదర్శనుడు. సముద్రునివలె గంభీరుడు, హిమవంతునివలె ధైర్యవంతుడు. క్రోధంలో కాలాగ్ని సదృశుడు. సహనంలో పృథ్వీసముడు.

ప్రధానంగా ధార్మికత, ప్రజాహితరతి, త్యాగనిరతి, సర్వ సమత్వం, ప్రియదర్శనత్వం, శ్రీరాముని ఆదర్శప్రభువుగా రూపొందించాయి. ఆయన రాజ్యాన్ని ఆదర్శరాజ్యంగా లోకానికి అనుగ్రహించాయి.

విద్యాభ్యాసం ఏ వ్యక్తికైనా భావిజీవితపాథేయం. శ్రీరామచంద్రుడు క్షత్రియోచితమైన అస్త్రవిద్యను పరమసాత్త్వి కుడు, బ్రహ్మర్షి అయిన వసిష్ఠుని దగ్గర అభ్యసించాడు. ఆ విద్యలో అపారసామర్థ్యం గడించాడు. అవసరమైన శస్త్రాస్త్ర సామగ్రినంతా ఒకనాటి రజస్తమోగుణాలరాశి, ఆనాటి సత్త్వ గుణపేటి అయిన విశ్వామిత్రమహర్షినుండి గ్రహించాడు. అందుకే ఆ రామచంద్రుని అస్త్రవిద్యాసామర్థ్యం, శస్త్రాస్త్ర సాధనాలు ధర్మబద్ధా లయ్యాయి. మహాకార్యాలు సాధించాయి. మానవకల్యాణానికి దోహదం చేశాయి.

విశ్వామిత్రునివెంట యాగరక్షణకు వెళ్లటం శ్రీరాముని జీవితంలో ఒకచిత్రమైనమలుపు. ఆమహర్షివెంట వెళ్లటం వల్ల



అనుకోకుండా అపారశక్తిసంపన్నాలైన అనేక శస్త్రాస్త్రాలు సిద్ధించాయి. శస్త్రాస్త్రప్రయోగంలో అనుభవం సాధించటానికి, తన సామర్థ్యం నిరూపించుకోవటానికి తగిన అవకాశాలు లభించాయి. మిథిలానగరంలో సకలరాజసమక్షంలో శివధనుర్భంగం గావించటం, సీతామహాదేవిని సహధర్మచారిణిగా స్వీకరించటం జరిగాయి. సీతారాములవివాహం జరిగింది. రామాయణం రసవత్తరమైనమలుపు తిరిగింది. వ్యక్తిజీవితాన్ని విస్తృతపరిచేది, ఎత్తు కెదిగించేది వివాహం. సీత లేకుంటే రావణవధే లేదు. రావణవధే లేకుంటే రామునిజీవితానికి సార్థకతే లేదు. రామాయణమహాకావ్యమే లేదు.

ఇంతవరకు రామునిజీవితంలో ఆయనధనుర్బలం వ్యక్తమయ్యే సంఘటనలేగానీ ఆయనధర్మబలం ప్రకటమయ్యే సన్నివేశాలు లేవు. యౌవరాజ్యాభిషేకభంగం శ్రీరామునిధర్మబలానికి మొదటి అగ్నిపరీక్ష. దశరథుడు శ్రీరామునిగుణగణాల నొకసారి నెమరు వేసుకొన్నాడు. తన వార్ధకాన్ని ఒకసారి తలచుకొన్నాడు. శ్రీరామునియౌవరాజ్యాభిషేకం జరిపించటం అన్నివిధాల అభిలషణీయ మనుకొన్నాడు. మంత్రి పురోహిత పౌరజానపదప్రముఖులతో సంప్రదించి, ముహూర్తం నిర్ణయించాడు. యౌవరాజ్యాభిషేకానికి అన్నిప్రయత్నాలు జరుగుతున్నాయి. అయోధ్య అందంగా అలంకరించుకొని అందుకు సిద్ధంగా ఉంది. తెల్లవారితే శ్రీరామయౌవరాజ్యాభిషేకమహోత్సవం.

శ్రీరాముడు శిరస్స్నానం చేశాడు. పూజాదికాలు పూర్తి చేసుకొన్నాడు. పిలుపుకోసం ఎదురుచూస్తున్నాడు. ఇక సుమంత్రుడు రావటమే ఆలస్యం. అంతలోనే సుమంత్రుడు వచ్చాడు. కైకేయి అంతఃపురానికి రమ్మని వర్తమానం తెచ్చాడు.

రాముడు ఆశించిన దొకటి. అయినది ఇంకొకటి. పూలహారం ఆశిస్తే మెడకు సర్పహారం పడింది. అమృతాన్ని ఆశిస్తే హాలాహలం పైకి పొంగింది. కైకేయి రామునితో 'తండ్రి మాటతప్పక పాటిస్తావా?' అంది. అది రామునికి పిడుగుపాటులా ఉంది. తన కేదోప్రమాదం కలుగుతుం దని గాదు. తల్లి తన పితృభక్తినే శంకిస్తూ ఉం దని. 'అమ్మా! నన్ను శంకిస్తున్నావా. ఇక బ్రదికి ప్రయోజన మేమి? తండ్రి ఆజ్ఞాపిస్తే అగ్నిలో దూకుతాను. విషాన్ని భక్షిస్తాను. మహాసముద్రంలో మునుగుతాను. రాముడు రెండుమాటలవాడు కాదు. నన్ను నమ్ము' అన్నాడు.

కైకేయి దశరథుని కోరినక్రూరవరాలు రెండూ వినిపించింది. అవి రామునిజీవితాన్నే తలక్రిందులు చేసేవి. ఆయన భోగానుభవాన్ని ముక్కలుముక్కలుగా కత్తిరించేవి.

అయినా రాముడు అణుమాత్రంగూడ కలవరపాటు నొందలేదు. పైగా కైకేయితో 'తల్లీ! నీ వన్నట్లు భరతుడే రాజవుతాడు. నేను రాజాజ్ఞమేరకు జడలు దాల్చి, మునివృత్తిని స్వీకరిస్తాను. అడవులకు వెళ్లుతాను. అయితే తండ్రి తనంత తాను నా కీసంగతి ఎందుకు చెప్పలే దన్నదే నా బాధ' అన్నాడు. అందుకు కైకేయి మనస్సు కరుగలేదు సరిగదా అడవులకు వెళ్లమని ఆమె రాముని త్వరపెట్టింది. అయినా రాముడు తన సమతను గోల్పోలేదు. పైగా కైకతో 'అమ్మా! నాకు ధనంమీద ఆశలేదు. రాజ్యంమీద కాంక్ష లేదు. నన్ను ఋషితుల్యునిగా భావించు. కేవలం ధర్మాన్ని ఆశ్రయిస్తాను. అంతేగాదు. అందరికన్న నీవు న న్నెక్కువగా ఆజ్ఞాపించ గల దానవే. ఇవి దశరథుని ఆజ్ఞ లని నాతో చెప్పాలా? నీవు చెపితే నేను కా దంటానా! ఆ మాత్రం నా మనస్సును అర్థం చేసుకోలేకపోయావా!' అన్నాడు.

రాముడు దశరథునికి, కైకేయికి ప్రదక్షిణం చేశాడు. సభామంటపానికి వెళ్లి, అభిషేకజలపూర్ణకుంభాలకు, తదితర ద్రవ్యాలకు ప్రదక్షిణం చేశాడు. ఆత్మీయులందరి దగ్గర సెలవు తీసుకొన్నాడు. అరణ్యాలకు బయలుదేరాడు.



ఇది ఒక వ్యక్తి జీవితంలో సామాన్యమైనమలుపు గాదు. సాధారణమైనదెబ్బ గాదు. పట్టాభిషేకానికి కట్టుకొన్నపట్టుబట్టలు వదలి, అరణ్యవాసానికి నారచీరలు ధరించటం. అభిషేకార్థం తెచ్చిన తీర్థజలాలతో అరణ్యవాసానికి స్నానం చెయ్యటం.

మహారాజుగా సాగించవలసినజీవితం మునివృత్తి నవలంబించటం. అయినా రాముడు కలతపడలేదు. ఎవ్వరినీ నిందించ లేదు. అయోధ్యామహారాజ్యాన్ని వదలి, అడవులకు వెళ్లే ఆయన మనస్సు ప్రాపంచికసుఖాలను,అన్నిలోకాలను అతిక్రమించి బ్రహ్మ పదార్థంలో లీనమైన పరమయోగీంద్రునిమనస్సులా ఉందట!

**న వనం గన్తు కామస్య త్యజతశ్చ వసుంధరామ్ ।**
**సర్వ లోకాతిగస్యేవ లక్ష్యతే చిత్తవిక్రియా ॥**

రామునిసమతాస్వభావం, త్యాగభావం అనుపమానాలు. తండ్రికొరకు జీవితంలో అంతటిత్యాగం చేశాడు. తమ్ముడు భరతుడు అరణ్యంలో తనఆశ్రమందాకా వచ్చి, వాకిటికి అడ్డంగా పడుకొని, అయోధ్యారాజ్యాన్ని స్వీకరింప వలసిం దని ఎంత అర్థించినా తండ్రి కిచ్చినమాట తప్ప నన్నాడు. భరతుడు మరీ బలవంతం చేస్తే 'కాంతి చంద్రుణ్ణి విడిచిన విడుచుగాక, మంచు హిమవత్పర్వతాన్ని వదలిన వదలుగాక, సముద్రం చెలియలికట్ట దాటిన దాటుగాక – తమ్ముడూ! నేను మాత్రం తండ్రి కిచ్చినమాట తప్ప' నన్నాడు.

రామునిదండకారణ్యప్రవేశం ఆయన అరణ్యవాసంలో ఎంతో ప్రాధాన్య మున్నఘట్టం. రాముడు దుష్టసంహారం గావించి మహర్షులకు రక్షణకల్పిస్తా నని మాట ఇచ్చింది–దండ కారణ్యంలోనే. శూర్పణఖ తారసిల్లింది, ఖరదూషణాదుల్ని వధించింది, సీతాపహరణం జరిగింది దండకారణ్యంలోనే, దండ కారణ్యప్రవేశమే లేకుంటే రామునిజీవితంలో ఇవి జరిగేవి కావేమో! ఆయన జీవితాని కొక చరితార్థత లభించేది కాదేమో! అయోధ్యలో పట్టాభిషేకభంగం రామునిధార్మికప్రవృత్తిని ఆవిష్కరిస్తే, అరణ్యవాసంలో దండకారణ్యప్రవేశం ఆయన దుష్ట శిక్షణ, శిష్టరక్షణసామర్థ్యాన్ని లోకానికి చాటాయి. అను కూలదాంపత్యం ఎన్నికష్టాల నైనా భరించ గలదేమోగాని ఎడబాటునుమాత్రం సహించలేదు. అందులోను ఒక దుర్మార్గుని చేత భార్య అపహరింపబడినపుడు భర్త మానవస్వభావ సహజంగా ఎంత ఆవేదనకు గురి అవుతాడో ఎంత ఆవేశాన్ని పొందుతాడో, ఎంత అన్వేషణ సాగిస్తాడో, ద్రోహిని దండించా లని ఎంత ప్రయత్నిస్తాడో వాల్మీకిమహర్షి పాఠకునిమనస్సు ద్రవించేలా శ్రీరాముని పాత్రలో చిత్రించాడు.

సుగ్రీవసఖ్యంతో శ్రీరామునిఅంగబలం విపరీతంగా పెరిగింది. హనుమసముద్రలంఘనంతో సీతాదేవి ఉనికి తెలిసింది. ద్రోహిదశగ్రీవుని తుదముట్టించడానికి దండయాత్ర ప్రారంభమైంది. శ్రీరాముడు సర్వవానరసైన్యంతో లంకను ముట్టడించటానికి, రావణుని సంహరించటానికి సన్నద్ధుడై సముద్రం ఒడ్డున దండు విడిశాడు. ఆ సమయంలో శరణంటూ వచ్చాడు– రావణసోదరుడు విభీషణుడు. వానరప్రముఖులు అతనికి ఆశ్రయమివ్వకూడ దన్నారు. అది ఎంతో ప్రమాదకర మన్నారు. పైగా అతనిని పట్టి వధించా లన్నారు. రాముడు అప్పుడుగూడా వారిమాటలు ఆలకించాడేగాని ఆవేశపడలేదు. తన ఆదర్శాలు విడనాడలేదు. శత్రువైనా శరణాగతుడ నని అంటే చాలు, అతడు ఎలాంటివాడైనా ఆశ్రయమిస్తా నన్నాడు. ఒకసారి శరణాగతుడను నీవాడను అని యాచిస్తే చాలు–అతనికి సర్వభూతాల వల్ల ప్రమాదా లేర్పడినా అభయహస్త మిస్తా నన్నాడు. శరణాగత రక్షణ తనజీవితవ్రత మన్నాడు.

అంతేగాదు. ఒక అడుగుముందుకు వేసి, సాక్షాత్తు రావణుడే వచ్చి శరణన్నా అతనికి అభయం ఇస్తా నన్నాడు.

**ఆన యైనం హరిశ్రేష్ఠ! దత్త మస్యాభయం మయా ।**
**విభీషణో వా సుగ్రీవా! యది వా రావణ స్స్వయమ్ ॥**

రావణునిచారులపట్లగూడ శ్రీరాముడు గొప్ప ఔదర్యాన్ని ప్రదర్శించాడు. వానరసేనారహస్యాలు గ్రహించటానికి వానరరూపంలో వానరసేనను ప్రవేశించిన శుకసారణులను విభీషణుడు కనిపెట్టి, శిక్షించవలసిన దని శ్రీరామునియెదుట నిలిపినపుడు ఆయన చిరునవ్వు నవ్వాడు. శుకసారణులను చూచి మీరు సావధానంగా మా సైన్యాన్నంతా పరిశీలించండి. స్వేచ్ఛగా లంకకు వెళ్ళండి. అవసరమైతే ఈ విభీషణుడే మీకు సైన్యాన్నంతా



చూపుతాడు. ఏమాత్రం మీరు ప్రాణభయం పొంద నక్కరలేదు. నిరాయుధులను, దూతలను మేము వధించం. లంకకు వెళ్ళి రావణునితో రేపు ప్రాతఃకాలన్నే మేము లంకా ప్రాకారాలను, బహిర్ద్వారాలను ముట్టడిస్తా మని చెప్పండి. తనబలాన్ని ప్రదర్శించ మని సలహా ఇవ్వండి అని చెప్పి పంపాడు. శ్రీరాముని ఆత్మవిశ్వాసం, ఔదార్యం, ఆదర్శపరత – అద్వితీయాలు, అవి మానవజాతికి శాశ్వతాదర్శాలు. యుద్ధరంగంలో సాక్షాత్తు రావణునితో పోరేటప్పుడుగూడ ఆయన ఆవేశపడి పైగుణాలను విస్మరించలేదు. జీవితంలో తనకు తీరని ద్రోహం చేసిన దశగ్రీవుడు యుద్ధరంగంలో తొలిసారి తనకు కన్పించినపుడు, అతనితేజస్సు చూచి మనసార మెచ్చుకొన్నాడు. అతనిమీదికి ఆవేశంతో పరుగెత్తే లక్ష్మణుని ఆపి, 'తమ్ముడూ! జాగ్రత్త. రావణుడు మహాపరాక్రమశాలి, అతడు మహోగ్రుడైతే ముల్లోకాలుగూడ అతనియెదుట నిలువలేవు' – అని శత్రుపరాక్రమాన్ని ప్రశంసించి, తమ్ముని హెచ్చరించి పంపాడు.



అది రామరావణద్వంద్వయుద్ధం, రాముడు రావణుని రథసారథిని, అశ్వాలను, రథాన్ని ముక్కలు చేశాడు. రావణుని చేత ధనుస్సునుగూడ త్రుంచాడు. అతని కిరీటాన్నిగూడ ఆవల పడగొట్టాడు. నిస్సహాయుడై, నిలువెల్ల చెమటలు గ్రక్కుతూ, నిడుపైన నిశ్వాసాలు వదలుతూ నేలమీద చతికిలబడిన ఆ లంకేశ్వరునిచెంతచేరి, చేతికి చిక్కినాడు గదా అని సంహరించకుండా "రాక్షసేశ్వరా! నీవు యుద్ధంలో బాగా అలసిపోయినట్లున్నావు. లంకకు వెళ్ళు, విశ్రాంతి తీసుకో. మరోరథాన్ని అధిరోహించు. ధనుస్సును ధరించు. మరల యుద్ధానికి రా. అప్పుడు నా బలాన్ని చూతువుగాని" అని చెప్పి పంపాడు.

రావణమరణానంతరం అన్నకు అంత్యక్రియలు జరిపించటానికి అనుమతి నిమ్మని విభీషణుడు అర్థిస్తే "వైరం మరణంవరకే. ఇప్పు డతడు నీ కెట్లో నాకు అట్లే. సంస్కారం జరిపించు" అన్నాడు.

**మరణాన్తాని వైరాణి నివృత్తం నః ప్రయోజనమ్ ।**
**క్రియతా మస్య సంస్కారో మమా ప్యేష యథా తవ ॥**

రావణునిఅంత్యక్రియలైన తరువాత విభీషణుని లంకా రాజ్యాభిషిక్తుని గావించాడు.

ప్రభుజీవితం ఎంతపరిశుద్ధంగా ఉండాలో, అది లోకాని కెంత ఆదర్శం కావాలో, ప్రజావిమర్శకు ప్రభు వెంత విలు విస్వాలో–రావణసంహారానంతరం సీతాదేవిని అగ్నిప్రవేశం చేయించి, అభిషేకానంతరం ఆమెను అపవాదకారణంగా పరిత్యజించి శ్రీరాముడు ప్రపంచానికి చాటాడు. సీతావియోగంతో అంతబాధపడి, వానరవీరులందరిని అన్నిదిక్కులకు పంపి, వెదికించి, రావణుణ్ణి, రాక్షసకులాన్ని ఉగ్రరణంలో వధించి, చివరకు చెరనుంచి సీతాదేవిని నడిపించి, ప్రియమార ఆమెను కౌగిలించి కుశలప్రశ్నలు వేయలేదు–సరిగదా పై పెచ్చు ఆమె శీలస్వచ్ఛతను ప్రశ్నించాడు. శుద్ధచరిత్రను నిరూపించుకో మన్నాడు. అగ్నిప్రవేశాన్ని ఆమోదించాడు. సీత స్వచ్ఛశీల అని ఆ రామునికి తెలియకపోలేదు. సముద్రుడు చెలియలికట్టను దాటలేనట్లే రావణుడు సీత నతిక్రమించలే దని గూడ ఆయనకు తెలుసు. అగ్నిజ్వాలను అంట సాధ్యంగా దని శ్రీరామునికి తెలుసు.

**అవశ్యం త్రిషులోకేషు న సీతా పాప మర్హతి ।**
**ఇమామపి విశాలాక్షీం రక్షితాం స్వేన తేజసా ॥**
**రావణో నాతివర్తేత వేలామివ మహోదధిః ।**
**నహి శక్త స్సదుష్టాత్మా మనసాపి హి మైథిలీమ్ ।**
**ప్రధర్షయితు మప్రాప్తాం దీప్తా మగ్ని శిఖామివ ॥**

అని అగ్నిహోత్రునితో రాము డన్నవాక్యాలే అందుకు నిదర్శనాలు. పరపరుషునిఇంట్లో బహుకాల మున్నభార్యను పరిశోధించకుండ గ్రహిస్తే–పెద్దలు తన్ను మూర్ఖు డని, ఖలు డని, కామాత్ము డని అంటా రని రాముడు భావించాడు. ముల్లోకాలకు సత్యం మీద విశ్వాసం కలిగించటానికే ఆమె అగ్నిప్రవేశాన్ని ఉపేక్షించా నన్నాడు.

అగ్నిశుద్ధ అయిన సీతను, అఖండసామ్రాజ్యాన్ని పొంది సర్వసుఖాలను అనుభవించేసమయంలో ఒక్క జనాపవాదానికి తల వంచి, అర్ధాంగిని మరల అడవుల్లో వదలి రమ్మని తమ్ముని ఆజ్ఞాపించాడు. సీతను పరిత్యజించ వద్దని ప్రార్థించినతమ్ము లతో అపకీర్తిని దేవతలు నిందిస్తా రని, కీర్తి త్రిలోకారాధ్యా మని, మహాత్ములు కీర్తికొరకు కృషి చేస్తా రని, జనాపవాద భయానికి తాను ప్రాణాలనైనా, తమ్ముల నైనా వదలుతా నని, సీతను వద లటం ఒక విశేషం గా దని శ్రీరాము దన్నాడు.

ఆజ్ఞ నతిక్రమించిన అందరిపట్ల శిక్షను సమానంగా అమలుజరపటం విశుద్ధప్రభుధర్మం. ఆత్మీయతలు, అనురాగాలు అందు ప్రవేశింపకూడదు. రాముడు మునిరూపంలో వచ్చిన యమధర్మరాజుతో ఏకాంతమందిరంలో మాట్లాడుతూ ఎవ్వరూ తమసంభాషణకు అంతరాయం కలిగించకూడ దని, అలా కలిగిస్తే అతనికి మరణదండం తప్ప దని, ఆ మునికోరికమేరకే ప్రతిజ్ఞ చేశాడు. మందిరద్వారందగ్గర తమ్ముడు లక్ష్మణుని కాపలా ఉంచాడు. అంతలోనే పిడుగు పడ్డట్లు ఎక్కటినుండో దూర్వాసమహర్షి రావడం, వెంటనే శ్రీరామచంద్రుని చూడా లనటం, లక్ష్మణుడు వీలుగా దనటం, అయితే అందరినీ శపిస్తా నని ఆ మహర్షి ఆగ్రహోదగ్రుడు కావటం, ఆ మహర్షిశాపం నుండి అన్నగారిని, అయోధ్యను రక్షించడానికి లక్ష్మణుడు లోపలికి వెళ్లటం, ఆ మహర్షిరాకను అన్నగారికి విన్నవించటం అనుకోకుండా జరిగిపోయాయి.

కారణంఏదైనా లక్ష్మణుడు అన్నగారిఆజ్ఞను అతిక్రమిం చటం జరిగింది. మరి తమ్మునికి ప్రతిజ్ఞప్రకారం శిక్ష విధించ టమా? మానటమా? ఇది సమస్య. లక్ష్మణుడు జీవితంలో సర్వ సుఖాలు త్యాగం చేసి తనకు, తన భార్యకు సేవలు చేశాడు. ఇప్పుడుగూడ తన క్షేమం, తన రాజ్యక్షేమం గోరి తన ఆజ్ఞ నుల్లంఘించాడు. అలాంటి తమ్ముని ఏం చేయాలి? భ్రాతృ ప్రేమను ఆదరించిక్షమించటమా? ప్రభువుగా చేసిన ప్రతిజ్ఞను పాలించి శిక్షించటమా? పెద్ద ధర్మసమస్య! రాముడు మాన సికంగా నలిగిపోయాడు. మరునాడు సభచేశాడు. మంత్రిపురో హితులందరిముందు తన సమస్య నుంచాడు. ఎట్టకేలకు వసిష్ఠ మహర్షి వాక్యానుసారం వైయక్తికమైన సోదరప్రేమకు స్వస్తిచెప్పి, సామాజికమైన ప్రభుధర్మానికే ప్రాధాన్య మిచ్చి ప్రభువుగా తాను చేసినప్రతిజ్ఞనే పాలించా లని నిర్ణయించాడు. సాధుజనులపట్ల మరణదండన, దేశబహిష్కారం సమానమే గనుక ప్రియసోదరుని శాశ్వతంగా బహిష్కరించాడు.

అర్ధాంగి ఇదివరకే రామునికి దూరమైంది. ఇప్పుడు అనుగుతమ్ముడుగూడ దూరమయ్యాడు. ధర్మాచరణంలో ఏ వ్యక్తికైనా త్యాగాలు తప్పవు. ఆదశలో భరతునికి పట్టంగట్టి రాముడు అడవులకు వెళ్ళా లనుకొన్నాడు. అందుకు భరతుడు అంగీకరించలేదు. అందుచేతనే కుశలవుల్ని పట్టాభిషిక్తుల్ని చేసి, సరయూప్రవేశం చెయ్యా లని శ్రీరాముడు నిర్ణయించాడు.

అగ్నిహోత్రం, శ్వేతచ్ఛత్రం పట్టుకొని, బ్రాహ్మణోత్తములు ముందు నడిచారు. తెల్లనిపట్టువస్త్రాలు కట్టుకుని, చేత దర్భలు పట్టుకుని, గాయత్రిని జపిస్తూ అంతర్ముఖుడై ఆ రామచంద్రుడు నడిచాడు. ఆయనవెంట భరతశత్రుఘ్నసుగ్రీవులు– ఆ తరువాత అయోధ్యాపురవాసులు. వెనుక వానరులు, రాక్షసులు, వివిధ జంతువులు, పక్షులు– అయోధ్యలో ప్రాణి అన్నది ఏదీ మిగుల లేదు. అదొక మహాప్రస్థానం. అందరు సరయూతీరాన్ని చేరు కొన్నారు. ఒకసారి శ్రీరాముడు ఆ నదీప్రవాహాన్ని అలా తిల కించాడు. అడుగుముందుకు వేశాడు. ఆ ప్రాణి ప్రవాహమంతా నీటిప్రవాహంలో కలిసిపోయింది. శ్రీరామునిసరయూప్రవేశం ముగిసింది.

శ్రీమద్రామాయణంలో శ్రీరామునిజీవితం సంఘట నాత్మకం. పుత్రుడుగా, మిత్రుడుగా, శత్రువుగా, భర్తగా, ప్రభువుగా ఆయన ఎన్నోసంఘటనల నెదుర్కొన్నాడు. ప్రతి సంఘటన వ్యక్తి కొక పరీక్ష. క్రొత్త అనుభవం. వ్యక్తి సంస్కారం వ్యక్తమయ్యేది, అతడు మహాత్ముడుగా మీది కెదిగేది, లేదా పాపాత్ముడుగా పతనమొందేది ఈ జీవితసంఘటనల్లోనే! శ్రీరాముడు ప్రతిసంఘటనలో పైకి ఎదిగాడు. తన మనస్సును దేహానికి, ఇంద్రియాలకు, స్వార్థానికి దూరం చేశాడు. ధర్మానికి ముడివేశాడు. మహాత్ముడుగా మీది కెదిగాడు. దశరథరాముడు, అయోధ్యారాము డయ్యాడు. అయోధ్యారాముడు సీతారాము డయ్యాడు. సీతారాముడు కోదండరాము డయ్యాడు, కోదండ రాముడు పట్టాభిరాము డయ్యాడు. పట్టాభిరాముడు ఆత్మారాము డయ్యాడు. అమృతరాము డయ్యాడు. అనంతరాము డయ్యాడు, అందరిరాము డయ్యాడు. రామాయణంలో రామునిపాత్ర చిత్రణం అపూర్వం, అద్వితీయం, అద్భుతం. మానవజీవితానికి ఆ రామునిజీవితం ఒక మహోన్నతాదర్శం.



ఏ తప్పు లేనివాడిని తిట్టడం నిద్రపోతున్న పామును మేల్కొల్పడమే!

అన్నమయ్య సంకీర్తనలలో...

# శ్రీరాముని గొప్పతనం

సూరపురాజు వసంతకుమారి

శ్రీ మహావిష్ణువుకు పాంచజన్య మనేశంఖం, సుదర్శన మనేచక్రం, కౌమోదకి అనే గద, శార్‌ఙ్గం అనే విల్లు, నందక మనే కత్తి - పంచాయుధాలు. అన్నమయ్య నందకాంశ సంభూతుడు. కారణజన్ముడు. 32 వేల సంకీర్తనలతో శ్రీవేంకటేశ్వర స్వామిని ఆరాధించి, పరిపరివిధాలుగా కీర్తించి, పదకవితా మహుడు, వాగ్గేయకారుడుగా ప్రసిద్ధి కెక్కాడు.

అన్ని అవతారాల సమష్టిరూపమే శ్రీవేంకటేశ్వరుడు. కనుకనే అన్నమయ్య సర్వావతారస్వరూపుడుగా అవతారాలతో ఉన్న శ్రీవేంకటేశ్వరస్వామిని ఎంతో తన్మయత్వంతో గానం చేశాడు.

శ్రీరాముణ్ణిగురించి అన్నమయ్య సుమారు 73 సంకీర్తనలు వ్రాశారు. అందులో శ్రీరామునిగొప్పతనం తెలియజేసే సంకీర్తనల్లో కొన్ని పరిశీలిస్తే తనువు పులకించక మానదు.

**రాముడు లోకాభిరాముడు**
**ఆముక నిజనగరమందు నున్నవాడు (3-233)**

అనే సంకీర్తనలో శ్రీరాముడు లోకాభిరాముడు, ఎంతో చక్కదనములతో ఉండి, ప్రకాశించే బంగారు విల్లు అమ్ములను ధరించిన కౌసల్యాకుమారుడు, అయోధ్యాధిపతి, తారకబ్రహ్మం, వరాలను గుప్పించేవాడు-ఈ వేంకటాద్రిని వెలసినరాముడు అని కీర్తించాడు-అన్నమయ్య.

**రామ! రామచంద్ర! రాఘవా! రాజీవలోచన! రాఘవా!**
**సౌమిత్రి భరతశత్రుఘ్నులతోడ జయమందు దశరథరాఘవా! (1-392)**

చిన్నారి పొన్నారి రాఘవా! చిన్నవయసులోనే తాటకిని చంపిన కౌసల్యా కుమారుడివి, శివధనుస్సును విరిచి, సిరులతో జనకునిఇంట ఉన్న సీతను పెండ్లాడిన రాఘవుడివి. రావణాదులను చంపి, దేవతలందరూ చూస్తూ ఉండగా, నీవు దేవేంద్రునిరథ మెక్కి వేవేగ అయోధ్యకు మరలి వచ్చి, పట్టాభిషేకం చేసుకొని, నేడు వేంకటగిరిపై చేరి, మాకు అభయ మిస్తున్నరామ! రామచంద్రా! రాఘవా! రాజీవలోచన! అని రామకథను క్లుప్తంగా కీర్తించాడు - అన్నమయ్య.

**రాముడు రాఘవుడు రవికులు డితడు**
**భూమిజకు పతియైన పురుషనిధానము (4-169)**

'పుత్రకామేష్టి'యాగమునందు పాయసంద్వారా జన్మించిన పరబ్రహ్మ, రాక్షసులను శిక్షించి, దేవతలను రక్షింప పుట్టిన దివ్యతేజం, ధ్యానించేయోగీంద్రులమనసుతామరపువ్వులలో నిలిచిన రూపం, మునులెల్ల వెదికే కోటికాంతులకన్నా ఎక్కువైన కైవల్యపదం, వేదవేదాంతాలలో, విజ్ఞానశాస్త్రాలలో చెప్పబడిన మోక్షం, శ్రీవేంకటాద్రిపైన అర్చావతారంలో వెలసిన శ్రీరాముడు రఘుసంతతికి చెందినవాడు, సూర్యవంశంలో పుట్టినవాడు, సీతాదేవికి భర్తయైన పురుషనిధానం అని శ్రీరాముణ్ణి స్తుతించాడు- అన్నమయ్య.

**ఈతడు తారకబ్రహ్మ మితడు మా దేవుడు**
**కౌతుకాన జెప్పే వినగదరే వోజనులు (2-208)**

ఓజనులారా! తారకబ్రహ్మమైన మా దేవుడు రాముడు. ఆ స్వామినిగురించి చెప్పేమాటలను సంతోషంగా వినండి. శ్రీరాముడు అన్నిలోకాలకు సార్వభౌముడు. పదహారుకళలతో కూడిన చంద్రునివంటివాడు.రాక్షసులను తుత్తునియలు చేసి, దేవతలకు కోరినవరాలను ఇచ్చి, కాపాడినవాడు. నీలమేఘ శరీరం, నిండుహృదయంగలవాడు. దానాలు చేయడంలో ఉదారుడు. గరుత్మంతుడినే వాహనంగా గలవాడు- అని రాముని గొప్పతనాన్ని అన్నమయ్య తెలియజేశాడు.

**రామునికి శరణంటే రక్షించీ బ్రదుకరో**
**యేమిటికి విచారాలు యిక దైత్యులాల! (10-283)**

మాయజింకను, కుంభకర్ణ, రావణాదిరాక్షసులను చంపిం దీబాణం. పరశురాముణ్ణి గెలిచిం దీరామబాణం. అటువంటి దివ్యబాణం శ్రీవేంకటేశ్వరస్వామిఅంబులపొదలో ఉంది. రాక్షసులారా! ఆలస్యంచేయక పారిపోండి. లేదంటే రాముణ్ణి శరణువేడితే మిమ్మల్ని బ్రతుకనిస్తాడు- అని రామ బాణప్రశస్తిని కొనియాడాడు - అన్నమయ్య.

**నమో నమో దశరథనందన మమ్ము రక్షించు**
**కమనీయ శరణాగతవజ్రపంజరా! (11-5)**

మునులను వెదకి పీడించేమారీచుణ్ణి వధించిన శూరుడివి. ఖరుడు, దూషణుడు మొదలైన వారిశిరస్సులను ఖండించిన ప్రతాపశాలివి. సూర్యవంశలో పుట్టినదివ్యాస్త్ర వేదివయిన దశరథునిపుత్రుడవైన ఓరామచంద్రా! శరణాగతులకు నీవు మనోహరమైన వజ్రపంజరంలాంటివాడివి. అటువంటి నీకు మరల మరల నమస్కరిస్తూ ఉన్నాం. మమ్మల్ని రక్షించు అని ప్రార్థిస్తాడు- అన్నమయ్య.

**శరణన్న విభీషణు గరుణ గాచినవాడు**
**పరికింపఁ దారక బ్రహ్మమా! యీ రాముడు (2-226)**

ఈ రాముడు శరణన్నవిభీషణుడిని కరుణతో రక్షించాడు. రాళ్ళతో సముద్రానికి ఆనకట్ట కట్టి, జటాయువు అనే పక్షికి మోక్షా న్నిచ్చి, కాకాసురుణ్ణి రక్షించి, రాక్షసులను చంపిన జానకీరమణుడే-ఈ వేంకటాద్రిపై నున్న వేంకటేశ్వరుడు. ఇంత ప్రసన్నంగా ఉండే ఈ స్వామేనా ఆనాడు తన ప్రతాపంతో అన్నిఘనకార్యాలు చేసింది! అని ఆశ్చర్యంగా నుతిస్తాడు- అన్నమయ్య.

**సీతాసమేతరామ! శ్రీరామ!**
**రాతి నాతి జేసిన శ్రీరామ! రామ! (3-516)**

అనే కీర్తనలో సీతతో కలసి ఉన్న రామా! నీవు రాతిని అహల్యగ మార్చిన శ్రీరాముడివి. బలవంతుడైన సుగ్రీవుని పాలిట నీవు పెన్నిధివి. నీబాణము మొనతో సముద్రాన్ని దారిలోనికి తెచ్చుకొన్నవాడివి. వేంకటాద్రిమీద వేంకటేశ్వరుడిగా వెలసినరాముడివి నీవు, అంటాడు-అన్నమయ్య.

**దీనరక్షకు డఖిలవినుతుడు దేవదేవుడు రాముడు**
**జానకీపతి గొలువుడీ ఘనసమరవిజయుడు రాముడు**

మునులకు, ఋషులకు అభయాన్ని ఇచ్చిన మూల మూర్తి. పరమపురుషుల మనసులలో వెలిగే తేజస్సు, కార్యసాధకుడైన తన బంటు హనుమంతునికి బ్రహ్మపట్టము నిచ్చినవాడు. దైవాంశసంపన్నుడు. భక్తసులభుడు. వేదాలతో నమస్కరింపదగినవాడు. దీనరక్షకుడు. అఖిలప్రజలచే స్తుతింపబడువాడు. దేవతలకే దేవుడు అని, ఘనసమరవిజయుడైన రామునిఘనతను కొనియాడాడు - అన్నమయ్య.

**సర్వరక్షకుడైన సర్వేశుడే కాక**
**ఉర్వీమీద నందరిలో నొక్కడా రాముడు (11-208)**



**నరుడా యీతడు ఆదినారాయణుడు గాక!**
**ధరణి గేరితికెక్క దరణిసుతుడు (2-497)**

ఎన్నో గొప్పకార్యాల్ని సాధించి, శ్రీవేంకటాద్రిపై వెలసి, నాలుగుదిక్కులతో కూడిన లోకాలన్నీ పాలించే శ్రీవేంకటేశ్వర స్వామిరూపంలో ఉండి అందరినీ రక్షించేవాడు, అందరికీ ప్రభువు అయిన శ్రీరాముడు భూమిపై నున్న మానవులలో తానూ ఒక్కడా? భూమండలంలో శాశ్వతకీర్తిని పొందిన రాముడు నరుడా! కాదు కాదు ఆదినారాయణుడే! దేవాధిదేవుడే! అంటాడు- అన్నమయ్య పై రెండుసంకీర్తనల్లో రామునిగొప్పతనాలను తెలియజేస్తూ,

రాముడు మూర్తీభవించిన ధర్మస్వరూపం. వేదాల్లో తెలియజేసిన 'అహం బ్రహ్మాస్మి' అనే పరమాద్వైత స్థితిని ఆచరణలో చూపి పరమాత్ము డయ్యాడు. మానవులు మాధవులు కావా లన్నసందేశాన్ని యుగయుగాలకు అందించాడు. అటువంటి రామునిగొప్పతనం తెలియజేసే తెలుగుసాహిత్యంలో అన్నమయ్యపదాలు, ఆ శ్రీరామునిపదాలపై నిలచి, ఎప్పటికీ వసివాడని అక్షరపారిజాతాలు.

## డయల్ యువర్ ఈ.ఓ. కార్యక్రమం - 01-02-2013

## భక్తుల సమస్యలు - సూచనలు - ఈ.ఓ. గారి ప్రతిస్పందన - కార్యప్రణాళిక

*(ప్రతినెల మొదటిశుక్రవారం తిరుమల తిరుపతి దేవస్థానం కార్యనిర్వహణాధికారితో **'డయల్ యువర్ ఈ.ఓ.'** కార్యక్రమంద్వారా భక్తులు ఫోనులో మాట్లాడేఅవకాశం ఏర్పాటుచేసింది. వివిధప్రాంతాల భక్తులు కార్యనిర్వహణాధికారిగారికి చేసినసూచనలు, వివరాలు కొన్ని, ఇక్కడ పొందుపరుస్తున్నాం.)*

**1. పుష్కరిణివద్ద స్నానం చేస్తున్నప్పుడు సంకల్పం చెప్పుకోవడానికి పురోహితులను ఏర్పాటు చేస్తే బాగుంటుంది.**

**2. ఆర్జితసేవల టిక్కట్టులను ఆన్‌లైన్‌లో ఇస్తున్నారు. అందరికీ ఈ ఆన్‌లైన్ సదుపాయం ఉండదు. కరెంటు బుకింగ్‌లో కొన్ని ఆర్జితసేవాటికెట్టులను ఏర్పరిచితే బాగుంటుంది.** *- సుబ్బరామశాస్త్రి, హైదరాబాదు.*

**కార్యనిర్వహణాధికారి :** 1) పురోహితసంఘాన్ని సంప్రదించి, ఏర్పాటుకు చర్యలు తీసుకుంటాము.

2) మీరు సూచించినవిధంగా చేసినయెడల పరిపాలనపరమైన ఇబ్బందులు ఎదురవుతాయి. ఇది సాధ్యం కాదు.

**1. మాఅమ్మగారివయస్సు 60 సంవత్సరాలు. మేము వయోవృద్ధుల క్యూలైన్‌లో దర్శనార్థం వెళుతున్నప్పుడు 65 సం॥లు పైబడినవారికిమాత్రమే దర్శన సదుపాయం అని దర్శనమునకు అనుమతించలేదు. స్త్రీల వయోపరిమితిని 60 సం॥లకు తగ్గిస్తే బాగుంటుంది.**

**2. క్యూ లైన్ వద్ద పాలకేంద్రాల ఏర్పాటు బాగుంది. వీటి సంఖ్యను పెంచితే బాగుంటుంది.**

*- రమణబాబు, హైదరాబాదు.*

**కార్యనిర్వహణాధికారి :** 1) వయోపరిమితిని తగ్గించలేము.

2) పాలసరఫరాసంస్థలతో సంప్రదింపులు జరుగుతున్నాయి. వీలైనంత త్వరలో పాలకేంద్రాల సంఖ్యను పెంచుతాము.

**1. నడక మార్గాన పాదరక్షలు చేతిలో పట్టుకునివెళ్ళవలసి వస్తున్నది. అందుకని బ్యాగులో పెట్టి లగేజ్‌కౌంటర్ వద్ద ఇస్తే స్కానింగ్ చేసేసిబ్బంది బ్యాగులో చెప్పులు పెట్టకూడదు అంటున్నారు.**

**2. లడ్డుతో పాటువడనుకూడా భక్తులకు ఇస్తే బాగుంటుంది?** *- కళావతి, రాజమండ్రి.*

**కార్యనిర్వహణాధికారి :** 1) చెప్పులను బ్యాగులో పెట్టుకొని తీసుకొనివెళ్ళవచ్చు. అక్కడి సిబ్బందికి మరొక మారు సూచనలు ఇస్తాము.

2) లడ్డుతో పాటు వడ ప్రసాదాన్ని ఇవ్వడం కష్టం. అయినా మీ సలహామేరకు చిన్నసైజు వడలు ఇవ్వడానికి పరిశీలిస్తాము. మీ సలహా బాగున్నది.

**కల్యాణోత్సవం ఆర్జితసేవ చేసుకున్నగృహస్థులకు ప్రత్యేకంగా దర్శనసదుపాయం కల్పిస్తే బాగుంటుంది.**

*- విష్ణువర్ధన్, ప్రొద్దుటూరు.*

**కార్యనిర్వహణాధికారి :** కల్యాణోత్సవగృహస్థులకు ప్రత్యేక దర్శన సదుపాయ మున్నది.

**క్యూ వరుసలలో వచ్చేటప్పుడు బ్రిడ్జి దగ్గర అన్ని వరుసలు కలవడంచేత స్త్రీలు, పిల్లలు, ముసలివారికి ఇబ్బందిగా ఉన్నది.** *- సప్తగిరి, సాలూరు.*

**కార్యనిర్వహణాధికారి :** రద్దీ ఎక్కువగా ఉన్నప్పుడు ఈ ఇబ్బంది కలుగుతుంది. క్యూ లైన్ల రద్దీ మీద అధ్యయనం జరుగుచున్నది.

**మేము భజనసంఘాన్ని స్థాపించి, అన్ని ప్రాంతాలకు వెళ్ళి, భజనకార్యక్రమాలు నిర్వహిస్తుంటాము. మీసంస్థద్వారా భజనోపయుక్తవాద్యాలను ఇప్పించవలసినదిగా కోరుచున్నాము.** *- వెంకటేష్, తిరువళ్ళూరు.*

**కార్యనిర్వహణాధికారి :** దరఖాస్తును పంపండి. సాధ్యాసాధ్యాలను పరిశీలించి, వాద్యాలను ఇవ్వగలము.

# అన్నమయ్య సంకీర్తనలు - తిరుమల

డా॥ చాటచంద్రశేఖర్

కృతయుగంతో సమానమైనయుగం, వేదంతో సమానమైనశాస్త్రం, గంగతో సమానమైనతీర్థం, జలదానంతో సమానమైనదానం, నిజదారసుఖంతో సమానమైన సుఖం, కృషితో సమానమైన ధనం, జీవితం కంటే శ్రేష్ఠమైన లాభం, ఉపవాసాన్ని మించినతపస్సు, ధర్మంతో సమానమైన మిత్రుడు, సత్యంతో సమానమైన యశస్సు లేనట్లే సాక్షాత్తూ, భగవంతునినివాసభూమియైన శ్రీవేంకటాద్రితో సమానమైనస్థానం ఈ సృష్టిలో మరొకటిలేదు.

ఇంత గొప్పక్షేత్రాన్ని పదకవితాపితామహుడైన అన్నమయ్య అతిరమ్యంగా సంకీర్తించాడు. అన్నమయ్య తిరుమల కొండను కేవలం ఒక సామాన్యపర్వతంవలెగాక, పరమపవిత్ర ప్రదేశంగా భావించాడు.

**కట్టెదుర వైకుంఠము కాణాచయిన కొండ**
**తెట్టెలాయ మహిమలే తిరుమలకొండ**

**వేదములే శిలలై వెలసినది కొండ**
**యేదెసఁ బుణ్యరాసులే యేరులైనది కొండ**
**గాదిలి బ్రహ్మాదిలోకముల కొనలకొండ**
**శ్రీదేవుఁ డుండేటి శేషాద్రి యీకొండ**

**సర్వదేవతలు మృగజాతులై చరించేకొండ**
**నిర్వహించి జలధులే నిట్టచరులైన కొండ,**
**వుర్విఁ దపసులే తరువులై నిలిచిన కొండ**
**పూర్వపుటంజనాద్రి యీపొడవాటికొండ**

**వరములు కొటారుగా వక్కాణించి పెంచే కొండ**
**పరగు లక్ష్మీకాంతు సోబనపుఁ గొండ**
**కురిసి సంపదలెల్ల గుహల నిండిన కొండ**
**విరివైన దిదివో శ్రీ వేంకటపుఁ గొండ** **(3-471)**

వేంకటాచలంతో సమానమైనప్రదేశం ఈ బ్రహ్మాండంలో ఎక్కడా కానరాదు! తిరుమలశిఖరాలు అత్యంతమహిమాన్విత మైనవి! ఇక్క దున్నచెట్టూపుట్టా అన్నీ మునులరూపాలే! ఈ కొండపైని శిలలన్నీ వేదాలే! మృగజాతులన్నీ దేవతాస్వరూపాలే! పుణ్యరాసులన్నీ ఏరులైనకొండ ఇది! శ్రీదేవుడు కొలువైన కొండ ఇదే! వరాలు కురిపించే ఈలక్ష్మీకాంతుని సోబనపుకొండ, మనముందు నిలిచిన వైకుంఠమే తిరుమల అని అన్నమయ్య పై సంకీర్తనలో తిరుమలను కీర్తించాడు.

అంతేగాదు ఈ శేషాద్రి (తిరుమల) అతిశయంబైన శిఖరాలతో కూడి ఉన్నదట. ఆ కొండ సరిలేని గోపురప్రభలతో ప్రకాశిస్తున్నదట. అంతేగాక శతకోటిసూర్యులతేజస్సుతోనూ ఎలుగొందుచున్నదట.

**ఇప్పు డిటు కలగంటి నెల్లలోకములకు -**
**నప్పడగు తిరువేంకటాద్రీశు గంటి ॥**
**అతిశయంబైన శేషాద్రి శిఖరము గంటి**
**ప్రతిలేని గోపురప్రభలు గంటి**
**శతకోటిసూర్యతేజములు వెలుఁగగఁ గంటి**
**చతురాస్యు పొడగంటి చయ్యన మేలుకొంటి !!** **(1-38)**

అన్నమయ్యతలపుతరంగాలలో, కనులలో, కలలలో కొలువైయున్నది ఆకొండలరాయుడే! లోకజనకుడైన తిరు వేంకటప్పను, ఆ స్వామిదివ్యమంగళవిగ్రహాన్ని, తిరుగులేని ఆ దివ్యసౌందర్యాన్ని, శేషాచలశిఖరాల మణిమయకాంతులను స్వప్నంలో సాక్షాత్కరింపజేసుకున్నధన్యుడు - అన్నమయ్య. తిరుమలకొండను కలలో చూచిన అన్నమయ్య ఆ దివ్యధామాన్ని దర్శించడానికే మొదటగా తిరుమలకు బయల్దేరాడు.

తిరుమలక్షేత్రం చేరగానే అన్నమయ్యలో భక్త్యావేశం పెల్లుబికింది. ఆనందనిలయాన్ని చేరిన అన్నమయ్యలో ఆనందం ఉప్పొంగింది. ఆ ఆనందంలో చిందులు వేస్తూ ఆ భక్తశిఖామణి ఇలా గానం చేశాడు -

**అదివో అల్లదివో హరివాసము**
**పదివేలు శేషుల పడగలమయము**

**అదె వేంకటాచల మఖిలోన్నతము**
**అదివో బ్రహ్మాదుల కపురూపము**
**అదివో నిత్యనివాస మఖిలమునులకు**
**అదె చూడు డదె మొక్కు డానందమయము**
**.......................... (1-23)**

అన్నమయ్య ఎనిమిదేండ్లవయస్సులో తొలిసారిగా తిరుమలకొండను దర్శించినపుడు, ఆ బంగారుశిఖరాల సౌందర్యానికి, పులకితుడై, పరవశుడై ఆనందతాండవం చేస్తూ పాడినపాటే పై సంకీర్తన. కైవల్యానికి సాధనమైన కొండ, సకల సంపదలకు రూపమైన కొండవైభవాన్ని అన్నమయ్య ప్రస్తుతించాడు.

ఇలా తన ఆనందాన్ని ప్రకటించిన అన్నమయ్య ఆనంద నిలయవాసుణ్ణి దర్శించడంకోసం బంగారువాకిలి దగ్గరకు వెళ్ళాడు. ఇతడు వెళ్లేసరికి ఆనందనిలయవాసుడైన శ్రీనివాసుడు తనరూపసందర్శనతో భక్తులకు జ్ఞానాన్ని, ఆనందాన్ని ప్రసాదిస్తూ ఉన్నాడట! అతణ్ణి దర్శించగానే అన్నమయ్య పునీతు డయ్యాడట. అఖిలాండకర్తను దర్శించుకున్న అన్నమయ్య ఆపుణ్యప్రదేశ సందర్శనతో పునీతుడే కాదు, పులకితుడూ అయ్యాడు.

**కంటి నఖిలాండకర్త నధికుని గంటి**

**కంటి నఘములు వీడుకొంటి నిజమూర్తిఁ గంటి ॥**

**మహనీయ ఘనఫణామణుల శైలము గంటి**
**బహువిభవముల మంటపములు గంటి**
**సహజనవరత్నకాంచనవేదికలు గంటి**
**రహి వహించిన గోపురంబు లవె కంటి ॥**

**పావనంబైన పాపవినాశనము గంటి**
**కైవశంబగు గగనగంగ గంటి**
**దైవికపు పుణ్యతీర్థములెల్ల పొడగంటి**
**కోవిదులు కొనియాడు కోనేరుఁ గంటి ॥**

**పరమయోగీంద్రులకు భావగోచరమైన**
**సరిలేని పాదాంబుజములు గంటి**
**తిరమైనగిరి చూపు దివ్యహస్తము గంటి**
**తిరువేంకటాచలాధిపు చూడఁ గంటి ॥ (4-58)**

అఖిలాండకర్తయైన శ్రీవేంకటేశ్వరుని దర్శిస్తే చాలు! మన పాపా లన్నీ పటాపంచలైపోతాయి! అలాంటి మహనీయ కమనీయమూర్తిని, తిరుమలగిరులసౌందర్యాన్ని అన్నమాచార్యులవారు దర్శించి, భావావేశంలో ఆ అద్భుతసౌందర్యాన్ని సంకీర్తనం చేశాడు.



పరమపవిత్రమైన ఈకొండను కాలితో నడిచి వచ్చి, దీని పవిత్రతకు భంగం కల్గించరా దని రామానుజుడు తిరుమలకు మోకాళ్ళపై వచ్చేవారట. అంతటిగొప్పది ఈ కొండ మాహాత్మ్యం. అలాంటి తిరుమలకొండను తననెలవుగా చేసుకున్నట్టి, ఎల్లలోకాలకు నాథుడైనట్టి, కనకాంబరధారియైనట్టి తిరువేంకటాచలాధిపుని దర్శించడానికి నానాదిక్కుల నరులెల్లరూ, శతసహస్రయోజనదూరవాసులంతా "కుండపోతవానలవంటి ఎంతటి క్లిష్టపరిస్థితులనైనా లెక్కచేయక తిరుమలకు చేరుకుంటారట!

**నానాదిక్కుల నరులెల్లా**
**వానలలోననె వత్తురు గదలి ॥**

**సతులు సుతులు పరిసరులు బాంధవులు**
**హితులు కొలువఁగా ఇందరును**
**శతసహస్రయోజనవాసులు సు-**
**వ్రతములతోడనె వత్తురు కదలి ॥ (4-58)**

నానాదిక్కులనుండి మానవులంతా బంధుమిత్రులతో మంచినియమాలతో వానలనుకూడా లెక్కచేయకుండా పరమాత్మునిదర్శనార్థం కొండకు వస్తారట. వారు ముడుపులు చెల్లించడానికి ఏకాలమైన లెక్క చేయకుండా తిరుమలకొండను చేరుకుంటారట. సామాన్యమానవులేగాక, చక్రవర్తులూ, రాజులూ శ్రీస్వామిని దర్శించటానికి తిరుమలకు తరలి వస్తారట. అవును, జగత్తుకంతా చక్రవర్తి ఈ శ్రీనివాసుడు. ఇతని ముందర అందరూ సామాన్యులే.

తిరుమలకొండ పావనమైనది. బ్రహ్మమయమైనది. సచ్చిదానందస్వరూపమైనది. పరమాత్ముడైనవేంకటాపతి పాదస్పర్శతో పునీతమైన ఈ తిరుమలకొండ సాలగ్రామమయమై దివ్యధామంగా వెలుగొందుతూంది. ఈకొండయొక్క అణువణువూ భగవత్స్వరూపం. కలియుగవైకుంఠం అయిన తిరుమల క్షేత్రాన్ని ప్రతిభక్తుడూ దర్శించి, ఆ పద్మావతీచరణచారణచక్రవర్తి కృపకు పాత్రుడు కావాలి!

బాలప్రబోధం



# అణకువ

సి.వేదవతి

ప్రకృతి మనకు ప్రాణప్రదాత మాత్రమే కాదు. జీవన గమనంలో మనం అనుసరించదగిన అనేకధర్మ సూత్రాలను ఎరుకపరుస్తుంది. అద్భుతమైన ఈ కాలచక్రపరిభ్రమణమంతా సృష్టికర్తసంకల్పశక్తిని అనుసరించి, వినయవిధేయతలతో ప్రవర్తిల్లుతున్నదే! ఎప్పుడైనా దారి తప్పి, ప్రకృతి గీత దాటినట్లైతే జరిగేది వినాశనమేకదా!

మానవప్రకృతిలోనూ ఈ ఔద్ధత్యం కూడదని దనీ అహంకారాన్ని వదలి అణకువను అలవరచుకోవటం సజ్జనుల లక్షణమనీ– అదే ప్రకృతిలక్షణంకూడా అనీ భర్తృహరిసుభాషితం చెపుతున్న దిలా.

మధురమధురమైన ఫలాలను అందించే వృక్షాలు ఫలభారంతో వంగి ఉంటాయి. ప్రాణికోటికి జీవధారను అందించే మేఘాలు నీళ్లతో నిండి, బరువుగా ఆకాశంలో వేలాడుతున్నట్లు ఉంటాయి. లోకంలో సత్పురుషులూ అంతే! ఎంత సంపద ఉన్నా, గర్వంతో మిడిసిపడక వినయవిభూషితులై ఉంటారు.

ఎంత ఎదిగినా ఒదిగి ఉండడం అనే గొప్పలక్షణాన్ని ప్రకృతి ఈ విధంగా మనకు బోధిస్తున్నది. ధర్మశాస్త్రవేత్తలయిన మనమహర్షులు సృష్టించిన పౌరాణిక, వేదాంతగ్రంథాలలో ఈ సూక్తిని బలంగా చెప్పినదృష్టాంతాలు ఎన్నో కనిపిస్తాయి.

అణకువగా ఉండడం ఆత్మన్యూనతగా కొందరు భావించవచ్చు. కానీ వినయశీలత అనేది మానవీయమైన ఒక సౌజన్యలక్షణం. మహాపురుషులైనవారికి కూడా ఇది గొప్ప అలంకారం అవుతుం దనడానికి నిదర్శనం – వాల్మీకి రామాయణంలోని శ్రీరామచంద్రునిపాత్ర. తల్లిదండ్రులు, గురువులు, పూజ్యులైన వారిపట్ల శ్రీరాముడు ప్రదర్శించినవినయవిధేయతలు ఎంత మనోరంజకంగా ఉంటుంది! అందరూ అలవరచుకోవలసిన నమ్రతాలక్షణాన్ని తాను ఆచరించి చూపిన మహనీయ పాత్ర శ్రీరామపాత్ర.



అణకువ, వినయశీలత కలిగిన వానికే భగవంతుడు వశ్యుడు అవుతాడు. స్వాభిమానాన్ని ఎక్కువగా పెంచుకొన్నప్పుడూ మనిషిలో గర్వం, అహంకారం విజృంభిస్తాయి. అహంకారం ఉన్నచోట ఔద్ధత్యమే తప్ప అణకువకు స్థానం ఉండదు. ఒక్కొక్కసారి కొద్దిపాటి చదువుతోనే ఎక్కడ లేని గర్వం రావటం మనం చూస్తుంటాం. 'అల్పవిద్యో మహాగర్వి' అనడం అందుచేతనే! చదువుకున్నవిద్య మనకు వినయాన్ని ఇవ్వాలి. వినయం లేనివిద్యవల్ల ప్రయోజనం ఉండదు. విద్యకు వినయం కూడినప్పుడు అది ఒక గొప్ప అలంకారంగా భాసిస్తుం దని పెద్దలు అంటారు.

గర్వం అనేది మొలకెత్తగానే మనిషిలోని అణకువను అణచివేస్తుంది – అది ధనగర్వం, సౌందర్యగర్వం, అధికారగర్వం మరేదయినా కానీ! మనంత గొప్పవాళ్లు మరొకరు లేరన్నే భ్రమ మనకంటికి కమ్ముకొనే చీకటిపొర. మనకంటే గొప్పవాళ్లు ఎంతోమంది ఉన్నా రనీ, వారివద్ద మనం నేర్చుకోవలసింది చాలా ఉన్న దనీ తెలుసుకొన్న క్షణంలోనే అహం అనే కంటిపొర తొలగిపోతుంది. అహంకారం తొలగినహృదయంలో వినమ్రభావం ప్రవేశిస్తుంది.

వినమ్రత అంటే అందరిలోనూ దివ్యత్వాన్ని దర్శించే ప్రయత్నం చేయడం, దేవాలయానికి వెళ్ళినప్పుడు భగవంతుని ముందు మనం అప్రయత్నంగానే శిరసా నమస్కరిస్తాం. ఈ పారమార్థికమైన ప్రయోజనంతో పాటు లౌకికజీవనసాఫల్యతనూ పొందటానికి అణకువతో కూడిన వినయగుణం మనకు ఎంతో అవసరం.

# సరమ

**దూపాటి సౌభాగ్యలక్ష్మి**

**"రామస్య క్షిప్రమ్ అంకగతాం సతీమ్"**

ఈ మాటలు సీతమ్మతో సరమ అన్నది. సరమ రాక్షస స్త్రీ. కాని ఆమె "రామునితొడపై నువ్వు కూర్చుని ఉండగా చూచి సంతోషించా లని ఉంది" అని సీతతో అన్నది. ఆమె ఎందుకు అన్నది? అసలు సరమ ఎవరు? రావణాసురుడు సీతమ్మను అపహరించి, అశోకవనంలో ఉంచా డనేవిషయం మనందరికీ తెలిసిందే. ఆమెకు కాపలాగా రాక్షస స్త్రీలను ఉంచాడు. రోజూ ఉదయం రావణాసురుడు సీతమ్మవద్దకు వచ్చి, తనకోరికను చెప్తుతూ ఉండేవాడు. చుట్టూ ఉన్న రాక్షసస్త్రీలు-రావణుడు వెళ్ళినవెంటనే నిన్ను తినేస్తా మని పలురకాలుగా సీతమ్మను వేధించేవాళ్ళు. సీతమ్మ లంకలో ఉండగా ఆహారం తీసుకున్నట్లు మనకు ఎక్కడ కనిపించదు. ఉపవాసదీక్షతో ఉంది. సీత ఆహారం లేకుండా ఎలా ఉండగల్గింది? మానవజన్మనెత్తినవాళ్ళకు ఆకలి దప్పులు ఉంటాయిగా....

అందుకే... సీతమ్మ రావణాసురునిచెరలో ఉన్నప్పుడు ఆకలిదప్పులు లేకుండా పాయసాన్ని తెచ్చి యిచ్చాడు - ఇంద్రుడు. ఆ పాయసం తిన్నఆమెకు ఆకలి లేదు.

రాక్షసులలోకూడా మంచివాళ్ళు ఉంటారు. ఎందు కంటే విభీషణుడు రావణునికి హితబోధ చేసి, అన్నకోపానికి గురి అయ్యాడు. దుర్మార్గుడైన అన్నను వదిలి, తనమిత్రులతో శ్రీరాముణ్ణి శరణువేడాడు. ఆశ్రితజనరక్షకుడైన శ్రీరాముణ్ణి ఆశ్రయించినవారికి మేలేకాని కీడు ఉండదుకదా. ఆ విభీషణుని భార్య సరమ. సరమ ఉత్తమగృహిణి. శైలూషు డనే గంధర్వుని కుమార్తె. ఆకాశగమనం చేయగల కామరూపిణి. సరమా విభీషణుల కుమార్తెయే త్రిజట - అని కొందరి భావన.




సరమనుగురించినవిషయం మనకు శ్రీమద్రామా యణంలోని యుద్ధకాండ 33, 34 సర్గలలో ఉన్నది. హను మంతుడు లంకకు వెళ్ళి, సీతమ్మజాడను తెలుసుకొని రాము డిచ్చినఉంగరాన్ని గుర్తుగా ఇచ్చాడు-సీతమ్మకు. సీతమ్మ ఇచ్చిన చూడామణిని సీతమ్మను చూచినందుకు గుర్తుగా తీసుకొనివెళ్ళి, శ్రీరాముడికి ఇచ్చాడు. రావణునిపై యుద్ధంచేసి, అతణ్ణి వధించి, సీతమ్మను తీసుకురావా లంటే సేతువు కట్టాలి. సుగ్రీవజాంబ వంతులతో వాన భల్లూకసైన్యంతో సేతువు కట్టి, లంకను చేరారు. రామలక్ష్మణులు సుగ్రీవజాంబవంతాదులు, సైన్యం లంకలోని సువేలాపర్వతంపై చేరి ఉన్నారు.

రావణాసురుడు రామునిరాక తెలుసుకున్నాడు. అంత రంగంలో ఎక్కడో రావణునికి భయం ఉంది. తప్పు చేసిన వాళ్ళు భయపడక తప్పదుకదా! అదీకాక లంకలో హనుమంతుని ప్రతాపాన్ని చవిచూచిన రావణునికి తన శత్రువైన రామునిబలం తెలుసుకోవా లనుకున్నాడు. అందుకై తన ముఖ్యగూఢచారులైన శుకసారణు లనే కామరూపులైన రాక్షసులను పంపించాడు. (ద్వాపరయుగంనాటి శుకసారణు లనేరాక్షసులు ఈ రాక్ష సులు ఒకరే కాదు) వాళ్ళు వానరరూపం ధరించి, వానర భల్లూక సైన్యంలో తిరుగుతున్నారు. విభీషణుడు శుకసారణులను చూచి, గుర్తించాడు. వాళ్ళల్లో ముఖ్యుడైన శార్దూలుణ్ణి బంధించారు. శార్దూలుణ్ణి శ్రీరామునివద్దకు తీసుకొని వెళ్ళారు. వానరులు శార్దూలుని చావబాదుతున్నారు. అది చూచి రాముడు జాలి దలిచి శార్దూలుణ్ణీ, అతనితో వచ్చిన అనుచరులనూ వదలిపెట్ట మన్నాడు. వాళ్ళను వదిలేశారు - వానరులు. ఈ శుకసారణులు రావణుణ్ణి చేరారు.

రావణాసురుడు శుకసారణులను గూఢచర్యకు పంపిన తరువాత వాళ్ళు రామునిసైన్యం అతనిబలం, మిగిలిన వివరాలు తెలుసుకొని వచ్చేలోపల- సీతమ్మను కలిసి, ఆమెను భ్రమింప చేద్దా మనుకున్నాడు. తుది ప్రయత్నంగా అశోకవనంలోకి రావణుడు బయలుదేరాడు.

విద్యుజ్జిహ్వుడు మాయావిద్యలలో శ్రేష్ఠుడు. అతణ్ణి పిలిచి, సీతను భ్రమింప చేయటానికి రామునిమాయాశిరస్సును, ధనుస్సును సీతకు చూపించాలి. 'అలాగే' అన్నాడు-విద్యుజ్జిహ్వుడు. అతనిమాయాకౌశలానికి మెచ్చి, తన ఆభరణాన్ని ఒకటి తీసి యిచ్చాడు. రావణుడు సీతవద్దకు వెళ్ళాడు.

**అల్పపుణ్యే నివృత్తార్థే మూఢే పండితమానిని ।**
**శృణు భర్తృవధం సీతే! ఘోరం వృత్రవధం యథా ॥**

**(యు॥ 31 సం॥ 17 శ్లో)**

'సీతా! విను! తెలివిగలదానిని అనుకుంటున్నావేమో! పండితురాల నని భావిస్తున్నావా! ఇంద్రుడు వృత్రాసురుని వధించి నట్లు రామునిశిరస్సును ప్రహస్తుడు తనఖడ్గంతో వధించి శిరస్సు తెచ్చాడు. ఆ రామునిధనుస్సుకూడా తెచ్చాడు-చూడు.

**"బల మస్య హతం రాత్రే యత్ర రామ స్సలక్ష్మణః"**

**(యు.31-21)**

యుద్ధంపనులలో అలసి రాత్రి నిద్రపోతున్న రాముని శిరస్సు ఖండించి తెచ్చాడు. లక్ష్మణుడు, వానరసైన్యం నలుదిక్కుల పారిపోయారు. అంగదుడు బాణఘాతానికి రక్తపుమడుగులో ఉన్నాడు. సుగ్రీవునిమోకాళ్ళు తెగగొట్టాడు- అని రావణుడు సీతతో చెపుతూ "విద్యుజ్జిహ్వా! ఆ శిరస్సు, ధనుస్సు ఇటు చూపు" అన్నాడు. సీతమ్మ రామునిమాయాశిరస్సును చూచింది. శిరస్సు పైగల చూడామణిని చూచి, రామునిశిరస్సే అని భ్రమపడింది.

**"ఇదం చాస్యాఽఽ హృతం శిరః" (యు.31-21)**

ఇది రామునిశిరస్సే! ఇటు చూడు అని అనిన రావణునిమాటలు విని, ఆ శిరస్సును ధనుస్సును చూచి, దుఃఖపడుతూ...

"భార్యకంటె భర్త ముందు చనిపోవడం దురదృష్టకరం. వశిష్ఠాదిమునులు, బ్రాహ్మణులు 'దీర్ఘాయుష్మాన్ భవ' అని దీవించిన దీవెనలు అసత్యా లెట్లా అవుతాయి? పతివ్రతనైన నాకు రాముడు ముందు చనిపోవడం అసంభవం. కాని... ఏమైనా పొరపాట్లు చేశానా?" అని ఆలోచిస్తూ, "దానం సరిగా చేయ లేదా!.. "మన మాన్యాం మాయాజాతం వారితం దాన ముత్త మమ్ (యు॥ 32 సర్గ॥ 30 శ్లో.) రాముడు అనేకమైన ఉత్తమ దానాలు చేశాడు. అతను దానం చేస్తుంటే ఎప్పుడైనా నేను అడ్డుపడ్డానా!

## గోవిందనామాలు

**గోవిందనామాలు గోవిందనామాలు**
**కలియుగానికి వైకుంఠమార్గాలు**
**సప్తాద్రివాసునికి సరితూగుపదాలు**
**దర్శించువారికి దారిదివిటీలు**
**శరణన్నవారికి అభయప్రదాయాలు**
**కీర్తించువారికి మోక్షదాయాలు**
**భజియించువారికి వేదమంత్రాలు**
**అన్నమయ్యపదంలో తరించిన తత్త్వాలు**
**శ్రీవేంకటనాథుని పూజించు పుష్పాలు**

ఎ.చెంచులత

భర్తను ప్రాణంతో సమానంగా చూచుకొనే స్త్రీకి లోకంలో అన్నీ సుఖావహాలే! అయినా ..., నేను కౌసల్యాసుమిత్ర లకు ఏవిధంగా చెప్పను? అత్త కౌసల్యకు సమాధానం ఏమి చెప్పాలి". అని ఇలా పరిపరివిధాల ఆలోచిస్తూ... దుఃఖిస్తూ....

**క్షమా యస్మిన్ దమ స్త్యాగః సత్యం ధర్మః కృతజ్ఞతా।**
**అహింసా చైవ భూతానాం తమ్ ఋతే కా గతి ర్మమ ॥**

**(యుద్ధ... 32 సర్గ 34 శ్లోకం)**

బాధ కలిగినప్పుడే అన్నీ జ్ఞాపకం వస్తాయికదా! సీతమ్మ స్వయంభూమూర్తి అయినా ఒక సామాన్యమానవ గృహిణివలె భర్తగురించి బాధపడింది. రామునిమంచి గుణా లను తలచుకొనింది. ఇంద్రియనిగ్రహం, క్షమ, దయ, త్యాగం, సత్యం, ధర్మం కృతజ్ఞత, భూతదయ గల రాముడు... అని ఏడుస్తూ బంగారువన్నెతో మెరిసే ఆ ధనుస్సును చూస్తుండి పోయింది.

అదే సమయానికి అంగరక్షకుడు వచ్చి "రావణునికి జయం; జయం" అని జయజయధ్వానాలు చేశాడు. వచ్చినపని అడిగాడు-రావణుడు.

"మీదర్శనానికి ప్రహస్తుడు, అత్యవసరసమావేశమై మంత్రులు మీకోసం ఎదురు చూస్తున్నారు" అన్నాడు- అంగరక్షకుడు. రావణాసురుడు వెంటనే వెళ్ళిపోయాడు.

ఇవన్నీ చెట్టుచాటున విభీషణునిభార్య సరమ చూస్తున్నది. సీతవద్దకు వచ్చి ఓదార్చింది. కన్నీరు తుడిచింది. "అమ్మా! బాధపడకు. రాముడు రావణుణ్ణి వధించి, నిన్ను తీసుకొని వెళ్ళేరోజు త్వరగా వస్తుంది.

**రామస్య క్షిప్రమ్ అంకగతాం సతీమ్**

**(యు॥ 33 స॥ 32 శ్లో)**

శ్రీరామునిఅంకంపై కూర్చుని ఉండే నిన్ను చూచి, ఆనందించేరోజు శీఘ్రమే వస్తుం"దని సరమ సీతతో అన్నది.

## మే నెలలో తి.తి.దే. ఉత్సవ విశేషాలు

**12 –** శ్రీపరశురామజయంతి
- అక్షయతృతీయ

**14 –** తిరుపతి గంగజాతర

**15 –** శ్రీశంకరజయంతి

**17 నుండి 25 వరకు –**
శ్రీగోవిందరాజస్వామివారి బ్రహ్మోత్సవాలు, తిరుపతి

**19 నుండి 21 వరకు –**
శ్రీపద్మావతీ శ్రీనివాసుల పరిణయం, తిరుమల

**22 నుండి 30 వరకు –**
శ్రీకల్యాణవేంకటేశ్వరస్వామివారిబ్రహ్మోత్సవాలు, హృషీకేశ్ మరియు నారాయణవనం

**23 –** శ్రీనృసింహజయంతి

**24 –** శ్రీకూర్మజయంతి
- అన్నమయ్యజయంతి
- తరిగొండవెంగమాంబజయంతి

"ఆకాశంలో గరుత్మంతునికన్నా, వాయుదేవునికన్నా వేగంగా వెళ్ళి, శ్రీరామునికి నీక్షేమవార్తను తెల్పి, తిరిగి నీ వద్దకు వస్తా" అని సరమ అనింది.

రావణుని నిర్ణయాలు, సమాలోచనలుకూడా తెల్సుకొని రమ్మని సీతమ్మ సరమను కోరింది.

సరమ బయలు దేరింది. రావణునిసమాలోచన మందిరంవద్ద చాటుగా నిలిచి, అక్కడిసంభాషణ విన్నది. రావణునితల్లి కైకసి; వృద్ధమంత్రి అవిరుద్ధుడు రావణునిచర్యను మందలించారు; పురుషోత్తముడైన శ్రీరామునికి సీతమ్మను వెంటనే అప్పజెప్పమన్నారు. రావణుడు వారిమాటలు వినలేదు. కాలం దాపురించి వాళ్ళకు హితవచనాలు గిట్టవుకదా! రావణుడు తన మొండి వైఖరినీ, మూర్ఖత్వాన్నీ వీడలేదు.

ఈ మాటలన్నీ విన్న విభీషణునిభార్య సరమ సీతమ్మ వద్దకు వచ్చింది. అక్కడ జరిగిన సంభాషణలు చెప్పింది. "నీకు మంచిరోజులు వస్తా"యని చెప్పి ఊరడించింది.

అదే సమయంలో భూమి దద్దరిల్లేటుగా శంఖ, భేరీ నాదాలు, వానరభల్లూకాలకోలాహలాలు వినిపించాయి. యుద్ధ భేరి వినిపించింది.

"పురుషోత్తముడైన శ్రీరాముణ్ణి శీఘ్రమే నీవు చేరతావు" అని పలికిన శుభసూచకవాక్కులకు సీతమ్మ సంతోషించింది.

**అథ తాం జాతసంతాపాం తేన వాక్యేన మోహితామ్।**
**సరమా హ్లాదయామాస పృథివీం ద్యౌరివాంభసా ॥**

**(యుద్ధ... 34 సర్గ 1 శ్లోకం)**

గ్రీష్మతాపానికి వేడెక్కిన భూమిని ఆకాశం వర్షజలంతో వలె రావణునిమాటలకు భ్రమపడి పరితపిస్తున్న ఆ భూసుతను సరమ తనచల్లని మాటలతో మిక్కిలి ఆహ్లాదపరచింది.

**రావణం సమరే హత్వా న చిరాదేవ మైథిలి।**
**త్వయా సమగ్రః ప్రియయా సుఖార్హో లప్స్యతే సుఖమ్ ॥**

**(యుద్ధ... 33 సర్గ 36 శ్లోకం)**

సీతమ్మకు ఇలా సహకరించగల్గిన సరమ ధన్యురాలు. మంచివాళ్ళు ఎప్పుడూ మంచినే చూస్తారు. మంచినే చేస్తారు.

# ఆత్మనివేదన

**శ్రీమతి బి.కనకమాలిని**

అఖిలాండబ్రహ్మాండకోటి నాయకుడవైన శ్రీవేంకటేశ్వరా! స్వామీ! నీకు శతకోటి నమస్కారములు. కరుణామయా! ఏడుకొండల స్వామీ! ఆపద్బాంధవా! అనాథ రక్షకా! నిర్మల మూర్తీ! సర్వశక్తి స్వరూపా! 'గోవిందా, గోవిందా' అనే నీనామామృతం ఎంతమధుర మైనదయ్యా! ఈ కలియుగంలో భక్తజన కోటిని సంరక్షించడానికై తిరుమలపై వెలసిన ఓ దేవా! అపురూపమైన నీమహత్త్వాన్ని అభివర్ణించడానికి నే నెంతదాన నయ్యా! దివ్యమైన నీలీలాస్వరూపాన్ని కనులారా దర్శించి, నోరారా వర్ణించి, మనసారా ఆనందించా లని నా చిరకాల ఆకాంక్ష. నిన్ను దర్శించా లని మొదటిసారి తిరుమలకు వచ్చినపుడు నాకు కలిగిన అనుభూతిని ఈ విధంగా అక్షర రూపంలో వ్రాయడానికి ప్రయత్నించాను. ప్రభూ! నా 'ఆత్మ నివేదన'ను స్వీకరించి, ఈదీనురాలిని కటాక్షించి ఆదుకోవయ్యా నాతండ్రీ!

1963వ సం॥లో మేము ఆవునూ, దూడను దేవునికి సమర్పించడానికి వచ్చినప్పుడు దేవాలయంవారు వేలం వేయాలని చెప్పారు. కాని దేవునిదయవల్ల తక్కువధరకు అంటే 70 రూపాయలకు వేలం వేశారు. మేము డబ్బిచ్చి, ఆవును, దూడను గుడికి సమర్పించాము. తర్వాత ఎన్నోమార్లు తిరుమలకు వెళ్ళాము. ఎప్పుడు వెళ్ళినా, మళ్ళీ మళ్ళీ వెళ్ళా లనీ, స్వామివారి వైభవాన్ని కన్నులారా చూడా లని అనిపిస్తూనే ఉంటుంది. నీ మహత్త్వం అనంతంకదా!

'తిరు' అనే ద్రావిడపదం 'శ్రీ' అనే సంస్కృతపదానికి వికృతి. 'శ్రీ' అంటే లక్ష్మీదేవి. 'పతి' అంటే భర్త. 'తిరుపతి' అంటే సాక్షాత్ లక్ష్మీపతియైన శ్రీమహావిష్ణువు. భక్తుల ఆలనా పాలనా పరామర్శించడానికై మనతెలుగుగడ్డమీద, తిరుమలలో శ్రీవేంకటేశ్వరస్వామిగా అవతరించాడు. కాబట్టే, పవిత్రమైన మన భారత దేశంలో మన ఆంధ్రదేశం ఎంతో సౌభాగ్యవంతమైంది. ప్రపంచదేశాల్లో, నలుమూలల నుండి భక్తులు తండోపతండాలుగా వేంచేసి, తిరుమలలో స్వామిని దర్శిస్తున్నారంటే, మనతెలుగువారమంతా ఎంతో సంతోషించదగిన, ప్రస్తుతించదగిన విషయం.

'ఎంతోమంది కాలినడకన కొండ లెక్కి తిరుమలకు వస్తుంటారు. పసుపుబట్టలు కట్టుకొని, నుదుట తిరునామాన్ని దిద్దుకొని 'గోవిందా' అనే దివ్యనామాన్ని జపిస్తూ కొండమె ట్లెక్కుతుంటారు. మధ్య మధ్యలో మెట్లు ఎక్కలేక ఆయాసపడుతూ ఎక్క దున్నావయ్యా! స్వామి! అంటూ తమ కష్టాన్ని స్వామికే నివేదించుకొంటారు.

వైష్ణవక్షేత్రా లన్నింటిలో శ్రీవేంకటాచలం ఉత్తమోత్తమమైన పుణ్యక్షేత్రం. వేంకటేశ్వరుడి దివ్యమంగళస్వరూపాన్ని ఒక్కసారి చూచినా చాలు. 'గోవిందా' అని నోరారా ఒక్కసారి పలికితే చాలు, జన్మధన్యమయిన ట్లనిపిస్తుంది. మనస్సులో ఏ కల్మషం లేకుండా స్వామికి నమస్కరిస్తే చాలు. 'సకల కార్యసిద్ధిరస్తు', అంటూ మనల్ని తప్పక దీవిస్తాడు – అచంచల కరుణామయుడైన శ్రీవేంకటేశ్వరుడు.

ఈవిశ్వంలో ఎన్నెన్నో దేశా లున్నాయి. ఎన్నెన్నో దేవాలయా లున్నాయి. భక్తజనులు దేవుణ్ణి సందర్శించుకోవడానికి ముఖ్యమైన కొన్నిరోజుల్లోనే ఆయా దేవాలయాలకు వస్తుంటారు కానీ మన తిరుపతి వేంకటాచలపతిని దర్శించి, తరించడానికిమాత్రం ప్రతిరోజూ అసంఖ్యాకంగా భక్తులు తరలివస్తుంటారు. అందరు దేవుళ్లకు ఒకప్రత్యేకమైనరోజుమాత్రమే కల్యాణోత్సవాన్ని జరిపిస్తుంటారు. వేంకటాచలపతికిమాత్రం నిత్యకల్యాణమూ, పచ్చతోరణమూ. అది మంగళవారం కానీ, శనివారంకానీ, ఏదినమైనా సరే ప్రతిరోజూ ఆయనకు పెండ్లి జరుగుతూనే ఉంటుంది.




వేంకటేశ్వరస్వామియొక్క ప్రియసతీమణి అలమేలుమంగ. అలర్–మేల్–మంగై– అంటే తమిళభాషలో లక్ష్మీదే వని అర్థం. అలర్= తామరపువ్వు, మేల్= మీదవెలసిన, మంగై=స్త్రీ, దేవతామూర్తి–లక్ష్మీదేవి. ఆమె పేరుతో అలమేలుమంగాపురం– అనే ఒక ఊరు ఉంది. అక్కడ ముందుగా ఆ దేవిని దర్శించి, మనకోరికలను ఆమెకు విన్న

వించుకొంటే ఆమె తనపతిదేవునికి వాటిల్ని తీర్చమని చెప్తుం దట. మనకోరికలు తప్పక నెరవేరుతాయట.

సంవత్సరంలో పదిరోజులు కలియుగప్రత్యక్షదైవమైన స్వామివారికి బ్రహ్మోత్సవాలు మహావైభవంగా జరుగుతాయి. సృష్టికర్తయైన బ్రహ్మదేవుడే స్వయంగా సత్యలోకాన్నుండి తిరుమలకు దిగివచ్చి, ఈ ఉత్సవాలను జరిపిస్తాడట. ఆగమం పేర్కొన్న వాహనాలమీద స్వామిని సన్నిధివీథులమధ్య ఊరేగిస్తారు. ఈ బ్రహ్మోత్సవాలలో రకరకాల పుష్పాలంకారాలతో, నవమణులు పొదిగిన బంగారుఆభరణాలను ధరించి, స్వామివారిఉత్సవమూర్తి ఊరేగుతూ ఉంటే – చూడ్డానికి వేయికన్నులున్నా చాల వని అనిపిస్తుంది.

శ్రీవారిదర్శనభాగ్యం ఒకే ఒక్క క్షణం దొరికితే చాలు ననుకొని ఆ దివ్యమూర్తిని దర్శించి, తిరిగి వెళ్తుంటారు–భక్తులు. గర్భగుడిలో నెలకొన్న స్వామి దివ్యతేజోరూపుడై సాక్షాత్కరిస్తాడు. కుడిచేతిలో చక్రం, ఎడమచేతిలో శంఖం, వజ్రాలు పొదిగిన సువర్ణమయకిరీటం దివ్యకాంతులలో ధగధగలాడుతుంటాయి. శ్రీవారికి 'వడ్డికాసులవా' డని, పేరుందికదా! దాన్ని సార్థకం చేసుకోవడాని కన్నట్లుగా భక్తులు బంగారు, నగలు, డబ్బుల కట్టలు, వెండికాసులు మున్నగునవి కానుకలుగా మాటిమాటికి ఉండీలు నింపుతుంటాయి. వాటిల్ని ఒకచోట క్రుమ్మరించి, నాణాలను జల్లెడలలో జల్లించి, లెక్కపెడ్తుంటారు. తిరుమల తిరుపతి దేవస్థానంవారు ఏర్పాటుచేసిన ఈ 'పరకామణి'ని చూడ్డానికి భక్తులు ఎంతో ఆసక్తి చూపుతారు.

శ్రీవారికి, పద్మావతిదేవితో పెండ్లి జరిగినప్పుడు కుబేరునిదగ్గర స్వామి పెండ్లిఖర్చులకై అప్పుగా డబ్బు తీసుకున్నా డని ఒక పురాణకథ ఉంది. వడ్డీడబ్బే ఇంకా తీరలే దంటే? ఇక అసలు బాకీ తీరేది ఎప్పుడు?

స్వామివారు నిత్యాలంకారప్రియుడు. వజ్రాలు, వైడూర్యాలు, పచ్చలు, మాణిక్యాలు, గోమేధికాలు, నీలాలు, పుష్యరాగాలు మొదలుగా గల నవమణులు పొదిగిన బంగారు నగలతో, రకరకాల పుష్పమాలలతో రోజూ స్వామివారిని అలంకరిస్తారు. రథోత్సవం, వసంతోత్సవం, తోమాలసేవ మొదలగు ఉత్సవాలలో పాల్గొనేందుకు భక్తులు పోటీపడి ముందుకు వస్తారు.

స్వామివారి వైభోగమే వైభోగం! ఆయనను సందర్శించి ప్రార్థించడమే ముక్తికి సులభమైనమార్గం. ఆయననామస్మరణ వల్ల సకలకార్యాలూ విజయవంతంగా నెరవేరుతాయి. సకల దోషాలూ నివారించబడుతాయి. క్లిష్టమైనసమస్యలు వాటంతటవే పరిష్కరించబడతాయి. ఆబాలవృద్ధులూ "ఏడుకొండల వాడా! వేంకటరమణా, శ్రీనివాసా, గోవిందా!" అని భక్తితో కీర్తిస్తూ ధన్యులవుతుంటారు. అచ్చటికొండలు, జలపాతాలు, సెలయేర్లు మనోహరంగా ఉంటాయి.

శ్రీవారిని తులసీదళాలతో అర్చిస్తే సకలపాపాలూ, దోషాలూ తొలగిపోతాయి. విద్య, వ్యాపారం, ఉద్యోగం వంటి అన్నిరంగాలలో అభివృద్ధి గోచరిస్తుంది. గోవిందుణ్ణి సదా స్మరించువాళ్లు సిరిసంపదలతో తులతూగుతారు. మానసిక వ్యాధులు తొలగిపోతాయి. ఆరోగ్యాభివృద్ధి కలిగి, మానసిక ప్రశాంతత చేకూరుతుంది.

ఇంతకంటే మనకు మరేమి కావాలి? భక్తులందరూ జీవితంలో ఒక్కసారైనా స్వామిని తిరుమలలో దర్శించడంవల్ల ముక్తి కలుగుతుంది. ఇక్కడి ఏడుకొండలనే శేషాచలం, వేంకటాచలం అంటూ బహువిధనామాలతో పేర్కొంటారు. సప్తగిరులు ఘనీభవించిన శ్రీవారికృపారసం! దేవస్థానయాజమాన్యం భక్తులకు నిరంతరం ఎన్నో సౌకర్యాలు చేకూరుస్తూ – తిరుమల క్షేత్రంపై ఇతోధికంగా భక్తివిశ్వాసాలు పెంపొందించే కృషి చేస్తుంది.

శ్రీవేంకటాద్రినిలయా! శ్రీశ్రీనివాసా! సదా నిన్ను స్మరింతునయ్యా! దిక్కుతోచని నాకు మంచిదారిని చూపుమయ్యా? ఎల్లవేళల నాకు తోడునీడగ నిలచి, నన్ను కావుమయ్యా! నా కన్నీటి బాష్పాలను పుష్పాలుగా భావించి, నీపాద సన్నిధిలో అర్పించి, పూజిస్తానయ్యా! నాకు మనోబలాన్ని ప్రసాదించి, నన్ను అనుగ్రహించవయ్యా! నావంటి దీనభక్త జనులకు నీ దివ్యశ్రీచరణాలే కదా సర్వరక్ష! స్వామీ! "శ్రీ వేంకటేశచరణౌ శరణం ప్రపద్యే" గోవిందా! పాహి పాహి పాహి.

# రాశిఫలాలు

## మే, 2013



జె. చంద్రశేఖరశర్మ



### మేషం

ఈ రాశివారికి ఈ మాసంలో అన్నివిధాలా అనుకూలంగా ఉంటుంది. ముఖ్యంగా ఆర్థికంగా మంచిలాభాలు గడిస్తారు. మానసికఆందోళనలు ఉన్నా, పనులలో విజయాన్ని సొంతం చేసుకుంటారు. ఆలయదర్శనాలకై చేసే ప్రయత్నాలు, ఋణ ప్రయాత్నాలు అనుకూలం. చిన్ననాటిమిత్రుల సహాయసహకారాలు అన్ని విధాలా ఉపకరిస్తాయి. నరసింహస్వామి, గణపతి పూజలు మేలు చేస్తాయి. మొదటివారం ఆనందం, రెండోవారం ఋణ ప్రయత్నాలు, మూడోవారం కార్యజయం, నాలుగోవారం దైవారాధన.



### వృషభం

ఈ రాశివారికి ఈ మాసంలో మానసికఆందోళనలు ఇబ్బంది పెడుతున్నా, చేసే వృత్తివ్యాపారాల్లో మంచి ఫలితాలు పొందుతారు. స్థిరాస్తుల క్రయవిక్రయాలు అనుకూలం. నూతన గృహనిర్మాణం పనులకై ధనాన్ని వెచ్చిస్తారు. బంధుమిత్రుల ఆగమనం సంతోషాన్ని కలిగిస్తుంది. శనిత్రయోదశినాడు నల్లని నువ్వులను దానం చేయడంవల్ల శనిసంబంధదోషాలు తొలగి ఆరోగ్యం అనుకూలిస్తుంది. మొదటివారం దైవచింతన, రెండోవారం సంతోషం, మూడోవారం శుభవార్తాశ్రవణం, నాలుగోవారం ఆనందం.



### మిథునం

ఈ రాశివారికి ఈ మాసంలో అనారోగ్యం మానసిక వేదనకు గురిచేస్తాయి. గతంలో నిర్లక్ష్యం చేసినపనులవల్ల వృథాశ్రమ, వృథాఖర్చు ఇబ్బందిపెడతాయి. ఆరోగ్యవిషయంలో ప్రత్యేకశ్రద్ధఅవసరం. ఆర్థికంగా అనుకూలంగా ఉన్నా, మనశ్శాంతి లోపిస్తుంది. బంధుమిత్రుల ఆగమనంవల్ల చికాకులు కలుగుతాయి. ఇంట్లో విలువైనవస్తువులు పోయే ఆస్కారం ఉంది. మొదటివారం అనారోగ్యం, రెండోవారం వివాదాలు, మూడోవారం ధననష్టం, నాలుగోవారం కార్యజయం.



### కర్కాటకం

ఈరాశివారికి ఈ మాసంలో బంధుమిత్రుల వ్యతిరేకతలవల్ల చేయు వృత్తివ్యాపారాల్లో కష్టనష్టాలు ఎదుర్కోవాల్సి వస్తుంది. గత కొంతకాలంగా పెండింగ్‌లో ఉన్న భూవివాదాలు ఓకొలిక్కి వస్తాయి. మొండితనం, కోపం తగ్గించుకోవడం మంచిది. పొదుపుపాటించడంవల్ల ఆర్థికపరిస్థితి బాగుంటుంది. సుదూరప్రయాణాలవల్ల అశాంతి ఏర్పడుతుంది. దైవసంబంధపూజలు అనుకూలిస్తాయి. మొదటివారం ధనాదాయం, రెండోవారం క్షేత్రదర్శనం, మూడోవారం ఆనందం, నాలుగోవారం ఆందోళనలు.



### సింహం

ఈరాశివారికి ఈ మాసంలో శత్రుభయం, అగ్నిభయం ఆందోళనకు గురి చేస్తాయి. అధికశ్రమవల్ల అనారోగ్యం ఏర్పడుతుంది. క్రయవిక్రయాలలో లాభం చేకూరుతుంది. పుణ్యక్షేత్ర దర్శనంకోసం చేసే ప్రయత్నాలు అనుకూలిస్తాయి. అవివాహితుల వివాహప్రయత్నాలు నిరుద్యోగుల ఉద్యోగప్రయత్నాలు అనుకూలం. తొందరపాటువల్ల చేసే వృత్తివ్యాపారాల్లో నష్టాలు ఎదుర్కొనాల్సివస్తుంది. మొదటివారం కార్యజయం, రెండోవారం మనస్పర్థలు, మూడోవారం దైవచింతన, నాలుగోవారం ధనాదాయం.



### కన్యారాశి

ఈ రాశివారికి ఈమాసంలో గ్రహస్థితిగతుల ననుసరించి పరిస్థితులన్నీ అనుకూలంగా ఉన్నా – తొందరపాటు నిర్ణయాలు పలుఇబ్బందులకు గురిచేస్తాయి. మాటకు విలువ పెరుగుతుంది. పనులు సకాలంలో పూర్తయినా మానసిక

వేదనకు గురవుతారు. కనకదుర్గపూజలవల్ల దీర్ఘకాలంగా పెండింగ్‌లో ఉన్న పలుపనులు త్వరితగతిన పూర్తి అవుతాయి. మాటలలో పొదుపు మంచిది. మొదటివారం ప్రయత్నజయం, రెండోవారం ధనాదాయం, మూడోవారం స్వల్పఅనారోగ్యం, నాలుగోవారం వృథాశ్రమ.



## తుల

ఈరాశివారికి ఈ మాసంలో ధనలాభం ఉన్నా, గతంలోని కొన్నిపొరపాట్లు గ్రహపాటుగా మారి, మానసిక వేదనకు గురి చేస్తాయి. చేసే వృత్తివ్యాపారంలో దృష్టి ప్రభావం కలిగి నష్టాలను, కష్టాలను ఎదుర్కొనాల్సి వస్తుంది. సుదూర ప్రయాణాలవల్ల అనారోగ్యం ఏర్పడుతుంది. ఉద్యోగంలో మార్పులు ఉంటాయి. దైవభక్తి అధికంగా ఉంటుంది. ఇతరులకు సేవచేయా లన్నే తపన పెరుగుతుంది. మొదటివారం ఆకస్మిక ప్రయాణాలు, రెండోవారం భయాందోళనలు, మూడోవారం సంతోషం, నాలుగోవారం ధనప్రాప్తి.



## వృశ్చికం

ఈరాశివారికి ఈ మాసంలో చేసే పనులలో వ్యతి రేకత ఎదురవుతుంది. నమ్మినవ్యక్తులనుంచి పలుసమస్యలు ఎదురవటంవల్ల మానసికవేదన కలుగుతుంది. వెండి, బంగారు వర్తకులకు ధనాదాయం. అధికకోపంవల్ల పలు అనర్థాలు జరిగే సూచనలు ఉన్నాయి. ఆరోగ్యవిషయంలో ప్రత్యేకశ్రద్ధ అవసరం. స్వగృహనిర్మాణానికి అవసరమైన ధనంకోసం తీవ్రంగా ప్రయత్నం చేసి విజయం సాధిస్తారు. కోపాన్ని అదుపులో పెట్టు కుంటే మంచిది. మొదటివారం క్షేత్రదర్శనం, రెండోవారం లాభం, మూడోవారం అనారోగ్యం, నాలుగోవారం ఆందోళన.



## ధనుస్సు

ఈరాశివారికి ఈ మాసంలో ఆర్థికంగా, శారీరకంగా బాగుంటుంది. సుదూరప్రయాణాలవల్ల ధననష్టం ఏర్పడు తుంది. గ్రహసంచారంలో వచ్చే మార్పులు, చేర్పులవల్ల పనులలో అలసత్వం. ఎదుటివారిని విమర్శించడం, కోపంగా మాట్లాడటం చేస్తారు. దీనివల్ల అనారోగ్యం కలిగే అవకాశం ఉంది. నదీస్నానం, దైవదర్శనానికి చేసేప్రయత్నాలు అను కూలం. గతంలో పెండింగ్‌లో ఉన్న భూపంపకాలు పరిష్కార దిశకు చేరుకుంటాయి. స్త్రీలకు ధనయోగం, విద్యార్థులకు శుభవార్తాశ్రవణం. మొదటివారం ఆనందం, రెండోవారం ధార్మిక చింతన, మూడోవారం ప్రయత్నఫలం, నాలుగోవారం ఆందోళన.



## మకరం

ఈ రాశివారికి ఈ మాసంలో అన్నివిధాల యోగదా యకంగా ఉంటుంది. తొందరపాటునిర్ణయాలు, మాట పట్టింపు లతో సోదరీ, సోదరుల నుంచి వివాదాలు ఏర్పడుతాయి. విద్యార్థు లకు శుభవార్తాశ్రవణం, మహిళలకు ఉన్నతపదవీయోగం. మాటను, డబ్బును, పొదుపుగా వినియోగించుకోవడం మంచిది. పలుసేవాకార్యక్రమాలు, దైవదర్శనాలకోస మని ధనాన్ని విప రీతంగా ఖర్చు చేస్తారు. అనారోగ్యంవల్ల ఆందోళన ఎక్కువవు తుంది. మొదటివారం తొందరపాటు నిర్ణయం, రెండోవారం మనస్పర్థలు, మూడోవారం ఉన్నత పదవీ ప్రాప్తి, నాలుగోవారం వృథా ఖర్చు.



## కుంభం

ఈ రాశివారికి ఈ మాసంలో ఆర్థిక, అనారోగ్య పరి స్థితులు ఆందోళనకు గురిచేస్తాయి. గతంలో వాయిదాపడ్డ భూమి, కోర్టుపనులు సకాలంలో పూర్తవుతాయి. ఆర్థికసమస్యలతో ఋణాలు చేయాల్సి వస్తుంది. విద్యార్థులు విదేశాల్లో ఉన్నతవిద్యా భ్యాసానికి చేసేప్రయత్నాలు అనుకూలం. మొదటివారం క్రయ విక్రయాలు, రెండోవారం ఆలయదర్శనం, మూడోవారం ఆధ్యాత్మిక చింతన, నాలుగోవారం విజయం.



## మీనం

ఈ రాశివారు ఈ మాసంలో తొందరపాటువల్ల పలు సమస్యలు కొనితెచ్చుకుంటారు. పిల్లల చదువులకై ప్రణాళికలు సిద్ధం చేసుకుంటారు. గ్రహస్థితిగతులవల్ల ఆకస్మికప్రయాణాలలో స్వల్ప ప్రమాదాలు కలిగే సూచనలు ఉన్నాయి. ఇంట్లో శుభకార్యాల వల్ల ఆనందం కలుగుతుంది. తొందరపాటు నిర్ణయాలవల్ల ధనం ఖర్చు చేయాల్సివస్తుంది. మొదటివారం ఋణప్రయత్నాలు, రెండోవారం ఆనందం, మూడోవారం శుభవార్త, నాలుగోవారం వృథాఖర్చులు.



# తిరుమల ఆలయం



ఆంగ్లమూలం : డా॥ రమేశన్, తెలుగు అనువాదం : డా॥ కోరాడ రామకృష్ణ | ధారావాహిక

*(ఈస్ట్ ఇండియా కంపని చేతికింద నిర్వాహకం పొందిన ఆలయ పరిపాలన విధానాన్ని మహంతులకు అప్పగించడమైనది. అయినా పరమాధికారం మాత్రం కుంపణి సర్కారు చేతిలోనే నిక్షిప్తం అయి ఉండినది. మహంతు నిర్వహణ పూర్వం - ఆలయ వ్యవహారాల గురించి - జిల్లాధికారి వ్రాసిన వ్యాసం ఏసియాటిక్ జర్నల్ ప్రకటించాడు. ఆ లేఖ ఇక్కడ పొందుపరచడమైనది.)*

## ఆంగ్లేయుల అధీనంలో ఆలయం

### (1853 మే-ఆగష్టు - ఏసియాటిక్ జర్నల్‌లో ఆంగ్ల జిల్లాధికారి వ్రాసిననివేదిక)

కర్నాటిక సమరకాలంలో ఆలయఆదాయం తగ్గింది. ఈస్ట్ ఇండియా కంపనివారి ఆసక్తిమాత్రం ఆలయం చేకూర్చే ఆదాయం పైనే కేంద్రీకరించి ఉండినది. కర్నాటిక నవాబుల కాలంనుండి, ఆలయంఆదాయనిల్వలను రాచరికంవారు తమ స్వంత ఆదాయంలాగే వాడుతూ వచ్చారు – ఇక్కడ ఉటకింపబడ్డ ఆంగ్ల జిల్లాధికారి నివేదిక ఈ అంశాన్ని స్పష్టం చేసి చెపుతుంది. ఇక్కడ ఆంగ్లేయుల ఆసక్తికి గల కారణాలు స్పష్టం. ఏసియాటిక్ జర్నల్‌లోని మే–ఆగష్టు వ్యాసాన్ని మొత్తం ఇక్కడ ఉద్ధరించి ఇవ్వ డమైనది. ఈ వ్యాసంలోని వ్యాసరచనావిధానం, కాగుణితం అలాగే ఉటకించడమైనది.

“ఈ ఆలయం ఇండియా దేశంలోని అన్ని ప్రాంతాల విష్ణుభక్తుల ఆరాధనలు, అర్పణలచే కీర్తిమంతమైనది. సామం తులు, చక్రవర్తులు తమ ప్రతినిధులను, రాయబారులను స్వామికి సమర్పణకానుకలతో పంపుతూ ఉంటారు. ఏమీలేని కడు దరిద్రులు పసుపురంగు బియ్యాన్ని (అక్షంతలు) గుడ్డలో బిగించి సమర్పింతురు. ఈ సమర్పణ కానుకలకు కారణమైన కథను ఇలా చెప్పుదురు– ఇక్కడి విగ్రహం– దేవుడు వివాహమాడాడు. ఈమె బొమ్మరాజు జమీందారీ నారాయణవనంలోని ఆకాశరాజు కుమార్తె. ఈమెను దేవుడు ప్రేమించాడు. అయితే పెళ్ళిఖర్చులకై వాయువు పూచీపై కుబేరుడి దగ్గర డబ్బు అప్పుగా తీసికొన్నాడు. ఈ దేవుడు (కుబేరుడు) తాను ఇచ్చిన డబ్బును సంవత్సర కిస్తులలో పాలార్ మరియు సోనముఖి నదుల నడుమి రాజ్యం రాజుకు చెల్లించి అప్పుతీర్చవలె నని విధించాడు. సంవత్సరానికి ఒకమారు జరిగే తొమ్మిదిరోజుల బ్రహ్మోత్సవాల సమయంలో అతిపెద్దసంఖ్యలో భక్తులు ఇక్కడికి వచ్చి, తమ కానుకలను సమర్పించెదరు. ఆ రోజులలో సంవత్సరఆదాయంలోని మూడవ రెండువంతు సంగ్రహం అవుతుంది.

“ఇక్కడి బ్రాహ్మణులు చెప్పేటట్లు – హిందూరాజ మహారాజులు ఈయొక్క ఆదాయం – మొత్తంధనాన్ని క్షేత్రంలోని ధార్మికకార్యక్రమాలలో వెచ్చించేందుకు అనుమతి ఇచ్చేవారు. ముసల్మానదొరలు మొదటిసారిగా ఈ ధనాన్ని తమ స్వంతానికి తీసికొన్నారు. ఫ్రెంచిజనంతో ఈ ప్రాంతంలో సమరాలలో ఉన్న కారణంగా ఈ సొమ్ము మనపాలికి దక్కింది. దీని సింధుత్వం గురించి ప్రశ్న మిగిలి ఉంటుంది.

పలు మొక్కుబడులకు ప్రతిగా ఈ కానుకలు ఆలయానికి చెందుతుండేవి. తోడుకు కల్పనకు తగ్గట్లు ఇవి వైవిధ్యమయమై ఉండేవి. బంగారం, వెండి, వేర్వేరు నాణెములు, డబ్బు నిండిన సంచులు, తామ్రం కాసులు, ద్విదళ ధాన్యములు, ఇంగువ, తల్లిదండ్రుల దీర్ఘకాలం వ్రతంలో పుట్టిన మగబిడ్డల తలవెంట్రుకలు – మున్నగువాటివి. కుంటివాడు వెండితో చేసిన పాదం సమర్పిస్తే, గుడ్డివాడు బంగారపు లేదా వెండి కన్నులను

## చిరునగవు సిరితోడ - వెలుగు తిరుమల రేడ!

పల్లవి: చిరునగవు సిరితోడ
వెలుగు తిరుమల రేడు
నగల వగలు ఎంత
సొగసు నవ్వుల చెంత

అ.పల్లవి: గోవింద గోవింద గోపాల
గోపాల గోవింద గోవింద

చరణం-1: ఇంతలేసికన్నులవాడ
విప్పారు నయనాలతో నీచూపు - నీ
సుందర మోహనరూపు - మా
సర్వపాపముల బాపు

చరణం-2: గోవిందనామాల, అన్నమయ
గీతాల సంస్తుతుల సంకీర్తనలు మ్రోగును
నుతులు, సన్నుతులు, శ్రుతులై
తాళములు, మంగళ నాదములు సాగేను

చరణం-3: చేతినినిడ లడ్డులు, చక్కెర పొంగలి
పులిహోర, దధ్యోదన, భక్ష్యముల
షడ్రుచుల వంటకాలు, నైవేద్యములు
రుచులు, గనులు నీ భోగము
అంగరంగవైభవాలు

చరణం-4: నిను మించిన దైవము గలడా?
సన్నుతి నొందిన కలియుగ విభుడవౌ
నీదేపో యోగము, భోగము,
చల్లగ జూడుమా! జగతి జాలము

పాయసం సుబ్రహ్మణ్యమహర్షి

సమర్పిస్తాడు. హిందూవులమూఢనమ్మకాలను నేను పట్టికచేస్తూపోతే, దానికి అంతముండదు. ఆడవాళ్ళు తాము బాల్యమునుండి గర్వంతో వేసుకున్న ఆభరణాలను విగ్రహంముందు స్వ-ఇచ్ఛతో సమర్పించుకుంటారు. తాను జీర్ణవస్త్రధారణ కలిగి యున్ననూ, దేవుడికి ఖరీదైన వస్త్రసమర్పణ చేస్తుంది. తనబిడ్డ పాదాల గొలుసును తీసి స్వామికి సమర్పిస్తూ, ఆకాశంలో ఉన్న దేవుడు చూస్తున్నా డనీ, గాలిలో వింటూ తనపైన, తన కుటుంబంవారి పైన ఆశీర్వాదాన్ని కురిపిస్తా డని నమ్ము తుంది. ఈ వేళకు ఆమె వందలకొలది మైళ్ళ దూరాన్ని శ్రమించి తన జన్మ సార్థ క్యాన్ని సాధించిన భావం పొంది, తృప్తిగా ఉంటుంది. ఆ మోదలు గడపదాటి బయట కాలుపెట్టని ఆమెకు యాత్ర భయంకర మని తోచి ఉండవచ్చు. కొడుకు పుట్టడం, శత్రువుపై విజయ సాధన, యాత్ర శుభప్రదంగా ముక్తాయం పొందడం, కొడుకు లేక కూతురి వివాహం, వ్యాపారవృద్ధి, ఆరోగ్యభాగ్యం- వీటిలో ఏదో ఒకటి యాత్రికులను తిరుపతివైపు మొగ్గ చూపడానికి ప్రేరణ కావచ్చు. ఈ మాట అజ్ఞులకూ, విజ్ఞు లకూ సమానంగా వర్తిస్తుంది.

మొక్కుబడి ఉన్నవారే కానుక లను సమర్పించాలి అని నియమం లేదు. కానుకలను బంధువులు, స్నేహితులు, వకీలురు తెచ్చి సమర్పించ వచ్చు. ఐతే, బహుపాలు గోసాయిల మూలకంగా పంపబడుతుంది. గోసా యిలు, ఆలయసిబ్బంది, ఇటువంటి పని వారు ఎక్కువమంది ఉన్నారు. బ్రహ్మోత్స వాలు ఇంకా కొన్ని నెలలుంది అనేట ప్పుడే వీరు వేర్వేరు దిక్కులలో వెళ్ళి, ఆయ కట్టు స్థలములను చేరుకుంటారు. తమ సంగ్రహకార్యాన్ని ఆరంభించాలి అనే టపుడు తాము బస చేసిన ఆలయంలో (తిరుమల) ఆలయధ్వజాన్ని ఎగుర వేయుదురు. దీని చుట్టూ విగ్రహారాధక భక్తులు చేరి తమకానుకలను వీరి

వశం చేస్తారు. లేక తమకానుకలను తామే స్వతహాగా మోస్తూ ఈ గోసాయిల తోడుగా తిరుమల చేరుదురు. తగినంత జనం కూడుకున్న తర్వాత ఈ నమ్మినవాళ్ళ నాయకుడు ఆలయం వైపు తిరుగు ప్రయాణం చేపట్టును. సుంకం వసూలు చేయు అధికారులు సామాన్యంగా యాత్రికుల నందరిని ఉచితంగా ఆలయానికి వెళ్ళేందుకు అనుమతిస్తారు. గోసాయిలు తమకు అప్పగించినకానుకలలో చేయిపెట్టే సంభవంలేదు. ఐతే గోసాయిల జతలో ఉన్నందువల్లనే సురక్షితంగానూ, సుంక రహితంగానూ, యాత్ర సాగుటవలన గోసాయిలకు యాత్రి కులచే ప్రత్యేకసంభావన చెల్లుతుం దనేది నిస్సందేహం. యాత్రికులు ప్రయాణం చేసేటప్పుడు గోసాయిలు ఐదారు అడుగుల కొకమారు 'గోవింద గోవింద - అలమేల్‌మంగా' అని ఘోషించెదరు. మొత్తం యాత్రలోని యావన్మంది - స్త్రీ పురుష వృద్ధబాలురంతా ఈ నామాన్ని సామూహికంగా కీర్తిస్తారు. నేను తిరుపతికి పోయేటపుడు ఇటువంటి పలు గుంపులను చూసాను. వారిగోవిందనామస్మరణంతో మన యాత్ర ఉత్సాహంగానే జరిగింది. అయితే యోచన చేసినపుడు కొంచెం విషాద మనిపించింది.

"కానుకలుమాత్రం వైవిధ్యమయంగా ఉంటాయి. అప్పుడప్పుడు ఇది వేయిరూపాలకు మించి ఉండవచ్చు. దేవుడు తన ముందు నిలిచి, కానుకల సమర్పణ చేసేవారిని వాళ్ళ కానుకలకు తగ్గట్టు అనుగ్రహిస్తాడు. భక్తుడు వందరూపాయ లను ఇస్తే తలకు కట్టుకనే వస్త్రం లభిస్తుంది. వందనుండి ఐదువందలకు పట్టువస్త్రం. ఐదువందలనుండి వేయి రూపాయలవరకు ఐతే ఒక శాలువా - ఇలా. ఆదాయంలోని రెండవ విధానం వర్తన. విగ్రహానికి భూషణాలు, తొడుగులను సమర్పించు భక్తుడు తన కానుక విలువకు సమానమైన నగదును ఈ కానుకనిర్వహణకై ఆలయానికి ఇవ్వాలి. అటువంటి కానుకను ఆలయంలోనే ఉంచుకుని దేవుడి సేవలో వాడుదురు. ఆదాయంలోని మూడవవిధానం అంటే 'ఆర్జితం'. ఇది మూడు రీతులది. అభిషేకం (శుద్ధీకరణం), నైవేద్యం (ప్రసాదం), వాహ నములు (ఊరేగింపులు).

## అభిషేకం

ప్రతిశుక్రవారం విగ్రహాన్ని పూర్తిగా పునుగు, కస్తూరి, కర్పూరములతో లేపనం చేసి, పాలుపోసి కడుగుదురు. ఈ ప్రముఖదృశ్యాన్ని ఉచితంగా చూడజాలరు. కనుక ఇటువంటి దృశ్యాన్ని చూడగోరు భక్తుడు సంవత్సరం పూర్తి తన శక్తి కొద్ది ధనం ఇచ్చుకుంటాడు. బ్రహ్మోత్సవంలో చేతినిండా ధనం కుమ్మ రించాలి. ఆదిలో ఇది ఎక్కువగా ఉన్నా ఇప్పుడు యాభై రూపాయలైంది. ఇలా దేవుడిని అభిషేకం చేసిన తరువాత సుగంధభరితం చేయడాన్ని 'పూలకుబ్' అంటారు. పూలంగిసేవ అనేది దేవుడిని పూలతో అలంకరించడం. ఇది ప్రతిగురువారం జరుగుతుంది. పండుగరోజులలో ఈ దృశ్యాన్ని చూసేందుకు అరవై రూపాయలు చెల్లించాలి. మూడవది సుఖ అలంకారసేవ. పన్నెండు రూపాయలను చెల్లించి స్వామిని పూలమాలలతో అలంకరించడాన్ని చూడవచ్చు. ఈ దృశ్యసుఖాన్ని సంవత్సరం లోని 365 రోజులూ పొందవచ్చును. నాలుగవది సహస్ర నామార్చన. ఈ సేవ స్వామియొక్క వేయినామాలతో పూజించడాన్ని సూచిస్తుంది. ఈ సేవకు 5 రూపాయల శుల్కం. తమరు పూజించే దేవుడిని ఉయ్యాలలో నిదురపుచ్చే శయన సేవాదర్శనానికి పన్నెండురూపాయలు చెల్లిస్తారు.

## నైవేద్యం

నైవేద్యవిషయానికి వెళ్ళవచ్చును. మొదటిది అన్న నైవేద్యం. దీనిలో మొదటిది - పరమాన్నం. రెండవది పూళి కేయరం, మూడవది - మద్గురం నాల్గవది - దదుదవం.

మొదటిది బియ్యం, చక్కర, పాలు కలిపి చేసిన నైవేద్యం, రెండవది చింతపండు తీపి మరియు బియ్యంతో చేయబడినది, మూడవది - వెన్న, బియ్యంతో చేయబడినది, నాల్గవది పెరుగు బియ్యంతో చేసింది. ఈ ఆహారపదార్థాలను భక్తులే పక్వం చేసి, సమర్పించిన ఎడల ఆరురూపాయల నగదు చెల్లించాలి. ఆలయమువారు పక్వం చేసి, సమర్పిస్తే పదహారురూపాయలను చెల్లించాలి. రెండవనైవేద్యం అంటే తీపిపదార్థాల నైవేద్యం. ఈ తీపితినుభండారములను ఆలయం వారు చేసి సమర్పించెదరు. దీనికై భక్తులు ఇరవై ఎని మిది రూపాయలు సమర్పించాలి. మూడవది మలమ

## రచయిత(త్రు)లకు విజ్ఞప్తి

**సప్తగిరి మాసపత్రికకు రచనలు పంపే రచయిత(త్రు)లు ఈ క్రింది సూచనలను తప్పక పాటించని పక్షంలో వారి వ్యాసాలు పరిశీలనకు అంగీకరింపబడ వని తెలియజేస్తున్నాం!!**

❖ రచనలు కాగితానికి ఒక వైపునే రాయాలి. రచన ఆరు అరటావులకు మించరాదు. రచన స్పష్టంగా, అర్థమ య్యేలా సరళవ్యావహారికంలోనే ఉండాలి.

❖ తెలుగులో డి.టి.పి. చేసి పంపితే మంచిది. సీ.డి. (పేజిమేకర్, అను-6లో) పంపగలిగితే మరీ మంచిది.

❖ హామీపత్రం తప్పనిసరి.

❖ కలంపేరుతో వ్రాసే రచయిత(త్రు)లు విధిగా తమ అసలుపేరు తెలియపరచాలి.

❖ రచనలను తాము ఏ శీర్షికకు పంపుతున్నారో ఆ శీర్షిక పేరు రచనమీద, కవరుమీద వ్రాయాలి.

❖ రచనల ఎంపిక, ముద్రణలవిషయంలో ప్రధాన సంపాదకునిదే తుదినిర్ణయం. అందుకు సంబంధించి ఎలాంటి ఉత్తరప్రత్యుత్తరాలకు ఆస్కారం లేదు.

❖ 'మన దేవాలయాలు' శీర్షికకు రచనలు పంపేవారు- తప్పనిసరిగా సంబంధిత ఫోటోలు జతచేయాలి.

❖ పండుగలకు వ్యాసాలు పంపేవారు మూడునెలలకు ముందుగా వారిరచనలు పంపవలసి ఉంటుంది.

❖ రచనలు త్రిప్పి పంపగోరువారు తగినంత పోస్టేజి అతి కించిన సొంత చిరునామాగల కవరు జతపరచాలి.

❖ ప్రచురించిన ప్రతిరచనకు తగిన పారితోషికం శ్రీవారి ప్రసాదంగా పంపుతాము.

మీ రచనలు పంపాల్సిన చిరునామా

**ప్రధాన సంపాదకుడు,**
**సప్తగిరి మాసపత్రిక, తి.తి.దే. ప్రెస్ కాంపౌండు,**
**కపిలతీర్థం రోడ్డు, తి.తి.దేవస్థానములు,**
**తిరుపతి - 517 507, చిత్తూరు జిల్లా.**

వైదూం (మహానైవేద్యం) సాధారణంగా దీనిని తిరుపావ్రా (తిరుప్పావాడై) అంటారు. వేయినుండి రెండువేల సేరుల బియ్యంతో ఆలయం పాకశాలలో నివేదన తయారు చేయుదురు. దీనికై వంద లేక రెండువందల పగోడాల డబ్బు కట్టాలి. నాల్గవది అముంత నరమూచ- (ఆమంత్రణోత్సవం). ఇక్కడ ప్రతిరోజుచేసే అన్నినివేదలనూ ఒకేసారి నివేదిస్తే తక్కువ మోతాదులో నివేదించడం జరుగుతుంది. దీని వెల అరవై ఐదు రూపాయలు. ఐదవది ఊకై పచ్చడి. తిరుమలలో ప్రత్యేకంగా పెంచే ఊకై చెట్టుతో చేసిన నైవేద్యం. ఇది నాలుగు రూపాయలు.

### వాహనసేవలు

ఇపుడు విగ్రహం ఊరేగింపు చేసే వాహనాలు మాత్రం మిగిలింది. ఇవి పన్నెండుగా ఉండి హిందూవుల పురాణాలు విష్ణువుగురించి చెప్పే కథలతో ముడిపడి ఉన్నాయి. బయటకు వెళ్ళని ఆలయం మూలమూర్తి ప్రతిరూపాలైన లోహమూర్తులను ఊరేగింపులో వాడుతారు.

కల్పవరుచ(కల్పవృక్ష) వాహనము బంగారు ములాము పూసిన రేకు కప్పిన కొయ్యవాహనం. ఆందోలిక వాహన మనేది స్వామి ఊరేగింపులో వాడబడు పల్లకి. శేషవాహనమనేది స్వామి ఊరేగింపుకు వాడబడే బంగారు గిలిటు చేసినపాము - శేషుడు. సూర్యప్రభవాహన మనేది బంగారుగిలీటురేకులతో కూడిన సూర్యప్రభవాహనం. 'అద్దహఅర' అనేది అసంఖ్యాక ప్రతిబింబాలను చేయు అద్దాలను అమర్చిన గదికి స్వామి పోయి వచ్చుట. ఆందోలికవాహన మనేది స్వామి మరొక వాహనం. వీటిలో ఏ ఒక్క వాహనంలో నైనా స్వామి బయట రావాలి అంటే భక్తుడు నలభై రూపాయలు చెల్లించాలి. గుడువాహనం (గరుడవాహనం) అనేది స్వామి చిలుకపై (గరుడునిపై) కూర్చుని బయట తిరిగే వాహనం. చంద్రప్రభ అనేది బంగారం తాపడం చేయించిన చంద్రవాహనం. సింహవాహనం అంటే సింహం (కృత్రిమం) పై వేంచేయుట. బాలశేషవాహనం దేవుడు ఊరేగింపులో వచ్చే కడపటివాహనం. దేవుడు గిల్టుపాముపై వేంచేసియుంటాడు.

"ఆలయం సమస్తఆదాయాన్ని - అది ఏ రూపంలో వచ్చేదైనా దాన్ని మొత్తంగా సర్కార్ లేక స్థానికపరిపాలన

పుచ్చుకుంటుంది. వేతనమిచ్చి కొంత సిబ్బందిని పనికై తీసుకున్నారు. బ్రాహ్మణులకు భూమిని ఇవ్వడమైనది. దీనికొరకు చుట్టుపక్కల గ్రామభూములను వాడడమైనది. వీటిని మాన్యాలని గణించి అతితక్కువశిస్తుతో, అత్యనుకూలకర నిబంధనలతో ఇవ్వడమైనది. వెనకటి పది సంవత్సరాల సగటు రసీదులను పరిశీలన చేసిన, ఈ వ్యవస్థను ఎంత చక్కగా నడుపుతూ ఉన్నాము అనేది స్పష్టం. ఇక్కడి ప్రధాన అధికారిని తహసీల్దారు అని పిలువబడి, ఇతను ఇతర సిబ్బిందిపై పర్యవేక్షణ చేస్తాడు. యాత్రికులను గౌరవంతో చూస్తూ, వారికి తగిన వసతి సౌకర్యం కల్పిస్తూ, ఏ విధమైన లంచం, రుషువత్తు, వంచన, దోపిడిలకూ గురికాకుండ చూసుకునే బాధ్యత ఇతనిది. ఇతను కలెక్టరుకు లేక తనక్రిందివారికి తనకు సందేహం వచ్చిన విషయాన్ని తెలియపరచి నివారించుకొంటాడు. ఇతని క్రింద శిరస్తేదారు డనే స్థానిక లెక్కపరిశీలకుడు ఉంటూ, తహసీల్దారు కర్తవ్యంలో పాలు పంచుకుని సహాయకుడుగా ఉండి, ఆలయం ఆదాయ వెచ్చముల లెక్కలను చూస్తూ ఉంటాడు. ఇతనిక్రింద నలుగురు స్థానిక గుమాస్తాలు లేక కరణికులు ఉండుదురు. రాయసగు అనేవాడు కొత్వాలు, పోలీసు పనిని నిర్వహించును. గొల్ల ఇతని సహాయకుడు. అన్ని విధాల న్యాయవిషయాల్లో తహసీల్దారుకు మాన్యత ఇచ్చును. దప్తరం దాఖలాలను చూసుకుని, దీపములను వెలిగించడం మరియు చెత్త ఊడ్చడము మున్నగు కార్యాలయ పనులను సాధారణ సేవకులు చేయుదురు. తహసీల్దార్ కార్యాలయంలో ఇరవైమంది జవానులు ఉన్నారు. వీళ్ళకు నెలకు ఒక్కొక్కరికి ఒక పగోడ (ఎనిమిది షిల్లింగ్) జీతము కలదు. వీళ్ళలోని దఫేదారు, ప్రధానజవానులకు వేతనం ఎక్కువ. బ్రహ్మోత్సవం లేక తొమ్మిదిదినముల పండుగలో ఎక్కువ సిబ్బంది నియామకమై, 25 మంది జవానులు 20 మంది పటవారిలు (అతితక్కువ జీతం పొందేవారు) మరియు ఐదుగురు వార్తాహరులు ఉంటారు. ఈ వార్తాహరులు గణ్యవ్యక్తుల ఆగమనవార్తను తెలిపేదే కాక - దేశంలోని ఈ భాగంలోని ఎక్కువగా వచ్చే జనంలో ఒకరుగా చేరి, సమాచారములను అందిస్తారు. కొండపై ఎక్కువగా జనం వచ్చే ఉత్సవాలలో యాత్రికుల పైబడి దోచుకునే దొంగలను పట్టుకోవడానికి నలభై యాభైమంది సహాయకులతో వీరు తహసీల్దారుకు సాయం చేయుదురు. ఇంకొక గుంపు దేశంలోపల విస్తరించి గ్రామాంతర కొత్వాలులకు సంశయాస్పద వ్యక్తులను బంధించుటలో సాయం చేస్తుంది. స్థానిక అధికారి క్రింద సైనికుల ఒక తండాన్ని శాశ్వత రక్షణకై ఏర్పాటు చేసుకునే అధికారం తహసీల్దారుకు ఉంది. ఆలయంలో ఉగ్రాణమూ, భండారమూ, జీయంగారులు మరియు ఏకాంగుల లేక వారిసహాయకుల పూచికత్తులో ఉంటుంది. వీరు తమ చేతిక్రింద ఒక్క గుమాస్తా. ఒక అల్లవగారు లేక ధాన్యం కొలిచేవాడు. ముగ్గురు జవానులు, ఒక చందనం తెచ్చువాడు, ఒక మాలాకారుడు, ఒక కస్తూరి కారుడు, వంటవాడికి వంట చెరుకు తెచ్చువాడు, ఒక గొల్ల. ఒక చెత్త తీయువాడు. ఒక మొసలి లేక దీపం వెలిగించువాడు- వీరిని పొందియుంటారు. ఉగ్రాణంలో ఎల్లపుడు తగినంత దాస్తాను ఉండే విధంగా తహసీల్దారు చూసుకొనును. ఉగ్రాణం లోనికి వచ్చిన అన్ని వస్తువుల లెక్కలు ఇతనిదగ్గర ఉంటాయి. ఆలయం పారుపత్యదారు లేక పర్యవేక్షకుడు అడిగినట్టు ఆలయానికి ఇచ్చే ప్రతివస్తువు లెక్కలను జీయంగారు దాఖలు పరుస్తాడు. ఆలయంలోని వివిధసేవకులకు పారుపత్యదారు ప్రతినిత్యం దవసధాన్యములను ఇస్తాడు. వీరంతా తమ నియోజితకర్తవ్యాలను చేసేటట్టు చూసుకునే ఇతను నేరుగా తహసీల్దారుకు జవాబ్దారుడు. ఇతను కానుకల యథావిధి వితరణ జరిగేటట్టు చూసుకుంటాడు. ఇక్కడ రక్షకులు మరియు ఇతరులు కర్తవ్యం చేసిన తరువాత వారిని పరిశీలించి, వారితో కలిసి రోజు ఆదాయ ధనంతో తహసీల్దారు సన్నిధికి వచ్చును. తహసీల్దారు ధనాన్ని ఆభరణాలను, తామ్రపు కాసులను గోనె సంచులలో నింపి, వాటిని కుట్టి, తన అధికార ముద్రను వేస్తాడు. ఈ పారపత్యదారు ఒక గుమాస్త, ఒక కొలతలవాడు మరియు నలుగురు జవానులను పొందియున్నాడు. ఉగ్రాణంలోనించి తాను తీసుకునే ప్రతివస్తువు లెక్క వ్రాసుకుని ఉంటాడు. యాత్రికులు సమర్పించిన ప్రసాదభక్ష్యములు, ఆలయంలో ఇతనిఅనుమతితో తయారైయ్యే నివేదనలు-అన్నీ లెక్కలలో పొందుపరిచిన తరువాత తహసీల్దారు వీటిని పరిశీలించును. ఉగ్రాణం నుండి ఏ వస్తువునైనా ఎక్కువగా తీసుకునే అగత్యం ఏర్పడితే పారుపత్యదారు తన అంచనా పట్టిని మొదట తహసీల్దారునకు పంపును. తహసీల్దారు దానికి చేవ్రాతతో అనుమతి నిస్తాడు.

***(ఇంకా ఉంది)***

## పండుగ - పర్వం (ఆచారాలు - సంప్రదాయాలు)

**రచన:** డి.వి.ఆర్.భాస్కర్, **సైజు:** 1/4 క్రౌన్; **పేజీలు:** 206; **వెల:** రూ.150/-; **ప్రతులకు:** డి.వరలక్ష్మి, ఫ్లాట్‌నెం.103, వివేకానంద ఎన్‌క్లేవ్, శాంతినగర్‌కాలనీ, బాగ్‌అమీర్, కూకట్‌పల్లి, హైదరాబాద్-72, ఫోన్‌నెం:9912199394/9052395740

ఈ పుస్తకం 'సాక్షి' ఆధ్యాత్మికశీర్షిక 'సన్నిధి'లో వెలువడిన వ్యాసాలసంకలనం. రచయిత డి.వి.ఆర్.భాస్కర్. ఈ పుస్తక నేపథ్యాన్ని 'నామాట'లో స్పష్టం చేశారు. బాల్యంలో ఏర్పడిన జిజ్ఞాస అంచెలంచెలుగా వికసించి, పత్రికారంగంలో ఆధ్యాత్మికానందాన్ని పాఠకలోకానికి పంచిపెట్టే ప్రముఖరచయితగా భాస్కర్‌ను తీర్చిదిద్దింది. పట్టుదల, శ్రద్ధ, ఉత్సాహం, విశాలదృక్పథం, సహృదయత ఉంటే మనిషి - ఆశించిన లక్ష్యాన్ని తప్పక చేరుకోగల డనేది-భాస్కర్ పుస్తకం 'పండుగ-పర్వం', 'ఆచారాలూ-సంప్రదాయాలు' చదివిన పాఠకులకు గోచరించే ప్రథమతరంగం.

ఈ పుస్తకంలో మొత్తం 66 శీర్షిక లున్నాయి. 'వినాయకుడినే మొదట ఎందుకు పూజించాలి?'తో ప్రారంభించి, 'శ్రీదత్త బోధ'తో పూర్తిచేశారు- భాస్కర్. 66 ఏండ్ల జీవితానికి కావల్సినంత జ్ఞానవిజ్ఞానసంపద - వెయ్యిరూపాయలనోట్‌లో సూక్ష్మరూపంలో వెయ్యిరూపాయలు ఉన్నట్లు - ఇందులో దాగి ఉంది. 'గణపతి' శబ్దానికి గణం అంటే సమూహం అని అర్థం. ఈ సృష్టియావత్తూ గణాలమయం. అనేకగణాలతో కూడిన మహాగణం. ఈ విశ్వం-మనుష్యగణం, వృక్షగణం, గ్రహగణం-మళ్లీ ఇందులో వివిధ ధర్మాలను అనుసరించి మరెన్నో గణాలు-ఈ గణా లన్నింటిలోనూ అంతర్యామిగా ఉంటూ, సృష్టిని శాసించే పరమేశ్వరుడు గణపతి అనే వివరణ చాలా హేతు బద్ధంగానూ, విజ్ఞాన దాయకంగానూ ఉంది. ఇలాగే 'చక్కెరబొమ్మ ఎక్కడ తిన్నా తీపే' అన్నట్లు - 66 శీర్షికలూ సహృదయపాఠకులకు అమృతతుల్యంగా, ఆస్వాద్యయోగ్యంగా ఉన్నాయి. 'మాసామి వంటే నీవేలే....'' శీర్షికలో శ్రీరామునికల్యాణోత్సవాన్నిగూర్చి ప్రస్తావిస్తూ 'దేవతలు పుట్టినరోజే-వాళ్లకు కల్యాణం చేయడం ఏమిటి?'-అనే సంశయం రావడం చాలామందికి సహజం అంటూ- సమాధానంగా 'పురుషోత్తమసంహిత అనే ఆగమశాస్త్రం- ఆ పరమాత్ముడు అవతార మూర్తిగా ఏ రోజున ఈ పుణ్యపుడమిపై అవతరిస్తే ఆ రోజునే కల్యాణం జరిపించాల్సి ఉందనీ, ఒకవేళ ఆ తిథి తెలియకపోతే ఏకాదశిరోజున కల్యాణం జరిపించడం సంప్రదాయ మని పేర్కొంది'' అని ఆగమప్రమాణాన్ని సూచించడంలో భాస్కర్ కృతకృత్యులయ్యారు. భాష, భావవ్యక్తీకరణ, ప్రామాణికత, పఠనీయత- అనే ఉత్తమ రచనాగుణాలు మూర్తీభవించిన పుస్తకం ఇది. ముఖ్యంగా నేటి యువత, విద్యార్థిలోకం, ఈ పుస్తకం పఠించడం ద్వారా మన ఆచార వ్యవహారాల్లో ఉండే వైజ్ఞానిక, ఆధ్యాత్మికఆంతర్యాలు గ్రహించి, మన ప్రాచీనసంస్కృతీసంప్రదాయాలపట్ల విశ్వాసం, ఆచరించా లనే కుతూహలం పొందుతుం దనడంలో సందేహంలేదు. ఈ పుస్తకం ఇతరభాషల్లోకి అనువదింపబడితే ఆయా భాషలవారికీ ఎంతో ఉపకారం జరుగుతుంది. ప్రతి తెలుగు వ్యక్తీ తప్పకచదవాల్సిన మంచిపుస్తకం. మస్తకానికీ ఆనంద భూషణం. అమృతంపంచే పండుగ. మంచికాగితం. అందమైన ముద్రణ, పుస్తకానికి ప్రత్యేకఆకర్షణలుగా ఉన్నాయి. 'భాస్కర్' ఇలాంటి తేజఃకిరణవ్యాసాలను ఇతోధికంగా లోకానికి అందించాలని ఆకాంక్ష!

*- డా॥ కంపల్లె రవిచంద్రన్.*

**గ్రంథసమీక్ష**

---

## బ్రహ్మసూత్రములు

**రచన :** అంబటిపూడి వెంకటరత్నం, **సైజు:** 1/8 డెమ్మిసైజు; **పుటలు:** 70; **వెల:** రూ.300/-; **ప్రాప్తిస్థానం:** అంబటిపూడి వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రి, 11-14-25, రోడ్ నెం.1, హరిపురి కాలనీ, హైదరాబాద్-35, సెల్లు: 99498 49583.

ఉపనిషత్తులు, బ్రహ్మసూత్రాలు, భగవద్గీత. ఈ మూడింటిని ప్రస్థానత్రయ మంటారు. వీటిలో ఉపనిషత్తులు, భగవద్గీత పరిచయం సర్వసాధారణంగా కొద్దోగొప్పో ఉంటుంది. అయితే, బ్రహ్మసూత్రాలపరిజ్ఞానం తెలిసినవారు చాలా తక్కువమందే నని గట్టిగా చెప్పవచ్చు. లోతైనతాత్త్విక, ఆధ్యాత్మిక విషయం అందులో ఉండడమే అందుకు ప్రధానకారణంగా చెప్పవచ్చు. ఆధ్యాత్మికకోవిదులకే ఇది అంత సులభంగా అర్థంకాదు. దానిని అనువదించి ఆధ్యాత్మిక చకోరపక్షులకు దప్పిక తీర్చాడు-రచయిత. ఇందులో నాలుగు అధ్యాయాలు, అందులోని సూత్రాలు, వీటికి సరళతెలుగుఅనువాదం చక్కగా ఇచ్చాడు.

వేదాంతరహస్యాలను విప్పి చెప్పే గ్రంథం ఇది. ఈ బ్రహ్మసూత్రాలు నాలుగధ్యాయాలుగా - తిరిగి ప్రతిఅధ్యాయం నాల్గుపాదాలుగా వర్గీకరించబడింది.

రచయిత సంస్కృతాంధ్రాలలో దిట్ట. కాబట్టే బ్రహ్మసూత్రాలు అనువదించడానికి సాహసించాడు. అతనిసాహసం వ్యర్థం కాలేదు. మంచిఫలితాన్నే ఇచ్చింది. సాధారణంగానే, బ్రహ్మసూత్రాలకు అనువాదాలు గానీ, వ్యాఖ్యానాలు కానీ చాలా తక్కువగా వచ్చాయి. ఆ వచ్చినవికూడా పాఠకులకు అందు బాటులో లేవు. ఆ లోటును వీరు తీర్చారు. ఇది ఒక మంచి ఆధ్యాత్మికతత్త్వ గ్రంథంగా నిలిచిపోతుంది.

*- కె.గౌరీశంకర్.*

తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి

# ఆర్జిత సేవా టిక్కెట్లను అడ్వాన్స్ బుకింగ్, కరెంట్ బుకింగ్, ఇంటర్నెట్ బుకింగ్, ఈ-దర్శన్ బుకింగ్ ద్వారా భక్తులు పొందవచ్చు.

## అడ్వాన్స్ బుకింగ్

అడ్వాన్స్ బుకింగ్ మూడు నెలల కాలపరిమితి వరకే స్వీకరించబడుతుంది

| సేవ/ ఉత్సవం పేరు | రుసుం | ప్రవేశం | రోజు |
|---|---|---|---|
| సుప్రభాతం | 120/- | 1 | ప్రతిరోజు |
| కల్యాణోత్సవం | 1000/- | 2 | ప్రతిరోజు |
| ఆర్జిత బ్రహ్మోత్సవం | 200/- | 1 | ప్రతిరోజు |
| ఊంజల్ సేవ | 200/- | 1 | ప్రతిరోజు |
| వసంతోత్సవం | 300/- | 1 | ప్రతిరోజు |
| సహస్రదీపాలంకార సేవ | 200/- | 1 | ప్రతిరోజు |
| విశేషపూజ | 600/- | 1 | సోమవారం |
| నిజపాదదర్శనం | 200/- | 1 | శుక్రవారం |

వ్యక్తిగతంగా డి.డి.లు స్వీకరించబడవు. పోస్టు/కొరియర్ ద్వారా పంపినవి మాత్రమే స్వీకరించబడతాయి. డి.డి.లు. "కార్యనిర్వహణాధికారి, తి.తి.దేవస్థానములు" పేరుమీద తిరుమల/ తిరుపతిలో చెల్లు బాటయ్యే విధంగా తీసి, 'సహాయ కార్యనిర్వహణాధికారి, ఆర్జితం ఆఫీసు, శ్రీ తిరుమల ఆలయం, తిరుమల-517504' చిరునామాకు పంపాలి.

పోస్టు/ కొరియర్ సేవల ద్వారా పంపే డి.డిలతో పాటు దరఖాస్తుకు భక్తుల గుర్తింపు వివరాలు తప్పనిసరి. పాన్‌కార్డు, రేషన్ కార్డు, ఓటరు గుర్తింపు కార్డు, పాస్‌పోర్టు, డ్రైవింగ్ లైసెన్స్ తదితరాలలో ఏ ఒక్కదానినైనా జతపరచి అడ్వాన్స్ బుకింగ్ ద్వారా ఆర్జిత సేవా టిక్కెట్లు పొందవచ్చు.

## ఇంటర్నెట్ బుకింగ్

దీనికి సంబంధించిన వివరాలను www.ttdsevaonline.com ద్వారా పొందవచ్చు

| సేవ/ ఉత్సవం పేరు | రుసుం | ప్రవేశం | రోజు |
|---|---|---|---|
| సుప్రభాతం | 120/- | 1 | ప్రతిరోజు |
| తోమాల | 220/- | 1 | మంగళ,బుధ,గురు |
| అర్చన | 220/- | 1 | మంగళ,బుధ,గురు |
| కల్యాణోత్సవం | 1000/- | 2 | ప్రతిరోజు |
| ఆర్జిత బ్రహ్మోత్సవం | 200/- | 1 | ప్రతిరోజు |
| వసంతోత్సవం | 300/- | 1 | ప్రతిరోజు |
| నిజపాదదర్శనం | 200/- | 1 | శుక్రవారం |
| విశేషపూజ | 600/- | 1 | సోమవారం |
| అష్టదళ పాదపద్మారాధన | 1250/- | 1 | మంగళవారం |

## కరెంట్ బుకింగ్

ఈ సేవల టిక్కెట్లను తిరుమల సెంట్రల్ రిసెప్షన్ ఆఫీసు నందు గల విజయాబాంక్‌లో బయోమెట్రిక్ విధానం ఒకరోజు ముందస్తుగా బుక్ చేసుకోవచ్చు

| సేవ/ ఉత్సవం పేరు | రుసుం | ప్రవేశం |
|---|---|---|
| సుప్రభాతం | 120/- | 1 |
| కల్యాణోత్సవం | 1000/- | 2 |
| నిజపాద దర్శనం | 200/- | 1 |
| ఆర్జిత బ్రహ్మోత్సవం | 200/- | 1 |
| వసంతోత్సవం | 300/- | 1 |
| సహస్ర దీపాలంకార సేవ | 200/- | 1 |
| విశేషపూజ | 600/- | 1 |
| సహస్ర కలశాభిషేకం | 850/- | 1 |
| తిరుప్పావడ | 850/- | 1 |
| పూరాభిషేకం | 750/- | 1 |
| మేల్‌చాట్ వస్త్రం | 12250/- | 2 |
| అర్చన (మంగళ, బుధ, గురు) | 220/- | 1 |
| తోమాల (మంగళ, బుధ, గురు) | 220/- | 1 |

## ఈ-దర్శన్ బుకింగ్

ద్వారా లభించే ఆర్జితసేవలు

| సేవ/ ఉత్సవం పేరు | రుసుం | ప్రవేశం | రోజు |
|---|---|---|---|
| సుప్రభాతం | 120/- | 1 | ప్రతిరోజు |
| కల్యాణోత్సవం | 1000/- | 2 | ప్రతిరోజు |
| ఆర్జిత బ్రహ్మోత్సవం | 200/- | 1 | ప్రతిరోజు |
| ఊంజల్‌సేవ | 200/- | 1 | ప్రతిరోజు |
| వసంతోత్సవం | 300/- | 1 | ప్రతిరోజు |
| సహస్ర దీపాలంకారసేవ | 200/- | 1 | ప్రతిరోజు |
| నిజపాదదర్శనం | 200/- | 1 | శుక్రవారం |
| విశేషపూజ | 600/- | 1 | సోమవారం |
| అష్టదళ పాదపద్మారాధన | 1250/- | 1 | మంగళవారం |

ప్రత్యేక ఉత్సవ సందర్భాల్లో పై సేవల్లో స్వల్ప మార్పులుండవచ్చు | వివరాలకు-0877-2263589, 2263679



# బాలవాక్కు!

## ఊర్మిళాదేవి

త్యాగనిరతిలో సీతమ్మవారికి సాటిగా లక్ష్మణుడిఅర్ధాంగి ఊర్మిళాదేవి ఉదాత్తవ్యక్తిత్వాన్ని చాటుకుంది. అందుకే తులసీదాస్ తన 'రామచరిత మానస్'లో 'ఓ ఊర్మిళా దేవి! నాకు నీ ఔదార్యాన్ని వర్ణించేశక్తి లేదు. నీకు వందనం మాత్రమే చేయగలను' అంటాడు. సీతారాముల పట్టాభిషేకం అన్నే శుభవార్తకు ముందుగా స్పందించి, సంతోషపడిన వ్యక్తి ఊర్మిళాదేవి. అదే ఆనందంతో ఆ వైభవాన్ని ఊహించుకుంటూ అంతఃపురంలో ఒక కల్పనాచిత్రాన్ని గీస్తూ ఉంటుంది. ఆ సమయంలో భర్త లక్ష్మణుడు హడావిడిగా, ఆందోళనగా ఆమె మందిరంలోకి అడుగుపెడతాడు. ఒక్కసారిగా ఉలిక్కిపడుతుంది– ఊర్మిళ. ఆ తొట్రుపాటుకు రంగులన్నీ తొణికి, చిత్తరువు చెడి పోతుంది. కైకేయివల్ల అన్నపట్టాభిషేకమే భంగమైంది. ఇక ఈ చిత్రాని దేముంది! అంటూ కుమిలిపోతాడు–లక్ష్మణుడు.

'పధ్నాలుగు సంవత్సరాలు అన్నావదినల సేవకై నేను అడవులకు వెళుతున్నాను' అంటాడు– సౌమిత్రి. కన్నీళ్లతో అలా ఉండిపోయింది ఆ అర్ధాంగి! భర్త రమ్మన లేదు; తనూ సీతమ్మ వారిలా వెంటవస్తా నని పట్టుబట్టలేదు. పైగా మీ అన్నావదినల సేవలో తరించండి; కానీ నా ప్రార్థన ఒక్కటే! మీరు వనవాస కాలంలో నా గురించి ఒక్కక్షణం ఆలోచించినా మనస్సు చలించి పోతుంది. మీసేవకు ఆటంకం కలుగుతుంది. నా చింత వీడండి' అంటుంది.

అందుకే సీతారామలక్ష్మణులకు వీడ్కోలు పలికేందుకు కూడా ఆమె అంతఃపురం విడచి బయటకు రాలేదు. భర్తతో అరణ్యవాసమైనా అయోధ్యావాసంలా భావించి చరించిన చరిత జానకీమాతదైతే, భర్తచేసిన త్యాగానికి ప్రతిఫలంగా అయోధ్యలో కూడా అరణ్యవాసంగా తనజీవనాన్ని సాగించిన ధన్యవనిత ఊర్మిళాదేవి.

మరో సందర్భంలో కూడా ఆ మహా సాధ్వి పాతివ్రత్యధర్మం గుండెల్ని కదలించి వేస్తుంది. రామరావణయుద్ధంలో లక్ష్మణుడు మూర్ఛిల్లినవేళ మారుతి సంజీవని కోసం ఏకంగా పర్వతాన్నే చేపట్టి, అయోధ్యమీదుగా వెళుతూ ఉంటాడు. తన దివ్యశక్తితో విషయమేంటో తెలుసుకోవా లని భరతుడు హనుమం తుడితో సహా పర్వతాన్ని కిందకు దించుతాడు. కౌసల్యతో సహా అందరూ లక్ష్మణుడి దుఃస్థితికి విషాదంలో మునిగిపోతారు. కానీ, సతి ఊర్మిళమాత్రం తనస్వామికి ఏమీ కాదన్నే విశ్వాసంతో నిశ్చలంగా ఉంటుంది. అప్పుడు ఆంజనేయుడు ఆశ్చర్యంగా, 'అమ్మా ఊర్మిళాదేవి! నీవు అంత నిబ్బరంగా ఎలా ఉండగలుగు తున్నావు? నేను సూర్యోదయానికల్లా వెళ్లకపోతే లక్ష్మణస్వామి మనకు దక్కడు' అంటాడు. అప్పుడు ఆ నారీశిరోమణి, 'అయ్యా! మీరంతా వట్టిఅమాయకులు! నా భర్త అణువణువునా ఆ రామచంద్రుడినామమే మమేకమైంది. అంతటి ఆ సోదరుణ్ణి ఆయన రక్షించుకోకుండా ఉంటాడా? ఆ శ్రీరామచంద్రుడు మూర్ఛపేరుతో నా పతిదేవుడికి కాస్త విశ్రాంతిని ప్రసాదించాడు. అంతే! అయినా, నా మంగళసూత్రంపై ఆన! నీవు లంకకు చేరి నీపని పూర్తి అయ్యేంతవరకు సూర్యోదయం కాదు' అంటూ తనమంగళసూత్రంపై చేతులు ఆనిస్తుంది. ఆమెధైర్య, స్థైర్యాలకు ఆంజనేయుడు అచ్చెరువొందుతాడు.

వనవాసం అనంతరం, పధ్నాలుగేళ్ల తరువాత సీతా రామసమేతుడై తనభర్త అయోధ్యలో అడుగుపెట్టిన క్షణంలో కూడా ఎలాంటి ఉద్వేగానికి లోనుకాని స్థితప్రజ్ఞురాలు ఆమె! భర్త కనిపించగానే పాదాలకు ప్రణమిల్లింది. అంతే! ఏళ్ల తరబడి శిలలా పడి ఉన్న అహల్యకన్నా, జీవ మున్నా శిలలా కాలం గడిపిన ఊర్మిళ ధన్యురాలు. ఊర్మిళాదేవి తపోమయత్యాగమయ జీవనానికీ, వినయవిశ్వాసాలకూ, నిశ్చలమైనమనస్సుకూ, అకుంఠితపాతివ్రత్యధర్మానికీ యావత్‌లోకం కలకాలం నివాళు లర్పిస్తూనే ఉంటుంది.



**ఎ.మనోజ్ కుమార్,** 3వ తరగతి,
S/o ఎ.నరేంద్రకుమార్, ఇ.నెం.4-1-145,
ఎ.కె.ఎం.స్ట్రీట్, పులివెందుల,
కడప జిల్లా, ఆం.ప్ర.-516 390.

మన దేవాలయాలు

# భద్రాచలం

శ్రీమతి కె.విజయలక్ష్మి



శ్రీ రామచంద్రమూర్తిపాదధూళితో పునీతమైనదివ్యస్థలం. పవిత్రగోదావరినదీ తీరంలో పుణ్యపురాశిగా విరాజిల్లుతూ ఉన్న మహిమాన్వితపుణ్యక్షేత్రం – భద్రాచలం. ఈ క్షేత్రం. ఖమ్మంజిల్లాలో ఉంది.

భద్రాచలానికి ఒకప్పుడు దండకారణ్య మని పేరు. పితృవాక్యపాలకుడైన శ్రీరాముడు అరణ్యవాసం చేస్తూ కొంతకాలం ఈ దండకారణ్యంలో గడిపాడు. ఈ సమయంలో ఒక శిలపై విశ్రమించి, ఆ శిలను ఆశీర్వదించగా, ఆ శిల మరుజన్మలో మేరువు, మేరుదేవిదంపతులకు భద్రుడుగా జన్మించి, నారదుడినుంచి రామమంత్రోపదేశాన్ని పొంది, తపస్సు చేశాడు. ఆ తపస్సుకు మెచ్చి, శ్రీరాముడు ప్రత్యక్షమై, భద్రుడికోరికపై అక్కడే కొలువుదీరినట్లు కథనం. బ్రహ్మపురాణం ప్రకారం పర్వతరాజు అయిన మేరువు బ్రహ్మను గురించి తపస్సు చేశాడు.



తపస్సును మెచ్చి, బ్రహ్మదేవుడు ప్రత్యక్షం కాగా–మేరువు రామభక్తిపరుడైన కుమారుడిని ప్రసాదించ మని వరం కోరాడు. బ్రహ్మవరం ప్రసాదించాడు. వరంమేరకు మేరువుకు రామభక్తిపరుడైన 'భద్రుడు' కుమారుడిగా జన్మించాడు. భద్రుడు రామదర్శనం కోరి ఘోరతపస్సు చేశాడు. తపస్సును మెచ్చి శ్రీరాముడు శంఖ, చక్ర, ధనుర్బాణాలను ధరించి ప్రత్యక్షంకాగా ఆ రూపంలోనే తన శిరస్సుపై నివాసం ఉండ మని భద్రుడు వరం కోరాడు. అలా భద్రుడు శిలారూపాన్ని ధరించగా, దానిపై రాముడు కొలువుదీరినట్లు స్థలపురాణం. భద్రుడిపై రాముడు కొలువుదీరిన క్షేత్రం కనుక 'భద్రాచలం' అనే పేరు ఏర్పడింది.

క్రీ.శ.17వశతాబ్దం తొలిరోజుల్లో భద్రాచలానికి సమీపంలోని భద్రారెడ్డిపాలెం అనే గ్రామంలో 'పోకల దమ్మక్క' అనే గిరిజనమహిళ ఉండేది. రామభక్తిపరురాలైన ఆమెకు ఒకరోజు స్వప్నంలో శ్రీరాముడు సాక్షాత్కరించి, 'భద్రగిరిమీద వెతికితే తాను కనిపిస్తాను' అని పలికాడు. ఆ మరునాడు భద్రగిరిపై వెదుకగా ఇప్పుడు ఆలయం ఉన్నచోట శిలామూర్తులు దర్శనమిచ్చాయి. ఊరిపెద్దల సహాయంతో ప్రతిదినం గోదావరినీటితో అభిషేకించి, అడవిలో దొరికేపండ్లను నైవేద్యంగా అర్పించసాగింది.



ఈ స్థితిలో కుతుబ్‌షాహీ సుల్తాన్ అబుల్‌హసన్ తానీషా పాలనలో పాల్వంచప్రాంతానికి తహశీల్దారుగా పని చేస్తూ ఉన్న 'కంచర్లగోపన్న'కు శ్రీరాముడు కలలో కనిపించి ఆలయం నిర్మించ మని ఆదేశించాడు. గోపన్న శ్రీరాముడికి ఆలయం, ప్రాకారం

నిర్మించి, నిత్యకైంకర్యాలను ఏర్పాటు చేశాడు. ఆలయపోషణకు అవసరమైనమాన్యాలు వివిధఆభరణాలు ఏర్పాటు చేశాడు. ప్రభుత్వఅనుమతి లేకుండా చేయడంతో తానీషా గోపన్నను బంధించి, కారాగారంలో ఉంచాడు. గోపన్న జైలులో భక్తితో, ఆవేదనతో, నిష్ఠూరంతో, కోపంతో ఆలపించిన కీర్తనలు రామదాసుకీర్తనలుగా పేరుపొందగా, గోపన్న 'రామదాసు' అయ్యాడు. ఒకనాటి అర్ధరాత్రి రామలక్ష్మణులు మారువేషంలో తానీషా వద్దకు వెళ్ళి, ధనాన్ని చెల్లించగా, గోపన్న జైలునుంచి విడుదల అయ్యాడు. రాముడిమహిమను తెలుసుకున్న తానీషా పాల్వంచ ప్రాంతఆదాయాన్ని ఆలయానికి కేటాయించడమే కాకుండా ప్రతిసంవత్సరం శ్రీరామనవమినాడు జరిగే సీతారాములకల్యాణోత్సవాలకు ముత్యాలతలంబ్రాలు, మంగళసూత్రాలను తామే పంపే ఏర్పాటు చేశారు. ఈ ఆచారం నేటికీ సాగుతూ ఉంది. ఆంధ్రప్రదేశ్ రాష్ట్రప్రభుత్వం ప్రతిసంవత్సరం శ్రీరామనవమి నాడు ముత్యాలతలంబ్రాలు పంపడం ఆనవాయితీ అయింది.

పవిత్రగోదావరీనదితీరాన ఉన్నఆలయం - కొంత ఎత్తులో ఉంది. ప్రధానఆలయానికి చేరుకునే ప్రధానద్వారం పైన గాలిగోపురం నిర్మింపబడింది. ప్రధానఆలయంలో అడుగిడగానే ముందుగా శ్రీఆంజనేయస్వామి దర్శనమిస్తాడు. శ్రీ ప్రపత్తి ఆంజనేయస్వామి అని ఆయనకు పేరు. ప్రధాన గర్భాలయంలో గర్భగృహంలోని మూలవిరాట్టు అయిన శ్రీరామచంద్రమూర్తి చతుర్భుజాలతో వామాంకంమీద కూర్చున్న సీతా దేవితో లక్ష్మణుడితో కలిపి భక్తులపై కరుణాకటాక్షాలు ప్రసరింప జేస్తూ కొలువుదీరి ఉన్నారు. శంఖ, చక్ర, ధనుర్బాణాలను చేతులలో ధరించి స్వామివారు దర్శనమిస్తారు. ఈ ప్రధానదేవతా మూర్తులతో పాటు ఆలయప్రాంగణంలో భక్తులు శ్రీ కనక వల్లీదేవి, శ్రీ కులశేఖరఆళ్వారు, బలిపీఠం, ధ్వజస్తంభంతో పాటు గట్టుమీద లక్ష్మీనరసింహస్వామి, రథశాల, జమ్మిమండపం, సంతానగోపాలస్వామి, భద్రుడిపై శిరస్సుపై గల శ్రీరాముడి పాదాలు, గోవిందరాజస్వామిఆలయం, ఏకాదశి సత్యనారాయణ స్వామిమండపం, శ్రీరంగనాయకస్వామి, విష్వక్సేనులు, శ్రీవేంకటేశ్వరస్వామి, నారదుడు, రామదాసు ధ్యానమందిరం వంటివి దర్శించవచ్చు.

భద్రాచలానికి సుమారు 35 కిలోమీటర్లదూరంలో గల 'పర్ణశాల' తప్పక దర్శించవలసినప్రాంతం. వనవాసకాలంలో శ్రీసీతారామలక్ష్మణులు ఈ పర్ణశాలలో నివసించినట్లు ప్రతీతి. శూర్పణఖవృత్తాంతం, సీతాదేవి మాయలేడిని కోరడం, సీతాపహరణం, రావణరథంగుర్తులు వంటి ఎన్నో తార్కాణాలు ఈ పర్ణశాలలో దర్శనమిస్తాయి. సీతాదేవి ఏకాంతంగా స్నానమాచరించిన గోదావరిపాయ నేటికీ సీతమ్మవాగుగా పిలువబడుతూ ఉంది.

ప్రతిరోజూ పూజలు జరిగేభద్రాచలం శ్రీసీతారామచంద్రస్వామివారిఆలయంలో శ్రీరామనవమిసందర్భంగా బ్రహ్మోత్సవాలు జరుగుతాయి. శ్రీరామనవమిరోజు భద్రాచలంలో జరిగే శ్రీసీతారాములకల్యాణం జగత్ప్రసిద్ధి చెందింది. ధనుర్మాసం, వైకుంఠఏకాదశి, దేవీనవరాత్రుల సందర్భంగా ప్రత్యేక అలంకారాలు, పూజలు, ఉత్సవాలు నిర్వహిస్తారు. వైకుంఠ ఏకాదశినాడు జరిగే వైకుంఠద్వారదర్శనం, తెప్పోత్సవాలలో భక్తులు విశేషసంఖ్యలో పాల్గొంటారు.

భద్రాచలంలోని దేవాలయవసతిగృహాలలో భక్తులకు వసతిసౌకర్యాలు లభిస్తాయి. ఖమ్మం నుంచి 119, హైదరాబాదు నుంచి 325, విజయవాడల నుంచి 200 కిలోమీటర్ల దూరంలో ఉన్న భద్రాచలానికి రాష్ట్రంలోని ప్రధానమైన నగరాలు, పట్టణాల నుంచి బస్సుసౌకర్యాలు ఉన్నాయి.

**ధర్మో రక్షతి రక్షితః**

**ధర్మాన్ని మనం రక్షిస్తే - ధర్మం మనల్ని రక్షిస్తుంది**



శ్రీమాన్ పురిశై శ్రీరంగాచార్యస్వామివారిచే ప్రణీతమైన

# శ్రీలక్ష్మీగద్యమ్

04

"శ్రీచరణపరిచరణ" వ్యాఖ్య　　వ్యాఖ్యాత - ఈ.ఏ.శింగరాచార్యులు

**3. శ్రీశైలానంతసూరేః సధవముపవనే చోరలీలాం చరంతీ**
**చాంపేయే తేన బద్ధా స్వపతి మవరయ త్తస్యకన్యాసతీ యా।**
**యస్యాః శ్రీశైలపూర్ణ శ్శ్వశురయతి చ హరే స్తాతభావం ప్రపన్నః**
**సేయం శ్రీవేంకటాద్రిప్రభువరమహిషీ భాతు పద్మావతీ శ్రీః ॥**

యా = ఏ పద్మావతీదేవి, శ్రీశైల+అనంతసూరేః = శ్రీశైల అనంతార్యుల యొక్క ఉపవనే= ఉద్యానవనమునందు, సధవం= తన భర్తతోపాటు, చోరలీలాం= చోరకృత్యమును, చరంతీ = చేయునట్టిదై, తేన=అనంతాచార్యులచే, చాంపేయే = సంపెంగ చెట్టుకు, బద్ధా = బంధింపబడినదై, తస్య = ఆ అనంతాచార్యులకు, కన్యా సతీ = కుమార్తెయై, స్వపతిం = భర్తయగు శ్రీనివాసుని, అవరయత్ = వరించెనో, హరేః = శ్రీనివాసభగవానునికి, తాతభావం = తండ్రియగుటను, ప్రపన్నః = పొందిన, శ్రీశైలపూర్ణః = శ్రీశైలపూర్ణులు, యస్యాః = ఏ పద్మావతీదేవికి, శ్వశురయతి చ = మామగారు అయ్యెనో, సా ఇయం = ఇట్టి, ఈ, శ్రీః = లక్ష్మీదేవి, శ్రీవేంకటాద్రిప్రభువరమహిషీ = శ్రీవేంకటేశ్వరుని పట్టపురాణియగు, పద్మావతీ = పద్మావతీదేవి, భాతు= ప్రకాశించునుగాక !

ఈ శ్లోకమున ప్రస్తుతింపబడిన వృత్తాంతము ఈ స్తుతి కర్తచే రచింపబడిన **అనంతార్యమహిమ కథాసంగ్రహః** అను సంస్కృతగ్రంథమందు కలదు. శ్రీశైలపూర్ణుల వృత్తాంతము శ్రీమదనంతార్యగుంఫితమగు శ్రీవేంకటాచలేతిహాసమాల అను సంస్కృతకృతిలో కన్పడుచున్నది. ఆ వృత్తాంతములు రెండును సంగ్రహముగా ఇట్లున్నవి.

ఒకానొక సమయమున వసంతనవరాత్రులయందు పద్మావతీశ్రీనివాసులు ఇరువురు అనంతార్యనిర్మితమైన శ్రీరామానుజారామమున స్వైరవిహారమును సలుపుచు, అచటిపుష్పముల నన్నిటిని, ఫలము లనన్నిటిని యథేచ్ఛగా అనుభవించి, ఆ వనమును పాడుచేసిరి. మఱునాటి ఉదయమున అనంతార్యుడు వనమునకు వచ్చి, అచటిస్థితిని గమనించి, ఆ విధముగా ధ్వంస మొనర్చిన దొంగలను పట్టుకొనుటకు కొందఱు వ్యక్తులను నియమించెను. కాని, దివ్యదంపతులు వారికన్ను కప్పి, పూర్వమువలె స్వైరముగా సంచరించుచుండిరి. ఇక చేయునది లేక అనంతార్యుడే స్వయముగా కాపలా కాయసాగెను. అట్లయినను దివ్యదంపతులు ఆ మహనీయునికి కన్పడకుండగనే సంచరింపసాగిరి. ఇట్లు ఎనిమిదిదినములు గడచెను. తొమ్మిదవనాటి రాత్రి ఆ దంపతులు అనంతార్యుని మహిమను లోకులకు తెలుపగోరి రాజదంపతులరూపమున వనమున సంచరించుచుండిరి. అపుడు అనంతార్యుడు వారిని ఇరువురను వెంబడించి పట్టుకొనెను. శ్రీనివాసుడు ఆయనపట్టును తప్పించుకొనిపోయెను. కాని, పద్మావతీదేవి ఆయనకు చిక్కుపడెను. అపుడు అనంతార్యుడు ఆమెను అచటిసంపెంగచెట్టుకాండమునకు కట్టియుంచెను. పిదప వివరములను ప్రశ్నించెను. అపుడు ఆమె మిక్కిలిచాతుర్యముతో సమాధానమిచ్చుచు, భర్తపేరును తాను చెప్పజాల నని, భర్త స్వైరు డైనపుడు తా నేమి చెప్పగల నని, కూతురువంటి తనను విడువు మని ప్రార్థించెను. అపుడు అనంతార్యుడు "రేపటి ఉదయమున నీ భర్త నిన్ను వెదకుచు తప్పక ఇచటికి రాగలడు. అపు డతనిపనిపట్టెదను. అంతవరకు నీ విచటనే ఉండుము. అపుడు నీ కొఱకు జామీను ఇచ్చువానికి నిన్ను వదలిపెట్టెదను" అని పల్కి, ఆమెను విడువకుండెను.

మఱునాటిఉదయమున అధికారులతోపాటు అర్చకపరివారము శ్రీవేంకటేశ్వరునికోవెలతలుపులు తెరచి, ఆరాధన చేయబోయిరి. అపుడు వారికి స్వామివక్షఃస్థలమున నుండవలసిన లక్ష్మి కనబడలేదు. అర్చకులను దొంగలుగా శంకించి, అధికారులు వారిని శిక్షింపబోగా, స్వామి ఒక వ్యక్తిని ఆవేశించి,

అతనిద్వారా– “ఈ అర్చకులు దొంగలు కారు. పద్మావతీ సహితుడనైన నేను నిన్నరాత్రి అనంతార్యునివనమున మాఱు రూపములో విహరించుచుండగా, మమ్ముల నతడు పట్టుకొన బోయెను. అతనిబారినుండి నేను తప్పించుకొని వచ్చితిని. కాని, లక్ష్మి అతనికి పట్టుపడి, అచటనే సంపెంగ చెట్టుకు కట్టబడి యున్నది. మీరు అచటకు పోయి నా ఆజ్ఞగా ఆమెను, ఆ మహనీయుని నా వద్దకు కొనిరండు” అని పల్కెను. వారు అత్యాశ్చర్యచకితులై, శ్రీరామానుజవనమును చేరి, అచట బద్ధయైయున్న పద్మావతిని చూచి, అనంతార్యునకు జరిగిన సంగతిని వివరించిరి. ఆ భక్తాగ్రేసరుడును తన అపరాధమునకు చింతిల్లి, పద్మావతీదేవిపాదములపై పడి, క్షమింపవేడెను. ఆమె పూర్వము తాను ఆ భక్తునికి కూతురువంటిదాన నని చెప్పి నందులకు అనుగుణముగా వివాహోచితవయస్కయైన కన్యకగా మారెను. అనంతార్యు డామెను చంకన నెత్తుకొనిపోయి, స్వామి మందిరమును చేరి, తనతప్పును మన్నింపవేడెను. స్వామి ఆజ్ఞను అనుసరించుచు ఆ చిన్నకన్నియను స్వామికి కన్యా దానము చేసి, సువర్ణహారమును కన్యాశుల్కముగా పొందెను. కన్యకరూపములోని పద్మావతి శ్రీనివాసునివక్షఃస్థలమును చేరెను. కావున అతడు శ్రీనివాసునికి (మామగారు) శ్వశురు డయ్యెను. అందువలననే ఈ మహనీయునివంశమువారు చిరకాలము నుండి ఈనాటివరకు స్వామిబ్రహ్మోత్సవములలో రథోత్సవము నాడు నూతనపీతాంబరమును తమఇంటిఅల్లుడగు శ్రీనివాసునికి కానుకగా ఇచ్చుచున్నారు. ఈ వృత్తాంతము వేంకటాచలేతిహాస మాలయందును కలదు.

ఇక, శ్రీశైలపూర్ణవృత్తాంతము. తిరుమలక్షేత్రమున శ్రీనివాసునిదివ్యారాధనకు వలయుతీర్థమును పాపవినాశము నుండి కొనివచ్చుసేవను యామునార్యునిఆజ్ఞచొప్పున శ్రీశైలపూర్ణులు చేయుచుండెను. ఆ మహాభక్తునిగొప్పతనము అందఱకు తెలియవలయును ఉద్దేశముతో స్వామి ఒక వ్యాధుని రూపమును దాల్చి, వింటిని చేతబూని, తీర్థమును తీసికొనివచ్చు శ్రీశైలపూర్ణులకు ఎదురుగా వచ్చి – “తాతా! (నాయనా!) నాకు దప్పికగా ఉన్నది. కొంచెము తీర్థము నిమ్ము” అనెను. అపుడు శ్రీశైలపూర్ణులు తాను కొనిపోవు జలము స్వామి ఆరాధనకొఱకు కావున మానవులకు ఇవ్వజాల ననుచు తిరస్కరించి, ముందుకు సాగెను. వ్యాధరూపములోని స్వామి ఆయనను వెంబడించి, తనచేతిలోని బాణమును అత్యంతము నేర్పుతో సంధించి, తీర్థకలశమున రంధ్రము చేసి, అందలిజలమును అంతటిని త్రాగసాగెను. శ్రీశైలపూర్ణుడు భగవద్ధ్యాననిమగ్ను డగుటచే దీని నేమియు గమనించలేదు. కొంచెముదూరము పోవుసరికి కలశములో నీరులేకుండటను, గుర్తించి, అతడు వెనుకకు చూచి తీర్థమును త్రాగువ్యాధుని చూచి, –“ఓరీ ! ఇట్టి ద్రోహమేల చేసితివి?” అని నిందించెను. అపుడు స్వామి – “తాతా ! (నాయనా) విచారింపకుము. ఇంతటికి దగ్గరలోనే వేఱొక దివ్యతీర్థ మున్నది–చూపెదను. రమ్ము” అనుచు ఇప్పటి ఆకాశ గంగాతీర్థమువద్దకు కొనిపోయెను. కాని, అపుడు అచట జల మేమియు శ్రీశైలపూర్ణులకు కనబడలేదు. వ్యాధునిరూపము లోనున్న స్వామి తనవింటినుండి బాణముగా చేయబడిన గడ్డిపోచతో ఒక కొండకొమ్మును కొట్టెను. అందుండి మిక్కిలి వేగముగా జలధార ప్రవహింపసాగెను. అపుడు స్వామి ఆ తీర్థమును శ్రీశైలపూర్ణులకు చూపి– “తాతా! ఇది ఆకాశగంగా తీర్థము. భగవానునికి ఇందలిజలము మిక్కిలిప్రియము. ఇది మొదలు ఆరాధనముకొఱకు ఇచటినుండియే తీర్థమును కొనిరమ్ము” అనుచు అదృశ్యు డయ్యెను. అది అంతయు స్వామి లీలయే అని గుర్తించిన శ్రీశైలపూర్ణులు అట్లే చేసిరి. శ్రీనివాసునిచే “తాతా!” (తండ్రీ!) అని పిలువబడుటచే ఆ భక్తుడు భగవానునికి తండ్రి అయ్యెను. అందువలననే శ్రీశైలపూర్ణుని ప్రార్థనా శ్లోకమున **“పితామహస్యాపి పితామహాయ”** (పితామహుడైన బ్రహ్మకు పితామహుడు) అని నుడువబడినది. ఈ కారణముచే శ్రీశైలపూర్ణులు పద్మావతికి మామగారు అయ్యెను.

ఈ విధముగా ఈ శ్లోకమున భగవానునికి మామగారైన అనంతార్యుల, పద్మావతీదేవికి మామగారైన శ్రీశైలపూర్ణుల వృత్తాంతములు ప్రస్తుతము లగుట విశేషము. ***(ఇంకా ఉంది)***

**సంపదలు గృహంలోనే ఉండిపోతాయి.**
**మిత్రులు, బంధువులు శ్మశానం వరకు వచ్చి**
**తిరిగిపోతారు. చనిపోయిన వారి వెంట**
**నంటి వచ్చేది వారి పుణ్యపాపములే!**




## రథసప్తమి - శ్రీవారిదివ్యతేజం

**మా**ఘశుద్ధసప్తమి సందర్భంగా తిరుమలలో రథసప్తమి ఉత్సవం 17-02-2013న అత్యంత వైభవంగా జరిగింది. భక్తుల కోలాహలంమధ్య శ్రీవేంకటేశ్వరస్వామివారు సూర్యోదయం మొదలు రాత్రి వరకు సప్తవాహనాల్లో విహరించారు. ఉత్సవం నేపథ్యంలో శ్రీమలయప్పస్వామి అరుణోదయం సమయాన ప్రాతఃకాలఆరాధన పూర్తికాగానే ఆలయం నుంచి వాహనమండపానికి వేంచేశారు. అక్కడ శ్రీవారు వజ్రకవచాది అలంకారభూషితులై సకలపరివారంతో సూర్యప్రభవాహనంపై ఊరేగుతూ నాలుగుమాడవీథుల్లో వాయువ్యదిశకు వేంచేశారు. అక్కడకు వేంచేసిన తిరుమలేశునిపై సూర్యనారాయణుడు తనకిరణాలతో సమర్చించాడు. ఈవైభవాన్ని చూసేందుకు వేలాదిమంది భక్తజనులు తిరుమాడ




వీథుల్లో కిక్కిరిసిపోయారు. అనంతరం స్వామి వాహనమండపానికి చేరుకుని సూర్యప్రభవాహనాన్ని వీడి శేషవాహనాన్ని అధిష్ఠించి నాలుగుమాడవీథుల్లో ఊరేగుతూ భక్తులకు కనువిందు చేశారు. అనంతరం గరుడ, హనుమంతవాహనాలపై ఊరేగి వాహనమండపానికి విచ్చేశారు. మధ్యాహ్నం శ్రీమలయప్పస్వామి ఆలయానికి చేరుకున్నారు. ఆసమయంలో శ్రీ సుదర్శనచక్రత్తాళ్వారు సకలపరివారంతో ఊరేగుతూ వరాహస్వామిఆలయం ప్రాంగణానికి చేరుకున్నారు. అక్కడ పంచామృతాభిషేకం జరిగాక సుదర్శనభగవానునికి శ్రీవారిపుష్కరిణిలో పవిత్రస్నానం జరిగింది. ఇదేసమయంలో యాత్రికులు కూడా పుష్కరస్నానంచేసి పునీతులయ్యారు. సుదర్శనభగవానులు శ్రీవారిఆలయానికి చేరుకున్న అనంతరం మలయప్పస్వామి వారికి మధ్యాహ్న ఆరాధనపూర్తి అయిన వెంటనే వాహన మండపానికి వేంచేశారు. అనంతరం శ్రీవారు వరుసగా కల్పవృక్ష, సర్వభూపాల, రాత్రి చంద్రోదయం సమయాన చంద్రప్రభవాహనాల్లో ఊరేగి వాహనమండపానికి చేరుకున్నారు. ఈ విధంగా మలయప్పస్వామి సప్తవాహనాల్లో వైభవంగాఊరేగారు.

భక్తులకోలాహలం మధ్య శోభాయమానంగా రథసప్తమి ఉత్సవం జరిగింది. తిరుమాడవీథులు భక్తజనంతో పులకించాయి. భక్తులు కనీవినీ ఎరుగనిరీతిలో యాత్రికులు అధికసంఖ్యలో ఉత్సవంలో పాల్గొని అడుగడుగునా స్వామివారికి హారతులు పట్టారు. ఉత్సవం ఆద్యంతం బ్రహ్మోత్సవాన్ని తలపించింది.




## బ్రెయిలీలిపిలో భారత, భాగవతాలు

**తి**రుమలలో 17-02-2013, రథసప్తమి సందర్భంగా జరిగిన వాహనసేవల్లో 'ఉషశ్రీ' రచించిన భారత, భాగవతాలను అంధులకోసం బ్రెయిలీలిపిలో రూపొందించిన గ్రంథాలను తి.తి.దే. పాలకమండలిఅధ్యక్షుడు శ్రీకనుమూరి బాపిరాజు, కార్యనిర్వహణాధికారి శ్రీఎల్వీ. సుబ్రహ్మణ్యం, ఐ.ఏ.ఎస్., ఆవిష్కరించారు. హైదరాబాద్‌కు చెందిన దేవానార్ ఫౌండేషన్ వ్యవస్థాపకుడు పద్మశ్రీ సాయిబాబాగౌడ్ బ్రెయిలీలిపిలో వీటిని రచించి వెలుగులోకి తీసుకొచ్చారు. చిన్నశేషవాహనసేవ సందర్భంగా జరిగిన ఈ ఆవిష్కరణలో తిరుమల తిరుపతి దేవస్థానం ఉన్నతాధికారులు పాల్గొన్నారు.




## శ్రీవారికి వేడుకగా పున్నమిగరుడసేవ

**తి**రుమలలో 2013, ఫిబ్రవరి 25వ తేది రాత్రి శ్రీవేంకటేశ్వరస్వామికి వేడుకగా పున్నమిగరుడసేవ జరిగింది. ప్రతి నెలా పౌర్ణమిరోజున పున్నమిగరుడసేవ నిర్వహించడం ఆనవాయితీ. ఇందులో భాగంగా పూజాదికార్యక్రమాల తర్వాత సాయంత్రం స్వామివారు ఆలయం ముందున్న వాహనమండపానికి వేంచేపు చేశారు. అక్కడవిశేషఅలంకరణలతో గరుడుడిపై ఆశీనులయ్యారు. రాత్రి 7 గంటలకు గరుడవాహనంపై తిరువీథుల్లో గంటపాటు స్వామివారు విహరించారు. గ్యాలరీల్లోని భక్తులు గోవిందనామస్మరణలతో ఉత్సవర్లకు నీరాజనాలు అర్పించారు. ఈ విశేషకార్యక్రమంలో తిరుమలసంయుక్త కార్యనిర్వహణాధికారి శ్రీ శ్రీనివాసరాజు, ఐ.ఏ.ఎస్., తదితర ఉన్నతాధికారులు పాల్గొన్నారు.

తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి



# సప్తగిరి

(ఆధ్యాత్మిక మాసపత్రిక)

## చందా నమోదు పత్రం

1. పేరు మరియు చిరునామా :
(విడి విడి అక్షరాలలో అర్థమయ్యేలా వ్రాయండి. మరియు పిన్‌కోడ్ తప్పక వ్రాయండి)

(పిన్‌కోడ్ తప్పని సరి)

2. కావలసిన భాష : ☐ తెలుగు ☐ తమిళం ☐ కన్నడం ☐ హింది ☐ ఇంగ్లీషు

3. సంవత్సర/జీవిత చందా : ☐ రూ. 60/- ☐ రూ. 500/-

4. చందా పునరుద్ధరణ :
(అ) చందా నెంబరు :
(ఆ) భాష :

5. చెల్లించిన మొత్తం :
డి.డి.నెం. : తేది :
(చెక్కులు స్వీకరించబడవు)

ప్రదేశం :

తేది : చందాదారుని సంతకం

## మోసపోకండి!

మన రాష్ట్రంలోని కొన్ని నగరాలలో కొందరు వ్యక్తులు అనధికారికంగా **సప్తగిరి మాసపత్రికకు** చందాల రూపంలో అధిక మొత్తాలు వసూలు చేస్తున్నారని, తద్వారా శ్రీవారి దర్శనం చేయిస్తా మని, నమ్మిస్తున్నా రని తెలిసింది. అలాంటివారిమాటలకు మోసపోకండి. సప్తగిరి చందాకు, శ్రీవారి దర్శనానికి మరియు ప్రసాదాలకు ఎటువంటి సంబంధం లేదు. చందా మీరు నేరుగా "ప్రధాన సంపాదకుడు, సప్తగిరి, తి.తి.దేవస్థానం, తిరుపతి" వారికి పంపించాలి. (లేదా) తిరుపతిలోని శ్రీనివాసం యాత్రికుల వసతి సముదాయంలో కూడా మీచందాలను కట్టవచ్చు. సప్తగిరికి చందాలు వసూలు చేయుటకు దేవస్థానం బయటి వ్యక్తులను ఎవరినీ నియమించలేదు.

**అధిక మొత్తాలు చెల్లించకండి! వారి మాటలకు మోసపోకండి!!**

సంప్రదించండి...!
సప్తగిరి చందాల విచారణకు
**0877 - 2264359**
**0877 - 2264543**

- సప్తగిరి సంవత్సరచందా రూ.60/-, జీవితచందా రూ.500/-లు; డి.డి. / ఎం.ఓ. ను **'చీఫ్ ఎడిటర్, 'సప్తగిరి', తి.తి.దే., తిరుపతి'** వారిపేరున తీయాలి.
- సప్తగిరిచందాదారులుగా చేరదలచుకొన్నవారు/ తమచందాను పునరుద్ధరించుకోదలచినవారు ఈ కూపనులో గానీ లేక తెల్లకాగితంలోగానీ పైన పేర్కొన్నవిధంగా వివరాలు వ్రాసి, పంపవచ్చు. క్రింద ప్రచురించిన చిరునామానుమాత్రమే సంప్రదించండి. **తి.తి.దే. ప్రధాన సంపాదక కార్యాలయం, తిరుపతికి తప్ప-మీరు ఎవరిదగ్గర డబ్బులు కట్టి, మోసపోకండి.**
- మనిఆర్డరు పంపువారు అందులోనే మీయొక్క చందావివరాలు వ్రాసి, ఈ క్రిందిచిరునామాకు పంపవలయును.
- మా చిరునామా **"ప్రధానసంపాదకుడు, సప్తగిరి కార్యాలయం, టి.టి.డి.ప్రెస్ కాంపౌండ్, కె.టి.రోడ్డు, తిరుపతి - 517 507".**

Edited and published on behalf of T.T. Devasthanams by **Dr. C. Saila Kumar,** M.A.,Ph.D., Chief Editor, T.T.D. and printed at T.T.D. Press by **V. Sambasiva Rao,** D.P.T., Manager, T.T.D. Press, Tirupati - 517 507.



నగధర నందగోప నరసింహా వో
నగజవరద శ్రీనారసింహ

నరసింహ పరంజ్యోతి నరసింహా వీర
నరసింహ లక్ష్మీనారసింహా
నరసఖ బహుముఖ నారసింహా వో
నరకాంతక జేజే నారసింహా

నమో నమో పుండరీక నారసింహ వో
నమితసురాసుర నారసింహా
నమకచమకహిత నారసింహా వో
నముచిసూదనవంద్య నారసింహా

నవరసాలంకార నారసింహా వో
నవనీతచోర శ్రీనారసింహ
నవగుణి వేంకటనారసింహా వో
నవమూర్తి మండెము నారసింహా (1 - 259)



అన్నమయ్య దృష్టిలో నరసింహస్వామి గోవర్ధనగిరి మోసిన గోపాలుడు, పరంజ్యోతి. మూర్తీభవించిన వీరత్వంగల ఆ లక్ష్మీనారసింహు డంటే, అర్జునుణ్ణి ఆప్తునిగా చేసుకున్న ఆ పార్థసారథియే. నరకాసురుని అంతం చేసిన శ్రీకృష్ణుడే ఆయన అని అన్నమయ్య శ్రీనరసింహస్వామిని కీర్తించాడు.

# మీ మాట

## జ్ఞానాంజనం !

జనవరి 'సప్తగిరి' మాసపత్రిక సకాలంలో సర్వాంగ సుందరంగా మాకు చేరి, మమ్ములను ఆనందపరిచినది. ఇట్టి సప్తగిరిమాసపత్రిక అజ్ఞానాంధులకు జ్ఞానానంజనము వంటిది. ఇది అజ్ఞానమును, జాడ్యాన్నీపోగొట్టునది మాత్రమే కాక సూర్యునివలె అంధకారమం తయూ పోగొట్టి పరిపూర్ణ జ్ఞానప్రకాశమునిచ్చును. కనుక అజ్ఞానాంధకత్వమును పోగొట్టుకు ఒక అద్భుతమైన అంజనము (కాటుక) అని చెప్పుట అతిశయోక్తి లేదు.

*– అద్దంకి మాధవశాస్త్రి, హైదరాబాదు.*

## అక్షరసత్యాలు!

సప్తగిరి సంచికలో ప్రతినెల మీరు అందిస్తున్న సూక్తులు అక్షరసత్యాలు. ఈ సూక్తులను నిత్యజీవితానికి అనుసంధానం చేసుకుంటే మానవజీవితం మహోన్నతదశకు చేరుతుందనడంలో సందేహం లేదు. అదేవిధంగా మాన్యశ్రీ పమిడికాల్వ చెంచుసుబ్బయ్యగారు అందిస్తున్న సమాధానాలు మాకు తెలీని ఎన్నో విషయాలను తెలియజేస్తున్నాయి.

*– ఎం.కవిత, కాకినాడ.*


ఓం శ్రీవేంకటేశాయ నమః

ఫిబ్రవరి 2013 'సప్తగిరి' మాసపత్రిక
రథసప్తమి విశిష్టతగా సూర్యప్రభ
వాహనుపై శ్రీవారు ముఖచిత్రంతో
చాలాబాగుంది. మధ్యపేజిలో
సూర్య అష్టోత్తర నామావళి అపురూపం
శ్రీవారి ఆలయ విశేషాలతో నెలనెలా
వెలువడే సప్తగిరి మాసపత్రిక అంటే
మా ఇంటిల్లిపాదికి చాలా ఇష్టం
తెలుగులో తొలివెలుగులు
ఆధ్యాత్మికా జిలుగులు అందించే
అందాల తిరుమలగిరుల పత్రిక
సప్తగిరి మాసపత్రిక!
సంపాదకవర్గానికి అభినందనలు
–ఎల్. ప్రఫుల్లచంద్ర, ధర్మవరం

**రాబోవుసంచికలో.....**

**ఇటీవల ఉత్తరప్రదేశ్ రాష్ట్రం, అలహాబాద్‌లో జరిగిన మహాకుంభమేళా విశేషాలు, అరుదైన ఛాయాచిత్రాలు మీ కోసం....**

## జూన్ నెలలో తి.తి.దే. ఉత్సవ విశేషాలు

**03 –** శ్రీహనుమజ్జయంతి

**04 –** కార్వేటినగరం, శ్రీవేణుగోపాలస్వామివారి గరుడసేవ

**07 –** కార్వేటినగరం, శ్రీవేణుగోపాలస్వామివారి రథోత్సవం

**10 –** శ్రీపెరియాళ్వార్ల ఉత్సవారంభం

**18 –** అప్పలాయిగుంట శ్రీప్రసన్న వేంకటేశ్వరస్వామి వారిబ్రహ్మోత్సవప్రారంభం

**19 –** తిరుచానూరు శ్రీపద్మావతీతాయార్లప్లవోత్సవ ప్రారంభం.
శ్రీ పెరియాళ్వార్ల శాత్తుమొర

**20 –** తిరుమల శ్రీవారి జ్యేష్ఠాభిషేకప్రారంభం.

**22 –** శ్రీప్రసన్నవేంకటేశ్వరస్వామివారిగరుడోత్సవం, శ్రీవారిజ్యేష్ఠాభిషేకం సమాప్తి.

**23 –** తిరుచానూరు శ్రీపద్మావతీతాయార్లప్లవోత్సవ సమాప్తి.

**25 –** అప్పలాయిగుంట శ్రీప్రసన్నవేంకటేశ్వరస్వామి వారిరథోత్సవం.

**26 –** శ్రీప్రసన్నవేంకటేశ్వరస్వామివారిబ్రహ్మోత్సవ సమాప్తి.

**28 –** తిరుచానూరు శ్రీసుందరరాజస్వామివారి అవతారోత్సవప్రారంభం

**30 –** తిరుచానూరు శ్రీసుందరరాజస్వామివారిఅవతారోత్సవసమాప్తి.

# సప్తగిరి

**తిరుమల తిరుపతి దేవస్థానముల సచిత్ర మాసపత్రిక**

**సంపుటి : 43** **మే, 2013** **సంచిక : 12**




**ముఖచిత్రం : ఉభయదేవేరులతో శ్రీగోవిందరాజస్వామి (తిరుపతి)**

**చివరి పుట : శ్రీపద్మావతీపరిణయం (తిరుమల)**

*ఈ సంచికలోని రచయితల అభిప్రాయాలు వ్యక్తిగతమైనవి.*
*ప్రధానసంపాదకుడు గాని, తిరుమల తిరుపతి దేవస్థానం గాని వాటికి బాధ్యత వహించరు.*

**వేంకటాద్రిసమం స్థానం బ్రహ్మాండే నాస్తి కించన,**
**వేంకటేశసమో దేవో న భూతో న భవిష్యతి.**



**హరియను రెండక్షరములు**
**హరియించును పాతకములు**


గౌరవ సంపాదకుడు :
ఎల్.వి. సుబ్రహ్మణ్యం, ఐ.ఏ.ఎస్.,
కార్యనిర్వహణాధికారి, తి.తి.దేవస్థానములు.

ప్రచురణకర్త-ప్రధాన సంపాదకుడు :
డా॥ సి.శైలకుమార్

సంపాదకుడు : డా॥ కె.రాధారమణ

ఉపసంపాదకుడు : డా॥ కె.రవిచంద్రన్

ముద్రాపకుడు : వి.సాంబశివరావు, డి.పి.టి., మేనేజరు, ముద్రణాలయం, తి.తి.దే.

డి.టి.పి. : ప్రధాన సంపాదకులవారి కార్యాలయం, తి.తి.దే., తిరుపతి

వర్ణచిత్రాల లే-అవుట్ : పి.శివప్రసాద్

***వివరాలకు :***
ప్రధాన సంపాదకుడు,
సప్తగిరి, తి.తి.దేవస్థానములు,
తిరుపతి - 517 507.
ఫోను : 0877-2264543, 2264359

సప్తగిరి మాస పత్రిక

విడి ప్రతి : రూ. 5/-
సం॥ చందా : రూ. 60/-
జీవిత చందా : రూ.500/-
విదేశాలకు సం॥చందా : రూ. 850/-

సంపాదకీయం

# ఏది నిత్యం? ఏది అనిత్యం?

ఎనభైనాలుగులక్షల జీవరాశుల్లో మానవజన్మ దుర్లభమైనది, ఉత్తమోత్తమమైనది. అనేకజన్మల పుణ్యపరిపాకంవల్ల మానవజన్మ లభిస్తుంది. దాన్ని సార్థకం చేసుకోవడమే మానవజన్మలక్ష్యం. అయితే ఈ లక్ష్యాన్ని చేరుకోవడానికి మానవుడు ప్రయాణించాల్సినమార్గం కళ్లెదుటే కన్పిస్తున్నా, విశ్వాసం కలగని కారణంచేత దుర్గమారణ్యంవంటిసంసారంలోకి ప్రవేశించి, పరమార్థాన్ని మరచిపోతున్నాడు. దారి తెలిసినవాడు అడవిని సొంతఇల్లుగా భావిస్తాడు. చేరాల్సినచోటుకు చేరుతాడు. ఈత తెలిసినవాడు బావిని క్రీడామైదానంగా భావిస్తాడు. లోతును లెక్కపెట్టడు. హాయిగా ఆనందంగా, ఆరోగ్యకరంగా ఈది, గట్టుకు చేరుకుంటాడు. ఈ దారి తెలియడం లేదా ఈత తెలియడం లక్ష్యాన్ని చేర్చే ఉపకరణాలు. జీవితంకూడా ఆనందంగా సాగడానికి ఒక ఉపకరణం అవసర మవుతుంది. ఆ ఉపకరణం ధర్మం, సత్యం, భక్తి, విశ్వాసం... ఇలా అనేకరూపాల్లో కన్పిస్తూ ఉంటుంది. ఇవి ఏవైనా లక్ష్యాన్ని చేర్చేవే. మానవుణ్ణి ఓదార్చేవే.

ఈ లక్ష్యాన్ని మానవుడు చేరుకునేలోపు జీవితంలో బాల్యం, యౌవనం, వృద్ధాప్యం అడపాదడపా రోగాలు, అనుక్షణం మృత్యువూ వెంటాడుతూ ఉంటాయి. ఇవి అనివార్యాలు. వీటికి ఔషధా ల్లేవు. మార్గాంతరాలు లేవు. ఏ స్థాయిలోవారైనా వీటిని అంగీకరించాల్సిందే! నెరసినతలకు రంగు పూసుకోవచ్చు. కానీ వృద్ధాప్యాన్ని ఆపలేం కదా! భగవద్గీతలో శ్రీకృష్ణుడు అర్జునునికి అనివార్య మని బోధించిన ఈ సత్యాన్ని విస్మరించినమానవుడు ధనంకోసం, కీర్తికోసం ఆస్తులు, అంతస్తులకోసం వెంపర్లాడుతూ వెంటాడుతున్న మృత్యువునుగూర్చి మర్చిపోతాడు. తాను నెరవేర్చాల్సిన ధర్మాన్ని, సత్యాన్ని విస్మరిస్తాడు. తీరా ధర్మం, సత్యం అనే పదాలు తనచెవిలో దూరి, మెదడులో కూర్చునే సమయానికి తల తెల్లబడి, దంతాల పట్టుసడలి, శరీరం ముడతలు పడి మంచానికి నిత్యబంధువై ఉంటాడు. అప్పుడు వాచా వేదాంతిగా మాత్రమే మిగిలిపోతాడు. ఆచరించలేడు. అట్లని తప్పించుకోలేడు. పరలోకచింత వెంటాడుతూ ఉంటుంది. ఈ అవస్థను అతిక్రమించడంకోసం బాల్యంనుంచే భక్తితో ప్రవర్తించాలి. యౌవనం భగవంతునిదరిచేరే సాధనలకు ఉపయోగపడాలి. సాధ్యమైనంతవరకు సంపదలు దానధర్మాలకు, ఆస్తులు దీనజనసేవకు వినియోగించాలి. అప్పుడు మృత్యువు వెంటాడినా ఓడిపోతుంది. ధర్మాన్ని ఆచరించేవానికి, సత్యాన్ని వ్రతంగా కలిగినవానికి మృత్యువు మోకరిల్లి "నీవు చిరంజీవివి" అని మృత్యువే దీవించి, వెళ్ళిపోతుంది. అలాంటివాళ్లు జీర్ణమైనశరీరాల్ని వదలినా, చెక్కుచెదరని కీర్తికాయంతో జీవిస్తారు. ఈ సత్యాన్ని గ్రహించి మానవుడు జీవితం క్షణికమైన దని, గ్రహించి ఎలాంటి గందరగోళాలకు తావివ్వకుండా భక్తివిశ్వాసాలతో మనుగడ సాగించాలి.

జగన్నాటకసూత్రధారియై సమస్తపాత్రధారులను నడిపిస్తున్న శ్రీనివాసునిపాదపద్మాలపై అచంచల విశ్వాసంతో జీవిస్తూ, ప్రతిమానవుడూ తన జీవితాన్ని ఆవలితీరంకు చేర్చుకోవాలి.

**ఈ మేను మూడునాళ్ల ముచ్చటేరా, మిత్తి వెన్నంటి తిరుగుతుంటె ఎరుగవేరా,**
**అంతలోనే మానవ! ఇంత మారుపేలరా, ఐశ్వర్య దాస్యంబు మానుకోరా!!**

# అన్నమయ్య సంస్కృత సంకీర్తనలు

డా॥ సముద్రాల లక్ష్మణయ్య

2013, మే 24న **అన్నమయ్య జయంతి** సందర్భంగా ఈ వ్యాసాన్ని ప్రచురిస్తున్నాం



సంస్కృతం దేవవాణి. అన్నిభాషలపైనా సంస్కృత ప్రభావం ఏదోవిధంగా ఉండనే ఉంది. సంస్కృత ప్రభావం అంధ్రప్రబంధసాహిత్యానికిమాత్రమే పరిమితం కాలేదు. అన్నమాచార్యాదులైన వాగ్గేయకారులు రచించిన పదసారస్వతంపైగూడా సంస్కృతం తనదివ్యదీప్తిని ప్రసరింప జేసింది.

వాగ్గేయకారశ్రేణిలో ప్రథమగణనీయుడు అన్నమయ్య. ఈయన తాను రచించినపదాలు భగవత్పాదాలకడ సమర్పించిన పూజాకుమా లన్నాడు. తెలుగుపదాలతో పాటు సంస్కృతంలో రచించిన పదాలుగూడా ఈ పూజాపుప్పాలలో ఉన్నాయి.

ఈ సంకీర్తనాచార్యుడు ముప్పదిరెండువేల సంకీర్తనలు రచించా డని ప్రసిద్ధి. కాని అందు మనకు లభించినవి ఇంచుమించు పదునాల్గువేలుమాత్రమే. ఇందులో శతసంఖ్యకు దగ్గరగా లెక్కింపబడిన సంస్కృతసంకీర్తనలుగూడా ఉన్నాయి. అవి విడిగా కాక తెలుగుపాటల మధ్యలోనే ఎడనెడా కనిపిస్తు న్నాయి. బహుశః అన్నమయ్య తెలుగులో పాడినట్లే మధ్యలో తనకు తలపుగల్గి నప్పుడు సంస్కృతంలోగూడా వీటిని పాడి ఉంటా డని భావించవచ్చు. రేకుల లోని సంకీర్తనలలో సంస్కృతసంకీర్తనలు విడిగా గాక, అక్కడక్కడా ఉండడంవల్ల అలా భావించవలసివస్తున్నది.

'సకలవేదములను సంకీర్తనలు' చేసినవాడుగా అన్నమయ్య విఖ్యాతి పొందాడు. వేదాలలో కర్మ–భక్తి–ధ్యాన–జ్ఞానయోగాలు నిరూపితా లయ్యాయి. వాటినే అన్నమయ్య సంకీర్తనరూపంగా ప్రకటింపదలచాడు కాబట్టి సంస్కృతంలో చెప్పినా, తెలుగులో చెప్పినా ఆ వేదార్థాలే మనకు గోచరిస్తాయి.

నవవిధభక్తిమార్గాలలో కీర్తన మొకటి. కీర్తనంలో శ్రవణ–స్మరణాలు గూడా సమన్వితాలైఉంటాయి. కృత యుగంలో ధ్యానంతోనూ, త్రేతాయుగంలో యజ్ఞాలతోనూ, ద్వాపరంలో అర్చనలతోనూ, పొందేఫలం– కలిలో భగవన్నామ కీర్తనతోనే లభిస్తుం దని పెద్దలు బోధించారు.

కలిసంతరణోపనిషత్తులో హరిసంకీర్తనప్రయోజనం ఘనంగా కీర్తింపబడింది. దాన్ని దృష్టిలో పెట్టుకొని అన్నమయ్య ఒక సంస్కృతకీర్తనలో భగవత్కీర్తనప్రాముఖ్యాన్ని ఇలా ప్రశంసిం చాడు.

**ఏవం శ్రుతిమత-మిదమేవ త**
**ద్భావయితు మతః - పరం నాస్తి ॥**

**అతులజన్మభో-గాసక్తానాం**
**హితవైభవసుఖ-మిదమేవ।**
**సతతం శ్రీహరి-సంకీర్తనం త**
**ద్వ్యతిరిక్త సుఖం-వక్తుం నాస్తి ॥**

**బహుళమరణపరి - భవచిత్తానాం**
**ఇహపరసాధన - మిదమేవ ।**
**అహిశయన మనో-హరసేవా త**
**ద్విహరణం వినా - విధిరపి నాస్తి ॥**

**సంసారదురిత - జాడ్యపరాణాం**
**హింసావిరహిత - మిదమేవ ।**
**కంసాంతక వేం - కటగిరిపతేః ప్ర**
**శంసైవా పశ్చాదిహా నాస్తి ॥**

ఇదే వేదమతం, ఇంతకంటే ఏమీ లేదు. హితం చేకూర్చేదీ, ఇహపరసాధనమైనదీ, హింసలేనిదీ భగవంతుని ప్రశంసారూపమైన సంకీర్తనమే అని ఈపాటలో అన్నమయ్య కలిసంతరణోపనిషత్తులోని వేదమతాన్ని ఉద్ఘాటించాడు.

తత్త్వజ్ఞులు అనేకత్వంలో ఏకత్వాన్ని దర్శిస్తారు. 'ఏకంసత్ విప్రా బహుధా వదన్తి' అన్నవేదవచనం ఈ తత్త్వాన్ని నిరూపిస్తున్నది. అన్నమయ్యకు పూర్వులైన పెద్దలుసైతం....

**యం శైవా స్సముపాసతే శివఇతి**
**బ్రహ్మేతి వేదాంతినః**

**బౌద్ధా బుద్ధ ఇతి ప్రమాణపటవః**
**కర్తేతి నైయాయికాః ।**
**అర్హన్నిత్యథ జైనశాసనరతాః**
**కర్మేతి మీమాంసకాః ॥**

**సోఽయం వో విదధాతు వాంఛిత ఫలం**
**త్రైలోక్యనాథో హరిః ॥**

అని ఈ సత్యాన్నే ఉద్ఘాటించారు.

అన్నమయ్యమార్గంకూడా ఇదే! ఆయన వివిధ మతాలకూ సమన్వయం ప్రతిపాదిస్తూ పాడిన ఈ క్రింది సంస్కృతసంకీర్తనం ఇందుకు నిదర్శనం –

**బ్రువంతి బౌద్ధా బుద్ధ ఇతి**
**స్తువంతి భక్తా స్సులభ ఇతి ॥**

**గదంతి కిల సాంఖ్యా స్త్వాం పురుషం**
**పదవాక్యజ్ఞాః పదమితి చ ।**
**విదంతి త్వా వేదాంతిన**
**స్సదా బ్రహ్మలసత్పదమితి చ ॥**

**జపంతి మీమాంసకా స్త్వాంచ**
**విపులకర్మణో విభవ ఇతి ।**
**లపంతి నయ సకలాస్సతతం**
**కృపాళుకర్తా కేవల మితిచ ॥**

**భణంతి వేంకటపతే మునయో**
**హ్యణిమాదిప్రద మతులమితి ।**

**గుణవంతం నిర్గుణం పునరితి**
**గృణంతి సర్వే కేవల మితి చ ॥**

బౌద్ధులు బుద్ధ డనీ, భక్తులు సులభు డనీ, సాంఖ్యులు పురుషు డనీ, పదవాక్యజ్ఞులు పద మనీ, వేదాంతులు బ్రహ్మ మనీ, మీమాంసకులు కర్మ యనీ, తార్కికులు కర్త యనీ, మునులు అణిమాద్యైశ్వర్యప్రదాత అనీ, గుణవంతు డనీ, నిర్గుణు డనీ– ఇలా నానావిధాలుగా ఆయామతానుయాయులు భగవంతుణ్ణి వినుతిస్తున్నా రని భావం.

ఇదిపై 'యం శైవా స్సముపాసతే శివ ఇతి' అన్న శ్లోకంలోని భావాన్ని వివరించేపద్ధతిలో ఉన్నది. తెలుగులో ఉన్న 'ఎంతమాత్రమున నెవ్వరు' అన్న పాటగూడా దీనికి వివరణాత్మకమే!

ఆరువందలసంవత్సరాలకు పూర్వుడైన అన్నమయ్య మతసమన్వయదృష్టి మతకలహాలతో సతమతమయ్యే మనకు నేత్రోన్మీలకం కావాలి.

మధురభక్తిని ప్రతిబింబించే సంకీర్తనలుగూడా కొన్ని సంస్కృతంలో లభిస్తున్నాయి. జీవులందరూ నాయికలుకాగా, దేవు డొక్కడే నాయకు డని మధురభక్తిసంప్రదాయం చెబుతున్నది. జయదేవు డనుసరించిన ఈ సంప్రదాయాన్నే అన్నమయ్య అనుసరించా డని పరిశోధకులఅభిప్రాయం.

రాధామాధవులరహఃకేళిని జయదేవుడు వర్ణించియున్నాడు. ఆ విధానాన్నే అనుసరించినఅన్నమయ్య –

**రాధామాధవరతిచరిత మితి**
**బోధావహం శ్రుతిభూషణమ్ ॥**

**గహనే ద్వావపి గత్వా గత్వా**
**రహసి రతిం ప్రేరయతి సతి ।**
**విహరత స్తదా విలసంతే**
**విహతగృహాశౌ వివశౌ తౌ ॥**

ఈ సంకీర్తనలో పదమూడుచరణా లున్నాయి. సంయోగశృంగారాన్ని వివిధభంగిమలతో వర్ణించేపద మిది. అట్లే వియోగశృంగారాన్ని వర్ణించినసందర్భాలుగూడా అనేక మున్నాయి. అవి దేవునివియోగం సహించలేని జీవుని విన్నపాలు.

**దశవిధాచరణం త న్న భవతి**
**దశవిధావస్థాంతే తత్ర ॥**

అన్న పదునొకండు చరణాలు గల మరొకసంస్కృత సంకీర్తనలో చమత్కారధోరణిలో అన్నమయ్య దశావతారాలను వర్ణించియున్నాడు.

భగవంతునిగుణాలనూ, కర్మలనూ, నామాలనూ కీర్తిస్తే పాపపరిహార మవుతుం దని భాగవతంలోని అజామిళో పాఖ్యానంలో పేర్కొన్నబడిఉన్నది.

సంకీర్తనవాఙ్మయమంతా, అది ఏ భాషలో ఉన్నా, భగవద్గుణకర్మనామకీర్తనపరంగానే ఉంటుంది. రామావతారవైభ వాన్ని అన్నమయ్య ఇలా సంస్కృతంలో కీర్తించాడు –

**దేవదేవం భజే-దివ్యప్రభావం**
**రావణాసురవైరి - రఘుపుంగవమ్ ॥**

**రాజవరశేఖరం - రవికులసుధాకరం**
**ఆజానుబాహు నీ - లాభ్రకాయమ్,**
**రాజారికోదండ - రాజదీక్షాగురుం**
**రాజీవలోచనం - రామచంద్రమ్ ॥**

అట్లే 'రాజీవనేత్రాయ రాఘవాయ నమో' వంటి కీర్తనలు చతుర్థీవిభక్త్యంతాలుగా ఉండగా, 'దేవదేవం భజే' వంటివి ద్వితీయావిభక్త్యంతాలుగా ఉన్నాయి.

'నారాయణ తే నమో నమో' అన్న కీర్తనలో సంబోధన ప్రథమావిభక్త్యంతాలుగా భగవన్నామాలు పేర్కొనడమయింది. 'కరుణానిధిం గదాధరం', 'నమో నారాయణాయ నమః' ఇత్యాది కీర్తనలలోని ఆయా విభక్తులనుగూడా గమనించవచ్చు.

భగవంతుడు నమస్కారప్రియుడు. 'నమః పురస్తా దథపృష్ఠత స్తే నమోఽస్తు తే సర్వతఏవ సర్వ!' అని గీతలో పార్థుడు అనేకపర్యాయాలు భగవంతునికి నమస్కరించడం జరి గింది. భక్తిమార్గంలో ఇది తప్పదు. అన్నమయ్య సంస్కృత కీర్తనల్లో ఇట్టి ప్రయోగాలు విరివిగా చేశాడు.

భక్తిప్రపత్తులలో భక్తికంటే ప్రపత్తి సులభోపాయం. గీత చరమశ్లోకంలో శరణాగతి కర్తవ్య మని భగవంతుడే చెప్పినాడు.

**సర్వధర్మాన్ పరిత్యజ్య మా మేకం శరణం వ్రజ ।**
**అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః ॥**

సమస్తధర్మాలూ వదలి, భగవంతునిచరణసరోజాలను శరణ్యంగా ఆశ్రయిస్తే – పాపవిముక్తి కల్గుతుంది. ఈ భావాన్నే అన్నమయ్య –

**తథాకురుష్వ ముదా మద్వైవ**
**అధోక్షజ తే అనుదాసోఽ హమ్ ॥**

**వ్రజామి శరణం వరద తవాహం**
**త్యజ తానుబంధధర్మం మామ్ ।**
**భుజకృతాం (?) పురా ప్రతిజ్ఞాం**
**వృజినై ర్మోక్షయిష్యామీతి ॥**

అనే సంకీర్తనలో నిబంధించాడు.

'శరణు శరణు దేవ సర్వపోషక' ఇత్యాదికీర్తనల్లో 'శరణం' అనడానికి బదులు 'శరణు' అని దేశ్యప్రయోగం చేశాడు. తక్కిన పదమంతా సంస్కృతభాషామయమే.

కేవలసంబోధనాంతాలయినకీర్తనలు తెలుగు సంకీర్తనలుగాకూడా పరిగణనలోకి వస్తాయి. 'దశరథరామ!' అంటే అది సంస్కృతాంధ్రాలు ఉభయభాషల్లోనూ ఏకరూపం గానే ఉంటుంది.

కాని 'దశరథరామా!' అని దీర్ఘాంతంగా ఉంటే అది తెలుగుసంకీర్తనగా అవుతుంది. హ్రస్వాంతపదాన్ని గాయకులు రాగాలాపనకై దీర్ఘాంతంగాగూడా ఉచ్చరించడం కద్దు.

తెలుగులోలాగానే సంస్కృతంలోకూడా సంకీర్తనా చార్యుడు భక్తినీ, వివిధమతసమన్వయాన్నీ, మధురభక్తినీ, శరణాగతినీ నిరూపిస్తూ జానపదధోరణిలో గానయోగ్యమయ్యే టట్లు పదరచన చేశాడు.

సంస్కృతంలో పాణినివ్యాకరణవిరుద్ధమైన ప్రయో గాలుగూడా అన్నమయ్యకీర్తనల్లో కనిపిస్తాయి. తెలుగులో ఆనాటి వ్యావహారికం ఆయనకు ప్రయోగయోగ్యమైనట్లే సంస్కృతంలో గూడా స్వతంత్రంగా పదప్రయోగం చేసి, తన విశిష్టతను ఆయన నిరూపించుకొన్నాడు.

# తరిగొండ వెంగమాంబ

ఆచార్య పి. కుసుమకుమారి

ఆమె పాటంటే ఏడుకొండలవాడికి పరమప్రియం. ఆమె ఇంటికి వెళ్లి అడిగి మరీపాడించుకొని, ఆ పాటకు అనుగుణంగా ఆడేవా రాయన. ఆమె కర్పూరహారతి ఇవ్వకుంటే గోవిందుడికి నిద్రరాదు. హారతి ఇవ్వకుండా పూజారులు ఆమెను అడ్డుకుంటే రథోత్సవాన్నే ఆపేశారు స్వామి. అంతటి పరమభక్తు రాలు, యోగిని, బహుగ్రంథరచయిత్రి తెలుగు మీరాబాయి–తరిగొండవెంగమాంబ.

## భక్తితన్మయ... గానపారవశ్యం!

చిత్తూరుజిల్లా వాయల్పాడు సమీపంలోని తరిగొండలో కృష్ణ యార్యుడు, మంగమాంబ దంపతు లకు వేంకటేశ్వరుని అనుగ్రహప్రసా దంగా 1730 ప్రాంతంలో వెంగమ్మ జన్మించింది. కృష్ణయార్యుడు నృసింహ సాలగ్రామాన్ని ఇలువేల్పుగా ఆరాధించే వాడు. భక్తికి నిలయమైన ఆ ఇంట వెంగమ్మకు సహజభక్తి అలవడింది. అదే పనిగా భగవద్ధ్యానంలో మునిగితేలుతున్న వెంకమ్మను చూచి, తల్లిదండ్రులు కలవర పడ్డారు. పెళ్లయితే కాస్త దారికొస్తుం దని భావించిన ఆమెతల్లి దండ్రులు చిత్తూరుసమీపంలోని నారగుంటపాళెంకు చెందిన వేంకటాచలపతితో వివాహం నిశ్చయిస్తారు. తిరుమల వేంకటేశ్వ రుడే నా భర్త... నాకు పెళ్లి అవసరం లే దని వెంగమ్మ తేల్చి చెబుతుంది. కొంత ఒత్తిడి చేసి ఆమెకు వివాహం జరిపిస్తారు. నన్ను సహచరిగా కాక, దైవభక్తురాలిగా మన్నించమని భర్తను కోరుతుంది వెంకమ్మ. ఆ తరువాత కొంతకాలానికి వెంగమ్మ భర్త అకాలమరణానికి గురౌతాడు. అటుపైన మదనపల్లికి చెందిన సుబ్రహ్మణ్యయోగివద్ద ఆమె వేదాంతం నేర్చుకుంటుంది. భక్తితత్త్వాన్ని, యోగశాస్త్రరహస్యాలను ఆకళింపు చేసుకుంటుంది.

## తలలు బోడులైన తలపులు బోడులా?

భర్తపోయినా మాంగల్యచిహ్నాలను తీసేందుకు ఆమె అంగీకరించదు. "సర్వేశ్వరుడైన వేంకటేశ్వరుడు నా భర్త అయి నప్పుడు నాకు వైధవ్యం ఎలా వస్తుం"దని ఆమె ప్రశ్నిస్తుంది. ఊళ్లోవారు ఆమెతో వాదించి నెగ్గలేక, పుష్పగిరి శంకరాచార్యుల వారిని రప్పిస్తారు. 'వైధవ్యనియమాలను ఎందుకు పాటించడం లే'దని ఆయన వెంగమ్మను ప్రశ్నిస్తారు.' శిరోముండనం చేసు కోవడం ఎలా పతివ్రతాధర్మం అవుతుం దని ఆమె ఎదురు ప్రశ్నవేస్తుంది. 'తలలు బోడులైనంతమాత్రాన తలపులు బోడు లగునా?' అని నిలదీస్తుంది. 'స్వామినైన నాకు నమస్కారం కూడా చేయలేదే' అని ఆయన ప్రశ్నిస్తారు. మీరు లేచి ప్రక్కకు జరిగితే మీ పీఠానికి నమ స్కారం చేస్తా నంటుంది వెంగమాంబ. ఆమె నమస్కరించగానే ఆ పీఠం భస్మమైపోతుంది. ఈ పరిణామంతో పీఠాధిపతి ఆమెను గొప్పభక్తు రాలిగా గుర్తిస్తారు.

## తిరుమలకు ప్రయాణం

శ్రీవేంకటేశ్వరుడు తిరుమలకు రమ్మని ఆజ్ఞాపించినట్లుగా వెంగమాంబ అనుభూతిని పొందుతుంది. తిరుమలకు చేరుకుంటుంది. ఆమె గొప్పయోగిని, భక్తురా లని తెలుసుకున్న శ్రీవారిసంకీర్తనాచార్యపదవిలో ఉన్న తాళ్లపాక పెదతిరుమలాచార్యులవంశీయులు ఆమెకు ఉత్తరమాడవీధి లోని వారిఇంటిసమీపంలో చిన్నభాగంలో వసతి ఏర్పాటు చేస్తారు. ఆ ఇంటికి సమీపంలో ఉన్న స్థలంలో తులసీవనాన్ని పెంచి, నిరంతరం ఆ తోటలో స్వామిధ్యానంలో గడిపేది. నేటికీ తిరుమలలో ఆవనం ఉంది. దానికి వెంగమాంబ బృందావన మనీ, తరిగణమ్మ (తరిగొండమ్మ తోట) అనీ పేరు.

## వెంగమ్మకు అవమానం... కదలనిరథం

తిరుమలలో ఉన్న సమయంలో వెంగమాంబ తన భక్తి శక్తితో అనేకమహిమలు ప్రదర్శించింది. నిత్యం వెంగమాంబ

**2013, మే 24న**
**తరిగొండవెంగమాంబ జయంతి**
**సందర్భంగా... ఈ వ్యాసం**

స్వామికి స్వయంగా హారతి ఇవ్వడం కొందరు పూజారులకు కంటగింపుగా ఉంటుంది. ఓ రోజు హారతిస్తున్న సమయంలో ఆమెను వారు నానాదుర్భాషలాడతారు. వారిని బాధించడం ఎందుకులే - అని ఆమె మరురోజు ఆలయానికి రాదు. ఆ రోజు రథోత్సవం జరుగుతుండగా రథం వెంగమాంబఇంటి ముందుకు వచ్చి ఆగిపోతుంది. ఎంతకూ కదలదు. వెంగ మాంబను నిందించడం, స్వామికి ఆమెహారతి ఇవ్వకపోవడం వల్లే ఇదంతా జరిగిం దని గ్రహించినవిప్రులు చెంపలువేసు కొని, ఆమెచేత హారతి ఇప్పించాకే రథం కదిలింది. ఆమెభక్తి అనంతం అనేందుకు ఇదే ఉదాహరణ.

**ముత్యాలహారతి**

వెంగమాంబ తిరుమల చేరిననాటినుంచి ప్రతిరోజూ సాయంకాలం స్వామివారికి కైంకర్యం ముగిసి, ఏకాంతసేవ చేసే సమయానికి ఆలయానికి చేరుకొనేది. స్వామికి స్వయంగా కర్పూరహారతి ఇచ్చేది. దీనికే 'ముత్యాలహారతి' లేదా 'తరిగొండవారిహారతి' అని పేరు. అప్పుడు మొదలైన ఈ సంప్రదాయం తిరుమలలో నేటికీ కొనసాగుతున్నది.

**భక్తివేదాంతశిఖరం**

ఇలువేల్పు అయిన తరిగొండనృసింహస్వామి, ఇష్టదైవమైన వేంకటేశ్వరుడు, కులదేవతమైన చౌడేశ్వరిపై ఆమె పలు రచనలు చేసింది. శివకేశవులు ఒక్కరే - అని ప్రబోధించింది. తరిగొండనృసింహశతకం, నృసింహవిలాసం మొదలు తొమ్మిది యక్షగానాలను, ఆరు ఆధ్యాత్మికనాటకాలను, ఇతరకావ్యాలను ఆమె అనితరసాధ్యంగా రచించింది. ఆమె రచించిన వేంకటాచల మాహాత్మ్యం నేటికీ భక్తులకు తారకమంత్రమైంది. వేదాంత, భక్తిరహస్యాలను అతిసరళంగా చెప్పిన ప్రజ్ఞావంతురా లామె! ఆమెను ఎవరు ఎన్ని విధాలా అవమానపరచినా, పల్లెత్తుమాట అనేదికాదు. నిరంతరం భక్తి భావంతో, ధ్యానంలో ఉండేది. భగవంతుని ఆరాధించేందుకు భక్తికావాలి కానీ, బాహ్యమైన ఆచారాలు, కట్టుబాట్లు, సాధనాలు కావనేందుకు తరిగొండవెంగ మాంబజీవితం నిదర్శనం.



## తిరుమలలో.... ఆర్జితసేవలు పొందడమెలా?

అఖిలాండకోటి బ్రహ్మాండనాయకుడైన తిరుమల శ్రీవారిదర్శనం కోటిజన్మల పుణ్యఫలం. స్వామివారికి దిన వార సేవలు, విశేష పర్వదినాల్లో సేవలు జరుగుతాయి. ఈ సేవలను భక్తులు పొందడమెలాగో ఇక్కడ వివరిస్తున్నాము.

శ్రీవారి నిత్యసేవలైన సుప్రభాతం, తోమాల, సహస్రనామార్చన, కల్యాణోత్సవం, ఆర్జితబ్రహ్మోత్సవం, డోలోత్సవం, వసంతోత్సవం, సహస్రదీపాలంకరణ, ఏకాంత సేవవంటి ఆర్జితసేవలకు 90 రోజుల ముందుగా రిజర్వేషన్ చేసుకోవాలి. వీటిని పొందుటకు నిర్ణీతరుసుమును ఇంటర్నెట్ ద్వారాగానీ, "**కార్యనిర్వహణాధికారి, తి.తి.దే., తిరుమల**" పేరిట డి.డి. తీసి, తిరుమలలోని ఆర్జితంకార్యాలయానికి పంపి గానీ సేవాటిక్కెట్లను పొందవచ్చును.

దేశంలోని వివిధప్రాంతాల్లో గల ఈ-దర్శన్ కౌంటర్లలో నిర్ణీత సేవాటిక్కెట్లను తగిన రుసుము చెల్లించి భక్తులు పొందవచ్చు.

తిరుమలలోని విజయబ్యాంకులో సేవకు ఒకరోజు ముందు పేర్లు నమోదు చేసుకున్నవారిని లక్కీడిప్ ద్వారా నిర్ణీతఆర్జితసేవలకు ఎంపిక చేస్తారు.

**ఇతర వివరాల కోసం ఆర్జితం కంప్యూటర్స్ : 0877- 2263679, 2263589, 2263277**
**కాల్ సెంటర్ : 0877-2233333, 2277777 నంబర్లను సంప్రదించగలరు.**

# తిరుమల శ్రీవారి దర్శనం పొందడ మెలా?

**అఖిలాండకోటి బ్రహ్మాండనాయకుడైన తిరుమల శ్రీవారిదర్శనం కోటిజన్మల పుణ్యఫలం. తిరుమలతిరుపతి దేవస్థానం ఆరురకాలుగా భక్తులకు శ్రీవారిదర్శనం కల్పిస్తూంది.**

**1) ఉచిత దర్శనం(వైకుంఠం క్యూ కాంప్లెక్సులు 1& 2) :**

తిరుమలలోని వైకుంఠం క్యూకాంప్లెక్స్-1 మరియు వైకుంఠం క్యూకాంప్లెక్స్-2 ద్వారా తిరుమలతిరుపతి దేవ స్థానం భక్తులకు ఉచితంగా శ్రీవారిదర్శనం కల్పిస్తూంది. ఈ రెండు క్యూకాంప్లెక్సుల్లో కలిపి 32 వేచిఉండే గదు లున్నాయి. ఒక్కోగదిలో 500 మందిభక్తులు కూర్చునేసదుపాయం ఉంది. ఈ రెండు కాంప్లెక్సుల్లో నిరంతరం ఏసి సదుపాయం ఉంటుంది. ఇక్కడ ఉచితవైద్యశాల, ఉచిత ఫోన్ వసతి అందుబాటులో ఉన్నాయి. చిన్నపిల్లలకు పాలు, పెద్దలకు ఆహారం ఉచితంగా అందిస్తారు. శ్రీవేంకటేశ్వరభక్తిఛానల్ ద్వారా ఆధ్యాత్మికకార్యక్రమాలు, భక్తిసంగీతం ప్రసారం చేస్తారు. భక్తులకు ఏదైనా అనారోగ్యసమస్య తలెత్తినప్పుడు ప్రథమచికిత్స అందించేందుకు, అత్యవసరపరిస్థితుల్లో ఆస్పత్రికి తరలించేందుకు 5 అంబులెన్సులు నిరంతరం అందుబాటులో ఉంటాయి.

**ఫొటోమెట్రిక్ సిస్టమ్-** క్యూ కాంప్లెక్సుల్లో భక్తులు ఎక్కువ సేపు వేచి ఉండే అవసరం లేకుండా తిరుమల తిరుపతిదేవ స్థానం ఫొటోమెట్రిక్ సిస్టమ్‌ను ప్రవేశపెట్టింది. ఈ విధానం ద్వారా భక్తుల ఫొటోలు తీసుకుని బార్‌కోడింగ్ టిక్కెట్లు మంజూరు చేస్తారు. భక్తులు వీటిని పొంది, తిరుమలలోని దర్శనీయప్రాంతాలను తిలకించవచ్చు. నిర్ణీతసమయానికి తిరిగి క్యూ కాంప్లెక్సుల్లోకి ప్రవేశించవచ్చు. అలాగే భక్తులు ఎక్కువసేపు వేచి ఉండే అవసరం లేకుండా సుదర్శనం టోకెన్లద్వారా తితిదే దర్శనం కల్పిస్తోంది. ఉచితదర్శనం భక్తులకు ఒక్కొక్కరికి రూ.10/- చొప్పున రెండులడ్డూలను తి.తి.దే. అందిస్తూంది.

**2) ప్రత్యేక ప్రవేశ దర్శనం :**

రూ.300/- టికెట్ గల భక్తులను వైకుంఠం క్యూ కాంప్లెక్స్-1 మార్గంద్వారా శ్రీవారిదర్శనానికి అనుమతి స్తారు. వీరికి ఉచితంగా రెండులడ్డూలను అందజేస్తారు.

**3) సుపథం :**

ఆర్జితసేవాటికెట్లు, అంగప్రదక్షిణటిక్కెట్లు గల భక్తులు, చిన్నపిల్లల తల్లిదండ్రులను ఈ మార్గంగుండా శ్రీవారిదర్శనానికి అనుమతిస్తారు. చిన్నపిల్లల తల్లిదండ్రులకు రూ.10/- చొప్పున రెండులడ్డూలు అందజేస్తారు.

**4) ఈ-దర్శన్ రూ.50/- ప్రవేశం :**

దేశవ్యాప్తంగాగల ఈ-దర్శన్ కౌంటర్లలో రూ.50/- చెల్లించి, దర్శన టిక్కెట్‌బుక్ చేసుకున్నభక్తులను వైకుంఠం క్యూ కాంప్లెక్స్-1 ద్వారా శ్రీవారిదర్శనానికి అనుమతిస్తారు.

**5) దివ్యదర్శనం :**

అలిపిరి, శ్రీవారిమెట్టు నడకమార్గాల ద్వారా కాలి నడకన వచ్చేభక్తులను దివ్యదర్శనం ప్రవేశమార్గంగుండా ఉచితంగా శ్రీవారిదర్శనానికి అనుమతిస్తారు. వీరికి ఒక్కొక్కరికి రూ.10/- చొప్పున రెండులడ్డూలను అంద జేస్తారు.

**6) మహాద్వార ప్రవేశం :**

వికలాంగులకు వయస్సుతో నిమిత్తం లేకుండానూ, వృద్ధులైతే 70 ఏండ్లు దాటినవాళ్లనూ-

ఉదయం 10.00 గంటలకు,<br>
మధ్నాహ్నం 3.00 గంటలకు,<br>
రాత్రి 10.00 గంటలకు

శ్రీవారి ఆలయం ముందు గల గేటుద్వారా తిరుమల తిరుపతి దేవస్థానం మహాద్వారప్రవేశంతో దర్శనం కల్గిస్తూంది. ఇలాంటి వాళ్ళూ ఒకటిన్నరగంట ముందుగా వాళ్లకు కేటాయించిన ప్రదేశంలో ఉండాలి.

గుర్తింపుపత్రం, వయస్సునిర్ధారణపత్రం, అధికారులకు చూపించాల్సి ఉంటుంది. వికలాంగులకు తోడుగా ఒకర్ని సహాయకులుగా అనుమతిస్తారు. 80 ఏండ్లు దాటిన వారికీ ఒకర్ని తోడుగా అనుమతిస్తారు.

**ఇతర వివరాల కోసం వైకుంఠం క్యూ కాంప్లెక్స్ కార్యాలయం : 0877- 2263758, కాల్ సెంటర్ : 0877-2233333, 2277777 నంబర్లను సంప్రదించగలరు.**

**రథభేదాలు**

కౌటిల్యుడు తన అర్థశాస్త్రంలో ఆరు విధాలైన రథాలను పేర్కొన్నాడు. 1)దేవరథం 2)పుష్పరథం 3)సాంగ్రామికరథం (జైత్రరథం) 4)పార్యాణికరథం 5)పరపురాభియానం 6)వైనయిక రథం. దేవరథాన్ని దేవయాత్రలకు, పుష్పరథాన్ని మంగళయాత్ర లకు, సాంగ్రామికరథాన్ని యుద్ధాలకు, పార్యాణిక రథాలను పరిభ్రమణానికి, పరపురాభియానాన్ని శత్రుదుర్గవిధ్వంసనాది కార్యాలకు, వైనయికరథాన్ని అశ్వశిక్షణకు ఉపయోగిస్తారు.

**దేవరథ పుష్పరథ సాంగ్రామిక పార్యాణిక**
**పరపురాభియానిక వైనయికాంశ్చ తాన్ కారయేత్ ।**
**- కౌటిల్యుని అర్థశాస్త్రం.2-38.**

ప్రమాణాన్నిబట్టి రథాలు ఏడువిధాలు. దశపురుష ప్రమాణం ఎత్తు, ద్వాదశపురుషప్రమాణం వెడల్పు గల రథం శ్రేష్ఠమైనది. తక్కిన ఆరురథాల ఎత్తులో మార్పు ఉండదు. కాని, వెడల్పులో ద్వాదశపురుషప్రమాణంనుండి షట్పురుష ప్రమాణం వరకు ఒక్కొక్క పురుషప్రమాణం తగ్గుతుంది. పురుష ప్రమాణ మనగా 96 అంగుళాలు. రథాధ్యక్షుడు ఈ కొలతల ప్రకారం రథాలను నిర్మించాలి. రథాధ్యక్షుడు రథకారుడై ఉండాలి. నూతనరథనిర్మాణం, జీర్ణరథాలను సరిచేయడం వాని పని. దీనినిబట్టి వేదకాలంలో ప్రసిద్ధిచెందిన రథశిల్పం మహా భారతకాలంనాటికి చాలా అభివృద్ధి చెందినట్లు తెలుస్తున్నది. కురుక్షేత్రసంగ్రామంలో ఉపయోగించబడినరథాలే ఇందుకు తార్కాణం.

**నమ స్తక్షభ్యో రథకారేభ్యశ్చ వో నమః - రుద్రనమకం.**

**కశ్యపప్రజాపతి**

ఋభువుల తర్వాత చెప్పదగిన మహాశిల్పి కశ్యప ప్రజాపతి. కాశ్యపశిల్పాన్నిగురించి తైత్తిరీయబ్రాహ్మణం ఇలా చెబుతున్నది–

'ఓ కశ్యపప్రజాపతీ! నీ శిల్పం కాంతిమంతం, శక్తి సంపన్నం, సంపూర్ణమై చిత్రవిచిత్రాలుగా ప్రకాశిస్తుంది. ఈ శిల్పంలో ఏడుగురుసూర్యులు నిలిచి ఉన్నారు. అటువంటి నీ శిల్పంలో ఈ రాజుకు ఆశ్రయ మివ్వు.'

**య త్తే శిల్పం కశ్యప! రోచనావత్**
**ఇంద్రియావత్ పుష్కలశ్చిత్రభాను ।**
**యస్మింస్సూర్యా అర్పితా స్సప్తసాకం**
**తస్మి న్రాజాన మధివిశ్రయేమమ్ ॥**
**- తైత్తిరీయ బ్రాహ్మణం. అష్టకం2. ప్రపాఠకం7.51.**

కశ్యపశిల్పంచే ప్రభావితమైనందువల్లనే భూమికి 'కాశ్యపి' అనే పేరువచ్చింది. రాజ్యాభిషేకసమయంలో కిరీట ధారణ చేయిస్తూ, రాజు వర్చస్వి కావా లని కోరుతూ తైత్తిరీయ బ్రాహ్మణంలోని ఈ క్రిందిమంత్రాన్ని పఠిస్తారు –

**యేభి శ్శిల్పైః పప్రధానా మదృగ్ంహత్**
**యేభి ర్ద్యా మభ్యపిగ్ంశ త్ప్రజాపతిః ।**
**యేభి ర్వాచం విశ్వరూపాగ్ం సమవ్యయత్**
**తేనేమ మగ్న ఇహ వర్చసా సమఙ్ధి ॥**
**- తైత్తిరీయ బ్రాహ్మణం. 2-7-50.**

'ఓ అగ్నీ! కశ్యపప్రజాపతి ఏ శిల్పకౌశలంతో భూమిని నదీనదసముద్రపర్వతారణ్యాలతో బలమైనదానినిగా చేశాడో, ఏ కర్మకౌశలంచేత ఆకాశాన్ని నక్షత్రతారాగ్రహమండితంగా చేశాడో, ఏ కళానైపుణ్యంతో వాక్కును బహుళార్థాలంకారగుణ శోభితంగా చేశాడో, అటువంటి కళాకౌశలంతో ఈ రాజును ఈ లోకంలో వర్చస్సమృద్ధి గలవానినిగా చెయ్యి!' అని పై మంత్రార్థం.

**అశ్వినీదేవతలు**

అశ్వినీదేవతలు దేవవైద్యులుగానే కాకుండ గొప్ప శిల్పులుగా కూడా ఋగ్వేదంలో దర్శనమిస్తారు. వారు 'విశ్పల' అనే ఆమెకు యుద్ధంలో కాలు తెగిపోగా వేరే కాలిని తయారు చేసి, అమర్చినట్టు ఈ క్రింది ఋక్కు తెలియజేస్తున్నది.

**చరిత్రం హి వేరివాచ్ఛేది పర్ణ-**
**మాజా ఖేలస్య పరితక్మ్యాయామ్ ।**
**సద్యో జఙ్ఘామాయసీం విశ్పలాయై**
**ధనే హితే సర్తవే ప్రత్యధత్తమ్ ॥ - ఋ.1.116.15.**

పూర్వం ఖేలు డనే రాజు ఉండేవాడు. అతని బంధువైన 'విశ్పల' అనే ఆమెకాలు యుద్ధంలో తెగిపోయింది. ఖేలుని పురోహితుడైన అగస్త్యుడు ఆమెకు చికిత్స చేయమని అశ్వినీ దేవతలను ప్రార్థించాడు. వా రొకరాత్రివేళ వచ్చి, ఆమెకు శస్త్ర చికిత్స చేసి, ఇనుపకాలును అమర్చారు. ఆమె ఆ రాత్రే ఏదో ముఖ్యమైన పనిని నిర్వర్తించవలసి ఉండడంవలన ఆమెకు అత్య వసరచికిత్స చేసి, వెంటనే కాలిని అమర్చా రని, ఆమె వెంటనే ఆ కాలితో నడువగలిగిం దని ఈ మంత్రం చెబుతున్నది. దీనిని బట్టి అశ్వినీదేవతల వైద్య-శిల్ప ప్రతిభ వ్యక్తమవుతున్నది.

అశ్వినీదేవతలు వృద్ధుడైన చ్యవనమహర్షిని తమ వైద్యంతో యువకుని చేసినట్లు ఈ క్రింది మంత్రం చెబుతున్నది-

**యువం చ్యవాన మశ్వినా జరన్తం ।**
**పునర్యువానం చక్రథుః శచీభిః ॥ ఋ.1.117.13.**

అశ్వినీదేవతలు త్వష్టృదేవుని అల్లుడైన వివస్వంతుని పుత్రులు కాబట్టి వారి కిటువంటిదివ్యశక్తులు ఉండడంలో ఆశ్చర్యమేమీ లేదు.

ఇంద్రుడు అథర్వునికుమారుడైన దధీచికి 'ప్రవర్గ్య విద్య'ను (మధువిద్యను) ఉపదేశించి, ఆ విద్యను ఇతరులకు ఉపదేశించరా దని, అలా చేస్తే అతనితలను నరికివేస్తా నని చెప్పాడు. అశ్వినీదేవతలు దధీచినుండి ఆ విద్యను ఉపదేశం పొందా లనుకున్నారు. అందుకోసం వారు దధీచిశిరస్సును నరికి ఒకచోట భద్రంగా ఉంచి, ఒక గుర్రంతలను తెచ్చి, దధీచి మెడ పైన అతికించారు. ఆ తరువాత వారికి దధీచిమహర్షి గుర్రం తలతో ఋగ్యజుస్సామరూపమైన ప్రవర్గ్యవిద్యను, మధువిద్యా ప్రతిపాదకమైన బ్రాహ్మణాన్ని ఉపదేశించాడు. ఈ విషయం తెలిసిన ఇంద్రుడు తన వజ్రాయుధంతో దధీచిశిరస్సును ఖండిం చాడు. అప్పుడు అశ్వినీదేవతలు తాము భద్రపరచిన దధీచి మహర్షి తలను తెచ్చి, ఆయన కమర్చారు. ఈ విషయమే ఈ క్రిందిమంత్రంలో ఇలా ప్రస్తావించబడింది-

'మీరు దధీచికి గుర్రపుతలను అతికించి, అతనినుండి మధువిద్యను పొంది, మరల ఆయనతలనే ఆయన కమర్చి జగదాశ్చర్యకరమైన, ఎవరికీ సాధ్యంకాని దుష్కరమైన కార్యాన్ని చేశారు కదా!'

**తద్వాం నరా సనయే దంస ఉగ్ర-**
**మావిష్కృణోమి తన్యతుర్న వృష్టిమ్ ।**
**దధ్యఙ్ హయన్మధ్వాథర్వణో వా -**
**మశ్వస్య శీర్ష్ణా ప్రయదీ మువాచ - ఋ.1.116.12.**

అశ్వినీదేవతలశిల్ప - వైద్యసామర్థ్యాలను మరొక మంత్రంకూడా తెలియజేస్తున్నది.

ఓ అశ్వినీదేవతలారా! మీరు అథర్వుణునికుమారుడైన దధీచిమహర్షికి, అతనిశిరస్సును తొలగించి గుర్రపుతలను అమర్చారు. అప్పుడు దధీచిమహర్షి అశ్వశిరస్సుతో మీరిద్దరికి ప్రవర్గ్యవిద్యను, త్వష్టనుండి సంక్రమించిన మధువిద్యను ఉపదే శించాడు.

**ఆథర్వణా యాశ్వినా దధీచేऽశ్వ్యం**
**శిరః ప్రత్యైరయతమ్ ।**
**స వాం మధు ప్రవోచదృతాయ-**
**న్త్వాష్ట్రం యద్దస్రావపికక్ష్యం వామ్ ॥ -ఋ.1.117.22 .**

అశ్వినీదేవతలు శిల్ప-వైద్యవిద్యాదక్షులే కాక బ్రహ్మ విద్యోపదేశగురుపరంపరలోకూడా ప్రసిద్ధి చెందారు. అశ్వినీ దేవతలు 'వధ్రిమతి' అనే ఆమెకు హిరణ్యహస్తు డనేపుత్రుని ప్రసాదించారు. అలాగే 'శ్రావు'డనే ఋషిని రాక్షసులు మూడు ముక్కలుగా ఖండించగా వీరు ఆ ముక్కలను అతికించి, ఆ ఋషిని బ్రతికించారు. దీనినిబట్టి అశ్వినీదేవతలకు తెగిన అవ యవాలను అతికించే ప్రతిభే కాకుండ ముక్కలుగా ఖండించిన వాటినికూడా అతికించే సామర్థ్యం ఉన్నట్లు తెలుస్తున్నది. అశ్వినీ దేవతలు ఇంకా ఇటువంటి అనేకఘనకార్యాలు చేసినట్లు వేదం తెలియజేస్తున్నది.

**హిరణ్యహస్త మశ్వినా రరాణా**
**పుత్రం నరా వధ్రిమత్యా అదత్తమ్ ।**
**త్రిధా హ శ్యావమశ్వినా వికస్త -**
**ముజ్జీవస ఐరయతం సుదానూ॥ - ఋ.1.117.24.**

అశ్వినీదేవతలు అధిరోహించేరథం ముగ్గురుసారథులు కూర్చొనటానికి వీలుగా మూడుచక్రాలతో విరాజిల్లుతున్న దని, అటువంటిరథంపై విచ్చేసి, మాగోవులను సమృద్ధిగా పాలిచ్చే వానినిగాను, మాగుర్రాలు సంతోషంగా ఉండేటట్లు గాను చేసి మాకు వీరులైన పుత్రులను ప్రసాదించ మని కక్షీవంతు డనే ఋషి ఇలా ప్రార్థించాడు-

**త్రివన్ధురేణ త్రివృతా రథేన**
**త్రిచక్రేణ సువృతా యాతమర్వాక్ ।**
**పిన్వతం గా జిన్వతమర్వతో నో**
**వర్ధయత మశ్వినా వీరమస్మే॥ -ఋ.1.118.2**

అశ్వినీదేవతలు వృద్ధాప్యం రాకుండ చేసే ఔషధాలను కనిపెట్టి, వృద్ధుల్ని యువకులుగా చేసినట్లు మనకు వేదం ద్వారా తెలుస్తున్నది. వీరు ముసలివాడైన 'వందను'డనే ఋషిని తమ వైద్య-శిల్పకౌశలంతో యువకునిగా చేశారు. ఒకశిల్పి శిథిల మైన రథాన్ని తన శిల్పకౌశలంతో ఎలా కొత్తదిగా చేస్తాడో అలా అశ్వినీదేవతలు వందనఋషిని యువకుని చేసినట్లు ఈ ఋగ్వేద మంత్రం తెలియజేస్తున్నది-

**యువం వందనం నిర్ఋతం జరణ్యయా**
**రథం న దస్రా కరణా సమిన్వథః - ఋ.1.119.7.**

అలాగే మమతకుమారుడైన దీర్ఘతము డనే ఋషి ముసలివాడుకాగా అశ్వినీదేవతలు తమ శిల్ప-వైద్య ప్రక్రియలతో అతనిముసలితనాన్ని పోగొట్టా రని, ఆయన బ్రహ్మవలె కార్య నిర్వాహకు డయ్యా డని మరొకఋక్కు ఇలా చెబుతున్నది-

**దీర్ఘతమా మామతేయో జుజుర్వాన్దశమే యుగే।**
**అపామర్థం యతీనాం బ్రహ్మ భవతి సారథిః॥ - ఋ.1.158.6.**

సముద్రంలో చిక్కుకుపోయిన భుజ్యు డనే రాజును అశ్వినీదేవతలు మూడుతెడ్లు గల నావలో మూడురోజుల్లో ఇంటికి చేర్చినట్టు ఋగ్వేదం ఇలా పేర్కొంది-

**త్రిసః క్షపస్త్రిరహాతివ్రజద్భి -**
**ర్నాసత్యా భుజ్యుమూహథుః పతఙ్గైః।**
**సముద్రస్య ధన్వన్నార్ద్రస్య పారే**
**త్రిభీ రథైః శతపద్భిః షళశ్వైః ॥**

**అనారమ్భణే తదవీరయేథా -**
**మనాస్థానే అగ్రభణే సముద్రే ।**
**యదశ్వినా ఊహథుర్భుజ్యుమస్తం**
**శతారిత్రాం నావ మాతస్థివాంసమ్॥ - ఋ.1.116.4, 5.**

ద్యుస్థానమున గల దేవతలలో అశ్వినీదేవతలు ప్రథము లని నిరుక్త మిలా చెప్పింది -

**అథాతో ద్యుస్థానదేవతా స్తాసా మశ్వినో ప్రథమా**
**గామినౌ భవతోఽ శ్వినౌ । - నిరుక్తం.అ.12.ఖం.1.**

## శిల్పం- వాస్తు

వాస్తుపురుషునిగురించి చెప్పేది వాస్తుశాస్త్రం. ఇది మొట్టమొదట బ్రహ్మనుండి వచ్చింది. పురాతనమైన దీనిని శివుడు గర్గునికి, గర్గుడు పరాశరునికి, అతడు బృహద్రథునికి, ఆయన విశ్వకర్మకు క్రమంగా ఉపదేశించారు. విశ్వకర్మ లోకహితం కోరి దీనిని ప్రకాశింపజేశాడు- అదే వాస్తుశాస్త్రం. మయుడు, విశ్వ కర్మ, త్వష్ట మొదలైనవారు దీనికి ప్రవర్తకులు.

వాస్తువు అనగా వాసయోగ్యమైన స్థలంలో నిర్మించే గృహ-భవన-ప్రాసాదాదు లని అర్థం. ప్రాణులు వీటిలో నివసి స్తారు కాబట్టి ఇది వాస్తువు. గృహనిర్మాణంకూడా శిల్పకర్మే కాబట్టి వాస్తువిద్యకూడా శిల్పవిద్యలో అంతర్భాగమే. శిల్ప-వాస్తుశాస్త్రాలు రెండూ స్థాపత్యవేదంలోనివే. శిల్పవేదంలోని ఒక భాగమే వాస్తుశాస్త్రం. శిల్ప-వాస్తు శబ్దాలు రెండూ పర్యాయ పదాలు. అనేకవిధాలుగా నిర్మించేవస్తువులు, యంత్రాలు, రాగి- వెండి- బంగారు మొదలైనధాతువులతో నిర్మించేగృహో పకరణాదులు, గృహ-భవన-ప్రాసాదాదు లన్నింటిని వాస్తువులు లేక శిల్పాలు అంటా రని 'భృగుసంహిత' ఇలా పేర్కొంది-

**నానావిధానాం వస్తూనాం యంత్రాణాం శిల్పసంపదామ్।**
**ధాతూనాం సాధనానాం చ వాస్తూనాం శిల్పసంజ్ఞితమ్॥**

## వాస్తోష్పతి - వాస్తుపురుషుడు

రథ, యంత్ర, గృహ, సౌధ, దేవాలయ, వాపీ, కూప, తటాక, ఆరామాదులు నిర్మించేటప్పుడు ప్రారంభంలోను, మధ్య లోను, చివరిలోను వాస్తుపురుషపూజ చేయాలి. వాస్తోష్పతి అంటే సమస్తకర్మాధిపతి అయిన విశ్వకర్మే! ఆయన గృహాది

## దీనాలాపన

పల్లవి : ఏడుకొండలు ఎన్నిసార్లు ఎక్కినా తనివి తీరదు.
ఇడుము లన్నీ పైబడి దాడిచేసినా నీపై భక్తి మారదు.
గోవింద! గోవింద! హరి నారాయణ! గోవింద! ॥ఏడుకొండలు॥

చరణం : ముప్పేటలా కష్టాలు కమ్ముతున్నవి
ముప్పూటలా మాయ మమ్ము కుమ్ముతున్నది.
తప్పు లున్న క్షమియించీ...
మా తప్పు లన్నీ క్షమియించీ కాపాడి, ఆపదల
ముప్పు నుంచీ రక్షించే అభయదాత నీవయా!
గోవింద! గోవింద! హరి! నారాయణ! గోవింద! ॥ఏడుకొండలు॥

చరణం : కనుదోయిలో కొలువైన వరదుడ వీవే
వెనుదన్నుగా నిలబడి కాచే విభుడవు కావే?..
నిను మనసారా నమ్మినవా రందరికీ -
క్షణమున మరి చేరుతావు వారిదరికి !!!
గోవింద! గోవింద! హరి! నారాయణ! గోవింద! ॥ఏడుకొండలు॥

తరిగొప్పుల వి.ఎల్.ఎన్.మూర్తి

సర్వస్థానాలకు అధిదేవత. కావున వాస్తోష్పతిని విశ్వకర్మగా పూజించా లని వాస్తుశాస్త్ర మిలా చెబుతున్నది–

**రథే యంత్రే గృహే సౌధే దేవతాయతనాదికే।**
**వాపీ కూప తటాకాది స్వారామఘటనేషు వై॥**
**ఆరంభే మధ్యమే చాన్తే పూజయే ద్వాస్తుపూరుషమ్।**
**వాస్తోష్పతి ర్విశ్వకర్మా విశ్వశిల్పక్రియాధిపః॥**
**స ఏవ వాస్తుపురుషో వాస్తోః పూరుష కారణాత్।**
**తతోஉర్చయే త్పతిం వాస్తో ర్విశ్వకర్మ మనీషయా॥ - వాస్తుశాస్త్రం.**

### వాస్తువిద్య- గృహం

మానవులు నివసించడానికి ఇల్లు చాలా అవసరం. గృహస్థు గృహంలో ఉండడంవల్లనే మిగిలిన ఆశ్రమాలవారికి, కుంటివారు– గ్రుడ్డివారు మొదలైన వికలాంగులకు, అనాథలకు సహాయం చేస్తూ, తాను పురుషార్థాలను సాధిస్తూ సర్వసుఖాలను పొందుతున్నాడు. అందుకనే ఆశ్రమా లన్నింటిలో గృహస్థాశ్రమం శ్రేష్ఠమైంది, ప్రధానమైంది. జీవునికి దేహమెంత ప్రధానమో, దేహానికి గృహమంత ప్రధానం.

**స్త్రీ పుత్రాదిక భోగ సౌఖ్య**
**జనకం ధర్మార్థకామప్రదమ్**
**జంతూనాం లయనం సుఖాస్పద**
**మిదం శీతాంబుఘర్మాపహమ్।**
**వాపీదేవగృహాదిపుణ్య మఖిలం**
**గేహా త్సముత్పద్యతే**
**గేహం పూర్వ ముశన్తి తేన**
**విబుధా శ్శ్రీవిశ్వకర్మాదయః॥**

ఇన్నివిధాలుగా ప్రధానమైన గృహాన్ని నిర్మించడానికి వాస్తుశాస్త్రం అనేక విధులను శాసిస్తున్నది. భూపరీక్ష మొదలు కొని గర్భవిస్తారం, వెనుక–ముందఱ పంచల ఆయముల వైశాల్యం, దూలాలు, వాకిళ్ళు, కిటికీలు మొదలైన విషయా లన్నింటిని శాస్త్రం సౌందర్యం, సౌకర్యం, సౌలభ్యాలను దృష్టిలో పెట్టుకొని చాలా జాగ్రత్తగా చెప్పింది. ఆగ్నేయంలో వంటిల్లు, దక్షిణదిక్కున పడకగది, పడమట భోజన శాల, ఈశాన్యంలో పూజామందిరం, ఉత్తరాన ధనాగారం, ఈశాన్యంలో బావి ఉండా లని ఆయా దిక్పాలకులను, వారి కభిమానమైన విషయా లను అనుసరించి, వాటికి కొరతలేకుండా వర్ధిల్లడానికి చెప్పారు.

వాస్తుశాస్త్రంప్రకారం గృహాన్ని నిర్మిస్తే అందచందాలకు గాని, కావలసిన ప్రయోజనాలకు గాని, ఆయుర్భోగ భాగ్యాలకు గాని లోటు లేకుండ యజమాని వర్ధిల్లుతా డనడం వాస్తవం. కావుననే గృహనిర్మాణవిషయంలో ముందుగా చేసే వాస్తోష్పతి పూజ,నవగ్రహమండపారాధన, నక్షత్రజపాలు, శాంతిహోమాదులు, ప్రకృతిదేవతలను (ప్రకృతిలోని దివ్యశక్తులను) ప్రసన్నం చేసుకోవడానికి తోడ్పడతాయి. అందుకే మనవాళ్ళు గృహ నిర్మాణానికి ఇంతటి ప్రాధాన్య మిచ్చారు.

ఈవిధంగా భూశోధనం, దిక్నిర్ణయం, గృహప్రమాణం, ఆయం మొదలైన విషయా లెన్నింటినో వాస్తుశాస్త్రగ్రంథాలు చెబుతున్నాయి. గృహాన్ని శాస్త్రప్రకారం నిర్మించా లని అవి ఆదేశిస్తున్నాయి. ఇదే భారతీయవాస్తుశాస్త్రసంప్రదాయం.

*(ఇంకా ఉంది)*

# సందేహాలు? సమాధానాలు!!

విద్వాన్, డా॥ పమిడికాల్వ చెంచుసుబ్బయ్య

**శ్రీవారిబ్రహ్మోత్సవాలలో శ్రీమలయప్పస్వామివారు రోజు కొక అవతారంలో దర్శనమిస్తారు కదా! మరి మలయప్పవారి ఇన్నిభంగిమలకూ వేర్వేరుగా ఉత్సవమూర్తులు ఉన్నాయా? లేక ఒకే మూర్తిని ఆయా రూపాలలో అలంకరిస్తారా? తెల్పండి?**

**– ఏ.గౌతమ, అనంతపురం.**

☛ తిరుమల శ్రీవారిబ్రహ్మోత్సవాలలో ఉత్సవమూర్తిగా దర్శన మిచ్చేవిగ్రహం ఒక్కటే – శ్రీభూదేవీమూర్తులూ అట్లే! ఆయా వాహనాలపై శ్రీమలయప్పస్వామివారు అధిరోహించే రోజున– ఆవాహనంపై ఏ దేవత ప్రసిద్ధంగా ఉంటుందో – ఆ మూర్తిగానే మలయప్పస్వామివిగ్రహాన్ని అలంకరిస్తారు. అంతే కాని – వాహనాలకు తగినట్లుగా ప్రత్యేకఉత్సవమూర్తులు ఏ ఆలయంలోనూ ఉండవు. ఉన్న ఉత్సవమూర్తులకే వాహనాలకు అనుగుణంగా అలంకారం చేస్తారు. ఏ రోజుపగలు ఏ వాహనం? రాత్రి ఏ వాహనం? అనేది–ఆగమశాస్త్రాలు నిర్ణ యించాయి. ఆ ప్రకారమే వాహనసేవలు తు.చ.తప్పక నిర్వహి స్తారు. ఇక్కడ ఒక్కవిషయం మనం గమనించాలి. విశ్వమే విష్ణువూ, విష్ణువే విశ్వమూ కనుక అన్నిరూపాలూ శ్రీవారివే! అన్నిమంత్రాలూ, అందరు దేవతలూ ఆ స్వామిలోనే అంత ర్లీనమై ఉన్నారు. వాటిల్ని శాస్త్రోక్తంగా ఇలా ప్రసిద్ధ సన్నివేశాల్లో, ఉత్సవాలరూపంలో బహిర్గతంచేసి, సకలదేవతలూ తానే అయి, తనలోనే ఉన్నా రనే గొప్పవిశేషాన్ని మనకు తెల్పు తున్నారు – స్వామివారు. కనుక మీ ప్రశ్నలోని " ఒకేమూర్తిని ఆయారూపా లలో అలంకరిస్తారా?" అనడానికి 'ఔను' – అనేది సమాధానం.

**'సాలకట్ల' అనే పదానికి అర్థ మేమి? సాలకట్ల ఉత్సవాలు జరుపడానికి శాస్త్రా ధారా లున్నాయా? లేక ఆచారంగా ఉంటు న్నాయా?**

**– ఏ.గౌతమ, అనంతపురం.**

☛ సాల్ (సాలు, సాల)– అనేది హిందీపదం. దీనికి 'సంవత్సరం' అని అర్థం. 'కట్టడ' అంటే నియమం. ఇది తెలుగు పదం. 'కట్టడలు'=నియమాలు. 'కట్టడలు' అనేది జనవ్యవ హారంలో 'కట్ల' అయింది. 'సాల్' అనేది తెలుగులో 'సాలు' అని ఉకారాంతమయింది. అదే క్రమంగా 'సాల' అయింది. కాగా 'సాలకట్ల' అంటే 'సంవత్సరనియమంకలది' అని అర్థం. సౌరమానంరీత్యా కన్యామాసంలో శ్రవణనక్షత్రంనాటికి అవ భృథస్నానంతో పూర్తి అయ్యేటుగా, చిత్రానక్షత్రంనాటితో ప్రారంభించి– చేసేవి వార్షిక (సాలకట్ల) బ్రహ్మోత్సవాలు. ఇవి నియమంగా జరుగుతాయి. మునుపు భారతదేశాన్ని పాలించిన ఆంగ్లేయులు, తి.తి.దే.పాలన, నిర్వహణాధికారులు, 1843లో మహంతులకు అప్పజెప్పారు. వాళ్ల నిర్వహణ సౌలభ్యంకోసం వాళ్లభాషలో 'సాలకట్ల' మొదలైన చాలా హిందీ ప్రవేశపెట్టారు. అవే ఈనాటికీ రూఢిగా ఉపయోగంలో ఉన్నాయి. శ్రీవారు కన్యామాసంలో శ్రవణనక్షత్రంనాడు ఆవిర్భవించా రని పురా ణాలు పేర్కొన్నందున–బ్రహ్మోత్సవాలు సౌరమానం రీత్యాకన్యా మాసంలోనే నిర్వహిస్తారు. అధికమాసం వచ్చిన సంవత్సరంలో ఈ వార్షిక(సాలకట్ల)బ్రహ్మోత్సవాలు నవరాత్రి బ్రహ్మోత్సవాలకు ముందటిమాసమైన భాద్రపదంకన్యామాసం అయితే భాద్ర పదంలో(చాంద్రమాన) నిర్వహిస్తారు. ఆశ్వయుజంలో నిర్వహిం చేవి నవరాత్రిబ్రహ్మోత్సవా లవుతాయి. అప్పుడు సాలకట్ల (వార్షిక)బ్రహ్మోత్సవం, నవరాత్రి బ్రహ్మోత్సవం రెండూజరుగు తాయి. వార్షికబ్రహ్మోత్సవాలు మొట్టమొదట బ్రహ్మదేవుడు ప్రారంభించాడు.

రెండు బ్రహ్మోత్సవాలు నిర్వహించేటప్పుడు మొదటిది (సాలకట్ల)వార్షికబ్రహ్మోత్సవం. రెండవ బ్రహ్మోత్సవంలో ధ్వజా రోహణం, రథం, ధ్వజావరోహణం ఉండవు. దారు(కొయ్య) రథానికి బదులు రజిత(వెండి), స్వర్ణబంగారు రథోత్సవం జరుగుతుంది. భవిష్యోత్తరపురాణాదుల్లో బ్రహ్మోత్సవవాహన క్రమం పేర్కొనబడింది. బ్రహ్మోత్సవాలు 'నిత్యబ్రహ్మోత్సవం, శాంతిబ్రహ్మోత్సవం, శ్రద్ధాబ్రహ్మోత్సవం' అని మూడువిధాలు. నిత్యబ్రహ్మోత్సవాలు సంవత్సరానికి ఒక్కమారు నియతంగా జరి గేవి. ఇవి ఆవిర్భావదినాన్ని / నక్షత్రాన్నిబట్టి కానీ, ప్రతిష్ఠా దినాన్ని / నక్షత్రాన్నిబట్టిగానీ నిర్వహిస్తారు.

తిరుమలలో శ్రీవారు కన్యామాసం - శ్రవణనక్షత్రం నాడు ఆవిర్భవించడంవల్ల - ఈ బ్రహ్మోత్సవం ఆవిర్భావనిత్య బ్రహ్మోత్సవం. అట్లే తిరుపతిలోని శ్రీగోవిందరాజస్వామివారి ప్రతిష్ఠ వృషభమాసం, అనూరాధానక్షత్రంనాడు కనుక - ఆనాటికి అవభృథస్నానాంతంగా జరుగుతాయి. శ్రీకోదండరామ స్వామివారిప్రతిష్ఠ పంగుణీ (ఫాల్గున)మాసం-మృగశిరనక్షత్రం నాడు కనుక - తదనుగుణంగా జరుగుతాయి. ఈ నిర్ణయాలన్నీ వైఖానసాదిఆగమశాస్త్రాలలో, సంహితాగ్రంథాలలో చెప్పబడి నవే! తిరుమల తిరుపతి దేవస్థానాలలోని కైంకర్యాలూ, ఉత్స వాలూ అన్నీ ఆగమోక్తంగానే నిర్వహించడం సంప్రదాయం. శ్రీ వేంకటాచలమాహాత్మ్యంలో (2-210)" కన్యారాశియందు సూర్యు డమర ప్రవేశించినట్టిమాసము, చిత్రాఖ్యనక్షత్రంబునందు శాస్త్రమఖమతంబుగ, సత్ధ్వజారోహణము చేసి, ఉత్తరాషాఢ రథోత్సవంబు గావించి, శ్రవణనక్షత్రమందే తీర్థవారి చేయిం పగా వలయు ననుచు విఖనసుడు పల్కె" అని తరిగొండ వెంగమాంబకూడా ఈ వార్షిక బ్రహ్మోత్సవనిర్ణయాన్ని సూచిం చారు. కనుక 'సాలకట్ల'(వార్షిక) బ్రహ్మోత్సవాల నిర్వహణ ఆగమశాస్త్రీయమే!

**"ఫిబ్రవరి-2013 సంచిక సూర్యప్రార్థన 22వ పుటలో ప్రచు రించిన శ్లోకంలో 'తమోఘ్నం'కు బదులు నావద్దనున్న ప్రార్థనల పుస్తకంలో 'తమోరిం' అని ఉంది. ఏ పదం సరైందో తెలియజేయండి?"**

**- శ్లిష్టాకృష్ణశర్మ, విశాఖపట్నం.**

☛ మీ రనుకొన్నట్లు 'తమోఘ్నం' అనేది తప్పు కాదు. 'తమోఽరిం' అనినా, 'తమోఘ్నం' అనినా రెంటికీ 'చీకటిని చంపేవాడూ', 'చీకటికి శత్రువు'-అని,అర్థాలు. తాత్పర్యం 'చీకటిని తొలగించేవాడు' అనే! స్తోత్రశ్లోకాలలో ఇలాంటివి ఎన్నో విధాలుగా సమానార్థాలలో ఉంటాయి. అంతమాత్రంచేత 'తప్పు దొర్లిన ట్లున్నది' అని వ్రాయడం తగదు. ఆ శ్లోకంలోనే 'సర్వపాపఘ్నం' అని 'ఘ్న'-ఉంది. 'ఘ్న'-హింసాయాం' - అని అర్థం. కనుక - 'ఘ్న' అంటే హింసించడం= నశింపజేయడం, తొలగించడం అని తాత్పర్యం. 'అరి' అంటే శత్రువు. 'తమస్+అరి' అనేది సంస్కృతవ్యాకరణంరీత్యా 'తమోఽరి' అవుతుంది. దీని ద్వితీయావిభక్తి రూపం "తమోఽరిం". మీరు 'తమోఘ్నం' అని పఠించినా, 'తమోఽరిం' అని పఠించినా రెంటికీ తాత్పర్యం ఒక్కటే! ఇందులో ఛందోవ్యాకరణదోషాలేమీ లేవు. శ్రీమద్రామాయణాంతర్గత 'ఆదిత్యహృదయస్తోత్రం 20వ శ్లోకంలో 'తమోఘ్నాయ, పాపఘ్నాయ, శత్రుఘ్నాయా మితా త్మనే, కృతఘ్నఘ్నాయ దేవాయ జ్యోతిషాంపతయే నమః" అని 'తమోఘ్న' శబ్దం సూర్యపరంగా ఉండడం గమనించండి. కనుక 'సప్తగిరి' పాఠం, మీపాఠం-రెండూ మంచివే! 'సప్తగిరి'లో తప్పుదొర్లలే దని గ్రహింపగలరు.

**సంసార మనే అశ్వత్థవృక్షము కొమ్మలు క్రిందికి, వేళ్లుపైకి ఉండి, సత్త్వరజస్తమోగుణాలతో వృద్ధి పొందింది. దీన్ని ఎరిగిన వా రెవరు?**

**- యన్నం మల్లయ్య, కంభం.**

☛ సంసార మనే అశ్వత్థవృక్షవర్ణన భగవద్గీతపురుషోత్తమ ప్రాప్తి యోగప్రారంభంలో భగవానుడు పేర్కొనింది. అన్ని చెట్లకూ కొమ్మలు పైకి, వేర్లు క్రిందికీ ఉండడం చూస్తున్నాం. కానీ సంసార మనే అశ్వత్థవృక్షానికిమాత్రం కొమ్మలు క్రిందికీ, వేర్లు పైకీ ఉన్నాయనడం కొంత విచిత్రమే! కానీ ఇది సత్యమే! ఈ జగత్తు-త్వరత్వరగా ఆకులు రాలిపోయే ఒక అశ్వత్థవృక్షం. స్థిరత్వం లేనిది. చంచలమైనది. పరమాత్మనుండియే ఈ జగత్తు ఆవిర్భవించినందున ఊర్ధ్వంలో ఉండే పరమాత్మ-దీనికి వేరు. అలాపై నుండి జగత్తు వచ్చింది కనుక కొమ్మలు క్రిందికి ఉన్నాయి. ఇది మామూలుచెట్టు కాదు. బ్రహ్మాండవృక్షం. ఇది మాయా కార్యం. తలక్రిందుగానే ఉంటుంది. దీన్ని తెలుసుకోవా లంటే ఈ అధ్యాయంలోని 4,5 శ్లోకాలభావాన్ని గ్రహించాలి. భగవంతుడే సమాధానం అనుగ్రహించి ఉన్నాడు. వైరాగ్యం, ముముక్షుత్వం, ఆత్మజ్ఞానం-సంపూర్ణంగా కల్గినవారికి ఈ సంసార మనే అశ్వత్థవృక్షరూపం చక్కగా తెలిసి, దీనికి కారణ మైన పరమాత్మతత్త్వం అవగతం, అనుభూతం అవుతుంది. ఇంకాస్త వివరిస్తే- 'నిరహంకారత, వివేకత, అసంగత్వం, నిరంతరం ఆత్మజ్ఞానం (బ్రహ్మనిష్ఠ), నిష్కామత్వం, ద్వంద్వా తీతత్వం - అనే దివ్యగుణాలు కల్గిన మహాత్ములు ఈ సంసార వృక్షతత్త్వం పూర్తిగా తెలుసుకొని, అవ్యయమైన బ్రహ్మపదాన్ని పొందగలరు. అట్టివాళ్లకు పునర్జన్మ లేదు.

# ధూర్జటి మనస్సు

డా॥ కంపల్లె రవిచంద్రన్

ఆంధ్రప్రజానీకహృదయపీఠంపై అధిష్ఠించిన మొదటికవీశ్వరుడు భక్తకవిరాజు బమ్మెర పోతన. ఆ తర్వాత చెప్పదగిన వాడు పరమేశ్వరాస్థానకవీశ్వరుడు – ధూర్జటి.

వీళ్లు చెప్పింది భక్తికవిత్వం. భక్తి అందరూ ఆశించేది కాదు. అందరూ సాధించగల్గేదీ కాదు. అయితే ఈ కవిద్వయం పట్ల ప్రజలకు ప్రగాఢాభిమానం ఎలా కలిగింది? అంటే అందుకు కారణం ముఖ్యంగా వారి సర్వస్వతంత్రప్రవృత్తి. ఈ స్వతంత్రప్రవృత్తి ఎలా కల్గుతుంది? కవి నైతికంగా బలీయుడైనప్పుడు కల్గుతుంది. తన సకలజ్ఞానేంద్రియ, కర్మేంద్రియ, చిత్తాహంకారాలఏకోన్ముఖత్వంగా సృష్టించిన కావ్యకన్యను భౌతికసుఖా లాశించి, మదోన్మాదులైన రాజులకు అంకితం చేసి, చివరకు నానాకష్టాలపాలైన పూర్వకవులు చాలామంది చేసిన తప్పును తాను చేయకుండా దారిద్ర్యపుచిచ్చును ఒడిగట్టుకొని, భాగవతకావ్యాన్ని సృష్టించి, శ్రీరామచంద్రుడు స్వయంగా అర్థించిన ఆ కావ్యకన్యను ఆయనకే అంకితం చేసిన ధర్మవీరుడుగా లోకం పోతనను పూతచరితుడుగా పూజిస్తుంది.

కానీ ధూర్జటి ఇలాంటివాడు కాదు. రాజులంటే విష్ణ్వంశసంభూతు లని, విజ్ఞు లని, తమ ప్రజలు తమ ఇచ్చవచ్చిన మత మవలంబించే స్వేచ్ఛ నిచ్చేఉదారచరితు లని, తమ కావ్యాన్ని తాము నమ్ముకొన్న దైవానికి అంకితమిచ్చుకోనిస్తారని ఆశించి, ఆస్థానకవీశ్వరపదవి నంగీకరించి ఉంటాడు కాబోలు! కొలువు కూటానికి వెళ్లివస్తూ ఉండేవాడు. వాళ్లిచ్చిన వస్తు, వాహన సౌఖ్యా లనుభవించాడు. అవన్నీ ఈశ్వరుడే తన కిచ్చినట్లు భావించాడు. కానీ అచిరకాలంలోనే తెలుసుకున్నాడు – రాజులు మదాంధు లని, దయారహితు లని, వారికి ఆగ్రహం కల్గినా, అనుగ్రహం గల్గినా పట్టలే మని, ఎంతగా గౌరవిస్తారో అంత ఇబ్బడిముబ్బడిగా ఆగ్రహంతో అగౌరవం చేస్తా రనీ, అనుభవంతో తెలుసుకున్నప్పటి ధూర్జటి పరిదేవనం ఈ క్రింది పద్యంలో విదితం –

**రాజుల్ మత్తులు, వారిసేవ నరకప్రాయంబు, వారిచ్చు నం**
**భోజాక్షీచతురంతయానతురగీభూషాదు లాత్మవ్యథా**
**బీజంబుల్, తదపేక్ష చాలుఁ, బరితృప్తిం బొందితిన్, జ్ఞానల**
**క్ష్మీజాగ్రత్పరిణామ మిమ్ము దయతో, శ్రీకాళహస్తీశ్వరా. (ప.18)**

స్వానుభవంలో తెలిసివచ్చినప్పుడు గాని యథార్థం బోధపడదు. పరానుభవం పరానుభవమే ఇతరులకు జరగవచ్చు. అదివాళ్లకర్మ! మనకలా జరక్కపోవచ్చు అని భావించటం సహజం. అందుకే తలనొప్పి అయినా తనదాకా వస్తేగాని తెలీదని సామెత. అగౌరవాలతో విసిగి వేసారినాడు. తనకు కావాల్సిం దిక "జ్ఞానలక్ష్మీ జాగ్రత్పరిణామం" –దాన్ని ప్రసాదించమని ప్రార్థించాడు.

ధూర్జటి "రాజు" శబ్దం చెవినబడితేనే చీకాకు పడతాడు. చిర్రుబుర్రులాడుతాడు. అంటే "రాజు" చేతుల్లో ఎంత ఘోరపరాభవానికి లోనైనాడో ఊహించడానికికూడా శక్యం కాదు. నోరి నరసింహశాస్త్రి కొంతవరకు తమ "ధూర్జటి" నవలలో ఊహించి, కృతకృత్యులయ్యారు. వారు శ్రీకృష్ణదేవరాయలేనా? ఆ రాజని నిర్ణయిస్తే అంతరాత్మ అంతగా అంగీకరించదు.

**రాజై దుష్కృతిఁ జెందెఁ జందురుఁడు, రారాజై కుబేరుండు దృ**
**గ్రాజీవంబునఁ గాంచె దుఃఖముఁ, గురుక్ష్మాపాలుఁ డా మాటనే**
**యాజిం గూలె సమస్త బంధువులతో, నారాజశబ్దంబు ఛీ**
**ఛీ జన్మాంతరమందు నొల్లను జుమీ! శ్రీకాళహస్తీశ్వరా! (ప.21)**

రాజుల దుష్ప్రకృతి విషయంలోనే గాక 'రాజు' అనే మాటపట్లగూడ ధూర్జటికి ఎంత జుగుప్స ఉందో ఈ పద్యంలో ఉదాహరణపూర్వకంగా చెప్పాడు. చంద్రుడు రాజుగాను, కుబేరుడు, దుర్యోధనుడు రారాజులుగాను పిలువబడుతున్నారు. వీళ్లలో చంద్రుడు గురుదారాగమన దుష్కృతి పొందాడు. కుబేరుడు జగన్మాత పార్వతీదేవిని చెడుభావనతో చూచి, కంటిని పోగొట్టుకున్నాడు (ఏక పింగళః)

దుర్యోధనుడు కురుక్షేత్రసంగ్రామంలో బంధువులతో సహా కూలిపోయాడు. అందుకే ధూర్జటికి రాజు అన్నే పదం విన్పిస్తేనే అసహ్యాన్ని వ్యక్తం చేశాడు. అంతే కాదు "నిక్షేపం బబ్బిన రాజకీటములనే సేవింపఁగా నోప" (పద్యం–25)నని తన నిశ్చయాన్ని ఉద్ఘాటించాడు.

ఎంతెంతవారైనా, ఎంత సౌందర్యవంతులైనా, ఎంతటి కళాకారులైన, సామ్రాజ్యా లేలినప్రభువులైనా మృత్యువుకు

లొంగక తప్పదు. ఈ విషయం తెలిసీ రాజు లెందుకింత మదాంధులై సంచరిస్తారో బోధపడదు. పోతన బలిచక్రవర్తిచేత ఇలా ప్రశ్నింపజేస్తాడు.

**కారే రాజులు? రాజ్యముల్ గలుగవే? గర్వోన్నతిం బొందరే?**
**వారేరీ? సిరి మూటగట్టుకొని పోవంజాలిరే? భూమిపైఁ**
**బేరైనం గలదే? ... ... (భాగ. 8-590)**

ఈ పద్యానికి వాక్యవక్రత ఎనలేని సొగసులు తెచ్చి పెట్టింది. వక్రతలోనే గదా కవిత్వం తొంగి చూచేది. "సిరి మూట గట్టుకొని పోవడం" తరతరాలుగా మిగిలిపోయిన నుడికారం. అప్పటికి వాడుకలో ఉన్న పలుకుబడి ఇది. నాడు వాడుకలో ఉన్నమాట పోతన్న కృతి కెక్కిందో, పోతన్న వాడడంవల్ల ఈ నుడికారం నేటివ్యవహారంలో వాసికెక్కిందో! ఏమో మరి!

ధూర్జటికూడా రాజుల అజ్ఞానమదాంధకారాన్ని ఇలా దుయ్యబడతాడు.

**పదునాల్గేలె మహాయుగంబు లొకభూపాలుండు, చెల్లించె న**
**య్యుదయాస్తాచలసంధి నాజ్ఞనొకఁ డాయుష్మంతుఁడై, వీరి య**
**భ్యుదయం బెవ్వరు చెప్పఁగా వినరొ! యల్పుల్ మత్తులై యేల చ**
**చ్చెదరో రాజుల మంచు నక్కటకటా! శ్రీకాళహస్తీశ్వరా! (ప.38)**

దీర్ఘకాలపరిపాలనకు మనువు, విస్తారమైన భూభా గాన్ని శాసించడానికి మాంధాత మన పురాణాల్లో పేరొందిన వారు. ధూర్జటి – మనువు, మాంధాతలను లక్ష్యంగా పెట్టుకొని సమకాలీనరాజులవెకిలిచేష్టలను వేలెత్తి చూపుతున్నా డీపద్యంలో. వాళ్లు పరిపాలించిన కాలంలో, భూభాగంలో ఏ మూలకూ సరిపోని ఈ రాజుల ఆయుష్యమూ, అధికారమూ హాస్యాస్పదా లంటున్నాడు. ఈ రాజులు అల్పాయుష్కులే కాదు, అల్ప రాజ్యలక్ష్మీలల నాంధబుద్ధులుకూడ! 'విఱ్ఱవీగు' అనే అర్థంలో 'ఏల చచ్చెదరో రాజుల మంచు' అనే పదబంధం అత్యంత బంధురంగా ప్రయోగింపబడింది. ఈ పద్యంలో ధూర్జటి తెలుగు నుడికారాన్ని ఎంత బాగా ఉపయోగించాడో ననిపిస్తుంది.

**రా జన్నంతనె పోవునా కృపయు, ధర్మం, బాభిజాత్యంబు, వి**
**ద్యాజాతక్షమ, సత్యభాషణము, విద్వన్మిత్రసంరక్షయున్,**
**సౌజన్యంబుఁ గృతం బెఱుంగుటయు, విశ్వాసంబుఁ గాకున్న దు**
**ర్బీజశ్రేష్ఠులు గాఁ గతంబు గలదే శ్రీకాళహస్తీశ్వరా! (ప.39)**

ఇంతకుముందు చెప్పుకున్న పద్యం రాజులు శాసించిన కాలాన్నీ, భూభాగాన్నీ దృష్టిలో పెట్టుకొని చెప్పింది. ఈ పద్యం సమకాలికప్రభువుల నైతికవర్తనం పతనమవుతుండగా చూచి పలికింది. రాజశబ్దం అధికారసూచకం. 'రాజు' అని అనిపించు కోవటంతోటే మనిషిలో సర్వసద్గుణాలు నశించిపోతా యని అంటున్నాడు – ధూర్జటి. 'రాజై దుష్కృతిఁ జెందెఁ జందురుఁ డు' అనే పద్యంలో రాజశబ్దం తనకు ఏ జన్మలోనూ అక్కరలే దని చెప్పాడు. ఆ ఏవగింపునకు కారణం అక్కడ రాజ, రారాజ నామధారులకు పట్టిన దుర్గతి; ఇక్కడ రాజనామధారణమాత్రాన దిగజారిన నైతికవర్తనం. ఈ పద్యంలో పేర్కొన్న కృప మొదలైన సద్గుణాలు ఒక్కొక్కటి ఇతరసద్గుణాలకు బీజప్రాయాలు. ఇందులో ఏ ఒక్కటి పతనం చెందినా మిగిలినగుణాలు పలా యనమంత్రం పఠిస్తాయి. మనిషిలో మంచితనం అదృశ్యమై పోవడానికి రాజశబ్దమే కారణ మని ధూర్జటి నిశ్చితాభిప్రాయం.

లోకంలో అనేకవిధాలుగా వంచకు లున్నారు. అందులో ఒక వర్గంవారు – మే మెవ్వరినీ స్తుతించం– భగవంతుడ్ని తప్ప, అని పైకి చెబుతూ, చాటుగా పోయి, రాజుల్ని నుతించే వారి నిలా గర్హిస్తాడు – కవి.

**స్తోత్రం బన్యులఁ జేయనొల్లనివ్రతస్థుల్వోలె వేసంబుతోఁ**
**బుత్రీపుత్రకళత్రరక్షణకళాబుద్ధిన్, నృపాలాధమున్**
**బాత్రం బంచు భజింపఁ బోదు రిదియున్ భావ్యంబె? యవ్వారిచా**
**రిత్రం బెన్నడు మెచ్చ నెంచ మదిలో శ్రీకాళహస్తీశ్వరా! (ప.63)**

స్వార్థప్రయోజనాన్ని ఆశించి, ఇతరుల స్తుతించడం శీలవంతుల లక్షణం కాదు. కొందరు పరస్తుతివైముఖ్యం తమ ప్రకృతి అనీ, ఆ ప్రకృతిని వ్రతంగా చెల్లించుకుంటున్నా మనీ దాంభికాలు పలుకుతుంటారు. కానీ స్వకుటుంబభరణబాధ్యత వారిని ఆ మాటమీద నిలువనీయదు. ఆలుపిల్లల ఆకలి మంటలు అన్యులను స్తుతించేట్లు చేస్తాయి. రాజాధములను సేవించి, రోజులు గడుపుకోవటానికి రాజీపడుతారు. ఈ తీరు 'చెప్పేవి శ్రీరంగనీతులూ – దూరేవి / చేసేవి' అనే సామెతకు ఉదాహరణ. 'అవ్వారిచారిత్రం బెన్నఁడు మెచ్చ నెంచ మదిలో' అనటంలో వారి నడవడి తనకు ఏమాత్రం నచ్చ దని చెప్పటమే కాక. వారినిగూర్చి తలచినా పాపమేనన్న ధ్వనిని సూచిస్తున్నాడు – కవి. ఈ పద్యంలో ధూర్జటి తననాటి కవి (పండిత) సామా

న్యుల దాంభిక ప్రకృతిని నిశితంగా విమర్శించిన ట్లనిపిస్తుంది. రాజనింద స్పష్టం.

దుర్మార్గుల్నే ధాత్రీశుఁ జేయనేటి కని కవి, బ్రహ్మను నిందిస్తాడు. అప్పటికి గాని వారిపాపం పండ దని బ్రహ్మ ఆలోచన కావచ్చు. కొంతమంది బ్రతుకులు మరీ నీచం. వాళ్లకు రాజదర్శనమే లభించదు. "ద్వారద్వారములందుఁ గంచుకి జనవ్రాతంబు దండంబులన్, దోరంతస్థ్సలి బగ్గనం బొగడు చుచున్ దుర్భాషలాడ న్మతిన్, వారిం బ్రార్థన చేసి, రాజులకు సేవల్సే యగా బో"రని వారికై విచారిస్తాడు.

అయినా ఎందు కీ నీచరాజదాస్యానికి అర్రులు చాచటం? ఇంతకన్నా అవివేక మేముంది?

**రాజశ్రేణికి దాసులై సిరులఁ గోరం జేరఁగా సౌఖ్యమో?**
**యీ జన్మంబుఁ దరింపఁజేయఁ గల ని న్నేప్రొద్దు సేవించుని**
**ర్వ్యాజాచారము సౌఖ్యమో తెలియలేరౌ మానవుల్, పాపరా**
**శీజాతాతిమదాంధ బుద్ధు లగుచున్... (ప.88)**

– అని సంప్రశ్నిస్తాడు.

"నిధి చాల సుఖమా? రాముని సన్నిధిసేవ సుఖమా? నిజముగఁ బల్కు మనసా!" అన్న త్యాగయ్యగారిసంప్రశ్నం ఈ సందర్భంలో సంస్మరించదగింది. మానవుని సకలవ్యాపారాలు సవ్యాజంగానే సాగుతున్నాయి. నిర్వ్యాజమే కన్పించదు. అతని బుద్ధి అంత స్వార్థపరాయణ మైంది.

సహజమైనజీవనవిధానానికి స్వస్తి చెప్పి, కృతకనీచ సుఖజీవనానికి బానిసలు కావటంవల్లనే ప్రజలకు అధికార దుర్మదాంధాల సేవారతి అధికమైంది, వారు ఛీ అంటున్నా, ఛా అంటున్నా రోషావేశాలు చచ్చి, బ్రతుకుతారు. నిరంతర మీపోతనార్యునిభాగవతపద్యం స్మరించుకొంటుంటే కొంతవరకు ఆనీచదాస్యనివృత్తి కలుగుతుందేమో!

**కమనీయభూమిభాగములు లేకున్నవే?**
**పడియుండుటకు దూదిపఱుపు లేల?**
**సహజంబులగు కరాంజలులు లేకున్నవే?**
**భోజనభాజనపుంజ మేల?**
**వల్కలాజినకుశావళులు లేకున్నవే?**
**కట్ట దుకూలసంఘాత మేల?**
**గొనకొని వసియింప గుహలు లేకున్నవే?**
**ప్రాసాదిసౌధాదిపటల మేల?**

**ఫలరసాదులు గురియవే? పాదపములు,**
**స్వాదుజలముల నుండవే? సకలనదులుఁ,**
**బొసఁగ భిక్షయుఁ బెట్టరే? పుణ్యసతులు,**
**ధనమదాంధులకొలు వేల? తాపసులకు (ఆ.గ.భాగ)**

సంసారం మనం తెచ్చిపెట్టుకున్నది; కృత్రిమమైనది; ప్రకృతి స్వతస్సిద్ధమైనది. సహజసౌఖ్యదాయకమైనది. నిలువ డానికి నేల నిస్తుంది. కట్టుకోవడానికి నారచీర లిస్తుంది. నివ సించడానికి గుహల్ని చూపుతుంది. తిని, త్రాగి, జీవించడానికి ఫలాలను, జలాలనూ అందిస్తుంది.

మరి సంసారవలయం ఏం చేస్తుంది? దూదిపరుపు లను, పసిడిపాత్రలను, జిలుగువలువలను, తళుకు మేడలను ఎరచూపుతుంది. రెంటికీ ఎంతవ్యత్యాస ముంది?

తాపసి–అంటే యోగి, ఈ వ్యత్యాసాన్ని అవగతం చేసు కుంటాడు. సంసారవలయంలో బుసకొట్టే సంపన్నుల కొలువు తన కెందు కని నిర్ణయించుకుంటాడు. పుణ్యసతులు పెట్టే భిక్షానుభవంతోనే ధన్యతను గణించుకుంటాడు. యోగుల అంతః కరణానికి ప్రతిబింబం ఈ పద్యం.

నిరాడంబరజీవితానికి పోతన్న ప్రతినిధి–అని తెలుగు నాట తరతరాలుగా ప్రచారంలో ఉన్న అభిప్రాయానికి ఈ పద్యం ఒకరకంగా అంతస్సాక్ష్యం కూడా!

ఈ పద్యానికి ప్రబోధితుడై ధూర్జటి ఇలా రచించా దనిపిస్తుంది –

**ఊరూరన్ జనులెల్ల భిక్ష మిదరో, యుండన్ గుహల్ గల్గవో,**
**చీరానీకము వీథులం దొరకదో, శీతామృతస్వచ్ఛవాః**
**పూరం బేఱులఁ బాఱదో, తపసులం బ్రోవంగ నీ వోపవో,**
**చేరం బోవుదు రేల రాజుల జనుల్? శ్రీకాళహస్తీశ్వరా! (ప.92)**

కూడు, గూడు, గుడ్డ – ఈ మూడే మానవుని జీవికకు ప్రాథమికావసరాలు. ఇవి పరమేశ్వరసృష్టిలో ఇతరుల్ని అడగ కుండానే దొరుకుతుంటే–మానవులు రాజులను ఆశ్రయించి బ్రతకా లనుకోవడంలో అర్థం లేదు. వితరణశీలురు, దయా హృదయులు అయిన ప్రజలు ఊరూర ఉండగా యాచకుల

కూటికి కొదువ ఉండదు. ఆ జనులదృష్టిలో భిక్షుకులు యాచకులు కారు. వారిఅంతరంగంలో –

**గృహాత్ గృహ మటన్ భిక్షుః శిక్షతే నతు యాచతే,**
**అదత్త్వా మాదృశో మా భూత్ దత్త్వా త్వం త్వాదృశీ భవ.**

'యాచకుడు ఇల్లిల్లూ తిరుగుతూ యాచిస్తున్న – అది యాచన కాదు. గృహస్థుల్ని "దానం చేయక నావలె యాచకులు కావద్దు. దానం చేసి, సంపన్ను గృహస్థులుకండి' అని హెచ్చరిస్తున్నాడు' అనే సందేశం దాగి ఉంది. వారు అర్థులను రాజులు చూచినట్లు చులకనగా చూడక, పూజ్యభావంతో చూచి సమాదరించే తత్త్వం కలవారు. వాళ్లకు అర్థులు (అర్థించువారు) అర్థులు (అర్థం గలవారు) గానే కన్పిస్తారు.

ఒడలిబడలిక తీర్చుకోవడానికి కమనీయసౌధభాగా లక్కఱ లేదు. గుహలే చాలు. ఈశ్వరునిసృష్టిలో గుహల కేమి లోటు? మనిషి ప్రాథమికావసరాల్లో చివరిది వస్త్రం. 'చీరానీకము వీథులన్ దొరకదో' అనే మాట ఆదిశంకరుల భజగోవిందమంజరికాస్తోత్రంలోని 'రథ్యాకర్పటవిరచితకన్థః'ను జ్ఞప్తికి తెచ్చేది. వీథుల్లో విసిరి వేయబడ్డ చింపిరిగుడ్డలను ఏర్చి కూర్చి బొంతగా కుట్టుకుంటే ఇక వాసోదైన్య మెక్క డుంటుంది?

భౌతికసుఖలాలసజీవనం అన్నివిధాల పర్యవసానంగా దుఃఖభాజన మనేవివేకం కల్గితే, భగవదన్వేషణబుద్ధి తప్పక కల్గుతుంది. "భూభృచ్ఛండాలురఁ గొల్చి, వారు తనుఁ గోపింపన్ బుధుం డార్తుఁడై చిచ్చారం జము రేల చల్లుకొను"నని (ప–115) తన స్థితినే పరోక్షంగా వ్యక్తం చేస్తాడు – కవి. 'భూభృచ్ఛండాలు' రనడంలో రాజులపట్ల కవిమనస్సులో గల కసి వ్యక్తమౌతూంది. సంసారాగ్నితాపోపశమనానికి సులభకోపులైన రాజులఆశ్రయం ఆజ్యం వంటిదైతే – విశ్వనాథునిసంసేవనం హిమానీజలసదృశ మని వివేకవంతులకు మహాకవి ధూర్జటి అందించిన చరమసందేశం!

తన నేదో పరాభవించా రని కాదు – కవి రాజదూషణ చేసింది. వారిలో సత్యదానదయాదులు కొరవపడ్డందుకు. సద్గుణోపేతుడైన సరసుడైనరాజును శివునితో సమానంగా గౌరవిస్తా నంటాడు – కవి – "సర్వమునకున్ మధ్యస్థుఁడై సత్యదానదయాదుల్ గల రాజు నా కొసఁగు మెన్న న్వాని నీయట్ల చూచి దినంబున్ ముద మొందుదున్" (పద్యం–98) కవి చేసింది పరనింద గాదు. వాస్తవనివేదనం. పరనిందాపరు లైన వారిని వధించవే మని కవి శివుడినే కోరుతాడు. తాను చేసింది పరనిందైతే తన్ను అలాగే శిక్షించాలి.

**కరిదైత్యుం బొరిగొన్న శూలము కరగ్రస్తంబు గాదో, రతీ**
**శ్వరునిం గాల్చిన ఫాలలోచన శిఖావర్గంబు చల్లారెనే?**
**పరనిందాపరులన్ వధింప విదియున్ భావ్యంబె? వా రేమిచే**
**సిరి నీకుం బరమోపకార మరయన్ శ్రీకాళహస్తీశ్వరా!(ప.109)**

పరనిందాపరు లనే మాటకు ఇతరుల్ని దూషించుటే పనిగా పెట్టుకొన్నవాళ్లని సామాన్యమైన (లౌకిక) అర్థం. దీన్ని కొంచెం నిశితంగా వివేచిస్తే దైవదూషణ చేసేవా ళ్లన్నే అర్థం గోచరిస్తుంది. సమకాలీనదైవదూషకులను దృష్టిలో పెట్టుకుని శ్రీకాళహస్తీశ్వరుణ్ణి అధిక్షేపించాడు – ధూర్జటి.

ఈవిధంగా రాజస్వభావాన్ని దుయ్యబట్టాడు– కవి. రాజులు పోవచ్చు కానీ రాజరికం నశించదు. ఇక్కడ "రాజు" అంటే "అధికారి" అని అర్థం. ఎందరెందరో అధికారు లిప్పటికీ, ఎప్పటికీ తమదుర్మార్గత్వాన్ని చెలామణి చేసుకుంటూ, తమ క్రింద పనిచేసే సాధువుల్ని హింసిస్తూనే ఉంటారు కాబట్టి అలాంటివారికి ప్రతీకగా "రాజు" శబ్దాన్ని పరిగణించాలి. అలాంటి అధమమానవులకు తాను ఏకృతినీ ఇవ్వ నని ప్రతిజ్ఞ చేసి, దాన్ని నిలబెట్టుకొన్న ధీమంతుడుగా, ధీరుడుగా ధూర్జటిని తెలుగులోకం ఆరాధిస్తూంది. ఆ ప్రతిజ్ఞ –

**నీకుం గాని కవి.త్వ మెవ్వరికి నే నీనంచు మీఁ దెత్తితిం,**
**జేకొంటిన్ బిరుదంబుఁ, గంకణము ముంజేఁ గట్టితిం, బట్టితిన్**
**లోకుల్ మెచ్చవ్రతంబు, నా తనువుకీడుల్ నేర్పులుం గావు, ఛీ**
**ఛీ కాలంబులు రీతి దప్పెడుఁ జుమీ శ్రీకాళహస్తీశ్వరా!(ప.114)**

ఈ పద్యంలో ప్రయోగించిన మీదెత్తు, బిరుదుచేకొను, కంకణం కట్టుకొను, వ్రతంపట్టు అనే దీక్షావహనార్థక క్రియలు కవిమనోనిశ్చయమహాపర్వతశిఖరౌన్నత్యాన్ని చిత్రిస్తున్నాయి. దాని ఎత్తు మామూలు మనుషులు కొలువలేరు. అందుకు ఆ శ్రీకాళహస్తీశ్వరుడే సమర్థుడు!

ఇంతటి ఘోరప్రతిజ్ఞ చేసినద్వితీయకవి ధూర్జటి. తెనుగుబాసలో ఇది ఆర్తితో చేసిన ప్రతిజ్ఞ! ఆ ఆర్తి సంసారంవల్ల, రాజుకొలువువల్ల, పాండిత్యభేషజంవల్ల ఇంకా అనేకానేక కారణాలవల్ల ఆయనలో తీవ్రరూపం ధరించి, అది ఆత్మాశ్రయ

కవిత్వంగా ఆవిర్భవించి, శ్రీకాళహస్తీశ్వరశతకాకారాన్ని దాల్చింది. దానివల్ల ఆయన లోకారాధ్యుడైనాడు. ఆయన కలుషితమైన ఆస్థానకవీశ్వరపదవిని త్యజించి, "రాజలోకాధమ శ్రేణీ ద్వారం" చొరటం మానేసి, అత్యున్నతమైన శ్రీకాళహస్తీశ్వరాస్థాన కవీశ్వరపదవి నలంకరించి, నిర్భయుడై తన ఆవేదన పరమేశ్వరునికి నివేదించుకున్నాడు. ఆ ఆవేదన ఆయన ఒక్కడిదే కాదు, సకలమానవులది. మనందరి ఆవేదననే ఉదాత్తకవితాశైలిలో కరుణామయుడైన భగవంతునికి నివేదించాడు. కవి ఈవిధంగా సరైనప్రాతినిధ్యం వహించటంచేత ఆయన మన కత్యంత ప్రీతిపాత్రుడైనాడు, ఆత్మీయుడైనాడు.

కవి ఇతఃపూర్వం రాజులకొలువు కొల్చాడు. అప్పు డే ఒప్పందమూ లేదు. అందువల్లనే ఏ కారణంచేతనో కవి నిశితమనసును బాగా గాయపరిచారు - ప్రభువులు. అది ఎంత మరచిపోదామన్నా శక్యం గానిపని. ఎవరు ఆర్చేవారు? తీర్చేవారు? భగవంతునికి మొరపెట్టుకున్నాడు. ఆయన ప్రభువులకు ప్రభువు. గజేంద్రునిమొరను విష్ణుమూర్తి ఆలించినట్టు- ఈ కవీంద్రునిమొరను పరమేశ్వరు డాలించే ఉంటాడు. తీవ్రమైనఆర్తి ఎప్పటికీ వృథాపోదు. అవసానదశలో ప్రభువులు చెప్పరానిఅగచాట్ల కగ్గమైనారు. అది వేరేవిషయం.

ఇప్పుడు చేపట్టింది కొత్త కొలువు. అందుకే ఆయనతో ఒప్పందం కావించుకున్నాడు - ధూర్జటి.

**నీ నా సం దొడఁబాటు మాట వినుమా! నీచేత జీతంబు నే**
**గానిం బట్టక సంతతంబు మది వేడ్కం గొల్తు, నంతస్సప**
**త్నానీకంబున కప్పగింపకుము న న్నాపాటియే చాలుఁ దే**
**జీ నొల్లం, గరి నొల్ల, నొల్ల సిరులన్ శ్రీకాళహస్తీశ్వరా! (ప.4)**

జీతం, భత్యంలేని కొలువు కొలుస్తాడట! అందుకు ఏ వాహనాలూ, సిరులూ అక్కరలేదట! కానీ ఒక్కమేలు కోరాడు. అంతశ్శత్రువులు ఆర్గు రున్నారు. వారే కామక్రోధలోభమోహ మదమత్సరులు. వారికి తన నప్పగించకుండా ఉండాలి. వారి బారినుండి కాపాడాలి. అంతే చాలట! అది చాలాచిన్న విషయమైనట్టు! అలా అప్పగిస్తే ఏమిటి ప్రభువుకు వచ్చేనష్టం? వేళకు ఆయనకొలువు కొలువలేకపోతాడు. అప్పుడు ప్రభువుకు ఆగ్రహం వస్తుంది. శపిస్తాడు. తిరిగి మేఘసందేశాలు జరుగుతాయి. వృథాపరితాపం, శ్రమ.

బాహ్యశత్రువులకన్నా బలీయులు ఈ అంతశ్శత్రువులు. భారతీయులు మొదటినుండి ఈ అంతశ్శత్రువుల్ని జయించటానికి తపించారు. బాహ్యశత్రువుల్ని నిర్లక్ష్యం చేశారు. వాళ్లు విజృంభించారు. మొత్తంమీద మానవుడు నిరంతరం ఏదో ఒక శత్రువుతో పోరు చేస్తూనే ఉండాలి. తప్పదు. బలీయుల్ని ముందణచి ఓజస్వంతుడైన తరువాత తేజస్వంతుడు కావచ్చు. దీనికి ప్రభువైన పరమేశ్వరునిఅండదండలు ఎంతైనా కావాలి! అందుకే ఈ ఒప్పందం. తనమదిని పరమేశ్వరుని కొలువుకూటం కావించా లని కవిఆశ. అందుకు దాన్ని ఆక్రమించుకొని ఉన్న శత్రువుల్ని ఖాళీ చేయించాలి. తనను వారి కప్పగించకుండా - వాళ్లను పారదోల మని ధూర్జటి పరమేశ్వరునితో ఒప్పందబేరం పెట్టాడు. సత్య మాలోచించి చూస్తే ఈ ఒడబాటు సర్వమానవ (ప్రాణి) కోటిపక్షాన ధూర్జటి శ్రీకాళహస్తీశ్వరునితో చేసికొంటున్న ట్లుంది. అభవుడే భవతారకస్థితిని ప్రసాదించగలవాడనిగుర్తించి కవి శివచరణశరణాగతు డయ్యాడు.

తులసీదాసుకూడా ఇలాంటి అభ్యర్థనే చేస్తాడు -

**నాన్యాస్పృహా రఘుపతీ! హృదయే మదీయే**
**సత్యం వదామిచ భవాన్ అఖిలాంతరాత్మా**
**భక్తిం ప్రయచ్ఛ రఘుపుంగవ నిర్భరాం మే**
**కామాదిదోషరహితం కురు మానసంచ** - అని.

కాము దుంటే రాము దుండడు. రాము దుంటే కాము దుండడు. రాముడు, కాముడు కలిసి ఉండరు.

మన మనోదౌర్బల్యాన్నిబట్టే అంతశ్శత్రువిజృంభణం అధికమౌతుంది. విషయాల్ని చింతించటంవల్ల మనుష్యుడికి వాటిపట్ల ఆసక్తి కలుగుతుంది. ఆసక్తిని ఆసరాగా చేసుకొని, కామం పెచ్చుపెరుగుతుంది. ఆ కామం తీరకపోతే క్రోధం జనిస్తుంది. క్రోధంనుండి అవివేకం పుడుతుంది. అవివేకంనుండి స్మృతివిలోపం కల్గుతుంది. స్మృతిభ్రంశమైతే సదసత్‌విచారం వినష్టమౌతుంది. కాగా పూర్తిగా చెడిపోతా డని గీత విశదం చేస్తుంది.

**ధ్యాయతో విషయాన్ పుంసః**
**సఙ్గ స్తేషూపజాయతే ।**
**సఙ్గాత్ సంజాయతే కామః**
**కామాత్ క్రోధోఽభిజాయతే ॥**

**క్రోధాత్ భవతి సమ్మోహః**
**సమ్మోహాత్ స్మృతివిభ్రమః**
**స్మృతిభ్రంశాత్ బుద్ధినాశః**
**బుద్ధినాశాత్ ప్రణశ్యతి ॥** **(II-62, 63)**

తాను మానసికంగా దుర్బలు ణ్నని, తన రక్షణభారం పరమేశ్వరుడే వహిస్తే తాను నిష్కామంగా తనకొలువు చేస్తానని కవిసంప్రార్థనం. అయినా భగవంతుడు తనతో పూచీ పడతాడా? తనకు వివేకశక్తినికూడా ఆయన ప్రసాదించాడు గదా! దాన్ని ఉపయోగించుకోలేక తెలివితక్కువన పడితే దాని కాయన బాధ్యత వహిస్తాడా? "ఎందుకు వహించవు? అది నీ కనీసబాధ్యత కాదా" అని కవి ఏ రీతిగా ప్రశ్నిస్తాడో చూడండి-

**భవకేళీమదిరామదంబున మహాపాపాత్ముఁడై వీఁడు న**
**న్ను వివేకింపఁ డటంచు, నేను నరకార్ణోరాశిపాలైనఁ బ**
**ట్టవు, బాలుం డొకచోట నాటతమితోడన్ నూతఁ గూలంగఁ దం**
**డ్రి విచారింపక యుండునా? కటకటా! శ్రీకాళహస్తీశ్వరా! (ప.5)**

తాను బాలుడు. బాలిశుడు. తనశ్రేయస్సు తనకు తెలీదు. ఇంద్రియసౌఖ్యమే బ్రహ్మానంద మనే భ్రాంతితో సంసారార్ణవంలో కూలిపడితే నన్ను ఉద్ధరించాల్సిన తండ్రి మిన్నకుండటం సమంజసమా? అని అమాయికంగా ప్రశ్నిస్తాడు. నిజానికి ప్రతివ్యక్తికీ తప్పు చేసేటప్పుడు భగవంతు డాత్మప్రబోధం చేయిస్తూనే ఉంటాడు. అప్పుడు ఇంద్రియవశంవదమైన మనస్సు ఆ ప్రబోధాన్ని ఆలకించదు. గట్టిదెబ్బ తగిలేదాకా తెలిసిరాదు. ఇదంతా శ్రీకాళహస్తీశ్వరునితో ధూర్జటి తనదిగా చెప్పికొన్నట్లు మనకు తోస్తుంది. కానీ సృష్టిలోని సర్వజంగమస్థావరాలపక్షాన ఆయన చేసినఅవ్యాజవిన్నప మని చెప్పుకోవచ్చు. ఇంతటి ఔదార్యం ఈ మహాకవికి తప్ప మరొకరికి లేదు.

శతకమంతా మానవునిఅల్పత్వంమీదనే సాగుతుంది. అంతశ్శత్రువుల విజృంభణమే అభివర్ణితం. పెద్దపెద్ద వేదాంతార్థాలు, అనుభూతం కానివిషయాలు అందించటానికి గాక, కవి తననూ, తనవలే ఈ లోకాన్నీ పట్టిపీడించే దుష్టశక్తుల ఉద్ధృతినే సూటిగా చెప్పటంచేత ఈ శతకం సామాన్య ప్రజానీకానికి పదే పదే చదువుకోవా లనిపిస్తుంది. ఈవిధంగా శతకాలకు తలమానికమైంది - శ్రీకాళహస్తీశ్వరశతకం!!

'శివ మస్తు'



# బాలవాక్కు !

## శ్రీమద్రామానుజాచార్యులు

శ్రీవేంకటేశ్వరునే సర్వంగా తలచి అర్చించినవారిలో శ్రీభగవద్రామానుజాచార్యులవారు ముఖ్యులు.

శ్రీరామానుజాచార్యులవారు క్రీ.శ. 1017 వ సంవత్సరంలో కాంతిమతి, కేశవ సోమయాజి దంపతులకు చైత్రశుద్ధ పంచమి ఆరుద్రనక్షత్రంలో కర్కాటకలగ్నంలో జన్మించారు. చిన్నప్పటినుంచే ఎప్పుడూ హరి నామస్మరణలోనే కాలం గడిపేవారు. ఉపనయనం కాగానే రామానుజులవారికి తంజమాంబ అనేకన్యతో వివాహం జరిగింది. ఆ తరువాత కొంతకాలానికి తండ్రి మరణించటంతో ఆచార్యులవారు కాంచీపురం చేరి, అక్కడ సర్వవిద్యాపారంగతులైన యాదవప్రకాశులవారిని ఆశ్రయించి, సకలశాస్త్రాలనూ అభ్యసించారు. ఆ కాలంలో శ్రీరంగంలో యామునాచార్యులు అనబడే మహాపండితుడు ఉండేవారు. వారు రామానుజాచార్యులవారిగురించి విని, ఆచార్యులవారిని ఎలాగైనా చూడాలని తలచి, తనశిష్యుడైన మహాపూర్ణు డనేవానిని పంపారు. మహాపూర్ణుడు గురువాజ్ఞప్రకారం వెంటనే బయలుదేరి, కాంచీపురం చేరి, రామానుజులవారిని కలిసి, తాను వచ్చిన విశేషం విన్నవించాడు. మహానుభావులైన యామునాచార్యుల వారిని కలవటంకంటే మించినభాగ్యం ఏముంటుం దని తలచి, రామానుజులవారు ఎంతో సంతోషంగా ఒప్పుకున్నారు.

రామానుజులవారు, మహాపూర్ణులవారు కలిసి అనేక వేదవిశేషాలను ముచ్చటించుకుంటూ శ్రీరంగం చేరారు. ఊరు చేరగానే యామునాచార్యులవారు పరమపదించినా రనే ఘోర వార్త వీరిచెవినపడింది. 'అయ్యో! ఆ మహాపురుషుణ్ణి దర్శించలేక పోయానే' అని రామానుజాచార్యులవారు ఎంతో బాధపడుతూ, వారిభౌతికశరీరానికి నమస్కరించారు. ఆ క్షణంలో రామానుజులవారికి యామునాచార్యులవారిదేహంలో ఒక విశేషం కనబడింది. వారికుడిచేతియొక్క మూడువ్రేళ్ళు ముడుచుకుని ఉన్నాయి. అక్కడ ఉన్న వారందరికీ ఈ విషయం చెప్పగా అలా ఎందుకు ఉన్నాయో ఎవరికీ అర్థం కాలేదు. అప్పుడు శ్రీరామానుజులవారు ఒక్కక్షణం కనులు మూసుకుని ధ్యానింపగా భగవదనుగ్రహంవల్ల వారికి జరిగినవిషయం గోచరించింది. ఆచార్యులవారు మూడుకోర్కెలు తీరకుండానే తనువు చాలించారు. అవేమిటంటే మొదటిది– ఈ లోకంలో భక్తి, జ్ఞానమార్గాలను విశేషంగా ప్రచారం చేసేవా రెవ్వరూ లేరే అని, రెండవది– వైష్ణవమతాన్ని దీక్షతో వ్యాపింపచేసేవారే లే రని, ఇక మూడవ ఆలోచన–మహాపురుషులైన వ్యాస, పరాశర మునిసత్తముల తిరునామాలు ఎంతో సదాచారసంపన్నులైన ఇద్దరు వైష్ణవాచార్యులకు పెట్టా లన్నది. యామునాచార్యులవారు ఈ మూడుకోర్కెలు తీరకుండానే మరణించినా రని గ్రహించి, తాను ఈ మూడూ తప్పక తీరుస్తా నని ప్రతిజ్ఞ చేశారు. తత్క్షణమే ఆచార్యులవారి మూడువ్రేళ్ళు సరిగ్గా వచ్చాయి.

శ్రీరామానుజులవారు అనేకవైష్ణవక్షేత్రాలను దర్శించారు. ఆపరంపరలోనే శ్రీనివాసునికి నిత్యపూజాకైంకర్యాలను క్రమబద్ధం చేసిన అనంతరం–ఆచార్యులవారు బంగారు అలిమేలుమంగ ప్రతిమను తయారుచేయించి,శ్రీనివాసునిహృదయంలో కుడివైపున అలంకరింపచేశారు. ఆ రోజు శుక్లపక్షద్వాదశి, ఉత్తరఫల్గునీ నక్షత్రం శుక్రవారం. అందుకే శుక్రవారం అభిషేకం ఆలయ సేవలో అత్యంతప్రాముఖ్యత సంతరించుకున్నది. అటు తర్వాత ఆచార్యులవారు కొంతకాలం తిరుమలపైననే ఉండి, స్వామి వారిని సేవించుకున్నారు. తన శేషజీవితమంతా శ్రీనివాసుని విశేషాలను భక్తులకు విశదీకరిస్తూ– తనజీవితం ధన్యం చేసుకున్న మహాపురుషులు శ్రీమద్రామానుజాచార్యులవారు.




కొచ్చి యగ్నేష్, 8వ తరగతి
S/o కొచ్చి శేషగిరి,
ఇ.నెం.7-1-46, ఆర్.ఎస్.మాడవీధి,
తిరుపతి - 517 501.

## డయల్ యువర్ ఈ.ఓ. కార్యక్రమం - 01-03-2013
## భక్తుల సమస్యలు - సూచనలు - ఈ.ఓ. గారి ప్రతిస్పందన - కార్యప్రణాళిక

*(ప్రతినెల మొదటిశుక్రవారం తిరుమల తిరుపతి దేవస్థానం కార్యనిర్వహణాధికారితో* ***'డయల్ యువర్ ఈ.ఓ.'*** *కార్యక్రమంద్వారా భక్తులు ఫోనులో మాట్లాడేఅవకాశం ఏర్పాటుచేసింది. వివిధప్రాంతాల భక్తులు కార్యనిర్వహణాధికారిగారికి చేసినసూచనలు, వివరాలు కొన్ని, ఇక్కడ పొందుపరుస్తున్నాం.)*

**అంగప్రదక్షిణం టోకెన్లు ఇచ్చే కౌంటరుక్యూలో సిబ్బంది దురుసుగా ప్రవర్తిస్తున్నారు. అలాగే అంగప్రదక్షిణసమయాన్ని పెంచే వీలుందా.** - *దామోదరం, చెన్నై.*

**కార్యనిర్వహణాధికారి :** మేము మా సిబ్బందితో కూడి చర్చించి, తగినచర్యలు తీసుకుంటాము. అలాగే అంగప్రదక్షిణసమయాన్ని పెంచేవిధంగా ఆలోచిస్తాం. అందరికీ అవకాశం కల్పిస్తాం.

**సెక్యూరిటీ సిబ్బందిని విషయసేకరణకై ప్రశ్నించినపుడు సరియైనసమాధానం ఇవ్వడం లేదు.**

- *జగన్నాథం, అమలాపురం.*

**కార్యనిర్వహణాధికారి :** ఇదివరకే వారికి శ్వేతభవనంలో శిక్షణ నిప్పించడం జరిగింది. మరలా మరొకసారి అందరితో చర్చించి, ఒక నిర్ణయం తీసుకుంటాము.

**శ్రీవేంకటేశ్వరభక్తిఛానల్ డి.టి.హెచ్.లో ప్రసారంకావడం లేదు. అందులో ప్రసారం చేయడానికి ఏమైనా రుసుము తీసుకుంటారా.** - *పరమేశ్వరరావు, ఒరిస్సా.*

**కార్యనిర్వహణాధికారి :** శ్రీవేంకటేశ్వరభక్తిఛానెల్ అనేది ఫ్రీ టు ఎయిర్ ఛానెల్. దీనికి ఎటువంటి రుసుము అవసరం లేదు. మీరు మీ డి.టి.హెచ్.ఆపరేటర్ని శ్రీవేంకటేశ్వరభక్తిఛానల్ని ప్రసారంచేయమని అడగండి.

**శ్రీనివాసమంగాపురంలో స్నానం చేయడానికి వసతి లేదు. సిబ్బందిని అడిగితే సరియైనసమాధానం లేదు.**

- *క్రిష్ణప్ప, బెంగుళూరు.*

**కార్యనిర్వహణాధికారి :** అక్కడ అన్నివసతులు కల్పించడానికి మేము ఆర్కియాలజీ విభాగంవారిచే చర్చించాల్సి ఉంది. వీలైనంత తొందరలో పరిష్కరిస్తాము.

**శ్రీ వేంకటేశ్వర భక్తిఛానెల్లో విమానగోపురంమీద వేంకటేశ్వరస్వామిని చూపించడం వీలవుతుందా.**

- *పద్మజ, అమెరికా.*

**కార్యనిర్వహణాధికారి :** అలా కుదరదు. అలా నమూనా ఆలయంలోనున్న విమానవేంకటేశ్వరునిమాత్రమే శ్రీవేంకటేశ్వరభక్తిఛానెల్లో చూప వీలౌతుంది.

**అతిరాత్రయాగం, ఇష్టియాగం మొదలైనవి జరిపితే బాగుంటుంది. అలాంటియాగాల్లో ఉచితంగా అందరూ పాల్గొనచ్చా.** - *ఇందిరాలక్ష్మి, తిరుపతి.*

**కార్యనిర్వహణాధికారి :** శ్రీనివాసమంగాపురంలోనూ, తిరుచానూరులోనూ శాంతియాగం, అతిరాత్రయాగం, కారీరిష్టి యాగాలు జరిపాము. ఇంకనూ అన్ని దేవాలయాల్లోనూ జరపా లనుకుంటున్నాం. ఇందులో అందరూ పాల్గొనచ్చు.

**మూడులక్షలమంది జనాభాకుగాను ఒక్క సేవా టిక్కెట్టు మాత్రమే లభిస్తోంది. కోటా పెంచగలరు.**

- *సుదర్శనరెడ్డి, ప్రొద్దుటూరు.*

**కార్యనిర్వహణాధికారి :** అన్నిదేవాలయాల్లోనూ సమాచార కేంద్రాలు ఏర్పాటు చేసి, తద్వారా అడ్వాన్స్ బుకింగ్ చేసుకోవడానికి అవకాశం కల్పించాము.

**వృద్ధులు మెట్లెక్కడానికి ఇబ్బంది పడుతున్నారు. సామానులు పెట్టుకోవడానికి మరియు స్నానపుగదులకు కష్టంగా నున్నది.**

- *అరుణకుమారి, సికింద్రాబాదు.*

**కార్యనిర్వహణాధికారి :** పాత అన్నదానంవద్ద అన్ని ఏర్పాట్లు ఉన్నాయి. ప్రత్యేకించి ఆడవారికి 100 మరుగుదొడ్లు, 500 లాకర్స్ ఏర్పాటు చేయబడ్డాయి.

**60 సంవత్సరాలు దాటిన స్త్రీలకు శ్రీవారిసేవ చేసుకొనే అవకాశం ఉన్నదా?** - *నిర్మల, హనుమకొండ.*

**కార్యనిర్వహణాధికారి :** "ఆండాళ్ గ్రూప్" అనే సమూహంలో చేరినట్లైతే నిరభ్యంతరంగా పాల్గొనవచ్చు. ఒక్కరుగా రాకూడదు. ఆన్లైన్లోనైనా మీపేరు నమోదు చేసుకోవచ్చు.

# ఆదిశంకరులు

కె.మల్లికార్జున

శ్రీ జగద్గురు ఆదిశంకరాచార్యులు వైశాఖశుక్లపంచమి రోజున జన్మించారు. ఆ పర్వదినాన్ని భారతదేశంలో ఆదిశంకరులజయంతిగా జరుపుకుంటారు.

ఆదిశంకరాచార్యులు కాశీక్షేత్రంలో విశ్వేశ్వరునిదర్శనం పొంది, స్వామివారిఅనుగ్రహానికి పాత్రుడైనారు. అద్వైతమతాన్ని ఉద్ధరించడానికి దీక్షపూనారు. పిమ్మట శంకరాచార్యులు కుమారిల భట్టుకోరికమీద అతనిశిష్యుడైన మండనమిశ్రుణ్ణి జయించడానికి మహిష్మతీనగరం చేరాడు.

ఆరోజున మండనమిశ్రుడు శ్రాద్ధకార్యం నిర్వహిస్తు న్నాడు. వ్యాసజైమినుల్ని బ్రాహ్మణార్థం ఆహ్వానించాడు. భవన ద్వారాలు మూసిఉన్నాయి. శంకరులు ఆకాశమార్గంలో లోనికి ప్రవేశించారు. శంకరుణ్ణి సన్న్యాసిగా గుర్తించి, భిక్ష స్వీకరించా లని కోరాడు - మండనమిశ్రుడు.

'మండనమిశ్రా! నేను అన్నభిక్ష కోరి నీ ఇంటికి రాలేదు. వాదభిక్షను కోరివచ్చాను. వేదాంతతత్త్వం తెలియక-నీవు కర్మమే బ్రహ్మ మని ప్రచారంచేస్తున్నావు. నిన్ను జయించి, వేదాంత సిద్ధాంతాన్ని లోకంలో వ్యాప్తిచేయా లని వచ్చాను. వాదంలో ఓడినవాడు గెలిచినవానికి శిష్యుడు కావాలి. అదీ పందెం! దానికి సిద్ధపడు-లేనిచో ఓడిపోయా నని అంగీకరించు" అని చెప్పాడు - శంకరుడు.

"ఓ శంకరాచార్య! శ్రుతిసమ్మతమైన కర్మసిద్ధాంతాన్ని వదలి, నీ అద్వైతాన్ని అంగీకరించను. రేపే సభామధ్యంలో మనవాదం" అని మండనమిశ్రుడు సమాధానం చెప్పాడు. వ్యాసజైమినులను చూచి, "మహనీయులారా! మా వాదానికి మీరు సాక్షులుగా ఉండండి" అని ప్రార్థించాడు. వారు అంగీ కరించలేదు. "మండనమిశ్రా! నీ భార్య ఉభయభారతి సాక్షాత్తు సరస్వతీదేవి అవతారం. ఆమె మధ్యస్థురాలుగా ఉంటుంది. ఆమె తగినవిధంగా నిర్ణయించగలదు" అని వారు చెప్పారు.

మరుసటిరోజున ఉభయభారతి సభాధిపత్యం స్వీకరిం చింది. శంకరమండనమిశ్రుల వాదప్రతివాదాలు ప్రారంభ మయ్యాయి.

"శంకరయతీంద్రా! కర్మంవల్ల ముక్తి కలుగుతుంది. జీవులు ఆయుష్షు ఉన్నంతవరకు కర్మను ఆచరించవలసిందే! నేను ఓడిపోతే సన్న్యాసం స్వీకరించి, కాషాయాంబరాలు ధరి స్తాను" అని మొదలుపెట్టాడు - మండనమిశ్రుడు.

"మండనమిశ్రా! ఏది నీవు? ఈ దేహం నీవు కావు. పంచేంద్రియాలు నీవు కావు. కర్మేంద్రియాలు నీవు కావు. ఈ దేహం నేడో రేపో నశించి పోయేదే! ఆత్మ ఒక్కటే శాశ్వతం. అదే సత్యం! ఆ సత్యమే బ్రహ్మ. ఆ బ్రహ్మమే నీవు. జీవేశ్వరులకు భేదం లేదు" అన్నాడు - శంకరుడు.

"మరి యతీంద్రా! ఈ జీవుడు పాపపుణ్యాలమధ్య నలిగిపోతూ, అజ్ఞానంలో కొట్టుకొనిపోతున్నాడు. ఈ జీవుడే పరమేశ్వరుడు- ఈ జీవుడే పరబ్రహ్మము అంటే నేను ఎలా అంగీకరించగలను?" అన్నాడు - మండనమిశ్రుడు.

"మండనార్యా! అజ్ఞానమే దీనికి కారణం. అజ్ఞానం వల్ల తానే పరబ్రహ్మ నని తెలుసుకోలేకపోతున్నాడు. జ్ఞానంవల్ల జీవుడే ఈశ్వరుడు అనే సత్యం అవగతమవుతుంది" - అని బదులు చెప్పాడు-శంకరుడు.

ఇరువురూ వేదవేదాంగాలలోనివాక్యాలను ప్రమాణంగా తీసుకొని వాదిస్తున్నారు. వారివాదనలు అంత సులభంగా తేల వని గ్రహించింది - ఉభయభారతి. రెండుపుష్పమాలలను తెప్పించి, ఇద్దరిమెడల్లోనూ వేసింది. "ఎవరిమెడలో మాల వాడిపోతే, వారు ఓడిపోయినట్లు" అని పేర్కొంది. వాదనలు అయిదారురోజులు గడిచాయి. మండనమిశ్రునివాదనలో పసతగ్గింది. ఆయనమెడలోని మాల వాడిపోయింది. మండన మిశ్రుడు ఓడిపోయినతరువాత ఉభయభారతి, సభాధిపత్యాన్ని విడిచిపెట్టి, తానే వాదనకు ముందుకు వచ్చింది.

**2013, మే 15న**
**శ్రీశంకరజయంతి**
**సందర్భంగా... ఈ వ్యాసాన్ని ప్రచురిస్తున్నాం**

"శంకరయతీంద్రా! భార్యాభర్తలకు దేహం ఒక్కటే. నా భర్తను జయించి, అర్ధజయాన్ని పొందావు. నన్ను కూడా జయించి, పూర్తివిజయాన్ని సొంతం చేసుకో" అని చెప్పి, ఆమె వాదన ప్రారంభించింది.

ఉభయభారతి సాక్షాత్తు సరస్వతీదేవిఅంశ. శాపవశాన సరస్వతీదేవి విష్ణుమిత్రునికి కుమార్తెగా జన్మించింది. వేదాన్ని ఉద్ధరించుటకు బ్రహ్మదేవుడు మండనమిశ్రుడు అనేపేరుతో హిమమిత్రునికి పుత్రుడుగా జన్మించాడు. మండనమిశ్రునితో ఉభయభారతికి వివాహం జరిగింది.

ఉభయభారతీ శంకరులవాదం పదునేడురోజులు సాగింది. ఉభయభారతి తనకు అపజయం తప్ప దని అను కునింది. బాల్యంలో సన్న్యాసం తీసుకున్న శంకరుణ్ణి ఓడించటా నికి కామశాస్త్రమే సాధన మని భావించింది.

ఉభయభారతి కామశాస్త్రపరమైన ప్రశ్నలు వేసింది. 'వీటిల్ని సమాధానించలేకపోతే ఓడినా నని అంగకరించు' – అనింది.

శంకరులు ఒక్కక్షణం నిరుత్తరు లైనారు. మాతృస్థానీయ యైన అపరసరస్వతి – ఉభయభారతి ఈ విధంగా అడుగు తుం దని ఊహించలేదు. ఈ ప్రశ్నలకు సమాధానాలు చెప్పాలా? వద్దా? చెబితే తన సన్న్యాసాశ్రమధర్మానికి భంగం కలుగుతుందేమో? అనే ఆలోచనలో పడినాడు – శంకరుడు. అప్పటికి శంకరునివయస్సు పదహారేళ్లే!

"అమ్మా! నాకు ముప్పైరోజులు గడువు ఇవ్వు. నీ ప్రశ్నలకు సమాధానాలు చెబుతాను." అన్నాడు – శంకరులు. 'సరే నని' అంగీకరించింది – ఉభయభారతి.

శంకరులు మహిష్మతీనగరంనుండి ఆకాశమార్గాన బయలుదేరాడు. దారిలో ఒకనగరం కనిపించింది. ఆదేశానికి అధిపతి అమరుకమహారాజు. అతడు వేటకు వెళ్ళి, మరణిం చాడు. రాజుయొక్క పార్థివశరీరంచుట్టూ కూర్చుని అంతఃపుర కాంతలు విలపిస్తున్నారు. శంకరుడు తన శిష్యుడైన పద్మపాదుని వైపు చూచి ఇలా అన్నాడు.

"పద్మపాదా! నేను ఈ రోజు ఈ శరీరంలోకి 'పరకాయ ప్రవేశం' చేస్తాను. ఉభయభారతిని జయిస్తాను. అద్వైత సిద్ధాం తానికి ఆవశ్యకమైన సర్వజ్ఞత్వాన్ని నిలుపుకొంటాను.

పద్మపాదా! జగత్తు మిథ్య అని భావించే ఆత్మనిష్ఠునికి కర్మఫలాలు అంటవు. శ్రీకృష్ణుడు గోపికలతో విహరించినప్ప టికినీ, ఆయన అస్ఖలితబ్రహ్మచారియే! ఆయన యోగేశ్వరుడు. అన్నింటికీ సంకల్పమే మూలం. నా సంకల్పం నీకు తెలియదా. ఈ శరీరంతోనే కామశాస్త్రపరిశీలనం చేయవచ్చు. కానీ శిష్ట

## నిజస్వర్గధామము నీదు కరము

**అమ్మపట్టిన కరము -మా**
**యమ్మచేపట్టిన కరము**
**విహ్వల గజేంద్రుని కాచిన కరము**
**భక్త ప్రహ్లాదుని బ్రోచిన కరము**
**లంకేశుని ద్రుంచిన కరము**
**మామ కంసుని మర్దించిన కరము**
**శబరిముందర సాచిన కరము**
**దయను గుహుని దరిజేర్చిన కరము**
**రణమున స్యందనము తోలిన కరము**
**ఓ అసురునిభస్మము చేసిన కరము**
**శివునివిల్లు విరచిన కరము**
**రుక్మిచెల్లెలిని తోడ్కొనిన కరము**
**ద్రౌపది మానమున్ గాచిన కరము**
**గోపికల చీర లపహరించిన కరము**
**నిజస్వర్గధామమ్ము నీదు కరము**
**అట్టి కరమున కేను, కరములు జోడింతు!**

లకుమ

సంప్రదాయం ముఖ్యం. కాబట్టి ఈ శరీరాన్ని విడిచి, అన్య శరీరంతో నాధ్యేయం నిర్వహించాలి" అని చెప్పాడు- శంకరుడు.

"శిష్యులారా! నేను మరల నా శరీరంలో ప్రవేశించే వరకు మీరు ఇక్కడే ఉండి, నాశరీరాన్ని కాపాడండి" అని శాసించాడు - శంకరుడు. అనంతరం ఒకరాయి మీద పడుకుని శంకరుడు ప్రాణవాయుశక్తితో వెలుపలికి వచ్చి, అమరుకమహా రాజుశరీరంలో ప్రవేశించాడు.

అమరుక మహారాజుశరీరం చలించింది. ఉచ్ఛ్వాస నిశ్వాసాలు మొదలయ్యాయి. రాజు బ్రతికా డని అందరూ సంతోషించి, పురోహితులు, అమాత్యులు శాంతికర్మలు చేయించి, మరల సింహాసనంపై అధిష్ఠింపజేశారు.

అదిమొదలు రాజ్యం సుభిక్షంగా ఉంది. ప్రజలు సుఖశాంతులతో ధర్మాసక్తులై ఉన్నారు. పాడిపంటలతో, అనుకూలవర్షాలతో రాజ్యం హాయిగా ఉంది.

అమరుకమహారాజుమాత్రం రాజ్యపరిపాలనను అమాత్యులకు అప్పగించి, ఎక్కువభాగం అంతఃపురంలో గడిపాడు. తనపేరిట ఒకశృంగారశాస్త్రగ్రంథాన్ని రచించాడు. అది అమరుకకావ్యంగా ప్రసిద్ధి చెందింది. మంత్రులకు, పురోహితులకు ఈ మార్పు ఎంతో ఆశ్చర్యకరంగా ఉంది. 'ఈ మార్పు ఎలా వచ్చింది?' అని ఆలోచించారు. ఈ విషయాన్ని పట్ట మహిషితోకూడా చర్చించారు. చివరకు ఒక మహానుభావుడు, యోగవేత్త తమరాజుశరీరంలో ప్రవేశించా డని గ్రహించారు. ఆ మహానుభావుడు ఎక్కువకాలం ఈ శరీరంలో ఉండడేమో అని భావించి, అతడు ఈ శరీరంలోనే ఉండిపోవ డానికి ఒక మార్గం ఆలోచించారు. దానిప్రకారం రాజ్యంలో ఎక్కడైనా మృతకళేబరాలు ఉంటే- వాటిల్ని వెంటనే రహస్యంగా కాల్చేయండి' - అని సేవకభటులను ఆజ్ఞాపించారు.

అక్కడ కొండశిఖరంమీద శంకరాచార్యులశరీరాన్ని రక్షిస్తున్నశిష్యులు తమగురువుగారిరాకకోసం ఎదురు చూస్తున్నారు. ఉభయభారతి విధించిననెలరోజులగడువు సమీపిస్తున్నది. పద్మపాదుడు కొంతమందిసహాధ్యాయుల్ని వెంటబెట్టుకొని గాయకునివేషంలో రాజాస్థానికి వెళ్లాడు. అక్కడ రాజసభలో చమత్కారంగా ఉభయభారతికథను రాజుకుమాత్రం అర్థమయ్యే రీతిలో గానం చేశారు. అప్పటికే శంకరులకార్యం పూర్తి అయింది. మరల తనశరీరంలోకి ప్రవేశించడానికి ఉద్యుక్తుడవుతున్నాడు.

కొండశిఖరంమీద ఉన్న శంకరుని శరీరాన్ని గుర్తించి, రాజసైనికులు నిప్పుపెట్టారు. శంకరుడు రాజశరీరం వదలిపెట్టి, తననిజశరీరంలోకి ప్రవేశించాడు.

శరీరం అప్పటికే మండుతూంది. అగ్నితాపాన్ని శాంతింపచేయడానికి "లక్ష్మీనృసింహ! మమ దేహి కరావలంబమ్" అంటూ శ్రీనరసింహస్వామిని స్తుతించాడు. స్తోత్రం పూర్తి అయ్యేసరికి మంటలు పూర్తిగా తగ్గిపోయాయి. శరీరం యథాస్థితికి వచ్చింది.

ఆదిశంకరుడు లేచికూర్చున్నాడు. ఇంక ఉభయభారతిని జయించడానికి ఆకాశమార్గాన మహిష్మతిపురానికి చేరుకున్నాడు. ఉభయభారతిభర్త మండనార్యుడు శంకరులను ఆహ్వానించి, మందిరానికి తీసుకుని వెళ్ళాడు. వాదం ప్రారంభం కాగానే ఉభయభారతి తన ఓటమిని అంగీకరించింది. "మీకు సంపూర్ణవిజయం చేకూరింది" అని పలికి సాష్టాంగ నమస్కారం చేసింది.

అప్పుడు ఉభయభారతిని 'అమ్మా! నా దొకవిన్నపం. నీ భక్తుడనైన నేను స్థాపించేమఠాలలో నీవు నెలకొని ఉండాలి. "శారదానామంతో పూజలు అందుకుంటూ-ప్రజలకు సన్నిహితవై, ఇష్టకామ్యాలను అనుగ్రహిస్తుండాలి" అని అర్థించాడు- శంకరుడు. అందుకు ఉభయభారతి అంగీకరించి, ఆక్షణంలోనే అదృశ్యయై సత్యలోకం చేరింది.

మండనార్యుడు ఆడినమాటప్రకారం సన్న్యాసాశ్రమం స్వీకరించాడు. శంకరులు మండనార్యునికి "సురేశ్వరాచార్యులు" అని సన్న్యాసినామం అనుగ్రహించారు. శంకరులు దేశపర్యటలో శృంగేరికి చేరారు. అక్కడ ఉభయభారతి శారదా మాతగా సుప్రతిష్ఠిత అయింది. అక్కడే మొట్టమొదలు శారదా పీఠం నెలకొనింది. సురేశ్వరయతీంద్రులను ఆ పీఠానికి అధిపతిని చేశారు - ఆదిశంకరులు.

తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి

# 'శ్రీవారిసేవ' వాలంటీర్లకు మార్గదర్శకసూత్రాలు

**శ్రీవారిసేవలో ఒక వారంపాటు సేవ లందించుటకై పదిమంది సభ్యులకు తక్కువ కాకుండా ఉన్న సముదాయానికి అర్హత లభిస్తుంది. నిస్స్వార్థసేవ అందించుటకుగాను ఈ సభ్యులకు ఆధ్యాత్మికపరిజ్ఞానం ఉండాలి. స్త్రీపురుషభేదం లేదు. ఆసక్తిగల సమూహంలోని సభ్యులు వారియొక్క పేరు, చిరునామా, వయస్సు, స్త్రీలు/పురుషులు, మొదలైన వివరాలతో ఒక నెల ముందుగా "పౌరసంబంధాధికారి, తిరుమల తిరుపతి దేవస్థానములు, కపిలతీర్థం రోడ్డు, తిరుపతి - 517 501" అనే చిరునామాకు పంపాలి. మరిన్ని వివరాలకు సంప్రదించవలసిన ఫోన్ నంబర్లు : 0877 - 2263544, 0877 - 2264392.**

- శ్రీవారిసేవ వాలంటీర్లు శ్రీవారిసేవలో భక్తులకు నిస్స్వార్థంగా సేవ లందించడానికిమాత్రమే రావలెను.
- వీరు పిల్లలు, వృద్ధులు మరియు వ్యాధిగ్రస్తులను తమవెంట తీసుకొని రాకూడదు.
- శ్రీవారిసేవకు కేవలం హిందువులుమాత్రమే అనుమతింపబడతారు.
- శ్రీవారిసేవకులను హిందువులుగా గుర్తించడానికి అనుకూలంగా తిరునామం/ తిలకం లేక కుంకమ/ చందనం తప్పక నుదుట ధరించాల్సి ఉంటుంది.
- తిరుమలలో ఆర్.టి.సి. బస్టాండులో ఉన్న **శ్రీవారి సేవాసదన్** కార్యాలయంలో ప్రత్యేకాధికారి లేదా సూపరింటెండెంట్‌గారి వద్ద ఆర్డరు ఇచ్చిన తేదీ ప్రకారము ఉదయం పదిగంటలనుండి సాయంకాలం ఐదుగంటలలోపు హాజరుకావల్సి ఉంటుంది.
- శ్రీవారిసేవా కార్యాలయంవద్ద ప్రతిరోజు సాయంకాలం నాలుగుగంటలకు డ్యూటీ కేటాయించబడుతుంది. వీరు ప్రతిరోజు కనీసం నాలుగునుండి ఆరు గంటలు పనిచేయాల్సి ఉంటుంది.
- ఈ సేవకులకు ఉచితవసతి కల్పించబడుతుంది. వీరికి యాత్రికుల అమెనిటీస్ కాంప్లెక్సులో వసతి కల్పించినచో లాకరుకు స్వంతతాళంచెవులు తెచ్చుకోవలసిఉంటుంది.
- సేవలో ఉన్నప్పుడుమాత్రమే శ్రీవారిసేవ స్కార్ఫ్‌లను ధరించవలెను. శ్రీవారిదర్శనానికి వెళ్లునపుడు వీటిని ధరించాల్సినఅవసరం లేదు.
- శ్రీవారిసేవకులు ప్రతిశుక్రవారం ఉదయం 7 గంటలకు ఆస్థానమండపమందు ఏర్పాటుచేసేశిక్షణ తరగతులకు విధిగా హాజరు కావాలి.
- శ్రీవారిసేవకులు సేవలో పాల్గొనేసమయంలో పురుషులు తెలుపురంగు వస్త్రాలను, స్త్రీలు తెలుపురంగు రవికె, నీలంరంగు చీర తప్పనిసరిగా ధరించాలి.
- తిరుమలలో ఎల్లప్పుడు **'గోవింద'**నామాన్ని స్మరిస్తూ, భక్తులను **'గోవింద, గోవింద'** అని పలకరించాలి.
- యాత్రికులకు సహాయంకోసం ఈ వాలంటరీసేవ ఏర్పాటు చేయడమైనది. ఎవరికిగాని ధనరూపంగా, వస్తురూపంగా ఎటువంటి చెల్లింపులు చేయనవసరం లేదు. ఈ సేవ పూర్తిగా ఉచితం.
- ప్రతిరోజు వీరు భజనలు, నగరసంకీర్తనలలో పాల్గొనవలసిఉంటుంది. శ్రీవారిసేవా కార్యాలయంలో అందుబాటులో ఉన్న సంగీతవాద్యాలను శ్రీవారిసేవకులు ఉపయోగించుకోవచ్చు.
- శ్రీవారిసేవకులు వేంకటేశ్వరునికి చేసేపవిత్రసేవగా భావించి, శ్రీవారిసేవను అంకితభావంతో చేయాలి.

# తాళ్లపాక చిన్నన్న

ఎస్. ధనంజులయ్య

తాళ్లపాక అన్నమాచార్యులు కుమారుడగు పెదతిరుమలాచార్యుని ఐదుగురికుమారులలో చినతిరువేంగళనాథుడు నాల్గవవాడు. ఇతనికి చిన్నన్న అనే నామాంతరం కలదు. ఇతనికి చిన్నన్న, తిరువేంగళనాథయ్య, తిరువేంకటనాథర్, తిరువేణాధర్, తిరువేణాదయ్యర్ అను నామాంతరాలున్నాయి. పూర్వపండితలోకంలో ద్విపదకు ఉన్నపేరును- ఉత్కృష్టమూ, లాక్షణికమూ అగు తన ద్విపదరచనమూలంగా తొలగించి, వాటికి కావ్యత్వసిద్ధిని కల్గించాడు. తాతగారిజీవిత చరిత్రను సమగ్రంగా, ప్రామాణికంగా రచించాడు.

ఇతడు సుకవి, పండితుడు. కవితారచనలకు ఉద్యమించాడు. చిన్నన్న శాసనాలను, రచనలను పరిశీలించగా వైష్ణవమతప్రచారానికి చాలాపాటుపడిన వా డని తెలుస్తూంది.

## రచనలు

చిన్నన్నరచనలు సాధారణంగా వైష్ణవమతానికి సంబంధించినవిగాక, కథాపరంగా ద్విపదలో రచించడం విశేషంగా కనబడుతున్నవి. 1)ఉషాకల్యాణం 2)అష్టమహిషీకల్యాణం 3)పరమయోగివిలాసం 4)అన్నమాచార్యచరిత్ర.

### 1) ఉషాకల్యాణం :

ఈ కావ్యంలో సుమారు వేయిద్విపదలు ఉన్నాయి. వీటిలో బలిచక్రవర్తివందమందికుమారులలో ఒకడు బాణాసురుడు. ఇతనికూతురైన ఉషను శ్రీకృష్ణునిమనుమడు అనిరుద్ధుడు వివాహమాడడం ఇందలి వృత్తాంతం.

### 2)అష్టమహిషీకల్యాణం

ఈ కావ్యంలో ప్రథమాశ్వాసంలో శ్రీకృష్ణావతారం, శ్రీకృష్ణునిబాల్యక్రీడలు, ద్వితీయాశ్వాసంలో కృష్ణలీలామాహాత్మ్యం, గోపికలతోడిసరసల్లాపాలు, తృతీయశ్వాసంలో కంసునివధ, జరాసురయుద్ధం, చతుర్థాశ్వాసంలో-ప్రథమపట్టమహిషియగు రుక్మిణీదేవీపరిణయవృత్తాంతం, పంచమాశ్వాసంలో జాంబవతి, సత్యభామ, కాళింది, మిత్రవింద, సత్యకీర్తి, భద్రాదేవి, లక్ష్మణాదేవులవివాహవృత్తాంతాలు వర్ణించబడ్డాయి.

తాళ్లపాక చిన్నన్న ఇందలికథాంశాలను సంస్కృత భాగవతం దశమస్కంధాన్ని అనుసరించి, రచించినట్లు తెలుస్తున్నది. చిన్నన్న పేర్కొన్న అష్టమహిషులు ఈ విధంగా ఉన్నారు- రుక్మిణి, జాంబవతి, సత్యభామ, కాళింది, మిత్రవింద, సత్యకీర్తి, భద్ర, లక్షణ. ఈ అష్టమహిషుల పరిణయవృత్తాంతాలు ఈ కావ్యంలో వర్ణింపబడిఉన్నాయి.

### పరమయోగివిలాసం

తాళ్లపాకచిన్నన్నరచనలలో ఇది ఒకరచనగా పేర్కొన్నారు. ఇది పన్నిద్దరాళ్వారులచరిత్రలను తెలిపే తొలి తెలుగు గ్రంథం. ఇది 8 ఆశ్వాసాల ద్విపదగ్రంథం. ఇందులో 12,754 ద్విపద పంక్తులు ఉన్నాయి. చిన్నన్న తాను ఈ కృతిని జలజాతవాసినిచనుబాలపుష్టిచే సమకూర్చుకున్న కవితాశక్తిచే రచించాడు. విశిష్టాద్వైతసిద్ధాంతంలో సామాన్యంగా భగవద్భక్తుల కన్న భాగవతభక్తికి వైశిష్ట్యం అంగీకరించడం సంప్రదాయం. దానికి అనుగుణంగా భగవద్భక్తులు, పరమయోగులైన పన్నిద్దళ్వారులదివ్యచరిత్రలను కీర్తిస్తూ, వారి చరిత్రలను సమగ్రముగా అభివర్ణిస్తూ, పరమయోగివిలాసకావ్యం రచించినాడు.

### 4) అన్నమాచార్యచరిత్ర

తాళ్లపాక చిన్నన్న రచనలలో మరొకటి అన్నమాచార్య చరిత్ర. ఇది తాతగారిజీవితచరిత్రను మనుమడు వ్రాయడం విశేషంగా కనిపిస్తుంది. ఇది 570 ద్విపదలు గల ప్రబంధం. చిన్న చారిత్రకకథాకావ్యం. ఇది పిట్టకొంచెం కూతఘనం అనడానికి ఒక ఉదాహరణ.

అన్నమాచార్యజీవితచరిత్ర అత్యంతసుప్రసిద్ధమైంది. ఇది అందరికి తెలిసిందే. పూర్వం ప్రాచీనకవులకు స్వీయ చరిత్రలు గాని, జీవితచరిత్రలుగాని వ్రాసే అలవాటు అంతగా కనిపించడంలేదు. కాని, చిన్నన్నవ్రాయడం విశేషమైన విషయం!

# కృపాకటాక్షం!

ఎం. హేమలత

మాది గుంటూరుజిల్లాలో నర్సరావుపేట మండలం. మాది మధ్యతరగతి కుటుంబం. కలియుగదైవం శ్రీవేంకటేశ్వరస్వామి మా జీవితంలో ఎల్లప్పుడూ వెన్నంటి ఉండి ఆపన్నహస్తం అందిస్తూ ఉన్నాడు. మాకు ఇద్దరు అబ్బాయిలు. మా పెద్దబ్బాయి డిగ్రీ అయిన తర్వాత ఉద్యోగం కోసం హైదరాబాదుకు పంపించాము. ఆ రోజుల్లో నెలకు 2 లేక 3 వేలుజీతంతో ఉద్యోగం దొరికితే చాలు, జీవితం సంతోషంగా గడిచిపోతుంది అని అనుకునేరోజులు. హైదరాబాదులో హార్డ్‌వేరు నేర్చుకుంటూ ఉద్యోగ ప్రయత్నం చేసేవాడు.

వాడికి మంచిమార్గం చూపించ మని ఆదేవదేవుణ్ణి రోజూ ప్రార్థించేదాన్ని. అలాంటి నేను అనుకోకుండా ఒకరోజు నా బిడ్డకు నెలకు 10 వేలు జీతంతో ఉద్యోగం రావాలి. మొదటినెల జీతంలో సగం స్వామిహుండీలో వేస్తాము, అని వేడుకున్నాను. నా మనస్సులో ఆ ఆలోచన వచ్చేలా చేసింది ఆ స్వామియేకదా అని అనుకున్నాను. తర్వాత మా బాబుకి అదే సంస్థలో వెయ్యిరూపాయలకు ఉద్యోగం దొరికింది. అలా 5, 6 నెలలు గడచి పోయాయి. ఒకరోజు రాత్రి 12 గంటలకు మా బాబు పనిచేసే కార్యాలయం యజమాని మా బాబుకి ఫోను చేసి అత్యవసరంగా రమ్మని చెప్పాడు. సరే మా బాబు వెంటనే కార్యాలయానికి వెళ్ళాడు. అక్కడ ఇంకొక సంస్థ యజమానికూడ ఉన్నారు. ఆయన మా బాబుతో వెంటనే, "నీకు మా కంపెనీలో ఉద్యోగం ఇస్తున్నాను, జీతం పదివేలు, రేపే జాయినవ్వాలి" అన్నాడు. కనీసం సర్టిఫికెట్లు, అర్హతలు ఏమీ అడగలేదు. మా బాబుకి నోటమాట రాలేదు. ఆశ్చర్యపోయాడు. వెంటనే మాకు ఫోన్‌చేసి చెప్పాడు. మరుసటిరోజే ఉద్యోగంలో చేరిపోయాడు. కటింగ్స్ ఏమి లేకుండా నేను ఎలా ప్రార్థించానో అలాగే మొత్తంజీతం అందింది. ఇదంతా ఆ స్వామి కరుణాకటాక్షమే.




మేము అనుకున్న విధంగా ఆ స్వామిని దర్శించుకుని 5 వేలు ఆ స్వామి హుండీలో వేసి మొక్కుతీర్చుకున్నాం. సర్వ కాలసర్వావస్థలయందు వెన్నంటి కాపాడే ఆ చల్లనితండ్రి. 2 సంవత్సరాల తర్వాత విప్రోకంపెనీలో మాబాబుకు 40వేలతో మంచి ఉద్యోగం దొరికింది. స్వామిదయ వల్ల మంచిసంబంధం కుదిరి పెళ్లైంది కూడా!

ఆ స్వామిదయవల్ల మా చిన్నబ్బాయికి కూడా వివాహం అయింది. మేమందరం కుటుంబసమేతంగా ఆస్వామికి మెట్లపూజ చేసి, దర్శనం చేసుకున్నాము. మా సంతోషానికి కారణం ఆ స్వామి కరుణాకటాక్షాలే!

# అక్షయతృతీయ

డా॥పురాణపండ వైజయంతి

**అక్షయంబుగ కాశిలోపల....**

తెలుగులో మనకు మొత్తం 56 అక్షరాలు ఉన్నాయి. అంటే అ నుంచి క్ష వరకు ఉన్నవి. ఈ అక్షరాలతో అక్షయమైన సాహితీసంపదను సృష్టిస్తున్నారు–మేధావులు, కవులు, పండితులు. ఇది లౌకికంగా చెప్పుకునేమాట. అక్షయం అంటే వ్యవధానం లేకుండా, 'లేదు' అనకుండా నిత్యం సేవ చేసేవే. మహాభారతంలో అక్షయపాత్రగురించి తెలిసిందే. కామధేనువు, కల్పవృక్షం.... ఇవి కూడా అక్షయాలే. అక్షరాలు అంటే నాశనం లేనివి, అంటే నిరంతరం ఊటలా ఊరుతూ ఉండేవి! సంస్కృతంలో అక్షయపదానికి అంతం లేనిది అని అర్థం.

**పరమపవిత్రమైన తిథి.....**

భారతీయులు... సంవత్సరంలో మూడురోజులను పరమపవిత్రంగా భావిస్తారు. చైత్రశుద్ధపాడ్యమి, ఆశ్వయుజశుద్ధ దశమి (విజయదశమి), వైశాఖశుద్ధ తదియ (అక్షయతృతీయ). ఈ తిథులు ఆ రోజుల్లో పూర్ణంగా ఉంటాయి. ఈ మూడురోజులనూ మంచిరోజులుగా హిందువులు విశ్వసిస్తారు. అక్షయ తృతీయ హిందువులకు అతిపవిత్రమైనరోజు. వైశాఖమాసం, శుక్లపక్షం, తదియను అక్షయతృతీయ అనటం పరిపాటి. హిందువులు అనుసరించే చాంద్రమానంప్రకారం తిథులు, మాసాలు చూచినప్పుడు అందులో కొన్నిఅధికం, కొన్నిఏహ్యం అంటే తిథిద్వయం వస్తుంటాయి. కానీ ఈ తిథిమాత్రం ప్రతి సంవత్సరమూ సంపూర్ణంగా ఉంటుంది. అక్షయతృతీయను 'నవాహ్నపర్వం' అంటారు. కారణం–ఈ రోజు ఏ పనిక్రొత్తగా ప్రారంభించినా అది సఫలమవుతుం దనే అర్థంలో ఈ పేరు వచ్చింది. అక్షయతృతీయ రోహిణినక్షత్రంనాడు వస్తుంది.

ఈ తిథి ఇంటికి శుభాలను, విజయాలను చేకూర్చుతుం దనీ, ఈ రోజున దానధర్మాలు చేసినవారికి భగవంతుడు వరా లిచ్చి, ఆశీర్వదిస్తా డనీ భారతీయుల విశ్వాసం. నూతన కార్యక్రమాలను ఆరంభించడానికి ఈరోజును ఆమోదయోగ్యమైందిగా పరిగణిస్తారు. ఎందుకంటే ఈ రోజున ప్రారంభించిన పని అక్షయంగా వృద్ధిచెందుతూ ఉంటుం దని ఒక నమ్మకం.



- స్థితికారకుడైన విష్ణుమూర్తి అక్షయతృతీయతిథిని పరిపాలిస్తా డని ప్రతీతి.
- ఈ రోజునే త్రేతాయుగం ప్రారంభమయిం దనే విశ్వాసం కూడా ఉంది.
- పరమపవిత్రమైన గంగానది ఈరోజునే స్వర్గంనుంచి భూమి మీదికి ప్రవహించిం దనీ, అన్నపూర్ణాదేవి ఈ రోజునే జన్మించిం దనీ పురాణాలు, చరిత్ర చెబుతున్నాయి.
- శివపురంలో నివసించేశివుణ్ణి కుబేరుడు ప్రార్థించగా, ఆయనచే ఆశీర్వదింపబడి, సిరిసంపదలను పొందడమే కాకుండా, లక్ష్మీదేవితో పాటుగా సంపదలను రక్షించే పదవినీ కుబేరుడు చేపట్టిందికూడా ఈ రోజునే నని చెబుతారు.
- యమధర్మరాజుకుమారుడైన ధర్మరాజు ఈ రోజునే అక్షయ పాత్రను పొంది, ఆ పాత్రలో తనరాజ్యంలోని వారిఅవసరాలన్నీ తీర్చా డని చెబుతారు.
- శ్రీకృష్ణుడు రాజైనతర్వాత అతడిని కలవడానికి, కృష్ణుడి బాల్యమిత్రుడైన కుచేలుడు వచ్చిందికూడా ఈ రోజే. తాను

**అక్షయంబుగ కాశిలోపల అన్నపూర్ణ భవానివై**
**సాక్షిగణపతి కన్నతల్లివి సద్గుణావతి శాంభవీ**
**మోక్ష మొసగెడు కనకదుర్గవు మూలకారణశక్తివి**
**శిక్షజేయుదు ఘోరభవముల శ్రీగిరిభ్రమరాంబికా!**

పేదవాడు కావడంతో కేవలం అటుకులుమాత్రమే శ్రీకృష్ణునికి ఇచ్చిన కుచేలుడు, అందుకు బదులుగా శ్రీకృష్ణుడు మహారాజభవనం. అక్షయసంపదలూ ఇచ్చాడు.

- దుర్యోధనునిఆజ్ఞానుసారం దుశ్శాసనుడు ద్రౌపదీవస్త్రాపహరణం కావించగా, శ్రీకృష్ణుడు అక్షయంగా చీరలను ప్రసాదించి, ఆమెమానాన్ని కాపాడిందికూడా ఈ రోజేనట.
- ఆదిశంకరాచార్యుడు కనకధారాస్తవం చేసినరోజుకూడా అక్షయ తృతీయ. ఒక పేదబ్రాహ్మణ దంపతులు ఆదిశంకరులకు భిక్షవేయడానికి ఏమీ దొరకక పోవడంతో ఒక ఉసిరికాయను మాత్రమే భిక్షవేయగా, శంకరాచార్యులవారు చేసిన కనకధారస్తవానికి బంగారు ఉసిరి కాయలు అక్షయంగా కురిశాయని ప్రతీతి.

విష్ణుమూర్తిఅవతారాలలో ఆరవదైన పరశురాముడు ఈ రోజే జన్మించా డని, అంతేకాకుండా సముద్రంనుంచి భూమిని వెలికి తీసుకువచ్చిందికూడా ఈ రోజే నని కొన్నిగ్రంథాలు తెలియ చేస్తున్నాయి. గోవా, కొంకణప్రాంతాలు నేటికీ పరశురామ క్షేత్రాలుగానే ప్రసిద్ధి. ఒరిస్సాలో అక్షయతృతీయనాడు రైతులు పొలందున్నడం ప్రారంభిస్తారు. పూరీజగన్నాథుని రథయాత్రకు కావలసిన రథాలను తయారుచేయడం ఈ రోజునే ప్రారంభిస్తారు. ఈ రోజున గంగలో స్నానంచేసి, ఉపవాసం ఉండి, విష్ణుమూర్తిని బియ్యపుగింజలతో పూజిస్తే మంచి దని పండితులు చెబుతారు. ఈ రోజు జ్ఞానసముపార్జన చేయా లనుకున్నా, దానాలు చేసినా ఎంతో ఫలవంతం అవుతాయని ప్రతీతి.

**ఈ రోజున కుబేరునితో పాటు లక్ష్మీదేవినికూడా పూజిస్తారు. వైభవలక్ష్మిని విష్ణుసహితంగా పూజించడంలో ఆంత్యరం లేకపోలేదు. అక్షయతృతీయనాడు రాజులు తప్పనిసరిగా లక్ష్మీపూజ చేయాలి. ఆ విధంగా చేయడంవల్ల రాజ్యం సుసంపన్నంగా, సుభిక్షంగా ఉంటుం దని విశ్వాసం. మహాలక్ష్మిని పూజించేముందుగా విష్ణుమూర్తిని ఆవాహనం చేయాలి. లక్ష్మీదేవిని ప్రార్థించడంవల్ల లక్ష్మీతత్త్వం అలవడుతుంది. అంటే ధనం చేకూరుతుంది. ఈ రోజు లక్ష్మీరూపమైన బంగారుకొంటే సుమంగళీత్వం వర్ధిల్లుతుం దనీ, అక్షయభోగభాగ్యాలు సిద్ధిస్తాయనీ ప్రజలు విశ్వసిస్తుంటారు.**

ఈ రోజే త్రేతాయుగం ప్రారంభమయ్యింది. ఈ రోజే డోలాగౌరీవ్రతం, వార్తాకగౌరీవ్రతం కొన్నిప్రాంతాలలో ఆచరిస్తారు.

కొత్తవ్యాపారాలు చేయడానికి మంచిరోజు. ఈ రోజు.. బియ్యం, ఉప్పు, నెయ్యి, పంచదార, కూరలు, చింతపండు, పండ్లు, బట్టలు.... ఏది దానంచేసినా మంచిదే! కొన్నిప్రాంతాలవారు భగవంతునికి హారతి ఇచ్చే సమయంలో తులసీజలాన్ని దేవునిమీద చిలుకుతారు. బెంగాలీయులు ఈ తిథినాడు హోమాలు నిర్వర్తిస్తారు. కొన్ని ప్రాంతాలలో... ఇంటి యజమాని (మగవారు) పలుగు, పార పుచ్చుకుని పొలానికి వెళతాడు. ఎన్నోరకాల పక్షులు జంతువులు గుంపులుగుంపులుగా తరలి వెళ్లడం కనిపిస్తుంది. అంటే పంట వేసుకోవడానికి అనుకూల మనే సూచికగా ఉంటుంది. పెళ్ళిళ్లకు దీనిని అద్భుతమైనముహూర్తంగా పరిగణిస్తారు.

లక్ష్మీకటాక్షం లేనిదే మనుగడ సాధ్యం కా దనే వాస్తవం తెలిసిందే. సకలశుభాలనూ, సౌఖ్యాలనూ అందించే లక్ష్మీదేవిని పూజించి తరిద్దాం.

**వేళల్లో మార్పు**

**తిరుమలలో అంగప్రదక్షిణ టిక్కెట్లను ఇంతకుముందు సా॥ 6 గం॥లకు జారీ చేసేవారు. ఇప్పుడు మధ్యాహ్నం 2 గంటలకే విజయాబ్యాంకుకౌంటరు ద్వారా టిక్కెట్లను ముందుగా వచ్చిన వారికి ముందుగా- పద్ధతిలో జారీచేస్తున్నారు. భక్తులు దీన్ని గమనించగలరు.**

# రాశిఫలాలు

## జూన్, 2013

**జె. చంద్రశేఖరశర్మ**

### మేషం

ఈ రాశివారికి ఈ నెలలో బంధుమిత్రులవల్ల అపనిందలు, అనారోగ్యసమస్యలు ఏర్పడతాయి. విద్యా, ఉద్యోగ, వివాహప్రయత్నాలు అనుకూలం. కుజచంద్రగ్రహదోషనివారణకు ప్రత్యేకపూజలు చేస్తే, మానసికానందం కల్గుతుంది. మొదటివారం అపనిందలు, రెండోవారం గ్రహదోషపూజలు, మూడోవారం ప్రయత్నఫలం, నాలుగోవారం విజయం.

### వృషభం

ఈ రాశివారికి ఈ మాసంలో పట్టిందల్లా బంగారమౌతుంది. చంద్రగ్రహదోషనివారణకై నవగ్రహశాంతిపూజలు, దానధర్మాలు, నదీపుణ్యస్నానం ఎంతో మేలుచేస్తాయి. వృత్తి ఉద్యోగాల్లో పదోన్నతులవల్ల ఆనందం ఏర్పడుతుంది. మొదటివారం గీతాపారాయణ, రెండోవారం నవగ్రహదోషపూజలు, మూడోవారం ఆనందం, నాలుగోవారం ధనాదాయం.

### మిథునం

ఈ రాశివారికి ఆందోళనలు అధికమౌతాయి. దైవచింతన పెరుగుతుంది. శారీరక, మానసికసమస్యలు అధికమౌతాయి. వృథాశ్రమ అవుతుంది. శనిగ్రహదోషనివారణకు నవగ్రహశాంతిపూజలు తప్పనిసరి. తొందరపాటువల్ల ధననష్టం, అనారోగ్యసమస్యలు తీవ్రంగా ఇబ్బందిపెడతాయి. శస్త్రచికిత్సలకు దారితీసే అవకాశం ఉంది. మొదటివారం వృథాఖర్చు, రెండోవారం దైవారాధనలు, మూడోవారం అనారోగ్యం, నాలుగోవారం భయం.

### కర్కాటకం

ఈ నెలలో ఈ రాశివారికి పలు అనారోగ్యసమస్యలు, చేసేవృత్తివ్యాపారాల్లో అసంతృప్తివల్ల మానసికఆందోళన కలుగుతుంది. దైవదర్శనాలకై సుదూరప్రాంతాలకు వెళ్ళవలసి వస్తుంది. నదీపుణ్యస్నానాలు, నవగ్రహదశాదోషనివారణ పూజలపట్ల ఆసక్తి పెరుగుతుంది. సెనగ, తృణధాన్యాలు, బెల్లం, కొబ్బరి, పూలవ్యాపారులకు అనుకూలం. మొదటివారం ధార్మికచింతన, రెండోవారం దోషపూజలు, మూడోవారం ధనాదాయం, నాలుగోవారం సంతోషం.

### సింహం

ఈ మాసంలో ఈ రాశివారికి సుదూరప్రయాణాలు కలిసిరావు. విద్య, ఉద్యోగ, వివాహప్రయత్నాలలో విజయం సాధిస్తారు. ప్రతిపనిలో ఆలస్యం ఏర్పడుతుంది. అపనిందలవల్ల శారీరకమానసికవేదనలకు గురికావల్సివస్తుంది. ఋణాలు చేయవలసినపరిస్థితి ఏర్పడుతుంది. నాగదోషనివారణకోసం నాగసంబధితపూజలు అనుకూలిస్తాయి. మొదటివారం ప్రమాదం, రెండోవారం ధనాదాయం, మూడోవారం శుభకార్యం, నాలుగోవారం ఆనందం.

### కన్యారాశి

ఈమాసంలో వీరికి పలుఆటంకాలు, మిత్రులలో భేదాభిప్రాయాలు ఏర్పడతాయి. తల్లిదండ్రుల అనారోగ్యం ఆందోళనకు గురిచేస్తుంది. వివాహ, ఉన్నతవిద్యా ఉద్యోగప్రయత్నాలు అనుకూలం. క్షేత్రదర్శనానికి చేసేప్రయత్నాలు నెరవేరుతాయి. సోదరీసోదరులతో మనస్పర్థలు కలుగుతాయి. తొందరపాటు నిర్ణయాలు వద్దు. మాటలు పొదుపుగా మాట్లాడడం మేలు. మొదటివారం ఆనందం, రెండోవారం ధనాదాయం, మూడోవారం పుణ్యక్షేత్రదర్శనం, నాలుగోవారం ప్రయత్నఫలం.

### తుల

ఈ రాశివారికి ఆశించిన ఫలితాలు ఆలస్యంగా అందుతాయి. ఒప్పుకున్న పనులు ఇష్టంలేకుండా, కష్టనష్టాలతో పూర్తి చేయవలసివస్తుంది. గతంలో చేసినపొరపాట్లకు బాధ్యత వహించవలసిఉంటుంది. ఒంటరి, సుదూరప్రయాణాలవల్ల

ప్రమాదాలు. నూతనగృహనిర్మాణాలకు ఋణప్రయత్నాలు చేయవలసి వస్తుంది. తల్లిదండ్రుల అనారోగ్యం అందోళన కలిగిస్తుంది. మొదటివారం ఆందోళన, రెండోవారం అనారోగ్యం, మూడోవారం ధననష్టం, నాలుగోవారం కార్యజయం.



## వృశ్చికం

ఈ రాశివారికి శత్రుబాధలు అధికంగా ఉంటాయి. చేసేవృత్తివ్యాపారాల్లో కష్టనష్టాలు ఎదురౌతాయి. అవకాశాలు చేజారే అవకాశ ముంది. కోపాన్ని అదుపులో ఉంచుకోవడం మేలు. సుదూరప్రయత్నాలు అందోళన కల్గిస్తాయి. మొదటివారం శుభవార్తలు, రెండోవారం దైవారాధనలు, మూడోవారం అశాంతి, నాలుగోవారం శత్రుజయం.





## ధనుస్సు

ఈరాశివారికి ఈ నెలలో బంధుమిత్రులవల్ల అనేక కష్టనష్టాలు ఎదుర్కోవలసివస్తుంది. మాటను అదుపుగా, పొదుపుగా మాట్లాడితేనే మంచిఫలితాలు ఉంటాయి. విద్యార్థులు, ఉన్నతచదువులకోసం చేసేప్రయత్నాలు నెరవేరుతాయి. విదేశీఉద్యోగప్రయత్నాలు అనుకూలిస్తాయి. శ్రమకు తగ్గఫలితం, గుర్తింపు లభిస్తాయి. మొదటివారం ఆనందం, రెండోవారం వ్యవహారజయం, మూడోవారం అపనిందలు, నాలుగోవారం కష్టనష్టాలు.



## మకరం

ఈ మాసంలో విద్యాఉద్యోగావకాశాల్లో శుభవార్తలు ఆనందా న్నిస్తాయి. కుటుంబంలో శుభకార్యాలు జరగటంవల్ల సంతోషం కలుగుతుంది. ధార్మికసేవాకార్యక్రమాలవల్ల ప్రశాంతత కల్గుతుంది. సుదూరక్షేత్రదర్శనం మేలు చేస్తుంది. మొదటివారం అనారోగ్యం, రెండోవారం ధార్మికసేవ, మూడోవారం క్షేత్రదర్శనం, నాలుగోవారం ధనప్రాప్తి.



## కుంభం

ఈ రాశివారికి ఈ మాసంలో మనసు చికాకుగా ఉంటుంది. చేసేపనులలో ఆటంకాలు ఎదురవుతాయి. గతంలో చేసినపొరపాట్లు గ్రహపాటుగా మారి, మానసికవేదనకు గురి చేస్తాయి. తొందరపాటు నిర్ణయాలు వద్దు. పెద్దలసలహా తీసుకోవడం అవసరం. మనశ్శాంతికోసం నవగ్రహశాంతిపూజలు చేయడం మంచిది. మొదటివారం చోరభయం, రెండోవారం ఆందోళన, మూడోవారం బంధుమిత్రుల విభేదాలు, నాలుగోవారం శాంతిపూజలు, సంతోషం.



## మీనం

ఈ రాశివారు ఈ మాసంలో గతకొంతకాలంగా పెండింగ్‌లో ఉన్నపనులు పూర్తిచేస్తారు. మిత్రుల సహాయ సహకారంవల్ల ఆత్మవిశ్వాసం పెరుగుతుంది. మానసికప్రశాంతత కోసం క్షేత్రదర్శనం చేస్తారు. ప్రతివిషయాన్ని ఆలోచిస్తూ నిర్ణయం తీసుకోవడంవల్ల విజయం సాధిస్తారు. విద్యార్థులకు శుభవార్తా శ్రవణం. మొదటివారం శుభవార్తలు, రెండోవారం ఆనందం, మూడోవారం క్షేత్రదర్శనం, నాలుగోవారం ప్రయత్నజయం.



# తిరుమల ఆలయం



ఆంగ్లమూలం : డా॥ రమేశన్, తెలుగు అనువాదం : డా॥ కోరాడ రామకృష్ణ | ధారావాహిక

***(ఈస్ట్ ఇండియా కంపనివారి పర్యవేక్షణలోని కొన్ని ప్రముఖ అంశాలపై వివరణ ఇచ్చు లేఖనం ఇది. అయితే కంపనివారిచేతినుండి మహంతులకు పరిపాలన బాధ్యతలు మారిన తరువాత ప్రకటమైనది. కంపనివారిచే ఆలయ పరిపాలన జరిగిన ఆఖరు పదిసంవత్సరాల ఆదాయవివరాల పట్టిక, వరిపాలన పరిధిలోని వివిధఆలయాల పేర్లు ఇవ్వబడ్డాయి. ఆ కాలంలో లోపలినుండి బయటరావటానికి బంగారువాకిలి కాక మరొక వాకిలి ఉండేదని స్పష్టమౌతుంది.)***

## ఆంగ్లేయుల అధీనంలో ఆలయం
### (1853 మే-ఆగష్టు - ఏసియాటిక్ జర్నల్‌లో ఆంగ్ల జిల్లాధికారి నివేదిక)

"బంగారు వాకిలి లేక స్వర్ణద్వారం లోపలికి ప్రవేశించగానే యాత్రికుడు ఒక ఇరుకైన గదికి వస్తాడు. ఇక్కడ అతనిని దేవుడికి పరిచయం చేయబడును. ఇక్కడ రెండు పాత్రలను పెట్టియుంటారు. ఒకటి గంగాళం లేక పెద్దనోరున్న పాత్ర. ఇంకొకటి కొప్రం లేక కొళగమనే పెద్దపాత్ర. వీటిలో తమ కానుకలను చెల్లించిన తరువాత యాత్రికులు ఇంకొక ద్వారం నుండి బయటికి వస్తారు. *(ఆ కాలంలో బంగారు వాకిలి దాటి లోపలికి వెళ్ళినవారు మరొక ద్వారంనుండి బయటికి వచ్చే అవకాశం ఉండినది, అంటే రామర్‌మేడై నుండి వైకుంఠప్రదక్షిణం వైపు వెళ్ళే ప్రవేశమార్గం తెరిచే ఉండినది అన్నమాట. (ఇది మహంతులకాలంలో మూసివేయబడింది- అని చెప్పడానికి ఆస్కారమున్నది- అనువాదకుడు)* రోజూ దినాంతంలో రక్షకులను- ఈ పాత్రరక్షక సిబ్బంది మరియు ఇతరఉద్యోగులను ఒకేసారి శోధించడం జరుగుతుంది. ఎటువంటిలెక్కలనూ చేయక అన్ని సమర్పణలనూ మూటకట్టి పగోడ ముద్రవేస్తారు. తదనంతరం జీయంగారు, తహసీల్దారులు తమ తమ ముద్రలను వేసిన తరువాత ఈ సంచులను కొండ క్రింద ఉండే గోవింద రాజపేటకు పంపడం జరుగుతుంది. నెలాఖరులో ఈ సంచులను హుజూరు కార్యాలయానికి అంటే తి.తి.దే. పరిపాలన కార్యాలయానికి పంపుదురు. ఇక్కడ సంచులలో ఉండే, పదార్థాలను విభాగించి, లెక్కకట్టి వేలం వేసి, అమ్మడం జరుగుతుంది. ఏది ఏమైనా బ్రహ్మోత్సవసమయంలో కలెక్టరు లేక అతని సహాయక అధికారి స్థలంలో ఉండాల్సిందే. ఇక్కడ వచ్చే అపారమైన కానుకల సమర్పణ, ఎక్కువ సంఖ్యలో వచ్చు యాత్రికుల జనసమ్మర్దంలో వెంటనే చెలామణి చేసే అధికారం అవకాశం లేక ఎటువంటి ప్రమాదం జరుగరా దనే హెచ్చరికను చూడవచ్చును. చంద్రిగిరినుండి దీన్ని వ్రాసేటప్పుడు నేను అదే పనిలో ఉన్నాను. వెనకటి పదిసంవత్సరాల సగటు ఆదాయాన్ని దాఖలు పరచడానికి మించినపని ఎక్కువగా ఏదీ లేదు. ఇందులో ఏర్పడే మిగులు ఆదాయం సంవత్సరానికి సగటు ఎనభైఎనిమిది వేలరూపాయలు. 1822లో సంగ్రహమైన మొత్తం ఒక లక్షనలభై రెండువేలరూపాయలు. ఇది ఆశ్చర్యమైనా ఖర్చులకై ఇరవైవేల రూపాయలను తీసివేయాల్సి ఉంటుంది. 1820 లో అంటే ఫసలి 1230 లో ఆదాయం 1,02,000.

ఇటువంటి వ్యవస్థితమైన ధార్మికతను తమరు చెడ్డ అనే భావనతో చూడవచ్చును లేక ఇది సర్కారువారి అధార్మికమైన దోపిడి అని పేరు పెట్టవచ్చును. ఐతే ఇదంతా సత్యదూరమౌతుంది. స్పష్టమైన అవగాహన లేని కొందరు మనపై దేవుడి కోపాన్ని, ఆగ్రహాన్ని ఆహ్వానించే ఉదాహరణగా దీనిని పరిగణించి వ్యంగ్యంగా నవ్వుకొనవచ్చును. వాస్తవం ఏమిటంటే- ముసల్మానుల దొరలు ఈ పగోడా (ఆలయం) సంపన్మూలాన్ని

ధారావాహిక 28

# మందార మకరందాలు

**ఇందుఁ గలఁ డందు లేఁ డని**
**సందేహము వలదు; చక్రి సర్వోపగతుం;**
**డెందెందు వెదకి చూచిన**
**నందందే గలఁడు దానవాగ్రణి! వింటే!**

'సర్వం విష్ణుమయం జగత్.' ఈ లోకమంతా విష్ణుమయమే. ఇది తెలుగునాట బాగా వాడుకలో ఉన్నమాట. ఈ పద్యానికి ఇదే పునాది. అయితే కట్టడంలో పోతన్న పనితనం కొట్టవచ్చినట్టు కనిపిస్తు న్నది. మొత్తం పద్యాన్ని పిండితే చేతికందేసారం చిటికెడే:-- దేవు డంతటా ఉన్నాడు. 'చక్రి' 'సర్వోపగతుడు' 'దానవాగ్రణి' వంటి మూడు నాలుగు పదాలను తీసివేస్తే మిగిలే మాటలు 'ఇందులు' 'అందులు' 'ఎందెందులు' 'అందందులు.' ఈ బిందుపూర్వక 'ద' కారాల పొంది కలే ఈ పద్యంలో పొదిగినఅందాలు. ఈ అందాలఅల్లికవల్లనే ఈ పద్యం నిత్యస్మరణీయంగా నిలిచిపోయింది.

ఇంకొకవిశేషం ఉంది. భగవత్పరంగా వ్రాయబడిన ఈ పద్యంలోని పరమార్థం అప్పుడప్పుడు మరుగున పడిపోవడంకూడా జరుగుతుంది. ఏ పెద్దమనిషో ఈ పూట ఇక్కడుండి మరో గడియలో ఏ ఢిల్లీలోనో ఉంటే ఆ వార్తను విన్న తెలుగువాడు వ్యాఖ్యానిస్తాడు-- 'అబ్బో: ఆయనకేం? ఇందు గల దందు లే దని సందేహము వల' దని.

ఎన్నో సందర్భాలలో నెమరు వేసుకోవడానికి ఉపయోగపడే పద్యపాదాలు పోతన్నవి. అందుకే అతడు 'ఇజం' ఎరుగని ప్రజాకవి.

**- జ్ఞానపీఠఅవార్డు గ్రహీత, పద్మభూషణ్ డా॥ సి.నారాయణ రెడ్డి**

సొంతానికి వాడుతూ దాన్ని సింధువుగా పరిగణించారు-అనేదాన్ని చూచి ఉన్నాం. కోరమండలతీరంలోని సముద్రతీరం వ్యాపారాన్ని పోగొట్టుకునే పంథాలో మనరక్తం ధారపోసిన- పరిస్థితుల ఫలంగా ఈ మొదటి ఆదాయాన్ని - అదీ అతి తక్కువ ఆదాయాన్ని- గడించినాము. అప్పటినుండి నిరంతరంగా సందాయం అవుతూ వస్తున్నది. ఆలయాన్ని తన ఆదాయంతోనే నడపడానికి వదలడం వలన కిస్తుల చెల్లింపులో అనవసర బల వంతం చేసినవారవుతాము అనేదాన్ని చూశాము. తోడుగా దేశంలోని ఈ భాగం లోని వ్యవసాయమంతా బ్రాహ్మణుల చేతు లలో ఉండి, వారు నాగలిని పట్టిన వారు కారు గాబట్టి, ఇతరత్ర రైతులందరూ వీరి అధీనంలో ఉంటూ, సొంతం భూమి గురించి స్వప్నంలో కూడ ఆలోచించడం సాధ్యం కాలేదు. ప్రతిగ్రామంలోనూ ఇదే తీరు. ఈ కారణంగా దేశంలోని ఆలయ భూములనంతా కంపని వశపరచుకుని తసదీకుభత్యాన్ని ఇచ్చే గట్టి నిర్ధారంతో, భూమిపై అధిపత్యం వికేంద్రితమై కొత్త విధానంతో ఆదాయం పెరిగిం దని చెప్పాలి. ఈ సమయంలో దేశంలోని మన పట్టు సంధిగ్ధం. ధార్మికాభిమానులైన హిందువులు మనం అనుకొనేదానికంటే ముందే పోరాటానికి దిగవచ్చును. మనం చేసిందేమి? వారికి తమధర్మాన్ని ఆచ రించడానికి రక్షణ కల్పించాము. దానిని సహించాము. దానిని ఎప్పుడూ ప్రోత్స హించలేదు. అది మనకు అయ్యేదీ కాదు. ఇప్పుడేమైంది? తిరుపట్టి ఆదాయం క్రమేపి తగ్గుతూ ఉంది.

పై చెప్పిన విషయాల సత్యా సత్యల గురించి నేను ఏమీ చెప్పలేను. కారణం ఆలయంకానీ, దాని పరిపాలన కాని నా అధీనంలో లేదు. తిరుపట్టిలోని పరిపూర్ణశిస్తుసంగ్రహపరిపాలన నాదే అయిననూ ఈ వివరాలు పూర్తిగా తెలి యవు. నాకు తెలిసినంతవరకు పై చెప్పిన వివరాలన్నీ వాస్తవమే. ఈ విషయాన్నంత

నా కార్యాలయం నుండి సంగ్రహించి యున్నాను. ఐతే ఇటు వంటి విషయంలో స్థానికులను ప్రశ్నిస్తే వారు "అజ్ఞాన ప్రదర్శనం చేస్తారు లేక అలా నటించి చూపిస్తారు అనేది కూడ ఖచ్చితమే."

పై వ్యాసకర్త అధికారి, 1822 లో తిరుమల ఆలయ మొత్తం ఆదాయం 1,47,000 రూపాయలనియూ, 1820 లో ఇది 1,02,000 రూపాయలనియూ తెలిపియున్నారు. ఆలయం ఖర్చులు వారు చెప్పినట్లు 20,000 రూపాయలు. మడిమాన్యాలను జప్తు చేసిన తరువాత ఇచ్చిన తస్తీకు ధనమెంత అని వారు చెప్పలేదు. ఈ తస్తీకు ధనరూపంలో ఉండినదా లేక వస్తు రూపంలో ఉండినదా అనియూ చెప్పలేదు. 1819 లో అమలులో వచ్చిన 1227 ఫసలి సంవత్సరంలోని "మోయ్న జప్త పడితరం" రూపంలో ఉండినదా అనేదీ తెలియరాలేదు. ఫసలి 1233-34 సంవత్సరం నుండి ఫసలి 1242-43 వరకు లభ్యఆలయం తస్తీకు పుస్తకంలో మొత్తం ఆదాయం నమోదయ్యింది. వాటి వివరాలను ఇక్కడ ప్రత్యేక పట్టికలో ఇవ్వడం జరిగింది.

ఖర్చుల బాబత్తులో ఆలయంలోని ఉత్సవారాధనలకు వెచ్చించిన ధనంమాత్రమే లెక్కవేయబడింది. ఇది మొత్తం ఖర్చుల వివరాలు కాదు. అలా చూస్తే ఆలయంలో ఆరాధనలకై అయ్యే ఖర్చులకంటే తక్కువ తస్తీకు ధనాన్ని కుంపణి సర్కారు ఇస్తూ వచ్చినఅంశం స్పష్టం.

ఈస్ట్ ఇండియా కంపని తరువాత ఆలయం పరి పాలనాధికారులయిన విచారణకర్త బాధ్యతలను స్వీకరించిన మహంతులు తస్తీకు ధనాన్ని సర్కారువారిని అడిగి పుచ్చుకోలేదు. లేక ఈ తస్తీకు ధనాన్ని ఆలయం లెక్కలకు జమకట్టలేదు. కాన ఆలయాల ఒక ముఖ్యమైన ఆదాయమూలవివరాలు శాశ్వతంగా లుప్తమైంది.

ఈస్ట్ఇండియా కంపని తన పరిపాలనాపరిధిలో 19 ప్రధానఆలయాలనే గాక ఇతర 18 ఉపఆలయాలను తీసు కున్నది. తిరుమల ఆలయం కానీ తిరుపతి ఆలయం కానీ వీటిలోని ఏ ఆలయ పరిపాలన చేయడం లేదు. ప్రతి ఆలయానికి తనదైన ఆదాయమూలం ఉండేది. 6.39062 పగోడాల (రూ.22-6-0) ఆదాయమున్న సంజీవరాయస్వామి మఠానికీ ఈస్ట్ ఇండియా కంపని ఏమీ ఇవ్వలేదు. దాని నిర్వహణకు ఇతరత్ర ఏ ఆదాయమూ ఉండేది కాదు. అంగడి బాడుగలు, నేకారసుంకములు, మున్నగు ఆదాయం పొందిన ఆలయాలంటే, శ్రీవరాహస్వామి ఆలయం, బాసింగ నరసింహస్వామి ఆలయం, బేడినరసింహస్వామి ఆలయం. వరాహస్వామి ఆలయం తన ధర్మకర్త నుండికూడ ఆదాయం పొందుతూ ఉండేది. నాథముని ఆలయంకూడా ఇలాగే. తిరుపతిలోని దక్షిణమాడవీథిలోని లక్ష్మీనారాయణస్వామి ఆలయం 402 రూపాయల ఇనాం భూమిని సైతం పొందియుండింది. 1843 లో ఆలయాల పర్యవేక్షణ భారాన్ని మహంతులకు అప్పగించినపుడు ఈస్ట్ఇండియా కంపనివారు ఐదు ఆలయాలను అప్పగించలేదు- అవి - 1)బుగ్గమఠం కృష్ణస్వామి ఆలయం 2)రాఘవేంద్రాచార్ ఇంటిసమీపంలోని సంజీవరాయస్వామి ఆలయం 3)రామచంద్ర గుంట వద్ద ఉన్న అగస్త్యేశ్వరస్వామి ఆలయం 4)తిరుకచ్చి నంబి ఆలయం 5)తాతాయ్యగుంట గంగమ్మ ఆలయం.

| సంవత్సరం | ఆలయ ఖర్చులు | మొత్తంఖర్చులు |
|---|---|---|
| 1823-24 | 37,848 | 81,476 |
| 1824-25 | 39,872 | 81,619 |
| 1825-26 | 34,358 | 76,148 |
| 1826-27 | 25,749 | 68,144 |
| 1827-28 | 25,781 | 68,060 |
| 1828-29 | 26,884 | 69,257 |
| 1829-30 | 30,178 | 73,119 |
| 1830-31 | 30,119 | 73,010 |
| 1831-32 | 27,027 | 69,249 |
| 1832-33 | 34,662 | 71,553 |

## సాధారణ ఆలయాల పట్టిక

| క్ర.స. | ఆలయాల పేర్లు | ఆదాయం / ఖర్చు |
|---|---|---|
| 01. | తిరుమల శ్రీవరాహస్వామి ఆలయం | 299 కానుకలు/ ధర్మకర్తలు |
| 02. | భాసింగ నరసింహస్వామి | 105 కానుక |
| 03. | అలిపిరి నరసింహస్వామి ఆలయం | 105 కానుక |
| 04. | ఆళ్వార్ తీర్థంలోని లక్ష్మీనారాయణస్వామి ఆలయం | 2 కానుక |

## తి.తి.దే. ఆలయాల

# ప్యాకేజి టూర్

ఆంధ్రప్రదేశ్ టూరిజం డెవలప్‌మెంట్ కార్పొరేషన్

### 1. స్థానిక ఆలయాలు (ప్రతి రోజు)

టిక్కెట్టు ధర - రూ.50/- మాత్రమే (నాన్ ఏ.సి.)
- రూ.80/- మాత్రమే (ఏ.సి.)
(10 సం॥లోపు పిల్లలకు టిక్కెట్టు అవసరం లేదు)

బస్సు బయలుదేరు స్థలం - శ్రీనివాసం కాంప్లెక్స్, తిరుపతి

ట్రిప్పులు - 12 (పన్నెండు)

బయలుదేరు సమయం - ఉ. 6.00 నుండి సా. 5.00 వరకు (ప్రతి గంటకు)

--: చూపబడు ఆలయములు :--

1) శ్రీ పద్మావతీ అమ్మవారి ఆలయం - తిరుచానూరు
2) శ్రీ కోదండరామస్వామి ఆలయం - తిరుపతి
3) శ్రీ గోవిందరాజస్వామి ఆలయం - తిరుపతి
4) శ్రీ కపిలేశ్వరస్వామి ఆలయం - తిరుపతి
5) శ్రీ కల్యాణవేంకటేశ్వరస్వామి ఆలయం - శ్రీనివాసమంగాపురం
6) శ్రీ అగస్త్యేశ్వరస్వామి ఆలయం - తొండవాడ

### 2. సమీప ఆలయాలు (ప్రతి రోజు)

టిక్కెట్టు ధర - రూ.150/- మాత్రమే
(10 సం॥లోపు పిల్లలకు టిక్కెట్టు అవసరం లేదు)

బస్సు బయలుదేరు స్థలం - శ్రీనివాసం కాంప్లెక్స్, తిరుపతి

ట్రిప్పులు - 2 (రెండు)

బయలుదేరు సమయం - ఉ. 8.00 గం॥లకు మరియు ఉ. 9.00 గం॥లకు

--: చూపబడు ఆలయములు :--

1) శ్రీ వేణుగోపాలస్వామి ఆలయం - కార్వేటి నగరం
2) శ్రీ వేదనారాయణస్వామి ఆలయం - నాగులాపురము
3) శ్రీ కల్యాణవేంకటేశ్వరస్వామి ఆలయం - నారాయణవనం
4) శ్రీ ప్రసన్న వేంకటేశ్వరస్వామి ఆలయం - అప్పలాయగుంట
5) శ్రీ కరియమాణిక్యస్వామి ఆలయం - నగరి
6) శ్రీ అన్నపూర్ణాసమేత కాశీవిశ్వేశ్వరస్వామి ఆలయం - బుగ్గ
7) శ్రీ పల్లికొండేశ్వర స్వామి ఆలయం - సురుటుపల్లి

ఇతర వివరాలకు - 0877-2289126, 09059188284

| | | |
|---|---|---|
| 05. | ఆళ్వార్‌తీర్థంలోని వేణుగోపాలస్వామి ఆలయం | 2 కానుక |
| 06. | తిరుపతి గోవిందరాజస్వామి దక్షిణమాఢవీథిలోని లక్ష్మీ నారాయణస్వామి ఆలయం | 402 ఇనాం భూమి |
| 07. | బేడి హనుమంతరాయస్వామి ఆలయం | 52 కానుక |
| 08. | ఆళ్వార్‌తీర్థం సంజీవరాయస్వామి ఆలయం | 2 కానుక |
| 09. | గోవిందరాజస్వామి ఆలయం ఎదురు సంజీవరాయస్వామి ఆలయం | - |
| 10. | రామస్వామి ఆలయం ఎదురు సంజీవరాయస్వామి ఆలయం | - |
| 11. | నాథముని ఆలయం | 74 (ధర్మకర్తలు) |
| 12. | ఆళ్వార్‌తీర్థంలోని నమ్మాళ్వార్ ఆలయం | 7 కానుకలు |
| 13. | ఉత్తరాదిమఠం సంజీవ రాయస్వామి ఆలయం | 23 సర్కార్ తస్తీకు |
| 14. | బుగ్గమఠం (సీతాలదాస్) శ్రీకృష్ణస్వామి ఆలయం | - |
| 15. | రాఘవేంద్రాచార్ ఇంటిముందున్న సంజీవరాయస్వామి ఆలయం | - |
| 16. | రామచంద్రగుంట సమీపంలోని అగస్తేశ్వరస్వామి ఆలయం | - |
| 17. | బేరివీథిలోని తిరుకచ్చినంబి ఆలయం | - |
| 18. | తాతాయగుంట - తాళ్లపాకంగుంట గంగమ్మ ఆలయం | - |

(ప్రముఖ ఆలయం లేక సాధారణ ఆలయపట్టికలో ఎక్కడ పేరు దాఖలై ఉన్నా ఏ ఆలయమూ తిరుమల ఆలయం ఆదాయంపై ఏ విధమైన అధికారాన్నీ పొందియుండలేదు.)

## ఆదాయము మరియు ఖర్చుల పట్టిక

| క్ర.సం. | సంవత్సరం | సర్కారు వంతు | కానుకలు | ధర్మకర్తలు | మొత్తం | ఆదాయమిగులు (సర్కారు) |
|---|---|---|---|---|---|---|
| 01. | 1823-24 | 31763 | 95557 | 17999 | 177024 | 95548 |
| 02. | 1824-25 | 36972 | 146356 | 14933 | 227976 | 146357 |
| 03. | 1825-26 | 31427 | 107785 | 13007 | 183933 | 107785 |
| 04. | 1826-27 | 24511 | 124138 | 11907 | 192258 | 124114 |
| 05. | 1827-28 | 25184 | 125027 | 11089 | 193888 | 125828 |
| 06. | 1828-29 | 25403 | 118246 | 11124 | 187504 | 118247 |
| 07. | 1829-30 | 25360 | 117447 | 13029 | 190567 | 117448 |
| 08. | 1830-31 | 28262 | 118361 | 13050 | 191371 | 118361 |
| 09. | 1831-32 | 27140 | 72614 | 10330 | 141863 | 72515 |
| 10. | 1832-33 | 31210 | 59468 | 14672 | 137021 | 55468 |

(**టిప్పణి**-పై కనబడు మొత్తం ఆదాయంలో వెనక పట్టికలోని మొత్తం ఖర్చును తీసివేస్తే మిగులు ఆదాయం-సర్కారు పాలుకు వచ్చిన ఆదాయం అవుతుంది. ఉదాహరణకు 1823-24 లో మొత్తం ఆదాయం - 177024. మొత్తం ఖర్చు - 81476. మిగులు ఆదాయం - 95548. ఇలాగే పై చెప్పబడిన పదిసంవత్సరాలలో సర్కారు పొందిన మిగులు ఆదాయం రమారమి 12 లక్షరూపాయలు. దీన్ని ఇప్పటి రేట్లలో పరివర్తన చేస్తే నిఖరమైన లెక్క దొరుకును - అనువాదకుడు)

*(ఇంకా ఉంది)*

## తిరుమలేశుని చూడ పోదాముదరండి!!

రండయ్య పోదాము రండి!
రండమ్మ పోదాము రండి!!

పోదాము తిరుమలకు
చూదాము తిరుమలేశు
మొక్కులన్నీ తీర్చుకొని
తిరిగి మళ్ళీ వద్దాము

లడ్డుకన్నా తియ్యనంట
వెన్నకన్నా కమ్మనంట

తిరుమలేశు దివ్యరూపు
చూడ జన్మ ధన్యమంట

గాలిగోపురం దాటివచ్చి
గరుడవాహనం దరిసించి
గోవిందుని పేరు జెప్ప
గోడులన్నీ తీరునంట

కొండపైన కొలువంట
కొమ్మ కొమ్మన నెలవంట

పొర్లుదండం పెట్టి పిలువ
పాపాలే తీర్చునంట

దిన దినమూ పెళ్ళంట
పూట పూటల విందంట
స్వామి పుష్కరిణిలో స్నానమంట
పుణ్య మెంతో దక్కునంట

ఎన్. గుణవతి

## యజుర్వేదము (తెలుగువచనానువాదము)

**అనువాదకర్త:** శ్రీ యం.వి.నరసింహారెడ్డి, **మొదటిముద్రణ:** 2011; **పుటలు:**368; **ధర:**రూ.200/-; **ప్రతులకు:** సాహిత్యనికేతన్, ఇ.నెం. 3-4-852, కేశవనిలయ్, బర్కత్‌పుర, హైదరాబాదు-500 027, స్థిరవాణి- 040-27563236.

వేదాలు అపౌరుషేయాలనే అభిప్రాయం ఉన్నా, అవి కావలసిన వాళ్లందరికి అందుబాటులోనే ఉన్నాయి. వేదాల్లోని విషయాలను జిజ్ఞాసువు లెందరో అధ్యయనం చేస్తున్నారు. ఆ విషయాలను అందరికీ అర్థమయ్యే విధంగా సరళీకరించి, తమ తమ పద్ధతుల్లో ప్రచారం చేసే ప్రయత్నాలు సాగిస్తున్నారు. ప్రత్యేక గ్రంథాలుగా ప్రకటించి, వేదవిజ్ఞానాన్ని సమాజపరం కావిస్తున్నారు. ఇది ఎంతో మంచిపరిణామం. భౌతికవిజ్ఞానమే విజ్ఞాన మనుకొనే ఆధునికమానవులకు వేదవిజ్ఞానం సమాజం దృష్టితో ఎంత ప్రాధాన్యత కలిగి ఉందో, తమ జీవితపథాలను ఎంత అద్భుతంగా తీర్చిదిద్దగలదో తెలుస్తూ ఉంది. ఆరకంగా వేదవిజ్ఞానాధ్యయనం ఈనాడు ఎంతో ప్రాముఖ్యతను పొందింది.

వేదవిషయాలను వివరించే ఆంగ్లగ్రంథా లెన్నో ఉన్నాయి. వాటిలో మూలవిషయాలను పూర్తిగా తెచ్చినవి కొన్ని, ప్రధానవిషయాల సారాంశాలను తెచ్చినవి కొన్ని ఉన్నాయి. శ్రీనరసింహారెడ్డిగారు వేదవిజ్ఞాన ప్రధానవిషయాలను- అందునా నేటిసమాజానికి అత్యవసరమైన అంశా లను తన అనువాదంలో జారిపోనీకుండా చేసి, నాలుగు వేదాల విషయాలను నాలుగు గ్రంథాలుగా ప్రకటించారు. ఆ వరుసలో యజుర్వేద తెలుగువచనానువాదం రెండవ గ్రంథం. యజుర్వేదవిషయాలమీద ఎందరో పరిశ్రమించి ఎన్నోగ్రంథాలు వెలువరించారు. ఇలాంటి గ్రంథాలను పరి శీలించి, కొన్నిఆంగ్లగ్రంథాలనుకూడా చూచి, ఏయే యజుర్వేదవిషయాలను ప్రస్తుతకాలంలో చెప్పవలసిన అవసరముందో గుర్తించి, ఆ విషయాలను సరళమైనతెలుగులో స్పష్టంగా వివరించి నరసింహారెడ్డిగారు తెలుగువాళ్లకు మహోపకారం చేశారు.

నాలుగువేదాల్లో యజుర్వేదం ప్రముఖమైంది. ఇందులో అనేక పారాయణమంత్రా లుండడం, యజ్ఞవిధు లుండడం దానికి కారణం. యజ్ఞనిర్వహణద్వారా అర్థవంతమైన జీవితాన్ని పొందవచ్చు నని బోధించడమే గాక మోక్షసాధనవిధానాలుగూడా ఇందులో సూక్ష్మంగా వివరించబడినాయి. యజుర్వేదసంహితకే ఆంధ్రప్రదేశంలో ప్రచార ప్రాభవాలు ఎక్కువ. చతుర్విధపురుషార్థాలకు సంబంధించిన విషయా లెన్నో ఇందులో ఉన్నాయి. ఉత్తమకర్మ, యజ్ఞక్రియాఫలం, విద్య, ధర్మానుష్ఠానం, గృహస్థుల కర్మలు, జన్మ-పునర్జన్మ, ఆత్మప్రవృత్తి ఇత్యాది అనేకవిషయాలుకూడా కనిపిస్తాయి. ఆధ్యాత్మికవిషయాలను చర్చించినా ఎక్కువగా మానవజీవితానికి, సమాజంనడతకు సంబంధించి యజు ర్వేదంలో కనిపించే విషయాలకు ఈ గ్రంథం ప్రాధాన్యత నిచ్చింది. దైనం దిన జీవితంలో మానవులకు ఎదురయ్యే అనేకవిషయాలు, వాటికి ఈ వేదం చూపించిన పరిష్కారాలు ఈ గ్రంథంలో కనిపిస్తాయి. తెలుగు వాళ్లందరూ తప్పకుండా చదవవలసిన గ్రంథమిది.

వైదికవాఙ్మయంతో పూర్తిగా పరిచయం కోల్పోతున్న ప్రస్తుత కాలంలో ఎంతోశ్రద్ధతో ఈ గ్రంథం ద్వారా ఆర్షవిజ్ఞానాన్ని తెలుగువాళ్ల కందించిన నరసింహారెడ్డిగారు నిజంగా అభినంద నీయులు.

***- ఆచార్య గల్లాచలపతి***

గ్రంథసమీక్ష

## భర్తృహరి సుభాషిత త్రిశతి

**వ్యాఖ్యాత: 'అవధానకళానిధి' ఆముదాల మురళి; పుటలు:** 184; **ధర:** రూ.90/-; **ప్రతులకు:** ఆముదాల విజయ కుమారి, 9-65, యస్.బి.ఐ.కాలని, ఎ.కె.పల్లి (పోస్టు), రేణిగుంటరోడ్డు, తిరుపతి-517507, ఫోన్-9440432683.

సంస్కృతముక్తకసాహిత్యంలో భర్తృహరిసుభాషి తాలు అగ్రగణ్యమైనవి. నీతి, శృంగార, వైరాగ్య శతాకాలుగా విభజింపబడిన ఈ మూడువందగల శ్లోకా లను తెలుగులో చాలమంది పద్యరూపంలో అనువదించారు. వారిలో అగ్రగణ్యుడు ఏనుగులక్ష్మణకవి.

ప్రతిశతకంలోని శ్లోకాలు కొన్ని పద్ధతులుగా విభ జింపబడిఉన్నాయి. ఆయాపద్ధతులలోని విషయాలను సరళంగా విశ్లేషిస్తూ ఈ అనువాదంసాగింది. పండిత పామర జనరంజకమైన భాషలో చిన్న చిన్న వాక్యాలతో ఈ అనువాదం నడుస్తుంది. ఆద్యంతం చది వించేశైలి మనోహరం. ఎక్కడా విషయాన్ని వదలి శాఖా చంక్రమణం చేయకుండా, ముక్తకవిషయాలలో అను వాదకుడు ఏకసూత్రత సాధించగలిగాడు.

ఈ అనువాదానికి రెండుఅనుబంధాలు చేర్చ బడ్డాయి. ఒక అనుబంధం భర్తృహరి రచించిన 300 శ్లోకాలు, మరో అనుబంధం ఏనుగులక్ష్మణకవి వ్రాసిన 300 తెలుగుపద్యాలు. సాధారణపాఠకులకు సరళవచనం, సంస్కృతపండితులకు శ్లోకాలు, తెలుగుభాషాభిమానులకు లక్ష్మణకవిపద్యాలతో త్రివేణీసంగమంగా ఉన్నగ్రంథం ప్రతి ఇంటా ఉండదగినది. ప్రతిఒక్కరు ఈ నీతులను చదివి, ఆకళింపు చేసుకొని, ఆచరణ చేస్తే జీవితాలు సుఖ మయమౌతాయనడంలో విప్రతిపత్తి లేదు.

***- వి.ఉమారాణి.***

మన దేవాలయాలు

# శ్రీలక్ష్మీ నృసింహస్వామి దేవాలయం, సింగవట్నం

వేదార్థం మధుసూదన్

ఆంధ్రదేశంలో నరసింహస్వామిఆలయాలు ఎన్నో ఉన్నాయి. వాటిలో సింగవట్నం శ్రీలక్ష్మీనరసింహస్వామి దేవాలయం ఒకటి.

మహబూబ్‌నగర్ జిల్లాలోని కొల్లాపూర్ మండలకేంద్రానికి 10 కి.మీ. దూరంలో ఉన్న సింగవట్నం అనే గ్రామంలో శ్రీలక్ష్మీనృసింహస్వామిదేవాలయం ఎంతో ప్రఖ్యాతిగలది. సింగవట్నమే ఇప్పుడు సింగోటం. శ్రీలక్ష్మీనరసింహస్వామివారు ఈ క్షేత్రంలో లింగాకారంలో స్వయంభువుగా వెలిసారు. శివకేశవులకు భేదం లేదన్నట్టుగా రాతిలింగంపై త్రిపుండ్రాలు, ఊర్ధ్వ పుండ్రంగుర్తులు ఉండడం ఇక్కడివిశేషం.

శ్రీలక్ష్మీనరసింహస్వామివారు సింగవట్నంలో వెలియడానికి 600 సంవత్సరాలక్రితం నాడు జరిగిన ఒక చారిత్రకగాథ ప్రచారంలో ఉంది. జటప్రోలును పరిపాలిస్తున్న సురభి వంశీయులపాలనలో ఈ గ్రామం ఉండేది. సురభి వంశీయులలో పదకొండవతరంవాడైన సింగమ భూపాలుడు పాలిస్తున్నకాలంలో జరిగినకథ ఇది.

ఒకరోజు సింగవట్నం గ్రామానికి చెందిన ఒక యాదవుడు తనపొలంలో నాగలిదున్నుతూ ఉండగా ఆ నాగలి కొనకు ఒకరాయి తగిలింది. ఎంతప్రయత్నించినా నాగలి ముందుకు కదలలేదు. అప్పుడు అతడు ఆ రాయిని తీసి, ఒడ్డున పెట్టి, తిరిగి వచ్చి, నాగలితో పొలం దున్నుతూన్నాడు. ఆ రాయి దొర్లుకుంటూ వచ్చి, మళ్లీ నాగలికి అడ్డు పడింది. రైతు దాన్ని తీసుకొనివెళ్ళి, ఒడ్డుపై పెట్టడం, రాయి మళ్లీదొర్లుకుంటూ రావడం ఇలా నాలుగైదుసార్లు జరిగింది. రైతుకు ఆశ్చర్యం కలిగి ఆ రాయిని తీసి, నీటితో శుభ్రం చేసి, తేరిపార చూశాడు. ఇంకేముంది? ఆ రాయిపై త్రిపుండ్రాలు, ఊర్ధ్వపుండ్రాలు, కన్నులు, ముక్కు, నోరు మొదలగు గుర్తులతో స్వామి కనిపించాడు. రైతు ఆశ్చర్యచకితుడై, ఆనందపరవశుడై తనను రక్షించ మని ప్రార్థించి, ఆ రాయిని అక్కడే పెట్టి, ఇంటికి చేరాడు.

శ్రీనరసింహస్వామివారు ఆ రాత్రికే ఆ ప్రాంతపు రాజు సింగమనాయుడికి మరియు ఆ రైతుకులలో కనిపించి, తాను శ్రీలక్ష్మీనరసింహస్వామి ననీ, రైతునాగలికి అడ్డువచ్చింది తానే ననీ, తెల్లవారేసరికి తనకు ఆలయం కట్టవలసిం దని ఆదేశించాడు. సింగమనాయుడు వెంటనే మందీమార్బలంతో ఆ రైతు పొలం చేరుకుని, స్వామిని దర్శించి, వెంటనే గుడి కట్టించాడు. ఓరుగంటివంశీయుడైన బ్రాహ్మణునిచే ప్రతిష్ఠ చేయించాడు.



వీరివంశీయులే ఇప్పటికీ అర్చనాదికాలు నిర్వహిస్తున్నారు. సురభివంశంలో తర్వాతితరంవారు నేటివరకూ ఈ దేవాలయ అభివృద్ధిబాధ్యతలను భక్తుల, దాతల సహకారంతో కొన సాగిస్తున్నారు.

ఈ దేవాలయ ప్రశస్తి "మదనగోపాలమాహాత్మ్యం" అనే స్థలపురాణంలోకూడా ఉంది. దానిప్రకారం పూర్వం సింగ వట్నం ఒక అరణ్యప్రాంతం. కాశీనుండి సింహవటువు అనే బ్రహ్మచారి ఈ దారివెంట అహోబిలం వెళ్తున్నాడు. అప్పుడు అతనికాలికి ఒకరాయి తగిలి మూర్ఛపోయాడు. ఆ మగతలో అతనికి "నీవు అహోబిలంవరకు రా నక్కరలేదు. ఇక్కడే ఉండి తపస్సు చేయి" అనే మాటలు వినిపించాయి. అప్పు డతడు అక్కడే ఉన్న ఒకచెట్టుక్రింద కూర్చొని, తపస్సు కొనసాగించాడు. కొన్నిరోజులకు స్వామి ప్రత్యక్షమై నీ కాలుకు తగిలిన రాయిలోనే నే నున్నా ననీ, నిత్యం ఆరాధించ మనీ చెప్పాడు. ఆ రోజునుండి ఆ బ్రహ్మచారితో పాటు, ఆ గ్రామప్రజలందరూ ఆ రాతిలోనే శ్రీ నృసింహస్వామిని దర్శిస్తూ, మ్రొక్కుతూ, తమ కోరికలు నెర వేర్చ మని ప్రార్థిస్తుంటారు.

శ్రీత్రిదండిశ్రీమన్నారాయణపెదజీయరుస్వామివారు ఈ దేవాలయాన్ని దర్శించి, గర్భగుడి ప్రక్కనే, స్వామికి ఎడమ వైపున శ్రీమద్రామానుజులదేవాలయాన్ని ఏర్పాటు చేసి, వేదార్థం వంశీయులను అర్చకులుగా నియమించాడు. ఈ దేవాలయ ప్రాంగణంలో శివాలయం, ఆంజనేయస్వామి ఆలయం, శ్రీలక్ష్మీ గణపతి, నవగ్రహఆలయా లున్నాయి. ఈ దేవాలయానికి సుమారు కిలోమీటరు దూరంలో గల గుట్టపై శ్రీలక్ష్మీదేవిఅమ్మ వారిదేవాలయం ఉన్నది. రాణీవేంకటరత్నమాంబ ఈ దేవా లయాన్ని నిర్మించింది. కాబట్టి ఈ గుట్టకు రత్నగిరి అనీ, ఈ దేవాలయానికి శ్రీరత్నలక్ష్మీదేవాలయం అనీ పేరు వచ్చింది.

ఈ క్షేత్రానికి ఎడమవైపున రత్నసాగరం అనే పెద్ద చెరువు, కుడివైపున స్వామివారిపుష్కరిణి ఉంది. ఈ పుష్కరిణిలో స్నానం చేసి, తడిబట్టలతో స్వామివారిని దర్శిస్తే సంతాన సౌభాగ్యం కలుగుతుం దనీ, ఆయురారోగ్యాలు సిద్ధిస్తా యనీ భక్తుల ప్రగాఢవిశ్వాసం!

ప్రతిసంవత్సరం మకరసంక్రాంతిపర్వదినంనుండి వారం రోజులపాటు బ్రహ్మోత్సవాలు వైభవంగా జరుగుతాయి. పండుగ తర్వాత మూడోరోజున జరిగే రథోత్సవసందర్భంగా సుమారు లక్షమంది పాల్గొంటారు. బ్రహ్మోత్సవాలు తర్వాత నెలరోజుల పాటు జాతర కొనసాగుతుంది. బ్రహ్మోత్సవాలే కాక వివిధపర్వ దినసమయాలలోను నిత్యం ఎందరో భక్తులు స్వామిని సేవిస్తూ తరిస్తుంటారు. జిల్లానుండేకాక పొరుగుజిల్లాలు, పొరుగు, రాష్ట్రాలనుండికూడా భక్తులు విశేషంగా వచ్చి, స్వామికి మ్రొక్కులు సమర్పించి, ధన్యు లవుతుంటారు.

ఈ విధంగా కొలచినవారికి కొంగుబంగారంగా విరాజిల్లుతున్నది-సింగవట్నం శ్రీలక్ష్మీనృసింహస్వామిదేవా లయం.

## భర్తృహరి సుభాషితం

**ఒక ఎలుక (పాములవాని ఇంట) రాత్రివేళ ఆహారంకోసం అన్వేషిస్తూ ఒకపెట్టెకు కన్నం వేసి అందులో దూరింది. అంతకు ముందే ఆ పెట్టెలో బంధింపబడివున్న పాము ఇక వెలుపలికి వెళ్లే ఆశ లే దనుకొని అక్కడే చుట్టచుట్టుకొని, ఇంద్రియ పాటవం కోల్పోయి, ఆకలితో అలమటిస్తూ ఉండింది. ఎలుక తనంతతానే పోయి ఆ పామునోట పడింది. పాము దాన్ని మ్రింగి ఆకలి తీర్చుకొని ఆ కన్నం గుండానే చరచరా వెలుపలికి వెళ్ళింది. వృద్ధి వినాశాలకు దైవమే కారణం. కాబట్టి మీరు దైవంమీద భారం వేసి, నెమ్మదిగా ఉండండి!**

శ్రీమాన్ పురిశై శ్రీరంగాచార్యస్వామివారిచే ప్రణీతమైన



# శ్రీలక్ష్మీగద్యమ్

05

"శ్రీచరణపరిచరణ" వ్యాఖ్య  వ్యాఖ్యాత - ఈ.ఏ.శింగరాచార్యులు

**1. ఖర్వీభవదతిగర్వీకృత గురుమేర్వీశగిరి ముఖోర్వీధరకుల దర్వీకరదయితోర్వీధర శిఖరోర్వీఫణిపతి గుర్వీశ్వరకృత రామానుజమునినామాంకిత బహుభూమాశ్రయ సురధామాలయ వరనందనవన సుందరతరానందమందిరానంత గురువనానంత కేళియుత నిభృతతర విహృతిరత లీలాచోర రాజకుమార నిజపతి స్వైరసహవిహారసమయ నిభృతోషిత ఫణిపతిగురుభక్తిపాశవశంవద నిగృహీతారామ చంపకనిబద్ధే!**

ఖర్వీభవత్ = న్యూనముగా చేయబడిన, అతిగర్వీకృత = మిక్కిలిగా గర్వించిన, గురు = గొప్పదైన, మేరు= మేరు పర్వతము, ఈశగిరిముఖ = కైలాసము మొదలగు, ఉర్వీ ధరకుల= పర్వతకులమును కల్గినదగు, దర్వీకరదయిత+ ఉర్వీధరశిఖర+ఉర్వీ = శేషాచల శిఖరముపై గల ప్రదేశములో, ఫణిపతి గురు + ఈశ్వరకృత = అనంతార్యులచే నిర్మింపబడిన, రామానుజముని నామాంకిత = భగవద్రామానుజుల దివ్య నామమును కల్గినది, బహుభూమా+ఆశ్రయ= గొప్ప మహిమకు నెలవైనది, సురధామ+ఆలయ= దేవతల భవనములకు నిలయమైన స్వర్గములోని, వరనందనవన = గొప్పనందనవనము కంటే, సుందరతర = మిక్కిలి అందమైన, ఆనందమందిర = ఆనందమందిరమైన, అనంతగురు= అనంతార్యునిచే నిర్మింపబడినది అగు, వన= ఉద్యానవనమునందు, అనంతకేళియుత= అనంతములైన లీలావిలాసములతో కూడిన, నిభృతతర= అతిరహస్యములగు, విహృతి= విహారములందు, రత= ఆసక్తుడై, లీలాచోర= లీలాచోరుడైన, రాజకుమార= రాజకుమారుని రూపములో నున్న, నిజపతి=తన భర్తతో, స్వైర=యథేచ్ఛముగా, సహవిహారసమయ= కలసి విహరించు సమయమున, నిభృత= రహస్యముగానున్న, ఉషిత = మేల్కొనియున్న, ఫణిపతిగురు= అనంతార్యగురుని యొక్క, భక్తి=భక్తి అనెడి, పాశ=పాశములకు, వశంవద=వశయై, నిగృహీత=పట్టుకొనబడినదానవై, ఆరామ చంపక= ఉద్యానవనములోని సంపెంగచెట్టునకు, నిబద్ధే= బంధింపబడినదానా!

ఈ చూర్ణికయందు ప్రస్తుతమైన వృత్తాంతము పూర్వమే శ్లోకవ్యాఖ్యలో వివరింపబడినది. శేషాచలముచే మేరుపర్వత–కైలాసపర్వతాదులు తక్కువగా చేయబడిన వనుటకు **"సుభగశ్చిత్రకూటోఽసౌ"** అన్నట్లు అవి ఎంత ఉన్నతములైనను ఆ పర్వత శిఖరములందు శ్రీనివాసుడు నివసింపకుండుటయే కారణము. శ్రీకృష్ణభగవానుని యశోదాదేవి తనప్రేమపాశముతో **"ప్రేమ్ణా బబంధ"** (ప్రేమతో బంధించెను) అనురీతిలో కట్టివేసినట్లే అనంతార్యులు తమభక్తిపాశములతో లక్ష్మీదేవిని కట్టివేసిరి అనెడి అర్థస్వారస్యము **"ఫణిపతిగురుభక్తిపాశవశంవద"** అను ప్రయోగముచే స్ఫురించుచున్నది. అనంతార్యులు భగవద్రామానుజుల ఆజ్ఞను అనుసరించి, శ్రీవేంకటేశ్వరునకు పుష్ప కైంకర్యమును చేయుటకై తిరుమలలో వాసమేర్పరుచుకొని, అందులకై తగిన ఉద్యానవనమును నిర్మించుట చరిత్రలో కాననగును. దాని వివరమును ఈ స్తుతికర్తచే రచింపబడిన ఇంకొక అద్భుతస్తుతియగు ఉజ్జ్వలవేంకటనాథ స్తోత్రములోని ఈ క్రింది శ్లోకమువలన తెలియవచ్చును.

**నగధరారాధనే తవ వృషగిరీశ్వర య ఇహ సాదర**
**రచితనానానామకౌసుమతరులసన్నిజవన విభాగజ –**
**సుమకృతాం తాం తాం శుభస్రజ ముపహరన్ సుఖ మహిపతి ర్గురుః**
**అతిరయాయాయాసదాయక భవభయానక శతరిపోః కిల**
**నిగమగా గా గాయతా యతిపరివృఢేన తు రచయ పూరుష**
**జితసభో భో భోగిరాంగిరి పతిపదార్చన మితి నియోజితః**
**ఇహ పరం రంరంమ్యతే స్మ చ తదుదిత ప్రణచుబుక భూషణే**
**ఇహ రమే మే మేఘరోచిషి భవతి హారిణి హృదయరంగగ ॥**

ఈ శ్లోకమున ప్రస్తుతింపబడిన ఇతిహాసము ఇట్లున్నది.

పూర్వము ఒకానొక సమయమున భగవద్రామానుజులు గొప్పబుద్ధిమంతులగు అనంతార్యులవంటి శిష్యులతో కూడిన గోష్ఠిని అలంకరించుచు, శ్రీపరాంకుశసూరి అనుగ్రహించిన తిరువాయ్‌మొళి ప్రబంధమును వ్యాఖ్యానించుచు కాలక్షేపమును చేయుచుండిరి. కొన్ని దినములకు ఆ ప్రబంధములోని తృతీయ శతకములోని – **"ఒళివిల్ కాలమెల్లామ్"** అను తృతీయదశకము ప్రస్తావనకు వచ్చెను. అందు శ్రీనమ్మాళ్వార్లు శ్రీవేంకటాద్రిలోని శ్రీవేంకటేశ్వరునకు పుష్పకైంకర్యమును సర్వకాలసర్వావస్థల యందు చేయవలయునని ఆ దశకములోనిది మొదటి పాశుర మందు ఆశపడెనని, భగవద్యామునులుకూడ అట్టి మనోరథమునే కల్గియుండి రని తెలిసిన శ్రీరామానుజులు, ఆ మనోరథమును తమశిష్యులద్వారా క్రియాపర్యవసాయిగా చేయగోరినవారై, "మీలో ఎవరైనను వేంకటాద్రికిపోయి ఆళ్వార్లు ఆశపడిన కైంకర్యమును నిర్వహింపగల్గినవారు కలరా?" అని ప్రశ్నించిరి. ఆ కాలమున వేంకటాచలములో **"మారి మాఱాద తణ్ణమ్మలై"** (వర్షము నిరంతరము మరియు చల్లనిగిరి) అనురీతిలో వర్షబాధ, **"కుళిరరువి వేఙ్గడమ్"** (చల్లని కొండవాగులను కల వేంకటాద్రి) అను విధమున శైత్యబాధయు అధికముగా నుండుటచే ఆ గోష్ఠిలో ఎవరును అట్టి కైంకర్యమును తిరుమలలో నిర్వహించుటకు సాహసింపలేకపోయిరి. అపుడు అనంతార్యులు ఆచార్యపరిగృహీతమైన ధర్మమే శిష్యులకు పరమోపాదేయ మని, దానిని తప్పక అనుష్ఠింపవలయు నని దృఢముగా నమ్మినవారై, "స్వామీ! మీరు ఆజ్ఞాపించినచో నేను ఆ సేవను చేసెదను" అని ప్రార్థించిరి. "ఆ మహనీయుల ధైర్యమునకు, అచంచలమైన అధ్యవసాయమునకు మిక్కిలి ప్రీతులైన భగవద్రామానుజులు "ఈ గోష్ఠిలో నీవు ఒక్కడవే పురుషుడవుసుమా" **(నీదాన్ ఆణ్‌పిళ్ళై)** అని ధైర్యసూచకమగు పురుషపదముతో వారిని సంబోధించిరి. పిమ్మట ఆ కైంకర్యమును నిర్వహించుటకై అనంతసూరి తిరుమలకు భార్యాసహితుడై పోయి, అచట ఉద్యానవనమును పెంచుటకై ఒక తటాకమును స్వయముగానే త్రవ్వెను. అదియే ఈనాటి 'ఆళ్వార్‌టాంకు'. అనంతార్యుల వంశీయులకు ఈనాటికిని **"అనన్దాణ్‌పిళ్ళై"** అను నామము గౌరవవాచక మైనది.

**2. భక్తజనావనబద్ధశ్రద్ధే !**

భక్తజన = భక్తులయొక్క, అవన = రక్షణయందు, బద్ధ శ్రద్ధే = శ్రద్ధను కల్గినదానా!

**3. భజనవిముఖభవిజన భగవదుపసదన సమయనిరీక్షణ సంతతసన్నద్ధే !**

భజన విముఖ = భగవద్భజనయందు విముఖులైన, భవిజన = సంసారుల యొక్క, భగవదుపసదన సమయ = భగవానుని సమీపించుటకు తగిన సమయమును, నిరీక్షణ = ఎదురు చూచుటలో, సంతతసన్నద్ధే = ఎల్లప్పుడు సిద్ధమై యున్నదానా!

పూర్వసంబోధనయందు పద్మావతీదేవియొక్క ఆశ్రితరక్షణ శ్రద్ధ తెలుపబడగా, ఇందు ఆ విధముగా ఆశ్రయింపని సంసారులను సంస్కరించుటలో ఆమెకు గల ఆసక్తి తెలుపబడిది.

**4. భాగధేయగురు భవ్యశేషగురు బాహుమూలధృత బాలికా భూతే !**

భాగధేయగురు = అదృష్టముచే గొప్పవాడగు (కావుననే), భవ్య= పవిత్రుడగు, శేషగురు = అనంతార్యునిచే, బాహు మూలధృత= (తన) చంకయందు ధరింపబడిన, బాలికాభూతే= బాలికయైనదానా!

***(ఇంకా ఉంది)***

బాలప్రబోధం



# నమస్కారఫలం

*పింగళి పాండురంగారావు*

మార్కండేయుని వయస్సు ఐదుసంవత్సరాలు. ఒక రోజు తన తండ్రిమృకండమహర్షి ఒడిలో కూర్చుని ఆడుకుంటూ ఉన్నాడు. ఆ సమయంలో ఒక సిద్ధ పురుషుడు అటువైపు వస్తూ, మృకండునితో 'నీ కుమారుడు దైవీగుణసంపన్నుడు. కారణజన్ముడు. కాని అల్పఆయుష్షుకల వాడు. కనుక ఏదైనా ఒక మేలుమార్గాన్ని ఆలోచించు' అని చెప్పి వెళ్ళిపోయాడు.

మహాత్ములవాక్కులు అసత్యం కానేరవు. మృకండుడు తనకుమారునికి ఉపనయనం చేసి, సకలధర్మమార్గాల్ని బోధించాడు. ఇదే మేలైనమార్గ మని భావించాడు. ప్రేమతో కుమారుణ్ణి తనదగ్గరకు పిలుచుకుని "నాయనా! నీకు ఎప్పుడైనా, ఎక్కడైనా మహాత్ములు, జ్ఞానులు, పెద్దలు ఎదురై నపుడు వారికి వినయవిధేయలతో నమస్కరించు. వారి ఆశీర్వాదఫలంవల్ల నీకు తప్పక మేలు జరుగుతుంది" అని చెప్పాడు.

తండ్రిఆజ్ఞానుసారంగా మార్కండేయుడు జ్ఞానులు, సిద్ధులు, పెద్దలు ఎదురైనపుడు నమస్కరిస్తూ ఉండేవాడు. కాని ఆయనఆయువు చివరిమూడురోజులకు చేరింది. దైవయోగ ఫలంగా, సప్తఋషులు అటువైపు విచ్చేస్తుండటం గమనించిన మార్కండేయుడు, వారందరికీ సవినయంగా నమస్కరించాడు. ఋషు లందరు ప్రసన్నులై 'దీర్ఘాయుష్మాన్ భవ' అని ఆశీర్వదించారు. కాని వశిష్టమహాముని తనతపశ్శక్తిచేత, మార్కండేయునిఅల్పాయువును గుర్తించాడు. మిగతా ఋషులతో ఈ వాస్తవాన్ని చెప్పి, వారిఆశీస్సులు వ్యర్థంకాకుండా, ఏదో ఒక ఉపాయం ఆలోచించా లని వశిష్టమహాముని వారికి సూచించాడు.

బ్రహ్మదేవునివల్లనే ఈ బాలుడు చిరంజీవి కాగల డనే నిర్ణయానికి ఋషులందరు వచ్చారు. బాలుణ్ణి తీసుకొని ఋషులు బ్రహ్మలోకానికి వెళ్లారు. సప్తఋషులు బ్రహ్మదేవునితో 'ప్రభూ! మేము ఈ బాలునివినయవిధేయతలకు సంతోషించి, 'దీర్ఘా యుష్మాన్ భవ' అని ఆశీర్వదించాం. మీరూ అలాగే ఆశీర్వదించారు. కాని వీనిఆయువు మూడురోజులే' అని సవినయంగా చెప్పారు.

ఋషులమాటలు విన్న బ్రహ్మదేవుడు చిరునవ్వుతో, వినయసంపన్నుడైన మార్కండేయునివైపు చూస్తూ "మునులారా! మీరు దుఃఖించేపని లేదు. ఈ బాలుడు తన వినయవిధేయత లతో కూడిన అభివాదంతో (నమస్కారం) కాలుణ్ణే (యముణ్ణి) జయించాడు. ఇక ఈ బాలుడు చిరంజీవి" అని పలికినపుడు ఋషులందరు మిక్కిలి ఆనందించారు.

మహాత్ములకు, జ్ఞానులకు, పెద్దలకు, తల్లిదండ్రులకు వినయపూర్వకంగా భక్తిశ్రద్ధలతో యువకులు, పిన్నలు అభివాదం చేయడంవల్ల అఖండశుభం ఎలా లభిస్తుందో ఈ కథవల్ల తెలుస్తుంది. బాలలూ! మానవవిలువలు తగ్గిపోతున్న ఈ రోజుల్లో ఈ శుభప్రదమైన సదాచారం పాటిస్తూ, బంగారు జీవితాన్ని సొంతం చేసుకోండి.

**మీరూ రాయండి!**

అడుగడుగున గుడి ఉంది, అందరిలో గుడి ఉంది .... అన్నాడొక కవి. పవిత్రమైన ఈ భారతావనిలో ప్రాచీన, అద్భుతమైన కళానైపుణ్యం, అనంతమైన చరిత్రగల ఆలయాలు ఎన్నో! ఎన్నెన్నో!! వాటి గురించి తెలుసుకోవా లని అందరికీ ఉంటుంది. **అందుకే మీరూ రాయండి!** మీ సమీపంలో ఉన్న దేవాలయాల చరిత్ర, విశేషాలు, స్వామివారి మహిమలు మీరూ రాయండి.ప్రచురించిన ప్రతిరచనకు తగిన పారితోషికం ఉంటుంది. ఆలయానికి సంబంధించిన ఫోటోలు జతచేయడం, కవరుమీద, రచనమీద **'మన దేవాలయాలు'** శీర్షికకు అని రాయటం మరువకండి!!

మీ రచనలు పంపాల్సిన చిరునామా : ప్రధాన సంపాదకుడు, సప్తగిరి మాసపత్రిక,తి.తి.దే., తిరుపతి - 517 507, చిత్తూరుజిల్లా.

## తిరుమల తిరుపతి దేవస్థానముల ఇటీవల ముద్రితమైన ప్రచురణలు

| సంఖ్య | పుస్తకం పేరు | రచయిత పేరు | ధర |
|---|---|---|---|
| 01. | అన్నమయ్య పదకోశం | ఆచార్య రవ్వాశ్రీహరి | 140-00 |
| 02. | శ్రీవచన సౌరభం | శ్రీ కోరుకొండభట్టర్ రామానుజభట్టర్ | 25-00 |
| 03. | తిరుమల తిరుపతి వేంకటేశ్వర దివ్యవైభవం | శ్రీ తిరువాయిపాటి రాఘవయ్య | 30-00 |
| 04. | ఆర్షపుత్ర శతకం | శ్రీ టి.వి.నారాయణ | 15-00 |
| 05. | వేదాంత పంచదశి-2 | శ్రీరాయప్రోలు లింగన సోమయాజి | 105-00 |
| 06. | వేదాంత పంచదశి-3 | శ్రీరాయప్రోలు లింగన సోమయాజి | 30-00 |
| 07. | కమనీయక్షేత్రం కపిలతీర్థం (పునర్ముద్రణ) | శ్రీ జూలకంటి బాలసుబ్రహ్మణ్యం | 30-00 |
| 08. | ఆర్షవిజ్ఞానసర్వస్వం 2వ సంపుటం (సంపాదకులు) | డా॥ ఎస్.బి.రఘునాథాచార్య | 65-00 |
| 09. | శ్రీవేంకటేశ్వరస్వామి అవతారం (తిరుమలక్షేత్రదర్శిని సీరీస్) | డా॥ సముద్రాల లక్ష్మణయ్య | 15-00 |
| 10. | శ్రీవేంకటేశ్వరస్వామి దర్శనం (తిరుమలక్షేత్రదర్శిని సీరీస్) | డా॥ హెచ్.ఎస్.బ్రహ్మానంద | 15-00 |
| 11. | శ్రీవేంకటేశ్వరస్వామి కైంకర్యాలు(తిరుమలక్షేత్రదర్శిని సీరీస్) | అర్చకం రామకృష్ణదీక్షితులు | 15-00 |
| 12. | శ్రీవేంకటేశ్వరస్వామి ఉత్సవాలు (తిరుమలక్షేత్రదర్శిని సీరీస్) | శ్రీ జూలకంటి బాలసుబ్రహ్మణ్యం | 15-00 |
| 13. | శ్రీసద్గురు మలయాళస్వామి (బ్రహ్మ మొక్కటే సీరీస్) | డా॥ సముద్రాల లక్ష్మణయ్య | 15-00 |
| 14. | భక్త నందనార్ (బ్రహ్మ మొక్కటే సీరీస్) | డా॥ కె.సర్వోత్తమరావు | 10-00 |
| 15. | భక్త తిన్నడు (బ్రహ్మ మొక్కటే సీరీస్) | శ్రీ లగడపాటి భాస్కర్ | 10-00 |
| 16. | వళ్ళలార్ (బ్రహ్మ మొక్కటే సీరీస్) | డా॥ పి.వి.అరుణాచలం | 10-00 |
| 17. | డివైన్ బ్రహ్మోత్సవవాహన సేవాస్ | శ్రీ రాణి సదాశివమూర్తి | 10-00 |
| 18. | హైమ్స్ ఆఫ్ ఆళ్వార్ ఇన్‌ప్రైస్ ఆఫ్ లార్డ్ వేంకటేశ్వర | శ్రీ ఆర్.రామానుజాచారి | 40-00 |
| 19. | ద్వైత వేదాంత | శ్రీ కె.ఆర్.పరమహంస | |
| 20. | అథర్వవేద సంహిత 6వ సంపుటం | డా॥చిర్రావూరి శ్రీరామశర్మ<br>డా॥ కొంపెల్ల సత్యనారాయణ | 70-00 |
| 21. | అథర్వవేద సంహిత 8వ సంపుటం | డా॥ చిర్రావూరి శ్రీరామశర్మ | 55-00 |
| 22. | అథర్వవేద సంహిత 9వ సంపుటం | డా॥ చిర్రావూరి శివరామకృష్ణ శర్మ | 55-00 |
| 23. | అథర్వవేద సంహిత 10వ సంపుటం | డా॥ చిర్రావూరి శివరామకృష్ణ శర్మ | 55-00 |

పౌరసంబంధాధికారి, పుస్తక విక్రయశాల, తిరుమల తిరుపతి దేవస్థానములు,

తి.తి.దే. ప్రెస్ కాంపౌండు, కె.టి.రోడ్డు, తిరుపతి - 517 507

ఇతర వివరాలకు - 0877-2264294 ఫోన్ నంబరును సంప్రదించగలరు.

☛ పోస్టుద్వారా పొందగోరువారికి పోస్టేజి ఖర్చు అదనం



## 'మహామహోపాధ్యాయ' పురస్కారం

తిరుమలతిరుపతిదేవస్థానంలో పురాణేతిహాసప్రాజెక్టు ప్రత్యేకాధికారిగా పనిచేస్తున్న డా॥సముద్రాలలక్ష్మణయ్యకు 06-03-2013వ తేదీన రాష్ట్రియసంస్కృతవిద్యాపీఠంవారు 16వ స్నాతకోత్సవంలో 'మహామహోపాధ్యాయ' పురస్కారం అందజేశారు. 2007లో ఈ విద్యాపీఠంవారే వీరిని 'వాచస్పతి' పురస్కారంతో సత్కరించారు.

గతంలో శ్రీలక్ష్మణయ్య హిందూధర్మప్రచారపరిషత్తు కార్యదర్శిగా పనిచేసారు. సంస్కృతాంధ్రభాషలలో వీరు ఇప్పటికి 35 గ్రంథాలు రచించారు.

# వార్తాలహరి

### మనగుడి (విశాఖపట్టణం) కార్యక్రమ విశేషాలు

తిరుమల తిరుపతి దేవస్థానములు మరియు దేవాదాయ ధర్మాదాయ శాఖ సంయుక్తంగా 'మన గుడి' కార్యక్రమం ఆంధ్రప్రదేశ్‌లోని 24 జిల్లాల్లోని దేవాలయాలలో ఇటీవల ఎంతో ఘనంగా నిర్వహించాయి. ఇందులో భాగంగా విశాఖపట్టణంజిల్లా మనగుడి అధికారిగా, తి.తి.దే.శ్రీనివాసం వసతి సముదాయం ఉపకార్యనిర్వహణాధికారిణిగా పనిచేస్తున్న శ్రీమతి కె.సుశీలగారిని, డివిజనల్ ఇన్‌ఛార్జిలుగా శ్రీ యన్.చక్రవర్తి, శ్రీ డి.కృష్ణవర్మ, శ్రీ బి.మధు, సూపరింటెండెంటు మరియు శ్రీ ఆర్.సి.సుబ్రహ్మణ్యం ఎగువశ్రేణిగుమస్తాలను, నియమించడం జరిగింది.

ఈ కార్యక్రమంలో భాగంగా విశాఖజిల్లాలో తి.తి.దే. నుండి వచ్చిన మహాప్రసాదం పసుపుకుంకుమలు, అక్షతలు, కలకండ, కంకణాలు మొదలగునవి ఉన్న పెట్టెలతో పట్టుచీర, జాకెట్టు, ధోవతి, ఉత్తరీయం, నూనె, ఫ్లెక్సీలు, పోస్టర్లు, కరపత్రాలు మరియు భక్తులసంఖ్యనుబట్టి అదనంగా రక్షా కంకణాలు అన్ని దేవాలయాలకు పంపిణీచేయడం జరిగింది. అలాగే దేవాదాయశాఖ ఉద్యోగులకు స్వామి వారి 'శ్రీ' డి ఫోటోలను పంపి, భక్తులకు పంచడం జరిగింది.




వందేళ్లపాటు సంగీతసరస్వతి సేవలో తరించిన కర్ణాటకసంగీతస్వరధుని, తెలుగు కళానిధి శ్రీపాదపినాకపాణి(101) 11-03-2013న పరమపదం చేరుకున్నారు.

శ్రీకాకుళంజిల్లా ప్రియాగ్రహారంలోని సంగీతనేపథ్యకుటుంబంలో పుట్టిన పినాకపాణి 11 ఏళ్ళవయస్సులో సంగీతాభ్యాసం ప్రారంభించారు. వైద్యవృత్తిలో కొనసాగుతూనే కర్ణాటక సంగీతానికి నిరుపమానసేవలందించిన అసమానకళాకారుడీయన.

తన సంగీతసంపదను తదనంతర తరాలకు అందించేందుకు పుస్తక రూపమిచ్చారు. ఆయన రాసిన 'సంగీతసౌరభం' నాలుగుసంపుటాలను తి.తి.దే. ముద్రించింది. తెలుగునాట గానఋషిగా పేరొందిన పినాకపాణి గొప్పవైద్యుడు కూడా. తొలుత రాజమండ్రి, తరువాత విశాఖవైద్యకళాశాలలో పనిచేసి, 1957లో కర్నూలుకు వచ్చి అక్కడేవైద్యుడిగా పనిచేసి 1968లో పదవీవిరమణ చేశారు. వందేళ్లు పూర్తిచేసుకున్న వీరు కర్నూలులో స్థిరపడి కర్ణాటకసంగీతప్రచారాన్ని నిర్వహించారు. వందేళ్లు పూర్తిచేసుకున్న సందర్భంగా ఆయనను రాష్ట్రప్రభుత్వం స్వర్ణ కంకణంతో, తిరుమలతిరుపతిదేవస్థానం రూ.10లక్షల నగదుపురస్కారంతో సత్కరించాయి. వీరి మృతి ఇటు వైద్యరంగానికి, అటు సంగీతప్రపంచానికి తీరనిలోటు!

ఈ కూపను కత్తరించండి

తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి



# సప్తగిరి

(ఆధ్యాత్మిక మాసపత్రిక)

## చందా నమోదు పత్రం

1. పేరు మరియు చిరునామా : ______________________
(విడి విడి అక్షరాలలో అర్థమయ్యేలా వ్రాయండి. మరియు పిన్‌కోడ్ తప్పక వ్రాయండి)
______________________
______________________
______________________
______________________
(పిన్‌కోడ్ తప్పని సరి) ☐☐☐☐☐☐

2. కావలసిన భాష : ☐ తెలుగు ☐ తమిళం ☐ కన్నడం ☐ హిందీ ☐ ఇంగ్లీషు

3. సంవత్సర/జీవిత చందా : ☐ రూ. 60/- ☐ రూ. 500/-

4. చందా పునరుద్ధరణ :
(అ) చందా నెంబరు :
(ఆ) భాష :

5. చెల్లించిన మొత్తం :
డి.డి.నెం. : తేది :
(చెక్కులు స్వీకరించబడవు)

ప్రదేశం :

తేది : చందాదారుని సంతకం

## మోసపోకండి !

మన రాష్ట్రంలోని కొన్ని నగరాలలో
కొందరు వ్యక్తులు అనధికారికంగా
**సప్తగిరి మాసపత్రికకు**
చందాల రూపంలో
అధిక మొత్తాలు వసూలు చేస్తున్నారని,
తద్వారా శ్రీవారి దర్శనం చేయిస్తా మని,
నమ్మిస్తున్నా రని తెలిసింది.
అలాంటివారిమాటలకు మోసపోకండి.
సప్తగిరి చందాకు, శ్రీవారి దర్శనానికి
మరియు
ప్రసాదాలకు ఎటువంటి సంబంధం లేదు.
చందా మీరు నేరుగా
"ప్రధాన సంపాదకుడు, సప్తగిరి,
తి.తి.దేవస్థానం, తిరుపతి"
వారికి పంపించాలి. (లేదా)
తిరుపతిలోని శ్రీనివాసం యాత్రికుల
వసతి సముదాయంలో
కూడా మీచందాలను కట్టవచ్చు.
సప్తగిరికి చందాలు వసూలు చేయుటకు
దేవస్థానం బయటి వ్యక్తులను
ఎవరినీ నియమించలేదు.

**అధిక మొత్తాలు చెల్లించకండి!**
**వారి మాటలకు మోసపోకండి!!**

సంప్రదించండి...!
సప్తగిరి చందాల విచారణకు
**0877 - 2264359**
**0877 - 2264543**

- సప్తగిరి సంవత్సర చందా రూ.60/-, జీవితచందా రూ.500/-లు; డి.డి. / ఎం.ఓ. ని **'చీఫ్ ఎడిటర్, 'సప్తగిరి', తి.తి.దే., తిరుపతి'** వారి పేరున తీయాలి.
- సప్తగిరిచందాదారులుగా చేరదలచుకొన్నవారు/ తమచందాను పునరుద్ధరించుకోదలచినవారు ఈ కూపనులో గానీ లేక తెల్లకాగితంలోగానీ పైన పేర్కొన్నవిధంగా వివరాలు వ్రాసి, పంపవచ్చు. క్రింద ప్రచురించిన చిరునామానుమాత్రమే సంప్రదించండి. **తి.తి.దే. ప్రధాన సంపాదక కార్యాలయం, తిరుపతికి తప్ప-మీరు ఎవరిదగ్గర డబ్బులు కట్టి, మోసపోకండి.**
- మనిఆర్డరు పంపువారు అందులోనే మీయొక్క చందావివరాలు వ్రాసి, ఈ క్రింది చిరునామాకు పంపవలయును.
- మా చిరునామా **"ప్రధానసంపాదకుడు, సప్తగిరి కార్యాలయం, టి.టి.డి.ప్రెస్ కాంపౌండ్, కె.టి.రోడ్డు, తిరుపతి - 517 507".**

Edited and published on behalf of T.T. Devasthanams by **Dr. C. Saila Kumar,** M.A.,Ph.D., Chief Editor, T.T.D. and printed at T.T.D. Press by **V. Sambasiva Rao,** D.P.T., Manager, T.T.D. Press, Tirupati - 517 507.

పెరిగినాఁడు చూడరో పెద్ద హనుమంతుడు
పరగి నానావిద్యల బలవంతుఁడు

రక్కసుల పాలికి రణరంగశూరుఁడు
వెక్కసపు యేకాంగవీరుఁడు
దిక్కులకు సంజీవి దెచ్చిన ధీరుఁడు
అక్కజమైనట్టి యాకారుఁడు

లలిమీరినయట్టి లావుల భీముఁడు
బలు కపికులసార్వభౌముఁడు
నెలకొన్న లంకా నిర్ధూమధాముఁడు
తలంపున రామునాత్మారాముఁడు

దేవకార్యముల దిక్కు వరేణ్యుఁడు
భావింపఁగఁ దపఃఫలపుణ్యుఁడు
శ్రీవేంకటేశ్వరు సేవాగ్ర గణ్యుఁడు
సావధానుఁడు సర్వశరణ్యుఁడు

(4 - 528)

హనుమంతుడు అనేకవిద్యలసంపన్నుడు. రాక్షసులపాలి ఏకాంగవీరుడు. అవసరమైనపుడు సంజీవని తెచ్చిపెట్టిన ధీరుడు. తపఃఫలంగా జన్మించిన వాడు అని ఈ కీర్తనలో అన్నమయ్య హనుమంతుణ్ణి అనేకవిధాల స్తుతించాడు.





## జూలై నెలలో తి.తి.దే. ఉత్సవ విశేషాలు

**14 –** శ్రీకల్యాణవేంకటేశ్వరస్వామివారి సాక్షాత్కార వైభవోత్సవము

**16 –** ఆణివర ఆస్థానము

## శ్లాఘనీయం!!

మార్చినెల 'సప్తగిరి' మాసపత్రిక మీరు ప్రచురించిన సంపాదకీయం శ్లాఘనీయం. భారతనారీమణుల వైశిష్ట్యం గురించి చాలాచక్కగా హృదయాన్ని హత్తుకునేటట్లు వ్రాశారు. నిజంగా ప్రతిమనిషి ఆ సంపాదకీయాన్ని చదివి తీరాలి. ఇంతవరకు ఇలాంటి గొప్పసంపాదకీయాన్ని నేను చదువలేదు. అలాంటి భాగ్యం కలిగిన నేను అదృష్టవంతుణ్ణని తెలియచేసుకుంటున్నాను.

*– బి.వేంకటేశ్వరరావు, తిరుమల.*

☛ **ఇదేవిషయాన్ని చాలామంది పాఠకులు తెలియజేశారు. స్థలాభావంవల్ల వారిపేర్లు ప్రచురించలేకపోతున్నాం. ఇలాంటి పాఠకుల ఆదరాభిమానాలే మా పత్రిక మనుగడకు శ్రీరామ రక్ష.** *– ప్రధానసంపాదకుడు.*

## అభినందనీయం

ముఖ్యముగా సప్తగిరిమాసపత్రిక సిబ్బందికి మా ధన్యవాదములు. మాకుటుంబం కొన్ని సంవత్సరముల నుండి సప్తగిరి పత్రిక చదువుచున్నందున మాకు ఆధ్యాత్మిక విషయాలు మరియు మీరు ప్రచురిస్తున్న 'వేదం తెలుసు కుందాం' చాలాబాగుంది. అలాగే మీరు తెలిపిన పురాణ విషయాలు చాలా సంతోషం, స్వామివారిపట్ల మాకు భక్తి భావం పెరిగినది. మేము, మా చిన్నతనంనుండి స్వామివారి భక్తులము. మాకు తెలియని శ్రీతిరుచానూరు పద్మావతి అమ్మవారు పద్మశాలికులంనుండి జన్మించిన ఆడపడుచు అని సవివరముగా తెలియపరచినందున మీకు సర్వదాకృతజ్ఞులం. ముఖ్యముగా సంపాదకీయం చాలా అభినందనీయం.

*– అంజూరి వేంకటరమణ, రామచంద్రాపురం, తూ.గో.జిల్లా.*

## మీ మాట

## ఆలోచింపజేస్తోంది

సప్తగిరి సంచికలో ప్రతినెలా వెలువడుతున్న సంపాదకీయాలు మమ్మల్ని ఆలోచింపజేస్తున్నాయి. విశ్లేషణ అర్థవంతంగా, ఔచిత్యవంతంగా ఉంటోంది.

*– గోవింద, చెంబకూరు.*



# సప్తగిరి

తిరుమల తిరుపతి దేవస్థానముల సచిత్ర మాసపత్రిక

సంపుటి : 44 జూన్, 2013 సంచిక : 01



*ఈ సంచికలోని రచయితల అభిప్రాయాలు వ్యక్తిగతమైనవి.*
*ప్రధానసంపాదకుడు గాని, తిరుమల తిరుపతి దేవస్థానం గాని వాటికి బాధ్యత వహించరు.*

వేంకటాద్రిసమం స్థానం బ్రహ్మాండే నాస్తి కించన,
వేంకటేశసమో దేవో న భూతో న భవిష్యతి.



భక్తి కొలదివాడే పరమాత్ముడు
భుక్తి ముక్తిదానె యిచ్చు భువి పరమాత్ముడు


గౌరవ సంపాదకుడు :
ఎల్.వి. సుబ్రహ్మణ్యం, ఐ.ఏ.ఎస్.,
కార్యనిర్వహణాధికారి, తి.తి.దేవస్థానములు.

ప్రచురణకర్త-ప్రధాన సంపాదకుడు :
డా॥ సి.శైలకుమార్

సంపాదకుడు : డా॥ కె.రాధారమణ

ఉపసంపాదకుడు : డా॥ కె.రవిచంద్రన్

ముద్రాపకుడు : వి.సాంబశివరావు, డి.పి.టి., మేనేజరు, ముద్రణాలయం, తి.తి.దే.

డి.టి.పి. : ప్రధాన సంపాదకులవారి కార్యాలయం, తి.తి.దే., తిరుపతి

వర్ణచిత్రాల లే-అవుట్ : పి.శివప్రసాద్



***వివరాలకు :***
ప్రధాన సంపాదకుడు,
సప్తగిరి, తి.తి.దేవస్థానములు,
తిరుపతి - 517 507.
ఫోను : 0877-2264543, 2264359



సప్తగిరి మాస పత్రిక

విడి ప్రతి : రూ. 5/-
సం॥ చందా : రూ. 60/-
జీవిత చందా : రూ.500/-
విదేశాలకు సం॥చందా : రూ. 850/-

సంపాదకీయం

# బంటురీతి కొలు వియ్యవయ్య రామా!

ప్రకృతి సర్వం పరస్పరసేవాభావాన్ని చూపడానికే రూపొందింది. సేవాభావంలో ఐకమత్యం, సహృదయత్వం, సౌమనస్యం, సౌజన్యం ఇలా ఎన్నో సద్గుణాలు మిళితమై ఉంటాయి. పెద్దలు, పిన్నలు అందరూ వారివారితాహత్తుకు తగినట్లుగానే సేవారూపజీవనాన్ని గడుపుతూనే ఉన్నారు. పిల్లలు పెద్దలయందు చూపేసేవాభావం గౌరవంగా, భగవంతునియందు చూపేసేవాభావం భక్తిగా, పెద్దలు పిన్నలయందు చూపేసేవాభావం వాత్సల్యంగా, దంపతుల పరస్పరసేవాభావం ప్రేమగా, ప్రభువుల యందు సేవకులు చూపే గౌరవాన్ని రాజభక్తిగా, అధికారులయందు క్రింది ఉద్యోగులు చూపేసేవాభావం విధ్యుక్తధర్మ నిర్వహణంతో కూడిన ఆప్యాయతగా.... ఇలా నిత్యజీవితంలో సర్వమూ సేవామయంగానే ఉంటుంది.

సేవ శరీరమైతే దానికి ప్రాణమూ, ఆత్మ త్యాగమౌతుంది. నిస్స్వార్థమైన త్యాగగుణ మున్నప్పుడే సేవ నిష్కళంకమై విశ్వోన్నతిని సాధిస్తుంది. మహాత్ములందరూ ఇలాంటి సేవ లందించినవారే! నవవిధభక్తులలో దాస్యభక్తి ఎంతో విశిష్టమైనది. భగవంతుణ్ణి ఏ విధంగా ఆరాధించినా అందులో త్రికరణరూపమైన సేవ ప్రకాశిస్తూనే ఉంటుంది. హనుమంతుడు మూర్తీభవించినదాస్యభక్తి. మనసా కర్మణా వాచా శ్రీరాముణ్ణి సీతాదేవిని మానవపరిధిలో గాక సాక్షాత్ పరమాత్మ, పరాదేవతాస్వరూపంగా భావించి, నిష్కళంకసేవామహిమ ఎంత ప్రభావవంతమైనదో లోకానికి చాటి చెప్పాడు.

తాను సుగ్రీవునిమంత్రి అయినా 'దాసోஉహం కోసలేంద్రస్య' – అంటూ తనను రాముని బంటుగానే ప్రకటించుకున్నాడు. ఇప్పటికీ రామాలయాలలో శ్రీరామునిపాదభక్తుడుగానే ప్రతిష్ఠితుడై ఉన్నాడు. రామనామప్రభావమూ, శ్రీరామసేవామహత్త్వమూ హనుమంతుణ్ణి భవిష్యత్బ్రహ్మగా చేస్తున్నాయి. సేవానిరతి ఎంత సమున్నతస్థితికి తెచ్చినదో ఈ ఒక దృష్టాంతము చాలు!

ప్రతివ్యక్తీ తాను భగవంతునికీ, భగవద్రూపమైన ప్రకృతికీ, సమాజానికీ సేవకుణ్ణి అనే భావాన్ని స్థిరంగా అలవరచుకుంటే ఎక్కడగానీ వైషమ్యాలు, పోరాటాలు, నిమ్నోన్నతాలు, విభేదాలు ఉండవు. కనుక జీవితసర్వస్వమూ మరొకరికి సేవచేయడమే బ్రహ్మానందంగా భావించ మనీ, సేవయే నిజమైన ఐశ్వర్య మనీ భావించగలిగిననాడు మానవుడు మాధవు డౌతాడు. అందుకే 'మానవసేవయే మాధవసేవ' అన్నారు– పెద్దలు. ఈ సేవాపరమార్థాన్నే రామకృష్ణాద్యవతారాలు నిరూపిస్తున్నాయి.

పరస్పరసేవాసహకారాలతో సమాజం శాంతిసౌభాగ్యాలతో వర్ధిల్లుతుం దని ఆకాంక్షిద్దాం!!

**సర్వం సేవామయం జగత్**

**'మహాకుంభమేళా' ప్రపంచంలో ఒక అద్భుతమైన సంఘటన!**
**ధర్మహవిస్సుకు తొలియజ్ఞప్రాంగణం!!**
**కేవలం నదీస్నానంకోసం తరలివచ్చిన కోట్లాదిప్రజలు!!**
**విదేశీయులకు విస్మయం! కుతూహలం!!**
**సనాతనహైందవసంస్కృతికి అక్షరనీరాజనం!!**
**అవును!**
**మహాకుంభమేళా భగవత్తత్త్వాన్ని ఆవిష్కరించే**
**ఒక సద్గురుసన్నిధానం!!**
**మానవత్వాన్ని పరిమళింపచేసే కల్పవృక్షం!!**

ప్రకృతిమీదనే ఆధారపడి మానవజీవనం సాగుతుందనేది భౌతికసత్యం. సహజమైనప్రకృతిరీతిని నాశనం చేస్తున్నాడు- ఆధునికమానవుడు. ఈ దుష్ప్రభావం భారతావనిలో కూడా అధికంగా కనిపించడం బాధాకరం!! అయినప్పటికీ ప్రకృతిని దైవంగా భావించేసంస్కృతి మనది!! ప్రకృతితో సహజీవనం మనవిధానం. మానవులకు ప్రాణం–ప్రణవం – దైవచింతన! దీనివల్లనే లోకకల్యాణం జరుగుతుంది. ఇది వేదానుశాసనం! ఇది మనప్రాచీనమహర్షులు మనకు అందించిన ఆప్తవాక్యం!! బృహత్తరమైన సృష్టివిధానరహస్యం మనకు రేఖామాత్రంగా అర్థమయ్యే అపూర్వమైన సన్నివేశం మహాకుంభమేళామహోత్సవం!!

పుణ్యభూమిగా ప్రసిద్ధిపొందిన భారతదేశంలో ప్రజలు తరించటానికి అనేకదివ్యక్షేత్రాలు, పావనతీర్థాలు, దేవాలయాలు, ఋష్యాశ్రమాలు, పవిత్రప్రదేశాలు నెలకొని ఉన్నాయి. సమాజంలో అన్ని స్థాయిలలోనూ మనుగడసాగిస్తున్న ప్రజలందరికీ అందివచ్చే విధంగా హైందవసంస్కృతిని మనఋషులు తీర్చిదిద్దారు. మనది ఆర్షసంప్రదాయం! సనాతనధర్మం!! దీనిలోతు తెలుసుకోవటానికి అటు ప్రజలూ ప్రయత్నించాలి! ఇటు ఆధ్యాత్మికవేత్తలూ భక్తులకు అందించటానికి కృషిచేయాలి. ఆసేతుహిమాచలం హైందవులు ఆచరించేపర్వదినాలలో 'కుంభమేళా' ఒకటి!

## అద్వైతసిద్ధికి... అమరత్వలబ్ధికి...

బృహస్పతి- ప్రతిపన్నెండుసంవత్సరాలకు ఒకసారి ఒక్కొక్కరాశిలోనికి ప్రవేశించినపుడు ఆయా నదులకు పుష్కరాలు వస్తాయి. అయితే పుష్కరాలకు దక్షిణభారతప్రజలు ఇచ్చిన ప్రాధాన్యత ఉత్తరభారతప్రజలు ఇవ్వరు. కుంభమేళాఉత్సవాలకు మాత్రమే తరలివస్తారు. తెలుగువారుమాత్రం ఈ రెండుసంప్రదాయాలను పాటించడం విశేషం!! ఇంతకీ 'కుంభమేళా' అంటే ఏమిటి? సంగ్రహంగా తెలుసుకొందాం!! కుంభమేళాపుణ్యస్నాన మహోత్సవాలకు ఒకపురాణకథ కీలకం!! ఈ గాథలో కొన్ని మార్పులు, చేర్పులు అనేకకారణాలవలన వివిధకాలాలలో రూపుదిద్దుకొన్నట్టుగా పరిశోధకులభావన. ఇక ప్రధానమైన పురాణవృత్తాంతం చూడండి! అమృతంకోసం దేవదానవులు క్షీరసాగరమథనం చేశారు. చివరకు అమృతకుంభంతో ధన్వంతరి ఆవిర్భవించాడు. అమృతం రాక్షసులకు దక్కితే–లోకసంక్షోభం పుడుతుం దని భావించాడు–బృహస్పతి. అప్పటికే

# మహాద్భుతం....
# మహాకుంభమేళా -2013

*డా॥ వేదాంతం రాజగోపాలచక్రవర్తి*

దైత్యులు బలవంతంగా ధన్వంతరినుంచి అమృతభాండాన్ని తీసుకొన్నారు. బృహస్పతి రక్కసులనుంచి హఠాత్తుగా అమృతకుంభాన్ని లాక్కొని పరుగెత్తటం మొదలుపెట్టాడు.

ఆయనకు రక్షగా దేవతలు రాగా, వారిని వెంటాడుతూ రాక్షసులు కదిలారు. బృహస్పతి, 12 సార్లు భూమిచుట్టూ ప్రదక్షిణ చేశాడు. ఆ సమయంలో అమృతకుంభంనుంచి నాలుగుబిందువులు జారి, నాలుగుప్రదేశాలలో పడ్డాయి. అవే హరిద్వార్, ప్రయాగ, నాసిక్, ఉజ్జయిని ప్రాంతాలు. ఈ ప్రదేశాలలోమాత్రమే కుంభమేళాఉత్సవాలు జరుగుతాయి.

**పృథివ్యాః కుంభయోగస్య చతుర్ధా భేద ఉచ్యతే**
**గంగాద్వారే ప్రయాగే చ ధారా గోదావరీతటే**

అమృతకుంభంనుంచి జాలువారి, అమృతబిందువులు పడిన ఈ స్థలాలు దివ్యక్షేత్రాలుగా ప్రసిద్ధిని పొందాయి. అమృతస్పర్శను పొందటంచేత ఇక్కడ ప్రవహించే నదులలో స్నానం

గావిస్తే, మానవులకు అమృతత్త్వసిద్ధి లభిస్తుంది. అమృత బిందువులు పడినసమయం ఏదైతే ఉందో- ఆ కాలంలో నదీ జలాల్లో దివ్యశక్తి ప్రవహిస్తుంది. అప్పుడుమాత్రమే కుంభమేళా వస్తుంది. అప్పుడు చేసేస్నానాలకు విశిష్టమైనపుణ్యాన్ని ప్రసాదించేలక్షణం ఉంటుం దని వేదవేత్తలనిర్ణయం.

**అశ్వమేధసహస్రాణి, వాజపేయశతాని చ,**
**లక్షం ప్రదక్షిణా భూమేః, కుంభస్నానే హి తత్ఫలమ్.**

ఇలా ప్రతి 12 సంవత్సరాలకు ఒకకుంభమేళా ఒక క్షేత్రంలో జరుగుతుంది. ఇప్పుడు జరిగిన 2013 కుంభమేళా ప్రదేశం ప్రయాగక్షేత్రం!! రాబోయే కుంభమేళా (2015) ఉజ్జయినిలో!!

## గ్రహగతితో మహాకుంభమేళా!

కుంభమేళా జరగటానికి గ్రహగతివిధానంకూడా ఒక ప్రధానమైన అంశం. బృహస్పతి జీవనదాయకుడు. ధనుర్మీన రాశులకు బృహస్పతి అధిపతి. మకర, కుంభరాశులకు శని అధిపతి- స్వయంసంహారకశక్తి కలిగినవాడు. సూర్యుడు సింహ రాశికి, చంద్రుడు కర్కాటకరాశికి, అంగారకుడు మేషవృశ్చికరాశులకు, శుక్రుడు వృషభతులారాశులకు అధిపతులు. మిథున కన్యా రాశులకు బుధుడు అధిపతి. బృహస్పతి మేషరాశిలోనికి, సూర్య చంద్రులు మకరరాశిలోనికి ప్రవేశించినపుడు ఆయా రాశుల అధిపతులతీవ్రత తగ్గిపోతుంది. ఈ సమయంలో స్నానాలు చేయటంవల్ల మానవులకు సకలశుభాలు కలుగుతాయి. ఇదే కుంభమేళా!! మకరకుంభరాశులు వరుసగా ఉంటాయి కదా! ఇక మాఘమేళా మనకు తెలిసిందే!! ఇది ప్రయాగకుంభమేళా విషయం.

**మేషరాశిగతే జీవే మకరే చంద్రభాస్కరౌ**
**అమావాస్యా తదా యోగః కుంభాఖ్యే తీర్థనాయకే**
**మకరేచ దివానాథే హ్యజగే చ బృహస్పతౌ**
**కుంభయోగో భవే త్తత్ర ప్రయాగే హ్యతిదుర్లభః**
**మాఘే మేషగతే జీవే, మకరే చంద్రభాస్కరౌ**
**అమావాస్యా తదా యోగః కుంభాఖ్యే తీర్థనాయకే**

## మన మెంత అదృష్టవంతులం...!

ఇప్పుడు తెలుసుకొన్నవిషయము కుంభమేళా గురించి!! అయితే జరిగినది మహాకుంభమేళా!! ప్రపంచంలోనే కోట్లాదిమంది ప్రజలు ఆశ్చర్యంతో, ఆనందంతో వీక్షించిన అద్భుతదృశ్యం మహాకుంభమేళా!! ప్రయాగలో పన్నెండుసంవత్సరాలకు ఒకసారి వచ్చే కుంభమేళావంటివి పన్నెండు జరిగితే ఆ తరువాత వచ్చేది (12×12=144) మహాకుంభమేళా. అంటే 144 సంవత్సరాలకు ఒకసారి వస్తుంది. గ్రహగతులు, ఇతర అంశాలు పరిగణనలోకి తీసుకుని దైవజ్ఞులు నిర్ణయించిన అప్రమేయమైనపుణ్యకాలం- మహాకుంభమేళా!! ఇటువంటి మహాపుణ్యప్రదాయకమైన మహాకుంభమేళా జరిగే పవిత్ర సమయంలో మనం జీవించి ఉన్నాము. మళ్ళీ 144 సంవత్స రాల తరువాత మహాకుంభమేళా వస్తుంది. “నందో రాజా భవిష్యతి!” ఇతఃపూర్వం జరిగిన మహాకుంభమేళాలో మనం లేము. (మహాత్ములు, సిద్ధపురుషులు, హఠయోగులు, నాగసాధువులు ఉన్నారు). మనకనులముందు సాగిన అపురూపమైన పుణ్యకాలప్రవాహంలో మనమందరం స్నానాలు చేయటం పూర్వజన్మల సుకృతఫలం!!

కల్పాదిలో బ్రహ్మదేవుడు స్వయంగా యాగము నిర్వహించాడు కనుక ఈ ప్రదేశానికి ‘ప్రయాగ’ అనే పేరు వచ్చిందని పురాణవచనం. గంగ, యమున, సరస్వతీనదుల సంగమం ఇక్కడే జరుగుతుంది. ‘త్రివేణీసంగమం’ ప్రసిద్ధమైననామం. పావనత్రివేణీ సంగమంలో స్నానం చేయటానికి మహాకుంభమేళా సందర్భంగా 12 కోట్లమంది భక్తులు వచ్చా రని ఒక అంచనా. 2013, జనవరి 14 మకరసంక్రాంతినుంచి, మార్చి 10 మహా శివరాత్రివరకు మహాకుంభమేళా, మహోత్సవం జరిగింది. ఇంత సుదీర్ఘమైన జలమహోత్సవం, భక్తులపుణ్యస్నానాలు ప్రయాగలో తప్ప ప్రపంచంలో మరెక్కడా జరుగలేదు.

## కుంభనగరం.. ఇంద్రలోకం

ప్రయాగదగ్గర గంగానదీవిస్తృతి ఎక్కువ. ఉభయ తీరాల మధ్య ఉన్నప్రదేశంలో గంగానది పాయలు పాయలుగా ప్రవహిస్తుంది. గంగానదిమధ్యలో (కొంత యమునాతీరంలో) **‘కుంభనగర్’** అనేపేరుతో ప్రభుత్వం తాత్కాలికంగా ఒక నగరాన్ని నిర్మించింది- చూచేవారికి ఆశ్చర్యం కలిగేవిధంగా! సుమారు 57 కిలోమీటర్ల విస్తీర్ణంలో 10 లక్షలకు పైగా గుడారాలు ఏర్పాటు చేసి, రోడ్లు, విద్యుత్ స్తంభాలు, త్రాగునీటి

సౌకర్యం, వంతెనలు, ఆస్పత్రులు, వస్తువుల దుకాణాలు, మరుగుదొడ్లు, పోలీసుస్టేషన్లు, అగ్నిమాపకదళకేంద్రాలు, అత్యవసరసర్వీసులు, రాత్రింబగళ్ళు పారిశుద్ధ్యం, నిరంతరం భద్రతా చర్యలు... ఇవన్నీ చూస్తుంటే విదేశీయులకే విస్మయం కలిగింది. రాత్రివేళ విద్యుద్దీపకాంతులతో ధగద్ధగాయమానంగా **'కుంభ నగర్'** ఇంద్రలోకంవలే వెలుగులు విరజిమ్మేది. మామూలు రోజుల్లో ఎక్కడా కనిపించని నాగాసాధువులు, మహామండలాధిపతులు, పీఠాధిపతులు, యోగులు, అఘోరీలు, వివిధ వైష్ణవ, శైవఅఖాడాలకు సంబంధించిన సన్యాసులు, హిందూసేవా పరాయణులు, హిందూసంస్థలు, అనేకసంప్రదాయ అనువర్తకులు, యజ్ఞాలు, ప్రవచనాలు, ఆధ్యాత్మిక సమ్మేళనాలు, ఊరేగింపులు, మానవాతీతశక్తుల ప్రదర్శనలు... ఒక అద్భుతమైన హైందవఆధ్యాత్మికప్రపంచం ఆవిష్కృతమైంది– ఈ మహాకుంభ మేళాలో!!

# తిరుమల / తిరుపతిలో వసతి పొందడమెలా?

**అఖిలాండకోటి బ్రహ్మాండనాయకుడైన తిరుమల శ్రీవారిదర్శనం కోటిజన్మల పుణ్యఫలం. తిరుమల తిరుపతి దేవస్థానం భక్తులకు తిరుమల / తిరుపతిలో బస వసతి కల్పిస్తోంది.**

**1) ఉచిత వసతి :**

తిరుపతిలో రైల్వేస్టేషన్ వెనక వైపుగల శ్రీగోవిందరాజస్వామిధర్మశాల, శ్రీకోదండరామస్వామిధర్మశాల, శ్రీవేంకటేశ్వరస్వామిధర్మశాలల్లో భక్తులకు ఉచితంగా గదులు, డార్మెటరీసదుపాయాలు ఉన్నాయి. అదేవిధంగా శ్రీనివాసం, విష్ణునివాసం, అలిపిరి వద్దగల భూదేవి యాత్రికుల వసతిసముదాయాల్లో డార్మెటరీలు, లాకర్ సదుపాయాలను తితిదే అందిస్తోంది.

తిరుమలలో ఆర్‌టిసి బస్టాండు వద్దగల సి.ఆర్.ఓ. (సెంట్రల్‌రిజర్వేషన్ కార్యాలయం)లో భక్తులకు ఉచిత గదులను కేటాయిస్తారు. వివిధప్రాంతాల్లోని నాలుగు యాత్రికుల వసతిసముదాయాల్లో డార్మెటరీలు, లాకర్‌సదుపాయాలు ఉన్నాయి.

**2) రుసుముద్వారా వసతి :**

తిరుపతిలోని విష్ణునివాసం, శ్రీనివాసం, మాధవం, ఎస్వీ గెస్ట్‌హౌస్, పద్మావతి గెస్ట్‌హౌస్ వసతి సముదాయాల్లో నిర్ణీత రుసుముతో తి.తి.దే. గదులు కేటాయిస్తోంది. ఇక్కడ బస వసతికోసం అడ్వాన్స్‌రిజర్వేషన్ సౌకర్యం ఉంది. 20 రోజుల ముందుగా నిర్ణీతరుసుమును "కార్యనిర్వహణాధికారి, తి.తి.దే.,తిరుపతి" అనే పేరుపై డి.డి. తీసి శ్రీనివాసం సహాయకార్యనిర్వహణాధికారి(ఏ.ఈ.ఓ.)కు పంపాలి.

**అ) ఇంటర్నెట్ ద్వారా అడ్వాన్స్‌బుకింగ్ :**

తిరుమలలో బసకోసం 30 రోజుల ముందుగా ఇంటర్నెట్, తి.తి.దే. సమాచారకేంద్రాలద్వారా నిర్ణీత రుసుము చెల్లించి, అడ్వాన్స్ బుకింగ్ చేసుకోవచ్చు.

**ఆ) ఆర్జిత సేవల భక్తులు :**

తిరుమలలో శ్రీవారి ఆర్జితసేవాటిక్కెట్లు గల భక్తులు ఏ.ఆర్.పి. కౌంటర్‌లో టికెట్లు చూపి గదులు పొందవచ్చు.

**ఇ) కరెంట్ బుకింగ్ :**

తిరుమలలోని వివిధఅతిథిగృహాలకు సంబంధించి గదులను కేటాయించే సి.ఆర్.ఓ.వద్ద నిర్ణీతరుసుము చెల్లించి రాంభగీచా, వరాహస్వామి, పద్మావతి, వేంకటేశ్వర, టి.బి.సి (ట్రావెలర్స్ బంగ్లా), హెచ్.వి.డి.సి ఇతర కాటేజీల్లోని గదులను పొందవచ్చు.

**ఇతర వివరాలకోసం సి.ఆర్.ఓ. జనరల్ కార్యాలయం : 0877- 2263572, కాల్ సెంటర్ : 0877-2233333, 2277777 నంబర్లను సంప్రదించగలరు.**

## ప్రయాగలో మనగుడి!

మహాకుంభమేళామహోత్సవంలో కోట్లాదిభక్తులకు శ్రీవేంకటేశ్వరస్వామివారిదర్శనభాగ్యాన్ని అందజేయా లని హిందూ ధర్మప్రచారంలో భాగంగా- వివిధకార్యక్రమాలను నిర్వ హించా లని తిరుమల తిరుపతి దేవస్థానం సంకల్పించింది. దీనికి అనుగుణంగా కుంభనగర్‌లో సెక్టార్ 6 లో శ్రీవారి నమూనా ఆలయాన్ని నిర్మించడం జరిగింది. తిరుపతినుంచి అర్చకవ్యవస్థకు, నిర్వహణవ్యవస్థకు, శ్రీవేంకటేశ్వరభక్తిఛానల్‌కు సంబంధించిన సుమారు 250 మంది ప్రయాగకు తరలివెళ్ళారు. శ్రీవారినమూనాఆలయం, కల్యాణమండపం, ప్రసాదవినియోగం, పుస్తకప్రదర్శనశాల, శ్రీవారిపోటు మొదలైనవి నిర్మించి, తిరుమల క్షేత్రదర్శనానుభూతిని భక్తులకు తి.తి.దే.అధికారులు కలి గించారు. కమనీయంగా, రమణీయంగా ఏర్పాటుచేసిన శ్రీవారి ఆలయం **'బాలాజీమందిర్'**గా భక్తులతో నతులు, వినతులు అందుకోవటం ముదావహమైనఅంశం.

ప్రయాగకుంభనగర్ మొత్తంమీద ఒకే ఒక్కఆలయం! అది తిరుమల శ్రీవారినమూనాఆలయం!! ఈ ఆలయంలో ప్రథమార్చనలు, కైంకర్యాలు, నిత్యసేవలు, పౌష్యపౌర్ణమినాడు (27-01-2013) ప్రారంభమయ్యాయి. ఈ కార్యక్రమానికి తిరుమలతిరుపతిదేవస్థానముల పాలకమండలిఅధ్యక్షులు శ్రీకనుమూరి బాపిరాజుగారు, తిరుమలతిరుపతిదేవస్థానముల కార్యనిర్వహణాధికారి శ్రీయుత ఎల్.వి.సుబ్రహ్మణ్యం, ఐ.ఏ.ఎస్., తి.తి.దే. సంయుక్తకార్యనిర్వహణాధికారి శ్రీ పి.వెంక ట్రామిరెడ్డి, ఐ.ఏ.ఎస్., పాల్గొన్నారు. భక్తిపూర్వకంగా, భక్తకోటికి పుణ్యప్రదాయకంగా ప్రారంభోత్సవం జరిగింది. అనంతరం విలేకరుల సమావేశంలో తి.తి.దేవస్థానం చేస్తున్నధార్మిక కార్య క్రమాలు, సామాజికకార్యక్రమాలగూర్చి కనుమూరి బాపిరాజు గారు, ఎల్.వి.సుబ్రహ్మణ్యంగారు, పి.వెంకట్రామిరెడ్డిగారు వివ రించారు. ఈ సమావేశానికి స్థానిక కుంభనగర్ అధికారులు, తి.తి.దే.అధికారులు పాల్గొన్నారు. మరుసటిరోజు కార్యనిర్వహ ణాధికారి శ్రీ ఎల్.వి.సుబ్రహ్మణ్యంగారు అలహాబాద్‌కోటను సందర్శించి, వేలసంవత్సరాలనాటిఅక్షయ వటవృక్షాన్ని దర్శించి, పూజలుచేసి, లోకకల్యాణార్థం, దేశశ్రేయస్సుకు, ఆధ్యాత్మిక

వైభవవ్యాప్తికి, విశేషంగా ప్రార్థనలు చేశారు. ఈ అక్షయవట వృక్షం సాక్షాత్తూ శివస్వరూపం. ప్రయాగక్షేత్రంలో పరమేశ్వరుడు భక్తరక్షణార్థం కల్పాంతంవరకు వటవృక్షరూపంలో నిలిచి ఉంటాడని స్థలపురాణోక్తి. విమతస్థులు దీనిని నరికి, సమూలంగా పెరికి వేసి, మళ్ళీ మొలవకుండా సీసం కరిగించి పోసినా-మళ్ళీ అంకురించి, చిగుళ్ళుతొడిగింది-ఈ వటవృక్షం!! అంతటి మహా మహిమాన్వితమైనది. ఇతరచెట్ల ఆకులవలే ఈవటవృక్షం ఆకులు పండవు. త్రేతాయుగంలో సీతాలక్ష్మణ సమేతుడై శ్రీరాముడు వటవృక్షరూపంలో ఉన్న శివుడిని అర్చిం చాడు. ఇక్కడ ఏది సంకల్పించినా యోగ్యమైన ఫలితం లభిస్తుంది.

## ఎందరో మహానుభావులు...

ప్రతిరోజూ శ్రీవారినమూనాఆలయాన్ని వేలాదిగా భక్తులు దర్శించుకొని ధన్యులైనారు. ప్రత్యేకంగా కంచికామకోటి పీఠాధిపతులు, శ్రీశ్రీశ్రీ జయేంద్రసరస్వతీస్వామీజీ, హంపీ విరూపాక్ష పీఠాధిపతులు శ్రీశ్రీశ్రీ విద్యారణ్యతీర్థస్వామిజీ, విశాఖ శారదాపీఠాధిపతులు శ్రీశ్రీశ్రీ స్వరూపానందేంద్రసరస్వతీ స్వామిజీ, శ్రీశ్రీశ్రీ కమలానందభారతీస్వామిజీ, శ్రీశ్రీశ్రీ యాబలూరిలోకనాథశర్మస్వామిజీ, ఉడిపిమఠాధిపతులు, శ్రీశ్రీశ్రీ విద్యేశ్వరతీర్థస్వామిజీ, మధ్వపీఠాధిపతులు (పాలిమర్‌శాఖ), శ్రీశ్రీశ్రీ విద్యాత్మతీర్థస్వామిజీ, శ్రీశ్రీశ్రీ త్రిదండిస్వామిమహరాజ్‌స్వామిజీ, స్వామి స్వరూపానందసరస్వతీ మహరాజ్‌జీ మొదలైన పీఠాధిపతులు, ఆధ్యాత్మికవేత్తలు, యోగీశ్వరులు, సాధుపుంగవులు శ్రీవారిని దర్శించుకొని, తి.తి.దేవస్థానం చేస్తున్న హిందూధర్మప్రచారాన్ని, సాంఘికసేవాదృక్పథాన్ని, భక్తులకు కలిగించేసౌకర్యాలను ప్రశంసించి, ఆశీస్సులు అందజేశారు. శ్రీవారినిత్యసేవలు చూచి, ఉత్తరాదిభక్తులు పరవశించిపోయారు. ప్రయాగలో బడేహనుమాన్‌మందిరంలో మొదటి స్నపనతిరుమంజనం, చిత్రకూటంలో కల్యాణమహోత్సవం, అయోధ్యలో రామఘాట్‌లో స్నపనతిరుమంజనం, నైమిశారణ్యంలో కల్యాణోత్సవం, తి.తి.దేవస్థానంవారు ప్రత్యేకంగా భక్తిశ్రద్ధలతో ఆయా ప్రాంతాలలో నివసించేభక్తుల దగ్గరకే వెళ్ళి, ఈ కార్యక్రమాలు నిర్వహించడం జరిగింది. ఈ విధానంవల్ల అక్కడ భక్తిసంచలనం, దివ్యసంతోషసాగరం ఉప్పొంగింది. 'తిరుమల శ్రీవారు తమ ముంగిళ్ళ దగ్గరకు రావటం అపూర్వం!' అని భక్తులు తిరుమల తిరుపతి దేవస్థానంవారిని అభినందించడం చూస్తుంటే- ఇంకా ఇటువంటి మహత్తరకార్యక్రమాలు చేయవలసినబాధ్యతను మనకు వేంకటాచలాధిపతి గుర్తు చేస్తున్నాడా! అనేభావన కలుగుతుంది.

## కల్యాణం.. కమనీయం....!!

ప్రయాగ కుంభనగర్‌లో గంగాసేవాశిబిర్, ద్వారకాజోషీమఠ్, ఇస్కాన్‌మందిర్, శ్రీశ్రీశ్రీ త్రిదండిస్వామిజీమహరాజ్ శిబిరం, అలహాబాద్‌కోటలో సరస్వతీకూప్ మొదలైన ప్రదేశాలలో శ్రీవారికల్యాణాలను భక్తమనోరంజకంగా, పుణ్యవివర్ధనంగా నిర్వహించారు. తి.తి.దేవస్థానంవారు చేపట్టినకార్యక్రమాలలో శిఖరాయమానమైనది వారణాసి బిర్లామందిర్‌లో జరిగిన శ్రీవారికల్యాణమహోత్సవం!! హరిహరాద్వైతానికి ప్రతీకగా, హిందూధర్మానికి అక్షరరూపంగా జరిగిన ఈ నవనవోన్మేషమైన కల్యాణంలో తి.తి.దేవస్థాన కార్యనిర్వహణాధికారి శ్రీ ఎల్.వి.సుబ్రహ్మణ్యంగారు సతీసమేతంగా పాల్గొన్నారు. తి.తి.దేవస్థానం సంయుక్తకార్యనిర్వహణాధికారి పి.వెంకట్రామిరెడ్డి, ముఖ్యభద్రతాధికారి శ్రీ అశోక్‌కుమార్‌గారు, కాశీ హిందూవిశ్వవిద్యాలయ ఉపకులపతి, అధ్యాపకులు, సిబ్బంది, భక్తులు పెద్దఎత్తున ఈ కార్యక్రమానికి వచ్చి, పుణ్యసంభరితంగా జరిగిన శ్రీవారి వైవాహికోత్సవాన్ని చూచి, తరించారు.

## అద్భుతశాంతియాగం... మహాద్భుతగంగాస్నానయోగం

ప్రయాగక్షేత్రంలో కుంభనగర్ సెక్టారు 6 లో, శ్రీవారి ఆలయప్రాంగణంలో శ్రీవైఖానసాగమశాస్త్రబద్ధంగా అద్భుత శాంతియాగం నిర్వహించారు. అనంతరం గంగానదిదగ్గరకు వెళ్ళి, శ్రీదేవీభూదేవీసమేతశ్రీవేంకటేశ్వరస్వామివార్లకు స్నపన తిరుమంజనం చేసి, అనంతరం చక్రస్నానం గావించడం జరిగింది. పావనగంగానదీజలాల్లో తి.తి.దేవస్థానం కార్యనిర్వహణాధికారి శ్రీఎల్.వి.సుబ్రహ్మణ్యంగారు సతీసమేతంగా అవభృథస్నానరూపమైన చక్రస్నానం చేసి, ప్రజలందరూ శాంతి సౌభాగ్యాలతో, సామరస్యంతో భక్తియుతంగా జీవించేశక్తిని ప్రసాదించ మని స్వామిని ప్రార్థించారు. అనంతరం శ్రీవారి నమూనాఆలయానికి వచ్చి, మహామంగళహారతి కార్యక్రమాల్లో

పాల్గొన్నారు. ప్రయాగ మహాకుంభమేళా సందర్భంగా సెకార్టు 6లో శ్రీవారినమూనా ఆలయాన్ని నిర్మించి, శ్రీవారిఏనిమిది కల్యాణాలు, మూడుస్నపనతిరుమంజనాలు, మూడుచక్రస్నానాలు నిర్వహించి, ప్రయాగలోను, చుట్టు ప్రక్కలక్షేత్రాలలోను తిరుమల వైభవాన్ని చాటిచెప్పారు– తి.తి.దేవస్థానంవారు.

## ప్రతికూలమైనా... సానుకూలమే!!

ప్రయాగలో ఎప్పటికప్పుడు వాతావరణం మారిపోతుం టుంది. పైగా శ్రీవారినమూనాఆలయప్రాంతం గంగానది మధ్యలో ఉన్నది. ప్రతికూలవాతావరణం ఉన్నప్పటికీ తి.తి.దే. అధికారులు, ఉద్యోగులు, సిబ్బంది అహర్నిశలు కృషిచేస్తూ, అంకితభావంతో తమబాధ్యతలు నిర్వహిస్తూ, మహాకుంభమేళాలో తి.తి.దే.కార్యక్రమాలను విజయవంతం చేసి, ఆ పుణ్యఫలాలు భక్తులందరికీ అందేవిధంగా తమ కైంకర్యాన్ని నిర్వర్తించారు. అర్చకస్వాములు, పరిచారకులు, ఏకాంగులు, అధ్యాపకులు, వేద పండితులు స్వామిని సేవించి, తమవిధులు నిర్వహించి, శ్రీవారి వైభవం భక్తులకు సాక్షాత్కరింపజేశారు. శ్రీయుత డాలర్ శేషాద్రి; డి.పి.పి.ప్రత్యేకాధికారి శ్రీరాం రఘునాథ్; ప్రాజెక్టు ఆఫీసర్ ఉమాపతిరెడ్డి; పౌరసంబంధాధికారి టి.రవి; సి.ఎల్.ఓ. ఎస్.వేంకటశర్మ; ఛాయాచిత్రగ్రాహకుడు పి.ఎన్.శేఖర్; ఇతర అధికారులు, అనధికారులు, 25 విభాగాలఉద్యోగులకృషివలన, తి.తి.దే.వారిమహాకుంభమేళాకార్యక్రమాలు దిగ్విజయంగా, అభినందనవందనపూర్వకంగా సంపూర్ణమయ్యాయి.

శ్రీవేంకటేశ్వరభక్తిఛానల్‌బృందంవారు నిరంతరం శ్రమిస్తూ, ఎప్పటికప్పుడు ప్రయాగవిశేషాలను, తి.తి.దే. కార్యక్రమాలను ప్రసారంచేస్తూ భక్తులందరికీ మహాకుంభమేళా ప్రాశస్త్యాన్ని, వైభవాన్ని అందజేశారు. శ్రీవేంకటేశ్వరభక్తిఛానల్ ద్వారా కుంభమేళావిశేషాలు చూచి, వేలాదిగా తెలుగువారు, ఇతరరాష్ట్రాలవారుకూడా మహాకుంభమేళాస్నానాలకోసం, ప్రయాగకు తరలిరావడం గమనించదగ్గవిషయం. త్రివేణీ సంగమంలో స్నానాలు చేసి, శ్రీవారినమూనాఆలయాన్ని దర్శించి, తీర్థప్రసాదాలు స్వీకరించి, జీవితం చరితార్థమైం దని భావించారు. తి.తి.దేవస్థానకార్యనిర్వహణాధికారి అయిన శ్రీ ఎల్.వి.సుబ్రహ్మణ్యంగారికి స్వయంగా ఫోన్‌చేసి, సందేశాలు పంపి, తమ ఆనందాన్ని, స్పందనను తెలియజేశారు. ఈ విధంగా భారతదేశంలో ఎక్కడైతే పర్వదినాలు, మహోత్సవాలు జరుగుతాయో అక్కడికి తి.తి.దేవస్థానంవారు వెళ్లి, హిందూధర్మ ప్రచారం చేస్తూ– శ్రీవేంకటేశ్వరస్వామివారితత్త్వాన్ని, మాహా త్మ్యాన్ని తెలియజేస్తే భారతదేశంలో నూతన ధార్మిక, ఆధ్యాత్మిక ఆవిష్కరణలు జరుగుతాయి. ధార్మిక ఐక్యత పరిఢవిల్లుతుంది. ఈ నేపథ్యంలో భారతావనిలో తి.తి.దేవస్థానంవారుమాత్రమే ఇటువంటి బృహత్తరమైన, స్ఫూర్తిదాయకమైన ధార్మికచైతన్యం తీసుకువస్తా రని భక్తుల ప్రగాఢవిశ్వాసం!!

## మళ్ళీ 2157లోనే...

అనితరసాధ్యమైన మహాకుంభవేళా ఉత్సవాలు 2013, మార్చి 10వ తేదీ మహాశివరాత్రిపర్వదినంరోజున సంపూర్ణ మయ్యాయి. మళ్ళీ మహాకుంభమేళా సంరంభం చూడా లంటే 144 సంవత్సరాలు ఆగవలసిందే! అంటే 2157 సంవత్సరం!! రాబోయే తరాలవారికి 2013లో జరిగిన మహాకుంభమేళా చరిత్రను, తి.తి.దేవస్థానంవారు చేసినహిందూధర్మప్రచారకార్య క్రమాలను అందించా లని తి.తి.దే. కార్యనిర్వహణాధికారి శ్రీ ఎల్.వి.సుబ్రహ్మణ్యంగారు నిర్ణయించటం శుభకరమైన అంశం!! త్వరలోనే డి.వి.డి.రూపంలో, గ్రంథరూపంలో మహా కుంభమేళాప్రశస్తి భక్తులకు అందించేందుకు కృషి జరుగు తూంది. మహాకుంభమేళాచరిత్రలో తి.తి.దేవస్థానంవారికి సముచితమైన, గౌరవమైన, ఉదాత్తమైనస్థానం ఎప్పటకీ ఉంటుంది!!

*'సదా వేంకటేశం స్మరామి స్మరామి'*

**ఈ**
**కుంభమేళా ఉత్సవానికి**
**సంబంధించిన నిశ్చలఛాయాచిత్రాలు**
**సప్తగిరి మధ్యపేజీలలో**
**రంగులలో పాఠకులకు**
**అందిస్తున్నాము!!**

# వేదం.. తెలుసుకుందాం!

ధారావాహిక 24

- డా॥ విష్ణుభట్ల గోపాలకృష్ణమూర్తి

**శాలాసూక్తం:**

ఇల్లు కేవలం బాహ్యసౌందర్యప్రదర్శకమే కాకుండ శాంతులు అందులో నివసించేవారిసుఖసౌఖ్యాలు, ఆయురారోగ్యాలు, కుటుంబజీవనం మొదలైనవి పరమోత్కృష్టంగా ఉండాలని వేదఋషులు ఆకాంక్షించారు. ఇంటిలోనివ్యక్తులు తమ తమ కర్తవ్యాలను చక్కగా నిర్వర్తించినపుడే జీవితం సుఖమయమవు తుం దని, గృహిణి కుటుంబజీవనానికి మూలాధారమని వారు భావించారు. యజమాని వాసయోగ్యమైనస్థలంలో, గృహ నిర్మాణం చేస్తూ ఈ విధంగా సత్సంతానాదిసౌభాగ్యాన్ని, గవాశ్వా దుల సమృద్ధిని కోరుతున్నాడు-

ఈ ప్రదేశంలో సుస్థిరగృహాన్ని నిర్మిస్తున్నాను. ఈ గృహం ఘృతసేచనం చేస్తూ క్షేమంగా ఉండు గాక! ఓ శాలా! అనేకమందిశూరులు, సుగుణసంపన్నులైన సంతానంతో, అరిష్ట రహితులైన పుత్రాదులతో మే మిక్కడ సంచరింతుము గాక!

**ఇహైవ ధ్రువాం ని మినోమి శాలాం ।**
**క్షేమే తిష్ఠాతిఘృతముక్షమాణా ।**
**తాం త్వా శాలే సర్వవీరాః సువీరా ।**
**అరిష్టవీరా ఉపసంచరేమ ॥ -అథర్వవేదం-3.12.1.**

ఓ శాలా! ఇక్కడే సుస్థిరంగా ఉందు. అనేకగోవులతో సంపూర్ణమై, సూనృతవతివై, ఊర్జస్వతివై, పయస్వతివై మహా సౌభాగ్యంతో వర్ధిల్లు.

**ఇహైవ ధ్రువా ప్రతితిష్ఠ శాలే ఽ -**
**శ్వావతీ గోమతీ సూనృతావతీ ।**
**ఊర్జస్వతీ ఘృతవతీ పయస్వ -**
**త్యుచ్ఛ్రయస్వ మహతే సౌభగాయ ॥ - అథర్వవేదం-3.12.2.**

అక్షయధాన్యప్రపూర్ణమైన నిన్ను మా సంతానం చేరుగాక! నీవు పుత్రపౌత్రాదులతో వర్ధిల్లుదువు గాక! సాయంకాలం ధేనువులు క్షీరధారలతో నిన్ను చేరుగాక!

**ఆత్వా వత్సో గమేదా కుమార ।**
**ఆ ధేనవః సాయమాస్యన్దమానాః ॥ - అథర్వవేదం-3.12.3.**

ఓశాలా! నీ ఉపసదనాలలో నివసించే మేము ఆర్తులము కాకుందుము గాక! నీలో నివసించే మేము సర్వపుత్ర పౌత్రాదిసమేతులమై నూరేళ్ళు జీవింతుము గాక!

**మా తే రిష న్నుపసత్తారో గృహాణాం ।**
**శాలే శతం జీవేమ శరదః సర్వవీరాః॥ - అథర్వవేదం-3.12.6.**

ఈ శాలకు తరుణుడైన కుమారుడు వచ్చుగాక!
గోవులతో పాటు దూడలు వచ్చుగాక!
అలాగే మధుపూర్ణాలైన కుంభాలు వచ్చుగాక!
దధిపూర్ణాలైన కలశాలు వచ్చుగాక!

**ఏమాం కుమార స్తరుణ ఆ వత్సో జగతా సహ ।**
**ఏమాం పరిస్రుతః కుమ్భ ఆ దధ్నః కలశైరగుః ॥**
**- అథర్వవేదం-3.12.7.**

ఓనారీ! ఉదకపూర్ణమైన ఈ కుంభాన్ని ఇంట్లోకి కొనిపో! ఇది అమృతమయమైన ఉదకంతో నిండింది. మధుఘృతాదిధారలతో నిండిన ఈ కలశం అమృతమయమైన జలంతో సమృద్ధమయ్యేటట్లు చేయి! ఈ శాలను ఇక్కడ చేసే శ్రౌత-స్మార్తకర్మలు అభిరక్షించు గాక!

**పూర్ణం నారి ప్ర భర కుమ్భమేతం ।**
**ఘృతస్య ధారా మమృతేన సంభృతామ్ ॥**
**ఇమాం పాతౄనమృతేనా సమఙ్గ్ధీ-**
**ష్టాపూర్త మభిరక్షాత్యేనామ్ ॥ - అథర్వవేదం-3.12.8.**

ఇలాంటి చక్కని దృఢమైన ఆకృతిగల ఇంటిలో, శత్రువులకు - వాదాలకు - విషాదాలకు దూరమైన ఇంటిలో, నూరేళ్ళు సుఖంగా, ప్రశాంతంగా జీవించా లని అప్పటివారు కోరుకున్నారు. ఈ సూక్తం వారిసమృద్ధిభావనను, శుభ కామనను తెలియజేస్తున్నది. దీనినిబట్టి జీవితంపట్ల వారి

మహత్త్వపూర్ణదృక్పథం, భవ్యమైన గృహవాతావరణం, సర్వ సంపత్సమృద్ధమైన వారిజీవనవిధానం గోచరమవుతున్నాయి.

పుణ్యప్రదాలైన శ్రౌత–స్మార్త–కామ్యకర్మలు చేయడానికి యజమానికి గృహం కావాలి. అందుకే గృహం లేకుండ గృహస్థుని కార్యా లేవీ సిద్ధించ వని మత్స్యపురాణ మిలా చెప్పింది– 'గృహస్థస్య క్రియా స్సర్వాః న సిద్ధ్యన్తి గృహం వినా' శుభ లక్షణాలు గల గృహం సర్వసంపదలకు నిలయమౌతుంది. అది శుభప్రదమైనది.

భూమిని వాసయోగ్యంగా తయారు చేయడమే వాస్తు. దిక్కులను, విదిక్కులను, పార్శ్వభాగాలను, పృష్ఠభాగాన్ని, వీథులను పరిశీలించి, గృహయజమాని తనకు తగిన విధంగా ఆయవ్యయాలను లెక్కించి, దానినిబట్టి గృహనిర్మాణం చేయాలి. భూమే చాలా ప్రధానమైన దని, దానికి సంబంధించిన పదార్థాలతో నిర్మించేప్రాసాదాలు మొదలైనవాటినన్నింటినీ వాస్తువు లంటా రని మయమతమిలా చెప్పింది –

**భూరేవ ముఖ్యం వస్తు స్యాత్ తత్ర జాతాని యాని హి ।**
**ప్రాసాదాదీని వస్తూని వస్తుత్వాత్ వస్తుసంశ్రయాత్ ॥**

ఈ వాస్తు గృహవాస్తు, ఆలయవాస్తు అని రెండు విధాలు. గృహానికి సంబంధించింది గృహవాస్తు. ఆలయానికి సంబంధించింది ఆలయవాస్తు. ఈ రెండూ వేరు వేరు. వీటి నియమాలుకూడా వేరు వేరుగా ఉంటాయి.

ఆలయవాస్తు మరల రెండు విధాలు. 1)విగ్రహవాస్తు. 2)విమానవాస్తు. ఆలయవాస్తులో గర్భాలయంలోని మూలమూర్తే యజమాని. ఆయ న్ననుసరించి గర్భాలయం, విమానం, దాని ఎత్తు, ముఖమండపం, ధ్వజస్తంభం, ప్రాకారం, గోపురాలు, మంటపాలు, పరివారదేవతాస్థానం, ఆయ– వ్యయాలు ఏర్పడ తాయి. ఈ విషయాలన్నింటిని విమానవాస్తు వివరిస్తుంది. విగ్రహవాస్తు విగ్రహం కొలతలను, ఆయ – వ్యయాదులను నిర్ణయిస్తుంది.

వాస్తుశాస్త్రం దేవతలకు పరమానందాన్ని కలిగిస్తుంది. 'పరమానంద జనకం దేవానా మిద మీరితమ్'. దీనివలన లోకా లన్నింటికీ పరమసుఖం, ధర్మార్థకామమోక్షా లనేచతుర్విధ పురుషార్థప్రాప్తి, స్వర్గప్రాప్తికూడా తప్పకుండా కలుగుతుం దని విశ్వకర్మవాస్తుశాస్త్ర మిలా చెప్పింది –

**శాస్త్రేణానేన సర్వస్య లోకస్య పరమం సుఖమ్ ।**
**చతుర్వర్గఫలప్రాప్తిః స్వర్లోకశ్చ భవేద్ధ్రువమ్ ॥**

## మయబ్రహ్మ – దానవశిల్పి

శిల్పశాస్త్రోపదేశకులలో విశ్వకర్మకు తరువాతిస్థానం మయునిదే. నేటి దాక్షిణాత్య శిల్పసంప్రదాయానికి భిక్షపెట్టింది మయమతమే. ప్రాజ్ఞుడైన మయమహర్షి మానవులందరికి నివాస సుఖాన్ని కలిగించే వాస్తుశాస్త్రాన్ని నిర్మించినట్లుగా మయమతం ఇలా చెబుతున్నది –

**తైతిలానాం మనుష్యాణాం వాస్త్వాదీనాం సుఖోదయః ।**
**ప్రాజ్ఞో ముని ర్మయః కర్తా సర్వేషాం వాస్తులక్షణమ్ ॥**

మయబ్రహ్మ గృహ–స్యందన–మందిరాదినిర్మాణా లను కనిపెట్టి, లోకంలో ఎక్కువగా దారుకర్మప్రచారం చేసిన మహనీయుడు. దేవాలయాదినిర్మాణాదులు, శిలావిగ్రహ నిర్మాణాలుకూడా ప్రచారం చేశాడు. అనేకగ్రంథాలు రచించాడు.

విశ్వకర్మను దేవశిల్పిగాను, మయుని దానవశిల్పిగాను అనేకగ్రంథాలు పేర్కొన్నాయి. మయుడు దానవులకు శత్రు దుర్భేద్యములైన శిల్పమర్మవిస్తృతములైన మూడుపురాలను నిర్మించి ఇచ్చాడు. వీటిని శిల్పరత్నకారుడైన శ్రీకుమారుడు ఇలా ప్రశంసించాడు –

**త్రిపుర పురత్రయ రచనా యత్కరయోః కర్మచాతురీ జాతా ।**
**శిల్పివరం తం దనుజై రర్చితచరణం మయం వందే ॥**

స్కాందపురాణం మయబ్రహ్మను విశ్వకర్మ సుత పంచకంలో ఒకనిగా పేర్కొంది. మత్స్యపురాణం ఇతనిని వాస్తు శాస్త్రాచార్యుడుగా చెప్పింది. మానసారశాస్త్రం బ్రహ్మముఖాల నుండి పుట్టిన శిల్పాచార్యులలో మయు డొక దని స్పష్టం చేసింది. మయుడు తాను దానవశిల్పియైన మహాకవి నని చెప్పినట్లు మహాభారతం ఇలా పేర్కొంది –

**అహం హి విశ్వకర్మా వై దానవానాం మహాకవిః ॥**

దీనినిబట్టి మయుడు మహాశిల్పాచార్యుడే కాకుండ మహాకవి అని కూడా తెలుస్తున్నది. మయుడు ధర్మరాజుకు మిక్కిలి అపూర్వమైన ఒక సభాభవనాన్ని (మయసభను) నిర్మించి ఇచ్చా డని, ఇంద్ర యమ వరుణాదులసభలుకూడా దానికి సాటి కా వని భారతం చెబుతున్నది. శత్రువులైనవారికి ఉన్నది లేనట్లు గాను, లేనిది ఉన్నట్లుగాను తోపింపజేసే మయసభ విశేషాలు, దానిలోనిశిల్పచిత్రాలు, మాయామహిమలు 'మయ మాయ', 'మయజయము' అనే గ్రంథాలలో శతాంశమాత్రం గానైనా సూచించబడినాయేమో నని తెలుస్తున్నది. దానవుల మాయానగర మహాద్భుత నిర్మాణవిధులను వివరించే మయ శాస్త్రాదులు నేడు లభించడం లేదుకదా!

వరాహమిహిరుడు తనబృహత్సంహితలో భవన నిర్మాణ విషయంలో మయమతాన్ని చెప్పాడు. ఇంకను 'వజ్రలేప' మనేయోగం మయుడు చెప్పినట్లు బృహత్సంహిత ఇలా పేర్కొంది –

**మయ కథితో యోగోఽయం విజ్ఞేయో వజ్రసంఘాతః ।**

షట్చక్రవర్తులలో ఒకడైన హరిశ్చంద్రునిభార్య చంద్ర మతి మయబ్రహ్మ పెంపుడు కూతు రని, ఆమెకు తనభర్తకు తప్ప ఇతరులకు కనపడని మహామహిమోపేతమైన మంగళ సూత్రాన్ని చేసి యిచ్చి, ఆమెను సాటిలేని పతివ్రతగా తీర్చిదిద్ది, మహిళాలోకానికి ఆదర్శమూర్తిగా నిలిపింది మయుడే నని 'ఉత్తర హరిశ్చంద్రీయం' అనే గ్రంథం చాటి చెబుతున్నది.

శిల్పశాస్త్రంలో చాలాభాగం మయుడే రచించాడు. ఆయన తన గ్రంథాల్లో మనువు, త్వష్ట మొదలైనవారి మతాలను కూడా అనుసరించాడు. మాయామయశిల్పానికి ఆచార్యుడైనా నిరీహుడై లోకోద్ధరణ చేసి, జనోపకారియై అనాదికాలంలో ఆద్యశిల్పప్రవర్తకులలో ఒకడై మయుడు జగత్పూజ్యుడైనాడు.

స్థాపత్యవేదం అనేకశాఖలకు చెందిన శిల్పశాస్త్ర గ్రంథాల, వాస్తుశాస్త్రగ్రంథాల సమాహారం. ప్రతివేదానికి ఉప నిషత్తు ఉన్నట్టే శిల్పవేదానికి శిల్పోపనిషత్తు ఉంది. ఈ వేదంయొక్క ప్రధానసూత్రాలు వేదోపనిషన్మంత్రాలలో నిగూఢంగా నిక్షేపించబడి ఉన్నాయి. ఇవిగాక అగ్నిపురాణంలో కొన్నిఅధ్యాయాలలోను, విష్ణుధర్మోత్తరం, మత్స్యపురాణం మొదలగువాటిలోను, శిల్పప్రశంస ఉంది.

బృహత్తరమైన శిల్పశాస్త్రాన్ని ఎందరో మహర్షులు, శిల్పాచార్యులు నిర్మించారు. అందువల్లనే స్థాపత్యవేదంలో దాదాపు నాలుగువందలకు పైగా గ్రంథసమూహం వెలసింది. ఇంకా ఎన్నో గ్రంథాలు పేర్లు కూడా దొరక్కుండా నశించాయి. వీటిలో కొన్ని ముద్రితాలు. చాలాగ్రంథాలు ప్రాచీనగ్రంథ భాండాగారాల్లో హస్తలిఖితాలై తాళపత్రాల్లోనూ, కాగితాల్లోను తపస్సు చేస్తున్నాయి. భారతీయ నాగరికతకు ప్రబల హేతువైన మన శిల్పసంస్కృతి సనాతనమేగాక సమగ్రమైనది. అది నేడు ప్రచారం లేక మరుగున పడింది.

**శిల్పోపదేశకులు:**

మత్స్యపురాణం పద్దెనిమిదిమంది శిల్పోపదేశకులను పేర్కొనింది. వారు – 1)భృగువు 2)అత్రి 3)వశిష్ఠుడు 4)విశ్వకర్మ 5)మయుడు 6)నారదుడు 7)నగ్నజిత్తు 8)విశాలాక్షుడు 9)పురందరుడు 10)బ్రహ్మ 11)కుమారుడు 12)నందీశుడు 13)శౌనకుడు 14)గర్గుడు 15)వాసుదేవుడు 16)అనిరుద్ధుడు 17)శుక్రుడు 18)బృహస్పతి.

**భృగు రత్రి ర్వశిష్ఠశ్చ విశ్వకర్మా మయ స్తథా ।**
**నారదో నగ్నజిచ్చైవ విశాలాక్షః పురందరః ।**
**బ్రహ్మా కుమారో నందీశః శౌనకో గర్గ ఏవ చ ।**
**వాసుదేవోఽనిరుద్ధశ్చ తథా శుక్ర బృహస్పతీ ॥**
**అష్టాదశైతే విఖ్యాతా శ్శిల్పశాస్త్రోపదేశకాః ॥**

**- మత్స్యపురాణం. అ.250.**

గార్గేయప్రతిష్ఠాగమం మరికొందరు శిల్పాచార్యులను పేర్కొంది. వారు 1)అగస్త్యుడు 2)కాశ్యపుడు 3)భృగువు 4)గౌతముడు 5)భార్గవుడు 6)గౌడారి 7)విశ్వకర్మ 8)బోధకుడు 9)త్వష్టృకుడు 10)మనువు 11)మయుడు 12)యవన–మాణి త్థులు 13)పరాశరుడు 14)దైవజ్ఞుడు 15)మానసారుడు 16)దీప్తి 17)అత్రి 18)మరీచికుడు 19)కౌండిన్యుడు 20)విఖనుడు.

**అగస్త్యః కాశ్యపశ్చైవ భృగు గౌతమ భార్గవాః ।**
**గౌడారి ర్విశ్వకర్మా చ బోధక స్త్వష్టృకో మనుః ।**
**మయో యవన-మాణిత్థౌ పరాశర ముని స్తథా ।**

| ధారావాహిక 29 | # మందార మకరందాలు |
|---|---|

**నన్నుఁ గన్న తండ్రి, నా పాలిదైవమ!**
**నా తపఃఫలంబ, నా కుమార,**
**నాదు చిన్న వడుగ, నా కులదీపక,**
**రాఁగదయ్య, భాగ్యరాశి వగచు.**

ఇవి వామనుణ్ణి కన్న తల్లియైన అదితి మాటలే కానక్కరలేదు. ఏ తెలుగుతల్లైనా ఇలాగే అంటుంది. ఎద చేసిన వాత్సల్యంతో, మూర్తికట్టిన మాతృత్వంతో నడిచే ఈ పద్యానికి జీవం నన్ను 'గన్న తండ్రి' అనే అచ్చతెలుగు పలుకుబడి.

కన్నకొడుకును కన్నతండ్రి అని పిలవడం తెలుగుభాషకు దక్కినవరం.

**- జ్ఞానపీఠఅవార్డు గ్రహీత, పద్మభూషణ్ డా॥ సి.నారాయణ రెడ్డి**

**దైవజ్ఞో మానసారశ్చ దీప్తి రత్రి ర్మరీచికః ।**
**కౌండిన్యో విఖనా చైవ శిల్పశాస్త్రేషు ధీమతాః ॥**

**- గార్గేయ ప్రతిష్ఠాగమం.**

సృష్టి మొదలుకొని నగర-గ్రామ-భవన-గృహారామ వాపీ-కూప-తటాకాది నిర్మాణాలు, రాజప్రాసాద-దుర్గ- చతుశ్శాలాది విధులు, దేవాలయ-దేవమంటప-నాట్యశాలా- కర్మశాలా నిర్మాణవిధానాలు, సకలదేవతామూర్తుల నిర్మాణ పద్ధతులు, వివిధ అస్త్ర-శస్త్ర-రథాదులను తయారు చేసే రీతులు, దేవ-మనుష్య విధాన భేదములతో అయో-దారు-తామ్ర-శిలా-స్వర్ణమయాలైన సకలశిల్పకల్పనలు ఈ గ్రంథజాలంలో చెప్పబడినై.

అంతేకాకుండ ఈ కాలంలో ప్రపంచంలో సర్వాశ్చర్యకరంగా భావించే 'యంత్రశిల్పం' అతిప్రాచీనకాలంలోనే భరతభూమిలో వెలసి ఉండడం గమనించదగిన ప్రధానాంశం. పలువిధాలైన గజ-తురగ-యంత్ర-నిర్మాణవిధులు, విమాన నిర్మాణపద్ధతులుగురించి చెప్పడానికి ప్రత్యేకగ్రంథాలే వెలసి ఉండడం చాలా ఆశ్చర్యం కలిగిస్తుంది. కావున, భారతీయనాగరికత ఎంతో విశిష్టమైనది.

సృష్టిశిల్పం, విశ్వశిల్పం, విశ్వసారం, ఆదిసారం, మనశ్శిల్పం, సారస్వతశిల్పం, శిల్పసాహిత్యం, చిత్రశాలం, చిత్రకుండం, చిత్రబాహుళ్యం, చిత్రకర్మశిల్పం, మనుతంత్రం, మయమాయ, మయజయం, మయమతం, మయశిల్పం మయవాస్తు, త్వష్టృతంత్రం, కళానిధి, కాష్ఠశాల, పాషాణవిచారం, రూపమండనం, రూపవిధి, ప్రతిమాలక్షణం, గాంధర్వవిద్య, మనుష్యాలయచంద్రిక, సమరాంగణ సూత్రధారం, మానసారం, విమానాధికరణం, విమానవిద్య, లోహతంత్రం, శత్రుఘ్నీయం, భరద్వాజకృతయంత్ర సర్వస్వం, గార్గేయాగమం, విశ్వకర్మ ప్రకాశం, కాశ్యపశిల్పం, విశ్వకర్మవాస్తు - విమానాదిమానము మొదలైనగ్రంథాలఆనుపూర్వినిబట్టి, వాటి పేర్లలోని అర్థ మహిమనుబట్టి చూస్తే శిల్పవాఙ్మయం యొక్క సురుచిర స్వరూపం వ్యక్తమవుతుంది.

శివుడు కాశ్యపునికి వివిధశిల్పవిద్యారహస్యాల నుపదేశించినట్లు 'కాశ్యపీయం' చెబుతున్నది. అగస్త్యమహర్షి 'శిల్పశాస్త్రాన్ని' రచించినట్లు తెలుస్తున్నది. సనత్కుమార సంహితలో సనత్కుమారుడు తనపేరుతో 'గృహవాస్తువును' చెప్పాడు. వాస్తుశిల్పవిజ్ఞానవిషయంలో పురాతనసంప్రదాయ సిద్ధమై మొదట గర్గమతం ఉదయించింది. దానినిబట్టి విశ్వకర్మమతం, మానసారమతం పుట్టాయి. వీటిలో విశ్వకర్మీయశిల్పం, భృగుసంహిత, పరశివవిశ్వకర్మాగమం, విశ్వకర్మప్రకాశిక, కాశ్యపశిల్పం, మయమతం మొదలైనవి అతిప్రాచీనశిల్పశాస్త్ర గ్రంథాలు. సమరాంగణసూత్రధారం, అపరాజితపృచ్ఛ, వాస్తు వల్లభమండనం, రూపమండనం, శిల్పరత్నం మొదలైనవి అర్వాచీనగ్రంథాలు.

***(ఇంకా ఉంది)***

# సందేహాలు? సమాధానాలు!! విద్వాన్, డా॥ పమిడికాల్వ చెంచుసుబ్బయ్య

**అ)** రంతిదేవుని చరిత్ర క్లుప్తంగా తెలియజేయప్రార్థన.

**ఆ)** చంద్రునికి తల్లిదండ్రు లున్నారా?

*-వి. బాపిరాజు, సికింద్రాబాద్.*

☛ **అ)** రంతిదేవుడు-శకుంతలా దుష్యంతుల కుమారుడైన భరతునివంశానికి చెందినరాజు. రంతిదేవునితండ్రి సంకృతి. రంతిదేవుడు మహాదాత. మహాకీర్తిశాలి. తనసంపదనంతా దీనులకు ఇచ్చి ఇచ్చి, చివరకు పేదవా డయ్యాడు. 48రోజులు అన్నమూ, నీళ్లూ లేకుండా తిరిగాడు. అయినా ధైర్యం కోల్పో లేదు. ఒకరోజు ఉదయం అతనికి ఒకచోట నెయ్యి, పాయసం, నీళ్లూ లభించాయి. కుటుంబభారం, ఆకలి, దప్పిక బాధి స్తుండగా-దొరకిన ఆహారాన్ని తినడానికి సిద్ధమయ్యాడు. ఇంతలో ఒక బ్రాహ్మణుడు వచ్చి, ఆహారం కోరాడు. రంతిదేవుడు లేదన కుండా, హరిసమర్పణంగా, సంతోషంగా అర్ధంఆహారం ఇచ్చాడు. అతడు తృప్తిగా తిని, వెళ్ళాడు. వెంటనే మరొక శూద్రుడు వచ్చి, అన్నం కోరాడు. లేదనకుండా రాజు మిగిలిన అన్నంలో సగం ఇచ్చాడు. అతడూ తృప్తిగా తిని, వెళ్లాడు. ఇంతలో కుక్కలగుంపుతో మరొకడు వచ్చాడు. అతనికి తక్కిన నాల్గవవంతు ఆహారమూ సమర్పించాడు. వెంటనే ఒక హరి జనుడు వచ్చి, 'చాలా ఆకలితో ఉన్నాను. అన్నం పెట్ట' మన్నాడు. 'కనీసం నీళ్లయినా ఇచ్చి, నా ప్రాణం నిల్ప'మన్నాడు. రంతిదేవుడు సంతోషంతో 'అయ్యా! అన్నం లేదు. కొన్నినీళ్ళు మాత్రం ఉన్నాయి. ఇతరులబాధ తీర్చుటకంటే వేరొక సుఖం ఏముంది? నాకు దిక్కు ఆ పురుషోత్తముడే!" అంటూ ఆ హరిజనునిపాత్రలో తనవద్దనున్న (త్రాగే నీళ్లు) నీళ్లుపోసినాడు. అంతే! ఇక తనకంటూ ఏమీ మిగులలేదు. రంతిదేవుని భావన "ఈ జలదానంతో ఇతనిబాధ తీర్తే చాలు" - అనేది మాత్రమే! తనపరిస్థితి భగవన్నిర్ణయం ఎలా ఉంటే అలా అవుతుం దని తలంచాడు. రంతిదేవునిదానగుణానికి బ్రహ్మాదిదేవతలందరూ సంతోషించి, తమ తమ అసలురూపాలతో అతనిముందు నిల్చారు. "నీ హృదయధైర్యాన్ని పరీక్షించేందుకే మేము ఇలా నాల్గురూపాలతో వచ్చి, నీనుండి ఆహారం, నీళ్లూ స్వీకరించాము. ఇదంతా విష్ణుమాయావిలాసం" అని వివరించారు. రంతిదేవుడు మహానందంతో ఆ దేవతలకు నమస్కరించాడు. వాళ్లను ఏమీ అర్థించలేదు. అతడు నిష్కాముడు. అతనిహృదయంలో నారా యణభక్తి ప్రకాశించింది. మాయాప్రభావాన్ని గుర్తించి, భగవద్ జ్ఞానంవల్ల మాయను దాటినవాడై పరమపదాన్ని పొందాడు. ఆ రాజర్షిని సేవించినవా ళ్లందరూకూడా అతని యోగమహిమవల్ల హరిచింతన కలవాళ్లై పరమయోగులుగా మారి, సిద్ధపదాన్ని చేరారు. నిజమే కదా! దానం, జ్ఞానం రెండూ ఉంటే ముక్తి కరతలామలకం!! మహాత్ములు తాము తరిస్తూ-తమను ఆశ్ర యించినవాళ్లనుకూడా తరింపజేస్తారు. రంతిదేవుడు అట్టి మహాత్ములలో అగ్రగణ్యుడు (ఆంధ్రభాగవతం-నవమస్కంధం.)

**ఆ)** చంద్రుడు: ఇతడు ఆత్రేయసగోత్రుడు. భాగవతం ప్రకారం చంద్రునితల్లిదండ్రులు అనసూయ, అత్రిమహర్షి, ఇతడు దక్షప్రజాపతి కుమార్తెలయిన 27మంది-అశ్విని, భరణి మున్నగు వాళ్లను వివాహమాడాడు. వీళ్లే 27 నక్షత్రాలు. అందుకే చంద్రుణ్ణి నక్షత్రేశుడు అంటారు. అత్రి-బ్రహ్మమానసపుత్రుడు. ఒక మహర్షి. భార్య అనసూయ. అత్రి సంతానంకోసం తపస్సు చేస్తుండగా బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు ముగ్గురూ ప్రత్యక్ష మయ్యారు. "నేను ఒక్కణ్ణి ప్రార్థిస్తే మీరు ముగ్గు రెందుకు వచ్చా" రని అత్రి ప్రశ్నించాడు. "మా ముగ్గురకూ భేదం లేదు. నీవు కోరినవరం ఇస్తాము. మా కళలతో నీకు పుత్రులు పుట్తారు" - అని చెప్పి, త్రిమూర్తులు వెళ్లారు. ఆ పుణ్యదంపతు లకు బ్రహ్మాంశతో చంద్రుడు, విష్ణ్వంశతో దత్తాత్రేయుడు, శివాంశతో దుర్వాసుడూ కల్గారు. కనుక అత్రి, అనసూయ - చంద్రునికి తండ్రి, తల్లి అయ్యారు.

భారతీయుల దృష్టిలో ప్రతివస్తువూ భగవచ్చైతన్యంతో ప్రకాశించేదే! వస్తువులకు భౌతికరూపం. ఆధ్యాత్మిక (దేవతా) రూపం- ఉండడం మనహృదయవైశాల్యానికి దృష్టాంతం. కనుక నవగ్రహాలనూ మనం కేవలం ఖగోళంలోని చైతన్యకాంతి గోళాలుగానే కాక-దేవతా రూపంతోనూ భావించి, పూజించడం మనప్రత్యేకత!

**ఇపుడు జరుగుచున్న 'కలియుగం' ప్రారంభమై ఎన్ని సంవత్సరా లయ్యింది? ఇంకెన్ని సంవత్సరాలు ఉన్నదీ తెలియ జేయండి?** -పెనుగొండ అనసూయ, ఏలూరు (ప.గో.జి.)

☛ ప్రస్తుతకాలమానంలో 7వ మనువు వైవస్వతుని - మన్వంతరం. ఇందులో 27 మహాయుగాలు గడిచాయి. ఇపుడు 28వ మహాయుగం గడుస్తూంది. ఇందులో కృత, త్రేత, ద్వాపరాలు గడిచిపోయి (28వ మారు) కలియుగం జరుగు తూంది. కలియుగం 4,32,000 సంవత్సరాలు. ఒకొక్కపాదానికి ఒకలక్ష, ఎనిమిదివేల సంవత్సరాలు. ఇప్పుడు ప్రథమపాదంలో 5114 సంవత్సరాలు అయ్యాయి. అంటే ఇప్పటికలియుగం ప్రారంభమై 5114 సంవత్సరా లయ్యింది. ఇంకా నాల్గులక్షల, ఇరవైఆరువేల, ఎనిమిదివందల ఎనభై ఆరుసంవత్సరాలకాలం కలియుగం ఉంటుంది. అందుకే మనం సంకల్పంలో "వైవస్వత మన్వంతరే, కలియుగే, ప్రథమపాదే" అని చెప్తున్నాము కదా!

**శ్రీకృష్ణుడు "కురుక్షేత్ర" యుద్ధాన్ని ఆపగల శక్తిసంపన్నుడే అయినా, ఆపకపోవడానికి గల విషయాలను తెలుపగలరు?**
-కుక్కదపు కాత్యాయని, తిరువూరు, కృష్ణాజిల్లా.

☛ శ్రీకృష్ణునిఅవతారం ఎందుకు జరిగిందో - ఆ మహాత్మునిమాటల్లోనే "ధర్మసంస్థాపనార్థాయ, సంభవామి యుగే యుగే"- 'అధర్మం పెచ్చు పెరిగి, ధర్మం తన విశిష్టతను కోల్పో తున్నపుడు - అందుకు కారకులైన దుష్టుల్ని నాశనం చేసి, ధర్మానికి పూర్వప్రాభవం చేకూర్చడం' కదా! మహిమలు చూపి మారేడుకాయలు కాయించడం - కృష్ణునిఉద్దేశం కాదు. అది ద్వాపరాంతం! కలి ప్రవేశించబోతున్న యుగసంధికాలం! కనుక తన దైవశక్తులతో కురుక్షేత్రయుద్ధాన్ని ఆపితే - అప్పటికి కొన్నాళ్లు వాతావరణం ప్రశాంతంగా ఉంటుంది కానీ, తర్వాత ఆయా జీవులసంస్కారాలూ, యుగప్రభావాలూ తమపని తాము చేయక పోవు. కరిచేపామును కొన్నాళ్లు బుట్టలో ఉంచినంత మాత్రాన- తర్వాత అది కరచేగుణం మానుతుందా? అధర్మవర్తనుల స్వభావమూ అంతే! ఇంతెందుకు? సొంతం కృష్ణ బంధువులు, తమ్ముళ్లే ఋషుల్ని అవమానించి, యాదవనాశంకు కారణ మయ్యారు కదా! కనుక ధర్మరక్షణకోసం భగవంతుడైన కృష్ణుడు తనదివ్యశక్తులు ఉపయోగించ నని సంస్కృతఉద్యోగపర్వంలో చెప్పి ఉన్నాడు. కర్మానుగుణమైనఫలాన్ని వారిచేత అనుభవింప జేయడమే దైవనిర్ణయం! అందుకే ఈ యుద్ధమహాయజ్ఞంలో కృష్ణుడు నిస్సంకోచంగా, నిర్ద్వంద్వంగా ప్రవర్తించాడు. ధర్మం కొరకు చేసినయుద్ధ మది!

**"అయ్యా! 'గోవిందనామస్మరణం' తిరుపతిలో నిరంతరం చేస్తారు కదా! దాని పవిత్రత, విశిష్టత తెలుసుకోవా లని ఉంది - తెలుపగలరు" -బందలుప్పి జగన్మోహనరావు, విజయనగరం.**

☛ శ్రీమహావిష్ణువుయొక్కపేర్లు అనంతాలు. అన్నీ స్మరిం చడం ఎవ్వరికీ సాధ్యం కాదు. అందుకని కొన్నింటిని మాత్రం పెద్దలు పేర్కొని-వాటి వ్యుత్పత్తులు భౌతికంగా, పారమా ర్థికంగా వివరించారు- భక్తులు తెలుసుకొని, స్మరించి, భావించి, ఆనం దించడంకోసం! అలాంటి విశిష్టనామాలలో మిక్కిలి విశిష్టనామం 'గోవింద' అనేది. 'గోవిందః'- గాం-భూమిం, ధేనుం, స్వర్గం, వేదం వా-విందతి'-'భూమినికానీ, గోవునుకానీ, స్వర్గాన్ని కానీ, వేదాన్నికానీ పొందేవాడు'-అని వ్యుత్పత్తి. ఈ వ్యుత్పత్తిలో పేర్కొన్న నాలుగూ మానవజీవితాన్ని క్రమపద్ధతిలో పవిత్రం చేసి, ఇహ- పర ఆనందాలూ, భుక్తీ-ముక్తీ రెండూ ప్రసాదించేవి. కృష్ణావ తారంలో బాలకృష్ణుడు గోవర్ధనపర్వతాన్ని ఎత్తి, గోగోపాల కుల్ని-ఇంద్రుడు కురిపించిన శిలావర్షంనుంచి రక్షించాడు. ఇంద్రుడు కృష్ణునిఅనంతబలాన్ని ప్రశంసించి- బాలకృష్ణునికి 'గోవింద' అనే పేరును పట్టాభిషేకం చేశాడు. అప్పటినుంచీ కృష్ణుడు 'గోవిందు' డయ్యాడు. కానీ, అంతకు ముందే విష్ణువుకు గోవిందు డనే పేరు - పైన పేర్కొన్న వ్యుత్పత్తి రీత్యా ఉంది. 'గో' శబ్దానికి 'యాగం' వాక్కు, చంద్రుడు, కిరణం, నేత్రం, సరస్వతి, సూర్యుడు - మొదలైన అర్థా లున్నాయి. 'గోవింద' శబ్దాన్ని ఉచ్చరించడంతో సకలపాపాలూ పరిహారమవుతాయి. సుఖశాంతులు చేకూర్తాయి. అందుకే 'రమారమణ గోవింద, అంబరీషవరద గోవింద, ప్రహ్లాదవరద గోవింద, ఆంజనేయ వరద గోవింద" అంటూ కీర్తించడం మన సంప్రదాయం. తిరు మల, తిరుపతి శ్రీనివాసునిదివ్యక్షేత్రాలు. మహామహిమకలవి కనుక అందరూ నిరంతరం 'గోవింద' నామాన్ని స్మరించడం, కీర్తించడంవల్ల ఇతోధికఫలం సిద్ధిస్తుంది. ఆదిశంకరులుకూడా 'గోవింద' నామసంకీర్తనం చేశారు. 'గోవిందమాలాదీక్ష' ఒక విశిష్టకార్యం. గోవిందుడు అందరివాడు. అందర్నీ రక్షించేవాడు, అందరిరూపాలూ తానే అయినవాడు, అందరిలో ఆనందరూపుడై ఉండేవాడు - కనుక 'గోవింద' అనగానే సాకారనిరాకారతత్త్వాలు రెండూ మనల్ని రక్షిస్తాయి.

అన్నమయ్య సంకీర్తనల్లో....

# హనుమంతుడు

సూరపరాజు వసంతకుమారి

హనుమంతుని స్మరణవల్ల బుద్ధి, బలం, యశస్సు, ధైర్యం, నిర్భయత్వం, ఆరోగ్యం, చైతన్యం, వాక్పటిమ సిద్ధిస్తాయి. తనఇష్టదైవమైన శ్రీవేంకటేశ్వరస్వామిపై ముప్పయి రెండువేలసంకీర్తనల్ని రచించాడు – అన్నమయ్య. అందులోని యాభైనాలుగు సంకీర్తనల్లో హనుమంతునిచరితను అన్నమయ్య ఇలా తెలియజేశాడు. శ్రీమహావిష్ణువు రాముడుగ అవతరిస్తే, ఆ స్వామిని సేవించుటకై శివుడు హనుమంతుడిగా అవతరించాడు.

**మరిగి రుద్రుఁడే హనుమంతుఁ డాయను (4-295)**

బంగారుకవచకుండలాలకాంతులతో, కౌపీనంతో, మహాద్భుతమైన యజ్ఞోపవీతంతో, పొడవైనవాలంతో, శంకర తుల్యమైన బలంతో, పగడపుపసిడిమేనిఛాయతో వరపుత్రుడైన ఆంజనేయుడు జన్మించాడు. పుట్టినరోజే, ఉదయాద్రిపై అరుణారుణవర్ణాలతో ఉదయిస్తున్న సూర్యబింబాన్ని చూచి, ఎర్రటిపండనుకొని తినడానికి ఆంజనేయుడు ఆకాశానికి మూడువందల ఆమడలఎత్తుకు ఎగిరాడు.

**పుట్టిననాఁడే భువనము లెరఁగఁగ**
**పట్టితి సూర్యునిఁ బండనుచు (3-421)**

సూర్యుణ్ణి మ్రింగడానికి వెళుతున్న వాయుపుత్రునిపై ఇంద్రుడు వజ్రాయుధాన్ని ప్రయోగించాడు. ఆంజనేయుని దవడపై దెబ్బ తగిలి, స్పృహతప్పి పడిపోయాడు. నాటి నుండి ఆంజనేయుడు హనుమంతు డని పిలువబడ్డాడు. కోపించిన వాయుదేవుడు గాలిని స్తంభింపజేశాడు. లోకాలు అల్లకల్లోలం కాగా, దేవతలు దిగివచ్చి, వాయుదేవుణ్ణి బుజ్జగించి, హనుమంతునికి స్పృహ రప్పించి, సకలవరాలను ఇచ్చారు. హనుమంతుడు సూర్యదేవుణ్ణి గురువుగా ఎంచుకొని, విద్యను నేర్ప మన్నాడు. సూర్యుడు, తాను ఒకచోట ఉండక నిరంతరం చరిస్తూ ఉండడంవల్ల ఆ గమనవేగానికి నీకు ఏకాగ్రత కుదురదు, విద్యను అభ్యసించడం వీలు కాదన్నాడు. హనుమ హరియొక్కత్రివిక్రమరూపంవలె తనకాయాన్ని పెంచి, తూర్పువైపున ఉన్న ఒక కొండపైన ఒకపాదము, పడమర వైపున ఉన్న మరొకకొండపైన మరొకపాదమును ఉంచి, సూర్యగమనానుగుణంగా తన తలనుమాత్రం త్రిప్పుతూ వేదాలు, సకలశాస్త్రాలు అభ్యసించి, విద్యావంతుడైనాడు.

**వుదయాచలము మీఁది నొక్క జంగ చాఁచుకొని**
**వుదుటున నపరాద్రి నొక్క జంగ చాఁచుకొని**
**తుద సూర్యమండలముతోడ మోము దిప్పుకొంటా**
**పెదవులెత్తి చదివెఁ బెద్ద హనుమంతుఁడు (4-470)**

సుగ్రీవసచివుడైన హనుమంతుడు శ్రీరామునితో సుగ్రీవునికి మైత్రి కల్పించాడు. వాలిని వధింపజేసి, సుగ్రీవుణ్ణి కపిరాజుగా చేసినరాజనీతిజ్ఞుడు – ఆంజనేయుడు.

సీతజాడ తెలుసుకొనుటకు సముద్రంపైన ఎగిరి, లంకకు పయనమయిన హనుమంతుడు – వానరులతో ఇలా అంటాడు – "వాయువేగం గల రామచంద్రమూర్తిబాణంలాగా లంకలో ప్రవేశిస్తాను. అక్కడ సీతాదేవి కనపడకపోతే అట్లే స్వర్గానికి పోతాను. అక్కడా కనిపించకపోతే రావణుణ్ణి కట్టేసి, లంకానగరాన్ని పెల్లగించుకొని తీసుకొనివస్తాను, ఏ విధంగా



నైనా సీతమ్మను పిలుచుకొని వస్తాను– పోయివస్తాను, సెలవు" అంటూ సాగరలంఘనం చేశాడు.

**వనధిలంఘన శీలవైభవుఁడు (4-483)**

సాగరాన్ని దాటేవేళ జరిగినవివిధఘట్టాలైన హను మంతుడు మైనాకునిపూజ లందుకోవడం, నాగమాత సురస ఆశీస్సులు తీసుకోవడం, సింహికను సంహరించడం, లంకిణిని చంపడం తదితరవిషయాలన్నీ అన్నమయ్య తనకీర్తనల్లో తెలి పాడు. నూరుఆమడలు గల సముద్రాన్ని గోవుపాదమంత చిన్నగుంతలాగా దాటాడు – మహాధీరుడైన పవనసుతుడు. వారధి కట్టి, తన స్వామియైన శ్రీరాముడు సముద్రాన్ని దాటితే, ఆ స్వామిభక్తుడైన అంజనీసుతుడు వారధిలేకనే ఆ సముద్రాన్ని అవలీలగా దాటాడు.

**అలరి వూరికే దాఁటె హనుమంతుఁడు (4-443)**

లంకానగరంలో సీతాన్వేషణసమయంలో రాత్రివేళ రావణునిభవనంలో ఉన్న ఎంతోమంది అందగత్తెల్ని చూడకూడని విధంగా చూడవలసినసమయంలోకూడా హనుమంతుని మనస్సులో ఏ విధమైనవికారాలు కలగకపోవడానికి కారణం అతడు జితేంద్రియుడు కావడమే. శ్రీరామునివరంతో హను మంతుడు చిరంజీవి అయ్యాడు.

**చిరజీవి యీతఁడా జితేంద్రియుఁ డితఁడా (2-223)**

సీతమ్మను కనుగొని, రాముణ్ణిగురించి తెలిపి, రామ ముద్రికయైన ఉంగరా న్నిచ్చి, తనభుజంమీద కూర్చొంటే – రామునివద్దకు సీతమ్మతల్లిని తీసుకువెళతా నన్నాడు – పవన సుతుడు. ఇంత చిన్నవాడవు, సముద్రాన్ని ఎలా దాటుతావు? అని సీతాదేవి సందేహాన్ని వెలిబుచ్చింది. హనుమంతుడు తన విశ్వరూపాన్ని చూపాడు. భూమి ఆకాశం ఒక్కటయ్యేలా ధ్రువ మండలాన్ని దాటి, బ్రహ్మాండందాకా హనుమ పెరగగా ఆకాశం లోని చుక్కలు అతని మొలకున్న పూసలుగా, సూర్యచంద్రులు మొలగుంటలుగా అమరారు.

సీతజాడ తెలుసుకొని నెమ్మదిగా తిరిగి రాక, శత్రు బలాన్ని తెలుసుకొని, తనబలాన్ని చూపా లని హనుమంతుడు సంకల్పించాడు. వనాన్ని కూల్చి "వాయుకుమారుణ్ణి, హనుమం తుడనే, పేరుగలవాణ్ణి, రాముబంటును, వేయిమందిరావణులైనా యుద్ధంలో నాతో సరిరారు. రాళ్ళతో, చెట్లతో శత్రువుల్ని కొట్టి చంపేస్తాను" అని శత్రురాజ్యంలో ఒంటరిగా గర్జించినధీశాలి హనుమంతుడు. లెక్కకు మిక్కిలిగా చుట్టిముట్టిన రాక్షసుల్ని, దేవాలయంలోని ధ్వజస్తంభాన్ని పీకి, కన్నులకు కనిపించనంత వేగంగా గిరిగిరవేయిమార్లు త్రిప్పి, ఆ వేడికి అగ్నిశిఖలు చెల రేగగా తన అరివీరభయంకరమైన ప్రతాపంతో ఆస్తంభంతోనే మోది చంపాడు. ఎందరో రాక్షసుల్ని, సేనాపతుల్నీ, మంత్రికుమా రుల్నీ రావణపుత్రుడైన అక్షకుమారుణ్ణీ చంపిన రణరంగధీరుడు– అంజనీతనయుడు.

**భీకరప్రతాపపు పెద్ద హనుమంతుఁడు (3-143)**

బ్రహ్మాస్త్రాన్ని గౌరవించడానికి పట్టుబడ్డ హనుమంతుని తోకకు నిప్పంటించి, లంకాపురివీథులలో ఊరేగించగా లంకారహస్యాలు తెలుసుకోవడానికి మిన్నకుండినమారుతి, ఆ పని పూర్తికాగానే ఒక్కసారిగా పైకెగసి, లంకకు నిప్పంటించి, ఆ నగరాన్ని దహనం చేశాడు.

**నిండు నిధానపు లంక నిమిషాన నీరుసేసె**
**మండిత మూరితి హనుమంతరాయఁడు (4-467)**

విభీషణుణ్ణి మన్నింపజేసి, మైరావణుణ్ణి వధించి, కుంభ కర్ణుని శూలాన్ని విరిచి, సంజీవిని దెచ్చి లక్ష్మణవానరవీరుల్ని కాపాడి, ఎన్నెన్నో కార్యాల్ని సాధించిన హనుమకథను తన కీర్తనల్లో అన్నమయ్య తెలిపాడు. రామరావణయుద్ధంలో హను మంతుడు తన అరచేతిని పైకి లేపి ఒక్క దెబ్బ రావణుణ్ణి కొట్టగ, ఎదురులేని వీరుడైన ఆ రాక్షసరాజు భూకంపం వచ్చినప్పుడు పర్వతం అదిరినట్లు కంపించిపోయి, కొంతసేపు మూర్ఛ పోయాడు. రావణుడు రామునిచే సంహరింపబడేలా చేసి, సీతా రాముల్ని కలిపి, వారికి అయోధ్యలో పట్టాభిషేకం చేయించాడు– హనుమంతుడు.

**అలరావణుని గెల్చి అయోధ్యాపురికి వచ్చి**
**బలురాముని సీతతోఁ బట్టము గట్టి (3-503)**

భక్తిపథంలో పయనిస్తే భక్తుడుకూడా భగవంతుడు కావచ్చునీ, రూప మేదైనా స్వామిసేవాపరాయణత్వంతో జితేంద్రి యుడై, దైవనామస్మరణతో చిరంజీవి కావచ్చునీ, నిజమైనభక్తుడు భగవంతునితో సమానంగా పూజ లందుకోవచ్చునీ సాక్షాత్తు శివుడే కపిరూపంలో ఉండే ఆంజనేయుడిగా అవతరించి, లోకాలకు తెలియజేశాడు.

# సనాతన సంప్రదాయాలు - వైజ్ఞానిక విశేషాలు

పి. విజయలక్ష్మి

భారతీయ సంస్కృతి చాలా పురాతనమయింది. మన నాగరికత, సంస్కృతి ఎంత ప్రాచీనమో ఆధునిక విజ్ఞానశాస్త్రవేత్తలు నిరూపిస్తున్న విశేషాల్నిబట్టి తెలుసుకోవచ్చు. ప్రపంచానికే మన సంస్కృతీసంప్రదాయాలు ఆదర్శవంతాలు. భౌతికంగా, ఆధ్యాత్మికంగా అన్నివిధాలా ప్రపంచానికి కనువిప్పు కల్గించిన సంస్కృతి మనది. ఈజిప్టులోని గోపురాలలో ఇప్పటికీ మనభారతీయసంస్కృతీచిహ్నాలుగల శిల్పసంపద కన్నులపండువు చేస్తూ ఉంది.

ఈమధ్య రష్యాలో ఒక ప్రాచీనశ్రీచక్రం దొరికింది. దీనిపై లిఖించబడిఉన్న సాంకేతికతాంత్రికవిద్యను విశ్లేషించి, మాస్కోవిశ్వవిద్యాలయశాస్త్రవేత్త ప్రొఫెసర్ కులాశ్వే దాన్ని ఫార్ములాతో ఎలక్ట్రానిక్ కంప్యూటర్‌లో ఉంచగా తయారైనలిపి, భారతీయతంత్రవిధానంలోని శ్రీచక్రంమాదిరే ఉంది. అతడు "భారతదేశంలో గణితవిద్య 3000 సంవత్సరాలనాడు- ఈనాటి కన్నా మిన్నగా ఉండేది. దానిప్రభావప్రచారాలు విశ్వమంతటా వ్యాప్తి చెందా"యని ప్రస్తుతించాడు.

భారతీయులఆచారాలు మూఢవిశ్వాసాలు కావు. వీటిల్లో ఆరోగ్య, వైద్య, వైజ్ఞానికపరమైన ఎన్నో మంచి ప్రభావాలున్నా యని విజ్ఞానవేత్తలు పరిశోధించి, వివరించారు. మనపూర్వులు పేర్కొన్న వైజ్ఞానికాంశాలూ, ఆచారాలూ, పర్వదినవిధివిధానాలూ మొదలగునవి అన్నీ శాస్త్రీయమైనవే! సత్యవచనులైన మనఋషులు అసత్యవిషయాలు ఎందుకు ప్రచారం చేస్తారు? అందువల్ల వాళ్లకు కలిగేప్రయోజనం ఏముంది? వాళ్లు చెప్పే వన్నీ లోకశ్రేయస్సును చేకూర్చేవే!

భారతీయసంస్కృతీసంప్రదాయాల్లోని వైజ్ఞానికవిశేషాల్ని కొన్నిఆచారాలద్వారా సంగ్రహంగా తెలుసుకొందాం!

**1. బొట్టు పెట్టుకోవడం**

హిందువుల్లో అన్నికులాలవారికీ ఒక మతచిహ్నాన్ని నొసట ధరించడం సంప్రదాయం. కనుబొమ్మలమధ్యగా కుంకుమ, విభూతి, గంధం, తిలకం మొదలైనవి పెట్టుకోవడం- అక్కడిఆజ్ఞాచక్రాన్ని పూజించడమే నని పెద్దలమాట!

ప్రపంచంలో ఏదేశాల్లో అయినా బొట్టు పెట్టుకొన్న స్త్రీ భారతస్త్రీగానే సాక్షాత్కరిస్తుంది. శుభకార్యానికి నాందీగా బొట్టుపెట్టి పిలవడం మనసంప్రదాయం. స్త్రీనుదుటిబొట్టు ఆమె ఐదువతనం కల్గి ఉం దని గుర్తించడానికి ఒకగుర్తు. మనసంప్రదాయంలో ఏమున్నా లేకున్నా బొట్టు పెట్టి సాగనంపుతారు. ఉన్నవాళ్ళూ, లేనివాళ్ళూ ధరించేది బొట్టు. బొట్టుసౌందర్యాన్ని సాక్షాత్తు లక్ష్మీదేవిగా భావించి, మనభారతీయులు గడపలకూ బొట్లు పెట్టి, అలంకరించి, అందాన్ని ఆహ్వానిస్తారు. బొట్టు స్త్రీసౌందర్యానికి చిహ్నమే కాకుండా - ఇతరులదిష్టి సోకకుండా నివారిస్తుం దనీ మనపెద్దలనమ్మకం. ఉయ్యాల్లోని పసిబిడ్డమొదలు సుమంగళీత్వం, వృద్ధాప్యంవరకూ ప్రతిస్త్రీ బొట్టు ధరిస్తూనే ఉంటుంది.

**2) కుంకుమ**

కుంకుమ ఎర్రగా ఉంటుంది. మన జీవనజ్యోతిని నడిపించేరక్తంకూడా ఎర్రగానే ఉంటుంది. ఆ రంగు సూర్యశక్తిని ప్రతిబింబిస్తుంది. సూర్యశక్తిని తనలో లీనం చేసుకొని, సూర్యుని వేడిమిని తాకనివ్వదు. కుంకుమను నుదుటే ధరిస్తాము. శాస్త్రీయంగా చూస్తే మనశరీరంలోని అన్నినాడులనూ (72 వేల నాడులను) కలుపుతూ, మెదడుకు సంకేత స్థానంగా నిలిచి, ఎప్పుడూ మేల్కొనే ఉంటూ, అత్యంతకీలకమైన 'సుషుమ్నా' నాడి కనుబొమ్మలమధ్యలో ఉంటుంది. దాన్నే మనపూర్వులు "జ్ఞాననేత్రం" అన్నారు. ఈ శక్తిమంతమయిన జ్ఞాననేత్రానికి పగవారి దృష్టి పడకుండా, సూర్యతాపం తగలకుండా - రక్తప్రసరణల ద్వారా, ఆలోచనాపరంపరలద్వారా వేడి జనించి - ఆ వేడిలో జ్ఞాననేత్రం కరిగిపోకుండా - సదా ఆ ప్రదేశాన్ని చల్లగా ఉంచడానికి - అక్కడే ఎప్పుడూ కుంకుమ ధరించాలి.

హిందూవయిన ప్రతివ్యక్తీ తమతమమతసంబంధమైన గుర్తులను ముఖాన తప్పక ధరించడం హిందూధర్మప్రత్యేకత. భగవంతుణ్ణి పూజించేటప్పుడు గంధం, అక్షతలు తప్పక




**తిరుమల యాత్రకు వచ్చే సామాన్య భక్తులకు దాదాపు అన్ని సౌకర్యాలు ఉచితంగా లభిస్తాయి. భక్తులు కాస్త సహనంతో వ్యవహరించి, ఈ సౌకర్యాలు పొందవచ్చును.**

✦ తిరుపతి బస్టాండు, రైల్వేస్టేషన్ల నుంచి అలిపిరికి (కాలినడకదారివద్దకు) భక్తులు వెళ్ళేందుకు ఉచితంగా దేవస్థానం బస్సులు ఉన్నాయి.

✦ అలిపిరినుండి యాత్రికులసామానులను తిరుమలకు ఉచితంగా చేరవేస్తారు.

✦ తిరుమలలో బసచేసేందుకు ఉచితసత్రాలు మరియు పిల్గ్రిమ్ అమెనిటీస్ కేంద్రాలు ఉన్నాయి.

✦ కల్యాణకట్టలో ఉచితంగా తలనీలాలు సమర్పించవచ్చు.

✦ స్నానానికి ఉచితంగా వేడినీళ్లు లభిస్తాయి.

✦ ఉచితంగా శ్రీవారిదర్శనానికి అనుమతిస్తారు.

✦ దర్శనానంతరం శ్రీవారిప్రసాదాలను ఉచితంగా ఇస్తారు.

✦ శ్రీవారినిత్యాన్నదానంలో ఉచితంగా భోజనం లభిస్తుంది.

✦ లాకర్లసౌకర్యం ఉచితంగా లభిస్తుంది.

✦ ఉచితంగా పాదరక్షలు భద్రపరచుకోవచ్చు.

సమర్పించే సంప్రదాయం అనాదిగా ఉంది. శివునికైతే భస్మాన్ని సమర్పిస్తారు. విభూతి, గంధం, అక్షతలు కొందరూ, నామాలు కొందరూ, గోపీచందనం, ముద్రలు, గంధాక్షతలు కొందరూ ధరిస్తారు. కొందరు శనివారం మొదలైనప్రత్యేకవారాల్లో నామాన్ని తప్పక ధరిస్తుంటారు. కొందరు కుంకుమ పెట్టారు. ఇవన్నీ వాళ్లవాళ్ల ఆచారాల్ని సూచించేవిమాత్రమే కావు. వీటిల్లో వైజ్ఞానికవిశేషా లున్నాయి.

**3)విభూతి**

విభూతి పవిత్రమైంది. లక్ష్మిని ఇస్తుంది. శోకాన్నీ, రోగాన్నీ పోగొట్టుంది. అందరినీ వశీకరిస్తుంది. పరమేశ్వరుణ్ణి స్మరిస్తూ విభూతి ధరించాలి. అన్నివస్తువులూ కాలిస్తే బూడిదగా మార్తాయి. బూడిదను ఎన్నిమార్లు కాల్చినా బూడిదే మిగుల్తుంది. కనుక నాశంలేనిదీ, మార్పు లేనిదీ బూడిద. ఇలాంటి నాశం లేనివస్తువుతో నాశం లేనివాణ్ణి సేవిస్తున్నాం. దీన్ని ధరించడం వల్ల - అన్నీ చివరకు బూడిదే అవుతా యనే వైరాగ్యస్థితిని జ్ఞాపకం చేస్తుంటుంది.

**ప్రయోజనాలు** - భస్మాన్ని ధరించడంవల్ల శరీరంలో చెమటవల్ల జనించేప్రతిక్రియలూ, ఇందువల్ల ఏర్పడేవ్యాధులూ నివారింపబడతాయి. శరీరానికి కావలసినవేడిని ఒకే విధంగా ఉండేట్లుగా చేస్తుంది. చర్మరోగాలు రాకుండా శరీరాన్ని కాపాడుతుంది.

ఆయుర్వేదం "విభూతిని ధరించడంవల్ల రక్తంలోని దోషాలు నశించి, రక్తప్రసారం, ఓజస్సూ పెంపొందుతుంది. శరీరఉష్ణోగ్రత బయటికి వెళ్ళకుండా అరికట్టి, జఠరాగ్నిని వృద్ధి చేస్తుంది. ఆయువు పెరుగుతుంది. చలిని తట్టుకొనేశక్తిని పెంచుతుంది. శాంతస్వభావాన్ని చేకూరుస్తుంది" - అనింది. హరిద్వార్, ఋషీకేశ్ మొదలైన మంచుప్రదేశాలలో కేవలం భస్మంమాత్రమే ఒంటినిండా పూసుకొని, హాయిగా చలిలో తిరిగే సాధువుల్ని ఇప్పటికీ చూడవచ్చు. విభూతి అంటే ఐశ్వర్య మనీ అర్థం!

నిర్గుణమైనశుద్ధపరమాత్మతత్త్వానికి భస్మం ప్రతీక. భస్మంలో 'కాల్షియం' గుణం అధికంగా ఉంటుంది.

**4)నామధారణ**

నామధారణవల్లనూ విభూతిధారణగుణాలే ప్రాప్తి స్తాయి. నామం ఒక విధమైనమన్నుతో చేయబడుతుంది. అలాంటి పవిత్రమైనమన్ను ధరించడంవల్ల శరీరఉష్ణాంశం సమంగా ఉంటుంది. ఎక్కువగా ఉండే ఉష్ణాన్ని పీల్చుకొం టుంది. అందువల్ల శరీరంలోపలిఅంగాలు – హృదయం, శ్వాస కోశాలూ మొదలయినవి తమకు కావాల్సినఉష్ణాంశాన్ని స్వీకరిస్తాయి.

**5)శ్రీగంధం**

ఇదికూడా శరీరఉష్ణాన్ని కాపాడుతుంది. మంచివాసన ఉండటంతో శరీరదుర్గంధాన్ని పోగొట్టుంది. పైత్యాన్ని తగ్గిస్తుంది. రక్తదోషాన్ని హరిస్తుంది. దప్పికను నియమిస్తుంది. విషక్రిముల్ని హరిస్తుంది. హృదయతాపాన్ని తగ్గిస్తుంది. చల్లదనాన్ని ఇస్తుంది. కండ్లకూ, శరీరానికీ కాంతిని చేకూరుస్తుంది. చర్మరోగాల్ని తొలగిస్తుంది. గాయాలు మాన్పుతుంది. శరీరానికి బలాన్నీ, తేజస్సునూ కల్గిస్తుంది.

**6)పసుపు**

చర్మరోగాల్ని పోగొట్టుంది. గాయాలు మాన్పుతుంది. 'బ్యాక్టీరియా' ను నాశంచేస్తుంది. రక్తాన్ని శుద్ధి చేస్తుంది. విషాన్ని హరిస్తుంది. కుష్ఠరోగాన్నికూడా పోగొట్టుంది.

ఇలా బొట్టుపెట్టుకోవడంవల్ల శరీరానికి ప్రాణశక్తి వృద్ధి అవుతుంది. జ్ఞాపకశక్తి పెరుగుతుంది. ఇతరులదృష్టిదోషాలు నశిస్తాయి. ఈనాటినాగరికఅలంకారాల్లో లభించేకృత్రిమవస్తు వులు ధరించడం అనారోగ్యకరం!

మనపూర్వులు నిర్దేశించినప్రకారం మనం ధరించే దుస్తులూ, పూజలకు ఉపయోగించేపూలూ మొదలగు వస్తు వులూ, ప్రసాదంగా స్వీకరించేవీ, తీర్థంగా స్వీకరించేవీ, యజ్ఞాల్లో సమర్పించేవీ, వ్రతాల్లో వాడేవీ–ఇలా మనజీవితంలో దేశ, కాలపరిస్థితుల్నిబట్టి – ఉపయోగించేవస్తువులూ, పాటించే ఆచారాలూ అన్నీ విజ్ఞానశాస్త్రం, వైద్యశాస్త్రం, యోగశాస్త్రం, ఆధ్యాత్మికశాస్త్రం, జ్యోతిశ్శాస్త్రం ఆధారంగా మనకు ఆరోగ్యాన్నీ, పవిత్రతనూ, ఆనందాన్నీ చేకూర్చేవేతప్ప, గ్రుడ్డినమ్మకాలు మాత్రం కావు. ఆభరణాల్లో ధరించే నవరత్నాలుకూడా ఆయా కాంతినిబట్టి – మనపై విశేషప్రభావాన్ని చూపేవే!

ప్రదక్షిణలు చేయడంలో మనం తెల్లజిల్లేడూ, రావి, జమ్మిచెట్లకు ప్రాధాన్యమిస్తాము. ఈ మూడుచెట్లూ తమస్పర్శవల్ల, వాసనవల్ల, గాలివల్ల శరీరంపైనా, లోపలా ఉండే ఎన్నో రోగాల్ని పోగొట్టి, ఆరోగ్యాన్ని ప్రసాదిస్తాయి. ఇవన్నీ నేటి విజ్ఞాన వేత్తలు పరిశీలించి, ప్రయోగాలు చేసి, నిరూపించారు. మన పూర్వులు చరిత్రకు అందనికాలంలోనే వీటివిలువలు గుర్తించి, ప్రదక్షిణయోగ్యవృక్షాలుగా వీటిల్ని నిర్దేశించారు.

**7) వేప**

ఇంటిముందు వేపచెట్టు ఉండటం మంచిది. వేపచెట్టు గాలి ఇంట్లోకి రావడంవల్ల విషక్రిములు నశిస్తాయి. చర్మరోగాలు హరిస్తాయి. స్ఫోటకం మొదలైనవ్యాధులనుండి శరీరాన్ని కాపాడుతుంది. చెమటవల్ల వచ్చేక్రిముల్ని నాశం చేస్తుంది. వేపచిగురు తినడంవల్ల రక్తం శుద్ధి చెంది, విషప్రాణులు కరిస్తే కూడా విషాన్ని ఎక్కనీకుండా చేస్తుంది. వాతావరణకాలుష్యాన్ని హరిస్తుంది. ఇలా ఎన్నో శాస్త్రీయప్రయోజనా లుండబట్టి – వేపచెట్టుగాలి ఇంట్లోకి వచ్చేట్టుగా, ఇంటిముందు ఇరువైపులా వేపచెట్లు ఉండా లన్నారు – మనపెద్దలు. "ఇంటిముందు మునగ, వెనుక వేప ఉండరా" దని అంటారు. కారణం ముందు మునగచెట్టు ఉంటే– అందరూ కాయలు కోసుకెళ్ళడమేకాక – ఆ చెట్టువేర్లల్లో, కాండంలోపలా ఉండే కొన్నిక్రిములనుండీ వచ్చేగాలి – ఇంటివారికి అనారోగ్యాన్ని కల్గిస్తుంది. వెనుక వేప ఉండటంవల్ల ఆ గాలి ఇంటివారికి రాదు. చెట్టు ఉండికూడా ప్రయోజనం లేదు. అందుకే ఈ విషయాన్ని 'వాస్తుకు' జోడించి, ఇంటివెనుక వేప ఉండరా దన్నారు.

ఇలా మనసనాతనసంప్రదాయాల్ని నిశితంగా పరి శీలిస్తే ఎన్నోవైజ్ఞానికాంశాలు గోచరిస్తుంటాయి. మనసనాతన సంప్రదాయాలు– మూఢాచారాలు కావు. ఎందరో పెద్దలు ఆచరించి, సత్ఫలాలు పొంది, తర్వాత దాన్ని ఒక సంప్ర దాయంగా ఏర్పరచారు.

**'ఆచారప్రభవో ధర్మః'**

**ఆచారంనుండి ధర్మం రూపొందింది.**

## డయల్ యువర్ ఈ.ఓ. కార్యక్రమం - 05-04-2013
## భక్తుల సమస్యలు - సూచనలు - ఈ.ఓ. గారి ప్రతిస్పందన - కార్యప్రణాళిక

*(ప్రతినెల మొదటిశుక్రవారం తిరుమల తిరుపతి దేవస్థానం కార్యనిర్వహణాధికారితో* ***'డయల్ యువర్ ఈ.ఓ.'*** *కార్యక్రమంద్వారా భక్తులు ఫోనులో మాట్లాడేఅవకాశం ఏర్పాటుచేసింది. వివిధప్రాంతాల భక్తులు కార్యనిర్వహణాధికారిగారికి చేసినసూచనలు, వివరాలు కొన్ని, ఇక్కడ పొందుపరుస్తున్నాం.)*

**గతంలో హిందూ ధర్మప్రచారం చెయ్యడానికి ధర్మరథాన్ని తి.తి.దే. వారు ఇచ్చారు. ఈ సంవత్సరంకూడా ధర్మరథాన్ని ఇస్తే మావంతుగా ధర్మప్రచారం చేస్తాము.**

*– నాగప్పస్వామి, పెద్దబళ్ళాపుర.*

**కార్యనిర్వహణాధికారి :** ఇంకొకరిని నొప్పించకుండా హిందూధర్మాన్ని ప్రతిజిల్లాలలోనూ ధర్మరథాన్ని పంపి, ప్రచారంచేయాలని అనుకొంటున్నాము. ఈ సందర్భంగా ప్రతిజిల్లానుండి ధర్మకర్తలమండలిలో సభ్యులను ఎంపిక చేసి, ఈ నెల 15వ తేదీన వారికి తిరుపతిలో శిక్షణ ఇవ్వదలిచాము. మీ వంతుగా మీరు కూడా మీ అనుభవాన్ని మరియు సహకారాన్ని వారికి ఇవ్వవచ్చు.

**ప్రతిఆలయాలలో హరికథలు ఏర్పాటు చేసినప్పుడు– ముందు గానే హరికథా కళాకారులకు కొంతశిక్షణ ఇప్పిస్తే బాగుంటుంది. ప్రతిగ్రామాలలోనూ హరికథాకార్యక్రమాలు ఏర్పాటు చెయ్యాలి. యువతకు, స్త్రీలకు మన సంప్రదాయాలు, గొప్పతనం తెలిసేటట్లు శిక్షణ ఇప్పిస్తే బాగుంటుంది. నేను టీచరుగా పనిచేస్తున్నాను. మీరు మాకు కార్యక్రమాలు ఇప్పిస్తే ఇతోధికంగా నేను సహాయపడగలవాడను.** *– సుబ్రహ్మణ్యం, సత్యవేడు.*

**కార్యనిర్వహణాధికారి :** శ్రీ బ్రహ్మానందంగారు, శ్రీ సింహాచలశాస్త్రిగార్లచే హరికథదాసులకు శిక్షణ ఇప్పిస్తున్నాం. యువతకు, స్త్రీలకు ప్రాధాన్యత ఇచ్చుటకు 'శుభప్రదం', 'సదాచారం' కార్యక్రమాలు ఏర్పాటుచేస్తున్నాం. ఉత్తరం వ్రాయండి. తప్పకుండా మీకు అవకాశం కల్పిస్తాం.

**శ్రీవారికి సేవ చెయ్యాలని ఉంది. వివరాలు తెల్పండి.**

*– శ్రీనివాసులు, పశ్చిమగోదావరి.*

**కార్యనిర్వహణాధికారి :** 'శ్రీవారిసేవ' ద్వారా సేవలు చేయవచ్చు. వివరాలకు ప్రజాసంబంధాధికారి, తి.తి.దే., తిరుపతి వారికి ఉత్తరం వ్రాయండి.

**1) శ్రీనివాసమంగాపురంలో రాత్రి 8.20 ని॥లకు ఆలయాన్ని మూస్తున్నారు. అలాకాక ఒక అర్ధగంట పెంచగలిగితే భక్తులకు ఉపయోగంగా ఉంటుంది.**

**2) శ్రీనివాసమంగాపురం ఆలయంలో ఇతర సంస్థల పుస్తక విక్రయశాలలు ఉన్నాయి. తి.తి.దే. పబ్లికేషన్ స్టాల్ ఏర్పాటు చెయ్యండి.** *– శ్రీనివాసులరెడ్డి, తిరుపతి.*

**కార్యనిర్వహణాధికారి :1)**ఈ రోజే పుష్పయాగానికి వెళుతున్నాను. ఈ విషయంగా చర్చిస్తాను. **2)** త్వరలో ఏర్పాటు చేస్తాం.

**జాపాలి క్షేత్రంలో – బాత్‌రూములు, కుప్పతొట్లు, త్రాగునీరు సౌకర్యం సూచికబోర్డులు ఏర్పాటు చెయ్యమని గతంలో కూడా కోరాను.** *– ప్రవీణ్, హైదరాబాదు.*

**కార్యనిర్వహణాధికారి:** హథీరాంజీమఠంవారి పరిధిలో ఉన్నందున కొంత ఆలస్యమవుతున్నది. ఇప్పటికే కొన్ని ఏర్పాట్లు చేశాము. మిగిలినవి తొందరలోనే పూర్తి చేస్తాము.

**1) తిరుపతి తిరుమలలో ఉచితసత్రాలు పాతవి కావడం చేత భక్తులకు ఉపయోగపడడం లేదు. మీ హయాంలో వీటిమీద కొంత దృష్టి పెట్టగలిగితే సామాన్యభక్తులకు ఉపయోగంగా ఉంటుంది.**

**2) తిరుచానూరులో ఉచిత భోజనం కొద్దిగా పెడుతున్నారు. భక్తులకు సరిపోవడం లేదు.** *– రంగబాబు, చీరాల.*

**కార్యనిర్వహణాధికారి: 1)** చూస్తాం **2)** ఏర్పాటు చేస్తాం.

**ప్రతినెల వస్తుంటాను. నాకు 80 సం॥లు. వయోవృద్ధులైన మా వయస్సు వాళ్ళకు అసౌకర్యం కలుగకుండా కావలసిన కొన్ని సదుపాయాలు చేస్తే బాగుంటుంది. (అంటే – మరుగుదొడ్లు, కేశాలు ఇచ్చేటప్పుడు, బస్సును టోల్‌గేట్ దగ్గర నిలపడం మొదలగునవి.)** *– అరుణాచం, చెన్నై.*

**కార్యనిర్వహణాధికారి:** తప్పకుండా చెయ్యడానికి ప్రయత్నిస్తాము.

**తిరుమల తిరుపతి దేవస్థానములు**
**హిందూధర్మప్రచారపరిషత్తు, తిరుపతి**

# "సనాతనధార్మికవిజ్ఞానపరీక్షలు"

**"జ్ఞానం సమ్యగవేక్షణమ్"** – జ్ఞానమే మనిషికి సత్యదృష్టిని ఏర్పరుస్తుంది. ఆర్షవిజ్ఞానం, హైందవసంస్కృతి, సనాతనసంప్రదాయాలు మానవజీవితాన్ని ఆనందమయంగా, శుభప్రదంగా తీర్చిదిద్దుతాయి.

జ్ఞానసర్వస్వ మనదగిన మనవేదవిజ్ఞానాన్ని విద్యార్థిదశలోనే బాలబాలికలకు అందించా లనేసదాశయంతో తి.తి.దేవస్థానములు, హిందూధర్మప్రచారపరిషత్తు – ఉన్నతపాఠశాలవిద్యార్థులకు **'సనాతనధార్మికవిజ్ఞానపరీక్షలు'** నిర్వహిస్తూ ఉంది.

1980–81 సంవత్సరంలో ఈ పరీక్షలనిర్వహణకు హిందూధర్మప్రచారపరిషత్తు నాంది పలికింది. ఇప్పటివరకు 30 సార్లు రాష్ట్రవ్యాప్తంగా ఈ పరీక్షలు నిర్వహింపబడినాయి. గతసంవత్సరంలో నిర్వహించిన 30వ సనాతనధార్మిక విజ్ఞానపరీక్షలకు 61256 మంది పాల్గొనడం జరిగింది. **31వ సనాతనధార్మికవిజ్ఞానపరీక్షలు 09-11-2013 శనివారం నాడు నిర్వహించబడుతాయి.** సుమారు లక్షమందివిద్యార్థినీవిద్యార్థులను పాల్గొనచేయా లని సంకల్పం!

**వివరములు**

**6, 7 తరగతులకు - ధర్మపరిచయం**
**8, 9, 10 తరగతులకు - ధర్మ ప్రవేశిక**

పై పరీక్షలకు సంబంధించిన దరఖాస్తులు ప్రతిజిల్లాలోని తి.తి.దేవస్థానకల్యాణమండపాలలోను, హిందూధర్మప్రచార పరిషత్తు కేంద్రకార్యాలయాలలోనూ, తిరుపతి ప్రధానకార్యాలయంలోనూ లభిస్తాయి. **అయిదురూపాయల నామమాత్రపు రుసుముతో** పూర్తి చేసినదరఖాస్తులు ఆయా పాఠశాలల ప్రధానోపాధ్యాయులద్వారా **17-08-2013**లోగా "**కార్యదర్శి, హిందూధర్మప్రచారపరిషత్తు, తి.తి.దే.పాతహుజూర్ ఆఫీసు, (శ్రీగోవిందరాజస్వామిఆలయంవెనుక,) తిరుపతి-517 501**" వారికి చేరవలెను.

దరఖాస్తులు చేరినవెంటనే పాఠశాలలకు పాఠ్యపుస్తకాలు ఉచితంగా పంపబడుతాయి. **పరీక్షలు 09-11-2013న నిర్వహింపబడుతాయి. విజేతలకు రాష్ట్రస్థాయిలో మూడు స్వర్ణపతకాలు, ప్రతిజిల్లా స్థాయిలో మూడురజతపతకాలు ఉంటాయి.**

కనుక, హిందూధర్మానికి, సనాతనసంప్రదాయాలకు సంబంధించిన విషయాలు పొందుపరచిన **సనాతనధార్మికవిజ్ఞాన పరీక్షలలో** పాల్గొని, విద్యార్థులు తమబంగారుభవిష్యత్తుకు బాటలు వేసుకోవా లనీ, తప్పక ఈ అవకాశాన్ని వినియోగించు కోవా లనీ, తి.తి.దే. హిందూధర్మప్రచారపరిషత్తు కోరుతూంది.

సమగ్రసమాచారంకోసం దరఖాస్తులతో పాటు కరపత్రాలూ పంపబడుతాయి.

*ఇతర వివరాలు తెలుసుకొనేందుకు :*
*ల్యాండ్‌ఫోన్ : 0877 - 2264155,*
*సెల్ : 7893982500*

హిందూధర్మప్రచారపరిషత్తు,
**తిరుపతి.**

## మీకు తెలుసా?

1) బ్రహ్మాండనాయకుని బ్రహ్మోత్సవాల్లో మొదటివాహనం పేరేమిటి?

2) తిరుమలలో ఆనందనిలయాన్ని కట్టించిందెవరు?

3) శ్రీవారిబ్రహ్మోత్సవధ్వజపటంలో ఎవ రుంటారు?

4) పదకవితాపితామహు డని ఎవరికి పేరు?

5) శ్రీవేంకటేశ్వరస్వామికి ముత్యాలహారతిని ప్రవేశపెట్టినవా రెవరు?

6) తిరుమల బ్రహ్మోత్సవాల్లో అవభృథస్నానాన్ని ఏ నక్షత్రంరోజు నిర్వహిస్తారు?

7) ఉగాది ఏ తిథినాడు వస్తుంది?

---

జవాబులు:
1) పెద్దశేషవాహనం 2)తొండమాను చక్రవర్తి 3)గరుత్మంతుడు 4)తాళ్లపాక అన్నమాచార్యులు
5)తరిగొండ వెంగమాంబ 6)శ్రవణానక్షత్రం 7)చైత్రశుద్ధ పాడ్యమి

## పిల్లలూ.. జతచేయండి!!

| | |
|---|---|
| 1) రాముడు | అ) దశరథుడు |
| 2) శ్రీకృష్ణుని పట్టమహిషులు | ఆ) అయిదుగురు |
| 3) పాండవులు | ఇ) దమయంతి |
| 4) నలుడు | ఈ) సీత |
| 5) కౌసల్య | ఉ) ఎనిమిదిమంది |

---

జవాబులు:
1-(ఈ); 2-(ఉ); 3-(ఆ); 4-(ఇ); 5-(అ)

## కదంబం

### సప్తకాండలు (వాల్మీకి రామాయణం)

1) బాలకాండ 2) అయోధ్యాకాండ
3) అరణ్యకాండ 4) కిష్కింధాకాండ
5) సుందరకాండ 6) యుద్ధకాండ
7) ఉత్తరకాండ.

### సప్తచిరంజీవులు

1) అశ్వత్థామ
2) బలిచక్రవర్తి 3) వ్యాసమహర్షి
4) హనుమంతుడు
5) విభీషణుడు 6) కృపాచార్యుడు
7) పరశురాముడు.

## ఈ పద్యం.. మీ కోసం..

**ఉ.** **ఓ కమలాప్త! యోవరద! యో ప్రతిపక్షవిపక్షదూర! కు**
**య్యో! కవియోగివంద్య! సుగుణోత్తమ! యో శరణాగతామరా**
**నోకహ! యో మునీశ్వర మనోహర! యో విమలప్రభావ! రా**
**వే! కరుణింపవే! తలఁపవే! శరణార్థిని నన్నుఁ గావవే!**

ఓ కమలాక్షుడా! ఓ వరదుడా! శత్రువులపైనకూడా వైరం లేనివాడా! నా మొర వినవా? కవులచేత, యోగులచేత నమస్కారాలు అందుకొనేవాడా! ఉత్తమగుణాలు కలవాడా! శరణు వేడినవాళ్ళకు కల్పవృక్షం వంటివాడా! మునీంద్రులకు ప్రియమైనవాడా! నిర్మలమైన మహిమ కల దేవా! రావా? కనికరింపవా? నా ప్రార్థన గూర్చి తలంపవా? శరణు కోరుతున్న నన్ను కాపాడవా!

# అన్నమయ్య సంకీర్తనలు - నీతిబోధ

షర్మిలా ప్రతిమ

## అన్నమయ్య - నీతిబోధ :

భక్తిలేనిమానవుడు పాపభీతి లేక, నీతినియమాలను ఉల్లంఘించి, పాపకార్యాలు చేస్తూ, ఉపకారికికూడా అపకారం చేస్తూ, తిన్న ఇంటివాసాలు లెక్కపెడుతూ, 'తా చెడ్డకోతి వనమెల్ల చెఱచు' అన్నట్లు సమాజాన్ని క్షోభపెడుతుంటాడు. ఇలాంటి వారినుండి సమాజాన్ని రక్షించడానికి భగవంతుడు తన అంశతో కొంతమంది మహాభక్తులను భూమిపై అవతరింపజేస్తాడు. ఆ విధంగా – సాక్షాత్తూ కలియుగదైవమైనశ్రీవేంకటేశ్వరుని ఖడ్గస్వరూపంగా, దైవాంశసంభూతుడుగా అవతరించినవారు అన్నమయ్య.

ప్రజలను భక్తి, నైతికమార్గాలవైపు నడిపించి, మానవ జన్మకు సార్థకతను కలిగిస్తూ, సామాజికప్రయోజనం చేకూర్చ డమే అన్నమయ్యసంకీర్తనల లక్ష్యం. అందుకే అన్నమయ్య అన్ని వర్గాలవారినీ జాగృతం చేయడానికి, సామాన్యజనులకోసమే పద సాహిత్యాన్ని ఎంచుకొన్నాడు.

మానవునికి బాహ్యశత్రువులవల్ల వచ్చేప్రమాదంకన్నా అంతఃశత్రువులైన కామక్రోధలోభమోహమదమాత్సర్యాలవల్ల కలిగేకీడు బలీయమైనది. అటువంటి నిగ్రహశక్తిలేనివారిని ఉద్దేశిస్తూ....

**సారమైన చదువులు సారె సారె చదివినా**
**గోరపు దుష్టునికి కోపమేల మాను**

సారవంతమైన చదువులకు ఫలితం ఇంద్రియనిగ్రహమే! దీనివల్లే మనిషి సంస్కరింపబడుతాడు. అటువంటి ఇంద్రియ నిగ్రహం లేనివారు సారమైనచదువులు ఎన్నిచదివినా తమ కోపాన్ని వదులుకోలే రని బోధించాడు.

ఇహలోకంలో బ్రతకడానికి కావలసినధనం, రూపం, విద్య, చాతుర్యం, పదవి మొదలైనవి ఎన్ని ఉన్నా క్షణికాలే! వీటివల్ల కామక్రోధలోభమోహాదులు అధికమౌతాయేకాని సుఖశాంతు లుండవు–అంటాడు.

**కులమెంత గలిగె నది కూడించు గర్వంబు**
**చలమెంత గలిగె నది జగడమే రేచు**
**ధనమెంత గలిగె నది దట్టమౌ లోభంబు**
**ఘనవిద్య గలిగినను కప్పు పై పై మదము**
**తరుణు లెందరయిన తాపములు సమకూరు**
**సిరు లెన్ని కలిగినను చింతలే పెరుగు**

కులంవల్ల గర్వం, పంతంవల్ల జగడం, ధనంవల్ల లోభం, విద్యవల్ల అహంకారం, స్త్రీసంబంధాలవల్ల తాపాలు, సంపదలవల్ల చింతలు కలుగుతాయి. దైవభక్తే నిజమైనసుఖం అంటాడు– అన్నమయ్య.

స్వభావసిద్ధంగా దుర్మార్గులైనవారిని సన్మార్గంవైపు మార్చలే మని చెప్తూ.....

**భారమైన వేపమాను పాలుపోసి పెంచినాను**
**తీరనిచేదే గాక తియ్య నుండునా**
**సాయదీసి కుక్కతోక బద్దలు వెట్టి బిగిసి**
**చాయ కెంత గట్టినాను చక్క నుండీనా**

**కాయపువికార మిది కలకాలము జెప్పినా**
**పోయిన పోకలే కాక బుద్ధి వినీనా**
**ముంచి ముంచి నీటిలోన మూల నాన బెట్టుకొన్నా**
**మించిన గొడ్డలి నేడు మెత్త నయ్యీనా (1-287)**

వేపమానుకు పాలుపోసి పెంచినా, తన సహజసిద్ధమైన చేదును వదలి, తియ్యగా మారనట్టే, స్వభావసిద్ధంగా చెడ్డవాడు మంచివాడు కాలే దనీ, కుక్కతోకకు ఎన్నిబద్దలు కట్టి బిగించినా తోక చక్కబడ దనీ, గొడ్డలి నీటిలో ఎంత నానబెట్టినా మెత్తబడ దనీ, ఎంతో ప్రేమతో తేలును తెచ్చి, చీరలో పెట్టుకున్నా కుట్ట కుండా ఉండ దనీ, అలాగే దుష్టుడు తనచెడుస్వభావాన్ని మార్చు కోలే డనీ అంటాడు.

మానవుడు ప్రత్యేకంగా జపతపాలు చేయ నవసరం లే దనీ, తనలోని దుర్గుణాలను విడిచిపెట్టడమే పుణ్యకార్యాలు చేసినంత ఫల మనీ బోధిస్తూ....

**కోపము మానితేనే కోటి జపాలు సేయుట**
**పాపము సేయకుంటే బలుతపము**

**పరకాంత నంటకుంటే బలుపుణ్యాలు సేయుట**
**సరిమోనాన నుండుటే సన్యాసము చేకొనుట**
**పలు సుఖదుఃఖముల బాసి వుండుటే మోక్షము**
**అల చంచలము మాను టది యోగము (21-241)**

కోపాలు వదిలితే కోటిజపాలు చేసినంత ఫలితం వస్తుంది. పాపపు పనులు చేయకుంటే అనేకతపస్సులు చేసినంత ఫలితం. పరస్త్రీలను తాకడంవంటిపనులు చేయకుంటే అనేక పుణ్యాలు చేసినంత ఫలితం. ఎదుటివారు గాయపడేలా దురుసుగా మాట్లాడక మౌనంగా ఉంటే అదే సన్యాసం స్వీకరించి నంత గొప్పఫలితం. సుఖదుఃఖాలను రెండింటినీ వదలుకొని, సమచిత్తంతో ఉంటే అదే మోక్షం! ఇహలోకవాంఛలపై చంచలత్వం వదులుకొంటే అదే యోగం!

అశాశ్వతమైన శరీరంకోసం ఇతరులను బాధపెట్టడం, పీడించడం సరైనది కా దనీ, పరోపకారం చేయా లనీ, శాంతము అన్నింటికంటే గొప్ప దనీ, అనేకశాస్త్రాలను శోధించి, కనుగొన్న అర్థం ఎల్లప్పుడూ శాంతబుద్ధిని కలిగివుండటమే అని తెలియజేస్తూ.....

**కంటి నిదే యర్థము మనశాస్త్రములు దవ్వి**
**నంటున నిందుకంటెను నాణె మెందూ లేదు**
**పరపీడన సేయుకంటే పాపము మరెందు లేదు**
**పరోపకారముకంటే బహుపుణ్యము లేదు**
**నిరతశాంతముకంటే నిజధర్మ మెందు లేదు (1-443)**

కాలప్రభావమో, లోకరీతివలననో ప్రజలలో మంచి తనం లేకుండా పోయింది. ధర్మం క్షీణించింది. విజ్ఞానం తొలగి పోయింది. శాంతము లేకుండాపోయింది. వివేకం తగ్గి పోయింది. విద్యలేనివారు అజ్ఞానులై ఉంటే ఆశ్చర్యపడ నవసరం లేదు. కానీ, విద్యావంతులుకూడా కేవలం ఐహికసుఖాలకే ప్రాధాన్యం ఇస్తూ, వ్యసనాలకు లోనై, దుష్టులుగా, అవినీతి పరులుగా, వంచనతోడి కార్యకలాపాలు చేయడాన్ని గుర్తించిన అన్నమయ్య నాటిచదువరుల నాస్తికభావాలకు బాధపడుతూ.... వారికి జ్ఞానబోధ చేస్తూ....

**నాటికి నాడే నా చదువు**
**మాటలాడుచును మరచేటి చదువు**
**ఎనయ నీతిని నెఱగుటకే పో**
**వెనకవారు చదివిన చదువు**
**మనసున నీతిని మరచుటకే పో**
**పనివడి యిప్పటి ప్రౌఢల చదువు**
**............................... (1-91)**

మన పూర్వులంతా భగవంతుణ్ణిగూర్చి తెలుసుకోవడా నికి చదివితే, ఇప్పటివారు భగవంతుణ్ణి మరచిపోవడానికే చదువుతున్నా రని, కృతయుగాదులలోనివారంతా భగవంతుణ్ణి గూర్చి తెలిసినవారైనా, మరలామరలా భగవంతుణ్ణి తెలుసు కోవడంకోసమే మళ్లీ చదివా రనీ, ఈనాటివారు భగవంతుడు లేడనడంకోసమే చదువుతున్నా రనీ, బ్రహ్మాదిదేవతలు మహా విష్ణువైన శ్రీవేంకటేశ్వరుణ్ణి గూర్చి తెలుసుకోవడంకోసమే చదివా రనీ, ఈనాటి విద్యావంతులు వితండవాదులై సంపద్గర్వంతో భగవంతుణ్ణి మరచిపోతున్నా రనీ అన్నమయ్య ఆవేదన చెందాడు.

మానవుడు ఇహలోకంలో నిర్భయంగా, నిర్మలంగా జీవించా లంటే ధర్మమార్గంలో బ్రతుకు కొనసాగించాలి. అధర్మ మార్గంలో పయనించి, బ్రతుకును ఆటోపం చేసుకొని, కష్టాలకు లోనుకాకుండా, ఉన్నంతలో తృప్తిపడుతూ, బ్రతుకును కొన సాగించడం సుఖప్రద మని చెప్తూ....

**అప్పలేని సంసారమైన పాటే చాలు**
**తప్పలేని జీత మొక్క తారమైన జాలు (1-114)**

కొద్దిపాటిమేలు కలిగినా సంతృప్తి మంచిది. అనేక విషయాలకు బాధపడటంకంటే ఏ లంపటం లేకుండా సుఖంగా ఉండటం మేలు. బురదలోని స్తంభంలాగా సంసారంలో బ్రతకడంకన్నా సుఖాలకు దూరంగా ఉండటం మేలు. రంపంలాంటి కోరికలకంటే భగవంతుణ్ణి చేరడానికి ప్రయత్నించే మనిషిపుట్టుకే ఉత్తమమైనది.

ఈ విధంగా అన్నమయ్య తనకాలంనాటి దేశ, కాల, రాజకీయ, సాంఘికనైతికపరిస్థితులను దృష్టిలో ఉంచుకొని, సంకీర్తనలు వ్రాసినా– అందులోనిసత్యాలు ఆ కాలంవారికే కాకుండా– ఈనాటికాలంవారికీ, రాబోయే తరతరాలవారికీ ఆమోదయోగ్యంగానూ, ఆచరణీయంగానూ, మార్గదర్శకంగానూ ఉన్నాయి.




మా ఊరు కడపజిల్లాలోని కొర్రపాటిపల్లిగ్రామం. నేను సుమారు 30 సంవత్సరాలక్రితం ఒంగోలులో స్థిరపడ్డాను. మాది ఒంగోలులో చిన్న కిరాణా వ్యాపారం. నేను భక్తుణ్ణి కాను, దేవు డంటే పెద్దగా నమ్మేవాణ్ణి కాదు. ఎక్కువగా తిరుపతి వెళ్ళేవాడిని కాను. ఒకవేళ వెళ్ళినా హుండీలో రూ.20/-కన్నా ఎక్కువ వేసేవాణ్ణి కాదు.

సుమారు పదిహేడుసంవత్సరాల క్రితం శ్రీవేంకటేశ్వరస్వామి కలలో కన్పించి, మా సొంతఊరుసమీపంలో కాల్వకట్టదగ్గర చిన్నకొండమీద గుడి కట్ట మని స్థలం చూపించాడు. కానీ, నేను వేరే పనులమీద ఎన్నిసార్లు వెళ్ళినా ఆ స్థలం చూడటానికి వీలుపడలేదు. పైగా గుడికట్టా లంటే ఏమనుకుంటారో నని, వీడు గుడి కట్టడం ఏమి టని ఎగతాలి చేస్తా రని కొన్నిరోజులు ఆలోచించినాను. తర్వాత చాలాసార్లు చెప్పినాడు. చివరకు స్వర్గస్థులైన మా నాన్నగారిచేత చెప్పించినాడు. పిల్లల చదువులు అయిపోతే కడతా నని చెప్పినాను. నాకు ఉన్న బిడియంవల్ల ఏదోఒక సాకు చెప్పి తప్పించుకుంటున్నాను. అయినా స్వామివారు నన్ను వదలిపెట్టలేదు. చివరకు నా దగ్గర డబ్బులు లేవని, ఇప్పటికే అప్పుల్లో ఉన్నా నని చెప్పినాను. అందులకు ఆయన ఒక మాట చెప్పినాడు. నీవు నాలుగురాళ్ళు (పొడవు రాళ్ళు)తీసుకొని గుడిలాగ పెట్టి, అందులో ఒక దీపం పెట్టు. తర్వాత అన్నీ నేను చూసుకుంటా నని గట్టిగా చెప్పినాడు. ఇక తప్ప దనుకొని. ఒకరోజున నేను నా స్నేహితుడితో కలిసి 2004, డిసెంబరు 26న కొండమీదికి వెళ్ళి, చూడడం జరిగింది. ఆ స్థలం మూడుఊర్లకు సరిహద్దుగా ఉంది. ఏదైనా కార్యక్రమాలకు గానీ, ప్రభుత్వం పనులకు గానీ ఇబ్బందిగా ఉంటుం దని కొన్ని అడుగులు ప్రక్కకు జరిగి, మా గ్రామంహద్దులో కట్టుటకు నిర్ణయించినాము. బహుశః కలలో కన్పించిన స్థలం అదేనేమో! మేము సరిగ్గా గుర్తించలేకపోయా మని సరిపెట్టుకున్నాను. ఒక మంచిరోజు చూచి ఆ స్థలంలో ఉన్న ముళ్ళపొదలను తొలగించి, శుభ్రం చేయ మని మా బంధువులకు చెప్పినాను. కానీ, స్వామివారు కలలో కన్పించి, నీవు పోయి టెంకాయకొట్టి పని ప్రారంభించు అని చెప్పినారు. నేను పోయి పని ప్రారంభించినాను. 2006 మే నెల ఒకటవ తేదీ ముహూర్తం కూడా ఆయనే చెప్పినాడు. అది మంచిదా? కాదా? అని సిద్ధాంతులవారిని అడిగినాను. అది సరి అయిన ముహూర్త మని చెప్పినారు. అప్పటికి వ్యవధి చాలా తక్కువగా ఉంది. అప్పటికప్పుడు శంకుస్థాపనకు బ్రాహ్మణులు దొరకడం కష్టంగా ఉంది. శంకుస్థాపన ఖర్చులకుకూడా డబ్బులు లేవు. కానీ, ఒక రోజు ముందే బ్రాహ్మణులు కుదిరారు. అప్పుగా కూడా 15 వేలు డబ్బులు వచ్చినవి. ఆ రోజే ప్రతిష్ఠకు కావలసినశిలలు. పూజాసామగ్రి బ్రాహ్మణులతో కలిసి రాత్రి బయలుదేరి తెల్లవారేసరికి మా గ్రామం చేరినాము. అందరినీ పిలవడానికి సమయం లేక సుమారు 50 మందితో శంకుస్థాపన జరిగింది.

## స్వామి దయ!!

*ఎం.తిరుపాలు, ఒంగోలు*

అప్పుడే కొత్తగా వ్యాపారం ప్రారంభించినాను. వ్యాపారంలో అయితే నేమి, బంధువులద్వారా కానీ, స్నేహితుల ద్వారా కానీ నేను ఊహించినదానికన్నా ఎన్నోరెట్లు అధికంగా డబ్బు వచ్చింది. నేను, ఒకరూము ఏర్పాటు చేసి, అందులో విగ్రహాన్ని పెట్టి, మూడులక్షలలో ముగించేద్దా మనుకున్నాను. కానీ ఇప్పుడు సుమారు యాభైలక్షలు అయి ఉంటుం దని అంచనా. అంతపెద్దగుడి కడతా మని నేనుకానీ, మా బంధువులుకానీ ఆ చుట్టుప్రక్కగ్రామాలవారు కానీ ఊహించలేదు. స్వామిదయవల్ల అన్నిపనులూ సవ్యంగా జరిగాయి. ఇంకా పదిలక్షల పని ఉంది. తి.తి.దేవస్థానంవారి ఆర్థిక సహాయంలో శిలావిగ్రహాలు, పంచలోహ విగ్రహాలుకూడా వచ్చాయి. ఈ విషయాలన్నీ చాలాసార్లు స్వామివారు నాకు చూపించినలీలలు. సప్తగిరి మాసపత్రిక ద్వారా తెలియజేద్దాం అని వ్రాస్తున్నాను. ఇదంతా ఆ వేంకటేశ్వరునిలీలే!

# అన్నమయ్య సంకీర్తనల్లో .....
# పురాణేతిహాస అంశాలు

ఇ.జి. హేమంతకుమార్

సంస్కృతవాఙ్మయంలో వైదికసారస్వతం తరువాత పురాణఇతిహాససాహిత్యానికి ప్రాముఖ్య మెక్కువ. అందువల్లే పదకవులు ప్రామాణ్యంకోసం, పరమార్థవిశదీకరణ కోసం ప్రజలలో అప్పటికే సుప్రసిద్ధమైన పురాణకథల్ని దృష్టిలో ఉంచుకొని, తమపదాలలో వాటిల్ని ప్రచారం చేశారు. అన్నమయ్య కున్నపురాణప్రీతి అంతా ఇంతా కాదు. అన్నమయ్య బ్రహ్మాండాదినానాపురాణవిజ్ఞాననిరతుడు. కనుకనే శ్రీవేంకటేశ్వర స్వామిప్రసక్తిగల పదిపురాణాలలోని కథాంశాలను పరిశీలించి, "వేంకటాచలమాహాత్మ్యం" రచించాడు.

అన్నమయ్య అనేకపురాణాలలోని శ్రీమహావిష్ణువు దశావతారాదులను శ్రీవేంకటేశ్వరునికి అన్వయించి, తనది 'పురాణ పంథా" అనడాన్ని స్పష్టం చేశాడు. ఈ పంథా మూడురకాలు. 1)వైష్ణవతత్త్వప్రతిపాదకాలు 2)కథాదుల ఉటంకింపులు 3)మాయాసిద్ధాంతప్రతిపాదకాలు.

**1) వైష్ణవతత్త్వప్రతిపాదకాలు**

ద్వైతులకు, విశిష్టాద్వైతులకు పురాణేతిహాసాలు ఆరాధ్యగ్రంథాలు. విశేషించి, శ్రీమద్రామాయణం విశిష్టాద్వైతులకు శరణాగతిశాస్త్రం. గోవిందరాజీయవ్యాఖ్యానం, భగవద్రామానుజులగూర్చి; తిరుమలనంబికథ, రామాయణరహస్యాలు తెలుసుకోవడంలాంటివి కారణాలు. 'శరణాగతి' ప్రతిపాదకమైనది- వైష్ణవమతం. అందుకు శ్రీమద్రామాయణం తొలిపట్టుగొమ్మ. తరువాత భారతాదులు. కనుకనే అన్నమయ్య -

**శరణాగతివజ్రపంజరు డితడు**

**కోరి విభీషణుడు చేకొనె రామమంత్రం**

**తలప శబరిపాలితత్వపురహస్యము**

**అలరి గుహునిపాలి ఆదిమూలము**

లాంటిరామాయణసన్నివేశాలు చెప్పాడు.

"అల ద్రౌపదికిని ఆపద్బంధుడు" లాంటివి భారత సంబంధివృత్తాంతాలు. "అని ఆన తిచ్చెకృష్ణు దర్జునునితో" అనే సంకీర్తనలోనిఅంశాలన్నీ విశ్వరూపసాక్షాత్కారానికి సంబంధించినవి.

**2) కథాదుల ఉటంకింపులు**

**అ)** అన్నమాచార్యుడు భాగవతాదిపురాణాలనుండి ధ్రువోపాఖ్యానం, అజామిళునివృత్తాంతం, నృసింహావతారగాథ, వామనావతారగాథ, గజేంద్రమోక్షణం, అమృతమథనం, అంబరీషోపాఖ్యానం, కృష్ణకథలను గ్రహించి, తన సంకీర్తనలలో పొందుపరచాడు.

**1) ధ్రువోపాఖ్యానం**

ఈ కథ విష్ణు, మత్స్యహరివంశపురాణాలలో కనబడుతుంది.

**కొనరో కొనరో మీరు కూరిమిమందు**

**ఉనికి మనికి కెల్ల ఒక్కటే మందు**

**ధ్రువుడు గొనిన మంచి - (1-237)**

ధ్రువుడు ఉత్తానపాదునికుమారుడు. సవతితల్లిచే అవమానింపబడి, మరీచ్యాదిమహర్షులచే ప్రబోధితుడై భగవంతుణ్ణి గూర్చి తప మొనరించి, మహోన్నతుడై శాశ్వతమైనపదాన్ని ధ్రువుడు పరిపాలిస్తున్నాడు. పట్టుదల, ప్రయత్నం ఉంటే ఎంత కష్టమైనకార్యాన్నైనా సాధించవచ్చు ననడానికి బాలభక్తుడైన ధ్రువుడికథ చక్కటిఉదాహరణ.

**ఆ)జడభరతుడు:** ఇతడు రాజర్షిగా ఉండి చాలాకాలం రాజ్యపాలన చేసి, వైరాగ్యంతో మోక్షసాధననిమిత్తంగా పుత్రులపై రాజ్యభారాన్ని మోపి, వనవాసానికి వెళ్తాడు. ఒకరోజు నదిలో స్నానం చేసి వస్తుండగా పూర్ణగర్భిణియైనజింక ఒకటి చెరువులోని నీరు త్రావుతూ, సింహగర్జనకు అదిరిపడి, గర్భస్థ శిశువును ప్రసవించి, అది మృతి చెందింది. జడభరతు డది చూచి, ఆ జింకపిల్లను ఆశ్రమానికి తీసుక వచ్చి, పోషిస్తూ ఉంటాడు. అడవికి పోయినా సంసారభ్రమ అతనిని విడిచిపెట్ట లేదు. ఆ జింకపై మమకారం పెంచుకొని, జపతాపాదులను మరచి, యోగచ్యుతుడై ఆ జింకనే స్మరిస్తూ శరీరాన్ని విడుస్తాడు. జడభరతు డంతటి రాజర్షికూడా అజ్ఞానవశంతో జింకయందు

మమకారాన్ని పెంచుకొన్నందున మరుజన్మలో అతడికి జింక రూపం కలుగుతుంది. ఇంత విషయాన్ని అన్నమయ్య నాలుగే గీతల్లో ఆవిష్కరించినవైనం అద్భుతం.

**అలరిన సంసారభ్రమ విడిచి**
**అడవిలోన జడభరతుడు**
**తలపుచు నొక యిఱ్ఱి పెంచినంతనే**
**తనకును నారూపు తగిలె - (2-22)**

ఇలాంటివిషయాలను తెలుసుకోవడంవల్ల సాధారణ మానవులు తమ తమజీవితాల్లో వారికి ఎదురయ్యే సమస్యలను పరిష్కరించుకోవడానికి కొంతప్రయత్నం చేస్తారు.

**3) మాయాసిద్ధాంత ప్రతిపాదకాలు**

అన్నమయ్య చెప్పదలచుకొన్నఅంశాన్ని దృష్టాంత పూర్వకంగా వివరించడానికి వేద, పురాణ, ఇతిహాస, ఉప నిషత్కథల్ని ఉపయోగించినట్లుగా అర్థమవుతుంది. ఎంతవాడైనా విధికి తలవంచవలసిందే. ఈ విషయాన్ని వివరించడానికి పురాణకథల్ని అన్నమయ్య ఎలా వినియోగించుకొన్నాడో గమనిద్దాం.

**ఎంతసేయగలేదు ఇటువంటి విధి అభవు**
**అంతవానిని భిక్ష మడుగుకొన జేసె**
**కోరిచంద్రుని బట్టి గురుతల్పవుని జేసె**
**కూడి యలరంగ నింద్రు కోడి జేసె**

ఇక్కడ అభవు డంటే శివుడు. శివుడు ఇతరులకు ఐశ్వర్య ప్రదాత. తానుమాత్రం భిక్ష మడు క్కొని జీవించినాడు. చంద్రుడు జ్ఞానహీనుడై గురుపత్నియైన 'తార'ను కూడాడు. దేవతలకు రాజైనఇంద్రుడు ఒకమాన వాంగనపొందుకోసం కోడిగా మారాడు. ఈ విషయాలన్నీ కూడా వివిధపురాణాలలోని మాయా సిద్ధాంతప్రతిపాదక కథాంశాలు.

అన్నమయ్య పురాణేతిహాససన్నివేశాలను ప్రధానంగా ఆరురకాలుగా వాడుకోవడంలోనే ప్రతిభ స్పష్టమవుతుంది.

**1) ఉత్సవకీర్తనలుగా మలచుకోవడం**

రథోత్సవం:

**అప్పడైన హరి యెక్కే నదిలో తేరు**
**ఇప్పుడు తిరువీథులనేగే తేరు**

కీర్తనలో సముద్రాలమీద తోలినతేరును జరాసంధునిపై పంపిన తేరును,రుక్మకుపై తిమగ తోలినతేరును, హంసడిభకుల మీద తోలినట్టి తేరును జతగూర్చి వర్ణించాడు.

**2) పొడుపుకథలుగా మలచుకోవడం**

**ఎవ్వడోకాని ఎరగరాదు**
**కడు దవ్వులనే వుండు తలపులో నుందు**
**ఎడయవు తన రెక్క లెగసిపోలేడు**
**కడుదాగుగాని దొంగయు గాడు**
**వడి కింద వదును సేవకుడును గాడు**
**వెడగుగోళ్ళు వెంచు విటుడును గాడు**

**3) నామావళిగా మలచుకోవడం**

**మాధవా! కేశవా! మధుసూదనా!**

4) ప్రచారసరళిలో చెప్పడం

**'వినరో భాగ్యము విష్ణుకథ'**

**'సేవించరో జనులాలా చేరి మొక్కరో"** – లాంటివి.

5) అవతారకీర్తనల్లో వరుస సన్నివేశాలు చెప్పడం

**ఇందరికి నభయంబు లిచ్చుచేయి**

**కందువగు మంచిబంగారు చేయి**

**వెలలేని వేదములు వెదకి తెచ్చిన చేయి**

**చిలుకుగుబ్బలికింద చేర్చుచేయి**

దశావతారాలలో స్వామిచేసిన వివిధకృత్యాలను అందరికీ అర్థమయ్యేరీతిలో ప్రస్తుతించడం ఒక్క అన్నమయ్యకే సాధ్యం!

6) రసపరంగా చెప్పడం

కృష్ణావతారఘట్టాలను వివరిస్తూ చేసినపాపము నుండి తప్పించుకోవడానికి భగవంతుడికికూడా సాధ్యం కా దని, ఆ పాపఫలితాన్ని తప్పక అనుభవించాల్సి ఉంటుం దనేది అన్నమయ్యవిశ్వాసం. ఈ కీర్తనలో –

**ఎట్టివారికి నెల్ల యిట్టి కర్మములు మా**

**యిట్టివారికి యింక నేది త్రోవయ్యా**

**పాము చంపినయట్టి పాతకమున పెద్ద**

**పాముమీద నీకు పవలింప వలసె**

**కోమలి చంపిన కొరతవల్ల ఒక్క**

**కోమలిని ఎద పెట్టుకొని ఉండవలసె**

**బండి విరిచినట్టి పాతకమున పెద్ద**

**బండి బోయిడవై పని చేయవలసె**

**కొండ ఎక్కిన యిట్టి గుణమున తిరుమల**

**కొండ మీద నీకు కూచొండ వలసె**

అని చమత్కారాన్ని సాధించడంతో పాటుగా కర్మానుభవ సిద్ధాంతం ఈ కీర్తనలో వ్యాఖ్యానింపబడింది.

అన్నమయ్యకాలంనాటికి తెలుగునాట పౌరాణిక గాథలకు ఎంతో గౌరవముంది. ఆలయాలలో పురాణాలు చెప్పడం, వినడం, వినిపించుకోవడం తెలుగువారిసంప్రదాయం. ఎవరైనా ఒక వ్యక్తికథలు, కథలుగా చెబుతుంటే "ఏరా పురాణాలు చెపుతున్నావు?" అనే వ్యవహారం ఉంది. వేదశాస్త్రాల తరువాత పురాణాలకే ప్రాధాన్యం. అందువల్లనే చిన్న తిరుమలయ్య సంకీర్తన లక్షణంలో 'శ్రుతులై శాస్త్రములై పురాణ కథలై" అని తనతాతగారి పదవిన్యాసాన్ని సుస్పష్టం చేశాడు.

| **శ్రీ గోవిందరాజస్వామివారి జ్యేష్ఠాభిషేకమహోత్సవం, తిరుపతి** | | | |
|---|---|---|---|
| 18-7-2013 | గురు | జ్యేష్ఠాభిషేక ప్రారంభం | ఆషాఢ మాసమున జ్యేష్ఠానక్షత్రమున |
| 19-7-2013 | శుక్ర | కవచ ప్రతిష్ఠ | జరుగును |
| 20-7-2013 | శని | కవచ సమర్పణ | |

| **శ్రీ కపిలేశ్వరస్వామివారి పవిత్రోత్సవాలు, కపిలతీర్థం, తిరుపతి** | | | |
|---|---|---|---|
| తేదీలు | వారం | పగలు ఉత్సవములు | రాత్రి ఉత్సవములు |
| 18-7-2013 | గురు | -- | అంకురార్పణ |
| 19-7-2013 | శుక్ర | పంచమూర్తులకు స్నపనతిరుమంజనం | సా॥పవిత్రమండలపూజ, హోమములు |
| 20-7-2013 | శని | గ్రంథిపవిత్రసమర్పణ, వ్రతచరి | సా॥ పవిత్ర ప్రతిష్ఠ, వ్రతచరి |
| 21-7-2013 | ఆది | పట్టుపవిత్ర సమర్పణ, పవిత్రోత్సవ సమాప్తి | పంచమూర్తుల వీథి ఉత్సవం |

# గృహస్థాశ్రమ విశిష్టత

డా॥ ఎస్. చిన్నరెడ్డయ్య

బ్రహ్మచర్యం, గృహస్థం, వానప్రస్థం, సన్న్యాసం– అనే ఈ నాల్గింటినీ చతురాశ్రమా లంటారు. ప్రతిఒక్కరూ ఈ ఆశ్రమధర్మాలను పాటించా లనీ, వాటివిధులను నిర్వర్తించా లనీ శాస్త్రాలు తెలుపుతున్నాయి. బ్రహ్మచర్యాశ్రమంలో– విద్యాభ్యాసం చేయాలి. గృహస్థాశ్రమంలో వివాహం చేసుకొని, సంతానాన్ని పొంది, భోగభాగ్యాలు అనుభవించాలి. వానప్రస్థంలో అరిషడ్వర్గాలను జయించి, అటు తర్వాత మోక్ష ప్రాప్తికై సన్న్యాసం స్వీకరించాలి. అయితే ఈ ఆశ్రమాలలో గృహస్థాశ్రమం విశిష్టమైన దని ఆర్యులు తెలిపారు.

సర్వజీవులు వాయువును ఆశ్రయించి, ఏ విధంగా ప్రాణాలు నిలుపుకుంటున్నాయో, ఆ విధంగానే అన్నిఆశ్రమాల వారూ గృహస్థాశ్రమస్థునిపై ఆధారపడిఉన్నారు. గృహస్థునికి చాలా నియమనిబంధన లున్నాయి. వాటిల్ని కచ్చితంగా పాటించినపుడే ఆ ఆశ్రమజీవితం పరిపూర్ణమౌతుంది. గృహస్థుడు తనభార్యను సురక్షితంగా ఉంచుకోవాలి. బిడ్డలకు విద్య చెప్పించాలి. స్వజనుల్ని, బంధువుల్ని పోషించాలి. భార్యకు అప్రియాలైన పనులు ఎప్పుడూ చేయరాదు. బిడ్డల్ని ప్రేమతో, ప్రియవాక్కులతో పలకరించాలి. తల్లిదండ్రులను, భార్యను, బిడ్డల్ని, సోదరుల్ని, అతిథుల్ని వదలిపెట్టి, గృహస్థుడు భుజించరాదు. అదేవిధంగా బిడ్డల్ని ఐదేళ్లవరకూ ప్రేమగా పెంచాలి. అటుతర్వాత పదిహేనేళ్లు వచ్చేవరకు కొట్టియైనాసరే శిక్షణలో ఉంచాలి. పదహారేళ్లు దాటినపుత్రుల్ని, పండ్రెండేండ్లు దాటిన పుత్రికల్ని తిట్టరాదు. వాళ్లను పరుషవాక్యాలతో బాధించరాదు. ఇరవైయేండ్లు నిండిన కుమారుల్ని గృహకృత్యాలలో నియోగించాలి. ఇది సనాతనభారతీయధర్మం చెపుతున్నమాట. దాన్ని పాటించుటం మనబాధ్యత.




**అతిథిమర్యాదలు**

గృహస్థునిధర్మాలలో ప్రధానమైనది అతిథిమర్యాద. తనఇంటికి వచ్చినవాడు ఎటువంటివాడైనా తగినరీతిగా ఆదరించాలి. కుశలప్రశ్నలతో పలకరించాలి. తమశక్త్యనుసారం వాళ్లకు మంచినీళ్లు, భోజనం ఇవ్వాలి.

**బాలో వా యదివా వృద్ధో, యువా వా గృహ మాగతః ।**
**తస్యపూజా విధాతవ్యా, సర్వస్యాఽభ్యాగతో గురుః ॥**

**(హితోపదేశం - 1.61వ శ్లోకం)**

అభ్యాగతుడు బాలుడుగానీ, వృద్ధుడుగానీ పూజనీయులే. అభ్యాగతులు గురువువలె అందరికీ ఆదరణీయులు. అతిథికి అభ్యాగతుడుగాని, అభ్యాగతునికి అతిథిగాని కీడు చేయరాదు. కాళరాత్రిలో కుంభవర్షంలో చిక్కుకొని, ఎటూపోలేక చలికి గజగజ వణుకుతూ తాము నివసిస్తున్నమర్రిచెట్టుక్రింద ఆకలితో నకనక లాడుతున్న వ్యాధునికి, ఆ చెట్టుపై నివసించేపావురాలు అతిథిమర్యాదలు చేశాయి. అతనిఆకలి తీర్చటానికై అగ్గిమంటలో పడి, ఒకపావురం ప్రాణత్యాగం చేసింది. వ్యాధుడు సహజంగా పావురాలకు బద్ధశత్రువు. అతడు వాటిల్ని చంపటానికే అడవికి వచ్చాడు. అలాంటి బద్ధవిరోధి తమ చెట్టుక్రింద ఉండడంవల్ల వాటికి అతడు అతిథి అయ్యాడు. అతనికి అతిథిమర్యాదలు చేశాయి. అందుకే మనవారు 'అతిథి దేవో భవ' అన్నారు. అతిథిసేవ మనసంస్కారానికి చిహ్నంగా భావించాలి.

**తల్లిదండ్రులసేవ**

గృహస్థుడు ఎల్లప్పుడూ తల్లిదండ్రులకు చక్కగా సేవలు చేయాలి. వాళ్లను కఠినంగా మాట్లాడరాదు, విమర్శించరాదు. వారికి ఎలాంటి మానసికశారీరకబాధలు కలిగించరాదు. వేళకు స్నానాదులు, అన్నపానాదులు అమర్చాలి.

**మాతరం పితరం చైవ । సాక్షాత్ ప్రత్యక్ష దేవతామ్ ।**

**మత్వా గృహీ నిషేవేత, సదా సర్వప్రయత్నతః ॥ (ఆర్యధర్మం)**

కుటుంబి తల్లిదండ్రులను ప్రత్యక్షదైవాలుగా భావిస్తూ, అన్ని విధాలా వాళ్లకు సేవలు చేయా లని ఆర్యధర్మం తెలుపు తున్నది. పుత్రుడు ఎల్లప్పుడూ తల్లిదండ్రులతో తియ్యనిమాటలే మాట్లాడా లని శాస్త్రాలు తెలుపుతున్నాయి. అతిథి, పిల్లలు, భార్య, తల్లి, తండ్రి అనెడి ఈ ఐదుగురిని గృహస్థుడు తప్పక పోషించ వలె నని పంచతంత్రం తెలుపుతున్నది.

**యం మాతాపితరౌ క్లేశం, సహేతే సంభవే నృణామ్ ।**

**న తస్య నిష్కృతిః శక్యా కర్తుం వర్షశతైరపి ॥**

**(మనుధర్మశాస్త్రం - 2-227వ శ్లోకం)**

శిశివు జన్మించినపుడు తల్లిదండ్రులు సహించేశ్రమకు ప్రతిఫలం ఏమి ఇచ్చినా తీర్చలేరు. నూరేండ్లు తల్లిదండ్రులకు సేవచేసినా ఆ ఋణం తీరదు అంటుంది- మనుధర్మశాస్త్రం.

**తప్పనిసరిగా....**

# భారతీయ సంప్రదాయ వస్త్రాలు

**తిరుమల శ్రీవారిదర్శనానికి వచ్చే భక్తులు తప్పని సరిగా సంప్రదాయ దుస్తులు ధరించాలనే నిబంధనను తి.తి.దే. 15-05-2013 నుండి ప్రవేశపెట్టింది. ఇందులో భాగంగా విరామదర్శనం (వి.ఐ.పి. దర్శనం) టిక్కెట్లపై ఆలయానికి వచ్చే భక్తులు సంప్రదాయ వస్త్రధారణతో రావాల్సి ఉంటుంది.**

**ఇప్పటికే స్వామివారి ఆర్జితసేవలకు హాజరయ్యే భక్తులు సంప్రదాయదుస్తులు ధరించి హాజరవు తున్నారు. ఈ సంప్రదాయాన్ని విరామదర్శనసమయం లోనూ అమలు చేశారు.**

**పురుషులు- ధోవతి, ఉత్తరీయం, కుర్త-పైజామా,**

**మహిళలు- చీర-రవిక, లంగా-ఓణి,**
**చున్నీతో పాటు పంజాబీడ్రస్,**
**చుడీదార్ ధరించాల్సి ఉంటుంది.**

అదేవిధంగా అగ్నిహోత్రం, స్వగృహం, పుణ్యక్షేత్రం, గర్భిణీస్త్రీ, ముసలివారు, బాలురు, రాజు, దైవం, గురువు-వీరివద్దకు వెళ్లేటప్పుడు వట్టిచేతులతో పోరాదు. ఏదోఒక పండైనా, పూవైనా తీసికొనిపోయి, సమర్పించా లనేది - పెద్దలవాక్కు! దీన్ని ప్రతి గృహస్థుడూ పాటించాలి. ఇంటికి అతిథిగా వచ్చినవాడు శత్రువైనా ఆతిథ్య మివ్వా లంటుంది- హితోపదేశం. నరకడానికై దగ్గరచేరినవానినుంచి చెట్టు తమనీడను ఉపసంహరించదు కదా! అంటూ చక్కనిఉపమానం చెప్పారు. గృహస్థుడు మంచి లక్షణాలు కలిగి నడచుకొంటే భార్య, పిల్లలు, సోదరులు అందరూ అతణ్ణి అనుసరిస్తారు. అటువంటి గృహస్థు డుండే ఇల్లు ఉత్తమసమాజానికి కల్పవల్లిగా నిలుస్తుంది. గృహ స్థాశ్రమంలో అవలక్షణాలు చోటుచేసుకొంటే వాటిప్రభావం తక్కిన ఆశ్రమాలపైకూడా పడుతుంది. అలాంటివాటికి గృహ స్థుడు అవకాశ మివ్వరాదు. గృహస్థాశ్రమవైశిష్ట్యాన్ని మహాకవి అల్లసానిపెద్దన మనుచరిత్రలో ఇలా తెలిపాడు.

**సీ. కెలకుల నున్న తంగేటి జున్ను గృహమేధి**
**యజమానుఁ డంకస్థితార్థపేటి**
**పండినపెరటికల్పకము వాస్తవ్యుండు**
**దొడ్డిఁబెట్టిన వేల్పుగిడ్డి కాఁపు**
**కడలేని యమృతంపునడబావి సంసారి**
**సవిధమేరునగంబు భవనభర్త**
**మరుదేశపథమధ్యమప్రపకులపతి**
**యాఁకటి కొదవు సస్యము కుటుంబి**

**తే. బధిర పంగ్వంధ భిక్షుక బ్రహ్మచారి**
**జటి పరివ్రాజ కాతిథి క్షపణ కావ**
**ధూత కాపాలికాద్యనాథులకుఁ గాన**
**భూసురోత్తమ! గార్హస్థ్యమునకు సరియె? (1-66)**

సిద్ధుడు గృహస్థాశ్రమంలోని గొప్పతనాన్ని ప్రవరునికి సోదాహరణంగా వివరించాడు. ఆ మాటలు విన్నాక ప్రవరునిలో ఆత్మాభిమానం పెరిగింది. తక్కినఆశ్రమాలకు గృహస్థాశ్రమం వారధివంటిది. వారధిలేనిదే అవతలిగట్టుకు చేరలేనట్లు గృహ స్థాశ్రమజీవితాన్ని అనుభవించినపుడే వానప్రస్థ, సన్న్యాసా శ్రమాలు ఫలవంతమైన ప్రయోజనాన్ని చేకూరుస్తాయి.

# రాశిఫలాలు

## జూలై, 2013

జె. చంద్రశేఖరశర్మ



### మేషం

ఈ మాసంలో ఎక్కువ ధనాదాయంకలిగే సూచన లున్నవి. వృత్తివ్యాపారాల్లో రాణిస్తారు. సంతానం అభివృద్ధికై చేసే ప్రయత్నాలు అనుకూలిస్తాయి. ఉన్నతవిద్యాఅవకాశాలకోసం చేసే ప్రయత్నాలు ఫలిస్తాయి. విదేశీప్రయాణాలకోసం చేసే ప్రయత్నాలలో విజయం సాధిస్తారు. పెండింగ్‌లో ఉన్న కోర్టు వ్యవహారాలలో విజయం సాధిస్తారు. తొలిఏకాదశిసందర్భంగా ఆలయాలు సందర్శించడం మంచిది. మొదటివారం ధనాదాయం, రెండోవారం శుభవార్తాశ్రవణం, మూడోవారం క్షేత్రదర్శనం, నాలుగోవారం ఆనందం.



### వృషభం

ఈ మాసంలో ఈ రాశివారికి అన్నీ అనుకూలంగా జరుగుతాయి. నిదానమే ప్రదానం అనే సూక్తి ఈ రాశివారికి బాగా పనిచేస్తుంది. చేసే వృతివ్యాపారాలలో ఆశించినఫలితాలు చేకూరుతాయి. విద్యార్థులు ఉన్నత విద్యాభాస్యానికి ధనం ఖర్చు చేయవలసివస్తుంది. ఉద్యోగులకు స్థానచలనం, స్వగృహప్రాప్తి కలుగుతుంది. ఇంట్లో జరిగే శుభకార్యం మానసికఆనందాన్ని కలుగజేస్తుంది. మొదటివారం ఆనందం, రెండోవారం స్థానచలనం, మూడోవారం కార్యజయం, నాలుగోవారం వృథాఖర్చు.



### మిథునం

ఈ మాసంలో ఈ రాశివారికి అనారోగ్యసమస్యలు శస్త్రచికిత్సలకు దారితీసే అవకాశా లున్నాయి. ఆరోగ్యంపట్ల ప్రత్యేకశ్రద్ధ తీసుకోవడం మేలు. మహిళలు ఉన్నతవిద్యను అభ్యసించడానికి చేసేప్రయత్నాలు అనుకూలిస్తాయి. చేసేవృత్తి వ్యాపారాల్లో నరదృష్టిదోషంవల్ల ధననష్టం ఏర్పడుతుంది. చెప్పుడు మాటలవల్ల బంధుమిత్రులలో మనస్పర్థలు ఏర్పడి, మానసికంగా, శారీరకంగా, ఇబ్బందులు కలుగుతాయి. నవగ్రహపూజలు మేలు చేస్తాయి. మొదటివారం ఆందోళన, రెండోవారం వివాదాలు, మూడోవారం ధార్మికచింతన, నాలుగోవారం స్వల్పధనాదాయం.



### కర్కాటకం

ఈ రాశివారు ఈ మాసంలో అన్నిరంగాలలో విజయం సాధిస్తారు. మహిళలకు ఉన్నతపదవీప్రాప్తి. కోపాన్ని అదుపులో ఉంచుకోవడంవల్ల మేలు జరుగుతుంది. సుదూరప్రాంతాలకు వెళ్ళటంవల్ల ధననష్టం, శారీరకశ్రమ ఏర్పడుతుంది. ఆకస్మిక ప్రమాదాలు జరిగేసూచన లున్నాయి. చాతుర్మాస్యవ్రతం చేపట్టడం, గ్రామదేవతలను ఆరాధించడంవల్ల వంశాభివృద్ధి కలుగుతుంది. మొదటివారం ప్రమాదాలు, రెండోవారం దైవారాధన, మూడోవారం స్వల్పధననష్టం, నాలుగోవారం మానసిక వేదన.



### సింహం

ఈ రాశివారికి ఈ మాసంలో నేత్రసంబంధమైన వ్యాధులు, శత్రుబాధ, ఋణబాధలు అధికంగా ఉంటాయి. ప్రతి విషయానికి దీర్ఘాలోచన- పెద్దల సలహాలతో పూర్తిచేయడంవల్ల మేలు కలుగుతుంది. నిరుద్యోగులకు ఉద్యోగం, అవివాహితులకు వివాహప్రయత్నాలు అనుకూలిస్తాయి. కేంద్రరాష్ట్రకార్పొరేషన్ సంస్థలలో పనిచేసేఉద్యోగులకు స్థానచలనం మానసిక ఆందోళనకు గురిచేస్తుంది. పిల్లల చదువులకై ఋణప్రయత్నాలు చేయవలసివస్తుంది. మొదటివారం అనారోగ్యం, రెండోవారం శుభవార్తాశ్రవణం, మూడోవారం స్థానచలనం, నాలుగోవారం మనోవేదన.



### కన్యారాశి

ఈమాసంలో ఈ రాశివారికి ఆనందం, మానసిక ప్రశాంతతలు కలుగుతాయి. గతంలో పెండింగ్‌లో ఉన్న విద్యా ఉద్యోగకోర్టు వ్యవహారాల్లో విజయం సాధిస్తారు. సోదరీసోదరుల మధ్య నెలకొన్నవివాదాలు పరిష్కార మవుతాయి. బంధు

మిత్రులు మీ మాటను గౌరవిస్తారు. శనిగ్రహదోషంవల్ల స్వల్ప అనారోగ్యం ఏర్పడుతుంది. శనివారం శనిగ్రహదోషనివారణ కోసం నల్లని నువ్వులను దానంచేయడం మేలు. మొదటివారం సంతోషం, రెండోవారం కార్యజయం, మూడోవారం దైవచింతన, నాలుగోవారం బంధుమిత్రులకలయిక.



## తుల

ఈ మాసంలో ఈ రాశివారికి దీర్ఘాలోచనలవల్ల చేసే వృత్తివ్యాపారాలలో కష్టనష్టాలు ఏర్పడుతాయి. గతంలో చేసిన పొరపాటు ఈ మాసంలో గ్రహపాటుగా మారి, ఆర్థిక మానసిక ఇబ్బందులకు గురిచేస్తుంది. భార్యపిల్లల అనారోగ్యానికి ధనాన్ని ఖర్చు చేయవలసివస్తుంది. ఉద్యోగంలో స్థానచలనంవల్ల అశాంతి ఏర్పడుతుంది. తోటిఉద్యోగులతో స్వల్పవిభేదాలు కలిగే సూచన లున్నాయి. మానసికప్రశాంతతకోసం ఇష్టదేవతాపూజలు మేలు చేస్తాయి. మొదటివారం ఆందోళన, రెండోవారం వృథాఖర్చు, మూడోవారం విభేదాలు, నాలుగోవారం స్వల్పధనాదాయం.



## వృశ్చికం

ఈ రాశివారికి ఈ మాసంలో చేసే వృత్తి ఉద్యోగాలలో ఉన్నతపదవీప్రాప్తి. స్థిరాస్తుల క్రయవిక్రయాలవల్ల లాభాలు కలుగుతాయి. తొందరపాటువల్ల కష్టనష్టాలు ఎదుర్కో వలసివస్తుంది. మహిళలకు ఉన్నతపదవీయోగం. సంతానంకై చేసేపూజలు మంచిఫలితా న్నిస్తాయి. మిర్చి, చెరకు, చింతపండు వ్యాపారులకు ధననష్టం. మొదటివారం ధనాదాయం, రెండోవారం సంతానప్రాప్తి, మూడోవారం స్వల్పఅనారోగ్యం, నాలుగోవారం ప్రయత్నఫలం.



## ధనుస్సు

ఈరాశివారికి ఈ మాసంలో ఉన్నతవిద్యా అవకాశాలు అందివస్తాయి. వీసా, పాస్‌పోర్టులాంటి ప్రయత్నాలలో విజయం సాధిస్తారు. పోటీపరీక్షలలో మంచిర్యాంక్ సాధించి, అనుకున్న లక్ష్యానికి దగ్గరలో ఉంటారు. సోదరీసోదరులమధ్య నెలకొన్న వివాదాలు పరిష్కారం అవుతాయి. దీర్ఘాలోచనలు కొంత ఆందోళనకు గురిచేస్తాయి. గ్రహసంచారం అనుసరించి, సూర్య చంద్రకుజగ్రహదోషనివారణపూజలు మేలు చేస్తాయి. పిల్లల ఉన్నతచదువులకై ధనాన్ని ఖర్చు చేయవలసివస్తుంది. మొదటి వారం శుభవార్త, రెండోవారం విజయం, మూడోవారం స్వల్ప ధనాదాయం, నాలుగోవారం ఆనందం.



## మకరం

ఈరాశివారికి ఈ మాసంలో తొందరపాటు నిర్ణయాలు కొంత ఆందోళనకు గురిచేస్తాయి. పోటీపరీక్షలలో మంచి విజ యాన్ని చేజిక్కించుకుంటారు. తల్లిదండ్రుల అనారోగ్యం ఆందోళన కలిగిస్తుంది. దీర్ఘకాలికవ్యాధులపట్ల అప్రమత్తంగా ఉండటం అవసరం. ఇష్టదేవతాపూజలు, నదీస్నానాలకోసం చేసేప్రయత్నాలు అనుకూలిస్తాయి. ధనాన్ని పొదుపుగా, మాటను అదుపుగా ఉంచు కోవటంవల్ల అందరిలో ప్రశంసలు పొందుతారు. మొదటివారం అనారోగ్యం, రెండోవారం క్షేత్రదర్శనం, మూడోవారం స్వల్పధనా దాయం, నాలుగోవారం విజయప్రాప్తి.



## కుంభం

ఈ రాశివారికి ఈ మాసంలో అన్నిరంగాలలో ఆటు పోట్లు ఎదురవుతాయి. ప్రతివిషయంలో కోపాన్ని ప్రదర్శించడం వల్ల బంధుమిత్రులతో వివాదాలు ఏర్పడతాయి. ఎంత శ్రమించినా ఆశించినఫలితం రాకపోవడంతో నిరాశకు లోనవుతారు. వెండి, బంగారువర్తకులకు ధనాదాయం. కేంద్రరాష్ట్రప్రభుత్వ ఉద్యోగు లకు, పెన్షన్‌దారులకు ప్రభుత్వంనుంచి శుభవార్తలు అందుతాయి. దైవచింతనకోసం ప్రతిరోజు హనుమత్ స్తోత్రం పఠించడంవల్ల ఆత్మవిశ్వాసం పెరుగుతుంది. మొదటివారం స్వల్పవివాదాలు, రెండోవారం ధనప్రాప్తి, మూడోవారం దైవచింతన, నాలుగోవారం శుభవార్తలు.



## మీనం

ఈ రాశివారికి ఈ మాసంలో విదేశీప్రయాణప్రయ త్నాలు అనుకూలిస్తాయి. విద్య ఉద్యోగాలలో మంచిప్రతిభను కనబరచి, లక్ష్యాన్ని సాధించుకుంటారు. మహిళలకు, చిన్న పిల్లలకు, వృద్ధులకు అనారోగ్యసూచనలు. చేసే వృత్తి వ్యాపారా లలో స్వల్పధనాదాయం, ప్రింటింగ్, కంప్యూటర్ పత్రికారంగా లలో పనిచేస్తున్నవారికి యోగదాయకమైనకాలం. తొందరపాటు నిర్ణయాలు ఇబ్బందులకు గురిచేసేఅవకాశం ఉన్నందున పెద్దల సలహాలు పాటించడం మంచిది. మొదటివారం అనారోగ్యం, రెండోవారం శుభవార్తాశ్రవణం, మూడోవారం వ్యవహారజయం, నాలుగోవారం విదేశీయానం.



# తిరుమల ఆలయం



ఆంగ్లమూలం : డా॥ రమేశన్, తెలుగు అనువాదం : డా॥ కోరాడ రామకృష్ణ | ధారావాహిక

***(ఈస్ట్ ఇండియా కంపని ఆలయపరిపాలనను చేపట్టిన తరువాత ఆలయ రికార్డులు పటిష్టం చేశారు. ఆలయ ఆదాయాన్ని కట్టుదిట్టంగా వసూలు చేయడానికి చేయూతనిచ్చే పద్ధతిలో సవాల్ జవాబ్ పట్టి, దిత్తం, కైంకర్య పట్టి, బ్రూస్‌కోడ్, పైమాయిషి పట్టి - లను తయారు చేశారు. ఆ విధానంతో ఆదాయం అన్యథా జారిపోయే అవకాశాన్ని తప్పించారు. ఆ వైనాన్ని ఇక్కడ వివరించడమైనది. )***

## ఆంగ్లేయుల అధీనంలో ఆలయం

### ఈస్ట్ ఇండియా కంపనివారి ఐదుపరిశోధనలు

ఉపఖండంలో శాంతి నెలకొన్నపుడు ఈస్ట్ ఇండియా కంపనివారు ఆలయంగురించి అన్నివిషయాలలో వాకబు చేశారు. ఆలయం పరిపాలన, ఆదాయం, ఆదాయమూలం, దైవారాధన, ఆరాధనావిధానాలు, వాటిపరంపర, ఆలయ సిబ్బంది, వంశపారంపర్యం మరియు తాత్కాలిక పనుల ఉద్యోగులు, ఐచ్ఛిక సిబ్బంది కర్తవ్యం, సంభావన, రోజువారి నివేదనలు, మాసోత్సవ, పక్షోత్సవ, వారోత్సవ, సంవత్సరోత్స వాలు, ప్రత్యేక పబ్బములు, వాటి నివేదనలు, వివిధఆలయాలు, అక్కడ నెలవైన దేవతామూర్తులు, వాహనాల ఊరేగింపులు, ఆలయాలకు వచ్చే భక్తులు, వారికానుకలు, వాటిరసీదులు, దానిలెక్కలు మున్నగువాటిని కూలంకషంగా తెలిసికొని ఐదు దాఖలాలను ఏర్పరచారు. అవి - 1)దిత్తం 2)కైంకర్యపట్టి 3)బ్రూస్‌కోడ్ 4)సవాల్ జవాబ్ పట్టి 5)పైమాయిషి దాఖలు.

### దిత్తం

అన్ని దేవతలకూ, వైష్ణవ ఆళ్వారులకూ, ఆచార్యులకూ సమర్పించు అన్నప్రసాదాల నివేదనా వివరాలను నమోదుచేసే పుస్తకం. మొట్టమొదట ఈ దాఖలాల నమోదు ఫసలి 1200 నుండి 1250 వరకు చలామణికి తేవడం జరిగింది.

> ఎవరియందు కుటిల భావము, అసత్యము, కపటము, మొదలైన దోషాలు లేవో అట్టివారికే పవిత్రమగు బ్రహ్మలోకము సిద్ధిస్తుంది.
> - ప్రశ్నోపనిషత్తు *:16*

### కైంకర్యపట్టి

వేరు వేరు పనులు చేయుఉద్యోగుల కర్తవ్యములు, సంభావనలను గుర్తించే దాఖలా ఇది. మొదట క్రీ.శ.1801లో తయారు చేశారు. అనంతరం క్రీ.శ.1820 లో దీన్ని పరిష్కరించారు.

### బ్రూస్‌కోడ్

ఆలయపరిపాలన మరియు దీనికి సంబంధించిన విభాగాల పర్యవేక్షణగురించి జిల్లాకలెక్టరు క్రీ.శ.1821, జూలై 25 న తయారు చేసిననివేదిక. నియమావళిపత్రం.

### సవాల్ జవాబ్ పట్టి

క్రీ.శ.1819 లో ప్రకటింపబడ్డ ప్రశ్నోత్తరరూపమైన సిబ్బందికర్తవ్యం, సంభావన, ధార్మికప్రక్రియల, దాన వివరముల పట్టిక.

### పైమామిషి నివేదిక

ఆలయం మరియు ఇతరభవంతుల కొలతలు, విగ్రహాలవివరణ, మున్నగు లెక్కల నివేదిక.

స్థూలంగా చెప్పాలంటే ఈస్ట్‌ఇండియా కంపని పరిపాలనలో ఆలయం క్రీ.శ.1817 లో మదరాసు శాసనం ప్రకారం పరిపాలింపబడుతూ వచ్చింది. ఈ శాసనంలో

ఆలయం, మసీదులకు చెందినభూముల గుత్తాధిపత్యం, పంట లోనిభాగాలు, భూములపర్యవేక్షణగురించి నియమ నిబంధన లుండినవి. ఈ శాసనంప్రకారం అన్ని దానభూముల నిర్వ హణలో రెవెన్యూ కార్యాలయానికి సంపూర్ణాధికారం ఉండింది. భూములనుండి వచ్చే ఆదాయం సక్రమంగా రాబట్టడానికి ఈ శాసనం ఏర్పడింది. ఈ శాసనంలోని ఎనిమిదివకలంప్రకారం ప్రాంతీయ ప్రభుత్వ ప్రతినిధిగా జిల్లా కలెక్టరు వ్యవహరించే అధికారం పొందాడు. కంపని పరిపాలనకాలంలో బ్రూస్‌కోడ్ ఆధారంగా ఆలయ పరిపాలన జరిగేది.

### బ్రూస్ కోడ్ వివరములు

ఆర్కాడు నవాబునకు సహాయం చేసేటప్పుడు, తమరు ఖర్చు చేసిన ధనాన్ని, ఆర్కాడు నవాబు తమకు చెల్లించాల్సిన అప్పుగా భావించి, దానిని రాబట్టుకొనేందుకు సాధనంగా తిరుపతి ఆలయాన్ని ఈస్ట్ ఇండియా కంపని కైవసం చేసుకున్నది అనేది అసలు విషయం. ఈ ఉద్దేశంతో ఆర్కాడు నవాబు ఆలయాదాయాన్ని క్రీ.శ.1748 లో ఆంగ్లేయులకు అప్పగించాడు. తదనంతరం క్రీ.శ.1786 లో ఆలయాన్నే అప్ప గించాడు. తదనంతరం ఇక్కడి ఆదాయాన్ని తన అధికారంతో తనే సంగ్రహించే ఏర్పాట్లను కుంపణిప్రభుత్వం చేసింది.

కుంపణి ఆలయబాధ్యతలను స్వీకరించిన పిదప బ్రూస్‌కోడ్ రీత్యా ఆలయపరిపాలన, ఆదాయమూలాలను కట్టుదిట్టం చేసింది. ఈ బ్రూస్ ఎవ రనేది ఖచ్చితంగా తెలియ రాదు. బహుశః మదరాసు కంపనీ కమీషనర్, సెక్రెటరియో అయ్యుండాలి.

ఈ కోడ్‌లో 42 అధికరణములు (కలంలు) ఉండి, దీని ప్రకారమే 1843 లో మహంతులకు పరిపాలనాబాధ్యత లను అప్పగించేవరకు పరిపాలన జరిగింది.

ఆలయంలోని వంశపారంపర్యం మరియు ఇతర సిబ్బంది నియంత్రణం మరియు పర్యవేక్షణ అధికారం చిత్తూరు జిల్లా కలెక్టరుకు చెంది, అతడు ఆలయంలోని సర్వఉద్యోగుల పట్టిచేసి, ఒకప్రతిని తిరుపతి తహసీల్దారుకూ, ఒకప్రతిని ఆలయ పారుపత్యదారుకూ ఇవ్వవలసి ఉండింది, యాత్రికులు కానుకగా ఇచ్చే ధనంగురించి, వారు సమర్పించే దానముల గురించి కుంపణివారు ఎక్కువ శ్రద్ధ చూపేవారు. యాత్రికులు తమ దగ్గర ఉంచుకున్న ధనం గురించి స్పష్టమైన వివరములను తెలిసికొని, వారినుండి దానిని సంగ్రహించడంలో సాయంచేస్తూ, దానిని లెక్కల్లో ఎక్కించడానికి పారుపత్యదారుకూ, జీయం గారుకూ చేయూత నిస్తూ, ఎవరైనా వంచనకు పాల్పడినపుడు ఆ విషయాన్ని అధికారులకు తెలియజేసినవారికి సూక్త పారితోషికం ధనం ఇవ్వబడుతుండేది.

తహసీల్దారు బ్రహ్మోత్సవాలకు ఒక నెల మునుపే తిరుమలలో కార్యాలయాన్ని ఏర్పాటు చేసి, వివిధసేవలను చేసే యాత్రికులనుండి తగిన రుసుము వసూలు చేస్తూ, వారికి దర్శనానికి తగిన ఉత్తర్వులను ఇస్తూ, బ్రహ్మోత్సవాల అనం తరం తగినబహుమతులను ఇచ్చేందుకు ఏర్పాటు చేయవలసి ఉండింది.

తహసీల్దారు కనీసం వారంలో ఒకమారైనా ఆలయానికి వచ్చి ఉద్యోగస్థుల విధులను పర్యవేక్షణ చేయవలసి ఉండింది. సంవత్సరంలో కనీసం మూడుమార్లు ఆలయఆభరణాల లెక్క లను పరీక్షించవలసిఉండింది. ఈ ఆభరణాలను జిల్లా కలెక్టరు సంవత్సరంలో ఒకమారు ప్రత్యక్షతనిఖీ చేయాల్సి ఉండింది.

కానుకలు మరియు ఆర్జిత (వేరే వేరే వాహనముల ఊరేగింపు, నివేదనలు, ఉత్సవాలకు తగిన పైకాన్ని చెల్లించడం) సేవలు చేయు యాత్రికులకు ఎక్కువప్రాధాన్యం ఇస్తూ వారికి ప్రథమదర్శనావకాశం ఇవ్వబడేది. వీరిదర్శనానంతరం సర్వ జనులు దర్శనం చేసుకునేవారు. లేక వీరందరిని సుమారు యాభైమందిని గుంపులుగా దర్శనానికి వదిలేవారు.

ఆ రోజులలో పూలంగిసేవ (ప్రతిగురువారం సాయంత్రం శ్రీ వేంకటేశ్వరస్వామిని వివిధపూవులతో అలం కరించేసేవ) మరియు ప్రతిశుక్రవారం, సాయంత్రం పుళి కాప్పుసేవ (దక్షిణభారతంలో సాధారణంగా ప్రతిఇంటిలోనూ జరిగేటట్టు విగ్రహాలను చింతపండుతో తోమడం పరిపాటి, బహుశః ఈ విధానాన్నే విగ్రహాలకు అభిషేకానికై అన్వయించి నందువల్ల ఈ పేరు వచ్చింది కాబోలు) ఇంతేగాక అద్దాల

దర్శనసేవకూడ వాడుకలో ఉండింది. ఈ గదిలో నాలుగు పక్కలా గోడలకు అద్దాలు అమర్చినందువల్ల ఉత్సవమూర్తియొక్క ప్రతిబింబములు వేలాది కనబడేవి. ఈ అద్దాలగది – అద్దాల మహలు అనబడే గది, ఆలయం ఈశాన్యంలో కృష్ణదేవరాయడు మరి అతనిరాణుల ప్రతిమల మంటపం ఎడమవైపు ఉండేది. తిరుమల స్వామియొక్క పుష్కరిణి పశ్చిమంలో ఉన్న వరాహ స్వామి ఆలయం, జీర్ణోద్ధారణ చేసే సమయంలో శ్రీవరాహస్వామి మరియు ఇతరపరివారదేవతలవిగ్రహాలను పన్నెండు సంవత్స రాలు అంటే, ఆలయ జీర్ణోద్ధార పనులు పూర్తయ్యేవరకు, ఈ అద్దాలమహలులో ఉంచారు. ఈ అద్దాలసేవ ఇపుడు (1821 లో) ప్రాచుర్యంలో లేదు.

ఇక్కడ చెప్పబడిన అన్నిసేవలకు డబ్బు చెల్లిం చాల్సి ఉండింది. బ్రహ్మోత్సవసమయంలో పూలంగిసేవకు 1 రూపాయి. సాధారణ రోజులలో పూలంగిసేవకు అర్థ రూపాయి. పులికాపు సేవకు 2 రూపాయలు. సాధారణ రోజు లలో ఈ సేవలకు ప్రతి ఒక్కటికి 1 రూపాయి. ఆలయానికి, దేవుడికి సమర్పించిన ఆభరణములు మరియు ఇతర ఖరీదైన వస్తువుల రక్షణకై మరియు నిర్వహణకై ఆయా వస్తువుల వెలకు సమానమైన ధనాన్ని ఆలయానికి వర్తనగా ఇవ్వవలసి ఉండింది.

సంవత్సరం పూర్తిగా ఏదైనా సేవ చేయాలి అంటే దానికి తగ్గ రుసుము చెల్లించాల్సి ఉండింది.

చక్రాంకనం చేయించుకునేవారు (విష్ణువు ఆయుధా లైన శంఖచక్రముద్రలను భుజాలపై ముద్రించుకుని, తాము విష్ణువుకు సమర్పితమైన పుష్పము లని వైష్ణవులు వేయించుకునే ముద్రాంకనం) తగిన శుల్కం చెల్లించాల్సి ఉండింది.

యాత్రికులు ఆలయానికి సమర్పించే కానుకలను రక్షించుటకు పలు ఏర్పాట్లు చేయడమైనది.

7 వ నిబంధనలోని అంతర్గతమైన కలములు ఆలయం ఆదాయం, ఖర్చుల రోజువారిపట్టీని పారుపత్యదారుడు సిద్ధపరచిన తరువాత జీయంగారు గుమస్తా దీనికి చేవ్రాలు చేసి రోజూ ఒక ప్రతిని తహసీల్దారునకు పంపాలనియూ, అతను ఈ రోజువారి లెక్కలను వారాని కొకమారు జిల్లాకలెక్టరుకు పంపా లనీ నియమం. బ్రహ్మోత్సవంరోజులలోకూడా ఇదే నియమం.

23 వ కలము ప్రకారం పారుపత్యదారుగారు ప్రతి రోజు సంగ్రహమైన సొమ్మును ఆ మరుసటిరోజే లెక్కలతో సహా తహసీల్దారుకు అప్పగించాలి అని ఖచ్చితంగా చెప్పింది. తహసీల్దారు ఈ లెక్కలకు రసీదు పారుపత్యదారుకు ఇవ్వవలసి ఉండింది. పారుపత్యదారు నెలలో 15 వ దినం ఈ రసీదుల నంతా జిల్లా కలెక్టరుకు పంపాలి. ఇది నియమం.

24 వ కలం చెప్పేటట్టు బ్రహ్మోత్సవంరోజులలో ప్రతిరోజు సంగ్రహాన్ని ఆ మరుసటి రోజు కలెక్టరుకు అప్పగించాలి. కలెక్టరు గానీ అతని సహాయకుడుగానీ ఇందులోని నాణ్యములు, వెండి, బంగారు, ఆభరణములు మరియు ఇతర వస్తువులను వేరు చేసి లెక్కకట్టవలసి ఉండింది. (ఇపుడు దీన్ని పరకామణి అంటారు) ఈ వేరు వేరు వస్తువులను విభజించే కార్యములో తహసీల్దారు మరియు జీయంగారు సహాయకులు హాజరై విభజించిన వస్తువుల వివరాలను పత్రములో నమోదు చేయవలసి ఉండింది. నిండిన హుండీలను (యాత్రికులు కానుక లను వేసే పెద్దపాత్ర) ఆలయంలోనే భద్రపరచి, బ్రహ్మోత్సవాలు తరువాత మొత్తంకానుకలను తిరుపతి కార్యాలయానికి పంపేవారు. అక్కడ సంచులను తెరిచి, కానుకలను వర్గీకరణం జరిపేవారు.

26 వ కలం ప్రకారం బ్రహ్మోత్సవం తరువాత కలెక్టరు రెవిన్యూవిభాగానికి అన్ని కానుకల వివరాలను తెలుపుతూ వాటిని అమ్మడానికి అనుమతించేవాడు.

32 వ కలం యాత్రికుల మరియు వారివస్తువుల రక్షణభారాన్నీ, నిషిద్ధజనులు కొండ నెక్కకుండ ఆపడానికీ, జగడం, రచ్చ, దొంగతనాలను ఆపడానికీ పోలీసులకు అధి కారమిస్తూ, న్యాయవిచారణ జరపా లని ఆదేశిస్తున్నది.

35వ కలం ప్రకారం ఆలయంలో దేవుళ్ళకు నివేదించు ఆహారపదార్థాలతయారీబాధ్యత తహసీల్దారు మరియు పారు పత్యదారులది. ఇలాగే 38వ కలం తీర్థవితరణపద్ధతిని వివరించును.

పై వివరాలను గమనించినట్లైతే లెక్కపత్రాలు నాలుగు ప్రతులు తయారయ్యే వని తెలుస్తుంది. పారుపత్యదారు, జీయం గారు, తహసీల్దారు, కలెక్టరు దీనిహక్కుదారులు.

## ఎందుకు తలనీలాలు సమర్పించడం?

**తీర్థోపవాసః కర్తవ్యః శిరసో ముండనం తథా ।**
**శిరోగతాని పాపాని యాన్తి ముండనతో యతః ॥**
**(పద్మపురాణం 237.45)**

తీర్థక్షేత్రంలో ఉపవాసం చెయ్యాలి. తల నీలాలు తీయించుకోవాలి. అలా తలనీలాలు తీయించుకుంటే శిరస్సులో ఉన్న పాపాలు నశించి పోతాయి. అహంకారం తగ్గిపోయి, అశాశ్వతమైన శరీరంపైన మమకారం తగ్గిపోతుంది.

కానుకలు (యాత్రికులు తెచ్చి దేవుడికి సమర్పించే ధనం, ఆభరణం, ఇతర వస్తువులు) ఆర్జితం (యాత్రికులు ఆలయంలో చేయించే వాహనసేవలు, అన్నప్రసాద నివేదనలు– మున్నగు వాటిని) సంగ్రహాల విషయాలలో కంపని జాగ్రత్తగా పనిచేసేది. బంగారువాకిలిలో పారుపత్యదారుడు యాత్రికుని పేరు, అతని ఊరు ఘోషించి, అతను చేసే కానుక, సేవల గురించి వాకబు చేయా లని ఉండేది. అతను సమర్పించే కానుకను పరిశీలించి, ధనాన్ని ఎంచి, మొత్తాన్ని వ్రాసుకుని, ఇతరవస్తువుల తూకంవేసి, వాటి విలువలను వ్రాసుకుని, వాటిని పొట్లంగట్టి ముద్రవేసి యాత్రికుడికి వెనక్కు ఇచ్చేవాడు. ఇదే సమయంలో ఈ వివరాలను జీయంగారు గుమస్తాకూడ తనపుస్తకంలో వ్రాసుకునేవాడు. అనంతరం యాత్రికుడికి దర్శనానికి అనుమతించి, కానుకను సమర్పించడానికి అవకాశం కల్పించబడేది. ఆలయంలో ఇది రోజూ జరిగేవ్యవహారం.

బ్రహ్మోత్సవాలరోజులలోకూడ ఈ పద్ధతినే అను సరించేవా రని దిత్తం పుస్తకంలోని మొదటిదిత్తం విభాగంలో వివరించబడ్డది. మూడవ దిత్తంలోనూ – ఇది నేరుగా బ్రహ్మోత్స వానికే సంబంధించినది – ఇదే దాఖలైంది.

బ్రహ్మోత్సవం రోజులలో మహారాష్ట్ర, గుజరాతు, మరి ఇతర ఔత్తరేయ ప్రాంతాలనుండి తిరుమలకు ఎక్కువమంది యాత్రికులు గోసాయల నిర్దేశనంలో, మార్గదర్శనంలో వచ్చేవారు గాబట్టి పారుపత్యదారులూ, తహసీల్దారులూ ఈ సమయంలో అతి ఎక్కువ జాగ్రత్త వహించి, వారిచే అతిఎక్కువ కానుకలను రాబట్టేవారు.

సంవత్సరం పొడువునా దేశంలోని నానాప్రాంతాల నుండి వచ్చే యాత్రికుల సంరక్షణ గురించి, పలుగ్రామాలను పొందిన జమీందారులు, పాళేగారులు యాత్రికులను దారి దోపిడికారులు, వంచకులు, దాడికారులు నుండి రక్షించి వారికి తిరుమల త్రోవ చూపించి, ఆలయానికి వెళ్ళేందుకు అనుకూల వాతావరణం కల్పించా లని చెప్పడమైంది.

### ఆలయాన్ని మన్రోదొర సందర్శనం

థామస్‌మన్రో 1780 లో మద్రాసుకు వచ్చి మదరాసు సైన్యంలో సాధారణ సిపాయి ఉద్యోగంలో చేరాడు. హైదరాలి పై యుద్ధాలలో మరియూ సేలం, కెనరా యుద్ధాలలో పాల్గొని, తర్వాత హైదరాబాద్ నిజాము ఇంగ్లీషువారికి విడిచిపెట్టిన విశాఖపట్నం, విజయనగరం జిల్లాలలో కలెక్టరుగా 1800 నుండి 1807 వరకూ పని చేశాడు. క్రీ.శ.1817–18 లో మూడవ మరాఠాయుద్ధంలో బ్రిటిష్‌సైన్యంలో దళపతిగా పనిచేశాడు. క్రీ.శ.1820 నుండి 1827 వరకు మదరాసు గవర్నరుగా ఎదిగాడు. అప్పుడే అతడు సర్ బిరుదును పొంది సర్ థామస్‌మన్రో అని పిలువబడ్డాడు. అతనికి భారత ప్రజల పట్ల ఎక్కువ సానుభూతి.

అతడు మదరాసు గవర్నరుగా ఉన్నపుడు ఒకసారి శ్రీవేంకటేశ్వరస్వామిని చూడా లని అపేక్ష చెంది, ఒక రాత్రి తిరుపతికి వచ్చాడు. దేవుడు అతనికి మనుష్యరూపంలో కనబడి అతడు హిందువు కానందున కొండను ఎక్కకూడ దని చెప్పాడు. అతడు కొండ ఎక్కకనే వెనుదిరిగాడు. ఐతే ప్రతిదినమూ దేవుడికి తన పేరున ఒక తళిగ నైవేద్యసమర్పణ చేయా లని ప్రధాన అర్చకులకు కొంత భూమి నిచ్చి, ఆ భూమిలో పండిన పంటల ఆదాయాన్ని నివేదనలకై వాడాలి అని కట్టడి చేశాడు. ఈ నివేదనను మొదటిగంట సమయంలో నివేదించుదురు. (గంటానాదము చేసినపుడు ఈ ప్రసాదనివేదన జరుగును) ఇతరఆర్జితసేవల నైవేద్యాన్ని రెండవగంట సమయంలో సమర్పిస్తారు.

సర్ థామస్‌మన్రో క్రీ.శ.1827లో కలరావ్యాధితో మరణించాడు. క్రీ.శ.1839 లో మదరాసు మౌంట్‌రోడ్డులో ఈయనపై అభిమానంతో ఇతని ప్రతిమను స్థాపించారు.

*(ఇంకా ఉంది)*

# శ్రీ బాలబాలాజీ ఆలయం, అప్పనపల్లి

మన దేవాలయాలు

మూషిణి వేంకటేశ్వరరావు

అం దాల కోనసీమ మహిమగల పుణ్యక్షేత్రా లెన్నింటికో నిలయం. గోదావరీనదీమతల్లి పుణ్యజలాలతో పావనమైన పుణ్యభూమి కోనసీమ. తూర్పుగోదావరిజిల్లా కోనసీమలోని అప్పనపల్లిలో పవిత్రవైనతేయనదీతీరాన వెలసిన పుణ్యక్షేత్రం శ్రీబాలబాలాజీదేవాలయం. అయిదుదశాబ్దాల క్రితం ఇక్కడ వెలసిన వేంకటేశ్వరుడు బాలబాలాజీగా పూజలందుకుంటున్నాడు. భక్తజనబాంధవుడైన బాలబాలాజీ తనను కొలిచేవారిపాలిట కొంగుబంగారమై అశేషజనుల నిత్య నీరాజనాలందుకుంటున్నాడు.

తూర్పుగోదావరిజిల్లా మామిడికుదురుమండలంలోని అప్పనపల్లిగ్రామంలో శ్రీబాలబాలాజీదేవాలయం ఉంది. కోనసీమ ప్రధానకేంద్రమైనఅమలాపురంనుండి బోడసకుర్రు మీదుగా వైనతేయగోదావరినది దాటి, అప్పనపల్లి వెళ్లడానికి మార్గం ఉంది. పవిత్రగోదావరీనదీతీరాన వెలసిన శ్రీబాలబాలాజీ దేవాలయం నిత్యం వేలాదిమందిభక్తులతో కిటికిటలాడుతుంది. నిత్యం గోవిందనామసంకీర్తనలతో ఆలయప్రాంగణం మార్మోగుతుంది. ఉభయగోదావరిజిల్లాలనుండి, ఇంకా రాష్ట్రంలోని వివిధ ప్రాంతాలనుండి భక్తులు ఇక్కడికి విచ్చేసి, తమ మొక్కుబడులను తీర్చుకుని, తమ తలనీలాలను స్వామివారికి సమర్పించుకుంటారు. శ్రీబాలబాలాజీఆలయం కోనసీమలో ఓ ప్రసిద్ధ పుణ్యక్షేత్రంగా, 'బాలతిరుపతి'గా విరాజిల్లుతూంది.

## అప్పనపల్లిలో శ్రీబాలబాలాజీ వెలసినవైనం

సుమారు అయిదుదశాబ్దాలక్రితం అప్పనపల్లి గ్రామానికి చెందినశ్రీమొల్లేటి రామస్వామి కొబ్బరికాయల వ్యాపారం చేస్తుండేవారు. ఈయన శ్రీవేంకటేశ్వరస్వామివారిభక్తులు. నిత్యం శ్రీనివాసుణ్ణి భక్తిశ్రద్ధలతో ఆరాధిస్తూ తనవ్యాపారంలో వచ్చిన లాభంలో కొంతభాగాన్ని కలియుగదైవమైన శ్రీవేంకటేశ్వర స్వామివారికి విధిగా సమర్పించేవారు. ప్రతియేటా తిరుమలలోని శ్రీనివాసుణ్ణి దర్శించి, తన మొక్కుబడులను హుండీలో సమర్పించి, వచ్చేవారు. 1960లో శ్రీవేంకటేశ్వరస్వామివారి దర్శనంకోసం తిరుమల చేరిన శ్రీరామస్వామి, తాను తీసుకెళ్ళినధనాన్ని, కానుకులను హుండీలో వేయకుండా - నేరుగా స్వామివారి పాదాలచెంత ఉంచా లని కోరారు. అయితే ఆలయ నిర్వాహకులు ఆయనను అందుకు అనుమతించలేదు. స్వామివారికి సమర్పించ వలసిన ధనాన్ని మరియు కానుకలను నేరుగా హుండీలోమాత్రమే వేయా లని వారు రామస్వామిని ఆదేశించారు. అప్పుడు రామస్వామి తిరుమలేశుని ఆలయప్రాంగణంలో గోవిందనామాన్ని ఉచ్చరిస్తూ భక్తిపారవశ్యంతో స్వామివారి ధ్యాసలో నిమగ్నమయ్యారు. "స్వామి! నీ సేవయే పరమావధిగా భావించి, నిరంతరం నిన్నే ధ్యానిస్తూ ప్రతియేటా విధిగా నిన్ను దర్శిస్తున్న పరమభక్తుడను నేను!! అంతే కాకుండా నా వ్యాపారంలో వచ్చినఆదాయంలో నీకు కొంతభాగాన్ని ప్రతియేటా సమర్పించుకుంటున్నాను!!" అని కన్నీరు మున్నీరుగా విలపించారు- రామస్వామి. ఇంతలో ఓ బాలుడు రామస్వామి వద్దకు వచ్చి ఆయనభుజం తట్టాడు. గోవిందనామస్మరణలో నిమగ్నమైె ఉన్నరామస్వామి కనులు తెరచి చూడగా, ఆ బాలుడు ఇట్లు పలికాడు- "నీవు నన్ను దర్శించుకునేందుకు తిరుమలకొండపైకి రా నక్కరలేదు. నేనే స్వయంగా మీ స్వగ్రామమైన అప్పనపల్లిలో వెలసెదెను" అని చెప్పి అదృశ్యమయ్యాడు. ఆ బాలునిపలుకులు విన్నరామస్వామి ఆనందానికి అవధుల్లేవు. తనతో పలికిన ఆ బాలుడు ఎవరో కాదు సాక్షాత్తు ఆవేంకటేశ్వరస్వామివారే అని గ్రహించి, జరిగినదంతా తిరుమలేశునిలీలగా భావించారు- రామస్వామి. తిరుమలకొండపై స్వామివారిచిత్రపటాన్ని తీసుకుని తన స్వగ్రామమైన అప్పనపల్లికి పయనమయ్యారు. అప్పనపల్లి చేరుకున్న ఆయన తిరుమలఆలయంలో జరిగినవృత్తాంతాన్ని

తన మిత్రులకు, సన్నిహితులకు తెలిపారు. తనకొబ్బరికాయలు దుకాణంలోని పూజామందిరంలో ఆరంభించారు. నిత్యం బాల బాలాజీని పూజిస్తూ స్వామిసేవలో నిమగ్నమయ్యారు- రామ స్వామి.

అప్పనపల్లిలో బాలబాలాజీ వెలశా రనే వార్త కోనసీమ నలుచెరగులా వ్యాపించడంతో స్వామివారిని దర్శించుకోవడానికి అనేకమందిభక్తులు తండోపతండాలుగా రాసాగారు. భక్తజన సందోహంతో అప్పనపల్లిప్రాంతమంతా గోవిందనామధ్వనులతో మార్మోగింది. ప్రసిద్ధులైన అర్చకస్వాములచే బాలబాలాజీ స్వామివారికి నిత్యకాలఅర్చనలు చేయించడం ఆరంభించారు- రామస్వామి. స్వామివారిదర్శనార్థం వచ్చేభక్తులసంఖ్య రోజు రోజుకు పెరగడంతో అప్పనపల్లి ఓ ప్రముఖపుణ్యక్షేత్రంగా విరాజిల్లింది. భక్తులసంఖ్యతో బాటు ఆదాయం కూడా పెరిగింది. స్వామివారికి నూతనఆలయాన్ని నిర్మించా లని రామస్వామి తల పెట్టారు. రామస్వామిఅకుంఠితదీక్ష, భక్తితత్పరత ఫలితంగా బాలబాలాజీఆలయం దినదినాభివృద్ధి చెంది, ఓ ప్రసిద్ధపుణ్య క్షేత్రమై వెలుగొందింది.

## నూతనఆలయనిర్మాణానికి శ్రీకారం

నిత్యం వేలాదిమందిభక్తులతో రద్దీగా ఉండే అప్పన పల్లిలో సువిశాలమైనప్రాంగణంలో నూతనఆలయం నిర్మించా లని రామస్వామి సంకల్పించారు. బాలబాలాజీపై భారం వేసి, ధైర్యంగా దేవాలయనిర్మాణానికి నడుంబిగించారు. ఆయన 1970 మార్చి 18వ తేదీన శంకుస్థాపన గావించి, ఆలయనిర్మాణానికి శ్రీకారంచుట్టారు. నిపుణులైన శిల్పాచార్యుల్ని రప్పించి, నూతన ఆలయం పైభాగాన అనేకరకాల శిల్పాలను అత్యంతరమణీయంగా తయారుచేయించారు. రామస్వామి తన స్వయం ప్రణాళికప్రకారం ఆలయనిర్మాణం పూర్తి చేయించారు. అర్జునుడికి గీతోపదేశం చేస్తూన్న శ్రీకృష్ణుడు, పుట్టలో ఉన్న శ్రీనివాసునికి క్షీరా న్నిస్తున్నగోవు, నారదతుంబురులు గానం చేస్తుండగా శేష శయ్యపై పవళించిన శ్రీమహావిష్ణువువంటి శిల్పాలు రామస్వామి కళాభిరుచికి అద్దంపడతాయి. ఈ శిల్పాలు చాలా సుందరంగా, సజీవమూర్తులుగా చేయబడ్డాయి. ఇలా శ్రీబాలబాలాజీస్వామి వారిదేవాలయం అత్యంతశోభాయమానంగా రూపుదిద్దుకుంది.

## రామస్వామి సేవాతత్పరత

భక్తులసేవయే దైవసేవగా భావించినరామస్వామి భక్తులకు అనేకసౌకర్యాలను కల్పించసాగారు. సుదూరప్రాంతాల నుండి విచ్చేయుయాత్రికులకు వసతిసదుపాయాలు కల్పించారు. బారులుతీరినభక్తులకు ఎటువంటి సౌకర్యలోపం జరగకుండా స్వయంగా తానే పర్యవేక్షణ చేసి, యాత్రికుల నడిగి, సమస్యలను తెలుసుకొనేవారు. పసిబిడ్డలతో వచ్చే మహిళాభక్తులకు పాలు పంపిణీ చేయించేవారు. 1978లో అప్పనపల్లిలో భక్తులకు నిత్యఅన్నదానకార్యక్రమం ప్రారంభించారు. నిపుణులైనవారిచే తయారుచేయబడిన పులిహోర, పిండివంటకాలతో నిత్యం వేలాది మందికి అన్నదానం చేసేవారు. అత్యంతరుచికరమైన పదార్థాలతో నిత్యం అన్నదానం నిర్వహిస్తున్న రామస్వామిని భక్తులందరూ ప్రశంసించేవారు. దర్శనానంతరం అందరు అన్నప్రసాదాన్ని స్వీకరించా లని రామస్వామి స్వయంగా భక్తులను కోరేవారు.

1981వ సంవత్సరంలో బాలబాలాజీస్వామివారి దేవాలయం రాష్ట్రప్రభుత్వదేవాదాయశాఖవారిఅధీనంలోనికి వచ్చింది. 1991, జూలై 4వ తేదీన శ్రీశ్రీశ్రీ త్రిదండి చినజీయర్ స్వామిచే బాలబాలాజీవిగ్రహప్రతిష్ఠ నూతనాలయంలో వైభవోపేతంగా జరిగింది. శ్రీబాలబాలాజీ, ఆండాళ్ తాయార్ మరియు పద్మావతీదేవీవిగ్రహాలను తిరుమలతిరుపతిదేవస్థానంవారు సమర్పించారు. బాలబాలాజీ ఆలయంలో నిత్యం పాంచరాత్రశాస్త్ర ఆగమంప్రకారం స్వామివారికి అర్చనలు జరుగుతున్నాయి. ప్రాతఃకాలమే స్వామివారికి అర్చనకార్యక్రమాలు ఆరంభిస్తారు. అనంతరం భక్తులను దర్శనానికి అనుమతిస్తారు. సాయంకాలం ఆరాధనోత్సవకార్యక్రమం ముగిసాక, స్వామివారికి నివేదన సమర్పిస్తారు. అనంతరం హోమం, బలిహరణంవంటి కార్యక్రమాలు నిర్వహిస్తారు. తీర్థప్రసాదగోష్ఠి తర్వాత స్వామివారికి పవళింపుసేవ నిర్వహిస్తారు. మంగళాశాసనాలతో స్వామివారి అర్చనకార్యక్రమాలు ముగించినఅనంతరం ఆలయకవాట బంధనం చేస్తారు.

నారికేళవృక్షాలమధ్య అతిపెద్దబేడామండపంతో, శ్రీబాలబాలాజీస్వామివారిఆలయం ఎత్తైనధ్వజస్తంభంతో అలరారుతూంది. బేడామండపానికి నాలుగుదిశలా ప్రవేశద్వారాలు

# తిరుపతి చుట్టు ప్రక్కల దర్శనీయ ఆలయాలు

**శ్రీనివాస మంగాపురం :** తిరుపతికి పశ్చిమదిక్కున 12 కి.మీ. దూరంలో వెలసిన చిన్న గ్రామం శ్రీనివాస మంగాపురం. ఈ గ్రామానికి ఆగ్నేయమూలలో శ్రీ కల్యాణ వేంకటేశ్వర స్వామి ఆలయం నెలకొని ఉంది. వివాహానంతరం శ్రీ వేంకటేశ్వర స్వామి, శ్రీ పద్మావతితో కూడి తిరుమలకు వెళుతూ, కొంతకాలం ఇక్కడ ఉన్నా దని పురాణ ప్రసిద్ధి.

**నారాయణవనం :** నారాయణవనం తిరుపతికి ఆగ్నేయ మూలలో 22 కి.మీ. దూరంలో నెలకొని ఉన్న చిన్నపట్టణం. ఇక్కడ శ్రీకల్యాణవేంకటేశ్వరస్వామివారి ఆలయం ఉంది. శ్రీ వేంకటేశ్వర స్వామి శ్రీ పద్మావతి దేవిని వివాహమాడిన దివ్య క్షేత్రం ఇదే ననీ, అందుకు గుర్తుగా ఆకాశరాజు ఒక ఆలయాన్ని నిర్మించా దని పురాణాలు, ఇతిహాసాలు స్పష్టం చేస్తున్నాయి.

**నాగులాపురం :** శ్రీ వేదనారాయణస్వామివారి ప్రసిద్ధ క్షేత్రం ఇది. తిరుపతికి 65 కి.మీ. దురంలో ఆగ్నేయ దిక్కున నాగులా పురం ఉంది. విజయనగరం శైలీ విన్యాసానికి ఈ ఆలయం ప్రసిద్ధతార్కాణం. ఇచ్చట గర్భాలయంలో శ్రీ మహావిష్ణువు మత్స్యావతారంలో వెలసి, ఇరుప్రక్కల శ్రీదేవీ భూదేవులతో విరాజిల్లుతున్నాడు.

'సూర్యపూజ' ఈ ఆలయంలో ప్రత్యేకతను సంతరించుకుంది. ప్రతి సంవత్సరం మార్చి నెలలో మూడు రోజులపాటు ప్రధాన గోపురం ద్వారా ప్రవేశించిన సూర్య కిరణాలు గర్భాలయంలోని మూలమూర్తిని స్పృశించడం విశేషం. విజయనగర చక్రవర్తి శ్రీ కృష్ణదేవరాయలు తన తల్లి నాగులాంబకు స్మృతి చిహ్నంగా ఈ గ్రామాన్ని నిర్మించా దని చెప్పబడుతున్నది.

**అప్పలాయగుంట :** తిరుపతికి 15 కిలోమీటర్ల దూరంలో శ్రీ ప్రసన్న వేంకటేశ్వర స్వామివారు వెలసి ఉన్న అప్పలాయగుంట గ్రామం నెలకొని ఉంది. శ్రీ పద్మావతీ దేవి, శ్రీ ఆండాళ్ అమ్మ వారల విగ్రహాలు కూడా ఈ ప్రాచీన ఆలయంలో దర్శించవచ్చు. కార్వేటినగర రాజులచే నిర్మింపబడిన ఈ ఆలయానికి ఎదురుగా శ్రీ ఆంజనేయస్వామివారి సన్నిధి కూడా ఉంది. ఈ ఆంజనేయుడు భక్తులను రోగాలనుండి రక్షిస్తా దని ప్రసిద్ధి.

**కార్వేటినగరం :** తిరుపతికి 58 కి.మీ. దూరంలో పుత్తూరుకి దగ్గరలో కార్వేటినగరం ఉంది. ఇచ్చట శ్రీరుక్మిణీ సమేత శ్రీ వేణుగోపాలస్వామి వారి ఆలయం ఉంది. ప్రాచీన కాలంలో నారాయణవనం రాజులు ఈ ఆలయాన్ని నిర్వహించేవారు. ఈ ఆలయం శ్రీ సీతా రామ లక్ష్మణ ఆంజనేయస్వామి వారల ఏకశిలా విగ్రహానికి కూడా ప్రసిద్ధి.

**వాయల్పాడు :** తిరుపతికి 100 కి.మీ దూరంలో ఉన్న వాయల్పాడులో ప్రాచీనమైన శ్రీ రామాలయం నెలకొని ఉంది.

ఉన్నాయి. ఆలయానికి దక్షిణదిశగా రాజగోపురాన్ని ఏర్పాటు చేసి, ఈ ద్వారంగుండా భక్తులను దర్శనానికి అనుమతిస్తున్నారు.

తూర్పుదిక్కుకు అభిముఖుడైన స్వామివారికి ఇరువైపులా పద్మావతితాయార్, ఆండాళ్‌తాయార్ ఆలయా లున్నాయి. స్వామివారిఆలయానికి ఎదురుగా గరుడాలయం ఉంది. ఆలయ విమానపైభాగాన దశావతారశిల్పాలు చూడముచ్చటగా ఉంటాయి. ఆలయముఖమండపం పైభాగాన అర్జునుడికి గీతో పదేశం చేస్తున్నశ్రీకృష్ణుడు, పుట్టలో ఉన్నబాలాజీకి క్షీరా న్నిస్తున్నగోవు, నారదతుంబురుల గానాన్ని వింటున్న శ్రీమహా విష్ణువు శిల్పాలు చూపరులను విశేషంగా ఆకర్షిస్తాయి.

సహజదృశ్యాన్ని తిలకిస్తున్నరీతిలో ఈ శిల్పాలను అద్భుతంగా తీర్చిదిద్దారు. స్వామివారిఆలయానికి ఆగ్నేయదిశలో యాగశాల ఉంది. ఉత్తరదిశలో కల్యాణకట్ట, భక్తులు బస చేసేందుకు వీలుగా వసతిగృహం ఉన్నాయి, ప్రస్తుతం ఈ ఆలయంలో నిత్యం భక్తులకు అన్నదానం చేస్తున్నారు.

శ్రీవారిబ్రహ్మోత్సవాలు జ్యేష్ఠశుద్ధదశమినాడు ప్రారం భమై ఐదురోజులు అత్యంత వైభవంగా జరుగుతాయి. అందులో ఏకాదశినాడు శ్రీవారితిరుకల్యాణమహోత్సవం కన్నుల పండువుగా, రమణీయంగా జరుగుతుంది.

## గ్రంథసమీక్ష

# భక్త జనపూజితం!

**రచన:** తాటి జగన్నాథం, **సైజు:** 1/8 డెమ్మి సైజు; **పుటలు:** 78; **వెల:** రూ.50/-; **ప్రాప్తిస్థానం:** తాటి జగన్నాథం, ప్లాట్ నెం.21-59/2/1, హెచ్.ఎం.డి.ఏ. జోనల్ ఆఫీసు వెనుక, హుడా కాలనీ, శంషాబాద్ - 501 218. రంగారెడ్డి జిల్లా ఫోన్ - 08413 - 222094.

ఈ 'భక్తజనపూజితా!' అనే గ్రంథం ఆధ్యాత్మిక గేయసంకలనం. పద్యం ఒక శిఖరం అయితే గేయం ఒకప్రవాహం. ఈ గ్రంథంలో పద్యాలూ ఉన్నాయి, గేయాలూ ఉన్నాయి. అన్నీ భక్తిని ప్రబోధించేవే. ఇందులో వివిధ దేవతాప్రార్థనలను గేయాల్లోకి వ్రాశారు - రచయిత తాటి జగన్నాథంగారు.

మూలశ్లోకభావం పొల్లుపోకుండా అర్థభావ గాంభీర్యం సౌందర్యం దెబ్బతినకుండా అలతి అలతి పదాలతో చక్కనిఖండికలుగా వ్రాశారు. ఇవి సంస్కృత పరిజ్ఞానం లేనిపాఠకులకు ఎంతగానో తోడ్పడతాయి. 'శ్రీరఘురామ! నేరము లెంచక నేరుగ ముక్తి నొసంగుమయా' అంటూ భక్తునికోర్కెను భగవంతునిసన్నిధికి తీసుకొని పోతాడు. ఇది భక్తిరసప్రధానకావ్యం. భక్తిరసానికి ఆలంబనవిభావములు భగవంతుడు, ఆ భగవంతుని చరిత్రలు, భగవదాకారచిత్తవృత్తి, స్థాయీభావము, భగవదా సక్తి, ఆర్తి మొదలగు గుణా లన్నీ ఈ కావ్యంలో ఉన్నాయి.

సత్సంప్రదాయపద్ధతిలో వినాయకప్రార్థనతో కృతిని ప్రారంభించాడు. ఇంకా సర్వదేవతాప్రార్థన శ్లోకాలను ఇందులో చేర్చి, భక్తిప్రాముఖ్యాన్ని గ్రంథవిశిష్టతను ఇనుమడింపజేశాడు. భక్తు లందరికీ ఇది ప్రార్థనా సమయంలో కరదీపికగా ఉంటుంది. గీతాలు ఎక్కువగా శ్రీ వేంకటేశ్వరస్వామిపరంగా ఉన్నా, వివిధదేవీదేవపరమైన గీతాలూ ఉన్నాయి. భజనసంప్రదాయనిష్ఠ కలిగిన భక్తులకు ఈ గ్రంథం ఎంతో ఉపకరిస్తుంది. ఆయా దేవతలు కొలువైన ప్రదేశాలనుకూడా ఈ గ్రంథంలో పాదసూచికల్లో ఇవ్వడం జరిగింది. శ్రీ వేంకటేశ్వరస్వామివారిముఖచిత్రంతో గ్రంథం చాలా ఆకర్షణీయంగా ఉంది.

*- కె.ఆర్.శ్వేత.*

# శ్రీరామామృతం

**రచయిత:** డా॥పగడాలనారాయణ, **సైజు:** 1/8 డెమ్మి; **పుటలు:** 164; **వెల:** రూ.60/-; **ప్రతులకు:** పి.సంధ్య, డా॥పి.నారాయణ, ఇ.నెం.18-4-150, రైల్వేకాలనీ ఎక్స్టెన్షన్, 5వ క్రాస్, తిరుపతి. సెల్-99662 96366.

శ్రీరామ అనే పేరు ఎంత మహిమాన్వితమైందో తెలియజెప్పటానికి రామాయణంమీద వచ్చిన వివిధ గ్రంథాలే నిదర్శనం. తెలుగులో దాదాపు 175 రామాయణ పద్యకావ్యాలు వచ్చినట్లు పరిశోధకులు చెబుతున్నారు. ఎందరో కవులు ఆదికవి వాల్మీకిరామాయణం ఆధారంగా శ్రీరామునిగుణగణాలను వ్యాఖ్యానించారు. ఆ కోవలోనే డా॥పగడాలనారాయణగారు 'శ్రీరామామృతం' అనే గ్రంథాన్ని రచించి పాఠకులకు అమృతాన్ని పంచారు. అయితే రచయిత ప్రతిభాముద్ర అడుగడుగునా ఇందులో కనిపిస్తుంది. శ్రీరామచరిత నిత్యనూతనమైంది. అదే అమృతత్త్వ మంటే! అలనాటి రాముడే ఇలనాటి వేంకట రాముడుగా సుప్రభాత మంగళాశాసనా లందుకుంటున్నాడనే విషయాన్ని ఈ గ్రంథం వివరిస్తున్నది. ఇందులో వాల్మీకి చరితం, రామాయణఆవిర్భావం, ఏడుకొండల నామౌచిత్యం, శ్రీరామనామమహిమ, నారదునిగుణగణాలు, శ్రీరామ జననం, శ్రీరామసౌందర్యం, వాల్మీకి వర్ణించినరాముని గుణాలు, అయోధ్యావాసులు వర్ణించినరామునిగుణాలు వంటి అంశాలు సవివరంగా వివరించబడ్డాయి. సందర్భాను సారంగా అక్కడక్కడ మూలశ్లోకాలు ఇవ్వబడ్డాయి.

పరిశోధకులైన నారాయణగారు ప్రతిఅంశాన్ని చక్కనిప్రయాణాలతో సశాస్త్రీయపద్ధతిలో విశ్లేషించారు. మూలాన్ని ప్రామాణికంగా తీసికొని ఆయా అంశాలను సమగ్రంగా వివరించారు. ఈ గ్రంథం చదివితే శ్రీరాముని స్వరూపస్వభావాలు మన కళ్లముందు సాక్షాత్కరిస్తాయి. శ్రీరామునిఆత్మతత్త్వచిత్రణే గాకుండా ఆ అవతారపురుషుని గుణగణాలను చిత్రించాడు. ఈ గ్రంథం రాశిలో చిన్నదిగా కనిపించినా, వాసిలో మిన్నగా ఉంది. రచయిత ప్రతిభా పాటవాలు అడుగడుగునా మనకు ఇందులో కనిపించటమే గాక రామభక్తిరసామృతం తన్మయులను చేస్తుంది.

*- ఎస్.ప్రకాష్.*



శ్రీమాన్ పురిశై శ్రీరంగాచార్యస్వామివారిచే ప్రణీతమైన

# శ్రీలక్ష్మీగద్యమ్

06

"శ్రీచరణపరిచరణ" వ్యాఖ్య  వ్యాఖ్యాత - డా॥ ఈ.ఏ.శింగరాచార్యులు

ఇచటి వృత్తాంతము, ఆ పిమ్మట గల రెండు సంబోధన లలోని వృత్తాంతములును ఇంతకు ముందుగనే శ్లోకవ్యాఖ్యలో ప్రస్తావింపబడినవి. **"భాగధేయగురు"** అను విశేషణము అనంతా ర్యులు శ్రీవేంకటేశ్వరునకు నిత్యము పుష్పమాలికా సమర్పణ కైంకర్యభాగధేయమును, ఆచార్యాజ్ఞానిర్వహణ భాగధేయమును పొందుటను సూచించును.

**5. శ్రీవేంకటనాథవరపరిగృహీతే !**

శ్రీవేంకటనాథ వర = శ్రీనివాసు దనువరునిచే, పరి గృహీతే= పరిగ్రహింపబడినదానా !

**6. శ్రీవేంకటనాథతాతభూత శ్రీశైలపూర్ణగురు గృహస్నుషా భూతే !**

శ్రీవేంకటనాథ = శ్రీవేంకటేశ్వరునకు, తాతభూత = తండ్రియైన, శ్రీశైలపూర్ణగురుగృహ = శ్రీశైలపూర్ణులను ఆచార్యుల ఇంట, స్నుషాభూతే = కోడలుగా అయినదానా !

**7. అకుంఠవైకుంఠ మహావిభూతినాయకి !**

ఎట్టి అవరోధము లేని వైకుంఠనగరములోని దివ్య విభూతికి నాయకీ !

**8. అఖిలాండకోటి బ్రహ్మాండనాయకి !**

సమస్తములైన కోట్లాది బ్రహ్మాండములకు నాయకీ !

**9. శ్రీవేంకటనాయకి !**

శ్రీవేంకటేశ్వరుని నాయకీ!

**10. శ్రీమతి ! పద్మావతి !**

శ్రీమతీ ! పద్మావతీ !

**11. జయ ! విజయీ భవ !**

సర్వోత్కర్షతో వెలుగుము, విజయమును పొందుము.

**4.** శ్రీశైలే కేళికాలే మునిసముపగమే యా భయాత్ ప్రాక్ ప్రయాతా
తస్యైవోపత్యకాయాం తదను శుకపురే పద్మకాసారమధ్యే ।
ప్రాదుర్భూతాऽరవిందే వికచదలచయే పత్యురుగ్రైస్తపోభిః
సేయం శ్రీవేంకటాద్రిప్రభువరమహిషీ భాతు పద్మావతీ శ్రీః ॥

శ్రీశైలే = శ్రీశైల మనబడు వేంకటాచలములో, కేళికాలే = లీలావిహారసమయ మున, మునిసముపగమే = మునులు రాగా, యా = ఏ పద్మావతీదేవి, ప్రాక్ = పూర్వము, భయాత్ = భయమువలన, ప్రయాతా = వెడలినదో, (ఆ పద్మావతీ దేవియే) తదను = పిమ్మట, తస్య = ఆ వేంకటాచలముయొక్క, ఉపత్యకాయామ్ ఏవ = పాదమూలప్రదేశమునందు గల, శుకపురే = శ్రీశుకపురమందు (తిరుచానూరులోని), పద్మకాసార మధ్యే = పద్మసరస్సుమధ్యలో, వికచదళచయే = వికసించిన రేకుల సమూహమును కల,అరవిందే=పద్మమునందు, పత్యుః= భర్తయగు శ్రీనివాసునియొక్క, ఉగ్రైః = తీవ్రములైన, తపోభిః = తపస్సుల కారణముచే, ప్రాదుర్భూతా = అవతరించి నదో, సా ఇయం = అట్టి, ఈ, శ్రీవేంకటాద్రి ప్రభువరమహిషీ= శ్రీవేంకటేశ్వరుని పట్టమహిషి, శ్రీః = లక్ష్మీదేవియు అగు, పద్మావతీ = పద్మావతీ దేవి, భాతు = ప్రకాశించుగాక!

పూర్వము ఒకానొక సమయమున పద్మావతీ శ్రీనివాసులు లీలావిహారములు సల్పు సమయమున మునులు అచటకు వచ్చిరి. వారి రాకతో అచటినుండి తొలగిపోయిన పద్మావతీదేవి శ్రీశుకపురిలోని పద్మసరస్సులోని వికసించిన తామరపూవులో స్వామి చేసిన గొప్ప తపఃఫలితముగా అవతరించెను. అట్టి,

శ్రీవేంకటేశ్వరుని పట్టమహిషి, లక్ష్మీరూపిణియగు పద్మావతీదేవి ప్రకాశించుగాక!

ఇందు ప్రస్తుతింపబడిన వృత్తాంతముయొక్క ఆకరము పెద్దలవలన తెలియనగును.

**1. భద్రే ! =** మంగళరూపిణీ !

లక్ష్మీదేవియొక్క మంగళాత్మకత్వమును కూరేశులు శ్రీస్తుతి అను లక్ష్మీ స్తుతిలో వర్ణించుచు పల్కిన **"ఐశ్వర్యం యదశేషపుంసి విదితం సౌందర్య లావణ్యయోః రూపం యచ్చ హి మంగళం కిమపి యల్లోకే సదిత్యుచ్యతే, తత్సర్వం త్వదధీనమేవ యదతః శ్రీరిత్యభేదేన వా యద్వా శ్రీమదితీదృశేన వచసా దేవి! ప్రథా మశ్నుతే"** (లక్ష్మీదేవీ! పురుషులందరిలో ప్రసిద్ధమైన ఐశ్వర్యము, మంగళముగా లోకములో మంచిది అని చెప్పబడిన సౌంద ర్యముయొక్క, లావణ్యముయొక్కరూపము అంతయు నీ అధీ నములో నున్నవే! ఎందువలన అనగా, శ్రీ, శ్రీమత్ అను పదముల ప్రయోగముద్వారా అవి ప్రసిద్ధిని పొందుచున్నవి కదా !) ఇత్యాదిశ్లోకము స్మరణీయము.

**2. భక్తజనావననిర్నిద్రే!**

భక్తులను రక్షించుటలో నిద్రలేనిదానా! జాగరూకురాలా! (ఆలస్యము చేయనిదానా ! అని తాత్పర్యము)

**3. భగవద్దక్షిణ వక్షోలక్షణ లాక్షాలక్షిత మృదుపదముద్రే !**

భగవద్దక్షిణవక్షః= భగవానుని వక్షఃస్థలముయొక్క దక్షిణ భాగమున – కుడివైపున, లక్షణ= గుర్తుగానున్న, లాక్షాలక్షిత= లత్తుకచే ముద్రింపబడిన, మృదుపదముద్రే = మృదువైన తనయొక్క పదముల ముద్రలను కల్గినదానా!

**"లక్ష్మీచరణలాక్షాంకసాక్షి శ్రీవత్సవక్షసే",** (లక్ష్మీదేవి శ్రీచరణములలో అలంకరింపబడిన లత్తుకయొక్క ముద్రలకు సాక్షీభూతమైన శ్రీవత్సమును పుట్టుమచ్చను వక్షఃస్థమున కల వానికి)**"లక్ష్మీపదలాక్షైకలక్షణమ్"** ఇత్యాదిసూక్తులు స్మరణీ యములు.

**4. భంజితభవ్యనవ్య దరదలిత దలమృదుల కోకనదమద విలసదధరోర్ధ్వ విన్యాస సవ్యాపసవ్యకర విరాజదనితర శరణభక్తగణనిజచరణ శరణీకరణాభయ వితరణ నిపుణ నిరూపణ నిర్నిద్రముద్రే !**

భంజిత = భగ్నము చేయబడిన, భవ్య = అందమైన, నవ్య = నూతనమైన, దర దలిత దల = కొంచెము వికసించిన దళములను కల, మృదుల = మృదువైన, కోకనద = రక్తోత్పలముయొక్క మద = మదమును కల్గిన(ఎఱ్ఱతామర గర్వమును అణచిన), విలసత్ = ప్రకాశించుచున్న, అధర = క్రింది, ఊర్ధ్వ = పైదిశలో, విన్యాస = స్థితిని కల, సవ్య+ అపసవ్య = కుడివైపు, ఎడమవైపులలోని, కర = చేతులయందు, విరాజత్ = ప్రకాశించుచున్న, అనితర శరణ భక్తగణ = (దివ్య దంపతులకంటె) వేఱు శరణము లేని భక్తుల సమూహామునకు, నిజచరణ = తన చరణములను, శరణీకరణ = శరణముగా చేయుటలోను, అభయ వితరణ=అభయప్రదానమును చేయుట లోను, నిపుణ = సమర్థయగుటను, నిరూపణ = నిరూపించు, నిర్నిద్రముద్రే= వికసించిన (పూవుయొక్క) ముద్రను కల్గినదానా!

పద్మావతీదేవి ఇరువైపులలో గల హస్తములు ఎఱ్ఱనివై, అపుడే వికసించు ఎఱ్ఱ తామరల మదమును అణచునవియై యున్నవి. కుడిఎడమలలో గల ఆ హస్తములలో ఒకటి అభయ ప్రదానమును చేయు ముద్రతోను, వేఱొకటి అనన్యభక్తితో తనను ఆరాధించు భక్తులకు తన చరణములు శరణమనుటను తెలుపు ముద్రతోను ఉన్నవి. క్రిందకు, పైకి చాచబడియున్న ఈ రెండు హస్తములు వికసించిన పూవువలె శోభిల్లుచున్నవి.

**"మత్పాదౌ శరణం వ్రజేతి"** (నా రెండు పాదములను శరణు పొందుము) అను రీతిలో తన పాదములే శరణ మను టను స్వామి హస్తము భక్తులకు తెలుపునట్లే, పద్మావతీదేవి వామహస్తము ఆమె పాదములే శరణ మని బోధించుచున్నది. కుడిచేయి అభయప్రదానమును చేయుచున్నది. పద్మావతీదేవిని పురుషకారముకొఱకు శరణాగతిని చేయుట శాస్త్రసమ్మతము. **"లక్ష్మీః పురుషకారత్వేన నిర్దిష్టా పరమర్షిభిః"** (గొప్ప ఋషులు లక్ష్మీదేవిని పురుషకారస్వరూపిణిగా నిర్వచించిరి) ఇత్యాది సూక్తులు ఇందులకు ప్రమాణము. కావున భగవానుని సర్వశేషి త్వమునకు, సర్వశరణ్యత్వమునకు కొదువవలే దని చెప్పనగును. కావున ఇచట కవి పద్మావతీదేవిని శరణు వేడుట పురుషకారా ర్థమే నని తెలియనగును.

***(ఇంకా ఉంది)***



బాలప్రబోధం

# త్యాగరాజస్వామి

డా॥కొణిదలశోభ

***'నిధి చాలసుఖమా, దైవసన్నిధి చాలసుఖమా'*** – అంటూ రాజాస్థానాన్ని, రాజాశ్రయాన్ని తిరస్కరించినవాడూ– ***'రామభక్తిసామ్రాజ్య మేమానవుల కబ్బెనో, ఆ మానవుల సందర్శన మత్యంతబ్రహ్మానందమే'*** అంటూ పరవశించినవాడూ– తెలుగుభాషలోని సొగసులతో కీర్తనలు వ్రాసి, తెలుగుభాష గానానికి అనుకూల మైనభాష అని నిరూపించినవాడూ – కాకర్ల త్యాగరాజు.

విజయనగరసామ్రాజ్యపతనానంతరం ఆంధ్రదేశంలో శాంతిభద్రతలు కరవై, తమసాహితీసంస్కృతులకు ఆదరణ కరవై, తెలుగుదేశంనుంచి దక్షిణప్రాంతానికి వలసవచ్చినఅనేక కుటుంబాలలో త్యాగరాజుపూర్వీకుల కుటుంబంకూడా ఒకటి. ఆ కుటుంబానికి చెందినరామబ్రహ్మం, సీతమ్మదంపతులకు జన్మించినత్యాగరాజు – 'పూవు పుట్టగానే పరిమళిస్తుంది' అన్నట్లు చిన్నప్పటి నుంచి విద్యాసంస్కారసంపన్నుడై ప్రకాశించేవాడు. ఆడుకునే వయసులోనే సంస్కృతాంధ్రాలలో విద్వాంసుడైన తన తండ్రిద్వారా రామనామోపదేశాన్ని, తల్లిద్వారా జయదేవునిఅష్టపదులు; పురందరదాసు, రామదాసువంటి మహనీయుల కీర్తనలు నేర్చుకున్నాడు. తిరువైయూరులో మహారాజుచేత స్థాపించబడిన సంస్కృతపాఠశాలలో సంస్కృత శాస్త్ర, సాహిత్యాలను అభ్యసించాడు. ప్రతిరోజు పూజా సమయంలో తన తండ్రిచేసే మధురగానాన్ని ఆలకించి, స్వయంగా దివ్యనామసంకీర్తనలు వ్రాసి తానుకూడా పాడేవాడు. తండ్రిప్రోత్సాహంతో– తంజావూరు మహారాజువారి ఆస్థాన విద్వాంసులు శొంఠి వెంకటరమణయ్యగారి శిష్యత్వంలో ఏక సంధాగ్రాహియై గొప్పసంగీతజ్ఞానాన్ని సంపాదించాడు. తరువాత రామకృష్ణానందస్వామి నారదమంత్రోపదేశం చేసి, త్యాగరాజుచేత ఉపాసన చేయించగా – నారదుడు ప్రత్యక్షమై అనుగ్రహించాడట!

త్యాగరాజు సంగీతంలో పేరుప్రఖ్యాతులు గడించేకొద్దీ – ఇతరపండిత, గాయకులలాగా రాజాశ్రయాన్ని సంపాదించి, ప్రాభవంతో జీవితంగడపక దారిద్ర్యం అనుభవించడం ఆయన అన్నకు నచ్చలేదు. అనేకవిధాలుగా తమ్మునికి నచ్చచెప్పే ప్రయత్నం చేశాడు. కానీ త్యాగరాజు ఎవరు చెప్పినా, ఎందరు పరిహసించినా, మరెందరు అధిక్షేపించినా అంతకంతకు దృఢ వ్రతంతో భక్తిపరాయణు డవుతుండేవాడు. శిష్యులు వెంటరాగా ప్రతిరోజు నగరవీధులలో దివ్యనామసంకీర్తనలు పాడుతూ, తన సంగీతంతో అందరినీ ముగ్ధులను చేస్తూ, వారిహృదయాలను భక్తిపూరితాలు చేసేవాడు. పరమభక్తుడైనత్యాగరాజు తనభక్తి సాధనకు తీర్థయాత్రలు ముఖ్య మని భావించపోయినా– ఎక్కడెక్కడో ఉన్న తనశిష్యులకోరికను, అభిమానులఆహ్వానాన్ని మన్నించి, తీర్థయాత్రలు చేయడానికి పూనుకున్నాడు. తనను





## జయ.... జయ..... హనుమంత...!!

చూచితివట అట సీతమ్మను
చూపితివట శ్రీరాముని ఆనవాలు
కలయచూచితివట లంకను
ఇల చూపితివట నీ విశ్వరూపము
చూచితివట అణువుగా రావణుని
చూపితివట నీ శక్తిని, లంకకు, లంకేశునకు
చూపితివట నీయందు రామదర్శనము

దాచితివట సీతారాముల నీ యెదను
పల్కునట నీ రోమరోమము రామనామమే
కల్గునట రామ రామ యన నీ కభిమానము

తెచ్చితివట అమృతవాక్కు సీతమ్మ సేమము
తెచ్చితివట వృక్షసంజీవనివనము
ఇచ్చితివట రామునికి సీతమ్మ ఆనవాలు
ఇచ్చితివట లక్ష్మణునకు పునర్జన్మ!

*నందగిరి శ్రీనివాసరావు*

ఆహ్వానించిన శిష్యుల దగ్గరకు వెళ్ళి, అక్కడ కొంతకాలముండి ఆ చుట్టుపక్కల ఉన్నపుణ్యక్షేత్రాలను దర్శించి, ఆ యా క్షేత్రాలలో వెలసిన భగవంతునిమీద కీర్తనలు వ్రాసి పాడేవాడు.

'ఉదారచరితానాంతు వసుధైవ కుటుంబకమ్' అంటారు. కాబట్టే మహాత్ములకు తా మొక్కరే కాక–లోకమంతా తరించా లన్న ఆకాంక్ష కలుగుతుంది. అదేవిధంగానే త్యాగరాజు కూడా సంగీతజ్ఞానంతో తాను తరించడమేకాక, తనను ఆశ్రయించిన సంగీతాభిమానులనుకూడా తరింపచేయాలన్న మహాశయంతో వారందరికీ ఉత్తమశిక్షణ నిచ్చాడు. ఇతనిశిక్షణలో, శిష్యత్వంలో తమజ్ఞానానికి మెరుగులుదిద్దుకున్నారు. ఎందరో త్యాగరాజుచేత శిక్షితులై, వందలకొద్దికీర్తనలునేర్చుకుని, త్యాగరాజువిశిష్టగానసంప్రదాయం నేటికీ ప్రచారంలో ఉండడానికి కారకు లయ్యారు. ఈ విధంగా గానకళలో తనప్రత్యేక సంప్రదాయం తనతోనే ఆగిపోకుండా అందులో పలువురికి శిక్షణ నిచ్చి ఆ సంప్రదాయాన్ని స్థిరస్థాయిగా నిలిపినవాడు– త్యాగయ్య.

త్యాగరాజుజీవితం, భక్తి, సంగీతసాహిత్యాలకు నిలయం. "రామునిపై తనకు ప్రేమ పోదు. భోగానుభవంబులందు బాగుగా బుద్ధి నీయదు" అంటూ భక్తికి ఫలంగా భక్తిని కాకుండా– కేవలం ముక్తినిమాత్రమే కోరుకున్నాడు. భగవద్భక్తి ముందు రాజ్యవైభవాలు తృణప్రాయా లని తన జీవితాన్నే ప్రత్యక్ష సాక్ష్యంగా ప్రదర్శించాడు. "ఊరకయే గల్గునా రామునిభక్తి సారెకును సంసారమున జొచ్చి– సార మని యెంచువారి మనసున" అని సంసారవ్యామోహం కలవాళ్ళకు రామభక్తి సాధ్యం కాదంటూ స్వచ్ఛమైన, నిర్మలమైనభక్తి, భగవంతునిపట్ల ఎనలేని నమ్మకం, వినయం తదితరగుణాలతో భగవంతుణ్ణి కీర్తిస్తూ తరించవచ్చని త్యాగయ్య బోధించాడు.

నారదుడు తులసీదాసు, పురందరదాసు, రామదాసు, జయదేవుడు, తుకారం, నారాయణతీర్థులులాంటి మహనీయుల మార్గంలో పయనిస్తూ, అమృతగానాన్ని ప్రవహింపజేసి, భక్తిని వండించి, ప్రజలహృదయాల్లో శాశ్వతస్థానాన్ని సంపాదించి, అందరికీ మార్గదర్శకు డయ్యాడు – త్యాగయ్య.

## వైభవంగా శ్రీవారి ఉగాదిఆస్థానం

తిరుమల శ్రీవారిఆలయంలో ఉగాదిఆస్థానం 2013, ఏప్రిల్ 12న వైభవంగా జరిగింది. శ్రీ విజయనామసంవత్సరాన్ని స్వాగతిస్తూ శ్రీవారిఆలయాన్ని సర్వాంగసుందరంగా తీర్చదిద్దారు. ఉగాది పండుగనుంచే తిరుమలేశుని ఆలయవార్షిక కార్య క్రమాలు, ఉత్సవాలు ప్రారంభమవుతాయి. స్వామివారికి సుప్ర భాతం, తోమాల, అర్చనసేవల అనంతరం శ్రీదేవీ, భూదేవీ సమేత శ్రీమలయప్పస్వామి, శ్రీవారిసేనాధిపతి విష్వక్సేనులవారికి ఏకాం తంగా తిరుమంజనం నిర్వహించారు. స్వామివారికి పట్టువస్త్రా లను పెద్దజీయర్‌స్వామి ఊరేగింపుగా తీసుకెళ్లి సన్నిధిలో అర్చ కులకు అప్పగించారు. మూలవిరాట్టుకు, ఉత్సవమూర్తులకు నూతనవస్త్రాలను అలంకరించారు. అనంతరం శ్రీవారికిఆస్థానం జరిగింది. స్వామివారిపాదాలపై ఉంచిన పంచాంగాన్ని తీసుకుని ఆస్థానసిద్ధాంతి నూతనపంచాంగ శ్రవణం చేశారు. ఉగాదిరోజున స్వామి దర్శనంకోసం వేలాదిగా భక్తులు తరలి వచ్చారు. సాయంకాలం పురవీథుల్లో శ్రీదేవీ, భూదేవీ సమేతంగా శ్రీమలయప్పస్వామి ఊరేగుతూ భక్తులకు నూతన సంవత్సర ఆశీస్సులతో, దివ్యదర్శనంతో భక్తు లను అనుగ్రహించారు. ఉగాది ఆస్థానంలో రాష్ట్రమంత్రులు శ్రీమతి గల్లాఅరుణకుమారి, శ్రీ పితాని సత్యనారాయణ, తి.తి. దేవస్థానం కార్యనిర్వహణాధి కారి శ్రీ ఎల్.వి.సుబ్రహ్మణ్యం, ఐ.ఏ.ఎస్., దంపతులు, తిరుపతి సంయుక్తకార్యనిర్వహణాధికారి శ్రీ వెంకట్రామిరెడ్డి, ఐ.ఏ.ఎస్., సీ.వీ.&ఎస్.ఓ. శ్రీ అశోక్‌కుమార్ పాల్గొన్నారు.

## వార్తాలహరి

## సంప్రదాయాల పరిరక్షణకే 'సదాచారం'

ఆధునిక సమాజంలో సంప్రదాయపద్ధతుల పరిరక్షణకు 'సదాచారం' కార్యక్రమాన్ని చేపట్టా మని తి.తి.దే.కార్యనిర్వ హణాధికారి శ్రీ ఎల్.వి.సుబ్రహ్మణ్యం, ఐ.ఏ.ఎస్., పేర్కొన్నారు. తిరుపతి మహతిలో 28-03-2013న జరిగిన 'సదాచారం' విజయోత్సవసభలో ఆయన నేటి అలవాట్లు, ఆచరణపద్ధతులు విద్యార్థుల భవిష్యత్తుపై ప్రభావం చూపిస్తాయన్నారు. అందుకనే చదువుకునే సమయంలో మంచి నడవడిక, సంప్రదాయాలు, పెద్దలపట్ల గౌరవం, సంస్కృతి పరిరక్షణ అంశాలను నేర్పిస్తే ఉన్నతస్థాయికి చేరుకోగల రని అభిప్రాయపడ్డారు. ఈ ఉద్దేశంతో 2012 గాంధీజయంతిరోజున తిరుపతిలోని తి.తి.దే.పాఠ శాలల్లో ఈ కార్యక్రమం చేపట్టా మన్నారు. ఇందులోని 12 అంశాలను పాఠ్యాంశాలుగా చేర్చా లనే విషయమై త్వరలో నిర్ణయం తీసుకుంటా మన్నారు. 'సదాచారాన్ని' సదాఆచరిస్తా మంటూ విద్యార్థులచేత కార్యనిర్వహణాధి కారి శ్రీ ఎల్.వి.సుబ్రహ్మణ్యం, ఐ.ఏ.ఎస్., ప్రమాణం చేయిం చారు. ఈ కార్యక్రమంలో తి.తి.దే. సంయుక్త కార్యనిర్వహణాధి కారి శ్రీ వెంకట్రామిరెడ్డి, ఐ.ఏ.ఎస్., తి.తి.దే. హిందూధర్మ ప్రచారపరిషత్తు కార్యదర్శి ఆచార్య కసిరెడ్డి వెంకటరెడ్డి, ప్రత్యేకాధి కారి శ్రీరాం రఘునాథ్, డా॥సముద్రాలలక్ష్మణయ్య, డా॥పమిడి కాల్వచెంచుసుబ్బయ్య తదితరులు సదాచారం విశిష్టతలు, ప్రయో జనాలను వివరించారు. ప్రతిభచూపిన విద్యార్థులకు బహు మతులు అందజేశారు.



## డి.కే.ఆదికేశవులు ఇక లేరు

తిరుమల తిరుపతి దేవస్థానం పాలకమండలి మాజీ అధ్యక్షులు, మాజీ పార్లమెంటు సభ్యులు, ప్రముఖ పారిశ్రామికవేత్త అయిన డి.కే.ఆదికేశవులు 24-04-2013న తీవ్రఅనారోగ్యంతో బెంగుళూరులో వైకుంఠప్రాప్తి పొందారు. వీరు తి.తి.దే.పాలకమండలిఅధ్యక్షులుగా రెండుసార్లు వ్యవహరించారు. వీరు తి.తి.దే.పాలకమండలి అధ్యక్షులుగా ఉన్న సమయంలో ఎన్నో విరాళాలు, కానుకలు శ్రీవారికి సమర్పించారు. వీరిస్ఫూర్తితో ఎంతోమంది దాతలు ముందుకు వచ్చి శ్రీవారికి భూరివిరాళాలు సమర్పించారు. తి.తి.దే.పాలనలో వీరిముద్ర చెరిగిపోని దని, భావితరాలకు స్ఫూర్తిదాయక మని తి.తి.దే.పాలకమండలి అధ్యక్షులు శ్రీ కనుమూరిబాపిరాజు, కార్యనిర్వహణాధికారి శ్రీ ఎల్.వి.సుబ్రహ్మణ్యం, ఐ.ఏ.ఎస్., ఘననివాళు లర్పించారు. వీరి పవిత్రఆత్మకు శాంతి చేకూరా లని ఆ దేవదేవుణ్ణి **'సప్తగిరి'** ప్రార్థిస్తున్నది.

ఈ కూపను కత్తరించండి

# తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి

# సప్తగిరి



(ఆధ్యాత్మిక మాసపత్రిక)

## చందా నమోదు పత్రం

1. పేరు మరియు చిరునామా :
   (విడి విడి అక్షరాలలో అర్థమయ్యేలా వ్రాయండి. మరియు పిన్‌కోడ్ తప్పక వ్రాయండి)

   (పిన్‌కోడ్ తప్పని సరి)

2. కావలసిన భాష : ☐ తెలుగు ☐ తమిళం ☐ కన్నడం ☐ హిందీ ☐ ఇంగ్లీషు

3. సంవత్సర/జీవిత చందా : ☐ రూ. 60/- ☐ రూ. 500/-

4. చందా పునరుద్ధరణ :
   (అ) చందా నెంబరు :
   (ఆ) భాష :

5. చెల్లించిన మొత్తం :
   డి.డి.నెం. : తేది :
   (చెక్కులు స్వీకరించబడవు)

ప్రదేశం :

తేది : చందాదారుని సంతకం

## మోసపోకండి !

మన రాష్ట్రంలోని కొన్ని నగరాలలో కొందరు వ్యక్తులు అనధికారికంగా **సప్తగిరి మాసపత్రికకు** చందాల రూపంలో అధిక మొత్తాలు వసూలు చేస్తున్నారని, తద్వారా శ్రీవారి దర్శనం చేయిస్తా మని, నమ్మిస్తున్నా రని తెలిసింది. అలాంటివారిమాటలకు మోసపోకండి. సప్తగిరి చందాకు, శ్రీవారి దర్శనానికి మరియు ప్రసాదాలకు ఎటువంటి సంబంధం లేదు. చందా మీరు నేరుగా "ప్రధాన సంపాదకుడు, సప్తగిరి, తి.తి.దేవస్థానం, తిరుపతి" వారికి పంపించాలి. (లేదా) తిరుపతిలోని శ్రీనివాసం యాత్రికుల వసతి సముదాయంలో కూడా మీచందాలను కట్టవచ్చు. సప్తగిరికి చందాలు వసూలు చేయుటకు దేవస్థానం బయటి వ్యక్తులను ఎవరినీ నియమించలేదు.

**అధిక మొత్తాలు చెల్లించకండి!**
**వారి మాటలకు మోసపోకండి!!**

సంప్రదించండి...!
సప్తగిరి చందాల విచారణకు
**0877 - 2264359**
**0877 - 2264543**

- సప్తగిరి సంవత్సర చందా రూ.60/-, జీవితచందా రూ.500/-లు; డి.డి. / ఎం.ఓ. ని **'చీఫ్ ఎడిటర్, 'సప్తగిరి', తి.తి.దే., తిరుపతి'** వారి పేరున తీయాలి.
- సప్తగిరిచందాదారులుగా చేరదలచుకొన్నవారు/ తమచందాను పునరుద్ధరించుకోదలచినవారు ఈ కూపనులో గానీ లేక తెల్లకాగితంలోగానీ పైన పేర్కొన్నవిధంగా వివరాలు వ్రాసి, పంపవచ్చు. క్రింద ప్రచురించిన చిరునామానుమాత్రమే సంప్రదించండి. **తి.తి.దే. ప్రధాన సంపాదక కార్యాలయం, తిరుపతికి తప్ప-మీరు ఎవరిదగ్గర డబ్బులు కట్టి, మోసపోకండి.**
- మనిఆర్డరు పంపేవారు అందులోనే మీయొక్క చందావివరాలు వ్రాసి, ఈ క్రింది చిరునామాకు పంపాలి.
- మా చిరునామా **"ప్రధానసంపాదకుడు, సప్తగిరి కార్యాలయం, టి.టి.డి.ప్రెస్ కాంపౌండ్, కె.టి.రోడ్డు, తిరుపతి - 517 507".**

Edited and published on behalf of T.T. Devasthanams by **Dr. C. Saila Kumar,** M.A.,Ph.D., Chief Editor, T.T.D. and printed at T.T.D. Press by **V. Sambasiva Rao,** D.P.T., Manager, T.T.D. Press, Tirupati - 517 507.

షోడశకళానిధికి షోడశోపచారములు
జాడతోడ నిచ్చలును సమర్పయామి

అలరు విశ్వాత్మకున కావాహన మిదె పర్వ
నిలయున కాసనము నెమ్మి నిదె
అల గంగాజనకున కర్ఘ్య పాద్యాచమనాలు
జలధిశాయికిని మజ్జన మిదె

వరపీతాంబరునకు వస్త్రాలంకార మిదె
సరి శ్రీమంతునకు భూషణము లివె
ధరణీధరునకు గంధపుష్పధూపములు
తిర మిదె కోటిసూర్యతేజునకు దీపము

అమృతమథనునకు నదివో నైవేద్యము
గమిఁ జంద్రనేత్రునకుఁ గప్రవిడెము
అమరిన శ్రీవేంకటాద్రి మీఁది దేవునికిఁ
దమితోఁ బ్రదక్షిణాలు దండములు నివిగో

(3 - 134)



ధ్యాన ఆవాహనాదులు పదహారు షోడశోపచారాలు. వీటితో షోడశకళా ప్రపూర్ణుడైన శ్రీవేంకటేశ్వరుణ్ణి అర్చించడం ఆగమసంప్రదాయం. ఈ సంకీర్తనలో అన్నమయ్య శ్రీహరికి సదాషోడశోపచారపూజ సమర్పిస్తున్నానని తెలియచేశాడు.

## ధన్యవాదాలు...!!

నేను చదివిన భాస్కరరామాయణము, కంకంటి పాపరాజు ఉత్తరరామచరిత్రము సంపూర్తిగా అనేకమార్లు పఠించాను. ఈ రెండు గ్రంథాల సారమంతా ఏప్రిల్ సప్తగిరి మాసపత్రికలో డా॥అప్పజోడు వేంకట సుబ్బయ్యగారు 'శ్రీరామచంద్రుడు' వ్యాసంలో తెలియ జేశారు. ఈ వ్యాసం పసిబాలుడికి అరటిపండు వొలిచి తినిపించినంత హాయిగా, సౌలభ్యంగా ఉండి పాఠకులను విశేషంగా ఆకర్షించింది. రచయితకు, సంపాదక సిబ్బందికి ధన్యవాదాలు.

*– పద్మశ్రీ జొన్నలగడ్డ గురప్ప, శ్రీకాళహస్తి.*

# మీ మాట

## మల్లెలపరిమళాలు

డా॥ సి.నారాయణరెడ్డిగారి 'మందార మకరందాలు' నందనవనంలో విరిసిన మల్లెల్లా పరిమళాలు వెదజల్లుతున్నాయి. అదే విధంగా డా॥ఈ.ఏ.శింగరాచార్యులు అందజేస్తున్న 'శ్రీలక్ష్మీగద్యమ్' వాఖ్యానం భక్తులకు ఎంతో ఉపయోగపడు తున్నది. మీకు కృతజ్ఞతలు.

*– ఆర్.గౌరీశంకర్, హైదరాబాదు.*

## ఆనందం.... పరమానందం

సప్తగిరిమాసపత్రిక మాకు తపాలాలో అందినరోజు మా మనస్సు పరమానంద భరితమౌతుంది. ముఖ్యంగా ధారా వాహికలు మమ్మల్ని విశేషంగా ఆకట్టుకుంటున్నాయి. 'తిరుమల ఆలయం' ఆ దేవదేవుని గురించి ఎన్నో చారిత్రక విశేషాలను తెలియజేస్తోంది.

*– కె.ఆర్.ఆర్.శ్రీనివాసరెడ్డి, తాడిపత్రి.*

## అభినందనలు

ప్రతినెల మీరు అందిస్తున్న 'శ్రీవేంక టేశ్వరలీలలు' శీర్షికను చదివితే కలిగే ఆనందాన్ని మాటలలో వర్ణించలేము. మాకే ఆ విధంగా జరిగి, ఆ స్వామి ఆ రూపంలో వచ్చి మమ్మల్ని కరుణించి, రక్షించినట్లుగా అనుభూతికి లోనవుతున్నాము. ఈ శీర్షికను నిరవధికంగా వేస్తున్న 'సప్తగిరి' యాజమాన్యానికి అభి నందనలు. దీనితో పాటు అన్ని శీర్షికలూ చాలా బాగు న్నాయి.

*– కె.ఎం.పి.శ్యామల, కర్నూలు.*

## ద్విగుణీకృతం

ప్రతినెలా సప్తగిరి పత్రిక ముఖచిత్రం చక్కగా కను విందు చేస్తోంది. ఆద్యంతం సర్వాంగసుందరంగా ఉంటోంది. ఈ పత్రిక తి.తి.దేవస్థానం మహోన్నతవైభవాన్ని ద్విగుణీ కృతం చేస్తోందనడంలో సందేహం లేదు.

*– కన్నయ్య, రాజమండ్రి.*

## ఆగష్టు నెలలో తి.తి.దే. ఉత్సవ విశేషాలు

**1 నుండి 4 వరకు –**
శ్రీకోదండరామస్వామివారి పవిత్రోత్సవాలు, తిరుపతి

**11 నుండి 13 వరకు –**
శ్రీపట్టాభిరామస్వామివారి పట్టాభిషేక మహోత్సవం, వాల్మీకిపురం

**13 –** మంగళగౌరీవ్రతం

**15 –** తరిగొండ వెంగమాంబ వర్ధంతి
– భారతస్వాతంత్ర్యదినోత్సవం

**16 –** వరలక్ష్మీవ్రతం

**16 నుండి 19 వరకు –**
శ్రీవేంకటేశ్వరస్వామివారి పవిత్రోత్సవాలు, తిరుమల

**18 నుండి 20 వరకు –**
శ్రీవేణుగోపాలస్వామివారి (తెప్ప) ప్లవోత్సవాలు, కార్వేటినగరం

**21 –** శ్రీహయగ్రీవజయంతి

**22 –** గాయత్రీజపం

**28 –** గోకులాష్టమి

వేంకటాద్రిసమం స్థానం బ్రహ్మాండే నాస్తి కించన,
వేంకటేశసమో దేవో న భూతో న భవిష్యతి.



**స్వీయలోపంబు లెఱుగుట పెద్దవిద్య..!!**


గౌరవ సంపాదకుడు :
ఎల్.వి. సుబ్రహ్మణ్యం, ఐ.ఏ.ఎస్.,
కార్యనిర్వహణాధికారి, తి.తి.దేవస్థానములు.

ప్రచురణకర్త-ప్రధాన సంపాదకుడు :
డా॥ సి.శైలకుమార్

సంపాదకుడు : డా॥ కె.రాధారమణ

ఉపసంపాదకుడు : డా॥ కె.రవిచంద్రన్

ముద్రాపకుడు : వి.సాంబశివరావు, డి.పి.టి., మేనేజరు, ముద్రణాలయం, తి.తి.దే.

డి.టి.పి. : ప్రధాన సంపాదకులవారి కార్యాలయం, తి.తి.దే., తిరుపతి

వర్ణచిత్రాల లే-అవుట్ : పి.శివప్రసాద్



***వివరాలకు :***
ప్రధాన సంపాదకుడు,
సప్తగిరి, తి.తి.దేవస్థానములు,
తిరుపతి - 517 507.
ఫోను : 0877-2264543, 2264359



సప్తగిరి మాస పత్రిక

విడి ప్రతి : రూ. 5/-
సం॥ చందా : రూ. 60/-
జీవిత చందా : రూ.500/-
విదేశాలకు సం॥చందా : రూ. 850/-


# సప్తగిరి

**తిరుమల తిరుపతి దేవస్థానముల సచిత్ర మాసపత్రిక**


**సంపుటి : 44 | జూలై, 2013 | సంచిక : 02**




**ముఖచిత్రం : ఉభయదేవేరులతో శ్రీవారు**
**చివరి పుట : ఆణివర ఆస్థానం**

*ఈ సంచికలోని రచయితల అభిప్రాయాలు వ్యక్తిగతమైనవి.*
*ప్రధానసంపాదకుడు గాని, తిరుమల తిరుపతి దేవస్థానం గాని వాటికి బాధ్యత వహించరు.*

సంపాదకీయం

# శ్రీమతే రామానుజాయ నమః

భగవద్రామానుజులు నడిచేభక్తి, పలికేశక్తి, సేవించే వ్యక్తి. ఆ మహాత్ముని ఆసక్తి సర్వజీవులూ భగవంతుణ్ణి ఆరాధించి, భాగవతుల్ని సేవించి శాశ్వతానందం పొందా లనేది. భగవదారాధనకు అవస్థాభేదాలు, ఆధారభేదాలు లేనేలే వని, అందరికీ అందుబాటులో ఉన్న ఆరాధన సగుణమే నని సర్వసమతావాదాన్ని సిద్ధాంతీకరించిన మహామనీషి–రామానుజులు. వారిబోధల్లో మానవులందరూ శ్రీరంగేశునిదయాపాత్రులు కావా లనీ, అందుకు భక్తిప్రపత్తులు మూలస్తంభా లనీ తద్వారా సర్వజీవ సమత్వం గోచరిస్తుం దనీ, పవిత్రజీవితగమనానికి ఆచార్యనిష్ఠ, భగవత్ప్రపత్తి తరణోపాయా లనీ స్పష్టం అవుతోంది.

సామాజికంగా వెలిగా ఉన్నవాళ్ళను సమాజస్రవంతిలోకి తీసుకునే ప్రయత్నం మొట్టమొదట రామానుజులవారే ప్రారంభించారు. గురువులు ఉపదేశించిన గోప్యమైన తిరుమంత్రాన్ని సర్వజనసంక్షేమం కోసం అందరూ తరించా లనే ఉద్దేశంతో గోపురసందేశంగా మార్చి రామానుజులవారి విశాలఔదార్యం వర్ణింపరానిది.

ఆలయనిర్వహణాదుల విషయంలో రామానుజులపాత్ర ప్రధానభూమిక వహించింది. కలగా పులగంగా ఉన్న అర్చనావిధానాన్ని సరిదిద్ది, ఆగమానుసారంగా అనేక ఆలయాల్లో రూపొందించారు. ముఖ్యంగా తిరుమల శ్రీవారి ఆలయంలో ఆచార్యులు ప్రవేశపెట్టిన ఆగమోక్త పూజావిధానం నానాటికీ వర్ధిల్లుతూ అశేషభక్తజనులకు శ్రీవారికృపాధనం కొంగుబంగారమయ్యేట్టుగా చేస్తోంది.

పార్థసారథి ఆలయాన్ని గోవిందరాజఆలయంగా తీర్చిదిద్దినప్పుడు దానిచుట్టూ గోవిందరాజ పట్టణం పెరిగి ఈనాటి తిరుపతి అయ్యింది అంటే అందుకు భగవద్రామానుజులే కారణం. రామానుజుల ప్రచారప్రభావఫలంతో వేదాధ్యయనంతో పాటు ద్రావిడప్రబంధపఠనం కూడా వైష్ణవాలయాలలో సమానప్రతిపత్తి పొందడం ఆచార్యులవారికృషి ఫలితమే! రామానుజుల తత్త్వా న్నర్థం చేసుకుంటే భగవంతునిసర్వవ్యాపకత్వాన్ని తెలుసుకునేందుకు సాధనం భక్తిప్రపత్తులే అని తెలుసుకోగలుగుతాం.

వర్ణ, వర్గ, మతవైషమ్యాలు లేని ఉత్తమసమాజాన్ని నిర్మించడంకోసం రామానుజులు అహర్నిశలూ కృషి చేశారు. వారిచరిత్ర భగవద్భక్తి ప్రచారం, సమాజసేవాస్ఫూర్తి, వినయవిధేయతలు, సర్వకాలసర్వావస్థల్లో భగవద్భాగవతచింతన మనలో మనఃచైతన్యపరచి రామునిలోని ధర్మనిష్ఠను, లక్ష్మణస్వామిలోని కైంకర్యదీక్షను మేల్కొలిపి, ఉత్తమసమాజసేవకునిగా మనల్ని తీర్చిదిద్దుతాయి. “సర్వేజనా స్సుఖినో భవంతు” అన్న వాక్యానికి రామానుజులు ఆకృతిగొన్నదివ్యతత్త్వం.

విద్య అనంతం, అధ్యయనం జీవితపర్యంతం. ఇదే రామానుజునిజీవితసందేశం!

హిందూ ధర్మాచరణలో...

# అన్నమయ్య సంకీర్తనలు

ఆచార్య కసిరెడ్డివెంకటరెడ్డి

**1. ఇదీ నేపథ్యం**

అన్నమయ్య కాలంనాటికి దేశంలో విధర్మీయులు అక్కడక్కడ ప్రభుత్వం నెఱపుతున్నారు. వేదాలు–ఉపనిషత్తులు, రామాయణ–భారత–భాగవతాలు– భగవద్గీత తమను తీర్చిదిద్దే గ్రంథాలని దేశంలోని భిన్నభాషలవారు, కాశ్మీరునుంచి కన్యాకుమారి వరకు, అటక్ నుంచి కటక్‌వరకు విశ్వసించేవా రందరు ఈ దేశీయులే. అందువల్ల సువిశాలభూఖండంలో ఎన్ని భాషలున్నా, ఎన్ని ప్రాంతా లున్నా, ఎన్ని మతా లున్నా పైన చెప్పిన వేదాదిగ్రంథాలను విశ్వసించి ప్రచారం చేసినవే. ఎన్నిమతాలు ఉన్నా, ధర్మం అన్నిటికీ ఒకటే; అదే వైదికధర్మం/ సనాతన ధర్మం / అదే హిందూధర్మం.

ఈ పైన చెప్పిన వాటిని ప్రచారం చేసినమతాలకు, వ్యతిరేకంగా, ఒక దురాక్రమణభావంతో ఈ దేశంలో చొరబడ్డవారే విధర్మీయులు. వారిఉద్ధృతి తీవ్రంగా ఉండి, తమసైనికశక్తితో ప్రభుత్వాలు స్థాపిస్తున్నతరుణంలో, ప్రాంత–భాషా–మత–సంప్రదాయవైవిధ్యాలతో కొట్టుమిట్టాడుతున్న దేశీయుల్ని కలపడానికి భక్తినీ–ఆధ్యాత్మికచింతననూ ఆధారంగా స్వీకరించిన వారిలో పదకవితాపితమహులైన అన్నమయ్యను అగ్రగణ్యులుగానే చెప్పుకోవాలి. ఈ దేశఆర్షవాఙ్మయాన్ని, ఈ దేశ సంస్కృతినీ, ఈ దేశఆలయసంప్రదాయఆచారాల్ని విశ్వసించని విదేశీ– విధర్మీయ ప్రభుత్వాలు తిరుమలదేవుని పరిసరాల్లో దాడులు జరుపుతున్నసందర్భంలో భక్తిసంకీర్తనలు ప్రాదుర్భవించాయి.

ఈ నేపథ్యంలో అన్నమయ్యను అధ్యయనం చేయాలి. "వ్యక్తుల్లో గుణశీలాలు నిర్మాణం చేయాలి, మనమందరం ఆ పరబ్రహ్మ (బ్రహ్మమొక్కటే) సంతానం, ఎందుకు వర్గ–వర్ణ భేదాలని తమను తాము ప్రశ్నించుకోవాలి. అందరూ ఆధ్యాత్మిక భక్తిమార్గాలలో పయనించి, అద్వైతభావనతో సామాజికసామరస్యానికి, సామాజికఏకతకు పూనుకోవాలి".

ఆక్రాతుకులుకూడా అధికారదర్పంతో, భోగదృష్టితో ఈ దేశంలోని ద్రవ్య–జీవ–ప్రకృతి సంపదలను అనుభవించరాదు. వారుకూడా జీవకోటిసమత్వాన్ని పాటించాలి. అందరిలోని ఆత్మ ఆ పరమాత్మే అని భావించాలి.

ఒకవైపు ఈ దేశపౌరుడు జ్ఞానగుణశీలాలతో, ధైర్యపరాక్రమాలతో ధర్మవీరుడై నిలబడాలి. అందుకే గీతలో బోధించిన భక్తియోగ–కర్మ యోగ–జ్ఞానయోగాలతోపాటు, గీత ప్రతిపాదించిన సమదర్శనాన్ని (సర్వభూతసమానత్వమ్...), ఆత్మతత్త్వాన్ని (నైనంఛిన్దన్తి...), నిమయబద్ధ జీవనాన్ని (యుక్తాహారవిహారస్య...), సర్వవ్యాపకత్వాన్ని (ఈశ్వరస్సర్వభూతానాం...), ఇలా అనేకవిషయాల్ని తమసంకీర్తనల్లో ప్రవహింపజేశారు. యోగవాశిష్ఠం, ఉపనిషత్తులు, అష్టాదశపురాణాలు, రామాయణభారతాది ఇతిహాసాలు, సనత్సుజాతీయం, శ్రీవిష్ణుసహస్రనామాలు... ఇలా అనేక ఆర్ష–పౌరాణిక–ఆధ్యాత్మిక గ్రంథాల్లోని అంశాలను, తేటతెనుగులో జానపదసంప్రదాయబాణీల్లో అందించారు.

**2. అన్నీ ధార్మికభావాలే!**

ఏది ధర్మం అనే విషయంపై ఓ వందనిర్వచనాలు రావచ్చు! అయితే ఏది సనాతనమో అది నిత్యనూతన మనీ, పృథ్వప్తేజోవాయ్వాకాశాల్లాగా ధర్మమూ శాశ్వత మనీ చెప్పినవారున్నారు. ఎవరిధర్మాన్ని వారు నిర్వహించడమే ధర్మం. మరి స్వీయధర్మాన్ని నిర్వర్తించడానికి ఆటంకా లేర్పడ్డప్పుడు గీతాది గ్రంథాలు తప్పనిసరిగా ఆటంకాలను అధిగమించా లన్నాయి; ధర్మాన్ని ఆచరించాల్సిందే అన్నాయి. భయావహమైనపరధర్మాన్ని ఆచరించడంకన్నా స్వధర్మాచరణలో మరణించడం మే లన్నాయి.

**"మనుజుడై ఫల మేది మతి జ్ఞానియౌదాకా**
**తనువెత్తి ఫలమేది దయ గలదాకా**
**ధనికుడై ఫల మేది ధర్మము సేయుదాకా**
**పనిమాలి ముదిసితే పాసెనా భావము"**

సదసద్వివేచనానికి జ్ఞానం కావాలి, అందరిలో తా నొకడై మెలగా లంటే దయ ఉండాలి. ధన ముంటే ఎవరి కవసరమో వారికి దానం చేయాలి. ఏ పనీ చేయకుండా

ముసలివాడైపోతే స్వీయభావం (ఆత్మభావం, గీత = స్వభావో అధ్యాత్మ ముచ్యతే) దూరమైపోయినట్లే.

సంకీర్తనలోని నాలుగుపాదాల్లో ధార్మికమానవుణ్ణి కళ్ల ముందు బొమ్మ గట్టించారు- అన్నమయ్య. ఇంతకూ హిందువు ఇటువంటి ధార్మికు డని ధర్మశాస్త్రాలు చెప్పినాయా! వాటికే మన్నా ఆధారా లున్నాయా! అన్నమయ్య ఆ అంశాలనే తనపద కవితల్లో పొందుపరిచారా! చూద్దాం!!

### 3. హిందూధర్మం

**శ్లో॥ గోషు భక్తిః భవే ద్యస్య - ప్రణవేచ దృఢామతిః ।**
**పూర్వజన్మని విశ్వాసః - సవై హిందురితి స్మృతః ॥**

- ఓంకారం పరమేశ్వరనామంగా గట్టిగా విశ్వసించేవారు, గోమాతను భక్తితో పోషించి పాలించేవారు, పూర్వజన్మపై (పునర్జన్మపై) నమ్మక మున్నవారు హిందువులు.

**శ్లో॥ ఆసింధోః సింధుపర్యంతా - యస్యభారతభూమికా ।**
**పితృభూః పుణ్యభూశ్చైవ - సవై హిందురితి స్మృతః ॥**

- సింధూనదినుండీ హిందూమహాసముద్రంవరకున్న భరతఖండాన్ని (భారతభూభాగాన్ని) తనపితృభూమిగా, పుణ్యభూమిగా ఎవరు భావిస్తారో వారు హిందువులు.

**శ్లో॥ హింసయా దూయతే చిత్తం ।**
**తేన హిందు రితీరితమ్ ॥**

- హింసను చిత్తంనుండి దూరంగా ఉండేవాడు, మనస్సులోకే రానీయనివాడు హిందువు.

**శ్లో॥ యో వర్ణాశ్రమ నిష్ఠావాన్ - గోభక్తః శ్రుతిమాతృకః ।**
**మూర్తీచ నావజానాతి - సర్వధర్మసమాదరః ।**
**ఉత్ప్రేక్షతే పునర్జన్మ - తస్మాన్మోక్షణ మీహతే**
**భూతానుకూల్యం భజతే - సవై హిందురితి స్మృతః॥**

**తిరుమలకు వచ్చే యాత్రికులు ముఖ్యంగా ఆర్జితసేవలు, వి.ఐ.పి. దర్శనానికి వచ్చువారు తప్పనిసరిగా ఒరిజినల్ ఐ.డి. ప్రూఫ్ తీసుకురావాలి. లేనిచో వారిని ఆయా సేవలకు అనుమతించరు.**

- వర్ణాశ్రమాల ధర్మనిర్వహణలో నిష్ఠ గలవాడు, గోపాలన - గోసేవ చేసేవాడు, వేదాన్ని అన్నిటికి మూలంగానూ - తల్లిగాను భావించేవాడు, మూర్తిపూజ చేసేవాడు, సర్వధర్మాలను సమాదరించేవాడు, పునర్జన్మను విశ్వసించేవాడు, మోక్షాన్ని (బంధవిమోచనాన్ని) కోరేవాడు, ప్రాణులపై దయగలవాడు, హిందు వని పిలువబడతాడు.

**శ్లో॥ శాంతః తితిక్షుః దాంతశ్చ, సత్యవాదీ ।**
**జితేంద్రియః, దాతా దయాళుః**
**నమ్రశ్చ, ఆర్యస్యా దష్టభిర్గుణైః ॥**

- శాంతం, సహనశీలం, ఇంద్రియనిగ్రహం, సత్యం, తపః క్లేశాలతో నిగ్రహసాధనం, దానశీలం, దయాళుత్వం, వినయ శీలం అనే ఈ ఎనిమిదిగుణా లున్నవారే ఆర్యులు (ఆర్యావర్తం లోని శ్రేష్ఠులు, భారతీయులు, హిందువులు).

**శ్లో॥ ఓంకారమూలమంత్రాఢ్యః - పునర్జన్మదృఢాశయః ।**
**గోభక్తో భారతగురుః - హిందూ హింసనదూషకః ॥**

- ఓంకారాన్ని శ్రేష్ఠమైన (పరమేశ్వరునిదైన) మూల మంత్రంగా భావించేవాడు, పునర్జన్మపై దృఢమైనవిశ్వాసం ఉన్నవాడు, గోవును పాలించి పోషించేవాడు, భారతాన్ని (భరతుణ్ణి) గురుస్థానంలో నిలుపుకొన్నవారు, హింసను దూషించే వాడు (హింసకు దూరంగా ఉండేవాడు) హిందువు.

### 4. ధర్మవీరులై నడవండి!

అన్నమయ్య దశావతారాలవర్ణనద్వారా ధర్మవీరాన్ని, ప్రత్యేకంగా నృసింహావతార, ఆంజనేయస్వామివర్ణనలద్వారా ధార్మికజాగరణాన్ని ధర్మరక్షణావశ్యకతను గుర్తించేట్టు చేశారు.

**అందరికి నెక్కుడైన హనుమంతుడు**
**అందుకొనె సూర్యఫల మని హనుమంతుడు**
**బల్లిదుడై లంకజొచ్చి బలురాకాసుల గొట్టి**
**వల్లకల్లోలము చేసె హనుమంతుడు**
**వొల్లనె రాముల ముద్దుటుంగరము సీత కిచ్చె**
**అల్లదె నిలుచున్నాడు హనుమంతుడు**

హింసను వ్యతిరేకిస్తాడు - హిందువు. కానీ అసురశక్తుల విజృంభణాన్ని ఆపడానికి బలప్రయోగం చేయవలసివస్తుంది.

భగవద్గీత – భారతం – రామాయణం ఈ విషయమే బోధిస్తున్నాయి. అందుకే అన్నమయ్య 'బలు రాకాసుల గొట్టి' అన్నాడు. అన్నమయ్యకు ముందు, అన్నమయ్య కాలంలో, వర్తమానంలో ఏవి రాకాసిశక్తులో గుర్తించి ఆంజనేయస్వామిమార్గాన్ని అనుసరించవలసిందే! ఇదేవిధంగా కదిరి నృసింహునివర్ణన ఉన్న ఈ క్రింది సంకీర్తననూ అన్వయించుకోవాలి.

**కదిరినృసింహుడు – కంబమున వెడలె**
**విదితముగా – సేవింపరో మునులు**

1. **ఫాలలోచనము – భయదోగ్రముఖము**
**జ్వాలామయకేసరములును**
**కాలరౌద్రసంఘటితదంతములు**
**హేలాగతి ధరియించగ నిలిచె ॥**

2. **ముడివడు బొమ్మలు – ముంచిన మార్పులు**
**గడగడ నదరెటి – కటములను**
**నిడుదనాలికయు – నిక్షుకర్ణములు**
**నడియాలపు – రూపైవెలసె ॥**

3. **సకలాయుధములు – సహస్రభుజములు**
**వికటనఖంబులు – వెసపూని**
**వెకలియగుచు శ్రీ వేంకటేశ్వరుడు**
**ప్రకటపుదుష్టుల – భంజించె నిదివో ॥**

అన్నమయ్య ఇటువంటి కీర్తనలు వ్రాసేనాటికే, కదిరి (ఖాద్రి) నృసింహాలయం, శ్రీనివాసమంగాపురందేవాలయం విదేశీయ – విధర్మీయశక్తులవిధ్వంసాలకు గురైనాయి.

శ్లో॥ కృతేతు నరసింహోఽభూత్
త్రేతాయాం రఘునందనః ।
ద్వాపరే వాసుదేవశ్చ
కలౌ వేంకటనాయకః ॥

అన్నమయ్యకు ఈ శ్లోకం, శ్లోకపరమార్థం తెలుసు. అందుకే కృతయుగంలో ధర్మరక్షకుడైన నరసింహస్వామిని, కలియుగంలో ధర్మరక్షకుడైన శ్రీవేంకటేశ్వరస్వామిని పై సంకీర్తనలో పేర్కొనడం జరిగింది. నాటిస్వామి, నేటిస్వామి ప్రేరణతో ఆధునిక హిరణ్యకశిపులను హిందువు చక్కదిద్దవలసి ఉన్నది. సాహిత్యం అందించే సందేశ మిదే! దేశకాలపరిస్థితు లనుబట్టి పరమార్థాలను సమన్వయించుకోలేనప్పుడు, ఆ సాహిత్యం కాలదోషం పట్టిపోతుంది.

అదేవిధంగా దశావతారాల పరమార్థాన్ని 'ఇతనికంటె మరి దైవము గానము...' అన్న సంకీర్తనలో ప్రస్తావిస్తారు. "మత్స్యావ తారం బితడు, ఆదికూర్మ మీవిష్ణుడు, భూవరాహ మని కంటిమి, శ్రీనరసింహం బున్నాడు, త్రివిక్రమాకృతి నిలచినది, పరశురాము డొకడైనాడు, తారకబ్రహ్మము రాఘవుడు, కృష్ణుడు రాముడు నైనారు, బుద్ధావతారం బైనాడు, మీదటి కల్క్యవ తారము..." ఇలా ప్రస్తావించడంవెనుక ధర్మరక్షణ ఉద్దేశమే ఉంది. భక్తివైరాగ్యశృంగారసంకీర్తనలు పరిశీలించే సందర్భంలో ఇటువంటివీ కనిపిస్తాయి. ఎవరి కేదికావాలో అది గ్రహించి ధర్మాచరణలో అన్నమయ్య మార్గ మిది అని గుర్తించి ప్రచారం చేయవలసి ఉంది, ఆచరించవలసి ఉంది.

### 5. ఆర్యులు (శ్రేష్ఠులు) కావాలి

హిందూధర్మం అందరూ శ్రేష్ఠమానవులు కావా లంటు న్నది. మను ర్భవ (మనిషివి కమ్ము), కృణ్వంతో విశ్వ మార్యమ్' అన్న మాటలకు దివ్యత్వాన్ని ఆపాదిస్తూ ఇలా అన్నారు.

**"ఏదియును లేని దేటి జన్మము**
**వేదాంతవిద్యావివేకి గావలెను**
**పరమే తానై పరగుండవలెను"**

పరమే తాను కావా లంటే శ్రేష్ఠుడు కావాలి; శ్రేష్ఠుడే కాదు దేవుడు కావాలి. అంటే దైవీశక్తి ఈ జీవునిలో స్థిరీకృతం కావాలి; అప్పుడే తనను చుట్టుముట్టే ఆసురీశక్తులను అంతం చేయ గలుగుతాడు. ధార్మికసామాజికచైతన్య మంటే ఇదే!

### 6. సమత్వం కోరినహిందుత్వం

సమదర్శనులం కావా లని గీత చెప్పింది. వర్ణాశ్రమ ధర్మాలు సమత్వానికి విఘాతం కలిగిస్తున్నా యని కొందరు ప్రచారం చేస్తున్నారు. అవి వృత్తి, వ్యవస్థకు సంబంధించిన అంశాలు మాత్రమే. వాటిని ఆ దృష్టితోనే అధ్యయనం చేయాలి. ఒక కర్మాగారంలోని విభిన్నకార్యాలలో పాల్గొనే కార్మికులనూ, ఒక యంత్రంలో వేర్వేరు పనిముట్లనూ ఈ వృత్తివ్యవస్థలతో (వర్ణాశ్రమధర్మాలను) పోల్చుకొని చూచినప్పుడు అందరూ సమానమే అని తెలుతుంది. అయినా కొన్ని వికృతులు (అహం కారాలు, ఆశలు, మానసిక వికారాలు) చోటు చేసుకొంటాయి. అప్పుడే అన్నమయ్యవంటి దార్శనికుల, తత్త్వవేత్తల అవసరం కలుగుతుంది. అప్పుడే "తందనాన అహి, తందనాన పురే, తందనాన భళా తందనాన" వంటి సంకీర్తనలు పుట్టుకొని వస్తాయి.

"ఇందులో జంతుకుల మింతా నొకటే, ... రాజు నిద్రా బంటు నిద్రా ఒకటే, బ్రాహ్మణుడు చండాలుడు మెట్టుభూమి ఒకటే, దేవతలకు, కీటకాలకు, పశువులకు కలిగే సుఖ మొకటే, ధనాఢ్యునకూ నిరుపేదకూ కలిగే అనుభూతి ఒకటే – అందరికీ శ్రీహరే అంతరాత్మ"

ఇదే హిందుత్వం చెప్పింది. "ఆత్మవత్ సర్వభూతాని" అన్నది. దుర్గుణాలనూ,దురాచారాలను దూరం చేసుకొని సద్గుణా లనూ సదాచారాలను ఆహ్వానించ మంటుంది – హిందుత్వం. గీతాదిగ్రంథాలలో దైవాసురసంపద్విభాగయోగాద్యంశాలు ఈ దృష్టితో వచ్చినవే! సాంఖ్యయోగం స్థితప్రజ్ఞులు కండి అని పిలుపిస్తుంది. భక్తిశృంగారాలు ప్రముఖస్థానాన్ని ఆక్రమించినా, హిందూధర్మం ప్రబోధించి ప్రస్తావిస్తున్న దివ్యమానవనిర్మాణానికి యోగ్యమైన భావా లెన్నిటికో అన్నమయ్య పదకవితలు పట్టం గట్టాయి. హిందూధర్మాచరణలో అన్నమయ్య సంకీర్తనలస్థానం పై విధంగా అధ్యయనం చేసినప్పుడు ఇంకా వందలకొలది అంశాలు వెలుగుచూచే అవకాశం ఉంది.

# అందరినోటా... అన్నమయ్య పాట!!



గోరుముద్దలు తినిపిస్తుంది
ప్రతి తెలుగు తల్లీ తన బిడ్డకు
చందమామ రావే
జాబిల్లి రావే అని పాడుతూ

ఊయల లూపుతూ
జోకొడుతుంది తన బిడ్డను
జో అచ్యుతానంద
జోజో ముకుందా అని పాడుతూ

మాటల కందేది సాహిత్యం
మాటల కందనిది సంగీతం
రెండింటినీ సమన్వయం చేసి
భావాతీత ఆత్మానంద స్థితిని అందించాడు

కొండల్లో నెలకొన్న
పరమాత్మకే కాదు
గుండెల్లో గూడు కట్టుకున్న
అంతరాత్మకు
మేలుకొలుపులు వినిపించాడు



అచ్చ తెలుగు పదాలతో
తెలుగు నుడికారంతో
అలతి అలతి పదాలతో అందంగా కూర్చి
సంకీర్తనలతో చైతన్యవంతులను చేశాడు

అందరూ పాడుకొనే విధంగా
పాడుకొంటూ అర్థం చేసుకొనేలా
అర్థం చేసుకొని ఆచరించేలా
తా నెరిగిన సత్యాన్ని
తను నమ్మిన ధర్మాన్ని
అపురూపగాన మాధుర్యంతో అందించాడు

జాతిసంస్కృతిలో
సప్తగిరీశుని వైభవాన్ని
సహస్రముఖాలుగా కీర్తించిన
హరినామ సంకీర్తనాచార్యుడు

తిరుమలేశుని మహిమలను
తెలుగుపాటలో వెలుగుబాటలా మలిచిన
తెలుగుపదకవితా పితామహుడు

సమసమాజస్థాపనకు
నాంది పలికిన సంఘసంస్కర్త
సంకీర్తనా మధురిమల
వైతాళిక సార్వభౌముడు
మాటలు చాలవు
అన్నమయ్యను ప్రస్తుతించడానికి....!

ఆకుల రఘురామయ్య

తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి

# 'శ్రీవారిసేవ' వాలంటీర్లకు మార్గదర్శకసూత్రాలు

**శ్రీవారిసేవలో ఒక వారంపాటు సేవ లందించుటకై పదిమందిసభ్యులకు తక్కువ కాకుండా ఉన్న సముదాయానికి అర్హత లభిస్తుంది. నిస్స్వార్థసేవ అందించుటకుగాను ఈ సభ్యులకు ఆధ్యాత్మికపరిజ్ఞానం ఉండాలి. స్త్రీపురుషభేదం లేదు. ఆసక్తిగల సమూహంలోని సభ్యులు వారియొక్క పేరు, చిరునామా, వయస్సు, స్త్రీలు/పురుషులు, మొదలైన వివరాలతో ఒక నెల ముందుగా "పౌరసంబంధాధికారి, తిరుమల తిరుపతి దేవస్థానములు, కపిలతీర్థం రోడ్డు, తిరుపతి - 517 501" అనే చిరునామాకు పంపాలి. మరిన్ని వివరాలకు సంప్రదించవలసిన ఫోన్ నంబర్లు : 0877 - 2263544, 0877 - 2264392.**

- శ్రీవారిసేవ వాలంటీర్లు శ్రీవారిసేవలో భక్తులకు నిస్స్వార్థంగా సేవ లందించడానికిమాత్రమే రావలెను.
- వీరు పిల్లలు, వృద్ధులు మరియు వ్యాధిగ్రస్తులను తమవెంట తీసుకొని రాకూడదు.
- శ్రీవారిసేవకు కేవలం హిందువులుమాత్రమే అనుమతింపబడతారు.
- శ్రీవారిసేవకులను హిందువులుగా గుర్తించడానికి అనుకూలంగా తిరునామం/ తిలకం లేక కుంకమ/ చందనం తప్పక నుదుట ధరించాల్సి ఉంటుంది.
- తిరుమలలో ఆర్.టి.సి. బస్టాండులో ఉన్న **శ్రీవారి సేవాసదన్** కార్యాలయంలో ప్రత్యేకాధికారి లేదా సూపరింటెండెంట్‌గారివద్ద ఆర్డరు ఇచ్చిన తేదీ ప్రకారము ఉదయం పదిగంటలనుండి సాయంకాలం ఐదుగంటలలోపు హాజరుకావల్సి ఉంటుంది.
- శ్రీవారిసేవా కార్యాలయంవద్ద ప్రతిరోజు సాయంకాలం నాలుగుగంటలకు డ్యూటీ కేటాయించబడుతుంది. వీరు ప్రతిరోజు కనీసం నాలుగునుండి ఆరు గంటలు పనిచేయాల్సి ఉంటుంది.
- ఈ సేవకులకు ఉచితవసతి కల్పించబడుతుంది. వీరికి యాత్రికుల అమెనిటీస్ కాంప్లెక్సులో వసతి కల్పించినచో లాకరుకు స్వంతతాళంచెవులు తెచ్చుకోవలసిఉంటుంది.
- సేవలో ఉన్నప్పుడుమాత్రమే శ్రీవారిసేవ స్కార్ఫ్‌లను ధరించవలెను. శ్రీవారిదర్శనానికి వెళ్లునపుడు వీటిని ధరించాల్సినఅవసరం లేదు.
- శ్రీవారిసేవకులు ప్రతిశుక్రవారం ఉదయం 7 గంటలకు ఆస్థానమండపంనందు ఏర్పాటుచేసేశిక్షణ తరగతులకు విధిగా హాజరు కావాలి.
- శ్రీవారిసేవకులు సేవలో పాల్గొనేసమయంలో పురుషులు తెలుపురంగు వస్త్రాలను, స్త్రీలు తెలుపురంగు రవికె, నీలంరంగు చీర తప్పనిసరిగా ధరించాలి.
- తిరుమలలో ఎల్లప్పుడు **'గోవింద'**నామాన్ని స్మరిస్తూ, భక్తులను **'గోవింద, గోవింద'** అని పలకరించాలి.
- యాత్రికులకు సహాయంకోసం ఈ వాలంటరీసేవ ఏర్పాటు చేయడమైనది. ఎవరికిగాని ధనరూపంగా, వస్తురూపంగా ఎటువంటి చెల్లింపులు చేయనవసరం లేదు. ఈ సేవ పూర్తిగా ఉచితం.
- ప్రతిరోజు వీరు భజనలలో, నగరసంకీర్తనలలో పాల్గొనవలసి ఉంటుంది. శ్రీవారిసేవా కార్యాలయంలో అందుబాటులో ఉన్న సంగీతవాద్యాలను శ్రీవారిసేవకులు ఉపయోగించుకోవచ్చు.
- శ్రీవారిసేవకులు వేంకటేశ్వరునికి చేసేపవిత్రసేవగా భావించి, శ్రీవారిసేవను అంకితభావంతో చేయాలి.



# వేదం.. తెలుసుకుందాం!

ధారావాహిక 25

- డా॥ విష్ణుభట్ల గోపాలకృష్ణమూర్తి

## 1) విశ్వకర్మప్రకాశిక

విశ్వకర్మ రచించిన శిల్పశాస్త్రగ్రంథాలు దాదాపు ఇరవై ఉన్నాయి. వాటిలో 'విశ్వకర్మ ప్రకాశిక' పరమ ప్రమాణమైనది. దీనిలో 13 అధ్యాయాలు, 1425 శ్లోకా లున్నాయి. ఇది ప్రధానంగా వాస్తువిషయాలను ప్రస్తావించింది. పుర-దుర్గ-ప్రాసాద-దేవాలయాదులనుగురించి సంగ్రహంగా చెప్పింది. శతాధికంగా వాస్తువిషయాలను వివరించిన ఈ గ్రంథం వాస్తువిద్యార్థులకే కాక వాస్తుపండితులకుకూడా కల్పవృక్షం వంటిది.

సకల సద్గుణసంపన్నుడు, సర్వశాస్త్రవేత్త, విమలవిద్యా రహస్యకోవిదుడు, సకలదేవతలకు శిల్పాచార్యుడు, మహాత్ముడు అయిన విశ్వకర్మ లోకక్షేమం కోరి, ఈ సచ్ఛాస్త్రాన్ని నిర్మించా డని చెప్పడంవల్ల దీనిలో గృహవాస్తువిషయమే ప్రధానంగా చెప్పబడినట్లు తెలుస్తున్నది.

**అథ సువిమలవిద్యో విశ్వకర్మా మహాత్మా**
**సకలగుణవరిష్ఠ స్సర్వశాస్త్రార్థవేత్తా ।**
**సకలసురగణానాం సూత్రధారః కృతాత్మా**
**భువననివసతాం సచ్ఛాస్త్ర మేత చ్చకార ॥**

## 2) విశ్వకర్మవాస్తుశాస్త్రం

ఇది 87 అధ్యాయాల గ్రంథం. దీనిలో అనేకగృహ వాస్తువిశేషాలు చెప్పబడినై.

## 3) విశ్వకర్మశిల్పం

దీనికి 'విశ్వకర్మీయం' అనికూడా పేరుంది. దీనిలో 22 అధ్యాయా లున్నాయి. ఇది శిల్పిపదానికి నిర్వచనాన్ని, శిల్పులలో భేదాలను ఇలా చెప్పింది -

**సర్వలక్షణతః శుద్ధః తస్మాత్ తక్షక ఈరితః ।**

శిల్పాచార్యుల కుండవలసిన సర్వలక్షణాలు కలిగి పరిశుద్ధుడైనందున అతనిని 'తక్షకుడు' అని అంటారు. 'తక్షణ' మనగా చెక్కడం. ముడివస్తువులైన అయో, దారు, తామ్ర, శిలా, స్వర్ణాదులను చెక్కిగాని, కరిగించిగాని కావలసిన రూపాలను కల్పించేవాడు తక్షకుడు.

అలాగే దేవాలయాలను, గృహ-భవన-ప్రాసాదాదు లను తననిర్మాణకౌశలంతో వృద్ధి పొందించేవాడు వర్ధకి. వర్ధన మనగా వృద్ధిచేయడం, చెక్కడం అనికూడా అర్థం. కొయ్య, రాయి మొదలైన వాటికి రూపకల్పన చేసేవాడు 'వర్ధకి'.

**దేవాలయాదికాన్ సర్వాన్ వర్ధయే దితి వర్ధకిః ।**

రథాన్ని తయారుచేసేవాడు రథకారుడు. త్రిపుర దహనానికి పూనుకొన్న పరమశివునికి విశ్వకర్మ జగద్రూపమైన, మిక్కిలి శుభప్రదమైన రథాన్ని చేసిచ్చాడు. అందువల్ల ఆయనకు రథకారు డనే పేరొచ్చింది.

**త్రిపురం దగ్ధుకామస్య శివస్య పరమేష్ఠినః ।**
**రథం తు జగదాకారం కృతవాన్ పరమం శుభమ్ ॥**
**రథకార ఇతి ప్రోక్తో విశ్వకర్మా స ఏవ హి ।**

ఇంకను విశ్వకర్మ రచించిన విశ్వకర్మమతం, విశ్వకర్మ సంహిత, విశ్వకర్మసిద్ధాంతం, విశ్వకర్మవిద్య, అపరాజిత వాస్తు శాస్త్రం, పరశివవిశ్వకర్మాగమం, జ్ఞానరత్నకోశం మొదలైన గ్రంథాలు మహావిషయబంధురాలు. వీటిలో కొన్నిమాత్రమే నేడు లభిస్తున్నాయి. వాటిలోను కొన్నిమాత్రమే ముద్రితాలు. మరెన్నో గ్రంథాలు శిల్పాచార్యులవద్ద తాళపత్రాల్లో తపస్సు చేస్తున్నాయి.

## 4) మయమతం

మయుడు మయమత మనే పేరుతో 36 అధ్యాయాల గ్రంథాన్ని రచించాడు. దీనినే మయమతశిల్పశాస్త్ర మని, మయశిల్పశాస్త్ర మనికూడా అంటారు. దీనిలో అనేకశిల్ప-వాస్తువిషయాలు సంపూర్ణంగా చెప్పబడినై. ఇది సమగ్రము, ప్రాచీనము అయిన శిల్పశాస్త్రగ్రంథము. దీనిలో శిల్పాచార్యుని

లక్షణాలు, శాస్త్రప్రజ్ఞ, సదాచారంగురించిన విషయాలు నేటి శిల్పులకు ప్రబోధకాలు.

శిల్పాచార్యుడు ధర్మం తెలిసినవాడు, సకల వేదపారంగ తుడు, గణిత-సాముద్రక-జ్యోతిష-వాస్తుశాస్త్రాలను కూలం కషంగా చదివినవాడు, సువర్ణాదిలోహాలు, పాషాణాలు, దారువులు, ఇటుకలు, గచ్చులు, చిత్రాలు మొదలైన పనులు నేర్చినవాడు, 64 కళల మెలకువలు తెలిసినవాడు, సూత్రశాస్త్ర క్రియలందు ప్రవీణుడు, సత్యవచనుడు, సదాచారసంపన్నుడు, విద్యలలో కుశాగ్రబుద్ధి కలవాడు, సర్వలక్షణసంపన్నుడు, ఆరోగ్యవంతుడు, ప్రమాదరహితుడు, జూదం మొదలైన సప్తవ్యస నములు లేనివాడు, వేదధర్మాలను ఆచరించేవాడు, మనువు, మయుడు, త్వష్ట మొదలగు ప్రముఖుల సూత్రశాస్త్రముల నెరిగినవాడు, గుణవంతుడు, సత్యవంతుడు అయిన మహావ్యక్తి అయి ఉండా లని మయమతం ఇలా పేర్కొంది -

**.............. ధర్మజ్ఞో వేదపారగః ।**
**సాముద్ర గణితానాం చ జ్యోతిశ్శాస్త్రస్య చైవ హి ॥**
**లోహ పాషాణ కాష్ఠానాం ఇష్టకానాం చ సంకలే ।**
**సుధానాం చిత్రకానాం చ చతుష్షష్టిక మర్మగః ॥**
**సూత్ర శాస్త్ర క్రియా ప్రాజ్ఞో వాస్తువిద్యాబ్ధిపారగః ।**
**సత్యవాక్య స్సదాచారో విద్యాకుశలబుద్ధిమాన్ ॥**
**సర్వలక్షణసంపన్నః సర్వావస్థాసు శోభితః ।**
**ఆరోగ్యే చాప్రమాదే చ సప్తవ్యసనవర్జితః ॥**
**వేదకర్మా సదాచార ఏకపత్నీవ్రత స్తథా ।**
**మనుసూత్రాదిశాస్త్రజ్ఞో గుణవాన్ సత్యవాచకః ॥**
**ఏవం గుణగణై ర్యుక్తః శిల్పాచార్య స్సదోచ్యతే ॥**

**- మయమతం.**

దీనినిబట్టి శిల్పాచార్యునికి ఎన్నిఉత్తమలక్షణాలు, మరెన్ని శాస్త్రాలపరిజ్ఞానం, కార్యదక్షత ఉండవలెనో తెలుస్తు న్నది. కశ్యపమానసారాదులుకూడా శిల్పికి ఇంచుమించు ఇటువంటి లక్షణాలనే చెప్పారు.

## 5) మయవాస్తువు

ఇది చిన్నగ్రంథం. దీనిలో 4 అధ్యాయాలు, 105 శ్లోకా లున్నాయి. దీనిపేరు వాస్తుశాస్త్ర మని ఉన్నా దీనిలోని విషయాలు శిల్పశాస్త్రానికి సంబంధించినవి. దీనిలో నవతాళ ప్రమాణంతో విగ్రహాలను చేసేవిధానాలు, లింగ-దేవప్రాసాద-ప్రాకారాదులలక్షణాలు, ప్రతిమలలో దోషాలు, మూర్తుల కుండవలసిన ఊర్ధ్వ-అధ-సమదృష్టులు, వాటి ఫలితాలు, గోపుర నిర్మాణం మొదలైనవి వివరించబడినై. మానసారాదుల తంత్రాదులకంటె మయమతాగమం శ్రేష్ఠ మని ఈ గ్రంథం చెబుతున్నది. శిల్పిలక్షణాలు, శిల్పిపూజాపురస్కారాదులగురించి కూడా ఇది వివరించింది.

శిల్పిని పూజిస్తే శిలను పూజించినట్లే నని, శిల్పి దుఃఖిస్తే శిల దుఃఖిస్తుం దని, శిల్పే దైవాన్ని కల్పిస్తా డని, జగ త్తంతా శిల్పి బ్రహ్మమయ మని, శిల్పి దేవరూపం ధరించినవా డని, అందుచేత ముందుగా శిల్పికి నమస్కరించి, పూజించా లని మయవాస్తుశాస్త్ర మిలా చెప్పింది -

**శిల్పిపూజా శిలాపూజా శిల్పిదుఃఖేన దుఃఖితా ।**
**శిల్పినా కల్పితం దైవం శిల్పిబ్రహ్మమయం జగత్ ॥**
**శిల్పినం పూజయే త్పూర్వం తస్యలక్షణ ముచ్యతే ।**
**శిల్పి నమస్క్రియా పూర్వం దేవరూపధరో యతః ॥**

**- మయవాస్తుశాస్త్రం**

శిల్పాచార్యుడు ముందు దేవుని ప్రతిష్ఠించి ప్రాణప్రతిష్ఠ చేయాలి. తరువాత విప్రులు అర్చనాదులు జరుపుకోవాలి. అలా చేయనిచో ఆ ప్రతిమస్వరూపం నిర్జీవమౌతుం దని మయవాస్తు శాస్త్ర మిలా పేర్కొంది -

**పూర్వం శిల్పీ ప్రతిష్ఠాప్య ద్వితీయా బ్రాహ్మణైః కృతా ।**
**అన్యథా కీర్తితం తత్తు రూపం నిర్జీవమేవ హి ॥**

**- మయవాస్తుశాస్త్రం.అధ్యాయం.3.శ్లోకం.21.**

అలాగే జలాధివాసం, ధాన్యాధివాసం మొదలైన కార్యాలుకూడా శిల్పాచార్యుడే చేయాలిగాని, ఇతరులు చేయరా దని, అలా చేస్తే కర్త, భర్త కూడా నశిస్తా రని మయవాస్తు శాస్త్ర మిలా చెప్పింది -

**జలధాన్యాధివాసం చ శిల్పాచార్యేణ కారయేత్ ।**
**అన్యజాత్యా న కర్తవ్యం కర్తా భర్తా వినశ్యతి ॥**

**- మయవాస్తుశాస్త్రం.అధ్యాయం.3.శ్లోకం.22.**

శిల్పి తల్లివంటివా డని, శిల పుత్రు డని, పూజించే వారంతా దాసు లని, ఇవన్నీ చక్కగా తటస్థిస్తే ఇంద్రభోగమే అవుతుం దని, ఇదే త్రివిధలక్షణ మని మయవాస్తుశాస్త్ర మిలా పేర్కొంది -

**శిల్పీ మాతా శిలా పుత్రో దాసా స్తే సర్వపూజకాః ।**
**కర్తవ్య ఇంద్రభోగశ్చే తీదం త్రివిధలక్షణమ్ ॥**

**- మయవాస్తుశాస్త్రం.అధ్యాయం.3, శ్లోకం.23**

ఈ విధంగా అతిప్రాచీనాలైన శాస్త్రగ్రంథాలు శిల్పాచార్యుడే ఆలయంలో దేవతామూర్తిని ప్రతిష్ఠించి, ప్రాణప్రతిష్ఠ - నేత్రోన్మీలనసంస్కారాదులు జరిపి, యజమానికి (అనగా దేవాలయాన్ని నిర్మించినవ్యక్తికి) బింబాన్ని ధారపోయా లని, అప్పుడు యజమాని అర్చకుని నియమించి నిత్యార్చనాకలాపం నిర్వర్తించా లని చెబుతున్నై.

సర్వభూతముల అభ్యుదయంకోసం శిల్పకర్మ చేసేవాడు, సురాసురులకు గురువు, విశ్వసృష్టిస్థితిలయాలకు హేతువైన విశ్వకర్మ దేవతలందరిలో ముఖ్యు డని మయవాస్తుశాస్త్ర మిలా చెప్పింది -

**అశేష భూతోదయకర్మ కర్తా**
**సురాసురాణాం చ గురు స్తథైవ ।**
**విశ్వస్యసృష్టిస్థితినాశహేతుః**
**శ్రీవిశ్వకర్మాఖిలదేవముఖ్యః ॥**

**- మయవాస్తుశాస్త్రం. అధ్యాయం.3.శ్లోకం.16.**

### 6) కాశ్యపశిల్పం :

కశ్యపుడు రచించినది కావున దీనికి 'కాశ్యపశిల్ప'మనే పేరు సార్థకమైంది. మహాదేవుడైన పరమశివుడు దీనిని కశ్యపునికి ఉపదేశించినట్లు గ్రంథాదిలో చెప్పబడింది. దీనికి 'అంశుమద్భేద తంత్రము' అనే మరోపేరుకూడా ఉంది. కాశ్యపశిల్పం 88 పటలాలుగా విభజించబడింది. దీనిలో కర్షణాది అర్చనాంతమైన శిల్పక్రియాసర్వస్వం సంపూర్ణంగా వివరించబడింది. శివుడు ఉపదేశించినందువల్లనేమో ఇది చివరివరకు శివతత్త్వ ప్రధానంగానే ఉంది. దేవాలయాలు మొదలైనవాటికి సంబంధించిన అనేకశిల్పవాస్తువిషయాలు దీనిలో చెప్పబడినై. మయ-విశ్వకర్మల మతాలతో పాటు ఇదికూడా ప్రామాణికమైన ఆర్షగ్రంథం. 'శిల్పసంహిత', 'అంశుమానభేదకల్పము' అనే గ్రంథాలుకూడా కశ్యపప్రోక్తాలే నని తెలుస్తున్నది. ఈ గ్రంథం స్తంభభేదాలను, ప్రాసాదభేదాలను వివరించింది.

### 7) మానసారము

ఇది మానసారఋషిప్రోక్తం. ఇది 72 అధ్యాయాల గ్రంథం. మాన మంటే కొలత. సమస్త దేవ-మానవ-యక్ష-రాక్షస-కిన్నర-గంధర్వాదుల శరీరమానాలు, దేవ-మనుష్య ఆలయాలకొలతలు ఏవిధంగా ఉండాలో మానసారం వివరిస్తుంది. దీనిలో భూపరీక్ష, శంకుస్థాపన, గృహ-రాజగృహ-గ్రామ-పుర-దేవాలయాదుల నిర్మాణవిధానమంతా అసామాన్యంగా వివరించబడింది. ఇది ప్రపంచవిజ్ఞానానికి ఆకరం వంటిది.

ఇంకను నానాదేవతల, వాహనాదుల, రాజభవనాదుల లక్షణా లనేకం దీనిలో వివరించబడినై. దీనినిబట్టి ప్రాచీనశిల్పాచార్యుల అధికార, అర్హతాప్రాభవాలు వెల్లడవుతున్నై. ఈయన మానముల సారములను అనగా దేవాలయాలు, దేవతామూర్తులు మొదలైన లక్షణాలను నిర్వచించడం వలన ఇతనికి 'మానసారు'డనే బిరుదు వచ్చి ఉండవచ్చు.

దీనిలో సంగ్రహము, శిల్పిలక్షణపూర్వకమానోపకరణం, వాస్తుప్రకరణం, భూపరీక్ష, గ్రామ-నగర-అధిష్ఠాన-విమానలక్షణ-ఏకతలాదిద్వాదశతలవిధాన-ప్రాకార- గోపుర-మండప- శాలా- ద్వారస్థాన- రాజహర్మ్య విధానాలు, త్రిమూర్తి- లింగ-ముని-యక్ష-గరుడ-వృషభాదుల లక్షణాలు, ఉత్తమ- మధ్యమ-దశతాళ పద్ధతులు, అంగభూషణ-నయనోన్మీ

**జ్యేష్ఠాభిషేకం (అభిధ్యేక అభిషేకం)**

**తిరుమలలో ప్రతిసంవత్సరం జ్యేష్ఠమాసంలో జ్యేష్ఠానక్షత్రానికి పూర్తి అగునట్లుగా మూడురోజుల పాటు శ్రీస్వామివారికి జ్యేష్ఠాభిషేకం జరుపబడుతుంది. దీన్నే 'అభిధ్యేక అభిషేకం' అని కూడా అంటారు. శ్రీవారి ఉత్సవమూర్తుల పరిరక్షణకై నిర్వహించే ఉత్సవం ఇది.**

| ధారావాహిక 29 | మందార మకరందాలు |
|---|---|

**జో జో కమలదళేక్షణ,**
**జో జో మృగరాజమధ్య, జో జో కృష్ణా,**
**జో జో పల్లవ కరపద,**
**జో జో పూర్ణేందువదన జో జో యనుచున్.**

కందంలో అందంగా ఇమిడిన జోలపాట ఇది. 'జో అచ్యుతానంద జో జో ముకుంద' అనే జోలపాట పాటల్లో ఎంతపేరు మోసిందో, పద్యాల్లో ఇది అంత వాసి కెక్కింది. ఎందరెందరో తెలుగుతల్లులు ఇది పోతన్న పద్య మని తెలియకుండానే మనసార పాడుకునేవారు; మాతృత్వమాధుర్యాన్ని తనివితీరా అనుభవించేవారు.

ప్రాసస్థానంలో 'జో జో' అంటూ ఉండడంవల్ల. మధ్య మధ్య కృష్ణ పరమైన ముచ్చటైన సంబోధన లుండడంవల్ల ఇటు రక్తికీ అటు ముక్తికీ మూలకందమైంది–ఈ కందం.

**- జ్ఞానపీఠఅవార్డు గ్రహీత, పద్మభూషణ్ డా॥ సి. నారాయణ రెడ్డి**

లనాది లక్షణాలు చెప్పబడినై. పరిశిష్టాధ్యాయం (71)లో మరి కొన్నివిశేషా లున్నై. దీనిలో జైన–బౌద్ధ శిల్పలక్షణాలుకూడా ఉండడం మానసారుని విశాలదృష్టికి నిదర్శనం.

**8) సమరాంగణసూత్రధారము**

భోజరాజు సమరాంగణసూత్రధార మనే మహాగ్రంథాన్ని రచించాడు. దీనిని భోజుని ఆస్థానంలోని సమరాంగణసూత్రధారు డనే మహాశిల్పాచార్యుడు రచించినట్లు కొందరిఅభిప్రాయం. ఈ మహోత్కృష్టగ్రంథంలో చెప్పని శిల్ప–వాస్తు రహస్యం, విషయం లే దంటే అతిశయోక్తి కాదు.

దీనిలో 83 అధ్యాయా లున్నై. వీటిలో 2000 విషయాలు చెప్పబడినై. మొదటి అధ్యాయాల్లో ఖగోళ– భూగోళ–విజ్ఞానం, ఆ తరువాత భూపరీక్ష మొదలైన వాస్తువిషయాలు సంపూర్ణంగా వివరించబడినై. ఇంకను వివిధ దేవ–మనుష్య వాస్తుశిల్పవిషయాలు వివరించబడినై. కొన్నిఅధ్యాయాల్లో యంత్రశిల్పరహస్యాలుకూడా చెప్పబడినై. వాటిలో ఆకాశవిమాన నిర్మాణవిధానాలు తెలుపబడినై.

ఈ గ్రంథం చదివితేగాని శిల్పవాస్తు రహస్యాలసమగ్రవిజ్ఞానం కలుగ దనే టట్లుగా గ్రంథకర్త దీనిని తీర్చిదిద్దాడు. శిల్పవిజ్ఞానసర్వస్వ మనదగిన ఈ గ్రంథం శిల్పశాస్త్రజిజ్ఞాసువులకు అవశ్యం పఠనీయం.

**9) అపరాజితపృచ్ఛ**

ఈ మహాశిల్పశాస్త్రగ్రంథాన్ని భువనదేవాచార్యుడు రచించాడు. 'పృచ్ఛ' అంటే 'ప్రశ్న' అని అర్థం. విశ్వకర్మకు జయుడు, విజయుడు, సిద్ధార్థుడు, అపరాజితుడు అని నలుగురు కుమారులు. వారిలో చిన్నవాడైన అపరాజితుడు తండ్రిని ప్రశ్నించగా విశ్వకర్మ అతనిప్రశ్నలకు సమాధానా లిస్తాడు. ఈ విధంగా ప్రశ్న–సమాధానం రూపంలో ఉన్న ఈ గ్రంథానికి 'అపరాజితపృచ్ఛ' అనే పేరు సార్థకమైంది.

ఇందలి భాగాలకు సూత్రా లని పేరు. ఇక్కడ సూత్ర మంటే కొన్ని శ్లోకాలసమూహం. అదొక అధ్యాయంవంటిది. దీనిలో 239 సూత్రాలు, 9600 శ్లోకాలలో దాదాపు 1150 విషయాలు చెప్పబడినై. మొదట బ్రహ్మాండోత్పత్తివిధానం వర్ణించబడింది. వైదిక–శాస్త్రీయ–పౌరాణిక–చారిత్రక–శిల్ప సంబంధాలైన సకలవిషయాలకు ఈ గ్రంథం విజ్ఞానసర్వస్వం వంటిది.

ఈ గ్రంథం శివునికి సర్వాధిక్యా న్నిస్తుంది. శివశక్తి సంయోగంచేత రుద్రరూపం ఉద్భవిస్తుం దని, ఆ రుద్రుని నుండి శంభుడు, శంభువునుండి బ్రహ్మ, విష్ణువు ఉద్భవించా రని ఈ గ్రంథం ఇలా పేర్కొంది –

**శివశక్తి సమాయుక్త ముద్భవే ద్రుద్రరూపకమ్ ।**
**శంభూ రుద్రోద్భవః ప్రోక్తో బ్రహ్మావిష్ణూ తదుద్భవౌ ॥**

*(ఇంకా ఉంది)*

# సందేహాలు? సమాధానాలు!!

విద్వాన్, డా॥ పమిడికాల్వ చెంచుసుబ్బయ్య

**శ్రీకృష్ణపరమాత్మను బాణముతో కొట్టి చంపిన 'బోయ' గత జన్మలో ఎవరో వివరించగలరు.**

*– సాయిరామానందస్వామి, పొదలకొండపల్లె, ప్రకాశంజిల్లా.*

☛ గాంధారీశాపకారణంగానూ, ఋషులశాపంవల్లనూ యాదవవంశం నాశనంకాక తప్పలేదు. శ్రీకృష్ణుడు విధి నిర్ణయాన్ని తప్పించరా దని తలచాడు. బలరాముడు తపోవనానికి వెళ్ళా డని తెలిసి, తానూ తపస్సు చేసుకోవడానికై అడవికి వెళ్లాడు. అక్కడ మహాయోగాన్ని చెంది, పరుండి ఉండగా 'జర' అనే ఒక బోయ– అదొక మృగ మని భ్రమించి, త్వరపడుతూ బాణంతో శ్రీకృష్ణునిఅరకాలిపై తగిలేటుగా వేశాడు. దానివల్ల స్వామి – భౌతికశరీరాన్ని వదలి, పరమస్థానం చేరాడు. జరాసంధుణ్ణి భీమునిద్వారా చంపించినవాడు కృష్ణుడే కనుక – జనించినవేళ జరాసంధుణ్ణి బ్రతికించిన 'జర' అనేరాక్షసి కోపించి, కృష్ణునిపై పగదీర్చుకోవడానికై – ఆ క్షణంలో ఆ 'బోయ'లో ప్రవేశించి, అతనికి మృగభ్రాంతిని కల్గించింది. (భారతం).

**బోయపూర్వవృత్తాంతం**–జగన్నాథమాహాత్మ్యంలో ఇలా ఉంది. "రామావతారంలో నిష్కారణంగా వాలిని చంపినాడు– రాముడు. అందుకే కృష్ణావతారంలో ఇలాంటిదుర్ఘటన జరిగింది. తన తండ్రియైనవాలిని బాణంతో కొట్టి, చంపినందుకు కోపించిన అంగదుడు ద్వాపరంలో బోయయై పుట్టి– ఈ విధంగా పగదీర్చుకొన్నాడు. కృష్ణునిశరీరమే కొంతకాలానికి దారువు (కొయ్య) అయింది. అదే పూరీజగన్నాథంలో విగ్రహం!!"

**(పూర్వగాథాలహరి–ఆధారంగా– శ్రీవేమూరి శ్రీనివాసరావు)**

**ఉపపాండవులకు ఏల పెండ్లి కాలేదు?**

*– పి.సురేష్‌బాబు, ప్రొద్దుటూరు.*

☛ పాండవులకు ద్రౌపదియందు పుట్టినకొడుకులు ఉపపాండవులు. ధర్మరాజు, భీముడు, అర్జునుడు, నకులుడు, సహదేవుడు – వీళ్లవల్ల వరుసగా ప్రతివింధ్యుడు, శ్రుతసోముడు, శ్రుతకీర్తి, శతానీకుడు, శ్రుతసేనుడు – అనేవాళ్ళు జన్మించారు.

భారతయుద్ధానంతరం–ఉపపాండవులు రాత్రి నిద్రిస్తుండగా అశ్వత్థామ వాళ్ళను నిర్దాక్షిణ్యంగా సంహరించాడు. ఉపపాండవులు మరణించేనాటికీ అవివాహితులే! ఇలా అవివాహితులు కావడానికి కారణ ముంది.

ఉపపాండవులు పూర్వజన్మలో 'విశ్వులు' అనే దేవతలు. వీళ్లు తమ దివ్యమార్గంలో వెళ్తూ – హరిశ్చంద్రునిభార్య అయిన చంద్రమతిని విశ్వామిత్రుడు తొందరగా నగరం వెడలి పొ మ్మని దూషిస్తూ, బాధిస్తుండడం చూచారు. అందులకు బాధపడి, ఆ విశ్వు లనే దేవతలు 'ఇలా నిర్దయగా, ప్రవర్తించే ఈ మునికి పుణ్యలోకం ఎలా కల్గుతుంది?' అని విశ్వామిత్రుణ్ణిగూర్చి తమలో తాము మాట్లాడుకొన్నారు. ఆ మాటలు విశ్వామిత్రుడు విన్నాడు. వెంటనే కోపంతో 'మీరు మానవులై పుట్టండి' అని శపించాడు. విశ్వులు శాపాన్ని తప్పించం డని కోరారు. విశ్వామిత్రుడు 'నా శాపం తప్పదు. కానీ, మీరు భూలోకంలో చిరకాలం ఉండక, బ్రహ్మచారులుగానే మరణించి, శాపవిముక్తులవుతారు" అని అనుగ్రహించాడు. అందువల్లనే ఉపపాండవుల పెండ్లిప్రసక్తి భారతంలో కనిపించదు. ఆ అయిదుగురూ బ్రహ్మచారులుగానే మరణించి, తమ పూర్వస్థితిని పొందారు.

**(మార్కండేయపురాణం) (పూర్వగాథాలహరి ఆధారంగా)**

**శబరి ఎవరు? ఆమె పూర్వజన్మవృత్తాంతం ఏ గ్రంథంలోనైనా ఉందా? ఉంటే తెల్పండి?** *– ఆర్.సంజీవ్, రొంపిచెర్ల, చిత్తూరుజిల్లా.*

☛ 'శబరి' ఆటవికజాతికి చెందిన సామాన్యస్త్రీ. అరణ్యవాససమయంలో శ్రీరామలక్ష్మణులకు ఫలాహారం సమర్పించి, ధన్యురాలైంది. శ్రీరాముడు శబరికి ముక్తి ప్రసాదించాడు.

**పూర్వజన్మ** – కంబరామాయణంలో శబరిపూర్వవృత్తాంతం ఇలా ఉంది. శబరి మునుపు 'చిత్రకవచు'డనే గంధర్వరాజు కూతురు. పేరు 'మాలిని'. ఒక పండితుడైన 'వీతిహోత్రుడు' ఆమెను వివాహమాడాడు. అతడు ఎప్పుడూ బ్రహ్మజ్ఞానం గురించే ధ్యానిస్తుంటే – భార్య 'మాలిని' (శబరి) కల్మషుడు అనే వేటగాణ్ణి ప్రేమించింది. అందుకు కోపించినభర్త వీతిహోత్రుడు 'నీవు వేటగాణ్ణి ప్రేమించావు కనుక ఆటవికురాలివి

క'మ్మని శపించాడు. అంతట మాలిని కన్నీటితో శాపవిముక్తికై ప్రార్థించింది. భర్త "శ్రీరామునిదర్శనంతో విముక్తి కల్గుతుంది" అని చెప్పాడు. వెంటనే ఆమె ఆటవికస్త్రీగా మారి, మతంగాశ్రమ ప్రాంతానికి వచ్చి, జీవించసాగింది. అచ్చట ఆమె మతంగముని శిష్యులకు సపర్యలు చేస్తూ, వారిఆశీస్సులు పొంది, శ్రీరాముని రాకకై నిరీక్షిస్తూ ఉంది. శ్రీరాముడు అరణ్యవాస సందర్భంగా ఎన్నోఆశ్రమాలు దర్శించి, ఒకనాడు మతంగాశ్రమం చేరాడు. ఇంతలో శబరి ఎన్నోఫలాలు సేకరించి, వాటిల్ని రామలక్ష్మణు లకు సమర్పించింది. తర్వాత సుగ్రీవునివిషయం వివరించి, అతనితో మైత్రి ఘటించు మని విన్నవించి, శ్రీరామునికి నమ స్కరించింది. కనులుమూసుకొనింది. వెంటనే 'మాలిని' అనే గంధర్వస్త్రీగా మారింది. వీతిహోత్రుడు విమానంలో వచ్చి, ఆమెను గంధర్వలోకానికి తీసుకెళ్లాడు. (శ్రీమద్రామాయణంలో ఈ వృత్తాంతం లేదు)

**(పూర్వగాథాలహరి-'విక్టరీ' ప్రచురణ ఆధారంగా)**

**'అహిమహిరావణమారణ రామ' అని 'నారదగానగేయ రామాయణం'లో ఉంది కదా! అర్థం వివరించండి.**

***- పి.శారద, విజయనగరం.***

☛ ఈ వాక్యం 'నారదగానగేయరామాయణం'లో యుద్ధ కాండలోనిది. 69వ నామం. అహి=పాము, మహి=భూమి- అంటే నాగలోకం= పాతాళలోకం. పాతాళరావణుడు-రాక్ష సుల్లో ఒకడు. లంకారావణుడూ, పాతాళరావణుడూ ఒకరు కారు. పాతాళరావణుడు మలయవాణుని సోదరికుమారుడు. ఒక తెగకు చెందినరాక్షసులు మహావిష్ణువుకు భయపడి, పాతాళం చేరి, అక్కడే రాజ్యం నిర్మించుకొన్నారు. అలా వెళ్ళిన రాక్షసులకు నాయకుడే పాతాళరావణుడు. ఇతనితోబుట్టువు కుంభోదరుడు. పాతాళరావణుడూ, లంకారావణుడూ స్నేహితులు. రావణుడు ఓటమిదశలో ఉండగా ఇతనితో సంప్రదించగా, రాముణ్ణి ఓడించడానికి ఇరువురూ ప్రయత్నించారు. బ్రహ్మవల్ల పొందిన వరాలవల్ల పాతాళరావణుడు వాహనం లేకుండానే ఏ ప్రాంతాని కైనా వెళ్ళగలడు. ఇతడికి బ్రహ్మదేవు డిచ్చిన వజ్రంవల్ల - ఆ వజ్రం పగలనంతవరకూ ఇతడు మరణించడు. ఈ శక్తితో ఇతడు వానరసైన్యాన్ని ఆకాశమార్గంనుండే చూచి, యుద్ధంలో వీళ్లను గెల్వడం సాధ్యం కా దనీ - శ్రీరాముణ్ణి తనమంత్రశక్తితో పాతాళానికి తీసుకుపోవా లనీ నిర్ణయించాడు. కానీ, హనుమం తుడు రాముణ్ణి రక్షిస్తున్నందున తనప్రయత్నం ఫలించ దని భావించి, రాముడు నిద్రించేప్రాంతంలో అడుగునుండి ఒక రంధ్రం త్రవ్వి, రాముణ్ణి మూర్ఛకు గురిచేసి, పాతాళానికి తీసు కెళ్లాడు. రాముణ్ణి బలి ఇవ్వా లనికూడా తలంచాడు. రామలక్ష్మ ణులు కన్పించకపోవడంతో హనుమంతుడు ఆశ్చర్యపడి, విభీషణుణ్ణి విచారించాడు. అతడు జరిగిందంతా వివరించాడు. వెంటనే హనుమ పాతాళరావణునిపై యుద్ధానికి వెళ్లాడు. బ్రహ్మ నుండి పొందినవజ్రాన్ని యుక్తితో గ్రహించి, తన నోటితో ఉంచు కొని, ఇతనితో యుద్ధం చేశాడు. యుద్ధసమయంలో కోపంతో పళ్లు పటపట లాడించాడు. అప్పుడు వజ్రం ముక్కలయింది. పాతాళరావణుడు వెంటనే మరణించాడు. చంపింది హనుమం తుడే అయినా-రాముని కొరకే కనుక రాముడు పాతాళరావణుని మృతికి కారణమైనాడు. **(కంబరామాయణం, పూర్వగాథా లహరి-'విక్టరీ' ప్రచురణ ఆధారంగా) (అనేకరావణులసంగ తులు వాల్మీకిరామాయణంలో లేవు)**

**'ఆంధ్రమహాభాగవతంలో రుక్మిణి శ్రీకృష్ణునికి తన ప్రేమ సందేశాన్ని తెల్పుటకై పంపిన బ్రాహ్మణుని పేరు 'అగ్నిద్యోతను' డని ఉంది. సంస్కృత భాగవతంలోనూ ఇట్లే ఉందా?**

***- బి.మహాలక్ష్మి, నెల్లూరు.***

☛ సంస్కృతభాగవతంలో రుక్మిణీదేవీసందేశాన్ని శ్రీకృష్ణు నికి విన్నవించిన బ్రాహ్మణునిపేరు లేదు. సంస్కృతంలో 'విచింత్య ఆప్తం ద్విజం కంచిత్ కృష్ణాయ ప్రాహిణోద్రుతమ్' (10 స్కం-52 అధ్యా.26శ్లో) అని ఉంది. తరువాతి శ్లోకాలలోనూ 'ద్విజవర శ్రేష్ఠ, బ్రహ్మన్,బ్రాహ్మణః, ద్విజసత్తమః, బ్రాహ్మణాయ', అని జాతివాచకాలే ఉన్నాయి. అగ్నిద్యోతను డనేపేరు (నామ వాచకం) ఆంధ్రభాగవతంలో పోతనగారు పేర్కొన్నారు. 'అగ్ని వలె ప్రకాశించేవాడు' అని 'అగ్నిద్యోతన' పదానికి అర్థం. అనా మకుడుగా ఒక బ్రాహ్మణోత్తముణ్ణి పంపడంకంటే సార్థక నాముడైన వ్యక్తిని పంపడం సముచితంగా ఉంటుం దనుకొన్నాడు కాబోలు-పోతన! మూలగ్రంథాల్లోని విషయాలకూ-సన్నివేశా లకూ తగినట్లు మార్పులు, చేర్పులూ చేయడం అనువాదాల్లో సహజం! 'అగ్నిద్యోతన' నామం-అతని బాహ్యాంతఃశుద్ధినీ, నిర్మ లత్వాన్నీ, సత్యధర్మనిష్ఠనూ, కార్యనిర్వహణదక్షతనూ స్ఫురింప జేస్తుంది. ఈ చేర్పు మిక్కిలిమనోహరం!

# మౌసల పర్వ మార్మికత

ఆచార్య గార్లపాటి దామోదరనాయుడు

కవిత్రయభారతంలో మౌసలపర్వం పదహారవది. కురుక్షేత్రసంగ్రామంలో రథసారథి, భారతకథాసారథి అయిన శ్రీకృష్ణుని నిర్యాణం ఈ పర్వంలోని ప్రధానాంశం. యావత్ ఆంధ్రదేశమేకాక భారతావని అంతా సత్యా శ్రీకృష్ణులచే సంహరింపబడిన నరకాసురుని చావును దృష్టిలో ఉంచుకొని దీపావళి పండుగను జరుపుకుంటారు. లోకకంటకుడైన నరకునిమరణం సమాజానికి సంతోషం. అయితే శ్రీకృష్ణుని నిర్యాణంగురించి ఉపన్యసించడం కూడా అనౌచిత్యం అని కొందరిభావన. అందుకే కథకులు, హరికథకులు కొందరు పండితులు కృష్ణావతారాన్ని, కృష్ణలీలను, కృష్ణార్జునయుద్ధాన్ని, రుక్మిణీకల్యాణాన్ని, గజేంద్ర మోక్షాన్ని ఈ మొదలైన అంశాల్ని ప్రస్తావిస్తారు తప్ప శ్రీకృష్ణుని నిర్యాణం ప్రస్తావన చేయరు. హరివంశ నిర్మాత ఎర్రన కృష్ణ నిర్యాణాన్ని దాటవేసినాడు. ఉత్తరహరివంశప్రదాత నాచన సోమన్న కృష్ణనిర్యాణం పొంతకు పోనేపోలేదు.

అయితే తిక్కనగారు మౌసలపర్వంలోను పోతన, వెలిగందల నారయ భాగవతంలోను శ్రీకృష్ణునినిర్యాణాన్ని వివరించియున్నారు. జీవిపుట్టుకకు ఆనందాన్ని, మరణానికి దుఃఖాన్ని సంబంధీకులు అనుభవించడం మానవనైజం. జీవి పాపపుణ్యాలను అనుసరించి ఈలోకంలో జన్మించడం కర్మసిద్ధాంతం. పాప పరిహారం పొందిన జీవి జన్మరాహిత్యాన్ని పొందుతా దని ఋషుల వాక్కు. మనిషిజన్మం జీవులలో ఉత్తమమైనది కావచ్చు. జన్మ రాహిత్యం అంతకంటే ఉత్తమమైనది. తిక్కనభారతంలో ఈ విషయం స్పష్టంగా కనబడుతుంది.

మానవులను ధర్మమార్గప్రవర్తకులుగా మోక్షగాములుగా, సత్యవంతులుగా, నీతిమంతులుగా, తీర్చిదిద్దటానికి జ్ఞానం అవసరం. అట్టిజ్ఞానాన్ని లోకానికి అందివ్వడానికి పూనుకొనిన వారిలో వ్యాసుడు ప్రథముడు. "వి" అను ఉపసర్గతో కూడిన "అస్" ధాతువుతో ఏర్పడిన వ్యాసశబ్దం గౌరవసూచి అని పలువురి అభిప్రాయం. వ్యాసులు లోకంలో అనేకులు. అయితే వ్యాసుడు అనగానే సాహిత్య లోకానికి కృష్ణద్వైపాయనుడే గుర్తుకు వస్తాడు. ఇతడు భారతనిర్మాత. వ్యాసనిర్మితభారతాన్ని కవిత్రయంవారు తెలుగులో నిర్మించారు. అందులో పదిహేను పర్వాలనిర్మాత తిక్కన.

కొమ్మనామాత్యపుత్రుడు, అమలోదాత్తమనీష గలవాడు, హరిహరనాథోపాసకుడు, సోమయాజి అయిన కొట్టరువు తిక్కనగారు తెలుగు సాహిత్యంలో నాటకీయశైలికి ఆద్యుడు. పాత్రచిత్రణలో అద్వితీయుడు. సంభాషణరచనలో సిద్ధహస్తుడు. అల్పాక్షరాలతో అనల్పార్థరచనచేయుటలో సాటిలేని మేటి పండితుడు. అలతి అలతి మాటలతో తెలుగునుడికారపు వంపు సొంపులను చూపుట తిక్కనమాత్రమే నేర్చినవిద్య. తిక్కనవలె కవిత చెప్పవలె నని కుతూహలపడని తెలుగుకవి లేడు. సఫలీకృతుడైన కవిలేడు అనుట కూడా సత్యదూరం కాదు.

**మౌసలపర్వవిశిష్టత :** మౌసలపర్వఇతివృత్తం ప్రధానంగా శ్రీకృష్ణుని నిర్యాణం. ఇది ఏకాశ్వాసం. 226 పద్యగద్యలు కలిగి ఉంది. విరాట, ఉద్యోగ పర్వాల తర్వాతి పర్వాలలో నాటకీయత కొంత సన్నగించింది. అందులకు ఇతివృత్తవిషయం కారణం కావచ్చు. కానీ, మౌసలపర్వంలో చక్కనినాటకీయత చోటు చేసుకొంది. వ్యాసనిర్మిత సంస్కృత భారతంలో మౌసలపర్వం 9 అధ్యాయాలతో 273 శ్లోకాలతో విరాజిల్లుతూ ఉంది. కురుక్షేత్ర సంగ్రామానంతరం 36 సంవత్సరాలకు ఇంద్రప్రస్థనగరంలో అనేకఅపశకునాలు గోచరించినాయి. అనేకమహోత్పాతాలు పుట్టినాయి. ధర్మజుడు "ఒండొరులతో పెనగి, సర్వయాదవులును తెగిరి, అంబుజనాభుడు హలధరుండుతక్క" అని విని, తమ్ములను పిలిపించి, విషయాన్ని వివరిస్తాడు.

ధర్మజునిమాటలలో తిక్కన నొక్కి చెప్పిన అంశం "విధివశమున మనముల అవినీతి జనియింప" అన్నది.

**క॥ ద్వారవతికిఁ గణ్వుండును**
**నారద మునివరుఁడు గాధినందనుఁడును బెం**
**పారంగఁదొల్లి వచ్చిరి**
**నారాయణుఁ జూచు వేడ్క నరవరముఖ్యా!**

**సీ॥ చనుదెంచి పురవీథిఁ జను నవసరమున**
**వృష్ణికుమారులు విధివశమున**

**మనముల నవినీతి జనియింప సాంబున**
**కంగనాలంకార మమరc జేసి**
**కొనివచ్చి, యమ్మహామునివర్గమునకు మి**
**థ్యావినయమున వందన మొనర్చి**
**నిభృతులై కారుణ్య నియతాత్ములార! యీ**
**భామిని బభ్రునిభార్య ప్రజలc**

**తే॥ గనునె యిది యని యడగిన గౌరవేంద్ర!**
**యత్తపోధనవర్యు లయ్యాగడమున**
**కాత్మలందు గ్రోధానల మగ్గలముగ**
**నెలయ నక్కుమారులతోడ నిట్టు లనిరి.**

విధివశంతో అవినీతిపరులైనారేగాని, స్వభావసిద్ధంగా వృష్ణిని కుమారులు అవినీతి పరులుకారు. అంటే విధి బలీయం అయిం దని తిక్కన స్పష్టం చేశాడు.

వృష్ణికుమారులు సాంబునికి అంగనాలంకరణచేసి, మునుల చెంతకు తీసుక వచ్చి మిథ్యావినయంతో వందనం బొనర్చి, మునులనే పరీక్షించయెంచినారు. విషయం తెలుసుకొన్న మునులు ఆత్మలో క్రోధం అగ్గలం కాగ, ఈ సాంబుని కడుపున యాదవనాశనానికి మూలమైన ముసలం పుడుతుం దని, బలరామకృష్ణులు తప్ప, మిగిలిన యాదవులందరూ ముసలం కారణంగా మరణిస్తా రని శపించి, కృష్ణదర్శనంకూడ చేసుకోకుండా వెళ్లిపోతారు. ఇది వినిన కృష్ణుడు వృష్ణికుమారు లనుగూర్చి కూలంకషంగా తెలిసినవాడు కాబట్టి ఇది మనవారి తప్పిదం కా దని, విధాతృనిర్ణయం అని భావిస్తాడు.

మునులశాపంతో సాంబునికడుపున ముసలం పుట్టింది. కృష్ణుని కీ విషయం తెలిసింది. కృష్ణుడు ఆముసలాన్ని పొడిగా చేసి, సముద్రంలో కలిపేయ మని యాదవులకు ఆనతి ఇస్తాడు.

**క॥ మునిశాపశక్తి మానుష**
**మున ద్రోవగరామి యుల్లముల తలుపక య**
**జ్జనపతియు బాంధవులు న**
**ట్లొనర్చి యూరడిలి యుండి రుర్వీనాథా!**

"మునిశాపశక్తి మానుషమున ద్రోవగరామి" అన్నది సామాన్యకవులఅసాధ్యమైనప్రయోగం. "మానుషమున ద్రోవగరామి" అనుటలో విశేషార్థం ఉంది. మునిశాపం, గాంధారి శాపం బలీయం. విధియందు భగవంతుడైనా తల వంచక తప్పదు. అందుకే శ్రీకృష్ణపరమాత్ముడు మానుషమున ద్రోవగరామి అని అనుకొన్నాడు. తర్వాత ద్వారకానగరంలో అనేకఉత్పాతాలు పుట్టినాయి. మహాకవి షేక్స్‌పియర్ "Coming Events Cost their Shadows" అని అంటాడు. ఆవిధం గానే ద్వారకానగరంలో దుశ్శకునాలు ప్రబలినాయి.

**సీ॥ చిలుకలు గూబలయెలుcగులచందంబు**
**దోcపంగ నఱచు రాత్రులను దినము**
**లందును, నక్కలయట్లు మేcకలు గూయు**
**మొదవుపిందునకు గాడిదలు పుట్టు**
**ముంగుల కుదయించు మూషికంబులు గుక్క,**
**తెల్లను బిల్లుల నీను బలుడు**
**హరియను దక్కంగ యాదవనివహంబు**
**బ్రాహ్మణప్రతతికి బాధసేయు**

**తే॥ గురుల కవమాన మొనరించుదిరుగు లజ్జ**
**విడిచి, యభిలాషములవెంట విభులపంపు**
**సేయకున్మార్గముc దమచిత్తములకు**
**వచ్చినట్ల వర్తింతురు వనిత లధిప!**

**సీ॥ అనుదినంబును నిట్టు లశుభసూచకములు**
**దోపంగ సర్వవిదుండు కృష్ణుc**
**డంతరంగమున సమాలోచనము చేసి**
**గాంధారి పుత్రశోకమునc జేసి**
**కోపంబు గదిరిన శాపంబు ముప్పది**
**యాఱవునే డెల్ల యాదవులకు**
**నాశ మన్యోన్య హననమున నగుటకు**
**నిచ్చెనిష్ఠించి; యయ్యేడు వచ్చెc**

**ఆ॥ దప్పcదది ఫలించు; దానికిc దీర్ఘస**
**మీపభూమియైన మేలుగాదె**
**యని నరేంద్ర! యమ్మహాత్ము డీ భంగి నూ**
**హించి తెఱగు నిశ్చయించెc దివిరి.**

ఇక్కడ కవిబ్రహ్మ ప్రయోగం గమనింపదగి ఉంది. "కృష్ణుడు అంతరంగమున సమాలోచనచేసి" అన్నది ప్రయోగం. ఆలోచన

చేయుట మానవసహజం. సమాలోచనం చేయుట ఉన్నతం. పదుగురుతో ఆలోచనచేయడం ఒకపద్ధతి. కష్టం సంభ వించినప్పుడు తాను ఆలోచించి, తన శ్రేయస్సును కోరే వారితో ఆలోచన చేసి, నిర్ణయం తీసుకోవడం మానవసహజం. దైవాంశసంభూతుడైన మానవుడు తనలో తాను ఆలోచించు కుంటాడు. కానీ, దైవమే అయిన శ్రీకృష్ణుడు అంతరంగంలో సమాలోచన చేశాడు. ఏమిటి ఆ సమాలోచన అన్నది ప్రశ్న? నేటికి గాంధారి శాపం ఇచ్చి 35 సంవత్సరాలు పూర్తిఅయ్యింది. ఆమెశాపంప్రకారం 36వ సంవత్సరంలో యాదవుల నాశనం తప్పదు. ఇక మునులశాపం అనివార్యం. ఈ రెండుశాపాలను నివారించగలిగినశక్తి భగవంతుడైన శ్రీకృష్ణునికి ఉంది. అయితే ప్రస్తుతం శాపాలను నివారించాలా! లేక యాదవనాశనాన్ని కళ్ల చూడాలా? అన్నదే అంతరంగంలో జరిపిన సమాలోచన. ఇది ఇతరులతో ఆలోచించడానికి వీలుకాని విషయం. అందుకే పర మాత్ముడైన శ్రీకృష్ణుడు తా నొక్కడే అంతరంగంలో ఆలోచన చేశాడు. తిక్కన ఒక్కడే చూచినాడు. ఆ సమాలోచన యాదవ నాశనానికి స్థలనిర్ణయం.

యాదవనాశనానికి స్థలనిర్ణయం జరిగింది. శ్రీకృష్ణుడు పెద్దకొలువుచేసి, జాతర చేయా లని నిశ్చయించినాడు. ఆరాత్రి పీడకలతో తెల్లవారింది. అందరూ చూస్తూ ఉండగానే శ్రీకృష్ణుని చక్రం గరుడకేతనంతోసహా అకాశానికి ఎగిరి పోయింది. ఆవెంటనే బలరామునితాడిసిడము చక్రాన్ని అనుసరించింది. వాటిని అనుసరించి, వాసుదేవునితేరు ఆకాశానికి ఎగిరి పోయింది. ఇన్ని జరిగినా యాదవులు తీర్థయాత్ర సంకల్పాన్ని మానుకోలేదు. వారిపై మునులశాపశక్తిప్రభావం అంతగా పనిచేసింది. **'వినాశకాలే విపరీతబుద్ధిః'** అన్ననానుడి సత్య మయింది. శ్రీకృష్ణుడు రథంలేకపోవడంచేత వేరొకరి రథంలో నిర్వికారచిత్తుడై తీర్థయాత్రకు బయలుదేరినాడు.

"కృష్ణుడు నిర్వికారచిత్తత వెడలెను" ఇది తిక్కనగారి ప్రయోగం. ఇక్కడ నిర్వికారత-యాదవనాశనవిషయం తెలిసిన కృష్ణునికా? లేక కృష్ణునిర్యాణాన్ని చెప్పబోతున్న తిక్కనకా? లేకుంటే జరగబోయే కృష్ణునిర్యాణాన్ని తలుచుకొని బాధను పొందే పాఠకులకా? అన్నది ప్రశ్న! తాను వచ్చినపని ముగిసింది. ఇక తాను దివికి అరుగబోతున్నాడు. సుమారు 125 సంవత్సరాలు తాను నివసించిన ఈ భూమిని వదిలి పోతున్నాడు. కాబట్టి కృష్ణుడికీ నిర్వికారత తప్పలేదేమో? అంతేగాక తాను తన ఆయుధసామగ్రి, రథాదులను కూడా పోగొట్టుకొన్నదాన్నిగూర్చి ఏమాత్రం ఆలోచించనియాదవ సమూహం, అదికూడా చావు విషయం తెలియకుండా, చావును వెతుక్కుంటూ తీర్థయాత్రలకు వెళ్లుతున్న యాదవులపై జాలితో కృష్ణుడు నిర్వికారచిత్తుడై ఉండవచ్చు.

సుయోధనుని మరణవార్త వ్రాస్తూ "ఏమి చెప్పదుం గురు నాథా" అని నిర్వికారత పొందిన తిక్కన- శ్రీకృష్ణుని మరణవార్త వ్రాయవలసివచ్చినందుకు నిర్వికారాన్ని పొందినాడేమో! అట్లే భారతపర్యంతం శ్రీకృష్ణునిచాతుర్యం, లీలలు, రాజకీయ ఎత్తు గడలు చదివినపాఠకులు శ్రీకృష్ణునిర్యాణాన్ని చదవబోతూ నిర్వికారచిత్తులు కావచ్చు.

ఉద్ధవుడు తపమాచరించా లని అనుమతి అడిగినాడు. "ఒందు ఒకటి పలుకడు కృష్ణుడు కాలవేదితన్" అని వ్రాశాడు. తిక్కన ఇక్కడ "కాలవేదితన్" అన్న ప్రయోగం గమనింపదగి ఉంది. ఎంతటి వారికైనా కాలం అనుకూలిస్తేనే వారిప్రాభవం నిలబడుతుంది. కాలం వ్యతిరేకిస్తే ఎంతటి వారైనా తలవంచక తప్పదు. ఈ సత్యం తెలిసినవాడు శ్రీకృష్ణుడు. ఈ సత్యాన్ని చెప్పినవాడు కవిబ్రహ్మ.

**క॥ విను మొక్కడు నొక భూరుహ**
**మున మూలంబున నిరస్త మోహాంధత్వం**
**బున వెలుగుబుద్ధి విజ్ఞే**
**య నిరూఢతఁ జేసి యుండె నాసీనుండై**

మోహం అనే చీకటి పూర్తిగా తొలగిపోయిన తర్వాతనే జ్ఞాన మనే వెలుగు వస్తుంది. అట్టి జ్ఞానం సంపూర్ణంగా గలి గిన శ్రీకృష్ణుడు ఒకవృక్షమూలాన ఆసీనుడై ఉన్నా డని తిక్కన వర్ణన. సత్‌బ్రాహ్మణులకోసం వండినకూడు, కూరలను యాదవులు కోతులకు పెట్టినారు. శ్రీకృష్ణుడు చూస్తూ ఉండగానే అతనిఎదుటనే నంజులతో మద్యం సేవించినారట. మద్యం మత్తు తలకెక్కి, సాత్యకిప్రద్యుమ్నులు 36 సంవత్సరాల క్రితం జరిగిన విషయాన్ని గుర్తుచేసుకుంటూ కృతవర్మను నిందించారు.

కృతవర్మకూడ మద్యం ప్రభావంతో సాత్యకిని తూలనాడినాడు. ఈ గొడవలలో యాదవులలోనితెగల ప్రస్తావన వచ్చింది. ఒకరితెగను ఒకరు నిందిస్తూ వారివారితెగలను పొగడుకోవడం చేసినారు. ఈ తెగల ప్రస్తావనలో అక్కడే ఉన్న సత్యభామకు కోపం తారాస్థాయికి చేరింది. "కోప మదిరి వనితా స్వభావో ద్గతాశ్రుపూర యగుచు" కృష్ణునివద్దకు వచ్చింది. సత్యభామ కోపానికి కారణం కృతవర్మ తలతుంచినాడు– సాత్యకి. అంతటితో ఆగకుండా యాదవులలో ఒకతెగ అయిన భోజకుల మీద దూకినాడు. అప్పుడు భోజకులు అంధకులు ఒక్కటిగా, సాత్యకిని చుట్టుముట్టినారు. ప్రద్యుమ్నుడు సాత్యకికి అండగా నిలిచినాడు. శ్రీకృష్ణుడు నిర్వికారచిత్తుడై చూస్తూ ఉన్నాడే గానీ, ఎవరినీ వారించలేదు. అసలు మాట్లాడలేదు. ముసలం కారణంగా పెరిగిన తుంగ, భోజ అంధక వృష్ణి తెగలవారి నాశనానికి కారణం అయింది.

ఇదంతా చూచిన పద్మనాభుడు మునులశాపశక్తికి తానుకూడ లోనైనాడు. "తీవ్ర కోపాగ్ని తనచిత్తమున ఉద్ధురమై జనింపగ" మిగిలిపోయిన యాదవులను తానే చంపేశాడు. తర్వాత దారక బభ్రులతో కలసి బలరాముని వెతుకుతూ బయలు దేరినాడు. కొంతదూరం వెళ్లాక దారుకుని ఇంద్రప్రస్థానికి వెళ్లి, అర్జునుని తీసుకురమ్మని, స్త్రీసముఖాన్ని అంతా ద్వారకా నగరానికి చేర్చ మని బభ్రుని పంపినాడు. అయితే కృష్ణుడు చూస్తూ ఉండగానే ఒకబోయ కొట్టినతుంగదెబ్బకు బభ్రుడు మరణించాడు. మునుల శాపశక్తికి కృష్ణుడు ఆశ్చర్యపోయినాడు. తప్పనిసరిపరిస్థితులలో తానే స్త్రీలను, ఏనుగులను, గుర్రాలను, రథాలను నగరానికి చేర్చడానికి ప్రయత్నించాడు.

నగరానికి చేరిన శ్రీకృష్ణుడు వసుదేవునికాళ్లకు నమస్కరిస్తూ "ఆనాడు కౌరవనాశనాన్ని చూచినాను, నేడు యాదవనాశనాన్ని చూచినాను. బంధుహీనమైన ప్రదేశంలో నిలువజాలను, అన్న బలరాముడు అడవికి ఏగినాడు. అర్జునుడు వస్తాడు. మీకు అండగా ఉంటాడు. నేను అడవులకు వెళ్లుతున్నాను" అని నిర్వికారుడై నుడివినాడు. వసుదేవుడు శవంవలే మిగిలి పోయినాడు.

బలరాముడు శరీరాన్ని వదిలి, అనంతుడిని కలిసినాడు. శ్రీకృష్ణుడు అక్కడక్కడ సంచరిస్తూ తాను ఈ లోకానికి వచ్చింది మొదలు తాను నిర్వహించిన పనులన్నీ మననం చేసుకొన్నాడు. తాను వచ్చినపని ముగిసింది అనుకొన్నాడు. గాంధారిమునుల శాపాన్ని తలచుకొని "జలనిధి శయనుండు మహీస్థలశయనుం డయ్యె" పాలసముద్రంమీద పవ్వళించే ఆ వైకుంఠవాసుడు ఈ మానవశరీరాన్ని త్యజించడానికి భూశయనుం డయినాడు. అక్కడే తిరుగుతున్న ఒక్క వేటగాడు శ్రీకృష్ణునిపాదం బొటన వ్రేలును దూరంనుండి చూచి, అది జింక చెవిగా భావించి, బాణంతో కొట్టాడు. ఇక్కడ తిక్కన గారు "మాయ ఆవహించి" అని ప్రయోగం చేసినాడు. గాంధారీమునులశాపం ఒక మాయగా మారి, బోయవాడికంటికి శ్రీకృష్ణుని కాలి బ్రొటన వ్రేలు జింక చెవిగా కనిపించింది అని తిక్కనగారు స్పష్టం చేశారు. శ్రీకృష్ణుడు ఈ భూమికి తాను వచ్చిన కార్యం ముగిసింది. శరీరత్యాగం చేయా లనుకొన్నాడు 'నింద లేనిదే బొందె పోదు' కాబట్టి బోయవాడికి "మాయ" ఆవహించింది. అల్పార్థ పదాలతో తిక్కన ఈలాంటి అనల్పార్థభావనలు ఎన్నో భారతంలో చేశాడు. శరీరాన్ని వదిలి, ఊర్ధ్వలోకాన్ని చేరిన శ్రీకృష్ణునికి అక్కడ దివ్యపురుషులు స్వాగతం పలికారు.

దారకుడు తెచ్చినవార్త విని, పాండవులు దుఃఖసాగరంలో మునిగిపోయారు. అర్జునుడు దారకసహితుడై ద్వారకకు శీఘ్ర గతిన బయలుదేరినాడు.

**చ॥ అరిగి, మగండు సచ్చిన కులాంగనయున్, శశి గ్రుంకినట్టి శ**
**ర్వరియునుఁబోల్పఁ బట్టగుచు వారిజనాభుఁడు లేనిదీనతం**
**బొరసి, కృపైకభాజనతఁ బొందినయప్పురిఁ జూచి, మానసం**
**బెరియఁగఁజొచ్చె, నేటి కెదురేఁదినచాడ్పున నేమి సెప్పుదున్**

మగడు చచ్చినకులాంగనలు శశిక్రుంకినట్టి శర్వరిని పోలిఉన్నారు అని ఒక్క చక్కని ఉపమానంతో శ్రీకృష్ణుని భార్యల దుఃఖాన్ని తిక్కన తెలియజేశాడు. ద్వారకానగరానికి ప్రవేశిస్తున్న అర్జునుడికి ఏటికి ఎదురువెళుతున్నట్లుగా ఉన్నదట. కృష్ణార్జునుల బంధం లోకవిదితం. ద్వారకానగర ప్రవేశం అర్జునుడికి ఎంతో ఆనందదాయకం. అది అర్జునుడికి అత్తవారిఇల్లు. అటువంటి ద్వారకా నగరానికి దుఃఖసముద్రంలో మునిగిన అర్జునుడు ఏటికి

ఎదురు ఈదునట్టుగా ప్రవేశిస్తున్నాడు. నగరంలో కృష్ణుడు లేడన్న విషయం అప్పటికి అర్జునుడికి తెలియదు. కృష్ణుని చూడా లన్నే ఆశ అర్జునుడికి అధికంగా ఉంది. ఆ సమయంలో "మురాంతక ప్రియాంగనలు పదారువేలును మొగంబుల గప్పగ బాష్పవారి, రోదనముల్ చెలగంగ, పదంబులు తొట్రుపడంగ, దైన్యమున్ తనువులు దాల్చినట్లు తెరలం జనుదెంచిరి, పార్థుపాలికిన్" వారి దుఃఖాన్ని చూచిన అర్జునుడు ధీరోదాత్తుడు గనుక ఎలుగు గద్గదికన్ కలగంగా ఏడ్చినాడు. అప్పుడు ఆ స్త్రీలు 'దిక్కెవ్వరు మాకు' అనుచు దీనతతో విలపించినారు.

కృష్ణుని విషయం మనసున ఆందోళన కలిగిస్తూ వుండగా అర్జునుడు ఆ విషయాన్ని తెలుసుకోవాలనే ఆతురతతో వసుదేవుని మందిరానికి వెళ్లినాడు. వసుదేవుడు శయ్యపై నుండి లేచి సవ్యసాచిని కౌగిట చేర్చి అకారణ రోషాన దైవం అలిగి యాదవ నాశనం అయిపోయిందని విలపించాడు.

**క॥ విను నీశిష్యులు సాత్యకి**
**యును బ్రద్యుమ్నుండు నిమ్మహోగ్రపుసమరం**
**బునం దొలు పీనుగు లై రని**
**వినియుఁ బ్రదికినాఁడ నేన వీరుఁడ జగతిన్**

సాత్యకి, ప్రద్యుమ్నులు అర్జునుడిశిష్యులు. యాదవుల నాశనానికి వారే ప్రధానకారకులు. అర్జునుడిదగ్గర విద్య నేర్చిన ఆ ఇరువురు ఎంతో గుణసంపన్నులు అయినా విధి బలీయం! ఈ దుష్టకార్యానికి వాళ్లు పూనుకొన్నారు.

వసుదేవుడు తనమాటలలో యాదవనాశనాన్ని, కృష్ణుని ఉపేక్షను చెప్పినాడు కాని, కృష్ణునిగురించిమాత్రం చెప్పలేదు. అర్జునుడు ఎదురుచూచేది కృష్ణుని విషయం తెలుసుకొనే దానికి. అర్జునుడు కృష్ణుడు ఎక్కడున్నా డని ప్రశ్నించాడు. అందుకు వసుదేవుడు శ్రీకృష్ణుడు నాతో నీవు వస్తున్న వార్తను చెప్పి, కొన్ని దినాలలో సముద్రం ద్వారకను ముంచివేస్తుం దని జెప్పి, నీవు వచ్చి వనితలను బాలురులను, కాపాడుతా వని వివరించి, అడవులకు వెళ్ళిపోయాడు- అని చెప్పినాడు. అర్జునుడు కృష్ణుని విషయం తెలియక చాలా మనస్తాపం చెందాడు. కృష్ణుడు లేని ద్వారకలో ఉండటం సాధ్యంకా దని స్త్రీజనాన్ని, బాలురులను, ఇంద్రప్రస్థానికి చేర్చా లని మనసులో భావించాడు. అంతకంటే ముందే శ్రీకృష్ణుని జాడ తెలుసుకోవా లని దారకసహితుడై పోవ నిశ్చయించినాడు. మదిని వగలు మిగులు ఆరేయి కృష్ణ సదనమున కాలం వెలిబుచ్చినాడు. తెల్లవారేటప్పటికి వసు దేవుడు ఈ లోకాన్ని వదిలేశాడు. అర్జునుడు వసుదేవుని పార్థివశరీరానికి అగ్నిసంస్కారం జరిపాడు. పిమ్మట రామకృష్ణు లను వెతుక్కుంటూ బయలుదేరినాడు. అతని మనసు పరిపరి విధాల పరితపిస్తూ ఉంది. నన్ను రమ్మని, తండ్రికి కావలిగా ఉండు మని ఆదేశించి, వెళ్లినఆ భగవానునికి అతనితండ్రి మరణవార్తను చెప్పుటకా నేను వెళ్ళునది అని దుఃఖించినాడు. తిరిగి తనలో తాను వసుదేవునిమరణవార్తను కృష్ణునికి చెప్ప కూడ దని భావించాడు. చెబితే అతనితపోనిష్ఠకు భంగం కలుగుతుం దని భయపడినాడు. అంతలో అర్జునునిమదిలో



## శ్రీ వేంకటేశ్వర స్తుతిరత్నమాల

**శా॥ విన్నంజాలు భవన్మహత్త్వము, భవద్విజ్ఞానసద్గోష్ఠిలో**
**నున్నంజాలు, భవత్పదాంబురుహసేవోత్సాహసంపన్నులం**
**గన్నంజాలు, భవత్సమంచితజగత్కల్యాణనామంబుఁ బే**
**ర్కొన్నంజాలు, నరుండు శాశ్వతశుభారూఢుండు లక్ష్మీశ్వరా!**

\- ఎఱ్ఱా ప్రెగ్గడ

గాంధారిశాపం తళుక్కున మెరిసింది. **"దిక్కెవరు లేని యట్టిచోట నీకు తెగుట సంభవించు"** అని ఆమె కృష్ణుని శపించినప్పుడు అర్జునుడు దగ్గర ఉండి, ఆమెమాటలు విన్నాడు. అలా జరుగుతుందేమో అని భయపడినాడు. కాని **"నిప్పును చెదలంటు నొక్కొ!"** అని సమాధానపడినాడు. అర్జునుని భావనలో శ్రీకృష్ణుడు నిప్పు. గాంధారిశాపం చెదలు, ఆ భావనకూడా మనసులో ఎక్కువ కాలం నిలవలేదు. "విధాతచేంత కడ్డము గలదే" అన్న భావన వచ్చింది. విధి కేదీ అడ్డంకాదనీ, కృష్ణుడు కూడా విధిని ఎదిరించలే డనీ, విధివైపరీత్యంచేత కృష్ణుడికేమైనా ఆపద సంభవించిందేమో నని అర్జునుడు మనస్సులో కలతచెందినాడు. అర్జునుడు బోయవానిసహాయంతో విగతజీవుడైన కృష్ణుని చూచినాడు మూర్ఛిల్లినాడు. మూర్ఛనుండి లేచి, కృష్ణునిశవాన్ని కౌగిట చేర్చినాడు.

**అవికృతమును రుచిరమునై**
**యవయవములు నిదురపోయినప్పటిక్రియనుం**
**ద వఱలు కృష్ణునిదేహం**
**బవిరత చక్షురభిముఖత నాలోకించెన్**

దుఃఖంలో మునిగిఉన్న అర్జునుడికి ఆ మరుసటిరోజే ద్వారకను సముద్రం ముంచివేస్తుం దనే విషయం గుర్తుకు వచ్చింది. ఆ వెంటనే లేచి అటు ఇటు చూశాడు. దగ్గరలోనే బలరామునిశవంకూడా కనిపించింది. పొంగివస్తున్న దుఃఖాన్ని పండ్లబిగువున అదిమిఉంచి, ఆ నిర్జన ప్రదేశంలోనే ఆ రెండు శవాలకు దహనసంస్కారాలు చేశాడు. వెనువెంటనే ద్వారకకు చేరినాడు. స్త్రీలను, బాలురను తీసుకొని, ఇంద్రప్రస్థానికి పయనమయినాడు. మధ్యలో బోయలు కొందరు అర్జునుని ఎది రించి స్త్రీలవద్దనున్న నగలను దోచుకొని పోయినారు. భీష్మ, ద్రోణ, కర్ణాది అతిరథమహారథసమరథులను కురుక్షేత్ర సంగ్రామంలో ఒక్కచేతిమీదుగా సంహరించిన అరివీరభయం కరుడు-ఫాలనేత్రుని ఓడించి పాశుపతమును పొందిన పార్థుడు-ముక్కటి మూకచేతిలో ఓడినాడు. అవమానంతో ఇంద్రప్రస్థం చేరినాడు. శ్రీకృష్ణమరణవార్త తెలిసిన రుక్మిణి మొదలైన కొందరు అగ్నిప్రవేశం చేసినారు. సత్యభామ మరికొందరు తపస్సుకై అడవులు చేరినారు.

**దారిలో అంబులెన్సు వాహనం వచ్చినప్పుడు...**
**దానికి దారి వదిలి,**
**మీవంతు సహాయం చేయండి!**
**అందులోని రోగికి ఆరోగ్యం మెరుగుపడా లని**
**మనసారా 'శ్రీవేంకటేశ్వరస్వామి'ని వేడుకోండి!!**

విషాదవదనంతో అర్జునుడు వేదవ్యాసుని వద్దకు చేరినాడు. యాదవనాశనం, రామకృష్ణుల నిర్యాణం బోయలచేతిలో తన భంగపాటు వ్యాసునికి తెలియజేసి, శోకించినాడు. అప్పుడు వ్యాసుడు విజ్ఞులు ఎవ్వరూగాని ప్రాప్తకాలంబగుపనికి అడ్డు పడరు. కృష్ణుడు విజ్ఞుడు కావున కాలానికి ఎదురు వెళ్లకుండా ఉపేక్షించినాడు. అట్లే భూభారాన్ని తగ్గించడానికి ఉపయోగపడిన నీ అస్త్రాల శక్తి నిన్ను వీడి దేవలోకం చేరింది.

**తే॥ కాలమూలంబు సర్వంబు గాన దీని**
**కొంద తలపులు దక్కి మీ రుత్తమంపు**
**గతికి జనుడు నిశ్చింత వికారతనులు**
**విడిచి యార్యజనంబులు వినతి సేయు**

'కాలోహి మూలం సర్వమ్' కాబట్టి నిశ్చింత బుద్ధితో ఉత్తమ గతికి వెళ్ల మని వ్యాసుడు అర్జునునికి ఉపదేశించాడు. వ్యాస ఉపదేశం పొందిన అర్జునుడు శోకమోహంబులు వదిలి, వ్యాసుని వీడుకొని ఇంద్రప్రస్థం చేరుటతో మౌసలపర్వం ముగిసింది.

కవిబ్రహ్మ కవితాశక్తికి అల్పపదాలతో అనల్పార్థాన్ని సాధించ డానికి, కొంత నాటకీయశైలికి తాత్త్వికదృష్టికి ఈ మౌసలపర్వం చక్కని ఉదాహరణ. ఈ మౌసలపర్వంలో ఉభయకవి మిత్రుడు యాదవుల ఆడబిడ్డ, బలరామకృష్ణుల ముద్దులచెల్లి అయిన సుభద్రదుఃఖాన్ని ప్రస్తావించకపోవడం గమనార్హం.

కృష్ణుని నిర్యాణఘట్టాన్ని మౌసలపర్వంలో తిక్కన ఋషియై హరిహరనాథోపాసకుడై నిర్మించాడు. కవిబ్రహ్మసృష్టి అపూర్వం. ఉభయకవిమిత్రునిపద్యాలపోకడ అనన్య సామాన్యం. పాఠకులు ఈ పర్వాన్ని చదువుతున్నంత సేపు వారి వారిఆప్తులు, బంధు వులు, వారిసన్నిహితులు మరణించా రనే అనుభూతిని పొందు తారు. కనుకనే, తిక్కన కవిబ్రహ్మ.

**తిరుమల తిరుపతి దేవస్థానములు**

**హిందూధర్మప్రచారపరిషత్తు, తిరుపతి**

# "సనాతనధార్మికవిజ్ఞానపరీక్షలు"

**"జ్ఞానం సమ్యగవేక్షణమ్"** – జ్ఞానమే మనిషికి సత్యదృష్టిని ఏర్పరుస్తుంది. ఆర్షవిజ్ఞానం, హైందవసంస్కృతి, సనాతనసంప్రదాయాలు మానవజీవితాన్ని ఆనందమయంగా, శుభప్రదంగా తీర్చిదిద్దుతాయి.

జ్ఞానసర్వస్వ మనదగిన మనవేదవిజ్ఞానాన్ని విద్యార్థిదశలోనే బాలబాలికలకు అందించా లనేసదాశయంతో తి.తి.దేవస్థానములు, హిందూధర్మప్రచారపరిషత్తు – ఉన్నతపాఠశాలవిద్యార్థులకు **'సనాతనధార్మికవిజ్ఞానపరీక్షలు'** నిర్వహిస్తూ ఉంది.

1980–81 సంవత్సరంలో ఈ పరీక్షలనిర్వహణకు హిందూధర్మప్రచారపరిషత్తు నాంది పలికింది. ఇప్పటివరకు 30 సార్లు రాష్ట్రవ్యాప్తంగా ఈ పరీక్షలు నిర్వహింపబడినాయి. గతసంవత్సరంలో నిర్వహించిన 30వ సనాతనధార్మిక విజ్ఞానపరీక్షలకు 61256 మంది పాల్గొనడం జరిగింది. **31వ సనాతనధార్మికవిజ్ఞానపరీక్షలు 09-11-2013 శనివారం నాడు నిర్వహించబడుతాయి.** సుమారు లక్షమందివిద్యార్థినీవిద్యార్థులను పాల్గొనచేయా లని సంకల్పం!

**వివరములు**

**6, 7 తరగతులకు - ధర్మపరిచయం**

**8, 9, 10 తరగతులకు - ధర్మ ప్రవేశిక**

పై పరీక్షలకు సంబంధించిన దరఖాస్తులు ప్రతిజిల్లాలోని తి.తి.దేవస్థానకల్యాణమండపాలలోను, హిందూధర్మప్రచార పరిషత్తు కేంద్రకార్యాలయాలలోనూ, తిరుపతి ప్రధానకార్యాలయంలోనూ లభిస్తాయి. **అయిదురూపాయల నామమాత్రపు రుసుముతో** పూర్తిచేసినదరఖాస్తులు ఆయా పాఠశాలల ప్రధానోపాధ్యాయులద్వారా **17-08-2013**లోగా **"కార్యదర్శి, హిందూధర్మప్రచారపరిషత్తు, తి.తి.దే.పాతహుజూర్ ఆఫీసు, (శ్రీగోవిందరాజస్వామిఆలయంవెనుక,) తిరుపతి-517 501"** వారికి చేరవలెను.

దరఖాస్తులు చేరినవెంటనే పాఠశాలలకు పాఠ్యపుస్తకాలు ఉచితంగా పంపబడుతాయి. **పరీక్షలు 09-11-2013న నిర్వహింపబడుతాయి. విజేతలకు రాష్ట్రస్థాయిలో మూడు స్వర్ణపతకాలు, ప్రతిజిల్లా స్థాయిలో మూడురజతపతకాలు ఉంటాయి.**

కనుక, హిందూధర్మానికి, సనాతనసంప్రదాయాలకు సంబంధించిన విషయాలు పొందుపరచిన **సనాతనధార్మికవిజ్ఞాన పరీక్షలలో** పాల్గొని, విద్యార్థులు తమబంగారుభవిష్యత్తుకు బాటలువేసుకోవా లనీ, తప్పక ఈ అవకాశాన్ని వినియోగించు కోవా లనీ, తి.తి.దే. హిందూధర్మప్రచారపరిషత్తు కోరుతూంది.

సమగ్రసమాచారంకోసం దరఖాస్తులతో పాటు కరపత్రాలూ పంపబడుతాయి.

*ఇతర వివరాలు తెలుసుకొనేందుకు :*

*ల్యాండ్‌ఫోన్ :* **0877 - 2264155**

**హిందూధర్మప్రచారపరిషత్తు,**

**తిరుపతి.**

## కదంబం

### ఏడుకొండలు

1) శ్రీశైలం
2) శేషశైలం
3) గరుడాద్రి
4) వేంకటాద్రి
5) నారాయణాద్రి
6) వృషభాద్రి
7) వృషాద్రి



## పిల్లలూ.. జతచేయండి!!

| | | | |
|---|---|---|---|
| 1) | బలరాముడు | అ) | కుంతీదేవిపుత్రుడు |
| 2) | అర్జునుడు | ఆ) | గాంధారిపుత్రుడు |
| 3) | దుర్యోధనుడు | ఇ) | రోహిణీదేవిపుత్రుడు |
| 4) | రావణుడు | ఈ) | దేవకిపుత్రుడు |
| 5) | కృష్ణుడు | ఉ) | కైకసిపుత్రుడు |

జవాబులు:
1-(ఇ); 2-(అ); 3-(ఆ); 4-(ఉ); 5-(ఈ)

## మీకు తెలుసా?

1) ఆదికావ్యమని ఏ గ్రంథానికి పేరు ?
2) భారతాన్ని ఇలాకూడా అంటారు?
3) ఆళ్వారులు ఎంతమంది?
4) శ్రీరాముడు ఏ నక్షత్రంలో జన్మించాడు?
5) సుమిత్రకుమారులు?
6) తి.తి.దేవస్థానం మొదటి కార్యనిర్వహణాధికారి ఎవరు?
7) తి.తి.దేవస్థానం ప్రస్తుతకార్యనిర్వహణాధికారి ఎవరు?

జవాబులు:
1) రామాయణం
2) పంచమవేదం, 'జయం'
3) 12
4) పునర్వసు
5) లక్ష్మణుడు, శత్రుఘ్నుడు
6) చెలికాని అన్నారావు
7) ఎల్.వి.సుబ్రహ్మణ్యం

## కనుక్కోండి...!

ఈ అక్షరాలతో
ఒక 'సూక్తి' వస్తుంది.

న వ వే ధ వ సే మా వ మా సే

జవాబు: మానవసేవే మాధవసేవ

## ఈ శ్లోకం.. మీ కోసం..

శ్లో॥ సర్వే చ సుఖిన స్సంతు, సర్వేసంతు నిరామయాః ।
సర్వే భద్రాణి పశ్యంతు, మా కశ్చిత్ దుఃఖభాక్ భవేత్ ॥

లోకంలో అందరూ, అంతటా సుఖంగా ఉండాలి. అందరూ రోగాలు లేనివాళ్లయి ఉండాలి. అందరూ శుభాలనే చూడాలి. ఏ ఒక్కరుకూడా దుఃఖం పొందకుందురు గాక!

భారతీయులు విశాలభావనులు. అందరిసుఖశాంతులూ కోరడంకంటే లోకానికి మనం చేసే ఉపకారం మరొకటి లేదు. ఇలాంటి గొప్పభావాలు బాల్యంనుంచే అలవరచుకోవాలి.

# అన్నమయ్య సంకీర్తనలు సామాజికత

డా॥ తలారివాసు

"సర్వజగన్మంగళకరదీక్షం. సకలమనుజకులకృపా కటాక్షం శ్రీ విశ్వనాథం భజే!" అన్నారు– ముత్తుస్వామి దీక్షితులు. 'సర్వేజనా స్సుఖినో భవంతు' అన్న వేదవాక్యమే సంకీర్తనల సారాంశం. సంగీతసాహిత్యాలకు సమప్రాధాన్య మిచ్చి, తన చుట్టూ ఉన్నప్రపంచంకోసం ప్రజలబాణిలో తనవాణి వినిపించిన వాగ్గేయకారుడు–అన్నమయ్య. ఆయనకీర్తనలు కేవలం భక్తి రసప్రవాహాలే కాదు. జ్ఞానామృతధారలుకూడా!

**శ్రుతులై శాస్త్రములై పురాణకథలై సుజ్ఞానసారంబులై**
**యతిలోకాగమవీథులై వివిధమంత్రార్థంబులై నీతులై**
**కృతులై వేంకటశైలవల్లభరతిక్రీడారహస్యంబులై**
**నుతులై తాళులపాకఅన్నయవచోనూత్నక్రియల్ చెన్నగున్**

చిన్నతిరుమలయ్య చెప్పిన ఈ పద్యం అన్నమయ్య సంకీర్తనల ఔన్నత్యాన్ని తెలియజేస్తుంది. అసలు ఈ గాలి, ఈ నేల, ఈ నీరు అణువణువునా నాదమయమై ప్రణవనాదంలో లీనమయ్యే ఒకానొకసంగీతవృత్తి–వాగ్గేయకారప్రవృత్తి. అది మరి ఏ భాషకూ సాధ్యం కానిది. మరే సంస్కృతిలో లేనిది. వాగర్థ ప్రతిపత్తి అనేదానికి ఋజువుగా శబ్దార్థసమ్మిళితంగా అసలు లోకానికి మార్గదర్శనం చేసింది–ఆదిశంకరులు. అది అద్వైత సిద్ధాంతమైనా సంగీతసమన్వితం. అందుకే ఇది మనకు అనుశ్రుతంగా వస్తున్న సంగీతంతో ముడిపడిన–మనకే సొంతమైన ప్రవృత్తి. 'సంగీతమపి సాహిత్యమ్...' అని కదా శ్లోకం! ఒకటి ఆనందామృతం. మరొకటి ఆలోచనామృతం. ఆనందాలోచనామృతాలరసప్రపంచంలో తేలియాడిన అన్నమయ్య సంగీత నందనోద్యానం ఒక సుందరబృందావనం! ఆద్యంతం మానవీయతను ఆకలింపు చేసుకొని సమసమాజ నిర్మాణంకోసం కలం, గళం ఉపయోగించుకున్నసంస్కర్త, సంకీర్తనాచార్యుడు. అన్నమయకోశంలో ఆనందాన్నీ అందర్నీ నింపుకున్నవాడు అన్నమయ్య. ఆ అన్నమయ్య కోశంలోనుంచి కొన్నివేల రసానంద మకరందాల్ని సాదరంగా మన కందించాడు. "ఎంత మాత్రము ఎవ్వరు తలచినా అంతమాత్రమే అతడైన" భగవంతుడు అందింపజేశాడు.

'అనోభద్రాః క్రతవో యన్తు విశ్వతః' ఉదాత్తమైన ఆలోచనల్తో సమాజశ్రేయస్సును కోరేఅన్నమయ్య, త్యాగరాజస్వామి, శ్యామశాస్త్రి వంటివారిని పరాత్పరుడు మన కందించాడు. 'ఆత్మవత్సర్వభూతాని' అని కదా 'జయ' జయధ్వానం! అటువంటి మానవతావాదంకోసమే – 'తదాత్మానాం సృజామ్యహమ్' అన్నది! అదే పరబ్రహ్మ–అదికూడా ఒక్కటే! పరబ్రహ్మమొక్కటే. 'కందువగు హీనాధికము లిందు లేవు'–అవి మనం కల్పించు కున్నవి. స్వార్థంతో పోషించుకుంటున్నవి. చేతివృత్తులు కులాలై కూర్చున్నాయి. కుంపట్లై రాజుకుంటున్నాయి. స్వార్థరాజకీయాలకు ఆకరాలైనాయి. 'ఇందులో జంతుకులమంతా నొక్కటే' అని పలికినఅన్నమయ్య, 'కూడు తినెడికాడ కులభేద మేలకో' అని బాధపడ్డ వీరబ్రహ్మం, 'దర్శనములు వేరు దైవం బదొక్కటే' అన్న వేమన సమాజసంస్కర్తలు. సామాజికతత్త్వాన్ని సరళంగా తేటతెలుగుమాటల్లో ప్రబోధించారు.

**ఏకులజు డేమి యెవ్వడైన నేమి**
**ఆకడ నాతడె హరి నెఱిగిన వాడు**

– భగవంతుణ్ణి తెలుసుకున్నవాడు అందర్నీ సమానంగా చూడగలుగుతాడు. రాజునిద్ర, బంటునిద్ర ఒక్కటే. పండితుడు మెట్టేభూమి, చండాలు డుండేభూమి ఒక్కటే. అందరిజన్మ రహస్యం ఒక్కటే. ప్రత్యేకత లేమీ లేవు. అరవైనాలుగుగళ్ళ చదరంగంపలకపై రాజు, మంత్రి, భటుడు, ఏనుగుమీద ప్రసరించేఎండ, కుక్కమీద ప్రసరించేఎండా ఇవి రెండూ ఒక్కటే. కులాన్ని, జాతిని, వర్గాన్ని, మతాన్ని ప్రక్కనపెడితే మనుషులంతా ఒక్కటే ననే వివేకాన్ని అందించాడు–అన్నమయ్య. కొండంత మానవతావాదాన్ని ఈ సమాజాని కందించటానికి అన్నమయ్యను పంపించాడు– కొండలలో నెలకొన్న కోనేటిరాయడు. అసమానతలనే వృక్షాల్ని ఖడ్గంతో చీల్చడానికి పుట్టించాడు. 'దిన మహోరాత్రులు ధనికులకు, దరిద్రునికి ఒకటే' అని అనిపించాడు.

ఇది తనదృష్టి. వేరువేరుగా ఎవర్నీ పుట్టించలేదు. అదే మూస. స్త్రీపురుషుల ద్వైధీభావం తప్పు!

వ్యక్తిగతమైన అనుభవోద్వేగాల తీవ్రతను సార్వజనీనం చేయటానికే అన్నమయ్య పదకవితల నల్లాడు.

**తలమేల కులమేల తపమే కెరటము**
**యెలమి హరిదాసులు యేజాతియైన నేమి**
**కాకమువల్ల బుట్టదా పావనమైన యశ్వత్థము**
**దాకొని గుల్లలో బుట్టదా ముత్తెము**
**చౌకైన విషలతనె జన్మించదా నిర్విషము**
**యేకడ మహానుభావు లెందు పుట్టరేమి**
**చిదిపిరాళ్ళ బుట్టవా చెట్లనైన వజ్రములు**
**పుడమి నీగలవల్ల బుట్టదా తేనె**
**వెడగుబిల్లి మేనను వెళ్ల దాయెనా జవ్వాది**
**పుడమిలోని పుణ్యు లెందును ధరించిరేమి**
**పంకములో బుట్టదా పరిమళదామర**
**పొంకపుగీటములందు పుట్టదా పట్టు**

– పవిత్రమైన అశ్వత్థవృక్షం కాకివల్ల, ముత్యపుచిప్ప లోంచి ముత్యాలు, చిదిపిరాళ్లలోనుంచి వజ్రాలు, ఈగలవల్ల తేనె, జవ్వాదిపిల్లినుంచి జవ్వాది పుడుతున్నాయికదా! భగవంతుణ్ణి కొలిచేభక్తులంతా సమానమే అని సామాజిక సమతాభావాన్ని అన్నమయ్య ఈ సంకీర్తనలో వ్యక్తం చేశాడు. 'హరిగంటి, గురుగంటి, అంతటా మేల్కొంటి!' హరి–ఆత్మసాక్షాత్కారం. గురువు, 'తమసో మా జ్యోతి ర్గమయ'. మేల్కొంటి – అంతా వెలుగే! ఆ వెలుగును దర్శించ మనే 'అందరికి శ్రీహరే అంత రాత్మ' అంటున్నది. అన్నమయ్యది సంస్కరణతో కూడిన తన్మ యత్వం. కీర్తనశ్రవణం–ఆనందామృతం! సంస్కరణసాహిత్యం– ఆలోచనామృతం! ఒకపక్క చెవికి ఇంపుగా ఉంటుంది– ఆనం దిస్తాం. మరోపక్క పురుషార్థాలు, అరిషడ్వర్గాలు, లౌకికాలు. లౌకికాలౌకిక సంబంధమే సంగీతం– ఇటువంటి సంగీతసంస్కార మంతా అన్నమయ్య పుట్టుకతో అందుకున్న ఆస్తి. జీవితమంతా పైపై వేషాలతో కాక లోతైనభావాలతో, భక్తితో ఆదర్శప్రాయంగా గడపాడు, గడపా లన్నాడు. 'చదువుట మేలు విచారించుట కొరకే' అనేది ఆయన చదివినచదువుల పరమార్థం. ప్రవృత్తిలో నివృత్తినీ, బ్రతుకులో పరమార్థాన్నీ, కనిపించేఅన్నింటిలో అంత ర్యామినీ దర్శించి, ఆచరించి, అనుభవించినదానిలోనుంచే ఉప దేశాన్ని అందించిన అన్నమయ్య నిజమైన 'ఆచార్యుడు'. సంకీర్తనాచార్యుడు. ఆరుద్రగారు అన్నట్లుగా 'అన్నమయ్య అను భవసముద్రుడు'.

**శ్రీ కోదండరామస్వామివారి పవిత్రోత్సవాలు**
**తిరుపతి**

| | | | |
|---|---|---|---|
| 01-8-13 | గురు | అంకురార్పణ (రాత్రి) | ఆషాఢ మాసమున జరుగును |
| 02-8-13 | శుక్ర | పవిత్ర ప్రతిష్ఠ | |
| 03-8-13 | శని | పవిత్ర సమర్పణ | |
| 04-8-13 | ఆది | పవిత్రోత్సవ సమాప్తిః | |

**శ్రీ పట్టాభిరామస్వామివారి పట్టాభిషేకమహోత్సవం,**
**వాల్మీకిపురం**

| | | | |
|---|---|---|---|
| 11-8-13 | ఆది | శ్రీపట్టాభిరామస్వామివారికి | శ్రావణమాసమున శుక్లపంచమి నుండి సప్తమి వరకు జరుగును |
| 12-8-13 | సోమ | ” | |
| 13-8-13 | మంగళ | ” | |

**శ్రీ వేంకటేశ్వరస్వామివారి పవిత్రోత్సవాలు,**
**తిరుమల**

| | | | |
|---|---|---|---|
| 16-8-13 | శుక్ర | అంకురార్పణ (రాత్రి) | శ్రావణ మాసమున జరుగును |
| 17-8-13 | శని | పవిత్ర ప్రతిష్ఠ | |
| 18-8-13 | ఆది | పవిత్ర సమర్పణ | |
| 19-8-13 | సోమ | పవిత్రోత్సవ సమాప్తిః | |

**శ్రీ వేణుగోపాలస్వామివారి (తెప్ప) ప్లవోత్సవాలు,**
**కార్వేటినగరం**

| | | | |
|---|---|---|---|
| 18-8-13 | ఆది | శ్రీవేణుగోపాలస్వామివారికి | శ్రావణ పూర్ణిమకు జరుగును |
| 19-8-13 | సోమ | ” | |
| 20-8-13 | మంగళ | ” | |



# మహాభారతం - సేవాధర్మం

**ఆముదాలమురళి**

సమాజసుస్థిరత్వానికి ధర్మం మూలకారణం. శాంతి, సౌభాగ్యాలను ఒనగూర్చేది ధర్మం. మౌలికమైన ఈధర్మస్వరూపాన్ని విస్తృతంగా చర్చించినగ్రంథం మహాభారతం. గృహస్థులకు ఏది ధర్మమో అది సన్న్యాసులకు ధర్మవిరుద్ధం, రాజులకు ధర్మమైనది సేవకులకు ధర్మంకాదు. రాజధర్మాలు వేరు, ఆపద్ధర్మాలు వేరు, మోక్షధర్మాలు వేరు. సాధారణస్థితిలో ఏది ధర్మదూర మని చెప్పబడు తున్నదో అదే ఆపద్ధర్మంగా పేర్కొన బడుచున్నది. సత్యం, అహింస ఇత్యాదులలో ధర్మనిర్ణయం చాలా కష్టతరమైనది. ధర్మనిర్ణయం చేయాల్సిన స్మృతులుకూడా ద్విధాబుద్ధిని ప్రదర్శిస్తాయి. ఈ పక్షాంతరాల పరిహారం, ధర్మనిర్ణయం అసిధారా వ్రతంగా మారినచోట ధర్మనిర్ణయానికి మూద లగా నిల్చే ఏకైక గ్రంథం మహాభారతం. ధర్మార్థ కామమోక్షా లనేపురుషార్థాలకు సంబంధించిన సమస్తవిషయాలకు భారతభారతియే ప్రమాణ మని వ్యాసుడు ఉద్ఘోషించిఉన్నాడు.

సారపుధర్మాన్ని, విమలసత్యాన్ని, పాపం నుండి, బొంకునుండి దక్షులైనవారు రక్షించా లనేది భారతాభిమతం. వారు ఉపేక్షిస్తే వారికే చేటు కలుగుతుంది. కాని, ధర్మానికి లోటురాదు. ఒక వేళ ధర్మగ్లాని సంభవిస్తే ధర్మవిస్తారానికీ, సత్యశుభదాయకత్వానికీ యుగయుగాలలో భగవంతుడు అవతరి స్తాడని భారతనిరుక్తి.

'గృహీత ఇవ కేశేషు మృత్యునా ధర్మ మాచరేత్' అని శాస్త్రవచనం. 'ధర్మ ఏవ హతో హన్తి, ధర్మో రక్షతి రక్షితః' అని భారతం. వెరసి ధర్మదూరులుగా బ్రతుకరా దని పిండితార్థం.

అన్ని ధర్మసందేహాలకు భారతం సమాధానా న్నిస్తుంది. అనేకమైన ధర్మా లున్నప్పుడు దేనిని ఆచరించాలి? అనేప్రశ్నకు 'స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః' అనగా ఎవరి ధర్మాన్ని వారు పాటించడమే శ్రేయోదాయక మని సమాధానం చెబుతుంది. స్వధర్మానుష్ఠానంలోకూడా సందేహాలు తలెత్తి నపుడు 'యద్యదాచరతి శ్రేష్ఠః, తత్తదే వేతరో జనః' అంటూ శ్రేష్ఠ పురుషుల మార్గాన్ని ఆచరణీయమైన ఆదర్శమార్గంగా స్వీకరించ మని భారతం చెబుతుంది.

సమూహంగా బ్రతకడం సమాజం. సమూహంలోని వ్యక్తులు పరస్పరసేవాభావంతో మెలగడం జీవనవిధానం. సేవ లేకుండా సమాజాన్ని నిర్వచించలేం. వ్యక్తికీ, వ్యక్తికీ మధ్య సంబంధం సేవతో ముడిబడి ఉంటుంది. 'సేవాధర్మః పరమగహనోః యోగినామ ప్య గమ్యః' అని భర్తృహరి చెప్పడం సేవ క్లిష్టమైన దనడం కాదు, సేవ నిబద్ధతతో చేయా లని హెచ్చరించడంమాత్రమే. సేవ అంటే పరుల మనసును కష్టపెట్టేది కాదు, పరకార్యాలను నష్టపరచేదీ కాదు. నిబద్ధతతో కూడిన అవగాహనతో పంచే ప్రేమ 'సేవ'గా కీర్తించ బడుతుంది. ప్రేమలేనిసేవ ఒక నిర్జీవక్రియ మాత్రమే. ఒరు లేపనిచేస్తే మనకు అప్రియమో, దానిని ఒరులకు చేయకుండా ఉండడమే శ్రేష్ఠ మైన ధర్మపథంగా భారతం పేర్కొన్నది.

భారతం నిండా వివిధవ్యక్తుల మధ్య సేవాధర్మాన్ని విపులీకరించే కథలే ఉన్నాయి. వ్యాసమహర్షి గాని, కవిత్రయం గాని సేవాధర్మ పరాయణత్వం కలిగిన పాత్ర లను పోషించడానికి ఏమాత్రం వెనుకాడలేదు. పైగా చాలాచోట్ల తగినసందర్భాలను ఇందుకై సృష్టించుకొన్నారు. ప్రధానకథద్వారామాత్రమే కాకుండా ఉపాఖ్యానాలద్వారా కూడా ఇదే ప్రయోజనాన్ని సాధించారు.

నిష్ఫలమైన సేవ లుండవు. కొన్ని వెంటనే ఫలిస్తే, మరి కొన్ని కాలాంతరంలో ఫలించి, కర్తకు మేలో, కీడో కలిగిస్తాయి. కాలాంతరంలో ఫలించినవాటిని మనం అదృష్టఫలంగా పేర్కొం టాము. భగవత్సేవ, పితృసేవ, మాతృసేవ పతిసేవ, వృద్ధసేవ ఇత్యాదులు కాలాంతరఅదృష్టఫలప్రదా లైతే గురు, రాజసేవా దులు సద్యఃఫలప్రదాలు. భారతం అన్నిసేవలకు ప్రాధాన్యత నిచ్చింది.

విరాటపర్వప్రారంభం ప్రథమాశ్వాసంలో 121వ పద్యంనుండి 140వ పద్యంవరకు సేవాధర్మాలు ఉపదేశించ

## సన్నిధిలో...

**పొడగరిని కాను**
**స్ఫురద్రూపినీ కాను**
**మరి నీ సన్నిధి చేరిన సమయాన**
**ఎలా పోల్చుకుంటావు నన్ను?**

**భక్తజనసందోహంపై ప్రసరించే**
**నీదయామృతవీక్షణాలు సోకి**
**రేణువునై నీపాదపద్మాలపై వాలిపోతాను**
**అప్పుడు గుర్తించు ప్రభూ!**

*గోవిందరాజు రామకృష్ణారావు,*

బద్ధాయి. తామే స్వయంగా రాజులైన ధర్మరాజాదిపాండవులు, విధివశాత్తు అజ్ఞాతవాసం చేయాల్సిన అగత్యం ఏర్పడింది. తన్నిమిత్తం ఒక్క సంవత్సరకాలం పాటు విరాటునికొలువులో సేవకవృత్తిని అవలంబించి గడపాలి. రాజుకు, సేవకునికి మధ్య అధికారం, హోదా, పని అన్నింట్లోను వ్యత్యాసం ఉంటుంది. ధర్మరాజైనా సేవకుడైతే సేవాధర్మాలు పాటించాల్సిందే. అరివీర భయంకరులైన భీమార్జున నకుల సహదేవులకైనా అది తప్పదు. సహస్రపరిచారికాపరివృతయైన ద్రౌపదికూడా సుధేష్ణవద్ద సేవలు చేసేటప్పుడు సైరంధ్రిధర్మం పాటించాల్సిందే. ఇవన్నీ ధర్మరాజుకు తెలుసు. మిగిలిన పాండవులకుకూడా తెలుసు. అయినప్పటికి పాండవ పురోహితుడైన ధౌమ్యుడు సేవాధర్మాలను ఉపదేశించాడు. 'విదితేచాపి వక్తవ్యం' అని ధౌమ్యుడు తన ప్రబోధాన్ని సమర్థించుకొంటాడు. ధర్మరా జంతటివానికి ఈ సేవాధర్మాలు తెలియనివి కావు. తాను పాండవులపట్ల అను రాగంతో బోధిస్తున్నా నని ధౌమ్యు డన్నాడు. సంస్కృతభారతంలో ఈ ప్రబోధం విరాటపర్వచతుర్థాధ్యాయంలో ఉంది.

కవిత్రయంలో బాగా పొదుపరియైన తిక్కన ఈ విషయాలను పరిహరించలేదంటే సేవాధర్మాలకు ఎనలేని ప్రాధాన్యం కల్పించినట్లే కదా! పైగా ధార్మికవిషయాలను ఎన్ని సార్లైనా బోధించవచ్చు. దానికి పునరుక్తిదోషం ఉండదు. ఈ సందర్భంగా మహర్షి ధౌమ్యుడు ప్రబోధించిన సేవాధర్మాలను పరిశీలిద్దాం.

తే.గీ. **కౌరవాన్వయజాతులై గౌరవమునఁ**
**బెరిగినట్టి మీ రొండొక నరునిఁ గొలిచి**
**మసలి వర్తిల్లి మానావమానములకు నోర్చి**
**యడకువతోడన యునికి యరిది**

పాండవులు ప్రశస్తకౌరవవంశసంజాతులు, గౌరవ మున పెరిగినవారు, వేరొకనరుని ఇదివరలో కొలువని వారు. ఇప్పుడు తప్పనిసందర్భం- మానావమానాలు తప్పవు. ఓర్చు కోవాలి, అణకువతో ఉండాలి. ఇది పాండుకుమారులకు అనిదంపూర్వానుభవము. అందుకే ధౌమ్యుడు 'కీడునుం బొరయకుండునట్టి సాధారణనీతి' సంక్షేపరూపంబున ఎతి గించాడు.

రాజుఎదుట తన కుచితమైన ఆసనంమీదనే కూర్చో వాలి. రాజు చను విచ్చినా హద్దులు మీరి, ప్రవర్తించ రాదు. రాజుగృహంకంటే అభిరామంగా గృహనిర్మాణం చేయకూడదు. రాజువలే వేషం వేయడం, మాట్లాడడం, విహరించడం నిషిద్ధం. రాజపుత్ర, మిత్రబంధుజనులను గౌరవించాలి. ఇతరులు నిర్వర్తించుకార్యంలో అనవసరజోక్యం తగదు. సేవకుడు ఎంత బుద్ధిమంతుడైనా, దానిని రాజుగారి ఎదుట ప్రదర్శించరాదు. బిగ్గరగా మాట్లాడకూడదు. నవ్వకూడదు. మౌనంగా ఉండ రాదు.

రాజు కొలువులో ఉన్నపుడు ఇటూ అటూ చూస్తూ ఉండక, సావధానుడై రాజువైపే చూస్తుండవలెను. అంతఃపుర విషయాలు బయట మాట్లాడకూడదు. ఇతరులు చెబితే విన కూడదు. అంతఃపురంతో చుట్టరికం చేటు తెస్తుంది. అక్కడ చరించే పరిచారికజనంతో స్నేహం ప్రమాదం కలిగిస్తుంది. రాజుకంటే ఉత్తమాసనం, ఉత్కృష్టవాహనం, రాజు ఇచ్చినపుడు మాత్రమే అధిరోహించాలి. రాజు పొగిడితే పొంగిపోక, అవ మానిస్తే క్రుంగిపోక, మున్నున్నట్లే ఉండాలి. రాజు మనసులో ఎవర్నైనా ఏదైనా చేయా లని సంకల్పించి ఉంటే, అది సేవకునికి తెలిసినా- బహిర్గతం చేయకూడదు.

రాజు ఏదైనా పని చెబితే ఎం దని, వా నని, దూరదేశ మని, ఆక లని, నిద్రని, దప్పికని, ఒంటరివాణ్ణని అభ్యంతరాలు చెప్పకూడదు. తత్పరుడై పనిచేయాలి. సేవకుడు రాజుకెంత ఆప్తుడైనా రాజుసొమ్ములను తాకరాదు. రాజు కొలువులో ఆవులింత, తుమ్ము, నవ్వు, నిష్ఠీవనం గుప్తంగా ఉండాలి. వైరుల దూతలతో మైత్రి చేయరాదు. రాజువద్ద నున్న ఏనుగుతోనైనా, చివరకు దోమతోకూడా విరోధం పరిహరించాలి.

సేవకునికి సంపదలు ఉన్నా, సంపద లున్నందుకు ఫలం భోగమే అయినా భటుడు విచ్చలవిడిగా భోగించరాదు. రాజు బహుమానంగా ఇచ్చినవస్త్రాలను ధరించాలి. ఆభరణా లను అలంకరించుకోవాలి. వాహనాలను వాడుకోవాలి.

ఈవిధంగా ఒక సంవత్సరంపాటు ఉడిగి మడిగి, సంకటముల కోర్చి చరించి, ఆపద నిస్తరించుకొ మ్మని ధౌమ్యుడు పాండవులకు సేవాధర్మాలను తెలియజేశాడు.

అజ్ఞాతవాసకాలంలో భీముడు మల్లునితో యుద్ధం చేయడం, పరులఇండ్లకు తాను పో నని చెప్పిన పాంచాలి సుధేష్ణకు కల్లు తెచ్చుటకై కీచకునింటి కెళ్ళడం, విరటుడు సుశర్మ మీద యుద్ధంకు వెళ్లేటపుడు ధర్మరాజు– భీమ, నకుల, సహదేవులను తీసుకొని సుశర్మను ఎదుర్కొనడానికి విరటునికి సాయంగా వెళ్ళడం, సుశర్మచేత పట్టుబడినవిరటుణ్ణి విడి పించడం, ఉత్తరునికి అర్జును దంతటివాడు సారథి కావడం, ఉత్తరుడు భయపడగా అర్జునుడే కౌరవులతో యుద్ధానికి దిగి, విజయాన్ని కట్టబెట్టడం మొదలగు విరాటపర్వ కథాంశా లన్నీ సేవాధర్మానికి లోబడిన ఘటనలే, ధౌమ్యప్రబోధానికి అను గుణంగా పాండవులు నడచుకొన్న విధివిధానాలే!

ధౌమ్యుడు ధర్మరాజుకు సేవాధర్మాలను వివరిస్తూ 'ఓ ధర్మరాజా! రాజుకు ఇష్టంలేని మాటలను మాట్లాడవద్దు. (అప్రియం చాహితం యత్స్యాత్తదస్మైనానువర్ణయేత్) అని బోధిం చాడు. ధర్మరాజంతటివాడు ఉత్తరగోగ్రహణం నుంచి భూమిం జయుడైన ఉత్తరుడు బృహన్నలతో తిరిగివస్తున్న సమయంలో సేవాధర్మాన్ని అతిక్రమించాడు. ఏ తండ్రైనా తనకుమారుణ్ణి ఇతరులు తక్కువచేసి మాట్లాడడం భరించలేడుగదా! అందునా రాజు, కుమారుడా– భీష్మ ద్రోణ కృపాది ధన్వి నికరాభీలవైరి సముదాయాన్ని జయించాడు. అటువంటి సందర్భంలో సేవా ధర్మాన్ని విస్మరించి ధర్మరాజు ప్రతివచనాలు పల్కినందుకు విరటునిచేత సారెదెబ్బలు తిన్నాడు. అప్పటికి అజ్ఞాతవాసం ముగిసింది కనుక, సభలో సైరంధ్రి మినహా మిగిలిన పాండవు లెవురూ ధర్మరాజుతో లేరు కనుక ఒక పెద్ద ప్రమాదం జరగ కుండాపోయింది. అందుకే రాజైనా సేవాధర్మాన్ని పాటించే

టప్పుడు జాగరూకతతో ఉండాలి. ఇది ధర్మరాజు పాత్రద్వారా చెప్పడంవల్ల సాధారణకావ్యనిర్మాణంలో నాయకత్వంపై చులకన భావం ఏర్పడినట్లు కాకుండా సేవాధర్మ ప్రాధాన్యతను పెంచింది. ఇది వ్యాసధర్మప్రచారప్రణాళిక.

సేవవల్ల హృదయమార్దవం పెరుగుతుంది. వ్యక్తుల మధ్య ఆత్మీయతలు, బాధ్యతలు పెరుగుతాయి. ఒంటరితనం నశిస్తుంది. సామూహికభావన పెంపొందుతుంది. దృఢమైన అనుబంధాలు ఏర్పడతాయి. తద్ద్వారా సమాజం అవిచ్ఛిన్నంగా కొనసాగుతుంది. మానవసంబంధాలు మెరుగుపడతాయి. వ్యాస హృదయం జగద్ధితమే! వ్యాసభారతం సేవను పురుషార్థాలకు మూలకందంగా పేర్కొన్న ఉత్తమధ్వనికావ్యం. కవిత్రయం వ్యాసమునిబద్ధ నిరూపితార్థ మేర్పడునట్లు ఆంధ్రీకరించారు.

ప్రతిపాత్ర సేవాధర్మానికి అనుకూలంగా ఉండేటట్లు భారతనిర్మాణం జరిగింది. సేవవల్ల దుర్వినీతత్వం పోతుంది. భారతం 'సరమ' అనే శునకం చేసినఉపదేశంతో ప్రారంభమౌతుంది. శునకం సేవాధర్మానికి ఉత్తమప్రతీక. మహాప్రస్థానంలో ధర్మరాజువెంట చివరివరకు ధర్ముపు శునకరూపంలోనే వెంబడిస్తాడు. దేవ, మనుష్య, తిర్యక్ పాత్రలన్నీ ధర్మంకోసం సృజించబడినవే. పైలశిష్యుడైన ఉదంకుడు గురుహితకార్య ధురంధరుడై పౌష్యపత్ని కుండలములను తెచ్చి గురుసేవ చేశాడు. దానికోసం అతడు నాగలోకాన్ని ప్రసన్నం చేసుకొన్న తీరు ఆశ్చర్యం. స్వయంగా పైలుడు శిష్యుణ్ణి దీవిస్తూ గురుకార్య నిరతులగు సత్పురుషులకు అధిక పుణ్యఫలాలు కలుగుతా యని సెలవిచ్చాడు.

గరుత్మంతుడు తల్లిదాస్యం విడిపించడానికి నాగులకు సేవచేయడమే కాక అమృతాన్ని తెచ్చాడు. ఇది మాతృసేవ. తన తండ్రి ఆజ్ఞమేరకు మత్స్యగంధి యమునానదిలో ఓడ నడపడం పాంథజనసేవ. కద్రువ వినతకు, శర్మిష్ఠ దేవయానికి దాస్య రూపమైన సేవను చేశారు. కచుడు పనియేమి పంచిన పదపడి చేసెద ననక తన్‌బంచిన ఆక్షణమే బృహస్పతికి గురుసేవ చేశాడు. ధర్మవ్యాధునికథలో భర్తృసేవ, మాతాపితృసేవల గురించి వివరించబడింది. సత్యభామకు ద్రౌపది పతిసేవా రహస్యాలను ప్రబోధించింది.

ఘోషయాత్రలో గంధర్వులచేత పరాజితుడైన దుర్యోధనుడు ప్రాయోపవేశం చేయా లనుకొన్నాడు. అతణ్ణి ఓదారుస్తూ కర్ణుడు 'పాండవులు నీకు భృత్యులు, నిన్ను రక్షించడం వారి కర్తవ్యం, ఇందులో వారిబాధ్యత ఉన్నదే గాని, వారి పరాక్రమాన్ని గణించ నక్కరలేదు' అని అంటాడు. ఇది రాజ సేవకు సంబంధించిన వాదన. సావిత్రి ఉపాఖ్యానం పతిసేవను, వృద్ధసేవను తెలుపుతుంది. పాండవులు అరణ్యవాసంలో కూడా చాలామంది బ్రాహ్మణులను తమవెంట బెట్టుకొని సేవించారు. ధౌమ్య, మార్కండేయాది ఋషులనుకూడా సేవించారు.

ధర్మరాజుకు బృహదశ్వుడు చెప్పిన నలోపాఖ్యానంలో నలుడు తాను వలచిన దమయంతివద్దకు దేవదూతగా వెళ్ళి ఇంద్ర, దహన, వరుణ, యములలో ఒకరిని వరించమని చెప్పడం దైవసేవ. నలుడు ఋతుపర్ణునివద్ద వికృతరూపుడై అశ్వాధ్యక్షుడుగా నుండుట, తనభార్య ద్వితీయస్వయంవరానికి వెళ్తున్నాడని తెలిసి ఋతుపర్ణుని రథచోదకు డగుట రాజసేవ.

భీష్మాదులు ధర్మతత్త్వమెరిగిన వారైనప్పటికి దుర్యోధనునిపక్షం వహించి పోరడం రాజసేవయే. రాజసేవకు పరాకాష్ఠ కర్ణుడు. తన జీవితాన్నంతా దుర్యోధనునికి అంకితం చేసిన ఉత్తమసేవకుడు- కర్ణుడు. సేవాధర్మం తెలుసు కనుకే కర్ణుడు ఘటోత్కచుణ్ణి, అభిమన్యుణ్ణి చంపగలిగాడు.

భారతఆరణ్యపర్వాంతర్గతమైన రామాయణంలో రామునికి లక్ష్మణుడు చేసినభ్రాతృసేవవంటిదే ధర్మరాజుకు మిగిలిన సోదరులు చేసినసేవ. రామాయణంలో సేవాధర్మాలను గూర్చి ప్రత్యేకంగా చెప్పుకోవాల్సిందే. కృష్ణు డంతటివాడు పార్థ సారథి కావడం సేవాధర్మం. కుంతి దైవోపచారములతో దుర్వాసునికి సేవచేసింది.

అంపశయ్యపై నున్న భీష్ముడు ధర్మరాజుకు ఆపద్ధర్మాలను బోధిస్తూ ఒక కపోతయుగ్మంకథ చెబుతాడు. అతిథి ఆకలి తీర్చడంకోసం పావురం తనను తాను అగ్నికి సమర్పించుకొంటుంది. ఇది అతిథిసేవ. ఉద్యోగపర్వంలో జరిగిన రాయబారాలన్నీ సేవాధర్మంలో భాగమే.

ధర్మసారమైన ఈ భారత భారతిని నిరంతరం అనుసంధానం చేస్తూ, మానవజాతి పునర్నిర్మాణానికి అందరూ అంకితం కావాలి.

# సుమతి

విశ్వనాథరమ

పూర్వం ప్రతిష్ఠానపురంలో కౌశికు డనే బ్రాహ్మణుడు కలడు. అతడు మహాకోపిష్ఠి మరియు వ్యభిచారి. అతనిభార్య సుమతి. పేరుకి తగ్గట్టుగానే ఆమె శాంతమూర్తి. ఉత్తమఇల్లాలు.

కోపస్వభావంతో భర్త నిత్యం వేధిస్తున్నా ఏ మాత్రం నొచ్చుకోక పతినే దైవంగా భావించి, అతనిసేవకే తన జీవితాన్ని అంకితం చేసింది.

కొంతకాలం తర్వాత కౌశికునికి కుష్టురోగం వచ్చి, అతడు నడువలేని స్థితికి వచ్చాడు. ఆ పరిస్థితులలోకూడా ఒక వేశ్యను చూచి, అతడు మోహించి, ఆమె వద్దకు తీసుకొని పొమ్మని భార్యను వేధించసాగాడు. గత్యంతరం లేక సుమతి భర్త మూర్ఖత్వానికి తలవంచి, భర్తను డోలిలో ఉంచి, వేశ్య దగ్గరకు వెళ్లసాగింది. సరిగ్గా ఆ సమయంలోనే మాండవ్య డనేమహర్షి అడవిలో తపస్సు చేస్తుండినాడు.




అప్పుడు పొరపాటున కౌశికునికాలు మాండవ్య మహర్షికి తగిలింది.

దాంతో ఉగ్రుడైన మాండవ్యుడు సూర్యోదయానికి ముందుగానే కౌశికుడు మరణిస్తా డని శపించాడు. మహర్షుల శాపానికి తిరుగులేదు కదా! తెలీక చేసిన పొరపాటువల్ల భర్త ప్రాణాలకు ముప్పు కలిగిం దని సుమతి గ్రహినించింది. పతివ్రతగా పేరుపొందిన సుమతి తనపతిని బ్రతికించుకొనుటకుగాను, సూర్యోదయం కాకుండా ఉండునట్లు ప్రతిశాప మిచ్చింది.

ధర్మం, సత్యంతో కూడిన పతివ్రతల పలుకులకు పంచభూతాలు తలవంచుతాయి. 'ఆ మరుసటిరోజున సూర్యోదయం కాలేదు. ముల్లోకాలు సూర్యోదయంకోసం ఎదురుచూడసాగాయి. దేవతలు, మహర్షులు బ్రహ్మ దగ్గరికి పోయి జరిగినదంతా చెప్పి సూర్యోదయం జరిగేటట్లు చూడమని ప్రార్థించారు.

పతివ్రత మనసుని, సంకల్పాన్ని మరో పతివ్రత మాత్రమే మార్చగలదు. బ్రహ్మ అనసూయ వద్దకు వెళ్ళి సుమతి శాపాన్ని ఉపసంహరించుకొనేట్టుగా చూడమన్నాడు.

వెంటనే అనసూయ సుమతి దగ్గరికి వెళ్ళి, ఆమె భర్తని బ్రతికించే బాద్యత తనదే నని చెప్పి, శాపాన్ని ఉపసంహరించుకోమ్మని నచ్చచెప్పింది.

అనసూయ మాటలు విన్న సుమతి సూర్యునికి ఇచ్చిన శాపం ఉపసంహరించుకుంది. అంతే! తూర్పుదిక్కునుండి సూర్యభగవానుడు సహస్రకిరణాల వెలుగుతో ఉదయించాడు. ఆ దృశ్యాన్ని చూచి, అందరూ ఆనందపారవశ్యం చెందారు.

సూర్యోదయం కాగానే మాండవ్యుని శాపఫలితంగా కౌశికుడు మరణించాడు. అప్పుడు అనసూయ సుమతి కిచ్చిన మాటప్రకారం తనపతివ్రతామహిమతో కౌశికుని బ్రతికించాడు. ఆ క్షణంలోనే బ్రహ్మ ప్రత్యక్షమై కౌశికునికి కుష్ఠురోగ నివారణ చేసి, అతణ్ణి అందమైన యువకుడిగా మార్చి, సుమతి పతివ్రతామహిమను మెచ్చుకున్నాడు. ఆమెపేరు శాశ్వతంగా నిలిచి ఉండు నని దీవించి, అదృశ్య మయ్యాడు. అందుకే సుమతి మహాపతివ్రతగా ఈనాటికీ అందరిమన్ననలను పొందుతూ మహిళాలోకానికే ఆదర్శప్రాయురాలైంది.

**స్వామివారి దర్శనానికి వచ్చే యాత్రికులు మొబైల్ ఫోన్లు, కెమెరాలు వంటి ఎలక్ట్రానిక్ పరికరాలను తీసుకొని ఆలయంలోకి రాకూడదు. వాటిని లగేజి కౌంటర్లలో వదలి రావాలి.**

# రామరసామృతభాండం - దాశరథీశతకం

డా॥డి. మస్తానమ్మ

**భా**రతీయవాఙ్మయంలో వెలువడిన ఆదికావ్యం రామాయణం. ఈ కావ్యంద్వారా ఆదికవి వాల్మీకి – జనులు ఎలా జీవించాలో, ఎలా ప్రవర్తించగూడదో రసౌచిత్యవంతంగా జీవితంవిలువలను వివరించాడు. అందువల్లే రామాయణం రమణీయమైనకావ్యంగా కీర్తించబడింది.

రామాయణకావ్యం వివిధభాషల్లోకి అనువదించబడినట్లే వివిధప్రక్రియల్లోగూడా వెలువడింది. కొందరు ఆ కావ్యాన్ని యథాతథంగా అనువదించగా మరికొందరు కాలానుగుణంగా మార్పులు చేర్పులు చేస్తూ వ్రాశారు. ఇంకొందరు రామనామమహిమను వర్ణించారు. అటువంటివాటిలో శ్రీరామకర్ణామృతం, దాశరథీశతకం చెప్పుకోదగ్గవి. శ్రీరామకర్ణా మృతం సంస్కృతంలో వెలువడగా, దాశరథీశతకం తెలుగులో వెలుగుచూచింది. ఈ శతకకర్త పరమరామభక్త పరాయణుడైన కంచెర్లగోపన్న. ఈ కవి శ్రీరామునిపై కీర్తనలూ వ్రాశాడు.

**ఏ తీరుగ నను దయ జూచెదవో - ఇనవంశోత్తమ రామా!**
**నా తరమా భవసాగర మీదను - నళినదళేక్షణ రామా!**
**శ్రీరఘునందన సీతారమణా - శ్రితజనపోషక రామా!**
**కారుణ్యాలయ! భక్తవరద! నిను - కన్నది కానుపు రామా!**

– అంటూ శ్రీరామచంద్రప్రభువును శరణువేడాడు.

## రామభక్తి మహిమ

శ్రీరాముడు ఆపద్బాంధవుడు. తనను శరణుగోరినవారిని రక్షిస్తాడు. తనకు కీడుచేయప్రయత్నించేవారిని శిక్షిస్తాడు. భక్తులకోర్కెలు తీరుస్తాడు. తనను శరణుగోరిన విభీషణుణ్ణి రక్షించాడు. కీడు చేసినరావణుణ్ణి సంహరించాడు. తనకై ప్రాణా లర్పించిన జటాయువుకు అగ్నిసంస్కారాలు చేశాడు. శబరికి ముక్తిని ప్రసాదించాడు. వాలిని వధించాడు. సుగ్రీవుణ్ణి ఆదరించాడు. గురువాఙ్ఞను మన్నించి, తాటకాది రాక్షసులను సంహరించాడు. ఆరీతిగానే అహల్యకు శాపవిముక్తి కలిగించాడు.



వీటిని దృష్టిలో పెట్టుకొని కవి తనను పాపవిముక్తుణ్ణి చేయాలని అభ్యర్థిస్తున్నాడు.

**చ॥ అగణిత జన్మకర్మదురితాంబుధిలో బహుదుఃఖవీచికల్**
**దెగిపడ నీఁదలేక జగతీధవ! నీపదభక్తినావచేఁ**
**దగిలి తరింపఁ గోరితిఁ బదంపడి నాదు భయంబు మాన్పవే**
**తగ దని చిత్తమం దిడక, దాశరథీ! కరుణాపయోనిధీ!**

**(47వ పద్యం)**

"ఓ శ్రీరామా! లెక్కలేనన్నిజన్మాలవల్ల పాపాల సముద్రంలో పడి, దుఃఖా లనే అలలు మీద వచ్చి పడుతుండగా గట్టుకు ఎక్కలేక, నీపాదాలభక్తి అనే పడవను ఆధారంగా చేసుకొని దాట కోరాను. దయయుంచి నా మొరను కా దని త్రోసివేయక నా భయాన్ని వెంటనే తీర్చుము. నేను చేసే పాపాలకు లెక్కలేదు. అయినా నా నాలుకకు నీ దివ్యనామరసాయనం అబ్బింది. పూర్వం ఒక చిలుక 'రామా' అని పలుకగానే మెచ్చి పుణ్యలోకాన్ని ఇచ్చితివి. ఆ విధంగానే నన్నూ కాపా డుము" అని కవి శ్రీరాముణ్ణి ప్రాధేయపడ్డాడు.

శ్రీరామభక్తి రసకావ్యాలలో దాశరథీ శతకం కలకండలాంటిది. కలకండ ఎంత తిన్నా తీపి పెరుగుతుందే కానీ తగ్గదు. ఆ విధంగానే దాశరథీశతకం చదివినకొలదీ రామభక్తితత్పరత పెరుగుతుందేగాని తరుగదు. శ్రీరాముని గుణగణాలను, అవతారాలను, వ్యక్తిత్వ వికాసాన్ని సమగ్రంగా భక్తితో రంగరించి శతకాన్ని మనకు అందించిన కంచెర్ల గోపన్న ధన్యజీవి.

# రాశిఫలాలు

## ఆగష్టు, 2013

జె. చంద్రశేఖరశర్మ



### మేషం

ఈ రాశివారికి ఈ మాసంలో అనుకొన్నపనులు, కొత్త వ్యాపారాలు, కొనుగోలు, అమ్మకాలు అనుకూలం. దూర ప్రయాణాలు ఆనందాన్ని కల్గిస్తాయి. శరీరఆరోగ్యవిషయంలో ప్రత్యేకశ్రద్ధ అవసరం. విద్యార్థులు శ్రమకు తగినఫలితం పొందుతారు. ఉద్యోగస్థులకు తోటిఉద్యోగస్థుల సహకారంతో ధనానికి లోటులేకుండా ఉంటుంది. రాజకీయరంగంలోనివారికి గుర్తింపు, గౌరవం మరింత పెరుగుతుంది. సంతానంకోసం నాగదోషపూజలు మంచి ఫలితా న్నిస్తాయి. స్త్రీలకు రాజకీయంగా ఎదుగుదల. మొదటి వారం అనారోగ్యం, రెండోవారం కార్యానుకూలత, మూడోవారం వృథాఖర్చులు, నాలుగోవారం ధనాదాయం.



### వృషభం

ఈ మాసంలో ఈ రాశివారికి బంధుమిత్రులనుండి మనస్పర్థలు వచ్చినా పరిష్కారం అవుతాయి. భూగృహవాహనాలవల్ల ఆదాయంస్వల్పంగానేఉన్నా మనశ్శాంతిగా ఉంటుంది. భవిష్యత్తుగూర్చినఆలోచన ఆందోళనకు గురి చేస్తుంది. పత్రికా రచయితలకు, సినీరచయితలకు, నిర్మాతలకు ఆకస్మికధనలాభం. నూతనవ్యక్తులపరిచయం ఎంతో ఆనందాన్ని కల్గిస్తుంది. ఉద్యోగులకు బదిలీప్రయత్నాలు నెరవేరుతాయి. పుణ్యక్షేత్రదర్శనానికై చేసేప్రయత్నాలు ఫలిస్తాయి. సకలసౌభాగ్యాలు ప్రసాదించే వరలక్ష్మీవ్రతాన్ని ఆచరించడంవల్ల మానసికప్రశాంతత ఏర్పడుతుంది. మొదటివారం క్షేత్రదర్శనం, రెండోవారం ధనలాభం, మూడోవారం ఆనందం, నాలుగోవారం ఆందోళనలు.



### మిథునం

ఈ నెలలో ఈ రాశివారికి ఆశించినఫలితాలు పొందటానికి మిత్రులసహకారం అవసర మవుతుంది. ఒప్పుకున్న పనులు అనుకున్నసమయానికి పూర్తిచేస్తారు. బంధుమిత్రుల సహకారమమకారాలతో ఊహించనివిధంగా ధనం చేతికి అందుతుంది. విద్యార్థులకు అన్నివిధాలా అనుకూలం. సినీతారలకు, దర్శకులకు, నిర్మాతలకు, ఉన్నతఉద్యోగులకు విదేశ యానం. స్త్రీల అనారోగ్యం, చిన్నపిల్లలలో నరాలు, ఉదర, శిరస్సుకు సంబంధించిన వ్యాధులు ఆందోళన కల్గిస్తాయి. దీర్ఘకాలికవ్యాధులనివారణకోసం సంకటహర చతుర్థినాడు గణపతిని ఆరాధించడంవల్ల మేలు కలుగుతుంది. మొదటివారం అనారోగ్యం, రెండోవారం ధనప్రాప్తి, మూడోవారం ఆనందం, నాలుగోవారం శుభవార్త.



### కర్కాటకం

ఈ రాశివారికి వృథాప్రయాణం, ఒడిదుడుకులతో ఈ మాసమంతా నడుస్తుంది. ఖర్చులు ఒకదానివెంబడి ఒకటి వస్తాయి. బంధుమిత్రుల సహకారం అత్యంతదయనీయంగా ఉండటంతో మానసికవేదనకు గురిఅవుతారు. అధికప్రయాణాలు, ధనవ్యయంవల్ల ఆర్థికఇబ్బందులు, ఆధ్యాత్మిక, ధార్మిక కార్యక్రమాలపట్ల ఆసక్తి ఎక్కువ. రాజకీయనాయకులకు, బంగారం, వెండివర్తకులకు, పసుపు, శనగవ్యాపారులకు ధన లాభం. సోదరీసోదరుల ఆప్యాయతలు పెరుగుతాయి. మిత్రసహకారం కొంతమేలు చేస్తుంది. మొదటివారం ఆనందం, రెండోవారం వృథాశ్రమ, మూడోవారం ధనలాభం, నాలుగోవారం ఆందోళన.



### సింహం

ఈ మాసంలో ఈ రాశివారికి ఆర్థికంగా బాధలు, సోదరీసోదరులతో మనస్పర్థలు. శరీరఆరోగ్యవిషయంలో జాగ్రత్త అవసరం. రైతులకు, బ్యాంకుఉద్యోగులకు కష్టకాలం, సినీ కళాకారులకు, రచయితలకు సమ్మానాలు, పుణ్యక్షేత్రదర్శనం ఎంతో మేలు చేస్తాయి. ప్రతిదానికి ఇతరులపై కోపగించుకునే స్వభావం పెరుగుతుంది. అవివాహితులకు వివాహానికి చేసే ప్రయత్నాలు ఫలిస్తాయి. పత్రికారచయితలకు, మహిళలకు అత్యంతఅనుకూలమైన కాలం. సమస్త గ్రహదోషనివారణకోసం నవగ్రహశాంతిపూజలను శనివారం ఆచరించడం మంచిది. మొదటివారం అనారోగ్యం, రెండోవారం సమ్మానం, మూడోవారం అధికకోపం, నాలుగోవారం సంతోషం.



## కన్యారాశి

ఈరాశివారికి ఈమాసంలో అన్నివిధాల యోగదాయక మైన కాలం. సోదరీసోదరుల ఆప్యాయతలు పెరుగుతాయి. బంధుమిత్రుల సహకారంతో పాటు, దైవానుగ్రహం ఉన్నా ఎదుటివ్యక్తులమీద నమ్మకం లేకపోవటం ఆందోళనకు దారి తీస్తాయి. భర్త అనురాగం, ఉద్యోగవిజయం నూతనవస్తువుల కొనుగోలు కొంతఉత్సాహపరుస్తాయి. పట్టింపులకు పోకుండా ఉంటే సమస్యలకు పరిష్కారాలు లభిస్తాయి. తల్లి ఆరోగ్యంపట్ల జాగ్రత్త అవసరం. మొదటివారం ఇబ్బందులు, రెండోవారం మన స్పర్ధలు, మూడోవారం దైవచింతన, నాలుగోవారం వివాదం.



## తుల

ఈ రాశివారికి ఈ మాసంలో చేసేపనులలో ఆటం కాలు, మిత్రులతో అభిప్రాయభేదాలు రావచ్చు. వాహన ప్రమాదం దృష్ట్యా ఒంటరిప్రయాణాలు వద్దు. బంగారువర్తకులు మిత్రుల నుంచి మోసానికి గురిఅయ్యే అవకాశా లున్నాయి. ఉద్యోగస్థులకు అధికారుల ఒత్తిడి. రాజకీయనాయకులకు, మహిళలకు రాజకీయ ఉన్నతి. పసుపు, వరి, చెరకు, శనగపంట రైతులకు ఆకస్మికధన లాభం. మానసికప్రశాంతతకోసం నాగదోషనివారణపూజలు మేలుచేస్తాయి. మొదటివారం శత్రుజయం, రెండోవారం ఆనందం, మూడోవారం అశాంతి, నాలుగోవారం అధికారుల ఒత్తిడి.



## వృశ్చికం

ఈ మాసంలో ఈ రాశివారికి అన్నివిధాలా ప్రతికూల మైనకాలం. వృత్తి, ఉద్యోగాలలో కష్టనష్టాలు, వ్యవహారాలలో చిక్కులు, భాగస్థులతో తగాదాలు, అధికధనవ్యయం, అనారోగ్యం తదితరసమస్యలు ఇబ్బందిపెట్టినా, అన్నింటా విజయం మీ సొంతమౌతుంది. వివాహప్రయత్నాలు, నూతనభూమి కొనుగోళ్ళు ఫలిస్తాయి. బియ్యం, కొబ్బరికాయలు, పసుపు వ్యాపారులకు అధికలాభాలు. రైతులకు, మహిళలకు విద్యార్థులకు ఆందోళనలు. నామశాంతిపూజలవల్ల మేలు కలుగుతుంది. మొదటివారం ఆందోళన, రెండోవారం తగాదాలు, మూడోవారం ధనప్రాప్తి, నాలుగోవారం అనారోగ్యం.



## ధనుస్సు

ఈ మాసంలో ఈరాశివారికి విచారం, అనారోగ్యం, ప్రమాదాలు, శత్రువులవల్ల చిక్కులు, పాపకార్యానుసక్తి, ఉద్యోగంలో మార్పు, చోరాగ్నిబాధలు, పనిలో ఆటంకాలు ఏర్పడే సూచన లున్నాయి. వెండి, బంగారంవర్తకులకు నమ్మిన వ్యక్తుల నుంచి ఇబ్బందులు ఎదురవుతాయి. వైద్యులకు సినీతారలకు అప నిందలు. వరి, మిర్చి రైతులకు, రాజకీయ నాయకులకు, చిట్స్ వ్యాపారులకు కలిసివచ్చే కాలం. వివిధపూజలవల్ల మానసిక ప్రశాంతతతో పాటు ఆకస్మికధనలాభం కలుగుతుంది. మొదటి వారం ధనలాభం, రెండోవారం చోరభయం, మూడోవారం అగ్ని భయం, నాలుగోవారం శుభవార్తాశ్రవణం.



## మకరం

ఈరాశివారికి ఈ మాసంలో వ్యవహారవిజయం, పుణ్య క్షేత్రదర్శనం, తదితరశుభఫలితాలు కలుగుతాయి. ఉద్యోగులకు, విద్యార్థులకు, శుభవార్తలు. ఆయారంగాలవారికి ధనలాభం. చిరకాలవ్యక్తుల పరిచయాలు మానసికానందాన్ని కలిగిస్తాయి. రైతులకు, మహిళలకు, చిన్నపిల్లలకు అనారోగ్యసమస్యలు. మహిళలు ఆచరించే పూజలవల్ల ఇంట్లో ఆనందం వెల్లివిరిస్తుంది. మొదటివారం వ్యవహారవిజయం, రెండోవారం క్షేత్రదర్శనం, మూడోవారం ఆనందం, నాలుగోవారం ధనప్రాప్తి.



## కుంభం

ఈ మాసంలో ఈ రాశివారు తొందరపాటు నిర్ణయాలు, చేసేవృత్తి వ్యాపారాల్లో కష్టాలు తెచ్చుకుంటారు. అవివాహితులకు వివాహం నిరుద్యోగులకు ఉద్యోగప్రయత్నాలు అనుకూలిస్తాయి. వైద్యులు, వ్యాపారులు, ఇతర రంగాలవారికి ధనాధాయం. వెండి, బంగారం వర్తకులకు గడ్డుకాలం. లలితకళలు, సంగీతం, నృత్య కళాకారులకు ప్రసంశలు. పుణ్యక్షేత్రదర్శనంవల్ల మానసిక ఆనందం. మొదటివారం క్షేత్రదర్శనం, రెండోవారం ధనవ్యయం, మూడోవారం ఆనందం, నాలుగోవారం దైవదర్శనాలు.



## మీనం

ఈ రాశివారికి ఈ మాసంలో ముఖ్యంగా రోడ్డుకాంట్రా క్టర్లకు షేరువ్యాపారులకు, వైద్య, న్యాయవాదులకు శ్రమకు తగ్గ ఫలితం ఉండదు. సాఫ్ట్‌వేర్‌రంగాలలోనివారికి, సినీ, రాజకీయ, జ్యోతిష్య, పురోహితులకు అనుకూలసమయం. ప్రభుత్వానికి, రైతులకు ప్రజావ్యతిరేకత అధికంగా ఉంటుంది. నూతన గృహనిర్మాణానికి చేసే ప్రయత్నాలు అనుకూలిస్తాయి. బంధు మిత్రుల సహకారం లభిస్తుంది. స్త్రీలకు గొంతు సమస్యలు, చిన్నపిల్లలకు అనా రోగ్యసమస్యలు, ఆందోళనకు గురిచేస్తాయి. మొదటివారం కలహం, రెండోవారం విజయం, మూడోవారం శుభవార్తాశ్రవణం, నాలుగోవారం అనారోగ్యం.



# తిరుమల ఆలయం



ఆంగ్లమూలం : డా॥ రమేశన్, తెలుగు అనువాదం : డా॥ కోరాడ రామకృష్ణ | ధారావాహిక

***(కుంపణి ప్రభుత్వం ఆలయపరిపాలన యంత్రాంగాన్ని తన చేతికి తీసికున్న మొదట్లో వచ్చిన ఇద్దరు జిల్లా కలెక్టరులు ఉదారవాదులై, పరమత సహిష్ణువులై యాత్రిక స్నేహితులుగా గుర్తించబడ్డారు. ఆలయపరిపాలన విధానంకూడ వీరి పర్యవేక్షణలో పురోగమనం చెందింది. ఆలయ పురోభివృద్ధి చరిత్రకు ఈ అధ్యాయం ముందుమాటలాగ చెల్లుతుంది.)***

## ఆంగ్లేయుల అధీనంలో ఆలయం

### స్ట్రాటన్ మరియు ఇతరుల పరిశీలన

పాలార్‌నది ఉత్తరంనుండి నెల్లూరువరకు ఉన్న ప్రాంతాన్ని ఒక పరిపాలన విభాగంచేసి క్రీ.శ.1801లో ఈ నూతన జిల్లాకు స్ట్రాటన్ కలెక్టరుగా నియమింపబడ్డాడు. మొదటి జిల్లాధికారిగా ఆనాడు దగ్గరవుతున్న వార్షికబ్రహ్మోత్సవాలు సాఫీగా సుసూత్రంగా జరిగేటట్టు చూసేది స్ట్రాటన్ మొదటి కర్తవ్యమైంది. జిల్లాధికారినుండి గుత్తాదారులకు టెండరు భర్తి చేయడానికి పిలుపు వెలువరచబడింది. అయితే భూశిస్తు విభాగం ఈ పనిని నేరుగా తనే చేపట్టి నడిపించాలి అని అభిప్రాయపడి. దీనికై 183-3-314 నక్షత్ర పగోడాలు మంజూరు చేసింది. అమల్దారునుకు ప్రోత్సాహ ధనంగా అతడి నెలజీతం 100 రూపాయలకు తోడుగా ఆదాయంలోని ఒక శతాంశం తీసికొనుటకు అనుమతి దొరకింది. ఆ రోజులలో ఇది 45000 నక్షత్ర పగోడా లని చెప్పబడింది. తిరుపతి ఆదాయంతో మొత్తం జిల్లాఆదాయమే 62881 నక్షత్ర పగోడాలుగా ఉన్న సమయంలో కంపనికి ఈ ఆలయం ఎంత ప్రముఖమైన ఆదాయమూలమై ఉండింది అనే విషయం ఇక్కడ విధితం. (ఇక్కడ లెక్కల పొరపాటుకు ముద్రణ దోషం కారణం- 45000-యూనిట్లు- అది ఏ రూపంలో ఉన్నా దాని వంద శాతం లెక్క మొత్తం ఆదాయమైన 62881 తో పొలిక- పొందటం కుదరదు - అనువాదకుడు) కంపని ఈ మొదలు సొంత ఏర్పాట్ల గురించి యోచన చేయక గుత్త ఇచ్చే విధానానికి 'ఆ విధానంచే గుత్తాదారుడు తనశ్రమశ్రద్ధలకు తగిన పారితోషికం పొందడంతో, లెక్కల్లో పొరపాటు జరగకుండా ఆదాయం చేకూరు సంభవాలు ఎక్కువ' అనే వాదంతో సమర్థన లభించేది. వ్యక్తిగతఆదాయం ఎక్కువ స్థాయిదై, కంపని సర్కారానికి స్వంత ఏర్పాట్ల నుండి వచ్చే ఆ ఎక్కువ ఆదాయాన్ని లూటి చేసే విధానం ఇది అని తెలుసుకుని సొంత ఏర్పాటు వ్యవస్థకు వెనుదిరగడమైనది. ('అమాని' అనే పదం వాడబడినది. మాన్యము - కానిది- ఇంకొకరి జవాబుదారికి వదలనిది అని అర్థంలో సర్కారు స్వంత ఏర్పాటుతో నిర్వహించే పద్ధతి. ఇపుడు కూడా (2012) దేశాద్యంతం అమాని చెరువులు- పంచాయితీ నిర్వహణలో ఉండే చెరువులను చూస్తున్నాము - అనువాద కుడు) తిరుపతి ప్రాంతంలోని అతి ఎక్కువ ఆదాయం భక్తులు సమర్పించే కానుకల మూలంగా వచ్చేది అయ్యుండి, దీనిలో కాలానుగుణంగా ఎక్కువ తక్కువ అంతరాలుండి అతి తక్కువ అవధిలో సంగ్రహం అయ్యేటటువంటిదై, కంపని సొంత ఏర్పాట్లు చేయడంతో ఎక్కువప్రతిఫలం పొందే అవకాశం ఉన్నందువల్ల - వ్యవస్థితరక్షణవ్యూహం ఏర్పరచినందువల్ల- ఈ రీతి అధికఫలం గుత్తాదారునుండి నిరీక్షించడం కాని సంగతి అనే కారణాలచే స్వకీయ ఏర్పాట్లకు వెనుదిరగడమైనది.

ఈ రీతిగా సొంత పరిపాలన పరిధిలో ఆలయాన్ని తెచ్చుకునే ప్రయత్నంలో స్ట్రాటన్ మహాశయుడు, తిరుమల

తిరుపతి దేవాలయాల ఆరంభం, సంపద, ఆదాయం, మున్నగు వాటిని ఖచ్చితంగా తెలిసికొనేందుకు ఒక ప్రశ్నావళిని తయారు చేసి, స్థానిక ఆలయాల సిబ్బంది, ధర్మకర్తలు, భక్తులకు దానిని చూపించి, వారినుండి పొందినజవాబులను క్రోఢీకరించి, దాని ఆధారంతో ఆలయ పరిపాలన విధానాన్ని రూపొందించెను. ఈ ప్రశ్నోత్తరాలను స్థానికంగా "ఆలయం సవాల్ జవాబ్ పట్టి" అంటారు. ఇక్కడి జవాబులను, వివరాలను న్యాయాలయం సాక్ష్యం అని మన్నిస్తాయి. ఈ కారణంగా వెనకటి ప్రభుత్వం ఈ దాఖలాలను సార్వజనీన అవగాహనకు చేరింది కాదు అని ప్రత్యేకించినది.

ఈ దాఖలా బహుమూల్యమయింది - కారణం ఇది ఏ ఒక్క ఉపపంథాన్ని సమర్థించడానికి ఏర్పాడైనది కాదు. నేరుగా ఆలయ పరిపాలనను చేపట్టే మొదలు వెనుకటి యాభై సంవత్సరాల నుండి ఆలయప్రభువైన పరాయి ప్రభుత్వానికి ఆలయంలోని పరంపరాగతపద్ధతుల పరిచయం చేసే ఒక ప్రయత్నఫలస్వరూపం. ఈ దాఖలాకు జతపరచిన స్ట్రాటన్ నివేదిక ఆధారంతో చూస్తే ఈ జవాబుల కూలంకషపరిశీలన జరిపినట్లు అవగాహనమౌతుంది. ఈ నివేదిక బలంతోనే సవాల్ జవాబ్ పట్టి- వాస్తవ సంగతుల సంప్రదాయపరంపరల అధికృతవివరణ మని న్యాయస్థానాలు అంగీకరిస్తాయి. ఈ ఆలయంలోని విశిష్టమైన గరిమను, ఈ దాఖలా సహజంగానే ప్రతినిధిస్తుంది.



పార్లిమెంటరి కాగితపత్రాలలో చేరినటువంటిదీ, ఉత్తర ఆర్కాటుజిల్లా ప్రతి సంగ్రహాగారంలో చేరినటువంటిదీ ఐన క్రీ.శ.1803 జనవరి 31 వ నాటి స్ట్రాటన్ నివేదిక కొండపై ఆలయం ప్రారంభదశను గురించి చెబుతుంది. ఆ నాటి దైనందిన కార్యక్రమాలు ఉత్సవ పూజాదులు, వివిధ సేవలు దర్శనాలకై నిర్ణయించబడ్డ ఆర్జిత సేవా రుసుములు, సేవా వివరాలను తెలుపుతుంది. స్ట్రాటన్ వాసికెక్కడానికి ప్రథమ కారణమంటే ఈ రుసుములలో కొన్నింటిని తీసివేయాలనీ, యాత్రికులకు భారమైయున్న యాత్రిక శిస్తును తీసివేయాలని అతడు తీర్మానించి సిఫార్సు చేయడమే. ఈనాడు అమలులో ఉన్న ఆర్జితసేవా శుల్కములు, ఉత్సవాలు ఈ నివేదికలో ఉంటూ ఆసక్తిని రేకెత్తించేవిగా ఉన్నాయి.

కుంపణి ప్రభుత్వంలోని మొట్టమొదటి అధికారులలో బుద్ధికౌశలం, ఉదారవాదం, మనోభావం, సహిష్ణుత, ఇతరులు స్థాపించిన గుడి గుండారాల గురించి నిజమైన గౌరవభావం, మానవీయ దృష్టికోణం-ఉండేవి అని ఈ దాఖలా తెలియపరుస్తుంది. తరువాతి కాలంలోని ఇంగ్లెండు సామ్రాట్టు- సింహాసనం అధికారులకు భారతీయమైనదన్న దానిపట్ల ఉన్నట్టి హేయ భావం తిరస్కార భావానికి ఇది తద్విరుద్ధం. ఆలయాన్ని గురించి స్ట్రాటన్ చెప్పేదింత - "బహుతేక ఉత్తర దక్షిణ దిక్కుల మధ్య నడిచే కొండలలో పూర్వానికి తిరుపతి గ్రామం ఉంది. పర్వత శిఖరంలో తిరుపతి గ్రామం నుండి, ఏడుమైళ్ల దూరంలో ప్రసిద్ధ మైన తిరుపతి ఆలయ మున్నది. తిరుపతి నుండి ఈ గుడికి పోవుమార్గంలో మూడు గోపురా లుండి ఈ మార్గంలో హిందూవులు మాత్రమే పోవచ్చును. తిరుపతినుండి అరమైలు దూరం లోని కొండక్రిందప్రాంతలోని గోపురంవరకుమాత్రమే ఇతరులు పోవచ్చును. ఆలయ మున్న కొండను మొదటిసారి చూచిన తక్షణమే నేలపై పరుండి నమస్కారం చేసేంత పవిత్ర భావన యాత్రికులలో ఏర్పడేటట్లు ఈ ఆలయం చేయును." తరువాత స్వామి వివాహమాడిన, కుబేరుని దగ్గర అప్పుతీసుకున్న విషయం స్ట్రాటన్ చెప్పినాడు. గోసాయిల ద్వారా కానుకలు వసూలు అయ్యే రీతిని వివరించాడు.

ఆదాయంలోని ఇతరమార్గాలను వివరిస్తూ అతడు చెప్పేమాట - ఆదాయంలోని రెండవ విధానం వర్తనద్వారా

వచ్చేది. అంటే స్వామి విగ్రహానికి సొంత వాడుకకై సమర్పించిన నగలు, వస్త్రములు, అశ్వములు, మొదలైన వస్తువులను సమర్పించేటపుడు దానకర్త ఆయా వస్తువుల విలువకు సరియగు ధనం ఆలయానికి ఆ వస్తువుల నిర్వహణకై చెల్లించాల్సి ఉండేవి. సేవల రుసుము, అనుమతి రుసుము మున్నగు వివరాలను చెప్పిన తరువాత స్ట్రాటన్ విడదీసి చెప్పడమేమిటి అంటే "నేను సాధ్యమైనంత ఎక్కువ ఆధారితసంగతులమూలంగా తెలుసుకున్న దేమిటంటే ఈ సమస్తఎక్కువైన రుసుములు, అనుమతి శుల్కములు అన్నియు ముసల్మాన ప్రభుత్వం స్థాపనానంతరం ఆలయ వ్యవస్థను అతి ఎక్కువ మోజణి ఇచ్చు గుత్తాదారుడికి అప్పగించినపుడు పుట్టుకు వచ్చినవి. గుత్తా దారుడు వసూలు చేసే శిస్తులు, రుసుములకు ఎటువంటి అభ్యంతరమూ లేనందు వల్ల, ప్రతిగుత్తాదారుడు తన బుద్ధికి తోచిన కొత్త కొత్త విధానంలో డబ్బును గుంజడం కనుగొన్నాడు, ప్రతియొక్కడూ తన వెనుకటి వాడి రుసుములను అలాగే ఉంచుకుని కొత్త రుసుములను పెంచారు.

"కొండను ఎక్కెందుకు యాత్రికులు చెల్లించాల్సిన మూడు పణం సుంకానికీ ఇదే రీతి ఏ ఆధారమూ లేక అసింధు మూలమై దురపయోగమౌతూ వచ్చింది కాబట్టి దీనిని రద్దు పరచాలని శిసార్సు చేయా లనుకున్నాను. ఈ సుంకం గురించి యాత్రికుల వెలిబుచ్చిన దురభిప్రాయాన్ని తెలిసికొన్న తరువాత నా యొక్క సిఫారసును గురించి తమరు సానుకూలమైన ఆజ్ఞ చేస్తా రని విన్నవించుకుంటున్నాను".

నివేదికలో ఐదు నుండి తొమ్మిది అంశాలని దాఖలైన అనుమతి శుల్కం, సుంకంలను తీసివేయా లని శిఫారసు చేసిన దాన్ని చూడవచ్చు. దీనివల్ల ఏర్పడే నష్టం లెక్కవేసి 3674+ 341.25 పగోడా లని సూచించడం జరిగింది.

ఇతర ఆలయాలగురించి చెప్పాలి అంటే గోవింద రాజస్వామి ఆలయం సంగ్రహణ మాత్రమే ప్రభుత్వానికి చెందిన న్యాయసమ్మతమైన హక్కు అని లెక్కవేయబడి ఫసలి 1211 లో ఇది 877-13-7-8 నక్షత్ర పగోడాలని తెలుపబడింది. ఈ నివేదికలోని మరియొక ఆసక్తికరమైన అంశమంటే క్రీ.శ.1790-91 నుండి క్రీ.శ.1801-02 వరకు ఇవ్వబడ్డ ఆలయ వార్షిక ఆదాయ పట్టి.

తన నివేదికను పంపిన కొన్ని రోజులకు స్ట్రాటన్ జిల్లా బాధ్యతలనుండి వేరు చేయబడ్డాడు. అతడు సిఫారసు చేసిన సుంకములను రుసుములను రద్దు చేయడానికి ఏ క్రమమూ తీసికొనబడలేదు. తదనంతరం కాక్‌బర్న్ కలెక్టరై బాధ్యతలను స్వీకరంచినా అతనిపరిపాలన కంపనిప్రభుత్వానికి పట్టక అతడిని న్యాయశాఖకు బదలీ చేశారు. తరువాత కలెక్టర్ అయిన గ్రీమ్ సాహేబు 15-12-1804 నుండి 14-4-1818 వరకు పదవిలో ఉన్నాడు. ఇతడు దక్షుడు, జనప్రియుడు అయిన పరిపాలనాధికారి అని తెలుస్తుంది. ఇతనికాలంలో కంపని ప్రభుత్వం ఆమోదించలేదు కాని రైతువారి పద్ధతిని జారీ చేసింది ఇతనే. ఇప్పుడు జిల్లా కార్యాలయాలు ఉండే చిత్తూరు గ్రీమ్స్ పేట (గిరింపేట) ఇతని పేరులోనే ప్రసిద్ధి చెందినది. క్రీ.శ. 1818 లో ఇతను స్ట్రాటన్ చేసిన పలు సుంకములను రద్దు చేసేందుకు సిఫారసు చేయడమేకాక పలు శుల్కం రుసుముల గురించి చర్చ జరిపి వాటినికూడా రద్దు చేయా లని సిఫారసు చేశాడు. మంగలికట్టనుగురించి అతను (స్ట్రాటన్ నివేదికలో 8వ అంశం) చేసిన సిఫారసు మనోజ్ఞం "పతివిహీన లేక పిత విహీన, ప్రతియొక్క యాత్రిక స్త్రీ / పురుషుడూ కపిలతీర్థం సమీపంలోని క్షురకట్టలో తలగుండు చేయించుకోవాలి. గుండు గీయించుకోవడానికి మొదలు ఒకటిన్నర పణం ఇవ్వాల్సి ఉంటే ఇపుడు పోటీ కారణంగా మూడు పణం అయ్యింది. క్షౌరికుల ఒక సంఘం ఈ గుత్తను తీసుకున్నది. ప్రభుత్వం గుత్తకిచ్చిన కారణంగా వీరు ఒక అనుపాతంలో శుల్కం పెంచడానికి అవకాశం ఉంది కాబట్టి దీనిని తత్‌క్షణమే రద్దు చేయాలి, యాత్రికులు అతిత్వరగా అతితక్కువ ధరలో ముడులు ఇచ్చే వైనం జారీ కావాలి." ఇతని నివేదికనుండి మనకు ఆ రోజు లలో కొండమీది ఆలయం మాత్రమే ఆంగ్లేయుల నేర సుపర్దులో ఉన్నట్లు తెలుస్తుంది. గోవిందరాజస్వామి ఆలయం పరిపాలనను గుత్తకు ఇవ్వబడింది. ఈ ఆలయం గురించి అతని అభిప్రాయం ఇది - "గుత్తాదారు ఆపేక్ష పూర్తి అయ్యేంతవరకు భక్తులు తమ భక్తని చూపజాలరు. కాన తిరుపతిలాంటి పెద్ద ఆలయంలో భక్తులు స్వ-ఇచ్ఛతో తమభక్తిసమర్పణ చేసేందుకు అవ కాశముండాలి." దూరప్రాంతాల నుండి వేరే వేరే వృత్తుల వారంతా తిరుపతికి వచ్చి స్వ-ఇచ్ఛతో తమ కానుకలను సమర్పణ చేసే విధానం ఘనమైన ఆదాయ మూలం కాదు. అలాంటప్పుడు కానుకలు ఇచ్చి తీరాలి అని వాళ్లను బలవంతం చేసేది అత్యంత ఆక్షేపణీయం" రద్దు చేయా లని తాను సిఫారసు చేసిన సుంకములు, రుసుములు గురించి అతను చెప్పడం - 'ఈ సుంకములు రుసుములు గౌరవనీయమైన పరంపరతో వచ్చినవి కాకపోయినా పెద్ద సంప్రదాయం అనే రీతిగా అన్ని రకాల భక్తులూ ఇచ్చి తీరాల్సిన కానుకలై కూర్చున్నవి. నాకై నేను చేసిన పరిశీలనలో ఇవి అంతా నిరంకుశ దొరల కాలంలో ఆరంభం అయిన ఆధిక్యము లనియూ, యాత్రికులకు వీటి గురించి ఎటువంటి గౌరవభావమూ లే దనియూ తెలుసు కున్నాను. హిందూవులలో దీనిగురించి ఏకాభిప్రాయమైన ఆమోదమూ లేదు." ఇండియా దేశంలో కంపని ప్రభుత్వం అనుమతి పొంది రాజమార్గాల సమీపంలో యాత్రికులకై సత్రా లను, త్రాగునీళ్లకై బావులను త్రవ్వటానికి, విశ్రాంతికై ఉపవన నిర్మాణానికి, రెండుగుంటల తరిభూమి లేక ఐదుగుంటల ఖుష్కి భూమిని ఇనాంగా ఇచ్చే పద్ధతిని చలామణికి తెచ్చినవారిలో గ్రిం సాహేబు ప్రథముడు. 'మంచిచేయటంలో ఆదాయ భాగాన్ని త్యాగం చేయడం అతి ఎక్కువ అనే లెక్కలకు తావు లేదు అనియూ వాటిలో నిధానధోరణికి అవకాశమే లేదు' అనే అతనిఆదర్శం ఎంత ఉదాత్తమై ఉండింది అని స్పష్టం అవుతుంది. మొదటి ఈ ఇద్దరు కలెక్టరుల పరిపాలన నివేదికల నుండి వీరిద్దరూ ఎంత శ్రద్ధ, మానవీయ సానుభూతితో తమ కర్తవ్య నిర్వహణ చేశారు అనేది మాత్రమే కాక, గుత్తాదారులకు పరిపాలన బాధ్యత అప్పగించి ఆదాయాన్ని ఆరామంగా అనుభవిస్తూ వచ్చిన ఆర్కాడునవాబులకాలంలో ఆలయ పరిపాలన ఏ క్రిందిస్థాయికి దిగజారిపోయి ఉండింది అనేది స్పష్టం. తోడుకు గుత్తాదారుల శోషణకు లొంగిపోయిన సాధారణదుర్బలభక్తులు ఏ విధంగా దైన్యావస్థలో దేవుడి సేవకై బద్ధతతో అనివార్యంగా బలై ఉన్నారనేది కూడా తెలుస్తుంది. "స్వామి పెండ్లికై కుబేరుడి దగ్గర చేసిన అప్పును తీర్చుటకు కంతుల కిస్తులను స్థానిక రాజునకు అప్పగించాలి అనే స్థానికుల కట్టుకథను ఆలయాన్ని ముసల్మానుల దాడుల నుండి రక్షించుకొనేందుకు అల్లినారు" అనే సత్యాన్ని తెలుసు కునేందుకు ఎక్కువ కల్పనసహాయం అగత్యం లేదు.

*(ఇంకా ఉంది)*



# శ్రీ వేంకటేశ్వర లీలలు



## మట్టికుండపై.... శ్రీవారి నామాలు



పి. సూరిబాబు, పార్వతీపురం

మాది విజయనగరంజిల్లా. ఒకప్పుడు మాది చాలా బీద కుటుంబం. నాన్న చిన్నప్పుడే చనిపోయాడు. అమ్మ, తమ్ముడు ఉన్నారు. నేను పదోతరగతి కట్టి ఉత్తీర్ణు దయ్యాను. మా మేనమామ దయ వల్ల చిన్నసంస్థలో చిరుఉద్యోగం లభించింది. నాకు పెద్దగా దైవభక్తి ఉండేది కాదు. 1983లో నా స్నేహితుడు ఒకడు తిరుమలకు వెళ్లదాం..రా! అన్నాడు. అప్పుడు నాకు స్తోమత లేదు. నేను రాలేను అన్నాను. వాడే నాకు తన సొంతఖర్చులతో తిరుమలకి తీసుకువెళ్ళాడు. అప్పుడే భగవంతు డంటే ఇలా ఉంటా డనిపించింది. శ్రీ వేంకటేశ్వరుణ్ణి కనులారా దర్శించుకున్నాం. అప్పటినుంచి నాకు కొంచెం దైవభక్తి కుదిరింది. ప్రతివారం దేవాలయంకు వెళ్ళేవాడిని. ఆ వేంకటేశ్వర స్వామి నన్ను కరుణించలే దని బాధపడ్డాను. ఎందుకంటే నేను తిరుమల నుంచి వచ్చిన రెండు నెలలకే నా ఉద్యోగం తీసివేశారు. నేను చాల బాధపడ్డాను. ఏడ్చాను. ఎటువెళ్లాలో అని మథనపడ్డాను. అందరూ రెండవసారి తిరుమలకి వెళ్లి, శ్రీనివాసుని దర్శనం చేసుకోవా లని అనేవారు. కానీ, నాకు అంత స్తోమత లేదు. మనసులోనే ప్రార్థించుకునే వాణ్ణి.

ఈ లోగా కష్టంలో నష్టంలాగ మా అమ్మ 1984, మార్చిలో నాకు వివాహం జరిపించింది. భార్య వచ్చిన తరువాత బాధ్యత పెరిగింది. కొన్నికష్టాలు పడ్డాను. వినయం, విధేయత, సహనం, భగవంతునిపై భక్తీ కలవాడికి ఎప్పటికైనా ఆ శ్రీహరి, పరమాత్ముడు కరుణిస్తా డని అమ్మ చెప్పేది. అలాగే అమ్మమాట పొల్లుపోలేదు. సంవత్సరం తరువాత అమ్మాయి పుట్టింది. లక్ష్మీదేవి పుట్టిం దని అనుకున్నాను.

రోజూ భగవంతుడుకి దీపారాధన చేసి, సహస్ర నామాలు జపిస్తాను. శ్రీమన్నారాయణుడు కరుణించాడు. అమ్మాయి పుట్టిన మూడు నెలల తరువాత మళ్ళీ నా ఉద్యోగం నాకు వచ్చింది. ఆర్థికంగా వృద్ధి చెందాను. తదుపరి మళ్లీ ఇంకో అమ్మాయి పుట్టింది. లక్ష్మీదేవులు నా ఇంట పుట్టా రనుకొన్నాను. పెద్దఅమ్మాయి బి.ఎస్‌సి. పూర్తి చేసింది. వివాహం కూడా చేశాను. ఒక ప్రభుత్వ ఉద్యోగికి ఇచ్చాను. చాల చక్కగా కాపురం చేసుకుంటున్నారు. నా భార్య ప్రతిపైసా చాలా జాగ్రత్తగా ఖర్చు పెడుతుంది.

నేను 2010లో తిరుపతికి నా మిత్రుడుతో కలిసి వచ్చాను. తిరుపతిలో దిగి, కాలినడకన తిరుమల కొండకు చేరుకున్నాం. ఉచితదర్శనంతో శ్రీవారిని దగ్గరగా చూశాం. భక్తులకు ఉచితలడ్డు ప్రసాదం, ఉచితభోజన సదుపాయాలు చాలా బాగా తిరుమల తిరుపతి దేవస్థానంవారు నిర్వహిస్తున్నారు. మాకు చాలా ఆనందం కలిగింది. మళ్లీ తిరుపతి వెళ్ళా లనిపిస్తూంది. అంతా కన్నుల వైకుంఠంగా ఉంది-తిరుమల.

నేను రోజూ మా కార్యలయంలో దీపంపెట్టి, భగవంతునియొక్కసహస్రనామాలను చదువుతున్నాను. శ్రీ వేంకటేశ్వరునిపటంక్రింద మట్టికుండతో నీళ్ళు పెడతాను. తిరుపతి నుంచి వచ్చిన రెండునెలల తరువాత శ్రీహరి పటం క్రిందనున్న మట్టికుండపై శ్రీవారినామాలు దర్శనం ఇచ్చాయి. ఆశ్చర్యం వేసింది. శ్రీవేంకటేశ్వరమాహాత్మ్యం! పటం చాలా పాతది. అప్పట్లో తి.తి.దేవస్థానం సంబంధించిన ఛాయాచిత్రం. అప్పటినుంచి కుండకు పూజలు చేస్తున్నాను. మా ఆఫీసర్లు కూడా చాలా ఆనందించారు. అంతా నీభక్తివల్లే ఆ దేవుడు కరుణించా డని అన్నారు. అన్నిమీడియా ఛానల్స్ వచ్చాయి. వేలకొలదీ భక్తులు దర్శించుకున్నారు. మాది కార్యాలయం కనుక ఎదురుగా ఉన్న శ్రీఆంజనేయస్వామిఆలయంకు తరలించాం. అక్కడ స్వామివారు పూజలందుకొంటున్నారు.

ఆ విధంగా శ్రీవేంకటేశ్వరస్వామికి నామీద కరుణ కలిగింది. నాది చిరుఉద్యోగం అయినా చాలా సంతోషంగా ఉన్నాను. నా జీవితం సుఖవంత మైంది. దేవుణ్ణి నమ్మినవాడు ఎన్నడూ చెడిపో డనే పెద్దల మాటలు వాస్తవం అయ్యాయి.

# ఆలోచనాంశాలు

**(మానవజీవిత మార్గదర్శకాలు)**

గ్రంథసమీక్ష

**రచయిత:** డా॥ అప్పజోడు వేంకటసుబ్బయ్య, **సైజు:** 1/8 డెమ్మి; **పుటలు:**×+120; **వెల:** రూ. 90/–; **ప్రతులకు:** ప్లాట్ నెం. 108, అశోక్ అవెన్యూ, అశోక్‌నగర్, కర్నూలు – 518 005. ఫోన్–08518–253872, సెల్–90148 78108.

సమాజం యొక్క ఔన్నత్యం వ్యక్తి శీలనిర్మాణంపై ఆధారపడి ఉంటుంది. విశేషసాంకేతిక పరిజ్ఞానం అందుబాటులోకి వచ్చిన నేటి తరుణంలో మానవులు భోగమయజీవితంతో పాటు అసాధారణ మానసికఒత్తిడికి కూడా లోనౌతున్నారు. ఈ కారణంచేత విజ్ఞానశాస్త్రం చాలా మట్టుకు దుర్వినియోగమౌతున్నది. అశాంతి, అలజడి, ప్రేమ రాహిత్యం, అపార్థాలు పెరుగుతూనే ఉన్నాయి. సాంకేతికా భివృద్ధి సాధించిన దేమిటనేప్రశ్న సాధారణ ఆలోచనాపరు డైన ప్రతిమానవునిఎదుట భూతంలా నిలబడి ఉంది.

ఈ సందిగ్ధతకు కారణాలుకూడా స్పష్టంగానే ఉన్నాయి. మానవసమాజం సాంకేతికాభివృద్ధిని ఆకళింపు చేసుకొన్నంత త్వరగా శీలనిర్మాణనైతికవిద్యను, ధార్మిక తత్త్వాన్ని ఆకళింపు చేసుకోవడం లేదు. తద్వారా సమాంత రాభివృద్ధి చెందాల్సి సాంకేతికత, నైతికత ఇప్పుడు పరస్పర విలోమంగా ఉంటున్నాయి. మెల్లమెల్లగా నైతికవిద్య చేత గానివాళ్లు వల్లించే కాలక్షేమం కబుర్లుగా మిగిలిపోతున్నది. ఈ అవాంఛనీయపరిణామాలు సామాజికశాస్త్రవేత్తలు, సాహితీవేత్తలు మొదలగు మేధావివర్గానికి గగుర్పాటు కల్గి స్తూనే ఉన్నాయి. బాధ్యతగల రచయితలు ఈ పరిణామా లను చక్కదిద్ది, తద్వారా మానవజాతిమనుగడ ప్రశ్నార్థకం కాకుండా చేయడానికి పూనుకొన్నారు. అటువంటి వారిలో అగ్రేసరులు డా॥ అప్పజోడు వేంకటసుబ్బయ్యగారు. ఆర్షధర్మ పరిరక్షణే ధ్యేయంగా, మానవకల్యాణమే లక్ష్యంగా–రచనలు చేసే డా॥ అప్పజోడు గతంలో భారత, రామాయణాల్లోని ఉత్కృష్టాంశాలను సునిశితదృష్టితో వ్యాఖ్యానించి రెండు గ్రంథాలు వెలువరించారు.

మనవాఙ్మయంలో మానవజాతిశీలనిర్మాణం కోసం అనేకాంశాలు సూత్రప్రాయంగా చెప్పబడి ఉన్నాయి. సూక్ష్మగ్రాహులైన పాఠకులుమాత్రమే వాటిని అర్థం చేసుకో గలరు. వ్యాఖ్యానసాపేక్షాలైన ఇలాంటిపద్యాలు, పద్య పాదాలు, శ్లోకాలు మొదలగు వాటిని 36 సేకరించి వాటికి సరళ, సంక్షిప్తవ్యాఖ్యానం సంతరించారు. ఇందులో 12 శ్లోకా లున్నాయి. వాటిలో దాదాపు అన్నీ ప్రసిద్ధమైనవే. సుప్రసిద్ధ మైన ఆ శ్లోకాలలోని సురుచిరభావాలను సుమధురశైలిలో డా॥ అప్పజోడుగారు వ్యాఖ్యానించారు. ఒరు లేయవి యొన రించిన.., సారపుధర్మమున్ విమల సత్యము.. మొదలగు భారతపద్యాలు, చదు వది యెంత గల్గిన మొదలగు పద్యాలు ఎందరో మహానుభావులు......., బ్రహ్మ మొక్కటే..... మొదలగు సంకీర్తనలు, ఏ దేశచరిత్ర చూసినా ఏమున్నది గర్వకారణం...... ఇత్యాది అత్యాధునిక కవితా పంక్తులు డా॥ అప్పజోడుగారివ్యాఖ్యానంతో శోభాయ మానంగా ఈ గ్రంథంలో ప్రకాశిస్తున్నాయి.

భౌతికత, నైతికత, ఆధ్యాత్మికత దేని కదే వేర్వే రని భ్రమించే ఈ కాలంలో ధార్మికత అంతర్వాహినిగా వీటికి ఏకత్వాన్ని సమకూర్చే వైభవాన్ని మనం ఈ వ్యాఖ్యానంలో దర్శించవచ్చు. సామాజికచింతనతో పాటు ఆధ్యాత్మిక చింతనకూడా పుష్కలంగా కల్గిన డా॥అప్పజోడుగారు సంక్షుభితమానవసమాజానికి దిశానిర్దేశం చేయగల్గిన అపూర్వగ్రంథాన్ని సంతరించా రనడం అతిశయోక్తి కాదు.

ఈ గ్రంథానికి 'మానవజీవితమార్గదర్శకాలు' అనే ఉపశీర్షిక పాఠకులభావవిస్తృతికి బాటలు పరుస్తున్నది. ఊకదంపుడుమాటలే వ్యాఖ్యానంగా భావించే ఈ రోజుల్లో ఉత్తమవ్యాఖ్యాత స్పృశించదగిన కోణా లేవో తెలియజేసే ఒక పాఠ్యప్రణాళికలా ఈ గ్రంథం ఉన్నది. విషయాన్ని విపులీకరించడంకోసం డా॥ అప్పజోడుగారు ఎన్నుకొన్న పౌరాణికపాత్రలు, వాటిని వారు విశ్లేషించినదృష్టికోణం అనన్యసామాన్యం. ఇలాంటిగ్రంథాలపఠనప్రభావంవల్ల విశ్లే షణసామర్థ్యం పెరగడమే కాకుండా శీలనిర్మాణంకూడా జరుగుతుంది. ఇట్టి అపురూపగ్రంథాలను తెలుగువారంతా ముఖ్యంగా విద్యార్థిలోకం చదివి, కృతార్థులు కావా లని కోరుకొందాం!

*– డా॥ కంపల్లె రవిచంద్రన్.*

# శ్రీసువర్ణలింగేశ్వరస్వామి

## (గణపవరం)

వేదాంతంవెంకటరావు

మన దేవాలయాలు

పూర్వం ఈ ప్రాంతం కాకతీయసామ్రాజ్యంలో ఉండే దని ఈ శివాలయంలో ఉన్న శిలా శాసనాల వల్ల తెలుస్తోంది.

ఈ ప్రాంతంలో ప్రాచీనస్తంభశకలాలు, రాతిబలి పీఠాలు, రాతినిర్మాణకట్టడాలు విరివిగా ఉన్నాయి. పాతరాతి కట్టడాలు. సువర్ణగుండ మనేచెరువులో ఉన్నాయి. ఆ చెరువు నీరే గ్రామమంతా రక్షితమంచినీరుగా సరఫరా చేయబడు తున్నది. ఈ ఆలయప్రాంగణంలో ప్రాచీనశివలింగాల విగ్రహా లున్నాయి.

పదేళ్లకిందట ముఖమండపనిర్మాణం, ప్రహరీ, చెరువు చుట్టూ రక్షణగా గోడను నిర్మించారు. ముఖద్వారంనుండి లోపలకు దారి ఉంది. దేవాలయప్రాంగణంలో పాదప్రక్షాళన చేసుకుని ప్రవేశించడానికి నాలుగుమెట్లు రేవుగ నిర్మించారు. వాటిదగ్గరలో అరుగు ఉంది. ఆ అరుగుపై వేడుకలు జరుగు తుంటాయి. అరుగు ప్రక్కన మెట్లగుండా దేవాలయప్రవేశం.

ఎడమవైపున విగ్రహాల మందిరం ఈ మందిరానికి ఎదురుగా ఓ నాగమల్లి చెట్టు ఉంది. ఆ చెట్టుక్రింద మంది రానికి చెట్టుకు మధ్యలో ఐదడుగుల పానవట్టసహిత శివలింగం కలదు. అందరూ ఈ శివలింగాన్ని తాకి నమస్కరిస్తుంటారు. నాగమల్లిపుష్పాలు సమర్పిస్తే, కోరికలు నెరవేరుతాయని నమ్మిక.

కొందరు ప్రదక్షిణలు చేసి, గుడిలో ప్రవేశిస్తారు. కొందరు చండీప్రదక్షిణలు చేసి, ప్రవేశిస్తారు. ప్రవేశించే ముందు గంటకొట్టి ప్రవేశంచడం ఆలయప్రవేశధర్మం. పార్వతీదేవి విగ్రహానికి నాలుగుఅడుగుల దూరంలో నాలుగుపాతరాతి స్తంభాల మందిరం ఉంది. శివలింగం పూర్వం బంగారు రంగులో ఉండే దని అందువల్ల ఈ స్వామికి స్వర్ణలింగ మని పేరు వచ్చిం దని కొందరు అంటుంటారు.

ఈ ఆలయానికి దక్షిణంగా శ్రీసుబ్రహ్మణ్యేశ్వర స్వామిఆలయం కలదు. ప్రతియేట శ్రీసుబ్రహ్మణ్యేశ్వర తిరు ణాల జరుగుతుంది. శివరాత్రికి వైభవంగా వేడుకలు జరుగు తాయి.

---

**తి**రుమల శ్రీవారిదర్శనానికి వచ్చే భక్తులు తప్పని సరిగా సంప్ర దాయ దుస్తులు ధరించాలనే నిబం ధనను తి.తి.దే. ప్రవేశపెట్టింది. ఇందులో భాగంగా 15-05-2013 నుండి విరామదర్శనం (వి.ఐ.పి.దర్శనం) టిక్కెట్లపై ఆల యానికి వచ్చే భక్తులు భారతీయ సంప్రదాయ వస్త్రధారణతో రావా లనే నిబంధనను అమలుచేస్తున్నది.

## తప్పనిసరిగా.... భారతీయ సంప్రదాయ వస్త్రాలు

**పురుషులు** - ధోవతి-ఉత్తరీయం, కుర్త-పైజామా

**మహిళలు** - చీర-రవిక, లంగా-ఓణి, చున్నీతో పాటు పంజాబీడ్రస్, చుడీదార్ ధరించాల్సి ఉంటుంది.

**'శ్రీవారి సేవ'లో పాల్గొన దలచిన భక్తులు ఈ క్రింది డ్రస్‌కోడ్‌ను విధిగా పాటించాలి.**

**పురుషులు** - తెల్లని షర్టు, తెల్లని ప్యాంటు ధరించాలి.

**మహిళలు** - ముదురాకు పచ్చ చీరను, అదేరంగు రవికెను ధరించాలి.

సహనం లేకపోవడంవల్ల, కామక్రోధలోభమోహ మదమాత్సర్యాలను జయించలేకపోవడంవల్ల కలిగే అనర్థాలు ఈ క్రిందికథవల్ల మనకు విశదమవుతాయి. వశిష్ఠుడు, విశ్వామిత్రుడు పరస్పరం శపించుకొని, కొంగ బాతులుగా మారిన ఉదంతం మనకు కనువిప్పు కలిగిస్తుంది. త్రిశంకు కుమారుడు హరిశ్చంద్రుడు. ఈతడు కోశలదేశానికి రాజు. వశిష్ఠవిశ్వామిత్రులు పందెం వేసుకున్నారు. హరిశ్చంద్రునిచేత తాను అబద్ధ మాడిస్తా నని విశ్వామిత్రుడు వశిష్ఠునితో పందెం వేశాడు. అలా చేయలేకపోతే తాను బానిసగా ఉంటా నని పందెం వేసాడు. హరిశ్చంద్రునిపాలనలో ప్రజలు ధర్మమార్గంలో నడిచారు. వర్షాలు, సకాలంలో పడడంవల్ల పాడిపంటలతో దేశం సస్యశామలమై, ప్రజలు సుఖించారు.

ఒకసారి విశ్వామిత్రమహర్షి రాజకడ కేగి తాను చేసే యజ్ఞానికి ధనం సమకూర్చ మని అడిగాడు. రాజు అందుకు అంగీకారం తెల్పాడు. మరలా మహర్షి నీవు దిగ్విజయంగా పరిసమాప్తం చేసిన రాజసూయయాగానికై మాకు దక్షిణ ఇమ్మని అడిగాడు. రాజు మునీశ్వరుణ్ణి ఏమి కావాలో కోరుకోమన్నాడు. నీ కోశాగారాన్ని రాజ్యంతోపాటు ఇమ్మని విశ్వామిత్రుడు కోరాడు. నీవు నారచీరలు ధరించి, భార్యాబిడ్డలతో అడవికి పొమ్మని ఆదేశించాడు. రాజు మునికోర్కెను అంగీకరించాడు.

ఋషిఋణం తీర్చుకోవడానికై హరిశ్చంద్రుడు తన భార్య శైబ్యను (చంద్రమతిని) కొడుకు లోహితాస్యుణ్ణి బ్రాహ్మణునికి విక్రయించాడు. భార్యాపుత్రులను విక్రయించిన ధనం బాకీకి చాలకపోవడంతో రాజు తనను తాను అమ్ముకోడానికి సిద్ధపడ్డాడు. ప్రవీరు డనే తలారి తనవద్ద కాటికాపరిగా పనిచేయడానికి హరిశ్చంద్రుణ్ణి పదికోట్లనాణే లిచ్చి కొన్నాడు. సంవత్సరంపాటు హరిశ్చంద్రుడు కాటికాపరిగా పనిచేశాడు. హఠాత్తుగా లోహితాస్యుడు పాముకాటుకు బలియై చనిపోయాడు. చంద్రమతి, (హరిశ్చంద్రునిభార్య) కుమారుని శవాన్ని శ్మశానానికి తీసుకువచ్చి, దహనం చేయడానికి ప్రయత్నించింది. కాటికాపరి సుంకం చెల్లించకుండా దహనం చేయడానికి అంగీకరించలేదు. తన వద్ద ఏమీ లే దని మొరపెట్టు కొనింది–చంద్రమతి. వీరబాహుడికి (హరిశ్చంద్రునికి) ఆమెమెడలో నున్న మంగళసూత్రం కనిపించింది. మంగళసూత్రాన్ని అమ్మి, సుంకం చెల్లించమన్నాడు. చంద్రమతిమంగళసూత్రం భర్తకు తప్ప

# బాలప్రబోధం సత్యహరిశ్చంద్ర

ఎ.సూర్యకుమారి

ఇతరులకు కనబడ దని వశిష్ఠునివరం ఉంది. చంద్రమతి వీరబాహుణ్ణి పరీక్షగా చూచి, భర్త అని గుర్తించింది. తనభార్య అయినా సరే కాటి సుంకం చెల్లించకుండా దహనం చేయడానికి వీరబాహుడు అంగీకరించలేదు. హరిశ్చంద్రునిశమదమసత్యాది గుణాలకు అచ్చరు వొంది, దేవతలు ప్రత్యక్షమై, లోహితాస్యుణ్ణి బ్రతికించి, భార్యాపుత్రసమేతంగా స్వర్గలోకాన్ని అలంకరించుమని చెప్పి, వారికి పూర్వ వైభవాన్ని ప్రసాదించారు. తన యజమాని చండాలుని ఆజ్ఞపొందక, విశ్వామిత్రుని ఋణము తీర్చక, తాను స్వర్గానికి రానన్నాడు. అపుడు చండాల రూపధారి తానే నని ధర్మదేవత ప్రత్యక్షమయ్యాడు. తాను చేసిన పుణ్యకర్మల కన్నింటికీ ప్రజలే మూలస్తంభా లనీ, వాళ్లు లేనిదే తాను స్వర్గానికి రా నని కూర్చొన్నాడు. వారితో కలసి ఒక్కదినమైనా స్వర్గసుఖాలు అనుభవిస్తా నని పట్టుపట్టాడు. ఇంద్రు డందుకు సమ్మతించాడు. పిదప హరిశ్చంద్రుడు లోహితాస్యుణ్ణి రాజు చేసి, తన ప్రజలతో కూడా స్వర్గానికిపోయాడు. వశిష్ఠుడు తపస్సు చాలించి, విశ్వామిత్రుని కడకు వచ్చి, పుణ్యాత్ముడైన హరిశ్చంద్రమహారాజును కష్టాల పాలుచేసి, అగచాట్లకు గురిచేసినందుకుగాను నీవు కొంగజన్మను పొందుదువుగాక అని శపించాడు. విశ్వామిత్రుడు వశిష్ఠునికి తిరిగి ప్రతిశాప మిచ్చాడు. నీవు బాతువు కమ్మని. ఇలా ఇరువురు పరస్పరం శపించుకొన్నారు. కొంగగా, బాతుగా జన్మించిన విశ్వామిత్రుడు, వశిష్ఠుడు, వారివైర స్వభావం విడనాడలేదు. రాగద్వేషాలకు, కామక్రోధాలకు వశు లయ్యారు. బ్రహ్మదేవుడు ఇరువురికీ హితవు చెప్పి, వాళ్లకలహాన్ని మాన్పించాడు. బ్రహ్మదేవునికి కృతజ్ఞతలు తెల్పి, తమ సాధనను సఫలం చేసుకోడానికి ఆశ్రమాలకు బయలుదేరారు–వశిష్ఠవిశ్వామిత్రులు.

ఎంతటివారికైనా కోపగుణం కష్టనష్టాలకు కారణమవుతుంది. ఆ కోపం తమకే కాక పంతాలతో, పట్టుదలతో ఎందరో మహనీయులనుకూడా కష్టపెట్టుంది. కనుక సత్యహరిశ్చంద్రునికథద్వారా - శాంతం, సహనం, సత్యం, ధర్మం అనే సద్గుణాలు ఉత్తమజీవితానికి పట్టుకొమ్మ లని తెలుసుకోవాలి. ఋషులు కోపతాపాలకు గురికాకూడ దనే విషయాన్ని గ్రహించాలి.



శ్రీమాన్ పురిశై శ్రీరంగాచార్యస్వామివారిచే ప్రణీతమైన

# శ్రీలక్ష్మీగద్యమ్ (07)

"శ్రీచరణపరిచరణ" వ్యాఖ్య  వ్యాఖ్యాత - డా॥ ఈ.ఏ.శింగరాచార్యులు

**5. ఉల్లసదూర్ధ్వతరాపర కరశిఖరయుగళశేఖర నిజమంజిమ మదభంజన కుశల వదనవిధుమండల విలోకన విదీర్ణహృదయతా విభ్రమధర దరవిదలిత దలకోమల కమలముకులయుగలనిరర్గల వినిర్గలత్కాంతిసముద్రే !**

ఉల్లసత్ = మిక్కిలి ప్రకాశించుచున్న, ఊర్ధ్వతర = పూర్వము వర్ణింపబడిన హస్తములకంటె మిక్కిలి ఎత్తుగానున్న, అపర = వేఱొక, కరశిఖరయుగళ శేఖర = గొప్ప కరాగ్రముల జంటయందు (హస్తద్వయమందు), నిజ = తనయొక్క, మంజిమ = సొబగుయొక్క, మద = గర్వమును, భంజన = భగ్నము చేయుటలో, కుశల = సమర్థమైన, వదనవిధుమండల = ముఖ మను చంద్రమండలమును, విలోకన = చూచుటచే, విదీర్ణ = పగిలిన, హృదయతా = హృదయమును కల్గియుండుట యొక్క, విభ్రమ ధర = విలాసమును(భ్రమను) దాల్చినవై, దర= కొంచెము, విదలిత = విచ్చిన, దల= రేకులను కల, కోమల= సుకుమారములైన, కమలముకులయుగళ = పద్మములయొక్క మొగ్గల జంటనుండి, నిరర్గల = అడ్డు లేకుండ, వినిర్గలత్ = వెలువడుచున్న, కాంతిసముద్రే = కాంతి సముద్రమును కల్గిన దానా!

పద్మావతి స్వామివలె నాల్గుభుజములను కల్గినది. ముందు సంబోధనలో కుడివైపు, ఎడమవైపు గల రెండు హస్తముల సన్నివేశవైభవము వర్ణింపబడినది. ఇందు పైకి ఎత్తిన సన్నివేశముతో, కొంచెము వికసించిన పద్మములను దాల్చియున్న కుడి ఎడమలలోనున్న వేఱొక హస్తద్వయముయొక్క సొబగు అద్భుతమైన ఉత్ప్రేక్షతో ప్రస్తుతింపబడుచున్నది.

పద్మావతీదేవికి ఇరువైపుల గల వేఱొక కరద్వయము, పూర్వము వర్ణింపబడిన హస్తద్వయముకంటె ఉన్నతముగా నున్నది. అందు ఆమె రెండు కమలముకుళములను(మొగ్గలను) ధరించియున్నవి. అవి కొంచెము విచ్చుకొని యుండుటను చూడగా ఇట్లు తోచుచున్నవి. పద్మావతీదేవి ముఖ మనెడి చంద్ర మండలమును చూచిన ఆ కమలముకుళములహృదయము బాధతో పలిగినది. ఎందులకనగా-కమలముల శోభ చంద్రుని వలన నశించునుకదా! కమలముకుళములు కొలదిగా విచ్చు కొనుటను చూడగా ఆ బాధతో వానిహృదయము పగిలినదా! అనుననట్లున్నది. అట్లు ఈషత్ వికసితములైన ఆ తామరమొగ్గల నుండి అంతు లేనికాంతి పెల్లుబుకుచున్నది.

**"ఒరుమది ముకత్తు మఙ్గైయర్" (చంద్రుని వంటి ముఖమును కల కన్య) (తిరువెళుకూట్రిరుక్కై), "వెణ్మదిపోల్ తిరుముకత్తు అరివై"** (పెరియ తిరుమొళి-2-7-1) (తెల్లని చంద్రునివలె తిరుముఖాన్ని కల ముగ్ధ) అనుచు తిరుమఙ్గైమన్నన్ లక్ష్మీదేవిముఖము చంద్రసదృశ మనిరి.

**6. శ్రీవేంకటశిఖర సహమహిషీనికర కాంతలీలావసర సంగతమునినికర సముదితబహులతర భయలసదపసార కేళిబహుమాన్యే !**

శ్రీవేంకటశిఖర = శ్రీవేంకటాచలశిఖరమందు, సహ మహిషీనికర = మహిషీ సమూహముతో కూడియున్న, కాంత = నాథునియొక్క, లీలా+అవసర = విలాస సమయమునందు, సంగత = వచ్చి కూడుకొనిన, మునినికర = మునిసమూ హమువలన, సముదిత = జనించిన, బహులతర = మిక్కిలి గొప్పదైన, భయ = భయముచే, లసత్ = ప్రకాశించుచున్న, అపసారకేళి = తొలగుట అను క్రీడచే, బహుమాన్యే = గౌర వింపదగినదానా !

ఇందలి వృత్తాంతము ఈ చూర్ణిక ప్రారంభములోని **"శ్రీశైలే కేళికాలే"** ఇత్యాదిశ్లోకమున ప్రస్తుతము.

**7. శ్రీశైలాధీశ రచితదినాధీశ బింబరమాధీశవిషయతపోజన్యే!**

శ్రీశైల+అధీశ=శ్రీవేంకటేశ్వరునిచే, రచిత = చేయబడిన, దినాధీశబింబ= సూర్యబింబము రూపములోనున్న, రమా+ అధీశవిషయ= శ్రీమన్నారాయణుని గూర్చి చేయబడిన, తపస్= తపస్సువలన, జన్యే = అవతరించినదానా!

భగవానుడు శ్రీశుకపురమున సూర్యనారాయణుని ప్రతి ష్ఠించి, ఆ స్వామిని పూజించిన వృత్తాంతము పద్మపురాణాంత ర్గత శ్రీవేంకటాచలమాహాత్మ్యమున **"విష్ణుః సూర్యం ప్రతిష్ఠాయ ప్రాఙ్ముఖం సరసస్తటే, అర్చయన్ పంకజాధీశం కమలావాప్తయే విభుః, తద్ధ్యానసన్నిధౌ తీరే పశ్చిమాభిముఖో విభుః, దీక్షాం వివేశ దేవేశో ద్వాదశాబ్ద మనన్యధీః"** (పద్మసరోవరతీరంలో తూర్పుముఖంగా సూర్యుని విష్ణువు ప్రతిష్ఠించి, లక్ష్మిని తిరిగి పొందడంకోసం ఆ సూర్యుని అర్చిస్తూ, ఆ సూర్యుని సన్నిధిలో పశ్చిమముఖుడై దేవదేవుడైన ఆ విభుడు పన్నెండేండ్లపాటు గొప్ప మనస్సును కలవాడై దీక్షను చేపట్టాడు) అని తెలుపబడినది. సూర్యమండలాంతర్వర్తి శ్రీమన్నారాయణుడే అనుటను **"య ఏషోஉంతరాదిత్యే హిరణ్మయః పురుషో దృశ్యతే", ..... తస్య యథా కప్యాసం పుండరీకమేవ మక్షిణీ"** (ఆదిత్యమండలంలో బంగారు వన్నెను కల ఏ పురుషుడు కన్పిస్తున్నాడో.. అతనికి వికసించిన తామరుల వంటి అందమైన రెండు నేత్రా లున్నాయి) అని ఛాందోగ్యము, **"ధ్యేయ స్సదా సవితృమండలమధ్యవర్తీ నారాయణః"** (సూర్యమండలాంతర్వర్తి అయిన నారాయణుడు ధ్యానింపదగినవాడు) అని పురాణవాఙ్మయము, **"శెయ్యదోర్ ఞాయిత్రై క్కాట్టి చ్చిరీదరన్ మూర్తి యీదెన్నుమ్"** (ఎఱ్ఱని సూర్యుని చూచి "ఇది శ్రీధరునిరూపం" అని పరాంకుశనాయకి పల్కుతున్నది), **"శెఙ్జుదర్ తామరైక్కణ్ శెల్వనుమ్"** (ఎఱ్ఱని ప్రకాశించే తామరలవంటి కన్నులను కల శ్రియఃపతి) ఇత్యాది దివ్యసూరిసూక్తులు, **"తేజః పరం తత్ సవితుర్వరేణ్యం ధామ్నా పరేణాప్రణఖాత్ సువర్ణమ్, త్వాం పుండరీకేక్షణ మామనంతి"** (గొప్ప కాంతితో నఖపర్యంతం హిరణ్యవర్ణాన్ని కల, సూర్యుని యొక్క ఆ గొప్ప తేజస్సును పుండరీకాక్షుడవైన నిన్నుగా విజ్ఞులు పలుకుతున్నారు.) అనెడి ఆచార్యసూక్తులు మొదలైనవి తెల్పుచు న్నవి. గాయత్రీమంత్రము సూర్యమండలమును అధివసించి యున్న శ్రీమన్నారాయణునివైభవమును తెల్పునదియే కదా.

ఇట్లు పన్నెండు సంవత్సరములతపస్సునకు పిమ్మట పద్మసరోవరమునుండి లక్ష్మి పద్మావతీదేవియై అవతరించిన ఘట్టముకూడ అచట వర్ణితము. **"తతస్త్రయోదశే వర్షే కార్తికే శుక్లపక్షకే, పంచమ్యాం శుక్రవారే చ ముహూర్తే మంత్రసంజ్ఞకే, తతః పద్మసరోమధ్యే తేజోరాశిః మహా నభూత్"** (తరువాత, పదమూడవసంవత్సరములో కార్తికమాసం శుక్లపక్షములో పంచమీతిథి శుక్రవారమునాడు మంత్ర మను పేరును కల ముహూర్తములో పద్మసరోవరమునడుమగొప్ప తేజోరాశి ఆవిర్భవించెను.)





**8. శ్రీశైలాసన్న శుకపురీసంపన్న పద్మసరఉత్పన్న పద్మినీకన్యే!**

శ్రీశైల+ఆసన్న = శ్రీవేంకటాద్రికి సమీపముననున్న, శుకపురీ = శుకపురియందు, సంపన్న = ఏర్పడిన, పద్మసర= పద్మసరస్సుయందు, ఉత్పన్న = అవతరించిన, పద్మినీకన్యే = పద్మావతి అను పేరును కల కన్యకా!

శ్రీశుకపురిలో భగవానుడు పద్మసరస్సును నిర్మించుట. అందుండి లక్ష్మీదేవి పద్మావతియై ఆవిర్భవించుటయు పూర్వోదాహృతమైన పద్మపురాణాంతర్గత వేంకటాచలమాహాత్మ్యములో ఈ క్రిందివిధముగా తెలుపబడినది.

**భగవానుడు పద్మసరోవరమును నిర్మించుట :**

**"గోకర్ణమాత్రవిస్తారం చకార రుచిరం సరః, స్మృత్వా వాయుం సమాహూయ తమువాచ మహామనాః, ఇంద్రస్యానుమతే వాయో! రుక్మపద్మాని చాహర, స్థాపయిష్యామి సరసి లక్ష్మీపూజావిధౌ మరుత్!"** (గోకర్ణవిస్తారమైన, అందమైన సరస్సును నిర్మించి, వాయుదేవుని స్మరించి, అతనిని పిలిచిన ఆ మహామనస్కుడు – "ఓ వాయుదేవా! ఇంద్రుని అనుమతితో బంగారుపద్మాలను తీసికొనిరా! లక్ష్మీదేవిపూజకోసం వాటిని సరస్సులో స్థాపిస్తాను"– అని అన్నాడు.)

**పద్మసరోవరమునుండి లక్ష్మీప్రాదుర్భావము :**

**"తత్రస్త్రయోదశే వర్షే కార్తికే శుభపక్షకే, పంచమ్యాం శుక్రవారే చ ముహూర్తే మంత్రసంజ్ఞకే, వవుః పుణ్యాః సుఖాః వాతాః ఉత్తరాషాఢతారకే, ప్రసన్నం సలిలం సర్వం త్రైలోక్యాంతర్గతం ద్విజ!, సుప్రభో భానుమా నాసీత్ ప్రసన్నాని మనాంసి చ, తతః పద్మసరోమధ్యే తేజోరాశిః మహానభూత్, బాలభానుసహస్రాభః సువర్ణసదృశచ్ఛవిః, తన్మధ్యే కాంచనైః పద్మైః నిర్మితో రథ ఉత్తమః, పద్మభిః ధృతపార్శ్వ శ్చ చతుర్భిః మదగంధిభిః, తన్మధ్యే కాంచనే పద్మే సహస్రదలశోభితే, తత్పద్మకర్ణికామధ్యే పద్మాసనసమన్వితా, పద్మహస్తా పద్మనేత్రీ రుక్మపద్మపదద్వయా, సువర్ణపద్మ ముకులద్వయశోభికుచానతా, స్మేరపద్మరజోగంధి సముచ్ఛ్వాసముఖాంబుజా, బింబాధరసుసంబద్ధ స్మితశోభిసుధారసా, సంపల్లక్ష్మీసమావాసవిశాలనయనద్వయా, సర్వరత్నసముత్క్షిప్త జాంబూనద విభూషణా, కర్ణికోత్పలతాటంక మౌక్తికాలకబంధనా, ఆముక్తముక్తామకుటకటకాంగదకంకణా, విద్యుత్పుంజప్రతీకాశవిచిత్రాంబరచిత్రితా, మందస్మితా మనోజ్ఞాంగీ మాధవం వీక్ష్య సాదరమ్, కల్హారమాలామాదాయ యక్షకర్దమలేపనామ్, సుగంధి తులసీదూర్వామధూకకమలోత్పలామ్, స్థితా పద్మరథే దేవీ దేవం వీక్ష్య చతుర్భుజమ్".** (తరువాత, పదమూడవసంవత్సరంలో, కార్తికమాసం శుక్లపక్షం శుక్రవారంలో మంత్ర మనే పేరును కల ముహూర్తంలో ఉత్తరాషాఢానక్షత్రంలో చల్లని సుఖస్పర్శను కల్గించే వాయువులు వీచాయి. ముల్లోకాలలోని జలాలు అన్నీ తేటపడ్డాయి. ఓ బ్రాహ్మణా! సూర్యుడు గొప్పకాంతిని కలవాడయ్యాడు. అందరిమనస్సులు ప్రశాంతమయ్యాయి. అపుడు పద్మసరస్సుమధ్యలో బాలసూర్యునికాంతివంటి కాంతిని కల్గినది, బంగారు వన్నెను కల్గినది అయిన గొప్పతేజోరాశి ఆవిర్భవించింది. దాని మధ్యలో బంగారు పద్మాలతో నిర్మించిన గొప్పరథం కన్పించింది. దానిమధ్యలో వేయిదళాలలో ప్రకాశించే బంగారుపద్మంలోని కర్ణికనడుమ పద్మాసనంలో వేంచేసి ఉన్నది, పద్మాలను చేతిలో కల్గినది, పద్మాలవంటి నేత్రాలను కల్గినది, బంగారు పద్మాలవంటి పాదాలను కల్గినది, బంగారు పద్మాల మొగ్గలవంటి స్తనాలతో కొంచెం నమ్రమైనది, వికసించిన తామరల పుప్పొడి సువాసనవంటి పరిమళాన్ని కల్గిన ఉచ్ఛ్వాసం వెలువడే ముఖపద్మాన్ని కల్గినది, దొండపండువంటి అధరంలో అందంగా వెలిగే చిఱునవ్వుతో శోభిల్లుతున్నది, సంపల్లక్ష్మికి నివాసాలైన, విశాలమైన రెండు నేత్రాలను కల్గినది, అన్నిరత్నాలను పొదిగిన బంగారునగలను కల్గినది, ముత్యాలతో కూడుకొన్న అలకబంధాన్ని కల్గినది, ముత్యాలు పొదిగిన కిరీటాన్ని, అంగదాలను, కంకణాలను కల్గినది, విద్యుత్పుంజంవలె ప్రకాశించే చక్కనిపట్టువస్త్రాలతో ఆశ్చర్యాన్ని కల్గించేది, చిఱునవ్వును కల్గినది, ఆశ్చర్యాన్ని గొలిపే రూపాన్ని కల్గినది అయిన లక్ష్మీదేవి సాదరంగా మాధవుని చూచింది. సుగంధాన్ని కల తులసిని, గరికపోచలను, తామరలను కల్గిన కలువపూల మాలికను గైకొని, పద్మరథంలో ఉన్నదైన ఆ లక్ష్మీదేవి చతుర్భుజుడైన ఆ దేవుని చూచింది.)

***(ఇంకా ఉంది)***

## డయల్ యువర్ ఈ.ఓ. కార్యక్రమం - 03-05-2013
## భక్తుల సమస్యలు - సూచనలు - ఈ.ఓ. గారి ప్రతిస్పందన - కార్యప్రణాళిక

*(ప్రతినెల మొదటిశుక్రవారం తిరుమల తిరుపతి దేవస్థానం కార్యనిర్వహణాధికారితో* ***'డయల్ యువర్ ఈ.ఓ.'*** *కార్యక్రమంద్వారా భక్తులు ఫోనులో మాట్లాడేఅవకాశం ఏర్పాటుచేసింది. వివిధప్రాంతాల భక్తులు కార్యనిర్వహణాధికారిగారికి చేసినసూచనలు, వివరాలు కొన్ని, ఇక్కడ పొందుపరుస్తున్నాం.)*

**క్యూలైన్లలో వెళ్ళేటప్పుడు అత్యవసరద్వారందగ్గర సిబ్బంది ఉండడం లేదు.** *- గోపి, రావులపాలెం.*

**కార్యనిర్వహణాధికారి :** పరిశీలిస్తాం.

**గదుల కేటాయింపు ఆన్‌లైన్‌లో సరిగా డిస్‌ప్లే కావడం లేదు.** *- వేణు, ఒంగోలు.*

**కార్యనిర్వహణాధికారి :** విచారిస్తాం.

**గోవులు వీథులలో నిరాహారంగా సంచరిస్తున్నాయి. తిరుమలతిరుపతిదేవస్థానం గోవులను కాపాడాలి.** *- గాయత్రి, తిరుపతి.*

**కార్యనిర్వహణాధికారి :** మున్సిపల్ కార్పోరేషన్‌వారితో మాట్లాడి తగుచర్యలు తీసుకుంటాం.

**కాలినడక దారిలో లాకర్లను మరిన్ని కల్పించాలి.** - వెంకటస్వామి, ఒంగోలు,

**కార్యనిర్వహణాధికారి :** తప్పకుండా.

**కొండమీద జరిగే కల్యాణోత్సవాల్లో పండితులు పఠించే మంత్రభాగాలు సుస్వరంగా ఉండేటట్లు చూడగలరు.** *- మంజునాథ్, హైదరాబాదు.*

**కార్యనిర్వహణాధికారి :** తప్పకుండా.

**గర్భగుడిలోకి వెళ్ళేటప్పుడు స్త్రీ, పురుషులు సంప్రదాయ దుస్తులు కచ్చితంగా ధరించేటట్లు చర్యలు తీసుకోగలరు.** *- ఎస్. రమాదేవి, కదిరి.*

**కార్యనిర్వహణాధికారి :** తప్పకుండా.

**మహాలఘు దర్శనంలో వాలంటీర్లు (శ్రీవారిసేవకులు) చాలా కర్కశంగా ప్రవర్తిస్తున్నారు.** *- రవీంద్ర, నల్గొండ.*

**కార్యనిర్వహణాధికారి :** అలా జరగకుండా చూస్తాము.

**అలిపిరి చెకింగ్ పాయింట్ వద్ద బస్సులవాళ్ళు యాత్రికుల పట్ల నిర్లక్ష్యంగా ప్రవర్తిస్తున్నారు.** *- శ్రీనివాస్, సింహనగర్.*

**కార్యనిర్వహణాధికారి :** అలా జరగకుండా చూస్తాము.



**తి.తి.దేవస్థానం**

# టోల్ ఫ్రీ నెంబరు
# 18004254141

**శ్రీవారి దర్శనార్థం తిరుమలకు విచ్చేయు భక్తుల సౌకర్యార్థం తిరుమల తిరుపతి దేవస్థానంవారు టోల్ ఫ్రీ నంబరు ఏర్పాటు చేయడం జరిగింది.**

**యాత్రికులు, భక్తులు దేవస్థానానికి సంబంధించిన సూచనలు / ఫిర్యాదులకు మరి ఏ ఇతర సమాచారం కోసమైనా ఈ నంబరును సంప్రదించండి.**

ఈ అవకాశాన్ని అందరూ ఉపయోగించుకోండి!
**వ్యక్తిగత విషయాలు కాకుండ పదిమందికి ఉపయోగపడే ఫిర్యాదులు చేయండి.**
తి.తి.దేవస్థానం యాత్రికులకు మరింత సమర్థవంతంగా సేవలు అందించేందుకు మీ సూచన లివ్వండి.

వార్తాలహరి

# వైభవంగా తిరుపతి శ్రీ గోవిందరాజస్వామివారి వార్షిక బ్రహ్మోత్సవాలు
## (16-05-2013 నుండి 25-05-2013 వరకు)

**వైభవంగా అంకురార్పణం :** తిరుపతిలోని శ్రీ గోవిందరాజస్వామి బ్రహ్మోత్సవాలకు 16-05-2013న వైభవంగా అంకురార్పణం జరిగింది. ఉదయం కోయిల్ఆళ్వార్ తిరుమంజనం, సాయంత్రం యాగశాలలో అంకురార్పణ కార్యక్రమాలు జరిగాయి. ఈ సందర్భంగా సేనాధిపతిఉత్సవం నాలుగుమాడవీథుల్లో నిర్వ హించారు. స్వామివారి బ్రహ్మోత్సవాలు 17-05-2013న ధ్వజా రోహణంతో ప్రారంభమైయాయి. అదేరోజు రాత్రి స్వామివారు పెద్దశేషునిపై ఊరేగుతూ భక్తులను కటాక్షించారు.

**చిన్నశేషునిపై గోవిందరాజు :** శ్రీగోవిందరాజస్వామివార్షిక బ్రహ్మో త్సవాల్లో 2వ రోజు(18-05-2013)న ఉదయం 8.30 గంటల వరకు చిన్నశేషవాహనంపై ఊరేగారు. అదేరోజు రాత్రి హంసవాహనంపై ఊరేగి భక్తకోటికి ముక్తి ప్రసాదించారు.

**సింహం, ముత్యపుపందిరిపై వాహనాలపై స్వామివారు :** మూడవ రోజు(19-05-13)న ఉదయం స్వామివారు సింహవాహనంపై తిరుమాడవీథుల్లో ఊరేగుతూ భక్తులను అనుగ్రహించారు. స్వామివారిని పట్టుపీతాంబర, వజ్రవైదూర్య, స్వర్ణాభరణాలతో సుందరంగా అలంకరించారు. ఉదయం 7.00 గంటలకు సింహ వాహనంపై స్వామివారు కొలువుతీరారు. అదే రోజురాత్రి తిరు వీథుల్లోస్వామివారు ముత్యపుపందిరివాహనంపై ఊరేగుతూ భక్తులను ఆశీర్వదించారు.

**కల్పవృక్ష, సర్వభూపాల వాహనాలపై గోవిందరాజస్వామి :** వార్షిక బ్రహ్మోత్సవాల్లో భాగంగా తిరుపతి గోవిందరాజస్వామి కల్పవృక్ష వాహనంపై ఊరేగుతూ భక్తులకు కనువిందైన దర్శనం ఇచ్చారు. ఈ ఉత్సవాల్లో భాగంగా 20-05-2013న స్వామివారికి వివిధ పూజాదికాలను నివేదించారు. సుప్రభాతసేవతో స్వామివారిని మేల్కొలిపి, ఉత్తర తిరుమంజనం, శుద్ధి, తోమాలసేవ, అర్చనాదు లను నివేదించారు. అనంతరం వాహనమండపంలో స్వామి వారిని సుందరంగా అలంకరించారు. స్వామివారిసేవకోసం కల్పవృక్షవాహనాన్ని వివిధఅలంకరణలతో సిద్ధంచేశారు. కోర్కెలు తీర్చే కల్పవృక్షంపై భక్తులకొంగుబంగారమైన శ్రీగోవింద రాజస్వామి నాలుగుమాడవీథుల్లో ఊరేగారు. భక్తులు స్వామి వారికి అడుగడుగునా హారతులు సమర్పించారు. సాయంకాలం స్వామివారికి ఊంజలసేవ జరిగింది. తర్వాత స్వామి, అమ్మ వార్లను వాహనమండపానికి వేంచేపుగా తీసుకువచ్చి విశేషాలం కరణచేశారు. పట్టువస్త్రాలు, వివిధవర్ణాలపుష్పాలు, సర్వాభరణా లతో అలంకరించారు. సర్వాంగసుందరరూపుడైన స్వామివారు సర్వభూపాలవాహనాన్ని అధిరోహించి మాడవీథుల్లో ఆనంద సంచారం చేశారు.

**గరుడవాహనంపై శ్రీ గోవిందరాజస్వామి విహారం :** తిరుపతి శ్రీ గోవిందరాజస్వామి వార్షిక బ్రహ్మోత్సవాల్లో 5వ రోజు (21.05. 2013)న ఉదయం పల్లకీ ఉత్సవం, రాత్రి గరుడసేవ జరిగింది. అశేషభక్తకోటి ఈ రెండు ఉత్సవాల్లో పాల్గొని తరించారు. 22-05-2013న స్వామివారు ఉదయం హనుమంత వాహనంపై అత్యంత శోభాయమానంగా ఊరేగారు. అదేరోజు రాత్రి స్వామివారు గజవాహనాన్ని అధిరోహించి, భక్తులకు సర్వశుభాలు అందిం చారు. 23-05-2013న స్వామివారు తమ నేత్రద్వయమైన సూర్యచంద్రవాహనాలను అధిరోహించి, అత్యంతవైభవంగా భక్తులకు దర్శనం ఇచ్చారు.

**రథోత్సవం :** శ్రీగోవిందరాజస్వామి వార్షికబ్రహ్మోత్సవాల్లో భాగంగా 24-05-2013న ఉదయం రథోత్సవాన్ని ఘనంగా నిర్వహించారు. అదే రోజురాత్రి స్వామివారు అశ్వవాహనంపై ఊరేగి తనను కొలిచిన భక్తులకు అభయహస్తాన్ని అందించారు.

**ధ్వజావరోహణం:** శ్రీ గోవిందరాజస్వామి వార్షికబ్రహ్మోత్సవాలు ధ్వజావరోహణంతో (25-05-2013)న వేడుకగా సమాప్త మయ్యాయి. ఆలయవేదపండితులు శాస్త్రోక్తంగా ధ్వజావరోహణ కైంకర్యాలు నిర్వహించి, బ్రహ్మోత్సవాలకు ముగింపు పలికారు. వివిధవాహనాలపై స్వామివారు విహరించి, అలసిన సందర్భంగా శాంతికోసం చక్రస్నానాన్ని నిర్వహించారు. అనంతరం పి.ఆర్. తోట వరకు ఉత్సవర్లను వేంచేపుగా తీసుకువచ్చారు. శ్రీగోవింద రాజస్వామి బ్రహ్మోత్సవాల సందర్భంగా తిరుపతినగరంలో తి.తి.దే. ఏర్పాటు చేసినవివిధ సాంస్కృతిక కార్యక్రమాలు భక్తు లను విశేషంగా ఆకర్షించాయి.

ఈ కూపను కత్తరించండి

# మోసపోకండి!

మన రాష్ట్రంలోని కొన్ని నగరాలలో
కొందరు వ్యక్తులు అనధికారికంగా
**సప్తగిరి మాసపత్రికకు**
చందాల రూపంలో
అధిక మొత్తాలు వసూలు చేస్తున్నారని,
తద్వారా శ్రీవారి దర్శనం చేయిస్తా మని
నమ్మిస్తున్నా రని తెలిసింది.
అలాంటివారిమాటలకు మోసపోకండి.
సప్తగిరి చందాకు, శ్రీవారి దర్శనానికి
మరియు
ప్రసాదాలకు ఎటువంటి సంబంధం లేదు.
చందా మీరు నేరుగా
“ప్రధాన సంపాదకుడు, సప్తగిరి,
తి.తి.దేవస్థానం, తిరుపతి”
వారికి పంపించాలి. (లేదా)
తిరుపతిలోని శ్రీనివాసం యాత్రికుల
వసతి సముదాయంలో
కూడా మీచందాలను కట్టవచ్చు.
సప్తగిరికి చందాలు వసూలు చేయుటకు
దేవస్థానం బయటి వ్యక్తులను
ఎవరినీ నియమించలేదు.

**అధిక మొత్తాలు చెల్లించకండి!**
**వారి మాటలకు మోసపోకండి!!**

---

సంప్రదించండి...!
సప్తగిరి చందాల విచారణకు
**0877 - 2264359**
**0877 - 2264543**

---

**తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి**



# సప్తగిరి

(ఆధ్యాత్మిక మాసపత్రిక)

## చందా నమోదు పత్రం

**1.** పేరు మరియు చిరునామా : ____________________
(విడి విడి అక్షరాలలో అర్థమయ్యేలా వ్రాయండి. మరియు పిన్‌కోడ్ తప్పక వ్రాయండి)
____________________
____________________
____________________
____________________
(పిన్‌కోడ్ తప్పని సరి) ☐☐☐☐☐☐

**2.** కావలసిన భాష : ☐ తెలుగు ☐ తమిళం ☐ కన్నడం ☐ హిందీ ☐ ఇంగ్లీషు

**3.** సంవత్సర/జీవిత చందా : ☐ రూ. **60/-** ☐ రూ. **500/-**

**4.** చందా పునరుద్ధరణ :
(అ) చందా నెంబరు :
(ఆ) భాష :

**5.** చెల్లించిన మొత్తం :
డి.డి.నెం. : తేది :
(చెక్కులు స్వీకరించబడవు)

ప్రదేశం :

తేది : చందాదారుని సంతకం

---

☛ సప్తగిరి సంవత్సర చందా రూ.60/-, జీవితచందా రూ.500/-లు; డి.డి. / ఎం.ఓ. ని **‘చీఫ్ ఎడిటర్, ‘సప్తగిరి’, తి.తి.దే., తిరుపతి’** వారి పేరున తీయాలి.

☛ సప్తగిరిచందాదారులుగా చేరదలచుకొన్నవారు/ తమచందాను పునరుద్ధరించుకోదలచినవారు ఈ కూపనులో గానీ లేక తెల్లకాగితంలోగానీ పైన పేర్కొన్నవిధంగా వివరాలు వ్రాసి, పంపవచ్చు. క్రింద ప్రచురించిన చిరునామానుమాత్రమే సంప్రదించండి. **తి.తి.దే. ప్రధాన సంపాదక కార్యాలయం, తిరుపతికి తప్ప-మీరు ఎవరిదగ్గర డబ్బులు కట్టి, మోసపోకండి.**

☛ మనిఆర్డరు పంపేవారు అందులోనే మీయొక్క చందావివరాలు వ్రాసి, ఈ క్రింది చిరునామాకు పంపాలి.

☛ మా చిరునామా “**ప్రధానసంపాదకుడు, సప్తగిరి కార్యాలయం, టి.టి.డి.ప్రెస్ కాంపౌండ్, కె.టి.రోడ్డు, తిరుపతి - 517 507**”.

Edited and published on behalf of T.T. Devasthanams by **Dr. C. Saila Kumar,** M.A.,Ph.D., Chief Editor, T.T.D. and printed at T.T.D. Press by **V. Sambasiva Rao,** D.P.T., Manager, T.T.D. Press, Tirupati - 517 507.



ఇటు గరుడని నీ వెక్కినను
పటపట దిక్కులు బగ్గనఁ బగిలె

ఎగసిన గరుడని యేపున 'ధా' యని
జిగిదొలఁక చబుకు చేసినను
నిగమాంతంబులు నిగమసంఘములు
గగనము జగములు గడగడ వడఁకె

బిరుసుగ గరుడని పేరెము దోలుచు
బెరసి నీవు గోపించినను
సరస నఖిలములు జర్జరితములై
తిరుపున నలుగడ దిరదిరఁ దిరిగె

పల్లించిన నీపసిఁడి గరుడనిని
కెల్లున నీ వెక్కినయపుడు
ఝల్లనె రాక్షస సమితి నీమహిమ
వెల్లి మునుఁగుదురు వేంకటరమణా ॥

(4-327)



దుష్టశిక్షణ, శిష్టరక్షణార్థమై శ్రీనివాసుడు గరుడవాహనంపై అధిరోహించిన ఘట్టాన్ని ఈ పాటలో అన్నమయ్య ఇలా వర్ణించాడు.

"స్వామీ! వేంకటరమణా! నీవు గరుడుణ్ణి ఎక్కగానే పట పట మంటూ వింత వింత శబ్దాలతో దిక్కులన్నీ పగిలాయి. గరుడనిపై స్వారీ చేస్తూ కోపంతో దాన్ని తోలగా లోకాలన్నీ గిరిగిర తిరిగాయి. ప్రస్తుతం బంగారుగరుడునిపై విహరిస్తుండగా రాక్షస సమూహం భీతి చెందింది. ఓ వేంకటరమణా! ఇలా భక్తులు నీ మహిమల్లో మునకలేస్తారు కదా!

## సంస్కృతంలో సప్తగిరి

తిరుమల తిరుపతి దేవస్థానం ఐదుభాషలలో (తెలుగు, తమిళం, కన్నడ, హిందీ, ఇంగ్లీషు) సప్తగిరిమాసపత్రిక వెలువరిస్తున్న విషయం పాఠకులకు విదితమే. అదే విధంగా దేవభాష అయిన సంస్కృతంలో కూడా సప్తగిరి మాసపత్రికను వెలువరించాలని తి.తి.దేవస్థానం సంకల్పించింది. అందులో భాగంగా ఓంప్రథమంగా 'సప్తగిరి'(తెలుగు) పత్రికలో 8 పుటలు, 'సప్తగిరి'(హిందీ) పత్రికలో 8 పుటలు సంస్కృతభాషలలో భక్తిసాహిత్యాన్ని ఈ మాసంనుండి తీసుకువస్తున్నది. త్వరలో పూర్తిస్థాయిలో ప్రతిమాసం వెలువరించబోతున్నది. సంస్కృతభాషా భిమానులు, భక్తులు ఈ పత్రికను కూడా సమాదరిస్తారని ఆకాంక్ష.

## మీ మాట



### మంచి ఉపదేశము

సప్తగిరి ఆధ్యాత్మికమాసపత్రిక అసంఖ్యాక పాఠకులలో నేను ఒకటిని. ఆద్యంతం ఆధ్యాత్మికవిషయాలను అందించే ఈ పత్రికకు సర్వదానమస్సులు. ఈ జూలైలో ఆచార్య జి.దామోదరనాయుడుగారి 'మౌసలపర్వ మార్మికత' వ్యాసంలో శ్రీకృష్ణనిర్యాణవిశేషాలు పూర్వాపరాలను వివరించినందుకు చాలా సంతోషము. విధి, కాలమును ఎవ్వరూ నిరోధించలేరనేది సత్యమే అయినా అవతారపురుషులకు కూడా ఇదే సూత్రం వర్తిస్తుం దని చక్కగా వివరించిన కావ్యరచయిత మానవాళికి మంచి ఉప దేశం కావించారు.

అలాగే 'సేవాధర్మం'లో వ్యాసంలో మురళిగారు సేవ ఎలా చేయాలో, నిస్స్వార్థంతో, ప్రేమతో, అలాగే సేవా అవ కాశాన్ని సేవకుడు అన్వేషించి, అంది పుచ్చుకోవా లనే సందేశం కనపడుతోంది. ఈనాటి మహామనీషులుకూడా సేవ, ప్రేమగూర్చి తమభక్తులకు ఉపదేశించడం– 'అందరినీ ప్రేమించు అందరినీ సేవించు" ఎల్లప్పుడు ఇతరులకు సహాయపడు, ఎన్నడూ ఇతరులను బాధించకు' అనే మహా వాక్యాలు, సదాస్మరణీయం.

ఇలాగే నా జీవిత పర్యంతం (మీ) మనసప్తగిరిద్వారా సద్విషయాలు తెలుసు కొని, ఆచరించుటకు ప్రయత్నిస్తా నని తెల్పుతూ...

**– చామర్తి సత్యనారాయణ, ఉండ్రాజవరం, ప.గో.జిల్లా.**

## నవంబరు నెలలో తి.తి.దే. ఉత్సవ విశేషాలు

**02** – నరకచతుర్దశి
**03** – దీపావళీ
**07** – నాగులచవితి
**10** – శ్రీవారిపుష్పయాగోత్సవం, తిరుమల
**13 నుండి 17 వరకు** –
శ్రీకల్యాణవేంకటేశ్వరస్వామివారి తెప్పోత్సవాలు, నారాయణవనం
**14** – కైశికద్వాదశీ
**17** – శ్రీకరియమాణిక్యస్వామివారి పవిత్రోత్సవం, నగరి
**21** – శ్రీకపిలేశ్వరస్వామివారి లక్షబిల్వార్చన, తిరుపతి
**28 నుండి డిసెంబరు 7 వరకు** –
శ్రీపద్మావతీతాయార్లబ్రహ్మోత్సవాలు, తిరుచానూరు
**30** – శ్రీవేదనారాయణస్వామివారి పవిత్రోత్సవం, నాగులాపురం

# సప్తగిరి

తిరుమల తిరుపతి దేవస్థానముల సచిత్ర మాసపత్రిక

సంపుటి : 44 అక్టోబరు, 2013 సంచిక : 05



ఈ సంచికలోని రచయితల అభిప్రాయాలు వ్యక్తిగతమైనవి. ప్రధానసంపాదకుడుగాని, తిరుమల తిరుపతి దేవస్థానంగాని వాటికి బాధ్యత వహించరు.

24 గంటలు పనిచేసే తిరుమల తిరుపతి దేవస్థానముల కాల్ సెంటర్ ఫోన్ నెం.

**0877 - 2277777, 2233333**

వేంకటాద్రిసమం స్థానం బ్రహ్మాండే నాస్తి కించన,
వేంకటేశసమో దేవో న భూతో న భవిష్యతి.



**అడుగడుగు దండాలవాడు అందాలగోవిందుడు!**

గౌరవ సంపాదకుడు :
ఎం.జి.గోపాల్, ఐ.ఏ.ఎస్.,
కార్యనిర్వహణాధికారి, తి.తి.దేవస్థానములు.

ప్రచురణకర్త-ప్రధాన సంపాదకుడు :
డా॥ సి.శైలకుమార్

సంపాదకుడు : డా॥ కె.రాధారమణ

ఉపసంపాదకుడు : డా॥ కె.రవిచంద్రన్

ముద్రాపకుడు : టి.రవి, (ఇన్‌ఛార్జి మేనేజరు)
పౌరసంబంధాధికారి, తి.తి.దే.

డి.టి.పి. : ప్రధాన సంపాదకులవారి
కార్యాలయం, తి.తి.దే., తిరుపతి

వర్ణచిత్రాల లే-అవుట్ : పి.శివప్రసాద్

*వివరాలకు :*
ప్రధాన సంపాదకుడు,
సప్తగిరి, తి.తి.దేవస్థానములు,
తిరుపతి - 517 507.
ఫోను : 0877-2264543, 2264359

సప్తగిరి మాస పత్రిక

విడి ప్రతి : రూ. 5/-
సం॥ చందా : రూ. 60/-
జీవిత చందా : రూ.500/-
విదేశాలకు సం॥చందా : రూ. 850/-

# సంపాదకీయం

## అల్లదివో హరివాసము!

బ్రహ్మ కడిగినపాదము – బ్రహ్మము తానౌ నీ పాదము... అని ఎన్నడో అన్నమయ్య సన్నుతించిన పాదయుగళిని, 'తెరతీయగరాదా?' అని వాకిట నిలబడి భక్తిపూర్ణహృదయుడై త్యాగయ్య అర్థిస్తే తెర తొలగించిన దివ్యమంగళస్వరూపాన్ని... విజయనగరసామ్రాజ్యాధినేత – అష్టదిగ్గజాలను తనకొలువు కూటమిలో కుదురుగ కూర్చుండబెట్టుకున్న సాహితీసార్వభౌముడు శ్రీకృష్ణదేవరాయలు... ఒకటికి ఏడుసార్లు సందర్శించిన తేజోమయమూర్తిని... త్రిమతాచార్యులు– ఆదిశంకరులు, మధ్వాచార్యులు, రామానుజా చార్యులు, సందర్శించిన పరమాత్మస్వరూపాన్ని సందర్శించడానికై.... వస్తున్నారు! వస్తున్నారు! దైనందినము వస్తున్నారు! తండోపతండాలుగ వస్తున్నారు! 'ఏడుకొండలవాడా! వేంకటరమణా! ఆపదమ్రొక్కులవాడా! అనాథరక్షకా! గోవిందా!' అని గొంతెత్తి నినదిస్తూ వస్తున్నారు. తిరుమలస్వామివారికి రోజురోజుకూ భక్తకోటి తండోపతండాలుగా పెరుగుతూనే ఉంది. శ్రీవేంకటేశ్వరస్వామిమాహాత్మ్యంవల్ల తిరుమలక్షేత్రంలో నిత్య కల్యాణాలు పచ్చతోరణాలు! ఇక్కడ గాలిలో వేదమంత్రనాదాలు! ఇక్కడిమట్టిలో భక్తిభావాలు! రాళ్లలో దేవతారూపాలు! ఈ గాలిని పీల్చి, ఇక్కడితీర్థాన్ని సేవించి.. ఇక్కడిమట్టిపై తిరుగాడి... నామాలయ్యను సందర్శిస్తే జన్మతరిస్తుం దని వస్తున్నారు... వస్తున్నారు... తండోపతండాలుగ వస్తున్నారు!

'న మే భక్తః ప్రణశ్యతి!' అని శ్రీకృష్ణభగవానునిఅభయప్రదానం! శ్రీనివాసుణ్ణి అర్థించినభక్తులకు సకలమనోరథాలు సఫలమౌతాయి. భక్తులు మనసుతోనే అర్థిస్తారు. క్షణకాలం భౌతికనేత్రాలతో, చిరకాలం, మనోనేత్రంతో స్వామిని దర్శిస్తారు. సర్వవ్యాపకుడైన స్వామివారు మనోరథాలు గుర్తించి, వాళ్లను అను గ్రహించి, ఆనందపరవశుల్ని చేస్తూ– ఆనందనిలయు డనేపేరు సార్థకం చేసుకుంటున్నాడు. 'ఆనందమే బ్రహ్మం' అని ఉపనిషత్తు. కనుక ఈ బ్రహ్మోత్సవాలు పరమాత్మసంబంధమైన ఆనందోత్సవాలు. ఆ పర మాత్ముడే శ్రీనివాసుడు! స్వామిని భక్తులు అడిగేవిషయాలు, ఆ స్వామి అనుగ్రహించేవిధానం, స్వీకరించే మొక్కుబళ్ళు ఇవన్నీ... స్వామికీ, భక్తునికీమాత్రమే తెలుస్తాయి. కానీ, అడిగినవారికి లే దనకుండా ఇస్తున్నా డన్నమాటమాత్రం సత్యం. సత్యం, పునఃసత్యం! స్వామిలో జనాకర్షణ, భక్తుల్లో ఆనందాకర్షణ నెలకొన్నాయి. కనుకనే కోరినవారికి కొంగుబంగార మని, క్షణసందర్శనభాగ్యంతో క్షణభంగురమైనజీవితమే తరింపజేసే కలియుగప్రత్యేక్షదైవ మని ప్రతీతి!

ఈ విజయసంవత్సరశరత్కాలబ్రహ్మోత్సవాలు స్వామికీ, భక్తులకూ యావద్విశ్వానికీ ఉత్సవాలే! ఈ ఉత్సవాలు సర్వదేతలకూ ఆనందోత్సవాలు! భక్తులు క్రమశిక్షణతో, సద్భక్తితో, సంప్రదాయపరిరక్షణతో ప్రవర్తిస్తూ, ఈ మహోత్సవాలను విజయవంతం చేయడంలో ఎవరికి వారు తమపాత్ర సమర్థవంతంగా నిర్వహిస్తా రని, నిర్వహించా లని ఆకాంక్ష!

**ఏ తావు నుండైనా నీకొండ చేరేము, ముడుపులు తెచ్చేము కన్నతండ్రీ! నీకై,**
**అజ్ఞానులము మా అపరాధములు సైచి, ఆదుకోవేమయ్యా! ఏడుకొండలవాడా!**

వారిబ్రహ్మోత్సవాలలో గరుడసేవ అతిముఖ్యమైనది.

**పంచమే దివసే........**

**ద్వితీయం రజనౌ యానం వేదవేద్యస్య వై హరేః ।**

**బభూవచ స్వయం సాక్షాత్ ఛందోమూర్తిః ఖగేశ్వరః**

అని భవిష్యోత్తరపురాణం – శ్రీవారిబ్రహ్మోత్సవవాహనక్రమాన్ని – ఐదవరోజురాత్రి వేదవేద్యుడైన శ్రీవారికి ఛందోమూర్తి అయిన గరుత్మంతుని వాహనం ఉంటుంది అని వివరించింది. ఇక్కడ "వేదవేద్య, ఛందోమూర్తి" శబ్దాలు మహత్తరమైనవి.

తొమ్మిదిరోజులపాటు జరిగే బ్రహ్మోత్సవాలలో అయిదవనాటి రాత్రి 9.00 గంటల నుండి 1.00 గంట వరకూ జరిగే గరుడసేవ వైభవం వర్ణనాతీతం. గరుడ వాహనారూఢుడైనస్వామిని సేవిస్తే మోక్షం కరతలామలకం అని భక్తులప్రగాఢ విశ్వాసం.



# గరుడోత్సవం

డా|| కంపల్లెరవిచంద్రన్

**గరుడు వేదస్వరూపుడు**

వాహనక్రమాన్ని పేర్కొంటూ భవిష్యోత్తరపురాణం శ్రీవారికి వేదవేద్యు డనీ, గరుడునికి 'ఛందోమూర్తి' – అనీ విశేషణాలు చెప్పింది. ఇవి ప్రత్యక్షరసత్యాలు.

"వేదాత్మా విహగేశ్వరః" అంటూ యామునాచార్యులవారు చతుఃశ్లోకిలో గరుడుణ్ణి వేదమూర్తిగా వర్ణించి, కీర్తించారు. వేదంకూడా గరుడుణ్ణి వేదాత్మకునిగా కీర్తించింది. "సుపర్ణోఽసి గరుత్మాన్ త్రివృత్తే శిరో గాయత్రం చక్షు స్తోమ ఆత్మా సామతే తనూ ర్వామదేవ్యం బృహద్రథంతరే పక్షా, యజ్ఞాయజ్ఞియం పుచ్ఛం ఛందాగ్ం స్యంగాని ధిష్ణియా శ్శఫా యజూగ్ంషి వామ" ఇత్యాదిగా వివరించి, "తస్య గాయత్రీ జగతీచ పక్షావభవతామ్" ఇత్యాదిగా యజుర్వేదంలో గరుడుడు వేద రూపుడుగా స్తుతింపబడ్డాడు. ఈ భావాన్ని వేదాంతదేశికులవారు 'గరుడపంచాశత్' అనేస్తోత్రంలో "నేత్రం – శిరోనామధేయం... యజూంషి ఛందాం స్యంగాని" అనే శ్లోకాల్లో వివరించారు. శఠకోప సూరికూడా 'వణ్ కొణ్డవుళ్లిన్ శిఱకొలి' అంటూ గరుడునిరెక్కలధ్వని వేదనాదమే అన్నారు. తిరు విరుత్తం అనే శఠకోపసూరికృతమైన ద్రావిడప్రబంధంలోని "అశురమ్ మజ్గకడా వియవే కప్పుఅవైయిన్ పాకన్" అనేసూక్తిని నమ్పిళ్లై అనే ఆచార్యులు వ్యాఖ్యానిస్తూ, "ఆసురదృష్టికళా నబాహ్యా మదృష్టికళ్ మజ్గున్బుడి ప్రవర్తిక్కవ్వల్లు నిత్యాపౌరుషేయత్వ రూపమాన పక్షద్వయావలంబనత్తాలే అప్రతిహతప్రామాణ్యగతియాను శ్రుతిమయమాన పెరియ తిరువడిక్కు" అని వివరించి నందున గరుత్మంతునిరెక్కలు రెండూ– వేదంయొక్కనిత్యత్వ, అపౌరుషేయత్వాలకు ప్రతీక లని తెలుస్తున్నాయన్నారు.

**గరుడునిపై భగవానుడు**

వేదస్వరూపుడైన గరుడుణ్ణి అధిరోహించి, భగవానుడు వేంచేసే కమనీయ రమణీయదృశ్యంలోని అద్భుతమైనసాంకేతికరహస్యాన్ని "శాస్త్రయోనిత్వాత్" అనే బ్రహ్మసూత్రంలో బాదరాయణులవారు భగవంతుణ్ణి మనం తెలుసుకోవా లంటే

మొట్టమొదటి ప్రమాణం శాస్త్రమే అన్నారు. శాస్త్ర మంటే వేదమే! "శాసనాత్ శాస్త్రం" శాసించేది కనుక శాస్త్రం – అని వ్యుత్పత్తి. వేదం భగవంతునిశాసనం. అందువల్ల శాస్త్రా లన్నింటిలో ఉత్తమమయింది వేదం. ఆ వేదశాస్త్రాన్ని సాధనంగా భగవానుని యథార్థతత్త్వాన్ని గ్రహించా లని ఈ సూత్రతాత్పర్యం" అని వివరించారు.

గరుడుడు వేదమయు డని ముందే చెప్పబడింది. కనుక గరుడునిపై భగవానుడు వేంచేయడ మంటే – "ఉత్తమ ప్రమాణమైనవేదంవల్ల ప్రతిపాదింపబడేతత్త్వం నేనే" నని భక్తులకు తెలియజేయడమే! "వేదైశ్చ సర్వై రహమేవ వేద్యః" అని గీతలోనివాక్యం ఇక్కడ ప్రత్యక్షంగా గోచరిస్తుంది. ఇందు వల్ల–ప్రమాణాల్లో వేదం ఎలా ఉత్కృష్టమైందో ప్రమేయతత్త్వాల్లో నేనే ఉత్తమతత్త్వాన్ని" అని స్వామి నిరూపించిన ట్లయింది.

గరుడునిరెండుచేతుల్లో స్వామివారు తనపాదాలను ఉంచి, వేంచేయడంలోనూ విశేషార్థం ఉంది. సంస్కృతవేదంతో సమానమైనదిద్రావిడవేదం. ఈ రెండువేదాల్లో ప్రతిపా దింపబడిన పరమతత్త్వం "భగవంతునిపాదాలే ఆశ్రయింపదగి నవి"– అని తెలియజేయడమే! దీనివల్ల ఉభయవేదాలూ సమాన మైనవే అనీ భావన. ఈ భావనలో 'వేదాత్మా'– 'విహగేశ్వరః'– అన్నపుడు గరుడుడు ఉభయవేదాలకూ ప్రతీక అనీ తెలుస్తుంది. ఇందువల్లనే పెద్దలు గరుడసేవకు ఇంతటిప్రాధాన్యం ఇస్తున్నారు.

విష్ణుచిత్తులవారు ఏఉత్తమప్రమాణాన్ని సాధనంగా చేసుకొని, ఏపరతత్త్వంయొక్కనిర్ణయం పాండ్యరాజసభలో చేశారో – ఆ ప్రమాణం గరుడునిరూపంలో, పరతత్త్వం భగ వానునిరూపంలో ఆవిర్భవించినవృత్తాంతం ఇక్కడ స్మరణీయం. శ్రీవేంకటేశసహస్రనామస్తోత్రంలో "వైనతేయాంగభావితః" అని ఉంది. వినతాసుతుడు– వైనతేయుడు = గరుత్మంతుడు. వాహన మైన గరుత్మంతునిభుజాలపై ఉండి, గౌరవింపబడేవాడు అని అర్థం. అట్లే శ్రీవేంకటేశ్వరఅష్టోత్తరశతనామావళిలో "గరుడ స్కంధవాసినే నమః" అనే నామంకూడా స్వామివారు గరుత్మంతుని భుజస్కంధాలపై అధివసించి ఉంటాడు – అనే మాటను పేర్కొం టుంది.

భగవద్రామానుజులు బ్రహ్మసూత్రాలకు శ్రీభాష్య మనే వ్యాఖ్య వ్రాశారు. ఆ వ్యాఖ్య ప్రారంభంలో రామానుజులవారు "శ్రుతి శిరసి విదీప్తే బ్రహ్మణి శ్రీనివాసే భవతు మమ పరస్మిన్ శేముషీ భక్తిరూపా" – "వేదశిరస్సులైన ఉపనిషత్తుల్లో గొప్పగా ప్రకాశించే పరమాత్మ భగవానుడైన శ్రీనివాసునివిషయంలో నాకు భక్తిరూపమైన జ్ఞానాన్ని అనుగ్రహించుగాక!" అని స్తుతించారు. ఇక్కడ 'వేదశిరస్సులలో ప్రకాశించేపరతత్త్వమైన శ్రీనివాసుడు' అనే మాట విశేషార్థస్ఫోరకం. గరుడుడు వేదస్వరూపుడు కదా! గరుడునిఉన్నతభుజస్కంధాలపై వేంచేసే శ్రీనివాసుణ్ణి మనం ధ్యానిస్తూ, ఆ పరమాత్మవిషయంలో తమకు భక్తి కల్గా లని రామానుజులవారు ప్రార్థించా రనీ స్ఫురిస్తుంది.

భగవానుడు ఉత్సవసమయాల్లో అనేకవాహనాలపై తిరువీథులలో వేంచేయడంలో ప్రధానకారణం – చిన్నా పెద్దా అనే తేడా లేకుండా అందరూ తనను చూచి, తరిస్తా రనే లోకకల్యాణప్రదమైన సన్నివేశం అది. గరుడుణ్ణి భగవానుడు ఎందుకు అధిరోహిస్తాడు? అనే ప్రశ్నకు నమ్బిళ్లై అనే ఆచార్యులు "వినై యుళ్లపోదన్ఱో వాహనాపేక్షైయుళ్లదు? ఎన్నిల్ – ఎనైయి ల్లాద పోదిలుమ్ రాజాక్కళ్ అళకు శెణ్డేఅక్కడవదాయితే యిరుప్పదు. ఓడుమ్ పుళ్లేఱి ఎన్నిక్కడ వదిఱే. పెరియ తిరువడి యుడైయ శెల్లామ్ యాలుమ్, తన్ శెల్లా మైయాలుమ్, నిత్య సూరికళై అనుభవప్పిక్కైక్కాకవుమ్ అళమశెణ్డే అక్కడ వదాయితే యిరుప్పదు. శెళుమ్ వఱనై తానే అత్తి రివాన్ ఎన్నక్కడ వదిఱే" అన్నారు. ఏదైనా పని ఉన్నప్పుడు కానీ, లేకపోతే గరుడుణ్ణి తృప్తిపరచడానికి గానీ, తనతృప్తికోసం గానీ, నిత్యసూరుల్ని సంతోషపెట్టడానికి కానీ, భగవానుడు గరుడవాహనంపై వేంచేస్తా డని ప్రకృతసూక్తివల్ల తెలుస్తుంది.

గరుడుడు 'పెరియ తిరువడి' అని వైష్ణవసంప్రదాయ పరిభాషలో వ్యవహరింపబడుతాడు. అంటే "గొప్పదాసు"దని అర్థం. యామునాచార్యులుకూడా గరుడునిభగవత్కైంకర్య పరత్వాన్ని "దాస స్సఖా వాహన మాసనం ధ్వజో య స్తే వితానం వ్యజనం త్రయీమయః" గరుడుడు స్వామివారికి దాసుడుగా, సఖుడుగా, వాహనంగా, ఆసనంగా, ధ్వజంగా, గొడుగుగా, విసనకర్రగా' ఉంటా డని పేర్కొన్నారు. ఇలా స్వామి

వారిని సేవించేదాసుల్లో గరుడుడు అనేక కైంకర్యాలు నిర్వహిస్తున్నందున 'పెరియ తిరువడి' అనే పేరు ఏర్పడిం దన్నారు – పెద్దలు. పైగా సదా స్వామివారిపాదాలను మోసేభాగ్యం ఈ గరుత్మంతునికే దక్కింది గదా! అందువల్ల 'స్వామివారిని తానే మోయా లనే గరుడునిఆశనూ, ఆశయాన్నీ తీర్చడంకోసం భగవానుడు అతణ్ణి అధిరోహిస్తా డని మరొకకారణం. "ప్రియో హి జ్ఞానినోఽత్యర్థం అహం, స చ మమప్రియః" అనీ, "మమ ప్రాణా హి పాండవాః" అనీ, "అతివార్ ఉయిరానాయ్" అని చెప్పబడేవిధంగా భగవానుడు తనభక్తుల్ని ఎంతో ప్రేమిస్తాడు. అట్టిభక్తుల్లో గరుడుడు ప్రథమగణ్యుడు కావడంవల్ల, అతణ్ణి అధిరోహించి, తృప్తి పొందుతా డనేది మరో కారణం. గరుడునిపై భగవానుడు అధిరోహించినప్పటి సన్నివేశాన్ని దర్శించి, సేవించా మనుకొనే నిత్యసూరుల్ని తృప్తిపరచడంకోసం గరుడారూఢు డవుతా డనేది ఇంకొక కారణం.

ఈ మూడే కాకుండా "పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతామ్।" అని భగవానుడు స్వయంగా తానే పేర్కొన్న అవతారప్రయోజనాలు సిద్ధించడంకోసంకూడా గరుడుణ్ణి అధిరోహిస్తాడు. భట్టనాథసూరి, శఠకోపసూరి, పరకాల సూరి వంటి మహనీయుల్ని అనుగ్రహించడంకోసం స్వామి గరుడ వాహనంపై వేంచేశా డని ఆయా వృత్తాంతాలవల్ల తెలుస్తుంది. కనుక సాధురక్షణకోసంకూడా శ్రీవారు గరుడవాహనారూఢు డవుతారు. ఇక దుష్టశిక్షణకోసం గరుడుణ్ణి అధిరోహించిన సందర్భాలు ఎన్నో! నరకాసురవధ, బాణాసురవధ, వంటి ఉదంతాలు ఇక్కడ జ్ఞప్తి చేసుకోవచ్చు. ఇలా భగవానుడు గరుడవాహనంపై వేంచేయడంలోని కారణా లన్నీ – అర్చామూర్తి శ్రీవేంకటేశ్వరునివిషయంలోకూడా అనుసంధించుకోవాలి. అప్పుడే ఈ గరుడవాహనోత్సవం అన్వర్థం అవుతుంది.

గరుత్మంతుణ్ణి అధిరోహించి, స్వామివారు విజయం చేస్తున్నదృశ్యాన్ని మహర్షులూ, దివ్యమూర్తులూ, పూర్వాచార్యులూ ఎలా వర్ణించారో చూద్దాం!

వామనపురాణంలోని వేంకటేశ్వరమాహాత్మ్యవృత్తాంతంలో తిరుమలకొండపై చాలాకాలం తపస్సు చేసిన శంఖరాజు, అగస్త్యుడు, బ్రహ్మ, రుద్రుడు, శుక్రాచార్యుడు, బృహస్పతి, శ్వేతద్వీపనివాసులైన ముక్తులూ మొదలగువాళ్లకు మొదటగా శ్రీనివాసుడు ప్రత్యక్షమయింది – గరుడుణ్ణి అధిరోహించినసన్నివేశంలోనే! అప్పటి శ్రీవారిసొబగును వ్యాసభగవానులు "దదృశు స్తే సమారూఢం వైనతేయం మహాబలమ్। హరిం హేమాద్రి శిఖరే నీలమేఘమివస్థితమ్" – గరుడుణ్ణి అధిరోహించిన వేంకటేశ్వరుడు మేరుపర్వతంపై నల్లనిమేఘం ఆసీనమైన ట్లుం" దన్నారు– దివ్యసూరుల్లో ముఖ్యులుగా కీర్తింపబడే నమ్మాళ్వార్లు, తిరుమంగై ఆళ్వార్లుకూడా ఇలాగే వర్ణించారు. గోదాదేవికూడా 'పొన్ పురై మేనిక్కరుళ్' అనింది. గరుడునిరెక్కలు బంగారువన్నెతో మెరుస్తూ ఉండటంవల్ల స్వామివర్ణం నల్లనికారుమబ్బు వన్నెను పోలి ఉండటంవల్ల ఈ ఉపమానం ఎంతో మనోహరం! తర్వాతి కాలంలోని పెద్దలుకూడా "సుపర్ణపృష్ఠే ప్రబభౌ శ్యామః పీతాంబరో హరిః । కాంచనస్యగిరేః శృంగే సతటి త్తోయదో యథా" అనే సూక్తులు పూర్వాచార్యుల ఉపమానాన్ని తలపింపజేస్తున్నాయి.

కనుకనే భట్టనాథులు గరుడారూఢుడైన భగవానునికి పల్లాండు పాడేటప్పుడు "వడికాయ్ నిన్ వలైమార్ బినిల్ కాళివెన్ద ముజ్జై యుమ్ పల్లాండు" అంటూ లక్ష్మీదేవికీ మంగళం పాడారు.

గజేంద్రుణ్ణి రక్షించడానికి వస్తున్న శ్రీహరిని వర్ణిస్తూ, భాగవతం "తం తద్వదార్త ముపలభ్య జగన్నివాసః స్తోత్రం నిశమ్య దివిజై స్సహ సంస్తువద్భిః । ఛందోమయేన గరుడేన సముహ్యమానః చక్రాయుధోఽభ్యగమ దాశుయతో గజేంద్రః" (8 స్కం. 3 అధ్యా. 31 శ్లో) అని. ఛందోమయుడైన అంటే వేదరూపుడైన గరుత్మంతునిపై కూర్చుండి వచ్చా డని నుతించింది. విష్ణుదేవుడు పరమాత్మ. ఆపరమాత్మతత్త్వాన్ని నిరూపించేవి వేదాలు. కనుక వేదాలపై స్వామి అధివసించి రావడం – వేదవేద్యుడైన పరమాత్మ సాకారుడై విష్ణువైతే – వేదం గరుడ రూపాన్ని ధరించి – స్వామిని వహించడం ధర్మమే కదా! సాధారణంగా ఆయాదేవతలశక్తులే వాళ్లకు వాహనంగా, ధ్వజ పతాకగా ఉండటం కద్దు. విష్ణువుకు గరుడుడూ, శివునికి వృషభం– ఇలాంటివే! కనుక గరుడుడు వాహనంగానూ ఉంటాడు. ధ్వజంగానూ ఉంటాడు. ధ్వజారోహణం నాడు సకల దేవతల్నీ శ్రీహరి బ్రహ్మోత్సవానికి ఆహ్వానిస్తాడు. ఐదవరోజు

రాత్రి వాహనమై భక్తకోటికి శ్రీహరిదివ్యరూపసందర్శనభాగ్యం కల్గిస్తాడు. ధ్వజావరోహణం నాడు వచ్చిన దేవత లందరికీ కృత జ్ఞతలు తెల్పి, వీడ్కోలు పల్కుతాడు.

వార్షికబ్రహ్మోత్సవాలలో ఈరోజే శ్రీవిల్లి పుత్తూరునుండి వచ్చే తులసిమాలలూ, చెన్నపట్నంనుండీ వచ్చేగొడుగులు శ్రీవారిసేవతో పునీతమవుతాయి.

**గోదాసమర్పిత సువాసితపుష్పమాలాం ।**
**లక్ష్మీసుహారమణిభూషిసహస్రనామ్నామ్ ।**
**మాలాం విధార్య గరుడోపరిసన్నివిష్టః ।**
**శ్రీవేంకటాద్రినిలయో జయతి ప్రసన్నః ॥**

గోదాదేవి సమర్పించిన మాలనూ, లక్ష్మీసహస్ర నామ మాలను దాల్చి, గరుడవాహనంపై ఉత్సవంలో ఉండే శ్రీవారి దర్శనం మహాపుణ్యప్రదం. ఈ దివ్యదర్శనంవల్ల సర్పజ్వరాది బాధలు నశిస్తాయి. ఆధ్యాత్మికజ్ఞానం చేకూర్తుంది. సత్సంతాన వంతులై ప్రజలు వంశాభివృద్ధితో ఆనందిస్తారు. బుద్ధిబలం, భుజబలం రెండూ సిద్ధిస్తాయి. విద్యావినయసంపదలు నెల కొంటాయి.

గరుడునిరెక్కలు జ్ఞానవైరాగ్యాలు. శ్రీవారిపాదాలు సకలాభీష్టప్రదాలు.

గరుడవాహనవిశేషాలు ఆళ్వార్లు సాయించినరీతినీ గమనిద్దాం!

తొండరడిప్పొడి ఆళ్వార్లు సాయించిన తిరుమాలై ప్రబంధంలో -

**నాట్టినాన్‌దెయ్వ మెంగుం నల్లదోర్ అరుళ్ తాన్నాలే**
**కాట్టినాన్ తిరువరంగం ఉయ్ బవర్కు ఉయ్యుం వణ్ణమ్ ।**
**కేట్టిరే నంబిమీర్ గాళ్ గెరుడవాగననుమ్ నిఱ్క**
**శేట్టైదన్ మడియగత్తు శెల్వం పార్త్తిరుక్కిన్సీరే** - (10)

"ఉజ్జీవింపదలచినవాళ్లు శ్రీరంగక్షేత్రంలో వేంచేసి ఉండే సాత్త్వికమూర్తి అయిన గరుడవాహనుణ్ణి అర్చించకుండా, రాజస, తామసదేవతల్ని సేవిస్తున్నారు. మీ రెంత మూర్ఖులు?" అని ఆళ్వార్లు భక్తుల్ని ప్రశ్నిస్తున్నారు. పక్షుల్లో శ్రేష్ఠుడైన గరుడుణ్ణి వాహనంగా గల శ్రీరంగనాథుణ్ణి అర్చించం డని ఉద్బోధిస్తు న్నారు. తొండరడిప్పొడి ఆళ్వారు ఆ శ్రీరంగనాథుణ్ణి 'గరుడవాహ నుడు' అని కీర్తించారు. ఇంత స్పష్టంగా వాహనవిషయంలో, దివ్యప్రబంధంలో ఉదాహరణాలు దొరకవు.

ఇలాగే తిరుమంగై యాళ్వార్లు పెరియ తిరుమొళిలో 'గరుడుణ్ణి ఎక్కి మేఘాలమధ్య స్వామి సాక్షాత్కరించినట్లు' వర్ణించారు.

**మంజుయర్ మామది వీణ్డనీణ్డ మాలిరు ఞ్జోలై మణాళర్వన్దుఎన్**
**నెంజు ళ్ళుమ్ కణ్ణుళ్ళుమ్ నిన్ను నీంగార్ నీర్మలైయార్ కొల్ నినైక్కమాట్టేన్**
**మంజుయర్ పొన్ మలైమేలెళున్ద మాముగిల్ పోన్ఱుళర్వన్దు కాణీర్**
**అంజిరై పుళ్ళు మొన్నేరి వన్దార్ అచ్చో ఒరువర్ అళగియవా**
**(9-2-8).**

తిరుమంగైయాళ్వారు నాయికకు స్వామి దర్శనమి చ్చాడు. మబ్బుల వెనుకనున్న చంద్రునిలా ఎత్తుగా తిరుమాలి రుంజోలై వల్లభుడు వచ్చాడు. నా కన్నులనుండి వీడడు. మరొ కరు తీరునీర్మలై స్వామి. మబ్బుల ఎత్తుకు బంగరుకొండపై లేచిన మేఘంవలె వచ్చారు. అందమైన రెక్కలు గల గరుడుణ్ణి ఎక్కి వచ్చారు. ఆశ్చర్యం. ఒకరికంటే ఒకరు అందంగా ఉన్నారు అని ఆళ్వారునాయిక గరుడునిపైనున్న స్వామిని దర్శించింది.

అథర్వసంహిత - గరుత్మంతుణ్ణి (సుపర్ణుణ్ణి) "సమస్త విషాలనూ హరించడానికి గరుత్మంతుడు సమర్థుడు" (4-2-1) అనీ, "సభావివాదంలో జయాన్ని ఇచ్చేఓషధిని తిన్నవాళ్లల్లో ఈయనకూడా ఒకడు" - అనీ పేర్కొనింది. కనుక గరుడ వాహనం, శ్రీవారిని భక్తితో దర్శించి, సేవించేవాళ్లకు సమస్త విషభయాలూ నశిస్తాయి. విషభావాలు దూరమై, సద్భావాలు సిద్ధిస్తాయి. సభావివాదాల్లో విజయం లభిస్తుంది.

### శాసనాలలో గరుడోత్సవం

కొండమీద జరిగే బ్రహ్మోత్సవాలలో గరుడోత్సవం ప్రసిద్ధం. దీన్నిగూర్చిన ప్రశంస ఉండే శాసనాలు రెండు.

మొదటిది క్రీ.శ. 1530 నాటి తాళ్లపాక తిరుమలై అయ్యంగార్ శాసనం (154). రెండవది క్రీ.శ. 1583 నాటి ఎట్టూరు తిరుమలై కుమార తాతాచార్యర్ శాసనం (155).

మొదటిదానిలో గరుడోత్సవం అయిదవరోజు జరిగేదిగా ఉంది. రెండవదానిలో అలంకరణనియమం ఉంది.

**అన్నమయ్య - గరుడోత్సవం**

"గక్కున నయిదవనాడు గరుడినిమీదను" (13-192) అని అన్నమయ్య పేర్కొన్నాడు.

అన్నమయ్య ఎన్నో సంకీర్తనల్లో గరుడుణ్ణి కీర్తించారు. వాటిల్లో గరుడవాహనప్రశంస ఉండేవి - రెండు.

**వల్లించి గరుడునిపై నీ వుబ్బున నెక్క**
**బంగారుగరుడునిపై నీవు వీథు లేగ** (11-70)

**ఎట్టు నేరిచితివయ్య యిన్నివాహనము లెక్క**
**గట్టిగా నిందుకే హరి కడు మెచ్చేమయ్యా,**
**గరుడుని మీది నెక్కి గమనించితివి నాడు**
**అరుదైన పారిజాతహరణానకు** (16-105)

వాహనారూఢుడైన స్వామివర్ణన గలది మరొకటి.

**వీథివీథి వాఁడే వాఁడే వీడెవీడె చెలఁగీని**
**ఆదిదేవుఁడు శ్రీవేంకటాద్రిమీఁదటను**

**గరుడధ్వజం బదె ఘనవిష్ణురథ మదె**
**సరి శంఖచక్రముల శార్ఙ్గము నదె**
**హరియందు మీఁదటను ఆయిత్తమై యున్నాఁ డదె**
**అరులనెల్ల గెలిచి అమరులఁగాను**

**సారథి యల్లవాఁడె చాలి రణభేరి యదె**
**ఆరయ నిరుమేలా బ్రహ్మాదులు వారే**
**పేరుకొన్న వేదములబిరుదుపద్యము లవె**
**శ్రీరమణుఁడు మెరసె చిక్కులు వాపఁగను**

**ఆటలుఁ బాటలు నవె అచ్చరలేమలు వారె**
**చాటువ నలమేల్మంగ సంగడి నదె**
**యీటులేని శ్రీవేంకటేశుఁ డేఁగీ నల్లవాఁడె**
**కోటానఁగోటిదాసులకోరిక లీడేర్చను** (3-274)

ఈ పాటనుబట్టి గరుడోత్సవసందర్భంలో వేదపఠనం, స్త్రీల ఆటలు, పాట లుండే వని తెలుస్తూంది.

**పొందైన హితులు నాప్తులు రసికులును గవులు**
**నందమగు నునుమాటలాడ నేర్చినఘనులు**
**చిందులకు నాడేటి సీమంతినీమణులు**
**చెలఁగి యిరుగడఁ గొలువఁగాను** (12-228)

**అంగరంగవైభవాల సమరకామినులాడ**
**నింగి నుండి దేవతలు నిన్నుఁ జూడఁగా**
**సంగీతతాళవాద్యచతురతలు మెరయ**
**సంగడి దేలేటి మీకు సాసముఖా** (7-237)

శ్రీవేంకటేశ్వరుడు వైభవంగా తిరువీథుల్లో ఊరేగుతున్నప్పుడు ఆయనకుగల కళాభిమానాన్ని సూచ్యం చేయడం జరిగిం దిక్కడ. ఆయనను కొలిచే పరివారంలో రసికులు, కవులు, నర్తకులు, సంగీతతాళవాద్యకారులు ఉన్నారు. దీనిని బట్టి ప్రధానకళలైన సంగీతసాహిత్యనృత్యాలపట్ల నాయకునికిగల అనురక్తి విశదమవుతుంది.

కళలు దైవదత్తాలు. వరప్రసాదాలైన ఈ అపురూప విద్యల్ని ఆ విశ్వేశ్వరుని వినుతించడానికే వినియోగించి ధన్యతను చెందడం ఇహపరశ్రేయోదాయకం. స్వామివారియొక్క ధీరలలితునిలక్షణాల్లో ఒకటైనకళాభిలాష ఈ ఉత్సవాల్లో మనకు గోచరిస్తుంది.

మరో సంకీర్తన -

**ఇటు గరుడుని నీ వెక్కినను**
**పటపట దిక్కులు బగ్గనఁ బగిలె**

**ఎగసిన గరుడని యేపున 'ధా' యని**
**జిగిదొలఁక చబుకుచేసినను**

**నిగమాంతంబులు నిగమసంఘములు**
**గగనము జగములు గడగడవడఁకె**

**బిరుసుగ గరుడని పేరెము దోలుచు**
**బెరసి నీవు గోపించినను**
**సరుస నఖిలములు జర్జరితములై**
**తిరుపున నలుగడ దిరదరఁదిరిగె**

**పల్లించిన నీపసిఁడి గరుడనిని**
**కెల్లున నీ వెక్కినయపుడు**
**ఝల్లనె రాక్షససమితి నీ మహిమ**
**వెల్లి మునుఁగుదురు వేంకటరమణా!** (4-327)

ఇలా అన్నమయ్య గరుడారూఢుడైన శ్రీవారిని నుతించారు.

గరుత్మంతుణ్ణిగూర్చి సంస్కృతాంధ్రసాహిత్యాల్లో ఎన్నో ప్రశంసలూ, వర్ణనలూ ఉన్నాయి.

సంస్కృతంలో గరుడపంచాశత్, గరుడగద్యం మొదలగు నవి ప్రసిద్ధాలు.

శ్రీ వేదాంతాచార్యులవారు గరుడదండకం వ్రాశారు.

**నమః పన్నగనద్ధాయ వైకుంఠవశవర్తినే ।**
**శ్రుతిసింధుసుధోత్పాదమందరాయ గరుత్మతే ।**

**గరుడ మఖిలవేదనీడాధిరూఢం ద్విషత్పీడనోత్కంఠితా కుంఠ వైకుంఠపీఠీకృతస్కంధ మీడే! స్వనీడా గతిప్రీతరుద్రాను కీర్తిస్తనాభోగగాఢోపగూఢస్ఫురత్కంటకవ్రాతవేదవ్యథావేపమా నద్విజిహ్వాధిపాకల్పవిష్ఫార్య మాణస్ఫటావాటికారత్నరోచిశ్ఛటా రాజినీరాజితం కాంతికల్లోలనీరాజితమ్ ।** ఇలా సాగింది రచన.

ఆగమాలలో ధ్వజారోహణసమయంలో గరుడలగ్నాష్ట కాలూ, గరుడచూర్ణిక, గరుడగద్యా లున్నాయి.

గరుడలగ్నాష్టకాలలో

**సువర్ణవర్ణో భుజగోపవీతీ నాగాంతకో విష్ణురథ స్సుపర్ణః।**
**ప్రహ్లాదవ ద్భాగవతాగ్రగణ్యః ఖగేశ్వరో న శ్శుభ మాతనోతు॥**

ఇలా ఉండే శ్లోకాలద్వారా గరుడుడు సర్పయజ్ఞోపవీతం కలవా డనీ, విష్ణురథమైనవా డనీ, ప్రహ్లాదునివలె భాగవతాగ్ర గణ్యు డనీ, అనన్యసాధారణవిక్రమాఢ్యు డనీ, లక్ష్మీకటాక్షాంచిత పుణ్యమూర్తి అనీ, హరిప్రియు డనీ, వైష్ణవధర్మవేది అనీ, ధర్మప్రసంగప్రథితాత్మశౌర్యు డనీ, జగద్ధితానంతగుణాంబురాశి అనీ, కృపాళు డనీ, సత్యవ్రతు డనీ, స్వేచ్ఛారూపు డనీ, శ్రుతిస్మృతిజ్ఞానగురు వనీ - పేర్కొనడం జరిగింది.

**తత్పురుషాయ విద్మహే । సువర్ణపక్షాయ ధీమహి**
**తన్నో గరుడః ప్రచోదయాత్** - అని గరుడగాయత్రి.

తెలుగులో నన్నయభారతంలో - గరుత్మంతునిజన్మ వృత్తాంతం వివరిస్తూ -

**ఉ. ఆతతపక్షమారుత రయప్రవికంపితఘూర్ణితాచల**
**వ్రాతమహార్ణవుండు, బలవన్నిజదేహసముజ్జ్వలప్రభా**
**ధూతపతంగతేజుఁ డుదితుం డయి తార్క్ష్యుఁడు తల్లికిన్ మనః**
**ప్రీతి యొనర్చుచున్ నెగసె భీమజవంబున నభ్రవీథికిన్.**
(ఆది. 2-37)

**క. దారుణకల్పాంతమరుత్ ప్రేరిత హవ్యవహశిఖలపె ల్లిది యని బృం**
**దారకమునిబృందస్తుతి బోరనఁ దా నగ్నిసూక్తములతో నెసఁగెన్ ॥**
(ఆది. 2-38)

**క. హరికులిశక్షతి యెఱుఁగని గురుతరపక్షములతోడి కులగిరివోలెన్**
**గరుడండు గగనగతి నురుతరజవమున నరుగుదెంచి తల్లికి మ్రొక్కెన్**
(ఆది. 2-40) అన్నాడు.

గరుడుడు మహావేగుడు. మహాబలుడు. సూర్యమండలం దాకా ఎగిరిన బలశాలి. ఇంద్రాదుల్ని సరకుగొనక - అందర్నీ జయించి, అమృతభాండం తెచ్చి, తల్లి దాస్యాన్ని పోగొట్టిన మాతృభక్తిపరాయణుడు. చేజిక్కిన అమృతాన్ని తిరస్కరించి, జాత్యుచితమైన సర్పాలనే ఆహారంగా వరంపొందిన నిస్స్వార్థవ్యక్తి. ఈ నిస్స్వార్థత, మహాబలం, మహావేగం, ధైర్యస్థైర్యాలూ, జ్ఞానవిజ్ఞానాలూ గమనించినమహావిష్ణువు గరుడుణ్ణి తనకు వాహనంగా స్వీకరించాడు.

**బ్రహ్మణ్యు డగు కశ్యపబ్రహ్మావరమున వినతకు పుట్టిన అనఘుమూర్తి,**
**వాలఖిల్యుల దయ వరపక్షికులమున కింద్రుఁడై పరగిన యిద్ధతేజు**
**డుదధిలో నున్న యత్యుగ్రనిషాదుల నారంగ మ్రింగిన ఘోరవీరు**
**డిభకచ్ఛపముల రోహిణిశాఖతో నెత్తికొని దివిఁ బరచిన యనిలవేగి**
**వీఁగి తన తల్లిదాస్యంబు నీఁగఁ బూని తడయ కమృతంబు గొని పోవఁ గడగివచ్చె,**
**కామరూపసంపన్నుండు, కామగమనుఁ డతడు నీకు నసాధ్యుండు శతమఖుండ**

- అనిగరుడునిమహాబలపరాక్రమవిశేషాలనూ, సద్గుణగరిమనూ వివరించి, అతణ్ణి జయించలే వన్నాడు.

ఇంద్రుడు దేవేంద్రుడు కాగా, రెండవఇంద్రునిలాగా 'పక్షీంద్రు' డయ్యాడు – గరుడుడు.

సౌపర్ణోపాఖ్యానం విన్నవాళ్లకు అధికసంపదలు కల్గుతాయి. పాపక్షయం అవుతుంది. సర్పబాధ లుండవు. రాక్షసుల వలనిభయం తొలగుతుంది.

గరుత్మంతుణ్ణిగూర్చి ఉత్తరహరివంశంలో నాచన సోముడు –

**హరిదంతద్విపదంతకుంతశిఖరాహంకారనిశ్చింతని**
**ర్జరరాజార్జితవజ్రజర్జరితవిచ్ఛాయైకరోమచ్ఛవి**
**స్థిరవిద్యుత్ ప్రతిపక్షవక్షుడయి వచ్చెన్ వైనతేయుండు భా**
**స్కరబింబప్రతిబింబ మంబరము ప్రింగం బాఱు చందంబునన్**
**– (2 – 105)**

అని ప్రశంసించాడు.

**పారిజాతాపహరణంలో**

**వజ్రంబునకు నీఁకవైచిన బలశాలి**
**గజకచ్ఛపాశనఘాతుకుండు**
**జననిదాస్యంబు నీఁగిన కులశ్రేష్ఠుండు**
**దుర్లభామృతపశ్యతోహరుండు**
**కమలాప్తసారథి గారాబుఁదమ్ముండు**
**కశ్యపకృతపుణ్యకర్మఫలము**
**సకలశకుంతౌఘసామ్రాజ్యధౌరేయుఁ**
**దహిమృగయావ్యసనాకులుండు**

**తే. మింటి పాళెంబు లేర్చు ముక్కంటి తూపు**
**గతి నిపాతితరోహిణస్కంధుఁ, డనిల**
**మానసాతీత వేగ సంపద్ఘనుండు**
**తార్క్ష్యు డేతెంచె దానవధ్వంసికడకు**

(2–272) అన్నాడు – ముక్కు తిమ్మన. ఇందులో గరుడుణ్ణి "కశ్యపకృతపుణ్యకర్మఫల" మన్నమాట చాలా గొప్పది. కశ్యపమహర్షియొక్క తపఃపుణ్యఫలంగా జనించినవాడు గనుకనే అంతటి మహావిష్ణువుకు వాహన మయ్యాడు.

ఆముక్తమాల్యదలో రాయలువారు ఇష్టదేవతాస్తుతి చేస్తూ, వైష్ణవసంప్రదాయానుసారం – గరుడుణ్ణి ఇలా స్తుతించారు.

**ఖనటత్పయోబ్ధివీక్ష్యరసాతలాన్యోన్య**
**పిండీకృతాంగభీతాండజములు,**
**ధృతకువలయార్థఖండితసమిల్లవరూప**
**చరణాంతికభ్రమత్తరువరములు,**
**ఘనగుహాఘటితఝాంకరణలోకైకద్వి**
**దుందుభీకృత మేరుమందరములు,**
**చటులఝంపాతరస్వనగరీవిపరీత**
**పాతితాశాకోణపరిబృఢములు**

**ప్రబలతరబాడబీకృతేరమ్మదములు,**
**భాస్వరేరమ్మదీకృతబాడబములు,**
**పతగసమ్రాట్పతత్రప్రభంజనములు,**
**వృజినతూలౌఘములఁ దూల విసరుగాత!** (1–3) – అని

గరుత్మంతుని రెక్కలగాలిదెబ్బకు సముద్రంలోనినీళ్లన్నీ ఎగసి, మింట అల్లకల్లోలంగా దుముకుతున్నాయి. అందువల్ల సముద్రంలో నీళ్లు లేకపోవడంతో పాతాళం కన్పించింది. గరుత్మంతునికి భయపడి పాములు ఒకదాని కొకటి చుట్టుకొని ముడుగుతూ కన్పిస్తున్నాయి. గరుడునిరెక్కలగాలికి మహావృక్షాలు పెల్లగిల్లి అతనికాళ్లవద్ద సుళ్లు తిరుగుతూ – ఆయన గూడుకట్టుకోవడానికై చెట్లనుండి విరుచుకొని, కాళ్లలో ఇరికించుకొని పోతున్న చిన్న చిన్న చిరుగులా అన్న ట్లున్నాయి. మేరుగుహలో, మందరగుహలో రెక్కలగాలిచే ఝాంకృతిశబ్దం ఒక్కుమ్మడిగానే అయింది. ఆ మ్రోతవల్ల ఆ రెండుపర్వతాలూ ప్రపంచానికంతా ఒక్కటే జంటభేరిగా కన్పిస్తున్నాయి. ఆయన మహావేగంతో దాటుతూ ఉంటే జనించినగాలిబలానికి అష్టదిక్పాలకులుకూడా తమతమపట్టణాలనుండి విపరీతదిక్పట్టణాలలో పడిపోయారు. ఈయనరెక్కలగాలిదెబ్బకు మేఘాల్లోనిజ్యోతి సముద్రం అడుగున బడబానలస్థానంలో పడింది. అక్కడి బడబానలం మేఘాల్లో జ్యోతిస్సుగా పడింది. ఇలాంటి గరుడదేవునిరెక్కలయొక్క గాలులు జీవుల పాపా లనేదూదిపుంజాలను చెదరి పోగొట్టేటుగా వీచుగాక!

రాయలు గరుడునిరెక్కలయొక్కగాలివేగం, బలం – విశ్వాన్నంతా చెల్లాచెదరు చేస్తుంది కనుక జీవుల పాపాలనుకూడా తూలగొట్టుం దని విశ్వసిస్తూ – గరుడుణ్ణి పాపభంజనుణ్ణిగా భావించాడు. గరుడుడే సకలపాపభంజనుడు కాగా – ఇక అతనిపై అధిరోహించి ఉండే శ్రీహరి ఇంకెంతటి మహామహుడో, మహాబలుడో, మహోపకారియో ఎవరు చెప్పగలరు?

భాస్కరరామాయణంలో గరుడవర్ణన –

**కుప్పించు నురవడిఁ గుంభిని వడిఁ గ్రుంకి**
**సర్పాధిపతితలల్ సదియనదుమ**
**నెగయు నూకున మీది కెత్తిపారిన తరు**
**శ్రేణులు చుక్కలఁ జెదరనదువ**
**నెఱకలు జాడించు నేపునఁ గడలెత్తి,**
**యేడువారాసులు నెడము లొత్త**
**పరచు బల్వడి నక్షపంక్తులు నుడిగొంచు**
**వలయంపుఁగొండ యవ్వలికిఁదూల,**

**పర్వతములు వడక బ్రహ్మాండకోటర**
**మద్రువ గగనవీథి నరుగుదెంచె**
**రఘుకులేంద్రబంధవిఘటనత్వరితాంత**
**రంగుఁ డగుచు నవ్విహంగవిభుఁడు**

– అని యుద్ధకాండలో నాగాస్త్రంచే బంధితులైన రామలక్ష్మణుల్ని విడిపించడానికి వచ్చినగరుడుణ్ణి కడురమణీయంగా వర్ణించాడు.

రఘువంశానికి గరుత్మంతుడు చేసినమహోపకారం – ఇది.

ఇంకా భైరవకవి రచించిన శ్రీరంగమాహాత్మ్యం, తెనాలి అన్నయకవి రచించిన సుదక్షిణాపరిణయం, దేవులపల్లి సుబ్బరాయకవి రచించినయతిరాజవిజయం మొదలైనకావ్యాల్లో గరుడునిప్రశంస మహోన్నతంగా ఉంది.

ముఖ్యంగా జన్నాద వేంకటరంగాచార్యులు రచించిన 'రుక్మిణీకల్యాణం' లో గరుడస్తుతి ప్రశస్తంగా ఉంది.

**శా. దాసుండై సఖుఁడై ధ్వజం బయి సము ద్వాహమై యాసనం**
**బై సద్వీజనమై వితానమయి య య్యబ్జాలయాకాంతు నుల్లాసం బొప్ప భజింపుచుండినమహా త్రయ్యాత్మకు న్విద్విష**
**త్త్రాసాపాదిబలున్ బ్రశాంతుని గరుత్మంతు న్దలంతు న్మదిన్**
(1–4)

ఇంతటి మహాత్ముడు–జగన్నాయకుడైన శ్రీవేంకటేశ్వరునిపాదపద్మాలను– తనహస్తపద్మాలపై ఉంచుకొని, శ్రీవారి వాహనమై ఊరేగేదివ్యదృశ్యాన్ని భక్తిప్రపత్తుల్తో దర్శించేవాళ్ల నిజంగా ధన్యులు. కాలసర్పయోగంవల్ల కల్గేవంధ్యాదోషం, ఆలస్యవివాహం, సంతాననష్టం మొదలైనకష్టాలన్నీ తొలగి, సుఖశాంతులతో వర్ధిల్లుతారు.

తిరుమల ఆలయంలో గరుత్మంతుడు నమస్కారముద్రతో శ్రీవారికి ఎదురుగా నిల్చుండి, శ్రీవారిని దర్శిస్తూ, నమస్కరిస్తూ, భక్తుల్నీ గమనిస్తూ, భగవద్భాగవతదాస్యభక్తిని నిరూపించుకొంటున్నాడు.

గరుడనిసేవాదృక్పథం, మాతృభక్తి, ప్రభుభక్తిపరాయణత, సత్యవాఙ్నియతి, నిస్స్వార్థత, నిష్కళంకత, ఉపకారగుణం, మొదలగు ఉత్తమగుణాలు సమాజానికి స్ఫూర్తిదాయకాలు. ఇందుకే గరుడసేవకు ఎనలేనిప్రచారం, ప్రభావం, విశిష్టత ఏర్పడ్డాయి. రెక్కలున్న వన్నీ చుక్కలలోకాలకు ఎగురుతాయి. హృదయానికి భక్తి అనే రెక్కలు మొలిస్తే మానవుడు మాధవసన్నిధిని చేరుకుంటాడు. గరుత్మంతుడు – భగవంతుణ్ణి భక్తుల దరికి చేర్చే పుణ్యకార్యకర్త. ఈ అభ్రగపతికి జగత్పతితో విడదీయరాని సంబంధముంది.

పశుపక్ష్యాదులమీద, జంతుజాలం మీద మానవులకు జీవకారుణ్య భావాన్ని పెంపొందించడంకోసమే మన ఋషులు ఆయాదేవతలకు ఆయావాహనాలను జతపరచారు – లేకుంటే సర్వవ్యాపకుడికి ఈ వాహనా లెందుకు? లోకసంచారాలెందుకు?

**మ. జవసత్త్వంబుల కిక్క, మాతృపరదాస్యధ్వంససామర్థ్య సింధువు, నీదోద్భవ వంశరాజు, మహితద్యోమార్గసంచారు దాపవనాంధోఽరి విరాట్స్వరూపు గరుడాళ్వార్ మూపునన్ నిల్చి మా భవదుఃఖంబు లడంచవయ్య, మలయప్పా! నిన్ను కీర్తించెదన్**

# సందేహాలు? సమాధానాలు!!

విద్వాన్, డా॥ పమిడికాల్వ చెంచుసుబ్బయ్య

**శ్రీవేంకటేశసుప్రభాతంలో మొదటిశ్లోకం "కౌసల్యాసుప్రజా రామ...... కర్తవ్యం దైవ మాహ్నికమ్" అన్నారే - ఎందుకో తెల్ప గలరు.** *-సూరే పుల్లాజీరావు(మురళీనగర్), విశాఖపట్నం.*

☛ శ్రీవేంకటేశసుప్రభాతరచయిత ప్రతివాదిభయంకర అణ్ణన్. వీరిఅసలుపేరు హస్తిగిరినాథన్. వీరు శ్రీమణవాళమహా మునులకు శిష్యులు. గురుశిష్యులు ఒకమారు తిరుమల శ్రీవారిని సేవించడానికై వచ్చినపుడు గురువు–శ్రీమణవాళమహా మునులవారు శిష్యుణ్ణి చూచి, 'శ్రీస్వామిపై ఏదైనా సుప్రభాత రచన చేయరాదా?' అన్నారట! వెంటనే శ్రీమాన్ అణ్ణన్‌గారు నేడు మనం అనుసంధానం చేస్తున్న 'శ్రీవేంకటేశసుప్రభాతం, స్తోత్రం, ప్రపత్తి, మంగళాశాసనం'– అనే నాల్గింటినీ ఆశువుగా చెప్పారట! ఈ స్తోత్రంలో అనుసంధించినకొన్నిశ్లోకాలు ఇతిహాస పురాణాలనుండి గైకొన్నవీ ఉన్నాయి. సుప్రభాతం మానవులు భగవంతుణ్ణి కీర్తించాల్సినధర్మాన్ని వివరిస్తుంది. ధర్మం–నిత్య కర్మానుష్ఠానరూపమైంది.

ఈ సుప్రభాతసంప్రదాయానికి నాంది వాల్మీకిరామా యణం–బాలకాండలో జరిగింది. శ్రీరామలక్ష్మణులు విశ్వా మిత్రునివెంట ఆశ్రమం చేరి, ఆ రాత్రి విశ్వామిత్రుడు ఏర్పరచిన పచ్చిగడ్డిపడకపై శయినించి, హాయిగా నిద్రించారు. అరుణో దయం అవుతూంది. విశ్వామిత్రుడు నిద్రలేచాడు. కానీ, రామ లక్ష్మణు లింకా నిద్రలేవలేదు. కర్తవ్యనిష్ఠాపరుడు కనుక విశ్వా మిత్రుడు మొదట శ్రీరాముణ్ణి సమీపించి, "కౌసల్యాసుప్రజా! రామ! పూర్వాసంధ్యా ప్రవర్తతే। ఉత్తిష్ఠ నరశార్దూల! కర్తవ్యం దైవ మాహ్నికమ్" – "ఓ కౌసల్యానందనా! రామా! తొలిసంజ అవుతూంది. నరోత్తమా! దేవతాకార్యం–సంధ్యావందనాదికం నిర్వర్తించాలికదా! నిద్ర లెమ్ము!"– అంటూ శ్రీరామునికి మేల్కొల్పుపల్కాడు. (ఈశ్లోకం–వాల్మీకిరామాయణం – బాల కాండ – 23వ సర్గలో – 2వది)

'రామ' శబ్దం పరమాత్మవాచకం. పరమాత్ముడే రామ, కృష్ణ, వేంకటేశ్వరాదిఅవతారాలు ధరించాడు. సుప్రభాత రచ యిత ప్రాచీనమహర్షిసంప్రదాయం తెలిసిన గొప్పసంస్కార వంతుడు కనుక – మొట్టమొదట ఋషిసంప్రదాయాన్ని స్వీక రించి, శ్రీవారిని కీర్తించడం సముచిత మని భావించి, శ్రీమద్రా మాయణంలోని ఈశ్లోకాన్ని శిరోభూషణంగా ఇక్కడ నిల్పాడు. రాముడు సాక్షాన్నారాయణుడు. అతడే కౌసల్యానందనుడుగా, శ్రీవేంకటేశ్వరుడుగా అవతరించాడు. ఈ దృష్టితో సుప్రభాతకర్త– మహర్షి వ్రాసినమంత్రంవంటి ఈ మేల్కొల్పుశ్లోకాన్ని స్వీకరిం చాడు. ఇలా భగవంతుణ్ణి మేల్కొల్పడం అనేపద్ధతి త్రేతా యుగంలో శ్రీరామావతారంనుండీ వస్తూంది. ఈ పద్ధతికి మార్గదర్శి విశ్వామిత్రుడు. దేనికైనా మహర్షులు అనుసరించిన సంప్రదాయాన్ని – తరువాతికాలంవారు భక్తిశ్రద్ధలతో గైకొని, అనుసరించాలి. అప్పుడే మనకు సత్ఫలాలు సిద్ధిస్తాయి.

శ్రీవారిఆలయంలో శ్రీరామ, శ్రీకృష్ణాదుల ఉత్సవ మూర్తులు ఉండడం– ఆయా విశేషదినాల్లో ఈ మూర్తులు ఉత్సవానికి రావడం – శ్రీవారి శ్రీరామశ్రీకృష్ణత్వ అభేదస్థితులకు దృష్టాంతం! శ్రీవారు బ్రహ్మోత్సవాలలో శ్రీరామశ్రీకృష్ణ అలం కారాలతో దర్శన మిస్తుండం గమనించవచ్చు. శ్రీరామునికీ, శ్రీవేంకటేశ్వరునికీ భేదం లే దని గ్రహించాలి. కాలాలు మారినా, రూపాలు మారినా, తత్త్వంమాత్రం ఒక్కటే! 'ఏకం సత్ విప్రా బహుధా వదంతి' అనే సిద్ధాంతాన్ని అణ్ణన్‌గారు – రామాయణశ్లోకాన్ని – శ్రీవేంకటేశసుప్రభాతంలో మొదటిదిగా స్వీకరించడంద్వారా–మనకు గుర్తుచేశారు. సమత్వమేకదా యోగం!!

భగవంతుణ్ణి మేల్కొల్పేనెపంతో – మనలోని జ్ఞానశక్తిని మేల్కొల్పి, ధర్మకార్యనిర్వహణకు సంసిద్ధులు కావడం జరుగు తుంది.

శ్రీమాన్‌అణ్ణన్‌గారు కీర్తించిన'సుప్రభాతం' లేకముందు శ్రీవారిఆలయంలో 'తొండరడిప్పొడియాళ్వార్' (విప్రనారాయ ణులు) రచించిన 'ప్రాబోధికస్తుతి'యే సుప్రభాతంగా గానం చేసేవారట! ఈ సుప్రభాతం వచ్చాక – 'ధనుర్మాసం'లో తప్ప– తక్కినరోజులలో ఈ సుప్రభాతాన్నే గానం చేస్తున్నారు. 'ధను ర్మాసం'లో శ్రీవారిసన్నిధిలో శ్రీవారిని శ్రీకృష్ణునిగా భావించి, 'తిరుప్పావై' గానం చేస్తారు.

**శ్రీవారిని ఏయే పువ్వులతో పూజించవచ్చు? ఏయే పువ్వులతో పూజించకూడదు? వివరంగా తెలుపగలరు?**

*– వంకాయల పెంటరాజు, చినరాజుపేట, అనకాపల్లి.*

☛ భగవంతుణ్ణి పూజించే పవిత్రవస్తువుల్లో పూలు ప్రముఖ స్థానాన్ని వహిస్తాయి. సుకుమారం, సుగంధం, మంచిరంగు అనే త్రిగుణత్రివేణీసంగం పువ్వు. ఇలాంటివస్తువు సృష్టిలో అపురూపమైంది. ప్రకృతి ప్రసాదించినపుష్పాలను భక్తితో సేకరించి, వాటిల్ని మన స్సనే పుష్పాలుగా భావించి, భగవంతునికి అర్పించడం మనవంతు!

ఒక్కొక్కపుష్పం ఒకొక్కదేవతకు ఇష్టం! కనుక ఆయా దేవతలకు నిర్దేశింపబడిన ఆయా పుష్పాలతోనే పూజలు చేయాలని శాస్త్రాలు సూచించాయి. 'పుష్పై ర్దేవా ప్రసీదంతి' పుష్పాల ద్వారా దేవతలు సంతోషించి, భక్తులకోరికలు తీరుస్తారు.

శ్రీమహావిష్ణువుకు ఏయేపుష్పాలు ప్రీతిపాత్రా లని శాస్త్రం పేర్కొనిందో – సాక్షాద్విష్ణువే అయిన శ్రీవేంకటేశ్వరునికీ అవే పుష్పాలు ఇష్టం! ఆ స్వామికి ఏవి పూజార్హాలు కావో, ఈ స్వామికీ అవే ఉపయోగ్యాలు కా వని గ్రహించాలి.

'పుష్పచింతామణి' అనే గ్రంథం– (తి.తి.దే. ప్రచురణ) ద్వితీయప్రకాశంలో విష్ణువుకు ఇష్టమైనవీ, ఇష్టంకానివీ అయిన పూలను నిర్దేశించడమైంది. ఈ నిర్ణయం అనేకపురాణాల ద్వారా జరిగింది.

విష్ణువుకు – వేంకటేశ్వరునికి పూజార్హాలైన పుష్పాలు.

మల్లెలు, సన్నజాజులు, మొగలి, సంపెంగలు, సురపొన్నలు, నాగకేసరాలు, పొగడలు, తామరలు, కలువలు, తెల్లగన్నేరు, జమ్మి, అశోకం, ఎర్రదేవకాంచనం, దింటెన, గులాబి, పచ్చగోరింట, దేవకాంచనం, ఎర్రగన్నేరు, నంద్యావర్తం, దాసాని, మారేడుపూలు, నల్లకలువ, మెట్టతామర, నీటితామర, నల్లగోరింట, అవిసెపూలు, కడిమిపూలు, మామిడిపూత మొదలగుపూలు.

విశేషకాలంలో, విశేషపుష్పాలు – సమర్పించదగినవి.

ఒక తుమ్మిపువ్వు, విష్ణువుకు సమర్పిస్తే – పదిబంగారు నాణేలు దానంచేసినట్టిఫలం చేకూర్తుంది. అశోకపుష్పం– శోకనాశనం. జాజిపువ్వు– సద్భావాలు మరియు జాజిపూలు సమర్పిస్తే విష్ణుసమానపరాక్రమత్వం. పత్రాలు–పూలులేనప్పుడు ఆయా పూలతీగెల, చెట్లపత్రాలు ఉపయోగించవచ్చు. ఉత్తరేణి, భృంగరాజం (గుంట గలగర), చంద్ర, జమ్మి, గరిక, దర్భ, దవనం, మారేడు, తులసి ఒకదానికంటె మరొకటి శ్రేష్ఠం. పత్రాలలో విష్ణువుకు సర్వశ్రేష్ఠం తులసి. కడిమిపూలు– గోదానఫలం, స్వర్గసుఖం, ఐశ్వర్యప్రదం, కార్తికమాసంలో సన్నజాజులతో చేసినపూజ నూరుకపిలగోవుల్ని దానంచేసినఫలం. వసంతఋతువులో మల్లెపూలతో పూజ సకలపాపహరం. చైత్రమాసంలో దవనంతో పూజ గోదానపుణ్యఫలం. అవిసెపూలతో పూజ రాజాధిరాజత్వం. ఇలా ఆయామాసాల్లో శాస్త్రం పేర్కొన్నపూలతో విష్ణువును పూజించడంవల్ల భక్తులు ఇహపరసుఖాలు పొందవచ్చు.

విష్ణువుకు, వేంకటేశ్వరునికి అన్నిటికన్నా ఎక్కువ ప్రీతి అయినవి తులసీపత్రాలు!

**విష్ణుపూజకు తగనిపూలు, పత్రాలు :**

ఎర్రచంద్రనం, శ్రీకృష్ణునికి బిల్వపత్రాలు, నరసింహునికి మొగలి, మందారం, జిల్లేడు, ఉమ్మెత్త, బూరుగ, దేవకాంచనం, తెల్లని, పచ్చని మొగిలిపూలు, కొండగోగులు, దిరిసెన మొదలగునవి. ఇలా శాస్త్రానుగుణంగా ఆయాదేవతలకు యోగ్యాయోగ్య పుష్పపత్రాలు గుర్తించి, అర్పించి, అర్చించడంవల్ల సత్ఫలాలు సిద్ధిస్తాయి.

ఇట్లే, 'పుష్పచింతామణి' గ్రంథంలో శివునికీ, సూర్యునికీ, లక్ష్మికి, సరస్వతికి, దుర్గాదేవికి సంబంధించిన పుష్ప విని యోగవిశేషాలు పేర్కొనబడ్డాయి. వీలయితే ఆ పుస్తకం చూడండి.

**ద్వాదశ ఆదిత్యుల పేర్లు తెల్పండి?**

*– పెరగుజాలయ్య, హైదరాబాద్.*

☛ ఇంద్రుడు, ధాత, పర్జన్యుడు, త్వష్ట, పూష, అర్యముడు, భగుడు, వివస్వంతుడు, విష్ణువు, అంశుమంతుడు, వరుణుడు, మిత్రుడు – వీరు కశ్యపునికి అదితియందు గల్గిన 'తుషితు' లనబడే దేవతలు. అదితిసంతానం కనుక ఆదిత్యులు.

# పల్లవరాణి సామవై శాసనం

ఆచార్య గల్లాచలపతి

తిరుమలఆలయచరిత్రను, అనేకశతాబ్దాలుగా ఆలయంలో జరిగిన పూజాదివిషయాలను, వివిధదశలలో ఆలయం పొందినవైభవాన్ని తెలుసుకోడానికి మనకున్న ఆధారాలలో శాసనాలు ప్రధానమైన ఆధారం. ఆలయ ప్రాకార కుడ్యతలాలపై, స్తంభాలపై, మండపాలపై ప్రాచీనకాలం నుండి చెక్కించబడి కనిపిస్తున్నశాసనాలు ఆలయవిషయాలను సమగ్రంగా వివరిస్తున్నాయి. తిరుమలఆలయంలోనే గాక తిరుపతి శ్రీగోవిందరాజస్వామిఆలయంలోను, తిరుచానూరు శ్రీపద్మావతీఅమ్మవారిఆలయంలోనుకూడా అనేకశాసనాలు చెక్కించబడినాయి. ప్రయాగదాసుగా రనే మహంతు తిరుమల తిరుపతిదేవస్థానాల విచారణకర్తగా ఉన్నప్పుడు ఆలయాలలో కనిపించినశాసనాల ప్రతిబింబాలను తీసి, ముద్రించా లనే ప్రయత్నం జరిగింది. ఆలయాల యాజమాన్యం ఆ పనిని సాధు సుబ్రహ్మణ్యశాస్త్రిగారికి అప్పగించింది. వారు శాసనవిషయాలలో తగినశిక్షణపొంది, 1922 నుండి శాసనాలను తీసే పని ప్రారంభించారు. తిరుమల ఆలయశాసనాలతో పాటు తిరుపతి, తిరుచానూరు ఆలయాలశాసనాలప్రతిబింబాలనుకూడా తీశారు. ఈ పని 1927 వరకు కొనసాగింది. ఆలయాలు మహంతుల నిర్వహణలో ఉండిన చివరిదశలో వారి ప్రోత్సా హంతో సాధుసుబ్రహ్మణ్యశాస్త్రిగారు శాసనాలను ముద్రణకు అనుకూలం చేశారు. సేకరించిన 1060 శాసనాలను పరిశీలించి, వాటి లోని విషయాలను క్రోడీకరించి, అప్పటివరకు ఆలయాలలో జరుగుతూ ఉండిన పూజాకైంకర్యాలను తెలిపే శాసననివేదిక మొదటిభాగాన్ని (ఎపిగ్రాఫికల్ రిపోర్టు) తయారు చేసి, 1930లో ప్రచురింపజేశారు. అది మద్రాసులోని 'తిరుపతి శ్రీమహంతులముద్రణాలయం'లో ముద్రింపబడింది. ఆ తర్వాత మరికొన్ని శాసనాలనుకూడా తీశారు. వీరు తీసిన మొత్తం శాసనాలు 1150. ఈ శాసనాలను కాలక్రమా న్ననుసరించి ఆరుసంపుటాలుగా ప్రచురించే ప్రయత్నం జరిగి ప్రచురింపబడినాయి. శాసనాల మొదటి సంపుటం 1931లో అచ్చయింది.

ప్రచురింపబడిన ఈ సంపుటాలలో శాసనాలు టి.టి. (తిరుమల టెంపుల్) అని, జి.టి. (గోవిందరాజస్వామి టెంపుల్) అని రెండు వర్గాలుగా కనిపిస్తాయి. తిరుమలఆలయంనుండి సేకరించినవన్నీ టి.టి. అనే వర్గంగా, తిరుపతి, తిరుచానూరు దేవాలయాలనుండి సేకరించినవి జి.టి అనే వర్గంగా విభజింపబడినాయి. అయినా ప్రతిసంపుటంలో రెండువర్గాల శాసనాలు కలసి కాలక్రమా న్ననుసరించే కనిపిస్తాయి. మొత్తంమీద దేవస్థానాల శాసనాలను పరిశీలిస్తే మొదటిశాసనం తిరుచానూరు దేవాలయంనుండి కనిపిస్తున్నది. ఇది తొమ్మిదవశతాబ్ది ప్రారంభ కాలంనాటిది. పల్లవరాజైన విజయదంతివర్మ 51వ రాజ్యసంవత్సరంలో తిరుచానూరు గుడిలో చెక్కించబడిన ఈ శాసనం తిరుమలతిరుపతిదేవస్థానాల శాసనసంచయంలో మొట్టమొదటిది. దీనినిబట్టి పల్లవులకాలంనుండి తిరుమల తిరుపతి ఆలయాలలో శాసనాలు వేయించబడుతూ ఉండినట్లు తెలుస్తున్నది. ఉలగపెరుమాళ్ అనే వ్యక్తి తిరుచానూరులోని తిరువిళంగోయిల్‌లో నెలకొన్నమూర్తికి ఒక (అఖండ) దీపం పెట్టడం కోసం 30 కళంజుల బంగారుదానం చేసినవిషయం ఈ శాసనంలో ఉంది. ఈ శాసనకాలం సుమారు 830. అంటే తొమ్మిదవశతాబ్దిమొదటిసగం. ఈ శాసనం వేయించిన మరికొద్దిసంవత్సరాలకు కొప్పోత్ర మహేంద్రపన్మార్ (పల్లవపార్థివేంద్రవర్మ) 14వ రాజ్యసంవత్సరంలో సామవై అనేపేరుగల ఒక పల్లవరాణి తిరుమలవేంకటేశ్వరస్వామివిగ్రహానికి (తిరువేంగడనాథుని విగ్రహానికి అంటే ధ్రువమూర్తికి) ప్రతినిధిగా ఒక వెండివిగ్రహం చేయించి, తిరుమల తిరువిళంగోయిల్‌లో ప్రతిష్ఠించి, వివిధదానాలను సమర్పించింది. ఈ విషయాలను తెలిపే రెండుశాసనాలను సమవాయి వేయించింది. ఈ రెండు శాసనాలు తమిళభాషలో ఉన్నాయి. ఆ రెండింటిలో ఆమె వేయించిన మొదటిశాసనం (టి.టి.-18, దేవస్థానశాసనాలు సం.1.శా.8) ఇది-

**(తిరుమలఆలయం మొదటి ప్రాకారం ఉత్తరంవైపున గల గోడమీద (వైకుంఠప్రదక్షిణమార్గం?) చెక్కబడిన శాసనం)**

**1)** స్వస్తిశ్రీ కొప్పొత్ర మహేంద్ర పన్మర్‌కు యాండు 14వదు సత్తి విడంగనాకియ శ్రీకాడపట్టిగళ్ దేవియార్ పల్లవప్పెఱ్క్కడైయార్ మకళ్ సామవై యాకియ కాడవన్ పెరందేవియెన్

శ్రీవెంగడత్తు ఎళుందరుళి నిన్ఱపెరుమానడికళుక్కు కర్మార్చనై కొందరుళి తిరువి(ళ)ం కోయిలిల్ ఎళుందరుళి విత్త వెళ్లి త్తిరుమేనియన్ తిరుముడి

**2)** యిల్ (ఱుత్తి) ననైరమ్ 23మ్ పరుముత్తు 16 నాయగమాన మాణిక్కమ్ 2మ్ తడవి క్కట్టిన మాణిక్కమ్ 3మ్ ఆగ మాణిక్కమ్ 5నాల్ తిరుముడి ఒన్ఱుమ్ తిరుక్కాదిల్ పొన్నిన్ మకరమ్ ఇ(ర)ండుమ్ పవళత్తిన్ కొప్పు ఒన్ఱుమ్ తిరుక్కఴుత్తిన్ మాలైయిలెతిన వయిరమ్ 14మ్ మాణిక్కమ్ పరుముత్తు 11మ్ నేర్‌ముత్తు పల(వుమ్) ఇట్టుక్కట్టిన మాలై 4మ్ పొన్నిన్ ఉదరబంద(న)మ్ 1మ్ తిరువరైప్పటిగై 1క్కు ఇట్టుక్కట్టిన మాణిక్కమ్ 4నాల్ పట్టికై 1మ్ వాహూవ లైయమ్ 2క్కు తడవిక్కట్టిన మాణిక్క

**3)** మ్ 2మ్ తడవిక్కట్టిన మాణిక్కమ్ 2 క్కట్టిన తిరుచ్చందం 4మ్ తిరుక్కఴుత్తిన్ వళైయిల్ 4మ్ తిరుక్కాలుక్కఴుత్తిన కాఱై 2మ్ ఇడైయిట్టపొన్నిన్ మణియుమ్ పవళముమ్ ముత్తుం ఆగ ఉరు 22 పాదసాయిలమ్ 2మ్ వెళ్ళి(ప్ర)బైయిల్ ఎతిన నాయగమాన మాణిక్కమ్ ఇత్తనై ఆభరణంగళుమ్ ఇట్టు సెయ్‌దపొన్ 47 కళంజుమ్ ఇత్తన యుమ్ కొండు అభిషే కముమ్‌సెయ్ విత్తు ఎళుందరుళి విత్త మనవాళపెరుమా ళుక్కు శ్రీవేంగడకొట్టత్తు తిరుక్కడవూర్‌నాట్టు తిరుచ్చుగనూర్ శభైయార్ పక్కలుమ్ మడముడై

**4)** య ఇలక్షుమణనమ్బి పక్కలుమ్ పొన్ శుడుత్తువిలై కొండు తిరువిళంగోయిల్ పెరుమాళుక్కుమ్ పొన్ కుడుత్తు ఇఱై ఇళిత్తిక్కొండ నిలముమ్ సభైయార్ పక్కల్ కొండ నిలముమ్ నందిఎరిప్పట్టియుం మడుప్పూట్టైయుమ్ ఇలక్షుమణనమ్బి అద్దైకొండ నీలముమ్ మదుశూదన్ ఆవియర్రైయుం పురుషోత్తమన్ పట్టియుమ్ ఆగ మూన్ఱుపట్టినిలముమ్ కడిగైక్కొలాల్ అళందు పదినరుశాణ్ కొలాల్ మూవాయిరమ్ శుడివిలైక్కొండు శభైయాఱ్కుమ్ దేవఱ్కుమ్ విలైపొన్ కుడుత్తు ఇఱై ఇళిత్తి మణవాళపెరుమాళుక్కు నిమన్త

**5)** త్తుక్కు వైత్త పడియావదు నిమన్తమ్ నానాళి అరిసి తిరువ ముదుం తిరునన్దావిళక్కు ఒన్ఱుమ్ ఇరందు అయన సం(క్రా)ంతి యుమ్ ఇరండు విషుసం(క్రా)ంతియుమ్ తిరుమంజనమ్ పుగువిప్పదఱ్కు పురట్టాదితిరునాళ్ ఎళుందరళి ప్పొదిగైక్కు (విళం) వెళుందరుళుమన్ఱు మదన్ మున్పుమ్ ఇరండునాళ్ తిరువిళా ఎళుందరుళు విప్పదా (గ) కవుమ్ శిత్తిరై ముదలాక తిరుమళైయట్టి ఒన్పదునాళ్ తిరువిళా వెళున్దరుళి విక్క(వు)మ్ ఇత్తనై యుమ్ శెయ్‌విప్పార్ తిరువెంగడత్తు మాడాపత్తియుం సెయ్ వారె యాకవుమ్ ఇన్నిలమ్ ఇఱైకాత్తు విడ శభైయార్ ఇరక్షిప్పారాగవుమ్ ఇప్ప రిశు చం(ద్రా)దిత్తవరై నిఱ్పదాక

**6)** శెయ్‌దెన్ శత్తివిడంగనాకియ కాడ వన్ పెరుందెవియార్ పల్లవపెఱ్ క్కడయార్ మకళ్ శామవై యాకియ కాడవన్ పెరుందేవియన్ ఇత్తన్‌మమ్ ఇరక్షిప్పార్ శ్రీపాదమ్ ఎన్‌తలై మెలదు శ్రీవైష్ణవర్గళ్ ఇరక్షై ఇవై శాత్తందై ఎళుత్తు.



సామవై
వేయించిన రెండు శాసనాలు
ప్రథమ ప్రాకారంలో విమాన వేంకటేశ్వరుని
క్రింద ఉత్తరపు గోడపై చెక్కబడినాయి. ఈ రెండు
శాసనాలు ఉన్న ఉనికిని చూపే ఊహా చిత్రం

## తెలుగు అనువాదం

**1)** స్వస్తిశ్రీ కొప్పొత్రమహేంద్రపన్మార్ 14వ రాజ్యసంవత్సరంలో కాడపట్టిగళ్ అనే శక్తివిటంకన్ భార్య (రాణి), పల్లవ పెర్కడ యార్ కూతురు, కాడవన్‌పెరుందేవి సామవై అనే నాచే వేంకటాచలంలో నిలచిన (శ్రీనివాస)పెరుమాళ్ల చరణాల అనుగ్రహంకోసం (శ్రీనివాస)పెరుమాళ్లకు అర్చనలు నిర్వ హించిన తరువాత తిరువిళంగోయిల్ (శ్రీనివాస పెరుమాళ్ల బాలాలయం)లో ప్రతిష్ఠింపబడి అనుగ్రహిస్తున్న తెల్లని దివ్య శరీరంగల (వెండి) మూర్తికి (సమర్పించిన దాన వివరాలు)

**2)** 23 వజ్రాలు; 16 పెద్దముత్యాలు; 2 పెద్దకెంపులు, 3 జాతి కెంపులు కలసి 5 కెంపులతో చేసిన ఒక కిరీటం (తిరు ముడి); దివ్యమైన రెండుచెవులకు మకరిఆకారంలో గల రెండు బంగారుఆభరణాలు; పగడాలతోచేసిన చెవులకు పెట్టే రెండుకొప్పులు; పవిత్రమైన కంఠానికి 14 వజ్రాలు, 14 మాణిక్యాలు, 11 పెద్దముత్యాలు, చాలా చిన్నకెంపులు కలిపి తయారు చేసిన నాలుగుపేటల బంగారుహారాలు; ఒక బంగారు ఒడ్డాణం (ఉదరబంధం); నాలుగుకెంపులను కూర్చిచేసిన ఒక బంగారుమొలతాడు (తిరువరైపట్టిగై); రెండుబాహువుల (పై అలంకరించే) రెండు బంగారు బాహు వలయాలు;

**3)** రెండేసి జాతికెంపులు పొదిగిన 4 కేయూరాలు (తిరు చ్చందం); పవిత్రమైన కంఠానికి వలయాకారం గల 4 బంగారుకంఠహారాలు; మధ్యమధ్యలో మణులు, పగ డాలు, ముత్యాలు మొదలైన 52 వస్తువులను కూర్చి బంగారుతో తయారుచేసిన రెండు గట్టిపాదాభరణాలు (కారై; దట్టీలతోకూడిన రెండు (పాదాలకు అలంకరించే) గొలు సులు (పాదచాయలమ్); ఒకపెద్దకెంపును కూర్చి చేసిన ప్రకాశవంతమైన ఒక వెండిచక్రం (ప్రభ); ఇంత మట్టుకు చేసినఆభరణాలకు 47 కళంజుల తూనికగల బంగారు (వ్యయమయింది). వీటన్నిటితో (తిరువిళం గోయిల్‌లో) ప్రతిష్ఠించి, ప్రత్యక్షమైఉన్న మనవాణపెరుమాళ్లకు ప్రత్యేక అభిషేకం చేసి, శ్రీవేంకటకొట్టానికి చెందిన తిరుక్కడవూర్ నాడులోని తిరుచ్చుగనూర్ సమీపంలోని మఠంలో నివాస మున్న

**4)** లక్ష్మననంబినుండి కొన్నపొలం; సభవారి (సభైయారు) నుండి కొన్న పొలం; నందిఎరిపట్టి అనే పేరుగల కొంత పొలం; మదుప్పూట్టై అనేపేరుగల కొంత పొలం; మదు సూదన్‌ఆవియార్, పురుషోత్తమన్‌పట్టి అనువారినుండి కొన్న పొలం; అంతా కలసి 3 పట్టీల పొలాన్ని సంగ్రహించి 'కడి క్కైకోల్' అనే కొలతకర్రతో కొలిచిన మూడువేల (కుంటల?) భూమిగా నిర్ణయించి ఖరీదుచేసి; సభవారికి, పెరుమాళ్లకు కొన్నఖరీదుకు చెల్లించవలసిన ధనం బంగారురూపంలో చెల్లించి, పన్ను రద్దు చేయించి మనవాళ ప్పెరుమాళ్లకు (భోగశ్రీనివాసమూర్తికి) అనుగ్రహం కోసం, సేవకోసం దేవ మాన్యంగా బహూకరింప (సమర్పింప) బడింది.

**5)** ప్రతిరోజూ నైవేద్యంకోసం 4 నాలీల బియ్యంతో చేసిన ప్రసాదనిమిత్తం; ఒక అఖండదీపంకోసం; రెండు అయన సంక్రాంతులలో, రెండు విషుసంక్రాతులలో పురటాసి (భాద్ర పదమాసం) నెలలో జరిగే (బ్రహ్మోత్సవంలో) ప్రధాన ఉత్సవానికి ముందు రెండు రోజులు ఉత్సవం జరపడానికి; చిత్తానక్షత్రంనాటినుండి అంకురార్పణంతో ప్రారంభించి 9 రోజులు నిర్వహించే ఉత్సవాలు జరిపించడానికి ఇచ్చిననేల (దేవమాన్యం). ఈ ఉత్సవాలను, సేవలను తిరువేంకటా చలం మఠాధిపతులే నిర్వహించా లని, సభవాళ్లు (సభై యార్) ఆ మాన్యానికి పన్నులేకుండాచేసి కొనసాగించా లని (రక్షించా లని), ఈ దానం ఆచంద్రార్కం నిలిచి ఉండా లని

**6)** కట్టడిచేసిన నేను శక్తివిటంకన్ అనే కాడవన్‌భార్య, పల్లవపెర్కడయార్ కూతురు అయిన సామవై అనే పేరుగల కాడవన్‌పెరుందేవిని. ఈ దానధర్మాన్ని రక్షించేవాళ్ళ శ్రీపాదా లను నా తలమీద ఉంచుకొంటాను. దీనికి శ్రీవైష్ణవుల రక్ష. ఇది (ఈ శాసనం) సాత్తాంద్దై అనే (లేఖకుని) వ్రాత.

సామవై వేయించిన ఈ శాసనం గ్రంథలిపిలోను, ప్రాచీనతమిళభాషలోను ఉన్నది. మనవాణప్పెరుమాళ్ అనే పేరుతో పిలువబడే భోగశ్రీనివాసమూర్తి విగ్రహాన్ని వెండితో చేయించి, తిరుమలఆలయంలోనే తిరువిళంగోయిల్‌లో ప్రతిష్ఠించినవిషయం; భోగశ్రీనివాసమూర్తికి వివిధరకాల ఆభరణాలు చేయించిన విషయం; రెండు సంక్రాంతులలో

జరుపవలసిన ఉత్సవాలు, ఆ ఉత్సవాల నిర్వహణకు కావలసినధనం సమకూర్చడానికి మూడువేల (కుంటల?) పొలాన్ని సమర్పించినవిషయం; తిరుచానూరు సభవారిని (ఇప్పటి పంచాయితీవంటిసభ కావచ్చు) ఆ పొలంపై పన్ను మినహాయించ మని కోరినవిషయం; ఆ దానాలను గ్రహించి, తిరుమలమఠాధిపతులే ఆ యా ఉత్సవాలను ఆచంద్రార్కం నిర్వహిస్తూరావా లనేవిషయం విపులంగా శాసనంలో పొందుపరచబడినాయి.

సామవై పల్లవరాణి కాబట్టి; ఆమె వేయించిన రెండు శాసనాలు తిరుమలఆలయకుడ్యతలాలపై కనిపిస్తున్నాయి కాబట్టి పల్లవులకాలంనుండి తిరుమలఆలయంలో శాసనాలు చెక్కించబడుతూ ఉండినట్లు తెలుస్తున్నది. (రెండవశాసన, విషయం ఈ వ్యాసంలో చర్చింపబడలేదు.) ఇది ఆలయ చరిత్రను నిరూపించడానికికూడా పనికొచ్చే అంశం. అయితే సామవై వేయించినశాసనాలకాలాన్ని నిర్ణయించాలి. దీనికి ముందు తిరుమలప్రాంతం అంత ప్రాచీనదశలో ఏ రాజవంశం ఏలుబడిలో ఉండినదీ తెలియాలి. అప్పటిచరిత్రను పరిశీలిస్తే స్కందవర్మతో ప్రారంభమైన ప్రాకృతపల్లవులకాలం నుండి చిత్తూరుప్రాంతం పల్లవులరాజ్యంలో భాగంగా ఉండేది. (మొదటి దశలో వీళ్ళు ప్రాకృతభాషలో శాసనాలు వేయించడంవల్ల ప్రాకృతపల్లవులుగా పిలువబడినారు.) ఆ ప్రాంతం కొంతకాలం చోళుల ఆధిపత్యంలో ఉండి మొదటి నరసింహవర్మ (630-668) కాలంనాటికి మళ్లీ పల్లవుల స్వాధీనంలోకి వచ్చింది. వీళ్ళరాజధాని కంచి. తొండమనాడు వీళ్ల ఉత్తరపు సరిహద్దు. తొండమనాడే అప్పటి తొండమండలం లేక తుండీరమండలం. చిత్తూరు, ఉత్తరఆర్కాటు, చెంగల్‌పట్టు మండలాలు అప్పటి తొండమండలంలోని భాగాలు. చోళులకాలంలో తొండమండలం జయకొండచోళమండల మని పిలువబడింది. ప్రాచీనతమిళ సాహిత్యం తిరుమలకొండను తిరువేంగడంగా, అక్కడ కొలువైన దేవుని తిరువేంగడముడైయాన్‌గా చెప్పింది. తిరువేంగడం పల్లవులకాలంలో తిరువేంగడకొట్టంలోని భాగ మని ప్రాచీన తమిళశాసనాలు పేర్కొన్నాయి. తిరువేంగడకొట్టం తొండమండలంలోని ఒకభాగం. తిరువేంగడకొట్టంలో నాలుగు నాడులు ఉండేవి. అవి తిరుక్కుడవూరునాడు, (తిరుపతి పరిసరప్రాంతం), వైకుంతవలనాడు (చంద్రగిరిపరిసరప్రాంతం), తుయ్యనాడు (చిత్తూరు పరిసరప్రాంతం), అత్తూరు నాడులు (శ్రీకాళహస్తిప్రాంతం). ఈ శాసనంలో తిరువేంగడ కొట్టత్తు (తిరువేంగడకొట్టం), తిరుక్కుడవూర్, తిరుచ్చుగనూర్ (తిరుచానూరు) కనిపిస్తున్నాయి. అంటే తిరువేంగడకొట్టంలోని తిరుక్కుడవూరుకు చెందిన తిరుచానూరు అని చెప్పాలి.

సామవై శాసనకాలాన్నిగురించి చర్చించే ముందు పల్లవరాజవంశానికి చెందినచారిత్రకవిషయాలు కొన్ని తెలియాలి. సామవై కాడవన్‌పెరుందేవి- అంటే పల్లవరాణి. కాడవ అనేమాట పల్లవశబ్దాన్ని సూచిస్తుంది. కాడును (అడవిని) కొట్టి ఊరుకట్టినవారు (కాడువెట్టిగళ్) కాబట్టి పల్లవులకు కాడవు లని పేరొచ్చింది. ఆమెభర్త శక్తివిడంగన్ కాడపట్టిగళ్. అంటే పల్లవరాజైన శక్తివిటంకుడు. అలాగే ఆమె పల్లవ పెఱ్ఱుడయార్ కూతురు. పెఱ్ఱుడయార్ అంటే ప్రెగ్గడ. ప్రెగ్గడ అంటే మంత్రి. అందువల్ల ఆమెతండ్రి పల్లవరాజుల దగ్గర మంత్రిగా చేసినవాడు. శక్తివిటంకుడు కంచిని పాలించినరెండవనందివర్మకు మునిమనమడు. విజయదంతివర్మ (795-845) మొదటికుమారుడు. ఇతనికాలంలో పల్లవరాజ్యం చోళుల వశమైంది. అయినా చోళులకు సామంతులుగా పల్లవులు కొంత కాలం పాలన చేశారు. ఆ దశకు చెందినచోళుల అధీనంలోని పల్లవరాజు ఈ శాసనంలో కనిపించే కొప్పాత్ర మహేంద్రవర్మ. ఇతడు పరాంతకసుందరచోళుని అధీనంలో ఉండిన కోపార్థివేంద్రవర్మగా చరిత్రకారులు గుర్తించారు. ఈ కోపార్థివేంద్రవర్మకు శక్తివిటంకుడు సామంతుడు. కాబట్టి కోపార్థివేంద్రవర్మ కాలం తెలిస్తే సామవైశాసనకాలం తెలుస్తుంది.

పరాంతకసుందరచోళుడు మొదటిపరాంతకుడు (907-955)గా చోళులచరిత్రలో కనిపిస్తున్నాడు. ఇతడు 48 సంవత్సరాలు పాలించినట్లు, పదవశతాబ్దంవాడైనట్లు శాసనాధారాలతో 'దిచోళాస్' అనే గ్రంథంల్లో (1984, పుట 120) నీలకంఠశాస్త్రి గారు నిరూపించారు. కోపార్థివేంద్రవర్మ మొదటిపరాంతకుని కాలంవాడు కాబట్టి పదవశతాబ్దికి చెందినవాడే. సామవైభర్త శక్తివిటంకుడుకూడా ఆ శతాబ్దంవాడే. ఇక సామవై శాసనం

పదవశతాబ్దంనాటి దని చెప్పడంలో ఎలాంటి సందేహం ఉండ నక్కరలేదు. కోపార్థివేంద్రవర్మ 14వ రాజ్యసంవత్సరంలో సామవై శాసనం వేయించినట్లు శాసనంలో ఉండడంవల్ల సాధు సుబ్రహ్మణ్యశాస్త్రిగారు ఆ రాజు 14వ రాజ్యసంవత్సరం 966కు సరిపోతుం దని నిర్ణయించారు. 966 అని కచ్చితంగా చెప్పడానికి కూడా తగిన ఆధారం లేదు. ఆయా రాజుల పాలన కాలాలు ఇంచుమించుగా నిర్ణయింపబడడంవల్ల 966 అనడంకంటె పదవశతాబ్దిఅనడం సముచితంగా ఉంటుం దేమో! సామవై శాసనం తిరుమలఆలయంలో చెక్కించబడడంవల్ల అప్పటికి దేవాలయం ఉండి ఉండాలి. ఇతరఆధారాలను పరిశీలించినా అప్పటికి దేవాలయనిర్మాణం జరిగినట్లు తెలుస్తున్నది. కాబట్టి సామవైశాసనకాలం పదవశతాబ్ది అని చెప్పవచ్చు.

సామవైశాసనాన్ని పరిష్కరించి తి.తి.దే శాసనాలు మొదటిసంపుటంలో ప్రకటించినప్పుడు ఆ శాసనకాలాన్ని 966గా నిర్ణయించిన సాధుసుబ్రహ్మణ్యశాస్త్రిగారు 'తిరుపతి శ్రీవేంకటేశ్వర' అనే తన మరొక గ్రంథంలో సామవైపెరుందేవి 614లో భోగశ్రీనివాసమూర్తిని ప్రతిష్ఠించినట్లు (శాసనకాలం 614గా) నిర్ణయించారు. శాసనంలో మొదటిపంక్తిలోనే కనిపి స్తున్న కోప్పాత్రమహేంద్రపన్మఱ్‌ను (కోపార్థివేంద్రవర్మ) పల్లవమహేంద్రవర్మగా అనుకోవడంవల్ల, అతడు ఏడవశతాబ్ది పూర్వార్థంవాడు కావడంవల్ల అతని 14వ రాజ్యసంవత్సరాన్ని 614గా నిర్ణయించినట్లుంది. మహేంద్రవర్మ మొదటినరసింహ వర్మ (630–668) తండ్రి. అందువల్ల 614గా నిర్ణయించడం సబబుగానే ఉంది. అయితే తిరుమల తిరుచానూరు ఆలయాల్లో దొరికిన మొదటిదశశాసనాలను పరిశీలిస్తే 614ను అంగీ కరించడానికి అవకాశం లేదు. ఎందుకంటే 614 నాటికి తిరుమల ఆలయనిర్మాణం జరిగినట్లు కనపడడం లేదు.

తొమ్మిదవశతాబ్దం ప్రారంభంవరకు కొండపైన గుడి ఉన్నట్లు ఆధారాలు లేవు. అప్పటికి ఆళ్వారులు గుడినిగురించి ప్రస్తావించలేదు. చిన్నగుడి ఉండినదేమోమరి! దాన్ని ఎవరూ అంతగా పట్టించుకొన్నట్లు కనపడదు. అయితే, వేంగడం గొప్ప తనం చుట్టుపక్కలవారికి తెలిసి ఉంటుంది. అడవిప్రాంతం కాబట్టి యాత్రికులు అంతగా వెళ్ళేవారు కాదు. ఆ సందర్భంలోనే కొండమీద ఉన్న దేవునిప్రతినిధిగా మరోమూర్తిని కొండకింద ప్రతిష్ఠించా లనేఆలోచన వచ్చి ఉంటుంది. అప్పటికి కొండ కింది ప్రదేశంలో తిరుచానూరు ప్రసిద్ధిగా ఉండడంవల్ల ఆ ప్రతినిధిమూర్తిని తిరుచానూరు తిరువిళంగోయిల్‌లో ప్రతి ష్ఠించడం జరిగి ఉంటుంది. కొండమీదికి వెళ్లలేని భక్తులు తిరుచానూరుకు వచ్చి, ఈ మూర్తిని దర్శించుకొనేవారు. తిరుచా నూరులో దొరికిన మొదటిశాసనంలో విజయదంతి విక్రమవర్మ 51వ రాజ్యసంవత్సరంలో శోలనూరిఉంగప్పెరుమానార్ తిరుచ్చోకినూరు (తిరుచానూరు) తిరువేంగడత్తు పెరు మానడిగళ్ మూర్తికి నిత్యదీపారాధనకు 30 కళంజుల బంగారు సమర్పించి నట్లుంది. ఈ మూర్తి వేంగడంమీద ఉండిన దేవుని ప్రతినిధిగా



## శ్రీ వేంకటేశ్వర స్తుతిరత్నమాల

**ఉ॥ ఏమి తపం బొనర్చితిమొ, యే సుకృతం బొనరించినామొ, యే**
**నోములు నోచినారమొ, మనోరథముల్ మది దేటువారగా,**
**కామితదానపాటవము గల్గిన తండ్రిని, వేంకటాచల**
**స్వామిని చూడగంటిమి, శుభమ్ములు గూడ, నఘమ్ము లూడగన్**

– అజ్ఞాతకవి

తిరుచానూరులో ప్రతిష్ఠింపబడినమూర్తి. విజయదంతివిక్రమ వర్మ రాజ్యకాలం 779-830. తిరువిళంగోయిల్ అంటే అప్పటికి నూతనంగా నిర్మింపబడినగుడి అని అర్థం. తిరుచానూరులో దొరకిన మరోశాసనం 820 నాటిది. తిరువిళంగోయిల్‌పెరు మానడిగల్, తిరుమంత్రశాలైపెరుమాన డిగల్, తిరువేంగడత్తు పెరుమానడిగల్ అనే ముగ్గురుదేవతామూర్తుల విషయం ఈ శాసనంలో ఉంది. మూడవమూర్తి కొండ పైన ఉండిన దేవుడే. మిగిలిన ఇద్దరుమూర్తులకు చెప్పినట్లు తిరువిళంగోయిల్, తిరుమంత్రశాలై అనే ఆలయాంశాలు కొండమీదగల మూర్తికి చెప్పబడలేదు. కాబట్టి కొండపైన దేవాలయం అప్పటికి ఉన్నట్లు అనుకోడానికి వీలుకాదు.

కొండపైన దొరికిన మొదటిశాసనం 790 నాటిది. ఇది గుడి పక్కనే ఉన్న ఒకరాతిపలకపై చెక్కించిన శాసనం. గుడి గోడలమీదిది కాదు. ఈ శాసనంలో బాణవంశపు రాజైన విజయాదిత్యుడు పుట్టినవిషయం ప్రస్తావించబడింది. దీన్ని బట్టికూడా గుడి ఉన్నట్లు అనిపించదు. తిరుచానూరులో దొరికిన మరొక 935 నాటిశాసనం చోళరాజైన మొదటి పరాంతకుని కాలంనాటిది. ఈ రాజు 29వ రాజ్యసంవత్సరంలో మలనాడు (కేరళ)కు చెందిన కొడుంగోళూరాన్ అనే భక్తుడు కొండమీద దేవుడికి ఆచంద్రార్కం అఖండదీపం వెలిగించడానికి 40 కళంజుల బంగారు తిరుచ్చుకనూర్ సభైయారికి (తిరుచానూరు సభవారికి) దానంచేసినవిషయం ఈ శాసనంలో ఉంది. దేవుని ముందు అఖండదీపం వెలిగించడానికి గుడి ఉండాలి కాబట్టి 935 నాటికి కొండపైన గుడి నిర్మాణం అయినట్లు ఊహించ డానికి ఈ శాసనం ఆధారంగా ఉంది. గుడినిర్మాణమై ఒక మోస్తరుగానైనా భక్తులు పరిసరప్రాంతాల నుండి కొండ ఎక్కడం ఆరంభించి ఉండడంవల్ల దేవాలయ ఉనికి, దేవునిప్రశస్తి ఇతరప్రాంతాలకు వ్యాపించి ఉంటుంది. ఆ సందర్భంలోనే సామవైకి స్వామిని సేవించా లని అనిపించి ఉంటుంది. 790 నాటిశాసనం తరువాత కొండపై దొరికింది సామవైశాసనమే. ఇది గుడిమొదటిప్రాకారపుగోడమీద చెక్కబడడంవల్ల అప్పటికి దేవాలయం నిర్మింపబడి ఉండాలి. ఇంతగా చర్చించడం ఎందుకంటే 614 నాటికి కొండపైన దేవాలయం ఉండడానికి అవకాశం లే దని చెప్పడానికే. దేవా లయమే లేనపుడు సామవై 614లో భోగశ్రీనివాసమూర్తిని ప్రతిష్ఠించడం ఎలా సాధ్య మవుతుంది?

### సామవై ప్రారంభించినఉత్సవాలవివరాలు

**1)** రెండు అయనసంక్రాంతులలో (మకర సంక్రాంతి, కర్కాటక సంక్రాంతి) అభిషేకం.

**2)** రెండు విషుసంక్రాంతులలో (వసంత విషుసంక్రాంతి, శరత్ విషుసంక్రాంతి) అభిషేకం.

**3)** పురటాసినెల (భాద్రపదమాసం) చిత్తానక్షత్రంతో ప్రారంభించి అంకురార్పణంతో మొదలుపెట్టి తొమ్మిదిరోజులు ఉత్సవాలు.

**4)** తొమ్మిదిరోజులు ఉత్సవాల మొదటిరోజు, దానికి ముందు రోజు ఉత్సవాలు.

మూలమూర్తికి పూజాదికాలు జరిపినతర్వాత మూల మూర్తికి ప్రతినిధిగా తాను సమర్పించిన మనవాళపెరుమాళ్ రజితమూర్తికి పై ఉత్సవాలు నిర్వహించా లని సామవై కట్టడి చేసింది. సామవై తొమ్మిదిరోజులఉత్సవాలు అన్నదే గాని బ్రహ్మోత్సవా లని చెప్పలేదు. తొమ్మిదిరోజులు జరిగే ఉత్సవాలు కాబట్టి అవి బ్రహ్మోత్సవాలే నని భావించి, కొండపైన బ్రహ్మో త్సవా లను ప్రారంభించింది పల్లవరాణే నని అనుకోవడం జరి గింది. పల్లవరాణి ఆ ఉత్సవాలను ప్రారంభించినవేళావిశేష మేమో గాని, ఇప్పటికీ భాద్రపదమాసంలో బ్రహ్మోత్సవాలు జరుగుతూ ఉన్నాయి.

సామవై తాను తయారు చేయించిన వెండిమూర్తిని ప్రతి ష్ఠించింది- తిరుమలఆలయంలోని తిరువిళంగోయిలలో. తిరువిళంగోయిల అంటే అప్పటికప్పుడు నూతనంగా నిర్మాణం చేసిన ఆలయ మని అర్థం. ఇది గర్భగుడిముందుభాగాన అంటే కులశేఖరపడికి ఇవతలవైపు ఉన్నచిన్నఆలయం. దీనిని బాలాలయం అనికూడ అంటారు. ఇప్పు డిది శయన మందిరంగా ఉపయోగపడుతున్నది.

# నవరాత్రులు విజయదశమి

**పి. మాధవి**



ప్రతిసంవత్సరం మనకువచ్చే పండుగలలో 'నవరాత్రి' పండుగలు - మూడు. అవి 1)వసంతనవరాత్రులు- చైత్రశుద్ధపాడ్యమినుండి శ్రీరామనవమివరకు. 2)గణపతినవరాత్రులు- భాద్రపదశుద్ధ చవితి-వినాయకచవితినుండి తొమ్మిది రోజులు. 3)ఆశ్వయుజశుద్ధపాడ్యమి నుండి తొమ్మిదిరోజులు-మహానవమి వరకు-శరన్నవరాత్రాలు. ఈ మూడు నవరాత్రులలో శరత్కాలంలో వచ్చే శరన్నవరాత్రాలే విశేషంగా ఉత్సవాలు జరిగేవి. ఇవి దేవీపరమైనవే అయినా-అన్ని దేవాలయాలలో, అందరు దేవతలకు విశేషపూజామహోత్సవాలు నిర్వహించడం ఆనవాయితీ అయింది. దేవీప్రాధాన్యం వల్ల వీటిల్ని దేవీనవరాత్రు లనడం కద్దు. వసంత, గణపతి నవరాత్రులకు దక్షిణ భారతంలో ప్రాముఖ్యం ఎక్కువ. దేవీనవరాత్రులకు ఉత్తరదేశంలో ప్రాధాన్యం ఎక్కువ. క్రమంగా ఈ మూడురకాలనవరాత్రులూ భారతదేశంలో ప్రాంతీయభేదాలు లేకుండా యథాశక్తిగా నిర్వహిస్తుండడం చూస్తున్నాం.

శరదృతువు, వసంతఋతువు యమదంష్ట్రిక లనీ, మృత్యుకారకా లనీ- ఈ కాలాల్లో అనగా శరత్తులో చండికాదేవినీ, వసంతకాలంలో శ్రీరాముణ్ణీ పూజించా లనీ పురాణాలు పేర్కొన్నాయి. ఈ రెండుఋతువులూ వాతావరణ కారణంగా అనేకరోగాలకూ, దుష్పరిణామాలకూ నిలయాలు. కనుక ఈ బాధలనుండి తరించా లంటే దుష్టసంహారిణి అయిన చండికాదేవిని - (ఈమెనే దుర్గ, అపరాజిత అనీ స్తుతిస్తారు) పూజించా లన్నారు. పరాశక్తి అనేకరూపాలతో అనేకరాక్షసుల్ని సంహరించి, లోకాలకు ఎంతో ఉపకారం చేసింది. అందుకు కృతజ్ఞతాసూచకంగా ఈ పూజలు రూపొందాయి. అయితే, అమ్మవారు వరుసగా ఆశ్వయుజమాసంలోనే- ఒకేసంవత్సరం- ఒకేనెలలోనే ఈదుష్టశక్తుల్ని కూల్చలేదు. వేర్వేరుయుగాల్లో- కాలాల్లో ఆకార్యాలు జరిగాయి. అయినా వాటన్నింటినీ శరత్తు- ఆశ్వయుజానికి అన్వయించుకొని-శరన్నవరాత్రులు నిర్వహిస్తున్నా రనిపిస్తుంది. రాక్షసులబాధలు భరించలేక రాజులూ, మానవులూ అందరూ ఆశ్వయుజంలో వరుసగా తొమ్మిదిరోజులు వారి వారి ఇష్టదేవతల్ని ప్రార్థించా రనీ, అమ్మవారు సర్వదేవతాత్మిక కనుక ఆమె తొమ్మిదిరూపాలతో విజృంభించి, ఆ రాక్షసుల్ని సంహరించిం దనీ కథ! అందుకే కేవలం అమ్మవారిఆలయాల్లోనే కాక- శివ విష్ణురామాది అన్నిఆలయాలల్లో - గ్రామ దేవతాలయాల్లోకూడా నవరాత్రివిశేష పూజలు, ఉత్సవాలు నిర్వహిస్తున్నారు. పరాశక్తి ఈతొమ్మిది రోజులూ వరుసగా- 1)శైలపుత్రీ 2)బ్రహ్మచారిణీ 3) చంద్రఘంటికా 4)కూష్మాండా 5)స్కంద మాతా 6)కాత్యాయనీ 7)కాళరాత్రి 8)మహాగౌరీ 9)సిద్ధిదాత్రి అనేపేర్లతో సముచితరూపవస్త్ర శస్త్రాస్త్రాలతో శత్రువుల్ని జయించింది. వీళ్లనే నవదుర్గ లంటారు. రూపాలు వేరయినా- మూల ప్రకృతిమాత్రం ఒక్కటే-పరాశక్తి! 'తంత్రసారం'లో పరాశక్తి చిదాత్మగా సరస్వతి అనీ, సదాత్మగా లక్ష్మి అనీ, ఆనందాత్మగా మహాకాళి అనీ పేర్కొనబడింది. దేవీశబ్దానికి- లక్ష్మి, సరస్వతి, పార్వతి - ముగ్గురూ అర్థాలే! దేవీనవరాత్రులలో ఈ ముగ్గురి పూజలూ జరుగుతాయి. దేవీపూజలకు సాయంకాలం శ్రేష్ఠం! విద్యకోసం సరస్వతినీ, ఐశ్వర్యంకోసం లక్ష్మినీ, కార్యసిద్ధికోసం దుర్గాదేవినీ అందరూ ఆరాధిస్తారు.

శరన్నవరాత్రులలో మూలానక్షత్రంనాడు విశేషించి సరస్వతిగా, అష్టమినాడు దుర్గాదేవిగా, నవమినాడు సర్వాయుధ పరిష్కృత అయిన త్రిమూర్త్యాత్మికగా, దశమినాడు విజయలక్ష్మీ రూపిణి అయిన అపరాజితాదేవిగా - దేవిని పూజిస్తారు.

మనశరీరంలో ప్రధానమైనవి 96 నాడులు. ఇవే జగన్మాతలోని 96 కళలు. ఒక్కొక్క కళను ఆ కళాసంబంధమైన మంత్రంతో శంఖతీర్థంలోకి ఆహ్వానించి, ఆ పవిత్రతీర్థాన్ని రాగి లేక వెండికలశంలోకి పోస్తారు. 96 కళలను ఆహ్వానించాక, ప్రధాన దేవతను - ఏపేరుతో భావిస్తామో ఆపేరుతో శంఖతీర్థంలోకి ఆహ్వా నించి, ఆ తీర్థాన్నికూడా కలశం లోకి పోస్తారు. ఆ శంఖతీర్థం గంధజలం అయి ఉండాలి. ఇలా ఆహ్వానించాక కలశంపై నారికేళం ఉంచి, అలంకరించి, సాకార దేవతగా భావించి, తొమ్మిది రోజులూ పూజలు నిర్వహిస్తారు. అలంకారా లన్నీ స్త్రీపరంగానే ఉంటాయి. ఈ మూర్తులన్నీ అమ్మ వారికే సంబంధించినవి! దేవీ పూజతోపాటు ఈ తొమ్మిది రోజులూ సువాసినీపూజ(ముత్త యిదువలకు) కూడా చేస్తారు. సువాసినులు అమ్మవారిరూపాలు. ఇలా తొమ్మిదిరోజులూ చేయ లేనివారు మూలానక్షత్రంనాటి నుండైనామొదలుపెట్టి మూన్నాళ్లూ పూజలు తప్పక చేయాలి. సాధా రణంగా ఈ నవరాత్రపూజలు జంతుబలి లేకుండా- సాత్త్విక విధానంలోనే ఉంటాయి. విజయదశమి-పరాశక్తి దుష్టశక్తులపై సాధించినవిజయానికి కృతజ్ఞతగా నిర్వహించేపూజాపర్వ దినమే! ఆశ్వయుజశుద్ధదశమి - సాయంకాలం- శ్రవణా నక్షత్రంతో కూడినముహూర్తానికి 'విజయముహూర్తం'అని పేరు. ఇది నక్షత్రోదయసమయం!

**అశ్వయుక్ శుక్లదశమీ విజయాఖ్యాౖఖిలే శుభా।**

**ప్రయాణేతు విశేషేణ కిం పునః శ్రవణాన్వితా ॥**

### ఆధ్యాత్మికస్ఫూర్తి

**పరమపవిత్రమైన మాతృభావన స్థిరపడడానికి ఈ దేవీనవరాత్రపూజలు తోడ్పడతాయి. అనేకసమస్యలతో, ఆందోళనలతో, ఆలోచనలతో మనస్సులో చేరిన అహంకారం, స్వార్థం, ఈర్ష్య, అసూయ మున్నగు దుర్గుణా లనేరాక్షసభావాలు నశించి, నిర్మలమనస్సు ఏర్పడుతుంది. మానవుడు తొమ్మిదిరోజులలో తొమ్మిదిఆవరణాలు దాటి - పదవదైన దేవీతత్త్వంలో ఆనందించడం ఇందలిపరమార్థం! బొమ్మల కొలువుకూడా విశ్వేశ్వరియొక్క విరాడ్రూపానికి సంకేతమే! పంచసంఖ్యాకఇంద్రియాదులూ, మనోబుద్ధి చిత్తాహంకారాలు తమ తమ స్వేచ్ఛాప్రవృత్తుల్ని అణచుకొని, షడ్గుణసంపత్తితో అభ్యుదయాన్ని పొందడమూ ఈ 9+1=10 రోజుల 'దసరా' పండుగవిశేషం! నవరాత్రులు సర్వదేవతాపూజా సమాహారరూపాలు.**

ఆశ్వయుజశుక్లదశమి 'విజయ' అనే పేరు గలది. ఇది సర్వకార్యాలకు శుభప్రదమైంది. ఆ రోజు శ్రవణానక్షత్రయుక్త మయితే మరింతమంచి దని జ్యోతిశ్శాస్త్రం పేర్కొన్న దని ధర్మ సింధుకారుడు వివరించాడు. విజయ దశమికి వారంతో నిమిత్తం లేదు. అది ఏ వారమైనా సరే! సకలవిధ ప్రయాణాలకూ, శుభకార్యాలకూ శుభప్రదం!! ముఖ్యంగా 'జయ' సమయం అంటే- సాయం కాలం-నక్షత్రోదయం - శ్రవణా నక్షత్రం - దశమీతిథి ఉన్నవేళ - చాలా మంచిది.

ఈ రోజు సాయంకాలం అమ్మవారిని పూజించి, విజయో త్సవం చేయడం, 'పార్వేట' ఉత్సవం నిర్వహించడం, శమీ-జమ్మిచెట్టును పూజించడం జరుగు తాయి. శమికి 'అగ్నిగర్భ' అని పేరు. 'శమీ' అంటే దోషాల్ని నాశం చేసేది - అని వ్యుత్పత్తి. దీనికే 'శివా'-శుభస్వరూపమైంది అనీ పేరు. పాండవులు అజ్ఞాత వాసప్రారంభంలో తమఆయు ధాలు శమీవృక్షంపైన్నే ఉంచారు. అందువల్ల తరువాతియుద్ధంల్లో సర్వత్ర విజయు లయ్యారు. అప్పటినుంచీ సకలకార్యవిజయం కోరు కొనేవాళ్లు విజయదశమిరోజు శమీవృక్షాన్ని పూజించి, ఆ చెట్టు ఆకులు తాకే సంప్రదాయం ఏర్పడింది. ప్రతిదినం ఉదయ సాయంకాలాల్లో శమీవృక్షానికి ప్రదక్షిణాలు చేస్తే- శరీరం ఆరోగ్యంగా ఉండడమే కాక-మనస్సుకూడా ప్రశాంతంగా ఉంటుంది. ఈచెట్టు 'అగ్నిగర్భ' కనుక దీనిగాలి, స్పర్శ సోకినా శీతలం తగ్గి, ఉష్ణశక్తి పెరుగుతుంది. శరీరంలో ఉండే విష క్రిములు నశిస్తాయి. ఏల్నాటిశని మున్నగుశనిబాధ లుండే

వాళ్లు శమీవృక్షాలకు ప్రదక్షిణంచేయడంవల్ల శనిప్రభావం చాలావరకూ తగ్గుతుంది.

### శమీవృక్షంపుట్టుక

సృష్టికర్త ఒక్కొక్క వస్తువునే సృష్టిస్తూ అగ్నినికూడా సృష్టించాడు. అగ్ని తనప్రభావాన్ని చూపించి, ప్రజాపతినే కాల్చేయసాగింది. అందుకు ప్రజాపతి భయపడి, అగ్నిని శమింపజేసేందుకు ఒక పచ్చనిచెట్టును సృష్టించి, దాని కొమ్మలతో కొట్టి, అగ్నిని శాంతింపజేశాడు. ఇలా అగ్నిని శమింపజేయడానికి ఉపయోగించినవృక్షమే శమీవృక్షం! ఈ విషయం మైత్రేయసంహిత, శతపథబ్రాహ్మణం-కథకసంహిత, కపిష్ఠలకథాసంహితలలో పేర్కొనబడిం దని పెద్దలసూచన. శమీ వృక్షాన్ని పూజిస్తూ...

**శమీ శమయతే పాపం, శమీ శత్రువినాశినీ।**
**అర్జునస్యధనుర్ధారీ రామస్యప్రియదర్శినీ।**
**కరిష్యమాణయాత్రాయాం యథాకాలం సుఖం మయా।**
**తత్ర నిర్విఘ్నకర్త్రీ త్వం భవ శ్రీరామపూజితే॥**

- అనే శ్లోకాన్ని పఠిస్తారు. "ఓ శమీవృక్షమా! నీవు పాపాన్ని పోగొట్టావు. శత్రువుల్ని కూల్చేస్తావు. నీవు అర్జునుని ధనుర్బాణాలను ధరించినావు. శ్రీరామునికి ప్రియమైన దర్శనం చేకూర్చినావు. నేను చేస్తున్న ఈ యాత్రలో తగినసమయంలో నాకు సుఖాన్నీ, నిర్విఘ్నతనూ చేకూర్చి, విజయాన్ని అను గ్రహించు" అని ప్రార్థించాలి.

ఇలా పూజించి, శమీపత్రాలు తెచ్చి, పెద్దల కిచ్చి, నమస్కరించి, వారిద్వారా శుభాశీస్సులు పొందుతారు. విజయ దశమికే "అపరాజితాదశమి" అనీ పేరు. ధర్మసింధుకారుడు 'అపరాజితా' పూజను వివరించాడు. ఈ దేవతను పూజించడం వల్ల విజయాలు సిద్ధిస్తాయి. కనుక విజయదశమినాడు ఏ పూజ, ఏపనీ ప్రారంభించినా తప్పక సఫలం అవుతుంది.

విజయదశమీతిథి లక్ష్మీస్వరూపిణి. ఈ రోజు దేవిని పూజించడంవల్ల లక్ష్మీదేవి ఇతోఽధికంగా అనుగ్రహిస్తుంది. విజయప్రాప్తి, సరస్వతీకృప- ఇలా లక్ష్మీసరస్వతులు ఒకే చోట ప్రాప్తించడంతో పాటు- శారీరకమానసికశక్తిసామర్థ్యాలు కూడా అపరాజితాదుర్గాదేవివల్ల చేకూర్తాయి.

## నవవిధ భక్తిలక్షణములు

1) శ్రవణం
2) కీర్తనం
3) స్మరణం
4) పాదసేవనం
5) అర్చనం
6) వందనం
7) దాస్యం
8) సఖ్యం
9) ఆత్మనివేదనం

## పిల్లలూ... జతచేయండి!!

| | |
|---|---|
| 1) విష్ణువు | అ) నెమలి |
| 2) వినాయకుడు | ఆ) గరుత్మంతుడు |
| 3) సుబ్రహ్మణ్యస్వామి | ఇ) నంది |
| 4) శివుడు | ఈ) సింహం |
| 5) దుర్గాదేవి | ఉ) ఎలుక |

జవాబులు:
1-(ఆ); 2-(ఉ); 3-(అ); 4-(ఇ); 5-(ఈ)

## మీకు తెలుసా?

1) సుప్రభాతాన్ని రచించిం దెవరు?
2) వేంకటాచలమాహాత్మ్యం తెలుగులో రచించెం దెవరు?
3) శ్రీవారి వక్షఃస్థలంపై ఉండే అమ్మవారిపేరేమి?
4) తిరుమలక్షేత్రాన్ని మోకాళ్లతో అధిరోహించిం దెవరు?
5) శ్రీవారిబంగారుబావిని నిర్మించిం దెవరు?
6) మనవాళ పెరుమాళ్ అని పిలువబడే మూర్తి ?
7) తిరుమల శ్రీవారినిత్యకల్యాణోత్సవాన్ని ప్రారంభించిం దెవరు?

జవాబులు:
1) హస్తిగిరినాథన్ (ప్రతివాదిభయంకర అణ్ణన్)
2) తరిగొండ వెంగమాంబ
3) వ్యూహలక్ష్మి
4) శ్రీరామానుజాచార్యులు
5) రంగదాసు
6) భోగశ్రీనివాసమూర్తి
7) అన్నమయ్య

## కనుక్కోండి...!

ఈ అక్షరాలతో ఒక 'సూక్తి' వస్తుంది.

నుం ష్టా క్కిం మా గ న్నా ర్గం క గ ట్టె చే మే స్మ ణ ల డి భ వ మ ర

జవాబు: కష్టాలనుండి గట్టెక్కించే మార్గం భగవన్నామస్మరణమే

## ఈ శ్లోకం.. మీ కోసం..

**కరాగ్రే వసతే లక్ష్మీః । కరమధ్యే సరస్వతీ ।**
**కరమూలే స్థితా గౌరీ । ప్రభాతే కరదర్శనమ్ ॥**

**భావం –** నిద్రనుండి లేవగానే దేవుణ్ణి తలచుకోవడం నేర్చుకోవాలి. లేదా ఎదురుగా ఉన్న దేవుడిఫోటోకు (పటానికి) నమస్కరించాలి. రెండుచేతుల్నీ రుద్దుకొని, కళ్లు పులుముకొని, ప్రశాంతమైనమనస్సుతో – వేళ్ల చివరలో లక్ష్మీదేవి, అరచేతిలో సరస్వతీదేవి, చేతిమొదట్లో పార్వతీదేవి నెలవై ఉంటారు. ప్రభాతసమయంలో అరచేతిని చూచుకొంటే – ఈ ముగ్గుర్నీ స్మరించిన ట్లవుతుంది.

వైజ్ఞానికంగా అరచేతులరాపిడివల్ల ఒకరకమైన విద్యుత్తు ఏర్పడుతుంది. రాత్రి నిద్రించినకళ్లు పూర్తిగా చైతన్యవంతం కావడానికి ఈ అరచేతులవిద్యుత్తు కళ్లకు రుద్దుకొని, పిదప అరచేతిని చూడడంవల్ల కంటి నుంచి వెలువడే విద్యుత్తు మనఅరచేతిపైననే పడుతుంది. మనం అరచేతిని లక్ష్మీ, సరస్వతీ, గౌరీస్వరూపంగా భావించడంవల్ల ఆ రోజంతా శుభమే జరుగుతుంది.



బాలప్రబోధం

# స్వామి మెచ్చిన మట్టిపూలు

పి. హేమచంద్రబాబు

ఆ వేళ రెండవ శ్రావణశనివారం. తాతయ్య ఉదయాన్నే లేచి అనుష్ఠానం పూర్తిచేసుకొని, పూజకు, సిద్ధ మయ్యారు. ఎదురుగుండా చూచేసరికి రాము, సీత, యశోద అందరూ గదిముందు కూర్చొనున్నారు.

తాతయ్య కెంతో ఆశ్చర్యమేసింది. "ఏమిట్రా! పొద్దున్నే అందరూ కలసికట్టుగా వచ్చారు" అని ఏమీ తెలియనట్టడిగారు తాతయ్య!

తాతయ్యా! ఒకసారి చెబితే తెలుసుకోలేమా! ఈ వేళ రెండవ శ్రావణశనివారం. మాకు తెలియ దనుకొన్నారా? అంది సీత.

"తాతయ్యా! ఈ వేళకూడా స్వామికథ లేవైనా చెప్పరూ!" అని అడిగాడు - రాము.

"ఆ! ఆ! తప్పక చెబుతాను. ముందు పూజకానీ" అన్నారు - తాతయ్య.

***శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్,***
***ప్రసన్నవదనం ధ్యాయేత్ సర్వవిఘ్నోపశాంతయే***

- అని మొదలెట్టారు.

పూజ పూర్తయింది. తాతయ్య హారతి అందరికీ అందించారు.

ప్రసాదం యశోద కందిస్తుంటే....

"మామయ్యా! కొండమీదగుడిలో వంటశాలలో మట్టికుండలే కనిపిస్తుంటాయి కదా! స్వామి శ్రీమంతుడైనప్పుడు ఆ మట్టికుండ లెం దుకు? చెప్పరూ?" అని అడిగింది యశోద.

"తాతయ్యా! నాకూ అదే సందేహం. కుండలు సగానికి పగలగొట్టి వాటిలో ప్రసాదం ఎందుకు పెడతారు? పైగా 'ఓడు' ప్రసాద మని అర్చకు లంటూంటే విన్నాను. దానికి కారణ మేమిటో చెప్పండి" అని అడిగింది- అప్పుడే వచ్చిన పక్కింటి ఆండాలమ్మ.

ఆ! ఆ! యశోద అడిగిన ప్రశ్నకు ఆండాళమ్మ అడిగిన ప్రశ్నకు ఒకటే సమాధానం; దీనికంతా కారణం 'కురువనంబి'. ఆ కథ మీకు చెబుతాను.

తమిళంలో కురువర్ (కుయవర్) అంటే కుమ్మరివాళ్ళని అర్థం. సంఘంలో ఆ నాటికి కుమ్మరివాళ్ళంటే చాలా గౌరవం. పెళ్ళిలో నాగవల్లికుండలు తెచ్చి, గౌరవాలందుకొనే మొదటి వ్యక్తి ఈ రోజుల్లోనూ కుమ్మరివాడే. కుమ్మరులలో భగవద్భక్తు లెందరో ఉన్నారు. శైవుల్లో కుమ్మరి గుండయ్య చాలా ప్రసిద్ధుడు. వితలుని భక్తుల్లో కూడా కుమ్మరివాళ్ళు ఎందరో ఉన్నారు.



అలాంటి కుమ్మరి వా డొకడు వేంకటేశ్వర స్వామిభక్తుడై ఉండే వాడు. అతని అసలు

పేరేమిటో తెలియదు. శ్రీనివాసుణ్ణి త్రికరణశుద్ధిగా నమ్మినవాడు కావడంవల్ల అతనికి 'కురువనంబి' అని పేరు. అతడు తిరుమల కొండకు దగ్గరగా ఉండేవాడు.

ఆ! అన్నట్టు చెప్పడం మరిచాను.

ఆ రోజుల్లో కొండమీద రక్షణ అంతంతమాత్రమే! స్వామిని సేవించేవారు తప్ప మిగిలిన వారంతా రోజూ తిరుపతి నుండే వెళ్ళేవారు. అంచేత విలువైనవస్తువులు ఆలయంలో పెట్టేవాళ్ళు కాదు. కుండల్లోనే వంటలుచేయడం అలవాటు. ఇప్పటికీ బీదా బిక్కీ కుండల్లో చేయడం మీకు తెలుసుకదా! కుండల్లో చేసినవంట రుచిగాను, శుచిగానూ ఉంటుంది. అదిగాక పగిలినా ఇబ్బంది లేదు. పోయినా పెద్దనష్టమూ లేదు. అంచేత గుడిలో కుండలకే ప్రసిద్ధి. 'ఓడు' అంటే పెంకు అని అర్థం. మనిషి ఎంతధనవంతుడైనా సామాన్యుడుగా భావించు కొని ఓడులో తినాలని నియమం. దీనివల్ల దేవాలయంలో సర్వసమానత్వం అని భావించడానికి వీలుంటుంది అంటుంటే ఆ కథ చెప్పవూ? అని గుర్తుచేశాడు - రాము.

ఆగండ్రా! కథకే వస్తున్నా.

నంబి స్వామివారికోసం కుండలు చేసేవాడు. ఉదయం లేచింది లగాయితూ మట్టి తెచ్చుకోవడం, దాన్ని కొట్టడం, నీళ్ళువేసి కాళ్ళతో త్రొక్కడం, పదును వచ్చేటట్టు చేయడం, సారెమీద పెట్టి, కుండలు చేయడం, ఆపై ఎండలో పెట్టడం. ఆ తరువాత అవంలో పెట్టడం, ఆపై భద్రంగా ఒకచోట పేర్చడం నంబి అనుదినచర్య.

చెరువు త్రవ్వడానికి అనంతాళ్వారుకు భార్య ఎలా సహాయపడేదో; నంబికికూడా భార్య అలాగే సహాయపడేది.

> **తిరుమలలో శ్రీవారి దర్శనానికి ముందు,**
> **శ్రీవారిపుష్కరిణిచెంత వున్న**
> **శ్రీ వరాహస్వామివారిని దర్శించాలి.**
> **ఇది అనాదిగా వస్తున్న సంప్రదాయం.**

ఎడతెగని పనులవల్ల నంబిదంపతులకు ఎక్కడికీ వెళ్ళేదానికి వీలు పడేదికాదు. కనీసం శనివారమైనా వేంకటేశ్వరస్వామిని దర్శించుకోలేకపోయేవారు. అంచేత కొయ్యతో శ్రీనివాసుని బొమ్మ చెక్కించుకొని కుండలు చేశాక, మట్టితో పువ్వులు చేసి, స్వామికి అర్పించేవాడు.

ఆ రోజుల్లో ఈ ప్రదేశానికి రాజు 'తొండమాన్' చక్రవర్తి. అసలు ఆ రాజు పేరుకూడా తెలియదు. తమిళంలో 'తొండన్' అంటే సేవకు డని అర్థం. ఆ రాజు స్వయాన స్వామికి బంగారుపూలతో తొలిపూజ చేసేవాడు.

స్వామిని ముందు సేవించే భక్తుడు తానే నని, బంగారు పూలతో పూజచేసేశక్తి తనకే ఉం దని రాజుగారి కెంతో గర్వం. స్వామికరుణాకటాక్షాలు తనమీదే ఉన్నా యని లోలోపల తొండమాన్‌కు గర్వంకూడా!

ఓరోజు ఉదయాన్నే తొండమాన్ గుడిలోపలికి వెళ్ళాడు. బంగారుపుష్పాలు సమర్పిస్తుంటే– అక్కడ మట్టిపూలు కన్పిం చాయి.

రాజుకు పట్టరానికోపం వచ్చింది. ఆలయార్చకుల్ని ఆయన గదమాయించాడు. అయితే అర్చకులు తమ కేమీ తెలియ దని చేతులుజోడించారు.

రాజు సైనికుల్ని పిలిచాడు. "సైనికులారా! స్వామి పాదాలమీద బంగారుపూలు కా దని, మట్టిపూ లుంచిన మనిషిని పట్టుకోవాలి. ఈ గుడిదరిదాపుల్లో లేదా ఈ ఏడు కొండల్లో ఎక్కడున్నా ఆ వ్యక్తిని పట్టుకోండి. ఇది మాకు తీరని అవమానం" అని గర్జించాడు.

సైనికులు తలో దిక్కు కదిలారు.

దూరంలో కుమ్మరమండపం కనిపించింది. సైనికులు చరచరా కదలివెళ్ళారు.

అక్కడ నంబి కొయ్య శ్రీనివాసునిముందు మట్టిపూలు సమర్పిస్తున్నాడు. ఆ దృశ్యం చూసేసరికి ఆ నంబిని శిక్షించడమా లేదా బందీచేయడమా తెలుసుకోలేక సైనికులు సరాసరి రాజు దగ్గరికే వచ్చారు.

"మహారాజా! మీ ఆజ్ఞ ప్రకారం కొండంతా గాలించాం. దూరంలో కురువరతినంబి అనే కుమ్మరివాడున్నాడు. అతడే ఆలయానికి కుండలు సమకూర్చేవాడు. మీ ఆజ్ఞ అయితే అతణ్ణి హతమారుస్తాం" అని చెప్పారు. తొండమాన్ ఆశ్చర్యపడ్డాడు.

"ఆగండి! ఆగండి అఘాయిత్యం చేయకండి. ఆ భక్తుణ్ణి మేమే స్వయంగా సందర్శిస్తాము దారి చూపండి" అంటూ కదిలారు.

రాజు కదిలేసరికి మంత్రి అనుసరించాడు. సైన్యాధిపతి అడుగులు వేశాడు. సైనికులుకూడా అనుసరించారు. వీరందరూ కుమ్మరమండపం చేరుకున్నారు.

తనపనిలో నిమగ్నమయిన నంబి ఇవేమీ పట్టించు కోలేదు.

కుండలు చేస్తూనే ఉన్నాడు. మాటిమాటికి శ్రీనివాసుణ్ణి స్మరిస్తూనే ఉన్నాడు. నంబి 'మండపం' దగ్గరలో కొయ్య శ్రీని వాసమూర్తి కనిపించాడు. ఆ మూర్తిపాదాల దగ్గర మట్టిపూలు కనిపించాయి. రాజు ఆశ్చర్యపడ్డాడు. సరాసరికుమ్మరికేసి నడిచాడు. అతనిపాదాలు పట్టుకున్నాడు.

"నంబీ! నీవే ధన్యుడివి. ఆ శ్రీనివాసుడు మెచ్చినభక్తు డివి. నా పూలు కా దని నీ మట్టిపూలనే స్వామి ఎన్నుకొన్నాడు. నాకు ఆ స్వామిఅనుగ్రహం తప్పింది. ఆ స్వామి కరుణాకటా క్షాలకై వేచి ఉన్నాను. ఆ భాగ్యం ప్రసాదించు" అంటూ ప్రార్థించాడు. నంబి దిగ్భ్రాంతు డయ్యాడు.

మహారాజంతటివాడు తన పాదాలపైపడడం ఊహిం చనిసంఘటన.

"మహారాజా! మీరు క్షత్రియులు. 'దుష్టశిక్షణ శిష్టరక్షణ' మీ కర్తవ్యం. ఇతరులకు సేవ చేయడం మా బాధ్యత. మీలాంటి వారు నా పాదాలపైబడడం న్యాయంకాదు.

ఉన్నవాళ్ళు తమ కలిమితో స్వామిని సేవిస్తే-నా లేమితో నేను దూరంగానే ఉంటూ స్వామికి మట్టిపూలు అర్పించాను. మీరే భాగ్యవంతులు. రోజూ స్వామిని తనివితీరా సందర్శించే భాగ్యం మీకుంది. బంగారుపూలతో అర్చించే సౌకర్యంకూడా మీకుంది. నాకా భాగ్యం లేదు. నన్ను క్షమించండి" అంటూ వెనుకడుగు వేశాడు కుమ్మరి.

"నీవే అదృష్టవంతుడివి" అన్నాడు - మహారాజు.

"కాదు మీరే భాగ్యవంతులు" అన్నాడు - కుమ్మరి.

ఇలా ఒకరికొకరు సంవాదించుకుంటూండగా కొయ్య శ్రీనివాసుడు స్వీయరూపంలో ప్రత్యక్షమయ్యాడు.

"భక్తులారా! మీరిద్దరూ భాగ్యవంతులే! ఇద్దరూ నాకు బిడ్డల్లాంటివారే. మీ కైంకర్యం పవిత్రమైంది. ఇద్దరిసేవలూ నేను మెచ్చినవే! చక్రవర్తి అహంకారం పోవడానికోసం నేనే ఈ పరీక్షచేశాను. ఈ పరీక్షలో మీరిద్దరూ నెగ్గారు" అన్నాడు స్వామి.

"స్వామీ! ఈ దీనుణ్ణి కటాక్షించడంకోసం ఆనంద నిలయంనుండి వచ్చావా! మహారాజు బంగారు పుష్పాలకంటే నా మట్టిపూలు నచ్చాయా? అదృష్టవంతుణ్ణి స్వామీ" అంటూ స్వామి పాదాలపై పడ్డాడు- కురువనంబి.

"భక్తుల్లారా! మీరిద్దరూ భక్తులే. సందేహం లేదు. రండి, మీకు ముక్తి ప్రసాదిస్తున్నాను. వైకుంఠంలో శాశ్వతంగా ఉండండి" అని వారిని తనలో చేర్చుకున్నాడు- ఆ శ్రీనివాసుడు.

దీనికి గుర్తుగా ఇప్పటికీ కొండ ఎక్కే కాలిబాటలో కుమ్మరమండపం చిత్రాలు కనిపిస్తాయి. నాగరికత ఎంత మారినా ఇప్పటికీ గుడిలో కుండల వాడకం ఉండనే ఉంది అని కథ చాలించాడు- తాతయ్య.

"తాతయ్యా! ఈసారికొండకు నడచివెళదాం. అక్కడ కుమ్మరిమండపం చూపిస్తావా? అంటూ ప్రాధేయపడుతూ అడిగాడు- రాము.

"అలాగే! అలాగే! తప్పక చూద్దాం. ఈ కురువనంబినే తాళ్ళపాక అన్నమయ్యకూడా స్తుతించాడు. ఆ పాట విందురు గాని" అంటూ మొదలెట్టాడు.

**కొండలలో నెలకొన్న కోనేటి రాయడువాడు**
**కొండలంత వరములు గుప్పెడు వాడు**
**కుమ్మరదాసుడైన కురువరతినంబి**
**యిమ్మన్న వరములెల్ల నిచ్చినవాడు**

# బొమ్మల కొలువు

– డా॥ పురాణపండ వైజయంతి



బొమ్మలకొలువు తెలుగువారిచాలా పండుగల్లో ప్రధానపాత్ర వహిస్తుంది. సంక్రాంతి,దసరా, దీపావళి... ఈ పండుగల్లో బొమ్మలకొలువు పెట్టుకోవడం చూస్తుంటాం. దసరాకు ముఖ్యంగా బెంగాలీలు బొమ్మలకొలువు ఏర్పాటు చేస్తారు. దసరా, సంక్రాంతిపండుగలకుమాత్రం తెలుగువారు బొమ్మలకొలువుపద్ధతిని పాటిస్తారు. బొమ్మలకొలువు అంటే బొమ్మలను ఒకపద్ధతిలో వరుసగా, అందంగా, కళాత్మకంగా పేర్చడ మన్నమాట. బొమ్మ అంటే ఆటవస్తువు అనే అర్థం వాడుకలో ఉంది. బొమ్మ అనేపదం బ్రహ్మశబ్దానికి వికృతి కూడ! అంటే బొమ్మ అనేపదం బ్రహ్మకి అచ్చతెలుగు పద మన్న మాట. అంటే స్థూలంగా 'బొమ్మలకొలువు' అంటే బ్రహ్మగారిసభ అని అర్థం. బ్రహ్మ సృష్టికర్త కనుక సమస్తమైన సృష్టి ఆయన కొలువులో ఉంటుంది. ఈ బ్రహ్మగారిసభకు ప్రతిబింబంగా బొమ్మలను అందంగా తీర్చిదిద్దటమే బొమ్మలకొలువు.

**బొమ్మల సేకరణ -** ఏడాది కోసారిమాత్రమే పెట్టే బొమ్మల కొలువుకోసం, సంవత్సరమంతా బొమ్మలను, బొమ్మలకొలువుకు కావలసిన వస్తువులను సేకరిస్తూ ఉంటారు. వారివారిఅభిరుచుల మేరకు రకరకాలబొమ్మలను, మార్కెట్‌లోకి కొత్తగా వచ్చిన బొమ్మలను... ఇలా రకరకాలుగా సేకరిస్తుంటారు. ఇవి స్త్రీలలో పిల్లల్లో ఉన్నకళాత్మకతను, సృజనాత్మకతను వెలికి తీస్తుంది. బొమ్మలఅమరికలో వారివారిపరిజ్ఞానం వ్యక్తమౌతుంది. సాధారణంగా ప్రకృతిలో సంభవించినవిలయాలు కాని, కొత్త కొత్త ఆవిష్కరణలు కాని, రాజకీయాలలో చోటుచేసుకున్న అంశాలు కాని... ఇటువంటివి బొమ్మలకొలువు పెట్టడానికి ముందు కనుక సంభవిస్తే వాటిని ప్రతిబింబించేలా బొమ్మలకొలువు ఉంటుంది. సునామీవంటివి సంభవించినసమయంలో నైతే, సముద్రం ఉప్పొంగుతున్నట్టు, ఆ అలలతాకిడికి చనిపోయిన వారిశవాలను ప్రతిబింబించేలా తయారుచేస్తారు. అలాగే కంప్యూటర్‌లు లేదా సెల్‌ఫోన్‌లు కొత్తవి వస్తే, వాటికి కూడా బొమ్మలకొలువులో స్థానం కల్పిస్తారు.

**అమరిక -** బొమ్మలకొలువుకోసం పేర్చేమెట్లసంఖ్య, ఏ మెట్టు మీద ఏ రకం బొమ్మలు ఉండాలో శాస్త్రం నిర్ణయించింది. మెట్ల సంఖ్య తొమ్మిది ఉండా లని శాస్త్రం నిర్దేశించింది. దసరా పండుగను నవరాత్రి ఉత్సవాలుగా జరుపుకోవడం ఆనవాయితీ! అంటే ఈ తొమ్మిదిమెట్లు దసరాలలో నవావరణాలకు సంకేతంగా ఉంటుంది. ఈనియమం సంక్రాంతికి పెట్టే బొమ్మలకొలువులలో ఉన్నట్టు కనిపించదు. ఏమైనా బేసిసంఖ్యలో మెట్లుండా లనేమాట పండితు లందరూ ఏకాభిప్రాయంగా చెబుతారు.

**ఏ మెట్టుపై ఎవరు.... -** అన్నిటికన్నా పైన దేవతావిగ్రహాలను అమర్చాలి. అన్నిటికంటె కిందమెట్టుమీద జలచరాలు ఉండాలి. ఆపైన భూచరాలు అమర్చాలి. ఈ విధానం చూస్తే, సృష్టి పరిణామక్రమంలోని వరుస కనపడుతుంది. బొమ్మలు ఎన్ని పెట్టినా పసుపుగౌరీదేవిని, పసుపు వినాయకుడిని చేసి, వారిద్దరినీ ప్రార్థించడం తప్పనిసరి, నియమాలు... ఈ అమరికలోకూడా కొన్నినియమా లున్నాయి. బొమ్మలను ఒకసారి పెట్టాక – మళ్ళీ



ఆయాబొమ్మల స్థానాలను మార్చడం, కొత్తబొమ్మలు చేర్చటం, అమర్చినబొమ్మలను ముట్టుకోవటంవంటివి చేయకూడదు. బొమ్మలకు రెండుపూటలా ధూపదీపనైవేద్యాలతో పూజ చేసి, హారతి ఇవ్వాలి. ఉదయంపూట పులగం వండి, నివేదన చేయాలి. బొమ్మలను తొమ్మిదిరోజులు పూర్తిగా ఉంచడం కష్టం అనుకుంటే, కనీసం మూడురోజులుగాని, ఐదురోజులుగాని ఉంచాలి. ఎన్నిపాతబొమ్మలు ఉన్నప్పటికీ, ప్రతిసంవత్సరం కనీసం ఒకకొత్తబొమ్మయినా పెట్టాలి.

**సాంఘికంగా... -** ఇటువంటివి సాంఘికకార్యక్రమాల జాబితాలోకి వస్తాయి. ఈ కార్యక్రమాలవల్ల పిల్లల్లో సృజనాత్మకత పెరుగుతుంది. భక్తిశ్రద్ధలతో, క్రమశిక్షణతో పూజ చెయ్యటం అలవాటవుతుంది. ఇరుగుపొరుగుల ఇళ్లకు వెళ్లటం, వారిని మన ఇంటికి పేరంటానికి పిలవటంవల్ల సత్సంబంధాలు ఏర్పడతాయి. బొమ్మలపేరంటానికి వెళ్లి, ఒకరు పెట్టినవి మరొకరు చూచి మెచ్చుకోవటం, నేర్చుకోవటం ఉంటాయి. పేరంటానికి వచ్చినవారిని గౌరవంగా ఆదరించడం అలవాటవుతుంది. వచ్చినస్త్రీలకు మర్యాదలతో పసుపు, కుంకుమలు ఎలా ఇవ్వా లన్నది నేర్చుకుంటారు. వాయనాలు ఇవ్వటంద్వారా ఇతరులతో తనకున్న వాటిల్ని పంచుకోవటం అలవా టవుతుంది. నిజానికి పిల్లలపండుగ కనుక వారిలోని సృజనాత్మకత వ్యక్తం అవుతుంది. ఉన్నబొమ్మ లన్నింటినీ ఏదోవిధంగా ఒకచోట చేర్చటంకాక కొత్తకొత్తపద్ధతిలో పేర్చి, తమనైపుణ్యాన్ని ప్రదర్శించా లనుకుంటారు. ఇందువల్ల వారిమెదడు చురుకుగా పని చేస్తుంది.

దేవుడిబొమ్మలను అన్నింటికన్నా ఎత్తైనమెట్టుమీద పెట్టి, మిగిలినవాటిని రకరకాలతీరుల్లో అమర్చుతారు. ఒకప్పుడైతే ఒకచిన్నగ్రామం, తిరుపతివంటి ప్రముఖదేవాలయాల నమూనా, తోట, జంతుప్రదర్శనశాల, అంగడి, నృత్యహేల, రాసలీల, వాద్య విన్యాసం, కోట, రాజుగారికొలువు, దశావతారాలు... వంటివి ఎన్నో ఉండేవి. ఇప్పుడు అన్నింటితో పాటు బొమ్మలకొలువుల్లో కూడా మార్పు చోటుచేసుకుంది. దేవుడివిగ్రహాలతోపాటు దేశభక్తులు, స్వాతంత్ర్యోద్యమనాయకులు, శాస్త్రవేత్తలు, జంతువులతోపాటు కార్లు, స్కూటర్లు, రైళ్లు, విమానాలు, ట్యాంకులు, రాకెట్లు, సెల్‌ఫోన్‌లు, టీవీలు, సెల్‌టవర్లువంటివికూడా బొమ్మల కొలువులో వచ్చి, కూర్చుంటున్నాయి. స్వాతంత్ర్యోద్యమం, ఉప్పుసత్యాగ్రహం, కార్గిల్‌యుద్ధం, పారిశ్రామికప్రదర్శన, సైన్స్ ఫేర్ వంటిదృశ్యాలు బొమ్మలకొలువులో భాగమవుతున్నాయి... క్రికెట్ మ్యాచ్, సినిమాషూటింగ్ దృశ్యాలుకూడా కనువిందు చేస్తున్నాయి. వీటికోసం ఎంతగానో ఆలోచించి, తగిన సరంజామా సేకరించి, సర్దిపెట్టడం సామాన్యమైనవిషయం కాదు అన్నీ ఆయనసృష్టిలో భాగమే...

కొలువులో అమర్చిన బొమ్మ లన్నీ బ్రహ్మ సృష్టించినవే నని అర్థం చేసుకోవాలి. అంటే... మానవులు, జంతువులు, చెట్లు, నీరు, ఇతరవస్తువులూ అన్నీకూడ భగవంతునిసృష్టి అని అర్థం చేసుకోవడమే బొమ్మలకొలువు అంతరార్థం- అని అర్థం చేసుకుని అన్నింటినీ, అందరినీ సమదృష్టితో చూడటం అలవాటు చేసుకోవటానికి ఇది ప్రాతిపదిక అవుతుంది. ఆ పైన ఈ ప్రపంచం అంతా ఆ బ్రహ్మకొలువే అనే అర్థంచేసుకోవటానికి ఇది మొదటిమెట్టు అవుతుంది.

**త్రిగుణాత్మకం... -** బొమ్మలఅమరికలో త్రిగుణాలు కనిపిస్తాయి. పై మెట్లపై దేవుళ్లబొమ్మలను ఉంచుతారు. అన్నిటికంటె పై మెట్టుపై కలశం ఉంచుతారు. ఇది దేవీకరుణకు సూచనగా భావిస్తారు. వీటితోపాటుగా అమ్మవారిబొమ్మలుకూడా ఉంచే ఈ చోటును సత్త్వగుణానికి ప్రతీకగా నిర్వచిస్తారు. కింద ఉన్న మెట్లపై ప్రాపంచికజీవితానికి సంబంధించిన అంటే లౌకిక ప్రపంచానికి సంబంధించినబొమ్మలు ఉంచుతారు. తామసగుణానికి ప్రతీకగా వీటిని మధ్యలో అమరుస్తా రని పండితులు అంటారు. మధ్యభాగంలో క్షత్రియధర్మాన్ని ప్రతిబింబించే రాజు, రాణి, యుద్ధవీరులవంటిబొమ్మలు ఉంచుతారు. ఇవి రజోగుణానికి సంకేతం. ఈ మూడుగుణాలను అధిగమించటానికి దేవీకటాక్షం లభ్యమవుతుం దని అంటారు. ఇదీ బొమ్మలకొలువు తత్త్వం. మెట్లపై వేసేతెల్లనివస్త్రం స్వచ్ఛతకు, శాంతికి ప్రతీకగా నిలుస్తుంది. తెలుగువారు దసరాసంబరాలకు లేదా సంక్రాంతి, దీపావళి పండుగలకు బొమ్మలు పెట్టడం-అనే సంప్రదాయం- ఏదో ఒకసందర్భంగా అన్ని ప్రాంతాలవారికీ ఉం దని అర్థమవుతోంది.

## వాగ్గేయ రారాజు - త్యాగరాజు

**రచయిత:** శ్రీఆలూరు పద్మనాభయ్య,
**సైజు:** 1/8 డెమ్మిసైజు;
**పుటలు:** 74; **ధర:** రూ.50/-;

**దొరుకుచోటు:**
శ్రీఆలూరుశిరోమణిశర్మ,
ఇ.నెం.5-554, రేబాలవారివీధి,
స్టోన్ హౌస్ పేట, నెల్లూరు - 2,
సెల్:98856 61727.

**వా**క్కును గేయాన్ని స్వయంగా సమకూర్చ గలిగినవారు వాగ్గేయకారులు సాహిత్యంలో సరస్వతిని, మృదుమధురకవితారచనలో వాల్మీకిని, భక్తిలో ప్రహ్లాదుని, వేదాంతచర్చలో వ్యాసుని, సంగీతంలో నారదుని, రామభక్తితత్పరతలో పరమేశ్వరుని మెప్పించినవారు శ్రీత్యాగరాజస్వామి. హైందవసంప్రదాయమందలి ఉత్కృష్టమైన, అనేకవిషయాలు, వేదోపనిషత్తుల సారాంశాలు, పురాణేతిహాస ధర్మాలు, నీతులు తేటతెల్లముగా సంగీతసుధాపూరములుగా జేసి, మానవ లోకము తరించునట్లుగా కీర్తనలను గానముచేసి, ప్రపంచశాంతిని బోధించినవారు శ్రీత్యాగరాజస్వామి.

ఈ గ్రంథం త్యాగరాజస్వామి జీవితచరిత్రను ఆమూలాగ్రం వివరిస్తున్నది. త్యాగరాజస్వామికి చెందిన కొన్నిచిత్రాలుకూడా ఇందులో ఉన్నాయి. ప్రతి ఆధ్యాత్మికవేత్త, చారిత్రకపరిశోధకులు, సాహితీపిపాసువులు చదవితీరాల్సిన చక్కని గ్రంథ మిది. అక్కడక్కడా అక్షరదోషాలున్నా భావస్ఫోరణకు అడ్డురావు. ప్రచురణకర్తలు తదుపరిముద్రణలో జాగ్రత్తలు తీసుకుంటే సరిపోతుంది.

**- ఎం.నరసింహులు.**




## ఆముక్తమాల్యద

**రచన:** కోడూరు శ్రీపాండురంగారావు,
**సైజు:** డెమ్మిసైజు; **పుటలు:** 128;
**వెల:** రూ.180/-;

**ప్రాప్తిస్థానం:**
రచయిత,
ఇ.నెం.21/414-2, భాస్కరపురం,
మచిలీపట్నం - 521 001.

**తె**లుగుపంచకావ్యాలలో 'ఆముక్త మాల్యద'కు ఒక విశిష్టస్థానం ఉంది. ఈ కావ్యం వైష్ణవభక్తిపారమ్యాన్ని బోధించే ఉత్కృష్టగ్రంథం. అయితే, రాయలవారు నారికేళపాకంలో ఈ గ్రంథరచన చేయడంవల్ల, ఇది సామాన్యులకు ఇనుప గుగ్గిళ్ళరీతిలో కొరుకుడుపడదు! ఈ అంశాన్నే దృష్టిలో పెట్టుకొని 'కోడూరు శ్రీపాండురంగారావు' ఆముక్తమాల్యదను పండితపామరజనరంజకంగా, వ్యావహారికభాషలో తెనిగించారు. అధ్యాపకవృత్తిలో అనుభవంతో పాటు, ఆంధ్రభాషపై సాధికారాన్ని సాధించిన పాండురంగారావు, ఇంతకుముందు 'సాత్రాజితేయము', 'అశ్వమేధాది' గ్రంథాలు రచించారు. రచయిత ఈ గ్రంథరచనకు ఆముక్త మాల్యదనుమాత్రమే గ్రహించకుండా, 'ఆళ్వారుల చరిత్ర', 'శ్రీమద్భగవద్గీత' వంటి ఇతరగ్రంథాలనుకూడా ఉపయోగించుకొనుట ప్రశంసనీయం! ఔచిత్యదృష్టితో రచయిత మూలరచనలో కొన్నిమార్పులుచేయడం హర్షణీయం! అటువంటి మార్పులతో- పాండ్యరాజుచెల్లెలిని యామునాచార్యుడు పెండ్లాడినవిషయాన్ని పరిహరించడం, గోదాదేవి కాత్యాయనీవ్రతాన్ని ఆచరించడం ప్రధానం-అవసరార్థం కొన్నిపద్యాలను సరళశైలిలో రచించడం బాగుంది! రచయిత చాలాచోట్ల చిన్న వాక్యాలనూ, అలతి అలతి తెలుగుపదాలనే ఉపయోగించినా, కొన్నిచోట్ల 'తమస్వినీ చరాగ్రణి', 'మత్కృత దుష్కృతౌఘ-లబ్ధాఘరాశి' వంటి సంస్కృతసమాసభరిత పదాలను వాడి, పాఠకులను ఇబ్బందిపెట్టారు. ఇది భావ్యం కాదు! 'రంగడు', 'చచుచుండగా'- వంటి అచ్చుతప్పులను కనీసం ద్వితీయముద్రణలోనైనా సరిదిద్దు కుంటే మంచిది! మొత్తంమీద చూచినట్లయితే, చిన్నచిన్నలోపాలు మినహాయిస్తే, ఇది ఒక సత్ప్రయత్న మనే చెప్పాలి! రచయిత మరింత సులభశైలిలో, మున్ముందు ఇంకెన్నో రచనలు వెలయిస్తా రని ఆకాంక్షిస్తున్నాము.

**- టి.ఎస్.జగన్మోహన్.**




## జీవనజ్యోతి

*జి. భద్రావతి, తిరుపతి*

ఆ ఏడుకొండవాడు నాజీవితంలో ఎన్నోసార్లు పరోక్షంగా సహాయంచేశారు. నాకు 25-08-2010లో కాళి దాస్‌గారితో వివాహం జరిగింది. ఇద్దరం స్వామిదర్శనం చేసుకొని, దేవస్థానంవారు నిర్వ హించే ఉద్యోగపోటీపరీక్షకు మా స్వస్థలం విశాఖపట్నంనుండి తిరుపతికి 23-9-2010న బయలుదేరాము. మా కంపార్ట్‌మెంట్‌లో మరొకదంపతులు ఇద్దరుఅమ్మాయిలతో ఉన్నారు. మాటలమధ్యలో 'మీరు స్వామి దర్శనంకోసం వెళ్లుతున్నారా?' అని అడుగగా మా విషయం చెప్పాను. వారు "ఈ పరీక్షలో చాలా 'పగడ్బందీ'గా జరుగుతున్నాయి. కనుక మీరు శ్రీవారిఆలయంలో అంగ ప్రదక్షిణం చేసి, పరీక్ష వ్రాయండి", అని ఆ దంపతులు సూచించారు.

మేము తిరుపతి చేరినవెంటనే కాలినడకన తిరుమల చేరుకొని, అంగప్రదక్షిణం చేసి, స్వామిదర్శనం అనంతరం 26-09-2010న పోటీపరీక్షలో పాల్గొన్నాము. అందులో నేను అర్హత పొందాను. కానీ, ఉద్యోగం రాలేదు. చాలా బాధపడ్డాను.

20-12-2010న దేవస్థానం వారినుండి 23-12-2010లోగా విద్యాయోగ్యతాపత్రాలపరిశీలనకు హాజరు కావాలని ఆదేశపత్రం వచ్చింది. నిజంగా మా ఆనందానికి అవధులు లేవు. మాకు అంగప్రదక్షిణవిషయం సూచించినవాళ్ల ఫోన్ నెంబరుకు చాలాప్రయత్నం చేశాం. కానీ, స్పందన లేదు. మాచేత అంగ ప్రదక్షిణం చేయించడానికి శ్రీపద్మావతీ శ్రీనివాసులే ఆ దంపతులరూపంలో వచ్చి, అనుగ్రహించా రని సదా విశ్వసిస్తున్నాము. శ్రీనివాసునిదయ ఎవరిపై ఎప్పుడు ఏరూపంలో ప్రసరిస్తుందో ఎవరు చెప్పగలరు? లేకపోతే పూర్వాపరాలు తెలీని ఆ దంపతు లెవరు? మాప్రయాణవిషయం తెలుసుకొని, మమ్మల్ని 'శ్రీవారికి అంగప్రదక్షిణలు చేయండి.' మీ ఆశయం ఫలిస్తుం దని సూచించడ మేమిటి? వాళ్లిచ్చిన ఫోన్ నెంబర్లు ఎన్నిరకాల మార్పుచేసినా స్పందనలేకపోవడ మేమిటి? అంతా ఆశ్చర్యం! సర్వమూ శ్రీనివాసునిప్రభావఫలమే!!

*వినా వేంకటేశం న నాథో న నాథః*

---

తిరుమల తిరుపతిదేవస్థానములు, తిరుపతి

### 108 అడుగుల అన్నమయ్య విగ్రహం, తాళ్లపాక

- పదకవితాపితామహుడైన అన్నమయ్య శ్రీవారిని సంకీర్తనాసుమాలతో అర్చించిన భాగవతోత్తముడు.
- కడప - తిరుపతి ప్రధానరహదారిలో తాళ్లపాకవద్ద 22-05-2008న అప్పటి ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి డా॥వై.ఎస్.రాజశేఖరరెడ్డిగారు ఈ 108 అడుగుల అన్నమయ్య విగ్రహాన్ని ఆవిష్కరించారు.
- శ్రీ భూమన కరుణాకరరెడ్డి పాలకమండలి అధ్యక్షులుగా ఉన్న రోజులలో తిరుమల తిరుపతి దేవస్థానం అన్నమయ్య 108 అడుగుల విగ్రహాన్ని తయారు చేయించారు. పశ్చిమగోదావరిజిల్లా వడలి గ్రామానికి చెందిన వీరవాసరపు సూరిబాబు, నెల్లూరుజిల్లా కలువాయి మండలానికి చెందిన శ్రీ దేవరకొండ పెంచలయ్య అనే ఇద్దరు శిల్పులు ఈ విగ్రహాన్ని నిర్మించారు. అన్నమయ్య 600 జయంతి సందర్భంగా ఆవిష్కరించిన ఈవిగ్రహం భక్తులను, పర్యాటకులను విశేషంగా ఆకర్షిస్తోంది.



# మహోత్సవం.. మహోత్సవం!!

- ఎ. ఆర్. శ్రీపాద

గరుడవాహనంబుపై
గోవిందనాథు డొక్కడు
గారాబముగ తిరుగుతు
మాడవీధు లన్నియు!

శరణుగోరి వచ్చినారు
భక్తజనము ఎందరో
మూల మూల లన్ని నిండినాయి
మాడవీధు లన్నియు!

కరుణతో చూచినాడు
కాచుతూ శ్రీహరి
శంఖ, చక్రాధరియై
విష్ణువిభువు డొకండు!

ఆముక్తపుష్పమాల లవిగో,
ఆ లక్ష్మీహార మదిగో,
వెంకటాద్రి నిలయునికి
సహస్రనామమాల అదిగో!

విశేషవాహనంబు పై
విష్ణురూపు డొక్కడు!
అశేషభక్తజనము రక్షకై
విచ్చేసినాడు అదిగో!

మహోత్సవం! మహోత్సవం!
బ్రహ్మ పెట్టె శుభముహూర్తం!!
వెంకటాద్రి నిలయునికి
నవాహ్నికంగ బ్రహ్మోత్సవం!

పంచవర్ణ రహస్యము
గరుడసేవ ఉత్సవం!
సర్వపాపహరణము
గరుడసేవ దర్శనం!

ఆసనముగ వచ్చినాడు
దాసుడై గరుడుడు!
విష్ణుప్రభువు మిత్రుడు
వేదస్వరూపు డితడు

విశేషముగ వెలిగినాయి
మాడవీధు లన్నియు
విశ్వకాంతితో నిండినాయి
మూల మూల లన్నియు!

విశ్వలోకాల కధిపతి
విష్ణురూపు డొక్కడె
విశ్వశాంతి నిచ్చుశక్తి
విష్ణువిభుడు ఒక్కడె!

సర్వపాపహరం, ఈ....
గరుడసేవ దర్శనం!
సకలశ్రేయోదాయకం
గరుడసేవ మహోత్సవం!

# రాశిఫలాలు

## అక్టోబరు, 2013



జె. చంద్రశేఖరశర్మ



### మేషం

ఈ రాశివారికి ఈ మాసంలో లావాదేవీలలో ఆటు పోట్లు ఎదురైనా, అవసరాలకు డబ్బు అందుతుంది. నూతన కార్యక్రమాలు చేపడతారు. ముఖ్యమైనపనులు కొన్ని వాయిదా పడతాయి. బంధువులనుంచి వచ్చినసమాచారం కొంత ఉపశమనం కలిగిస్తుంది. కొత్త విషయాలు సేకరిస్తారు. ఆరోగ్య, కుటుంబసమస్యలు తప్పవు. వాహనాలు, స్థలాల కొనుగోలు ప్రయత్నాలు వాయిదాపడే సూచన లున్నాయి. మొదటివారం శుభవార్తాశ్రవణం, రెండోవారం స్వగృహప్రాప్తి, మూడోవారం కార్యజయం, నాలుగోవారం దైవారాధన.



### వృషభం

ఈ రాశివారికి ఈ మాసంలో చేపట్టినపనులలో ఆటంకాలు తప్పవు. కుటుంబసభ్యులతో వివాదాలు ఏర్పడవచ్చు. ఆర్థికసమస్యలు తొలగిపోతాయి. ఋణాలవిషయంలో తొందరపాటు తగదు. వృత్తివ్యాపారాలలో ఆటంకాలు తప్పవు. స్థానచలనం ఉండవచ్చు. కళలు, సాంకేతికరంగాలలోనివారికి కొంత మేరకు అనుకూలంగా ఉంటుంది. హామీలు ఇవ్వద్దు. మొదటి వారం మానసికోల్లాసం, రెండోవారం ధనలాభం, మూడోవారం కార్యానుకూలత, నాలుగోవారం అనారోగ్యం.



### మిథునం

ఈ రాశివారికి ఆరోగ్యవిషయంలో జాగ్రత్త అవసరం, అంతర్గతశత్రువులు సమస్యలు కలిగించేవీలుంది. అన్ని విషయాలలోనూ ఆచితూచి ఆలోచించండి. బంధువులతో అకారణంగా విరోధాలు ఏర్పడవచ్చు. ఋణాల ఒత్తిడులు అధికమౌతాయి. స్థిరాస్తి ఏర్పడుతుంది. చిన్ననాటిమిత్రులసహాయం పొందుతారు. క్రయవిక్రయాలలో జాగ్రత్త అవసరం. మొదటి వారం అనారోగ్యం, రెండోవారం ఆనందం, మూడోవారం కార్యజయం, నాలుగోవారం మనస్పర్థలు.



### కర్కాటకం

ఈమాసంలో ఈరాశివారికి కొన్నిసమస్యలు పరిష్కారమవుతాయి. నూతనకార్యక్రమాలు చేపడతారు. కుటుంబంలో శుభకార్యాలు జరుగుతాయి. ఆర్థికపరిస్థితి ఆశాజనకంగా ఉంటుంది. ఋణాలుసైతం తీరుస్తారు. ఆధ్యాత్మికకార్యక్రమాలలో పాల్గొంటారు. సంఘంలో కీర్తిప్రతిష్ఠలు పెరుగుతాయి. వృత్తి, వ్యాపారాలలో మంచిమార్పులు సంభవం. మొదటివారం ఆనందం, రెండోవారం ధనాదాయం, మూడోవారం శుభవార్తాశ్రవణం, నాలుగోవారం మనోవేదన.



### సింహం

ఆర్థికపరిస్థితి కొంతగందరగోళంగా ఉన్నా సమయానికి డబ్బు అందుతుంది. అంతర్గతశత్రువులవల్ల సమస్యలు ఎదురవుతాయి. ఆరోగ్యసమస్యలు చికాకు కలిగిస్తాయి. పట్టుదలతో కొన్నిముఖ్యమైనపనులు పూర్తిచేస్తారు. వృత్తివ్యాపారాలలో గతంకన్నా మెరుగ్గా ఉంటుంది. మొదటివారం సంతోషం, రెండోవారం శుభవార్తాశ్రవణం, మూడోవారం శత్రుజయం, నాలుగోవారం ధనలాభం.



### కన్యారాశి

ఈ మాసంలో కుటుంబ, ఆరోగ్యసమస్యలు ఉంటాయి. సంఘంలో గౌరవం లభిస్తుంది. మీశక్తియుక్తులకు పరీక్షాకాలంగా ఉంటుంది. ఆర్థికపరిస్థితి కొంతబాగానే ఉంటుంది. ఋణాలఒత్తిడులు అధికమవుతాయి. బంధుమిత్రులతో అకారణ విరోధాలు ఏర్పడవచ్చు. తొందరపాటు తగదు. కొత్తకార్యక్రమాలు చేపడతారు. అదృష్టం మీవెంటే! మొదటివారం ఆందోళన, రెండోవారం విజయం, మూడోవారం దైవచింతన, నాలుగోవారం స్థానచలనం.



### తుల

ఈ రాశివారికి ఈ మాసంలో ఆర్థికపరిస్థితి కొంత ఆందోళనకరంగా ఉన్నా–సమయానికి డబ్బు అందుతుంది. ఋణ

బాధలు తీరుతాయి. కుటుంబసమస్యలు ఒక కొలిక్కివస్తాయి. ముఖ్యమైనపనులు వాయిదాపడతాయి. దీర్ఘకాలికసమస్యలు కలత పెట్టవచ్చు. వాహనాలవిషయంలో మెలకువ అవసరం. ఆరోగ్యం మెరుగుపడుతుంది. ఆశించినస్థానం దక్కుతుంది. మొదటివారం కార్యహాని, రెండోవారం క్షేత్రదర్శనం, మూడోవారం శివాభిషేకాలు, నాలుగోవారం స్థానచలనం, పదవీయోగం.

## వృశ్చికం

ఈ రాశివారు చేపట్టినపనులు సకాలంలో పూర్తి చేస్తారు. కుటుంబసమస్యలు పరిష్కారమై ఆనందిస్తారు. ముఖ్యమైనవ్యవహారాలు సన్నిహితులసహకారంతో పూర్తిచేయగలరు. ఆర్థిక పరిస్థితి సంతృప్తికరంగా ఉంటుంది. ఋణాలఒత్తిడులు తొలగిపోతాయి. గృహం, స్థలాల, వాహనాల కొనుగోలుయత్నాలు ఫలిస్తాయి. జీవితాశయం నెరవేరేసూచన లున్నాయి. ఒక ముఖ్యమైన సమాచారం అందుతుంది. మొదటివారం నిరాశ, రెండోవారం శుభవార్తాశ్రవణం, మూడోవారం ఆనందం, నాలుగోవారం కార్యజయం.

## ధనుస్సు

ఈ రాశివారికి ఈ మాసంలో పడినశ్రమకు ఫలితం దక్కుతుంది. ఆరోగ్యసమస్యలు తీరి, మానసికప్రశాంతత లభిస్తుంది. పాతమిత్రులనుండి శుభవార్తలు అందుతాయి. వృత్తి, వ్యాపారాలలో అనుకూలంగా ఉంటుంది. కొత్తవస్తువులు, వస్త్రాలు కొనుగోలుచేస్తారు. సంగీత, సాహిత్యకార్యక్రమాలపై దృష్టి సారిస్తారు. మొదటివారం శుభవార్తలు, రెండోవారం సంతోషం, మూడోవారం దైవారాధన, నాలుగోవారం కార్యజయం.

## మకరం

ఈ రాశివారికి ఈ మాసంలో కుటుంబసమస్యలు ఒక దారికి వస్తాయి. అనుకున్నపనులు నెరవేరుతాయి. ఆర్థికపరిస్థితి ఆందోళనకరంగా ఉన్నా- ఏదోవిధంగా అవసరాలకు డబ్బు అందుతుంది. ఆరోగ్యం, వాహనాలవిషయంలో కాస్త మెలకువ అవసరం. సాంకేతికవిద్యలపై ఆసక్తి చూపుతారు. మొదటివారం ప్రయత్నజయం, రెండోవారం సన్మానాలు, మూడోవారం ఆనందం, నాలుగోవారం ధనాదాయం.

## కుంభం

ఈ మాసంలో ఆర్థికపరిస్థితి సంతృప్తికరంగా ఉంటుంది. ముఖ్యమైనవ్యవహారాలలో నిదానం అవసరం. తొందరపాటు వద్దు. విలువైనవస్తువులు కొంటారు. దూరపుబంధవులను, మిత్రులను కలుస్తారు. మానసిక ప్రశాంతత లభిస్తుంది. మొదటివారం ఆందోళనలు, రెండోవారం ధనలాభం, మూడోవారం ఆధ్యాత్మికచింతన, నాలుగోవారం ఆనందం.

## మీనం

ఈరాశివారు ఈమాసంలో ఆర్థికసమస్యలనుండి బయటపడతారు. కీలకవిషయాలలో సన్నిహితులసలహా స్వీకరిస్తారు. వాహనం, స్థలాల కొనుగోలుయత్నాలు ఫలిస్తాయి. సన్నిహితులనుంచి ఆర్థికసహకారం అందుతుంది. ఆరోగ్యసమస్యలు తీరుతాయి. మిత్రులనుంచి అందినసమాచారం కొంతఊరట కలిగిస్తుంది. మొదటివారం స్వల్పఅనారోగ్యం, రెండోవారం ధనప్రాప్తి, మూడోవారం వృథాఖర్చులు, నాలుగోవారం ధార్మికచింతన.

# సా మాం పాతు సరస్వతీ



పి. విజయలక్ష్మి

సృష్టి త్రిగుణాత్మకం. సర్వమూ పరాశక్తివల్లనే నిర్వహింప బడుతూంది. ఆ పరాశక్తియే గుణాలు స్వీకరించి, పురుషరూపాన్ని గైకొని, సత్త్వగుణంతో మహావిష్ణువుగా, రజో గుణంతో బ్రహ్మగా, తమోగుణంతో శివుడుగా రూపొందింది. శక్తి లేకుంటే వ్యక్తి అశక్తు డవుతాడు. ప్రకృతి లేనిదే పురుషుని మనుగడ సాగదు. కనుక మరలా పరాశక్తి స్త్రీమూర్తియై సత్త్వ గుణంతో సరస్వతిగా, రజోగుణంతో లక్ష్మిగా, తమోగుణంతో గౌరిగా రూపొందింది. పిదప సృష్టిస్థితి లయా లనే మూడు కార్యాలు నిర్వహించడానికై సత్త్వగుణం+ రజోగుణం= విష్ణువు, లక్ష్మి; రజోగుణం+సత్త్వగుణం=బ్రహ్మ, సరస్వతి; తమోగుణం+ తమోగుణం=రుద్రుడు, గౌరి;– అనే మిథునరూపాలు ఏర్పడ్డాయి. సృష్టికి రజోగుణం+సత్త్వగుణం అవసరం. పోషణకు సత్త్వం+ రజోగుణం ముఖ్యం. లయంకు తమోగుణం+తమోగుణం ప్రధానం. లయంలోనే సృష్టి రహస్యమంతా దాగి ఉంది.

ఇలా త్రివిధకార్యాలకై రూపొందినస్త్రీమూర్తుల్లో సరస్వతి బ్రహ్మపత్ని అయింది. ఈమెకు హంసవాహనం. బ్రహ్మకుకూడా హంసే వాహనం. సరస్వతికి బ్రాహ్మి, భారతి, భాషాదేవి, గీర్దే వత, వాగ్దేవత, వాణి– అనే పేర్లున్నాయి. బ్రాహ్మి=బ్రహ్మ సంబంధిని. భారతి=సర్వాన్నీ భరించేది, భరతు డనే మునిచేత తేబడింది. భాషాదేవి=భాషింపబడేదేవి. గీర్దేవతా=చక్కగా పల్కేదేవత. వాగ్దేవీ=పలుకబడేదేవి. వాణీ= వాక్కులరూపంలో ఉండేది. సరస్వతీ= అంతటా వ్యాపించి ఉండేది(నాదరూపంతో); బ్రహ్మలోకంలో బ్రహ్మసరస్సును ఆశ్రయించి, నదీరూపంలో ప్రవహించేది – అని అర్థాలు!

సరస్వతి–వాగ్దేత. సకలజీవులకూ–'పరా, పశ్యంతీ, మధ్యమా, వైఖరీ'– అనేనాల్గువిధాలైన వాక్కు లుంటాయి. వీటిలో 'పరా–పశ్యంతీ–మధ్యమా' అనే మూడింటినీ యోగులు, జ్ఞానులుమాత్రమే గుర్తించగలరు. ఇట్టి చతుర్విధవాక్కులకూ అధిదేవత కనుక సరస్వతి వాగ్దేవి. సృష్టిలో మొదటినాదం ప్రణవం=ఓంకారం. ఇదే క్రమంగా సర్వశబ్దాలుగా, అర్థాలుగా విస్తరించింది. కనుకనే సరస్వతీరహస్యోపనిషత్తు "ప్రణో దేవీ సరస్వతీ వాజేభి ర్వాజినీవతి। ధీనా మవిత్ర్యవతు' 'ఏదేవి పర మార్థమైన వేదాంతార్థతత్త్వస్వరూపిణియో, ఏదేవి నామరూపా త్మకమైన ప్రకృతిగా తెలియబడుతూందో, ఆ సరస్వతీదేవి నన్ను రక్షించుగాక! అన్నాలకే అన్నం అయిన సరస్వతీదేవి మా బుద్ధులకు రక్షకురాలై మమ్ము బాగా రక్షించుగాక!" అని ప్రస్తు తించింది. మానవులవాక్కు భావానుగుణమై, స్పష్టంగై వ్యక్తమవు తుంది. తక్కినజీవులవాక్కు అస్పష్టంగా వ్యక్తమవుతుంది. హృదయమే బ్రహ్మసరస్సు. అందు వాగ్రూపంలో– అంటే అవ్యక్త మైనవాగ్రూపంలో–నదిగా ప్రవహించి, ముఖ మనేభూమిలో వ్యక్త మవుతుంది. కనుక ఈ తల్లి సరస్వతి. అన్ని జీవులనుండీ మానవుణ్ణి విశిష్టజీవిగా చేసేది వాక్కు (మాట). అట్టి వాక్కులకు అధిదేవత సరస్వతి. కనుక ప్రతిజీవీ వాగ్దేవీరూపమే!

'బ్రహ్మ' అంటే సర్వవ్యాపకమైన పెద్దవస్తువు. ఆ బ్రహ్మ వస్తువుకు చైతన్యాన్ని ఇచ్చేశక్తి సరస్వతి. ఇలా సర్వాన్నీ భరిస్తున్నందున ఈమె 'భారతి' అయింది. ఈమెచేతుల్లో వీణ, రుద్రాక్ష/ స్ఫటికమాల, పుస్తకం ఉంటాయి. వీణ మానవశరీరా నికీ, హృదయస్పందనకూ, గాయత్రీతత్త్వానికీ సంకేతం. దీన్ని మీటడంవల్ల వచ్చేనాదం ప్రణవం. ప్రణవానందాన్నే తాను అనుభవిస్తూ–తననుఉపాసించే భక్తులకూ అనుగ్రహిస్తూంటుంది– సరస్వతీదేవి. వాణీబ్రహ్మల మానసపుత్రుడైన నారదుడు 'మహతి' అనే మహత్త్వంగల వీణను ధరించి, నిరంతరం భగవద్గుణకీర్తనుడై–లోకానికి 'నారం'=జ్ఞానాన్ని. 'ద'=ఇస్తున్నాడు. అక్షమాల భాషను అభివ్యక్తం చేసేసాధనాలైన అకారాదిక్షకారాంత మాతృకావర్ణాల సమాహారరూపం! పుస్తకం=వేదరాశి. కనుక సరస్వతి వేద, నాద, భాషారూపిణి. "సంగీతమపి సాహిత్యం సరస్వత్యాః స్తనద్వయ" మ్మన్నారు. సరస్వతీదేవియొక్కఉభయ స్తన్యం గ్రోలక ఏవ్యక్తీ సంపూర్ణానందం పొందలేడు. ఉభయమూ ఆజననియొక్క హృదయంనుండి స్రవించేవే! సంగీతసాహిత్యా స్వాదనహృదయం లేనిజీవి రాతికంటే కఠినుడే! కనుక వాగ్దేవీ ఉపాసన ప్రతిజీవీ బాహ్యంగానో, ఆంతరంగానో ప్రతిక్షణం చేస్తూనే ఉంది. సృష్టిలో సర్వత్ర–చివరకు చీమలకదలికలోకూడా సూక్ష్మాతిసూక్ష్మమైన నాదం ఉంది. ఆ నాదమే సరస్వతి – సర్వత్ర వ్యాపించినదేవి. హృదయాంతర్గతమైన ఆ ప్రణవనాద సరస్వతిని గుర్తించి, ఆనందించడమే శ్రీకైవల్యసాధన! ఇదే బ్రహ్మానందం! 'సర్వశుక్లా సరస్వతీ' కనుక సరస్వతి స్వచ్ఛమైన

తెలుపు. ఆమె వస్త్రం, ఆభరణాలు, వాహనం, అక్షమాల–అన్నీ తెలుపే! ఈ తెలుపు శుద్ధసత్త్వమైనపరమాత్మరూపానికి సంకేతం. సరస్వతి 'నిశ్శేషజాడ్యాపహా' బుద్ధిజాడ్యాన్ని పూర్తిగా తొలగిస్తుంది. జన్మాంతరంలో దానధర్మాదిపుణ్యకార్యాలు చేయకపోవడంవల్ల– ఈ జన్మలో 'బుద్ధిజాడ్యం' వస్తుం దన్నారు– పెద్దలు!

సృష్టి– అస్తి (ఉన్నది; భాతి–(ప్రకాశిస్తూంది); ప్రియం–(ఇష్టమైంది), రూపం–(కన్పించేరూపంతో ఉండటం); నామం–(రూపానికి తగినపే రుండడం – అనే ఐదుదశల్లో ఉంటుంది. ఇందలి 'అస్తి, భాతి, ప్రియం'– అనే మూడుగుణాలూ బ్రహ్మ రూపం. 'రూపం, నామం'–అనే రెండూ జగత్తుయొక్కరూపం. మొదటిమూడూ బ్రహ్మకాగా– వాటిల్ని వ్యక్తం చేస్తూ, నామ రూపాలతో బ్రహ్మ సృష్టికి పుష్టినీ, తుష్టినీ చేకూర్చి, సమగ్రతను సిద్ధింపజేసేది సత్త్వగుణాత్మికయైన సరస్వతియే! కనుక ఈమె 'బ్రహ్మపత్ని' 'బ్రాహ్మి' – అయింది.

ఈమెకు వాహనం హంస (తెల్లనిది). (కొందరు తెల్ల తామరపూవునుగూడా చెప్పారు). 'హంస'–తమస్సును (చీకటిని) హరించేదీ అనీ, సర్వత్ర సంచరించేదీ అనీ అర్థాలు. హంస నివాసం మానససరోవరం. లోభగుణం లేనిరాజుకూ, విష్ణువుకూ, అంతరాత్మకూ, మత్సరంలేనిమనస్వికీ, ఉత్తమసన్న్యాసికీ, సూర్యునికీ 'హంస' అనే పేరు. తెల్లనిహంసవాహన మంటే శుద్ధసత్త్వ అయిన సరస్వతికి సత్త్వగుణాత్మకమైన హంసే వాహనంగా ఉంది. తమోగుణాన్ని హరించేది సత్త్వగుణమేకదా! అంతశ్శత్రువులైన ఆరుమందినీ జయించినమహాత్ముల మనస్సు లనే సరోవరాల్లో పరమాత్మరూపిణియై వాగ్దేవి విహరిస్తుం టుం దని విశేషార్థం! నిరాకారతత్త్వాన్ని సాకారవస్తువులతో, ప్రతీక పద్ధతిలో (సింబాలిజం) చెప్పడం భారతీయపద్ధతి. మనం అందరం 'భారతి' అయినసరస్వతిబిడ్డలం కనుకనే మనం భారతీయుల మయ్యాము. ఇతరదేశాలవాళ్లకు వాక్కు లున్నాయే కానీ ఆవాక్కులకు అధిష్ఠానమయిన దేవతత్త్వాన్ని గుర్తించి, ఉపాసించి, ఆనందించేవిధానం లేదు. వాళ్లకు వ్యక్తమయ్యే 'వైఖరీవాక్కు' తప్ప–దానిపూర్వస్థితులైన పరా, పశ్యంతీ, మధ్యమా వాక్కుల స్వరూపవిశేషాలు అగోచరాలు! కనుకనే వాళ్లకు 'భారతీయత' సార్థకం కాలేదు.

"దేవీం వాచ మజనయంత దేవాః" అనింది – వేదం! సృష్టిలో మొట్టమొదట వ్యక్త మయింది వాక్కే! కనుక వాగ్దేవతయే ఆదిదేవి! అందుకే "యా బ్రహ్మాచ్యుతశంకరప్రభృతిభి ర్దేవై స్సదా పూజితా! సా మాం పాతు సరస్వతీ, భగవతీ నిశ్శేషజాడ్యాపహా" అని సరస్వతిని స్తుతిస్తున్నాము. త్రిమూర్తులుకూడా వాగ్దేవతను ఉపాసించేవాళ్ళే! ఈమెకు 'ఐమ్' అనేది బీజాక్షరం. ఏ దేవతా బీజాక్షరం చెప్పలన్నా ముందు ప్రణవం– 'ఓం' చేర్చాల్సిందే! కనుక 'ఓం ఐం' అని పల్కి– తర్వాతనే ఆయాదేవతల ప్రత్యేక మైన బీజాక్షరాలు చెప్పడం మంత్రశాస్త్రపద్ధతి. అంటే– నిరాకార, సర్వవ్యాపకనాదాత్మకమైనపరమాత్మ– ఓం. ఆపరమాత్మ సాకార వాగ్దేవతగా–'ఐం' అయింది. దీనినుండి సమస్తదేవతా బీజాక్ష రాలూ, దేవతలూ, శక్తులూ, ఉద్భవించాయి. జన్మాంతరంలో దానధర్మాలు చేయకపోతే– ఈ జన్మలో జాడ్యం=బుద్ధిమాంద్యం ఏర్పడుతుంది. అజాడ్యాన్ని సరస్వతీదేవీ కృపలో పూర్తిగా తొల గించుకోవచ్చు. సరస్వతి జన్మించింది మూలానక్షత్రంలో. అన్నిటికీ మూలం వాక్కే–నాదమే–ఓంకారమే అనేతత్త్వానికి సంకేతమే సరస్వతి మూలానక్షత్రంలో అవతరించడం!! నవరాత్రులలో మూలానక్షత్రదినంతోనే – సరస్వతీపూజతోనే దేవీపూజలు వృద్ధి నొందుతాయి.

సరస్వతీతత్త్వం ఆధ్యాత్మికంగా పరమాత్మరూపం. భౌతికంగా వాగ్రూపం. యోగులు హృదయాకాశంలో వినే దశ విధనాదాలు (చిణి, చిణీ, శంఖ, వేణు, వీణా, తాళ, ఘంటా, భేరీ, మృదంగ, మేఘనాదాలు. మరోపద్ధతిలో – జల, భేరీ, మృదంగ, ఘంటా, కాహళ, కింకిణీ, వేణు, భ్రమర, ఓంకార, శంఖనాదాలు) వాగ్దేవియొక్కకాలిఅందెల చిరుగంటల సవ్వడులే అని అనుభవజ్ఞుల మహాసందేశం! ఆదిశంకరులు అధిష్ఠించిన సర్వజ్ఞపీఠం–శారదాపీఠమే! శరదృతువులో (శరత్తులో) అవతరిం చింది కనుక 'శారద' అయింది. ఇది సృష్ట్యాదిలో జరిగిన మహత్తరసన్నివేశం! శరదృతువు–ఆశ్వయుజశుద్ధసప్తమి–మూలా నక్షత్రంనాడు సృష్టి వ్యక్తరూపాన్ని పొంది, నామరూపా త్మక జగత్తుగా ప్రకాశించింది. సరస్వతి అవ్యక్తబ్రహ్మంను– వ్యక్త బ్రహ్మంగా రూపొందించినమహాజ్ఞానదేవత! సర్వారాధ్య! వాగ్దేవీ తత్త్వాన్ని సంపూర్ణంగా తెలుసుకొన్నవాళ్ళకు 'శ్రీకైవల్యస్థితి' కర తలామలకం!!



శ్రీమాన్ పురిశై శ్రీరంగాచార్యస్వామివారిచే ప్రణీతమైన

# శ్రీలక్ష్మీగద్యమ్ (10)

"శ్రీచరణపరిచరణ" వ్యాఖ్య    వ్యాఖ్యాత - డా॥ ఈ.ఏ.శింగరాచార్యులు

**7. మహితలావణ్య మహావాహిని !**

మహిత = గొప్పదైన, లావణ్య = లావణ్య మను, మహా వాహిని = గొప్పనదివంటిదానా!

లావణ్య మనగా సముదాయశోభ. శరీరమంతటా వ్యాపించియుండు అనిర్వచనీయమైన, కంటిని ఆకర్షించుశోభ. **"భూయిష్ఠం తేజ ఏవాద్భిః బహులాభిః మృదూకృతమ్, చక్షురానందజననం లావణ్య మితి కథ్యతే"** అని అహిర్బుధ్న్య సంహిత లావణ్యమును నిర్వచించినది.

**8. ముఖచంద్రసముద్యత భాలతలవిరాజమాన కించిదు దదంచిత సూక్ష్మాగ్ర కస్తూరీతిలకశూల సముద్భూతభీతి విశీర్ణసముజ్ఝిత సమ్ముఖభాగపరిసర యుగళసరభసవి సృమర తిమిరనికర సందేహసందాయి ససీమంత కుంతల కాంతే!**

ముఖచంద్ర= చంద్రునివంటి ముఖమందు, సముద్యత = ఎత్తుగా నున్న, భాలతల = ఫాలభాగమందు, విరాజమాన = ప్రకాశించునట్టి, కించిత్ ఉదంచిత= కొంచెము పైకెత్తబడినది, సూక్ష్మ+అగ్ర= సూదిమొనను కల్గినది అగు, కస్తూరీతిలకశూల= కస్తూరీతిలకము అను శూలమువలన, సముద్భూత = జనించిన, భీతి = భయముచే, విశీర్ణ = చెదిరినవై, సముజ్ఝిత= విడచిపెట్టిన, సమ్ముఖభాగపరిసర = ముఖప్రదేశప్రాంతము యొక్క, యుగళ = జంటయందు (రెండు వైపుల), సరభస = వేగముగా, విసృమర = వ్యాపించు, తిమిరనికర = చీకటిగుంపు అను, సందేహ = సంశయమును, సందాయి = కల్గించునట్టి, ససీమంత = పాపటతోకూడిన, కుంతల కాంతే = కేశపాశము యొక్క కాంతిని కల్గినదానా !

ఇందు పద్మావతీదేవియొక్క కేశపాశమును రెండుగా విడదీయు సీమంతశోభ చక్కని ఉత్ప్రేక్షతో వర్ణింపబడుచున్నది. పద్మావతీదేవియొక్క చంద్రునివంటి, అందమైనముఖ మందు కస్తూరీతిలకము దిద్దబడియున్నది. అది శూలాగ్రా కారమున నున్నది. అనగా- శూలాగ్రముయొక్కఅకృతివలె దేవిముఖమందలి తిలకము కనుపించుచున్నది. దట్టమైన కేశపాశమును చీకటితో పోల్చుట కవిసమయము. ఎత్తబడిన ఆయుధమును చూచినపుడు భయము కల్గుట సహజము. శూలాకారములోని, ఉదంచితమైన అగ్రభాగమును గల కస్తూరీ తిలకము పద్మావతిదేవిముఖమున ఉండుటచే, దానిని చూడ గానే తిమిరమువలె, నల్లగా శోభిల్లు పద్మావతిదేవికేశపాశము భీతిచెంది, రెండుగా విడిపోయి రెండువైపులకు తొలగిపోయి నది. అపుడు మధ్యలో ఏర్పడిన దారివలె కేశపాశము మధ్య లోని పాపట తోచుచున్నది.

**9. స్ఫటికమణిమయ కందర్పదర్పణ సందేహసందోహి సకల జనసమ్మోహి ఫళఫళవిమల లావణ్యలలిత సతతముదిత ముదితముఖ మండలే !**

స్ఫటికమణిమయ=స్ఫటికమణులతో నిర్మింపబడిన, కందర్ప దర్పణ = మన్మథునిదర్పణముయొక్క, సందేహ సందోహి = సందేహమును కల్గించునది, సకలజన = సమస్త జనములను, సమ్మోహి= సమ్మోహమును కల్గించునది, ఫళఫళ విమల= ఫళ ఫళ మని ప్రకాశించు, స్వచ్ఛమైన, లావణ్య= లావణ్యముచే, లలిత = అందమైనది, సతత= ఎల్లప్పుడు, ముత్+ఇత = సంతోషమును పొందినది, (కావుననే) ముదిత= వికసించినది అగు, ముఖమండలే = గుండ్రనిముఖమును కల్గినదానా !

పద్మావతీదేవిముఖశోభ ఇందు ప్రస్తుతము. ఆమె ముఖములోని కపోలములు మన్మథునిమణిమకురములవలె తోచుచున్నవై, సకలజనులకు ఆశ్చర్యమును కల్గించుచున్నవి. ఆమె ముఖమండలము ఫళఫళమని ప్రకాశించుచున్నది. స్వచ్ఛ

మైనది. కావున మనోహరమైనది. అందు ఎల్లప్పుడు ఆనందము తొణికిసలాడుచున్నది.

**10. మహితమ్రదిమ మహిమమందహాసాసహిష్ణు తదుదయ సముదిత క్లమోదీర్ణారుణవర్ణ విభ్రమదవిడంబిత పరిణత బింబవిద్రుమ విలసదోష్ఠయుగళే !**

మహిత = గొప్పదైన, మ్రదిమ = సౌకుమార్యముయొక్క మహిమ = గొప్పతనమువలన, మందహాస+అసహిష్ణు = చిఱునవ్వునుసైతము సహింపలేనిదగుటచే, తత్+ఉదయ = ఆ చిఱునవ్వుయొక్క ఉదయముచే, సముదిత = పుట్టిన, క్లమ= శ్రమవలన, ఉదీర్ణ = అతిశయించిన, అరుణవర్ణ= ఎఱ్ఱదనముతో, విభ్రమద= సందేహమును కల్గించునవి, విడంబిత= అనుకరింపబడినవి, అనగా- సాటివచ్చునవి అగు, పరిణత = పండిన, బింబ = దొండపండు, విద్రుమ = పగడములను కల్గినవై, విలసత్ = ప్రకాశించు, ఓష్ఠయుగళే = క్రిందిపెదవిని, పైపెదవిని కలదానా !

పద్మావతిదేవియొక్క ఓష్ఠద్వయసౌందర్యము ఇందు అభివర్ణితము. ఆమెపెదవులు ఎక్కువ ఎఱ్ఱగా నుండుట కొక హేతువు చమత్కారపూర్వకముగా ఉత్ప్రేక్షింపబడుచున్నది. ఆమె సౌకుమార్య మెంత గొప్పది? అనగా-చిఱునవ్వునుకూడా సహింపలేనిది. సహజముగానే ఎఱ్ఱనైన ఆమెపెదవులందు మందహాసము ఉత్పన్నమగుటచే వానిఎఱ్ఱదనము మఱింత వృద్ధిజెందినదా! అని తోచుచున్నది. ఆ పెదవులు పండిన దొండపండువలె, పగడమువలె ప్రకాశించుచున్నవి. సందర్భ వశముచే ఇందు పద్మావతీదేవియొక్క సౌకుమార్యముకూడా కీర్తింపబడినది. **"రంగభర్తురపి లోచనచర్చాం సాహసావలిషు లేఖయమానమ్.... సౌకుమార్య మతివాఙ్మనసం నః"** (చూపులకు కూడా సాహసకార్యంగా భావింపజేసే శ్రీరంగనాథుని సౌకుమార్యం మాటలకు అందనిది) అనెడి భట్టర్ శ్రీరంగరాజస్తవ శ్లోకభావము స్మరణీయములు.

లక్ష్మీదేవి అధరము పగడపుశోభను కల్గియుండుటను **"తువర్క్కుమ్ పవళవాయ్ ప్పూమ కళుమ్"** (పగడపు మోవిని కల లక్ష్మీదేవి) అని పేయాళ్వార్లు స్తుతింపగా, ఆమె సహజ సౌకుమార్యమును **"మెల్లియలై తిరు"** (6-9-6) అని తిరుమంగై మన్నన్ పొగడిరి. భట్టర్ శ్రీగుణ రత్నకోశ మనుస్తుతిలో **"త్వయి స్త్రీత్వైకాంతాన్ మ్రదిమ పతిపారార్థ్య కరుణాక్షమాదీన్"** (స్త్రీత్వానికే తగిన మృదుత్వం, పతిపారతంత్ర్యం, కరుణ, క్షమ మొదలైన గుణాలను) అనుచు లక్ష్మీసౌకుమార్యము భగవానుని సౌకుమార్యము కంటే మిన్న అనిరి. **"పాదారుంతుదమేవ"** అను వేఱొక శ్లోకములోకూడా **"అతికోమలా తనురియమ్"** అని నుడివిరి.

**11. పరిహసిత దరహసిత కోకనద కుందరద మంథరతరోద్గత్వర విసృత్వర కాంతివీచి కమనీయామంద మంద హాస సదనవదనే !**

పరిహసిత = పరిహసింపబడిన (గేలి చేయబడిన), దరహసిత = కొంచెము వికసించిన, కోకనద = ఎఱ్ఱకలువను, కుంద = కుందపుష్పమును కల, రద = దంతములనుండి, మంథరతర = మిక్కిలి మెల్లగా, ఉద్గత్వర = పైకి ప్రసరించి, విసృత్వర = అంతట విస్తరించు స్వభావమును కల, కాంతి = కాంతియొక్క, వీచి= కెఱటములచే, కమనీయ = అందమైన, అమంద మందహాస = స్పష్టమైన చిఱునవ్వునకు, సదన = నివాసము అయిన, వదనే = వదనమును కల్గినదానా !

పూర్వవిశేషణమున పద్మావతీదేవియొక్క మందహాస ప్రభావమువలన ఎఱ్ఱనైనపెదవులశోభ వర్ణింపబడినది. ఇందు లక్ష్మీదేవి అట్లు నవ్వునపుడు పైకి కనిపించు పలువరుసల నుండి వెల్వడు కాంతియొక్కగొప్పతనము చక్కనిఉత్ప్రేక్షతో తెలుపబడుచున్నది.

పద్మావతీదేవి దంతములు ఇంచుక వికసించిన (పూర్తిగా మొగ్గలుకాని) కోకనదములవలె,సన్నజాజిమొగ్గలవలె నున్నవి. తెల్లని ఆ దంతములనుండి వెలువడిన కాంతివీచికలు పైకి ప్రసరించి, ముఖమునందు అంతట వ్యాపించినవి. అందుచే ఆమె ముఖమండలము కమనీయమైయున్నది.

లక్ష్మీదేవి దంత సౌందర్యమును **"కమలప్పావై కదిర్ముత్త వెణ్ణకైయాళ్"** (లక్ష్మీదేవి ప్రకాశించే ముత్యాలవంటి దంతాలను కల్గినది) అనుచు తిరుమంగైమన్నన్ కీర్తించిరి. ***(ఇంకా ఉంది)***

**वेङ्कटाद्रिसमं स्थानं ब्रह्माण्डे नास्ति किञ्चन,**
**वेङ्कटेशसमो देवो न भूतो न भविष्यति।**



भगवतः श्रीनिवासस्य सन्देशवाहिनी सप्तगिरिमासपत्रिका तिरुमल-तिरुपति देवस्थानेन पञ्चभाषासु (तेलुगु-तमिल-कन्नड-हिन्दी-आङ्गलभाषासु) प्रकाश्यमाना वर्तते। तथैव संस्कृताभिमानिनाम् इच्छाम् उररीकृत्य संस्कृतभाषायामपि मासपत्रिकामेनां समानेतुं तिरुमल-तिरुपति-देवस्थानेन सङ्कल्पिता। इदं प्रथमतया तेलुगु-हिन्दीभाषयोः सप्तगिरिपत्रिकायाः अभ्यन्तरे अष्टपुटात्मिका सञ्चिका प्रकाश्यमाना वर्तते। अचिरादेव एषा पत्रिका स्वतन्त्रतया संस्कृताम्बरे विहरिष्यति। संस्कृतज्ञाः संस्कृताभिमानिनश्च एनां पत्रिकां स्वागतीकरिष्यन्तीति विश्वसिमः।

**- प्रधानसंपादकः**

**सूचना**

मुद्रितलेखानां विचाराः लोखकानामेव ।
एतद्विषये अस्माकं दायित्वं नास्ति।
***– प्रधानसंपादकः***


# सप्तगिरिः
## तिरुमल-तिरुपति-देवस्थानम्
### सचित्रमासपत्रिका
### अक्टोबर् - २०१३


# स्वामिपुष्करिणी

**श्रीमती सी.ललिताराणी**

श्री वेङ्कटाचले कोटित्रयसंख्यकाः तीर्थाः सन्ति। तेषु तीर्थेषु स्वामिपुष्करिणी अत्यन्तं प्रसिद्धा। पुष्करिणी माहात्म्यं वराह-भविष्योत्तर-स्कांद-मार्कन्डेय-वामन-ब्रह्म-पद्मपुराणेषु वर्णितम्। पुष्करिण्याः आविर्भावः, शब्दार्थः, प्रभावः स्नानमहिमादयः अंशाः प्रबन्धे अत्र परिशीलिताः।

**आविर्भावः**

वराहरूपिणः भगवतः विष्णोः आदेशात् वैनतेयः वैकुण्ठात् क्रीडापर्वतं भूलोकमानीतवान्। क्रीडापर्वते तस्मिन् क्रीडावापी काचिदस्ति। सैव स्वामिपुष्करिणीति प्रसिद्धा। तदुक्तं वराहपुराणे –

**स्वामिपुष्करिणी पुण्या सर्वपापप्रणाशिनी।**
**वैकुण्ठात् भगवत्क्रीडावापी श्रीभूमिलालिता।।**
**अप्राकृतजलौघा च सुगन्धा सुमनोहरा।**
**गंगादिसर्वतीर्थानां जन्मभूमिश्शुभोदका।**
**आनीता वैनतेयेन क्रीडार्थं तत्र तिष्ठति।**

इति। अतः गरुडेन आनीते क्रीडाचले विद्यमाना क्रीडावापी स्वामिपुष्करिणीति नाम्ना प्रथिता इति ज्ञायते।

**शब्दार्थः**

वराहपुराणे अस्य सरोवरस्य स्वामिपुष्करिणी इति व्यवहारः उपलभ्यते। सर्वेषां तीर्थानां यत इयं स्वामिनी अत एव तथा संज्ञा अस्याः जातेति ज्ञायते। अत एव उक्तं वराहपुराणे –

**स्वामिपुष्करिणी शब्दो रूढस्तस्मिन् सरोवरे।**
**व्युत्पत्तिः कथिता तस्याः तीर्थानां स्वामिनी यतः।।**

इति। अस्मिन्नेव सन्दर्भे शब्दस्यास्य व्युत्पत्तिः अन्यापि वराहपुराणे प्रतिपादिता –

**स्वामित्वस्य प्रदानाच्च स्वामिपुष्करिणीत्वियम् ।**
**अहो! महत्त्वं तीर्थस्य दर्शनं पापनाशनम्।।**

अनेन इदं ज्ञायते 'स्वामिनं करोति स्नातारमिति 'स्वामिपुष्करिणी' इति।

एवमेव इयं पुष्करिणी भगवतः वराहस्वामिनः निवासः अतः **वराहपुष्करिणी** इत्यपि प्रसिद्धेति वराहपुराणे दृश्यते।

**वर्णनम्**

अद्य तिरुमलक्षेत्रे पुष्करिण्याः स्वरूपं यत् दृश्यते ततः भिन्नं तस्याः प्राचीनस्वरूपम्। पुरा पुष्करिणीयं अशोक पुन्नाग वकुलादि वृक्षैः शोभिता। अस्यां सप्तपर्ण-बांडीरवृक्षाश्च विलसन्ति स्म। मत्स्याः कच्छपाः जलकुक्कुटाः अस्यां निवसन्ति स्म। विविध पुष्पैः शोभमाना इयं पुष्करिणी गंगादि सर्वतीर्थानां जन्मभूमिः इति प्रथिता।

**प्रभावः**

अस्याः पुष्करिण्याः स्नानमात्रेण प्रज्ञा-लक्षीः-यशः-धनं - वैराग्यं च भक्तः प्राप्नोति। सर्वपापक्षयकारिणी ईप्सितार्थ प्रदायिनी इयं पुष्करिणीति पुराणेषु श्रूयते।

**स्नानमहिमा**

भक्तानां स्वामिपुष्करिणीस्नाने यादृशी भावना भवति तेषां तादृशी सिद्धिः संभवति इति विश्वासः। येन वा सङ्कल्पेन भक्तः पुष्करिण्यां स्नानं करोति सः म् अवश्यं प्राप्नोति इति लोकानुभवः।

**स्वामिपुष्करिणीस्नानं सद्गुरोः पादसेवनम्।**
**एकादशीव्रतं चापि त्रयमत्यन्तदुर्लभम्।**
**दुर्लभं मानुषं जन्म दुर्लभं तत्र जीवनम्।**
**स्वामिपुष्करिणीस्नानं त्रयमत्यन्तदुर्लभम्।।**

पुष्करिणी स्नानं सद्गुरोः पादसेवनं, एकादशीव्रतं च इति त्रितयं अत्यंतदुर्लभम् । मानवजन्म दुर्लभं, पुष्करिणी



तटजीवनम् अत्यंतदुर्लभम् । तस्यां स्नानं परं दुर्लभम् इति, पुष्करिणी माहात्म्यं वक्तुं शेषोऽपि असमर्थ इति वराहपुराणे उक्तम् ।

**पुष्करिणीसंबध्दाः महापुरुषाः –**

अनया स्वामिपुष्करिण्या केचिन्महापुरुषाः संबध्दाः। तेषु दशरथः, शंखणः, नारायणः, श्रीरामः, काश्यपः, धर्मगुप्तः, सुमतिः इत्यादयः प्रसिद्धाः।

**दशरथः**

अपुत्रः दशरथः पुत्रार्थं स्वामिपुष्करिणी स्नानम् अकरोत्। ततः तस्य चत्वारः पुत्राः अजायन्त इति वराहपुराणात् अवगम्यते।

**शंखणः**

अपहृतराज्यः शंखणनामा राजा पुष्करिणीस्नानमहिम्ना राज्यं पुनः प्राप्तवान्।

**नारायणः**

अङ्गिरसपुत्रः नारायणनामक ब्राह्मणः आसीत् । सः स्वामिपुष्करिणीस्नानमहिम्ना भगवतः श्रीनिवासात् वरं प्राप्य वैकुण्ठमुपगतः।

**श्रीरामः**

श्रीरामः पुष्करिणीस्नानमहिम्ना रावणं जघान, सीतां च प्राप्तवान्।

**काश्यपः**

शृङ्गिमहर्षिणा शप्तं परीक्षितं तक्षकात् परिरक्षितुम् उद्युक्तः मांत्रिकः काश्यपो नाम ब्राह्मणः, मार्गमध्ये तक्षकेण दत्तानि रत्नानि स्वीकृत्य स्वलक्ष्यं अनादृत्यम् प्रति गतवान्। तेन कारणेन सः महतीम् अशान्तिं प्राप्तवान्। ततः पुष्करिणी स्नानेन सः तस्मात् पापात् विमुक्तः।



**धर्मगुप्तः**

नंदनमहाराजस्य पुत्रः धर्मगुप्तः शापवशात् कंचित्कालम् उन्मतः अभूत्। तदनन्तरं स्वामिपुष्करिणीस्नानमहिम्ना स्वस्थः भूत्वा पूर्वस्थितिं प्राप्तवान्।

**सुमतिः**

महाराष्ट्रे यज्ञदेवनामकः ब्राह्मणः आसीत्। तस्य पुत्रः सुमतिः। सः कदाचित् ब्रह्महत्यां कृतवान्। स्वामिपुष्करिणी स्नानमहिम्ना तस्य सा पीडा निवृत्ता अभवत्।

एवं स्वामिपुष्करिण्याः वैशिष्ट्यं वराहादिषु पुराणेषु म्सम्यक्प्रतिपादित अत्याश्चर्यकरम् उपलक्ष्यते। अतः भक्तै : न्यूनातिन्यूनं स्वजीवने एकवारं वा स्वामिपुष्करिणी स्नानं कर्तव्यमेवेति संङ्कल्प्यते।

శ్లోకాలే ఇంతతక్కువకాలంలో పారాయణం చేస్తుంటే - ఇక కృష్ణార్జునులసంభాషణకు ఇంకా తక్కువకాలమే పట్టిఉంటుంది. గీతోపదేశం అయ్యాక కొంతసేపటికి యుద్ధం ప్రారంభ మయ్యింది. ఆ తర్వాత యుద్ధమే తప్ప-18 రోజుల యుద్ధంలో- ఎప్పుడూ గీతాబోధలాంటిది చేయలేదు- కృష్ణుడు. కనుక గీతా బోధ ఒకేరోజు-యుద్ధప్రారంభసమయానికి ముందుగా దాదాపు రెండుగంటలవ్యవధిలో జరిగిం దని తెలుస్తోంది. ఇందుకు ఎన్నిరోజులు? అనేప్రశ్న లేదు. ధర్మరాజు రాజ్య మేలేకాలంలో అర్జునునిఅభ్యర్థనపై కృష్ణుడు కొన్నివిషయాలు బోధించాడు. అవి 'అనుగీత'-'ఉత్తరగీత'- అనేపేర్లతో ప్రచారంలో ఉన్నాయి.

**ఆత్మగుణాలు ఎనిమిది ఉన్నాయంటారు గదా! అవి యేవో వివరించండి.** *- పి.ప్రభాకరశర్మ, ఏలూరు.*

☛ ఆత్మగుణాలు 1)దయ 2)క్షాంతి 3)అనసూయ 4)శౌచం 5)అనాయాసం 6)మాంగల్యం 7)అకార్పణ్యం 8)అస్పృహ. వీటిల్నిగూర్చి గౌతమధర్మసూత్రాలు వివరించాయి.

**1)దయా** - 'ఆపన్నస్య ద్వేష్టురపి రక్షణమ్'. శత్రు వయినా సరే ఆపదలో ఉన్నా డని తెలిస్తే, వెళ్లి అతణ్ణి రక్షించడం.

**2)క్షాంతిః** - 'బాహ్యే అభ్యంతరే వా పరేణ దుఃఖే ఉత్పాదితేఽపి కోపాభావమ్' ఇతరులు తనకు దుఃఖం కల్గిస్తే కూడా - వారిపై లోపల (మనస్సు) గానీ, బయటకానీ కోపం లేకుండా ఉండడం. ఇదే ఓర్పు!

**3)అనసూయా** - 'గుణినాం గుణా ననావిష్కరణం అసూయా, తద్భిన్నా అనసూయా' గుణవంతుల్లో ఉండేగుణాన్ని గ్రహించి, వెల్లడి చేయకపోవడం అంటే వాళ్లమంచితనాన్ని చూచి, ఓర్వలేకపోవడం అసూయ. అలాంటి అసూయాగుణం లేకుండా, మంచిని గ్రహించి, గౌరవించి, పదిమందికీ ప్రకటించడం అనసూయ.

**4)శౌచమ్** - 'నిందితసంసర్గఅభక్ష్యాది పరిహారపూర్వకం స్వధర్మవ్యవస్థాపనం శౌచమ్'. 'శౌచం సంకరవర్జనమ్'- నీచులతో స్నేహం, తినరానిపదార్థాలు తినకుండా ఉండడం, ఇలా ఉంటూ స్వధర్మాన్ని ఆచరిస్తుండడం. అంటే వేదశాస్త్రాలు సూచించినధర్మాలను గౌరవించి, ఆచరించడం - శౌచం- నిర్మలత్వం.

**5)అనాయాసః**- 'శరీరపీడావహ క్షుద్రకర్మాచరణ మాయాసః, తద్భిన్నః అనాయాసః' శరీరానికి శ్రమ, బాధ కల్గించే నీచ మైనపనులు చేయడం - ఆయాసం. అలాంటినీచకర్మలు చేయకుండా- సత్కర్మాచరణపరుడై ఉండడం - అనాయాసం.

**6)మాంగల్యమ్** - 'అప్రశస్తకర్మవర్జనపూర్వకం, ప్రశస్తకర్మా చరణం మంగళం-తద్భావః-మాంగల్యమ్. నిందింపదగినవైన నీచకర్మలు వదలి, అందరూ ప్రశంసించగల మంచిపనులు చేయడం మంగళం. మంగళంయొక్కభావం మాంగల్యం.

**7)అకార్పణ్యమ్** - 'అదైన్యపూర్వకం సత్పాత్రే భక్త్యా శక్త్యాచ ప్రత్యహం దాన మకార్పణ్యమ్' - లోభగుణం లేకుండా యోగ్యులైనవాళ్లకు శక్తికొలదీ భక్తితో ప్రతిదినం దానం చేయడం (ఇవ్వడం) - అకార్పణ్యం.

**8)అస్పృహా** - 'పరకీయవస్తు న్యభిలాషః స్పృహా. తద్భిన్నా అస్పృహా' ఇతురుల వస్తువుల్ని కోరుకోవడం స్పృహ. ఇందుకు భిన్నంగా- అంటే ఇతరులవస్తువుల్ని తాను కోరుకుండా ఉండడం - అస్పృహ.

ఈ ఎనిమిదీ ఆత్మగుణాలు. వీటిల్ని ఆచరిస్తే తప్పక చిత్తశుద్ధి కల్గుతుంది. శాస్త్రం పేర్కొన్ననలభైసంస్కారాలు పొంది, ఈ ఎన్మిదిఆత్మగుణాలు కల్గినవాడు బ్రహ్మలోకాన్ని పొంది, బ్రహ్మసాయుజ్యం చెందగలడు. ఇంతేకాదు- నలభైసంస్కారా లలో కొన్నింటిని పొందినా - ఈ ఆత్మగుణాలు ఎన్మిదీ కల్గిన వాడైతేకూడా బ్రహ్మలోక, బ్రహ్మసాయుజ్యాలు పొందుతాడు. ఈ గుణా లన్నీ భక్తిశ్రద్ధలతో వేదాంతవిషయాలు శ్రవణం చేసినపుడు-జ్ఞానవిషయంలో మనిషికి మిక్కిలి తోడ్పడతాయి. ఈ ఆత్మగుణాలు దైవీసంపదకు చెందినవి. ఇక్కడ 'ఆత్మ' అంటే పరమాత్మ అని కాదు. శరీరాన్ని నడిపించే జీవాత్మ, జీవుడు. కనుక జీవుడు జ్ఞానికావడానికీ, పురుషుడు పురుషోత్తముడు కావడానికీ ఈ గుణాలు చాలాముఖ్యమైనవి. ('నిత్య కర్మాష్టకం ఉపోద్ఘాతం' - స్వధర్మప్రకాశినీగ్రంథప్రచురణసంస్థ, హైదరా బాదు - 44)

# భక్తి నీతి సుధ

కె. సుజాత

కె ఆర్.కె.మోహన్ కథలు నైతికవిలువలకు ప్రాధాన్యత నిస్తూ సామాజికప్రయోజనాన్ని ఆశిస్తూ వ్రాయ బడ్డాయి. అవినీతికి ఆనకట్ట వేస్తూ, అరాచకాన్ని వేలెత్తి చూపిస్తూ, దైవత్వాన్ని ప్రబోధిస్తూ ఉంటాయి. భగవంతుడిసృష్టి క్రమబద్ధ మైంది. దాన్ని ఏమాత్రం తారుమారు చేద్దా మని చూచినా సృష్టిలోని జీవరాసులకు నష్టం వాటిల్లుతుంది.

'దైవలీల' అనే కథలో రామదేవు డనేకమ్మరి మంచిశివ భక్తుడు. మట్టితో శివలింగం చేసి, పూజించేవాడు. ఒకరోజు శివుడు కలలో కనిపించి, వరం కోరుకో మన్నాడు. కుమ్మరి తన కుండలు పగిలిపోకుండా ఉండేట్లు వరమీయ మని కోరాడు. ఆ వరప్రభావంచేత కుండలు పగలడం మానేశాయి. మొదట్లో అతనికుండలు త్వరగా అమ్ముడైనాయి. రాను రాను ప్రజల్లో పగలనికుండలవల్ల కుండలు కొనేఅవసరం ఎవ్వరికీ లేక పోయింది. మళ్లీ శివుడు ఒకనాడు అతడికలలో ప్రత్యక్షమైనాడు. "స్వామీ! బేరాలు లేవు, ఎప్పటిలాగే నా కుండలు పగిలలేటట్టు వరమి" మ్మని కోరాడు.

అప్పుడు శివుడు తనభక్తుడితో "నువ్వు కోరినట్టే జరుగుతుం" దని అభయమిచ్చాడు. "వస్తువుధర్మంపట్టి నడిస్తేనే ప్రపంచం క్రమంగా సాగుతుంది. ఇది దైవనిర్ణయం" అని శివుడు తన భక్తుడికి తెలియజేశాడు.

ఎదురు తిరిగినమోసం అనే కథలో స్వామిని మోస గించా లని ప్రయత్నిస్తే అంతకు పదింతలుగా అతడే మోస పోతాడు.

శ్రీరంగనాయకు డనేవడ్డీవ్యాపారి తనడబ్బుల్ని బ్యాంకుల్లో వేయకుండా ఇంట్లో దాచుకొనేవాడు. బ్యాంకులు దివాలా తీస్తా యని అతడికి భయం.

ఇలా ఉండగా ప్రభుత్వం వెయ్యరూపాయలనోటును రద్దు చేసింది. శ్రీరంగనాయకుడు ఆ సమయంలో విదేశాల్లో ఉన్నందువల్ల ప్రభుత్వం నిర్ణయించినగడువులోపల సొమ్మును మార్చుకోలేకపోయాడు. సమయం మించిపోయింది. రంగ నాయకుడికి తిరుపతి వేంకటేశ్వరస్వామి మొక్కుంది. ఆ మారని డబ్బును స్వామిహుండీలో వేసివచ్చాడు. ఇంటికి తిరిగి వచ్చి ఉదయాన్నే దినపత్రిక చదువుతూ ఉంటే వెయ్యిరూపాయలనోట్ల చెలామణి ఇంకా కొన్నాళ్లు పొడిగించినట్లు ప్రభుత్వప్రకటన కనిపించింది. ఆపదమొక్కులవాణ్ణి మోసగిస్తే ఊరుకుంటాడా? తిరుక్షవరం చేశా డని వ్యాపారి చింతించాడు.

అమ్మవారికటాక్షం ఉంటే ఎంత జటిలసమస్యనైనా ఎదుర్కోవచ్చనే కథ 'ఏ ఆవ్ రా బావా' అనే కథ. రాజరాజు నవరాత్రులపండగసందర్భంలో సాహిత్యకార్యక్రమాలు జరు పుతూ ఒకసమస్యాపూరణం ఇచ్చాడు. సమస్యను పూరించిన వారికి గొప్పబహుమతి ప్రకటించాడు.

శివశర్మ అనేవానిభార్య పార్వతీదేవిని ప్రార్థించింది. తనభర్త ఆ పోటీలో జయించేదారి చూప మని కోరుకున్నది. ఆయనఇంట్లో రెండావులు ఈనేట్లు ఉన్నాయి. శివశర్మ స్నానానికి పోతూ తనబావమరిదితో ఆవును గమనించ మని చెప్పాడు. అతడు స్నానం చేసి, వస్తూవుంటే 'బావా! ఆవు ఈనింది' అని పెద్దగా కేక వేశాడు. 'ఏ ఆవ్ రా బావా?' అని శివశర్మ ప్రశ్నించాడు.

అతడిభార్య విని, ఈ మాటే నీకు రాజాస్థానంలో పనికి వస్తుం దని చెప్పింది. సరస్వతీదేవి ఆవిధంగా కటాక్షిం చింది. 'ఏ' మరాఠీ, 'ఆవ్' హిందీ, 'రా' తెలుగు, 'బా' కన్నడం, 'వా' తమిళం–అన్నిటికీ కలిపి 'రమ్మని' ఒకే అర్థం. ఆయనసభలో ఈ వాక్యం చెప్పగానే సభ హర్షధ్వానాలతో నిండింది. రాజు ప్రకటిం చినబహుమతి నిచ్చి సన్మానించాడు. ఎన్నోభాషల్ని తనలో ఇముడ్చుకోవడమే తెలుగుభాషగొప్పతనం. అష్టావధా నశతా వధానాలు ఈ భాషకే పరిమితం. తెలుగుతల్లిఔన్నత్యం చెప్ప నలవిగాదు. చేపలకుగూడా దేవు డున్నా డని మోహన్ గారు వ్రాసిన 'ముప్పు తెచ్చుకున్న చేపలు' అనే కథ చెపుతున్నది. ఒకప్పుడు సముద్రంలో చేప లన్నీ ఒకేరకంగా ఉండేవి. నీళ్లలో తిరుగుతూ ఆకాశంలో ఎగిరేవి. చేపలకు దేవుడు తంగరువా.

ఒకసారి ఒక మనిషి భార్యతో పోట్లాడి పరా రయ్యాడు. అతడిభార్య తంగరువాను ప్రార్థించింది. అతడు ఆమెభర్తను

సైన్యంచేత వెతికించి, తెచ్చిపెట్టాడు. చేపలుకూడా తంగరువాను ప్రార్థిస్తే అతడు వరం కోరుకో మన్నాడు. ఆ చేపలు తలోరకంగా శరీరపురంగుల్ని, చదరంగా, నక్షత్రాలులాగా రకరకాల ఆకారాలు ఇవ్వ మని కోరాయి. అత డిచ్చినవరంవల్ల అవి చిన్నవి, పెద్దవిగా మారాయి. చిన్నచేపల్ని, పెద్దచేపలు తినసాగాయి. వాటిమధ్య ఏర్పడిన అనైక్యతవల్ల వేరుపడ్డచేపల్ని వేటాడి తినడం మనిషికి సులువైంది.

'సమఉజ్జీలు' అనే కథలో గొప్పవారిలో నిజాయితీ, సత్యం పలికేగుణం ఉంటుం దని రచయిత తెలియజేశాడు.

మూషికరాజు తనకూతుర్ని అందరికన్న గొప్పవాని కిచ్చి పెండ్లి చేయా లనుకున్నాడు. సూర్యుణ్ణి తనకు అల్లుడివి కమ్మని అడిగాడు. తనకన్న గొప్పవాడు మేఘు డనీ, తనను తనమేఘాలతో అతడు కప్పేయగల డనీ సూర్యుడు వివరించాడు.

మేఘుణ్ణి అల్లుడుగా రమ్మని కోరితే- తనకన్నా బలవంతుడు వాయు వనీ, తనను తొలగించగలశక్తి అతనికి ఉం దనీ చెప్పాడు. వాయువును తనకుమార్తెకు వరుడుగా రమ్మని కోరితే, అతడు తనకన్న బలవంతుడు పర్వతు డని చెప్పాడు. పర్వతుణ్ణి అడిగితే తనకన్న బలవంతుడు తనను తొలిచేమూషిక మని చెప్పాడు. అప్పుడు తనకూతుర్ని స్వజాతీయుడైన మూషికాని కిచ్చి పెండ్లిచేశాడు. ఎంతో గొప్పవారైనా వారు తమఔన్నత్యాన్ని చెప్పకుండా తమలోని లోపాన్ని తెలిపి, నిజాయితీ నిరూపించుకున్నారు.

ఎంతటివారికైనా గర్వం తగ దని చెప్పేకథ 'నారద గర్వభంగం'. నారదుడికి తనకు మించిన విష్ణుభక్తుడు లే డనే గర్వం ఉంది. ఆయన విష్ణుమూర్తిని దర్శించేందుకు వైకుంఠానికి వెళ్ళాడు. అప్పుడు స్వామి ఏకాగ్రతతో ఒకరిబొమ్మను గీస్తున్నాడు. ఆ చిత్రపటం ఎవరి దని లక్ష్మీదేవిని అడిగితే స్వామికి ప్రియమైన భక్తుడి దని చెప్పింది.

**ఆలోచన లేకుండా**
**తొందరపడి చేసిన పనులకు**
**బ్రతికినంతకాలం శల్యం లాగా**
**హృదయాన్ని పీడించే**
**దుష్ఫలం కలుగుతుంది.**

నారతుడు అతడిభక్తిని పరీక్షించడానికి భూలోకానికి వచ్చాడు. అతడు చిన్నఊర్లో చిన్నవసారాలో చెప్పులు కుట్టుకుంటున్నాడు. అతడు తనపనిలో నిమగ్నమైనాడే తప్ప ఒక్కసారికూడా దైవాన్ని తలచలేదు. అతడు ఇంటికి పోయేప్పుడు 'ఓ దేవా! రేపు నాకు చేయగలిగిన పని కల్పించు' అని స్వామికి నమస్కరించాడు.

నారదునికి లక్ష్మీదేవి సాక్షాత్కరించి 'నారదా! ఆ వ్యక్తికి తనకృషే తనప్రత్యక్షదైవం. పనిని చిత్తశుద్ధితో నమ్మాడు. అందుకే విష్ణువుకు అతనంటే ప్రేమ" అని చెప్పి నారదుడికి జ్ఞానోదయం కలిగించింది.

దేవు డెక్కడో లేదు - మనకు ప్రాణభిక్ష పెట్టినవారిలోనే ఉంటా డని మోహనుగారు కథాముఖంగా నిరూపించారు.

రంగనాయకు డనే భక్తుడు కాశీయాత్రకై జీవితాంతం సొమ్ము పొదుపుచేసి కూడబెట్టాడు. ఆ ఊర్లోనే ఫణిభూషణం అనే వడ్డీవ్యాపారి ఉన్నాడు. అత డంటే అందరికీ కోపం. అతడు దొంగలభయంతో సొమ్ము బ్యాంకులో వేసి ఉంచాడు. ఆదివారంనాడు బ్యాంకులేనిసమయంలో అతనికి గుండెపోటు వచ్చింది. అతనికి డబ్బు సహాయం ఎవ్వరూ చేయలేదు. రంగనాయకులు మానవత్వంతో కాశీయాత్రకు దాచుకున్న డబ్బు ఇచ్చి, ఆపరేషను చేయించి ఆదుకున్నాడు. ఫణిభూషణం ఆ సొమ్ము తిరిగి ఇవ్వకుండానే స్వామికి మొక్కు చెల్లించా లని తిరుమలకు, దైవదర్శనానికి వెళ్లాడు. శ్రీవేంకటేశ్వరుణ్ణి దర్శించుకునేసమయంలో స్వామిస్థానంలో రంగనాయకులే అతనికి కనిపించాడు. పుణ్యక్షేత్రయాత్రను విరమించుకొని నేరుగా తన ఊరు వచ్చి ఫణిభూషణం కాళ్లమీద పడ్డాడు. ప్రాణభిక్ష పెట్టిన నువ్వే నాకు దేవుడివి అని ఆలింగనం చేసుకొన్నాడు. దైవం ఈవిధంగా అతనికి కళ్లు తెరిపించాడు. భగవంతుడు ఏదో ఒకసందర్భంలో మనకు బుద్ధిగరుపుతూనే ఉంటాడు. ఇది అందరమూ గమనించాల్సిన సత్యం.

# తాళ్లపాక అన్నమయ్య ఆధ్యాత్మ సంకీర్తనల్లో... నిష్పన్ననామాలు

- కె.షణ్ముగం

తాళ్లపాక అన్నమయ్య రచించిన అధ్యాత్మసంకీర్తనల్లోని నాలుగుసంపుటాల్లో నేడు మొత్తం 1685 సంకీర్తనలు గలవు. 15వ శతాబ్దంలో తెలుగుసాహిత్యరంగంలో గొప్ప సంకీర్తనాచార్యులుగా ప్రఖ్యాతి పొందిన కవిపుంగవులు. అన్నమయ్య రచించినఆధ్యాత్మికసంకీర్తనలు, శృంగారసంకీర్తనలు, శ్రీవేంకటేశ్వరశతకం, శృంగారమంజరీకృతులు వంటివి ప్రస్తుతం మనకు లభ్యమవుతున్నవి. అధ్యాత్మసంకీర్తనల్లో నిష్పన్ననామాలు వివరణ :

అన్నమయ్య భాషలో పదాదిలో య, వ ల వాడకం కన్పిస్తుంది. తాళ్లపాక అన్నమయ్య ఆధ్యాత్మసంకీర్తనల్లో నిష్పన్న నామాలు -

| | |
|---|---|
| దిగువ | దిగువ పట్టణము |
| '**దిగువ పట్టణము**లోని దేవ హనుమంత' | సంపు.2-250 సం |
| సంకీర్తన | సంకీర్తన |
| 'పరమ **సంకీర్తన** ఫలములో నిలిపె' | సంపు.4-192 సం |
| మునుపు | మునుపటి |
| '**మునుపటి** బ్రహ్మలు ముందరి బ్రహ్మలు' | సంపు.3-116 సం |

తాళ్లపాక అన్నమయ్య అధ్యాత్మ సంకీర్తనల్లోని నిష్పన్న నామాలు -

**భావార్థక నిష్పన్ననామాలు :**

| | |
|---|---|
| కను - | కనుట |
| 'చెప్పగలరాని మేలుగనుట శ్రీ వేంకటపతి గనుటలు' | సంపు.1-2 సం |
| మొక్కు - | మొక్కులు |
| 'వేవేలు మొక్కులు లోకపావని నీకమ్మ' | సంపు.1-188 సం |
| విను, మను - | వినికి, మనికి |
| 'వినికి, మనికియును విష్ణుదే' | సంపు.4-335 సం |
| యెచ్చరించు - | యెచ్చరిక |
| యెచ్చరికc దిరు వేంకటేశుని గొలువక వుంటే | సంపు.1-55 సం |
| తలంచు- | తలంపు |
| తలంపునకు విష్ణుచింతన నిమిషమాత్రంబు | సంపు.1-202 సం |
| కొండాడు - | కొండాటము |
| కొసరే బ్రహ్మాదుల కొండాటము అదే | సంపు.4-1 సం |
| వుండు - | వునికి |
| వునికి ప్రాణులకు బ్రహ్మోపదేశంబు | సంపు.1-326 సం |
| హరి - | హరిమయము |
| మహి ఇంతా, హరిమయముగc గనుటే | సంపు.4-21 సం |
| పొల | పోలుసు |
| పోలుసు లాడకు నీవు పురుషోత్తమా | సంపు.2-283 సం |
| పొడవు | పొడవగు |
| పొడవునకు బొడవగు పురుషోత్తము డిదే | సంపు. 3-10 సం |
| ఈతcడు | ఈశుc డనేటి |
| అంచెల శ్రీవేంకటేశుc డనే దేవుcడు వచ్చి | సంపు.3-386 సం |
| అచ్చుతుడు | అచ్చుతుc డనియెడి |
| అచ్చుతుc డనియెడి శ్రీ వేంకటాద్రివిభునిశరణనవోమనసా | సంపు.3-561 సం |
| ఉత్తముడు | ఉత్తముc డనియెడి |
| పురుషోత్తముc డనేటి పురుషార్థము | సంపు.2-3 సం |
| పూజించిన | పూజించినవారు |
| శ్రీనాథ మిమ్మునే పూజించినవారు హరి | సంపు.1-411 సం |
| పెండ్లాడిన | పెండ్లాడిన రాఘవా |
| సిరులతో జనకుని ఇంటను జానకిcజెలగి పెండ్లాడిన రాఘవా | సంపు.1-392 |
| కృప | కృపచేరు |
| శ్రీవేంకటేశు కృపచేరు నందాకా? | సంపు.1-249 సం |
| పెండ్లి | పెండియాడు |
| సీతc బెండియాడెను యీ చిన్నరాముcడా | సంపు2-497 సం |
| తృప్తి | తృప్తియిచ్చు |
| హరియే సకల క్రియవై తృప్తియిచ్చుcగాక | సంపు 2-126 సం |
| తీర్థము | తీర్థమాడు |
| శ్రీవేంకటేశుcడే నీవునికిదీకొని తీర్థమాడితి యికాపమమ్ము | సంపు 2-426 సం |
| మేలు | మేలుకొను |
| చెప్పగరాని మేలుగనుట శ్రీవేంకటపతి గనుటలు | సంపు 1-1 సం |

| | |
|---|---|
| తిరు / మల | తిరుమల |
| తిరుమల మన్ననలు దైవికము | సంపు 1-65 సం |
| మల | మల |
| దైవశిఖామణి తిరుమల దేవునిమన్ననలు | సంపు 1-65 సం |
| కను | కనుగొను |
| గోవిందయము గనుఁగొంటి మిప్పుడే | సంపు.2-322 సం |
| భక్తి | భక్తినిలుపు |
| భావించి యాతనిపై భక్తి నిలిపినను | సంపు.4-174 సం |
| పాదు | పాదుకొలుపు |
| పాదుకొలిపినవారు బ్రహ్మలు | సంపు.1-365 సం |
| పరిమళమ్ములు | పరిమళమ్ములగు |
| పరిమళమ్ముల బుష్పముల కడు వెరవుగా వేంకటపతికినై | సంపు. 4-45సం |
| రక్షకుడు | రక్షకుడైన |
| వేదరక్షకుడైన వేంకటగిరీశ్వరునిపాదసేవ | సంపు.1-365 సం |
| అందము | అందమైన |
| అందమైన తిరువేంటాద్రీశ నీ ప్రేమ | సంపు.1-360 సం |
| విరాట్టు | విరాట్టయిన |
| విశ్వరూపపు బ్రహ్మము విరాట్టయిన బ్రహ్మము | సంపు.2-371 సం |
| సంతోషకరము | సంతోషకరమైన |
| సంతోషకరమైన సంకీర్తన | సంపు.1-343 సం |
| జయము | జయమగు |
| జయమగు వేంకటశైలము పైపడు | సంపు.1-258 సం |
| శరణు | శరణనే |
| చక్కగా శ్రీవేంకటేశ శరణనే బుద్ధినాకు | సంపు.2-130సం |
| ఒప్పు | ఒప్పగు |
| వొప్పగు సంసార మిది వున్నతి నాచార్యసేవ | సంపు.3-80 సం |

**తిరుమలతిరుపతిదేవస్థానములు, తిరుపతి**

## శ్రీ వేంకటేశ్వరస్వామి ఆలయం, తొండమనాడు

- ఆకాశరాజుతమ్ముడైన తొండమానుడు తొండమనాడు మండలాన్ని ప్రజారంజకంగా పాలిస్తూ అనేకదేవాలయాలు నిర్మించాడు. ఈయన ప్రతిరోజూ తిరుమల వెళ్ళి, శ్రీవారిసేవ చేసుకుని వచ్చేవాడు. తొండమానునికి వయసు మీరగా తిరుమల వెళ్ళి శ్రీవారిని దర్శించుకోలేని తనఅశక్తతను శ్రీవారికి విన్నవించుకొన్నాడు.

- తొండమానుని ఉద్దేశాన్ని గ్రహించిన శ్రీవారు ఆయన ఇంటికి తానే స్వయంగా వచ్చి పూజలందుకొంటా నని మాట ఇచ్చాడు. ఆ మాట ప్రకారం శ్రీవారు శ్రీదేవీభూదేవీసమేతంగా తొండమానుని ఇంటికే వచ్చి, సేవలందు కొన్నారు. చక్రవర్తిఇంటిలో వెలసినస్వామిని "వీటిల్ యిరుందురాయ్ పెరుమాళ్" స్వామి అని పిలిచేవారు.

- తిరుమలలో ఆనందనిలయం నిర్మించింది తొండమానుడే కనుక ఇచ్చట తొండమనాడులోని తననివాసంవద్ద నిర్మించినదేవాలయగోపురంకూడా ఆనందనిలయంను పోలినట్లే ఏర్పాటుచేశాడు. ఇచ్చట స్వామివారు ఎచ్చటా లేనివిధంగా అభయహస్తంతో కూర్చున్నభంగిమలో శ్రీదేవీ భూదేవీ సమేతుడై దర్శనమిస్తున్నాడు. ఈ దేవాలయానికి సమీపంలో తొండమానుడు నిర్మించిన అతిపెద్దచెరువుకు తిరుమలలోని ఆకాశగంగ నుంచి ప్రవహించి, నీరు చేరేది. ఆ నీటిద్వారానే స్వామికి అభిషేకకైంకర్యాలు జరిపించేవిధంగా తొండమానుడు ఏర్పాట్లు చేశాడు.

- తొండమనాడులో శ్రీదేవీభూదేవీసమేతంగా అభయహస్తంతోనే కాక – యోగముద్రతో వెలసిన ఈ వేంకటేశ్వర స్వామిని దర్శించుకొన్నచో సకలమనోభీష్టాలు నెరవేరటమే గాక మానసికప్రశాంతతను ప్రసాదించేస్వామిగా భక్తుల విశ్వాసం.

# శ్రీ రంగనాయకస్వామి దేవాలయం,
## శ్రీరంగాపురం

వేదార్థం మధుసూదనాచార్యులు

మన దేవాలయాలు

'ఉ'త్తర శ్రీరంగం'గా పేరు పొందిన శ్రీ రంగనాయక స్వామిదేవాలయం మహబూబ్‌నగర్‌జిల్లా వన పర్తిమండలకేంద్రానికి 25 కి.మీ.దూరంలో, జాతీయ రహ దారిపై ఉన్న పెబ్బేరుమండలకేంద్రానికి 11 కి.మీ.దూరంలో ఉన్న శ్రీరంగాపురం గ్రామంలో ఉంది. ఐదుఅంతస్తుల గాలిగోపురం, రాతి స్తంభాలపై చెక్కినశిల్పాలు చూపరులను మంత్రముగ్ధుల్ని చేస్తాయి.

క్రీ.శ.1650-78 మధ్యకాలంలో ఈప్రాంతాన్ని పాలిం చినరెడ్డిరాజులకాలంలో ఈ దేవాలయనిర్మాణం జరిగింది.

వనపర్తి సంస్థానాధీశులలో పేరెన్నికగన్న గోపాలరావు. ఈ ఆలయనిర్మాణానికి మూలపురుషుడు.

భక్తిమార్గాలలో తీర్థయాత్రాసందర్శనం ముఖ్యమైంది. గోపాలరావు తీర్థయాత్రాసందర్శనం కొరకు తనపరివారంతో దక్షిణభారతదేశయాత్ర ప్రారంభించాడు. ఆ విధంగా బయలు దేరి, అనేకపుణ్యక్షేత్రాలను సందర్శించి, 1662లో తమిళ నాడులో ప్రసిద్ధిచెందిన శ్రీరంగక్షేత్రానికి వెళ్లాడు. మూడువైపుల కావేరీనది ప్రవహిస్తుండగా మధ్య భాగాన ద్వీపకల్పంవలె విరాజిల్లుతున్న శ్రీరంగం ఎంతో రమణీయంగా అతనికి కనిపించింది.

సప్తప్రాకారాల మధ్య వెలసియున్న ఆల యంలో శ్రీరంగనాయకస్వామి శ్రీదేవి, భూదేవి నీళాదేవులతో కూడి శేషతల్పంపై శయనించి ఉన్న స్వామివారిరూపాన్ని దర్శించి ముగ్ధుడైనాడు. ఈ ఆలయసౌందర్యాన్ని తలచుకుంటూ, ఇటువంటి ఆలయం తనరాజ్యంలోకూడా ఉంటే బాగుం డును కదా! అని ఆలోచిస్తూ ఆనాటి రాత్రి నిద్రిం చాడు.

ఆనాటి రాత్రి అతనికి శ్రీరంగనాయకస్వామి స్వప్నంలో సాక్షాత్కరించాడు. "నేను మీ ప్రాంతంలో గరుడరూపంలో దర్శన మిస్తాను. ఆ రూపం ఎక్కడ అదృశ్యమైతే అక్కడ నా ఆలయం నిర్మించండి" అని తెలిపాడు. తాను గోపాలరావుగారిరాజ్యంలో ఎక్కడ కొలువై ఉన్నాడో ఆ ప్రాంతాన్ని కళ్లకు కట్టినట్లుగా చూపించాడు.

ఆ తర్వాత గోపాలరావుగారు తిరుగుప్రయాణంలో తిరుపతి, కంచి మొదలైన క్షేత్రాలను దర్శించి, అక్కడి కవి పండితులను వెంటబెట్టుకొని, తన రాజ్యానికి చేరుకున్నాడు. ఆ రాత్రి నిద్రించాడు. తెల్లవారేసరికి తన ఇంటిముందు గరు త్మంతుడు కన్పించాడు. తనకు స్వప్నసందర్శనమైన ప్రాంతాన్ని వెదకడంకొరకు అతడు తనపరివారంతో ఆ గరుడుణ్ణి అనుసరించాడు. కానాయపల్లి, కొత్తకోట, సంకిరెడ్డిపల్లి అనే గ్రామాలమధ్య అడవిలో ఆ గరుత్మంతుడు వీరిని తీసుకెళ్తూ



ఒకపుట్టపై వాలాడు. రాజుగారు ఆ పుట్టపై నీళ్లు పోయించి, పుట్టమట్టిని కరగదీశాడు. ఆ తర్వాత బహుజాగ్రత్తగా మట్టిని త్రవ్వాడు. అలా త్రవ్వగానే దాదాపు ఐదడుగుల పొడవున శేషశయనుడై శ్రీదేవీ, భూదేవీ, నీళాదేవీ సహితుడై నాభియందు చతుర్ముఖబ్రహ్మ అలరారుచున్న శ్రీరంగనాయక స్వామివిగ్రహం కన్పించింది.

ఆ విగ్రహాన్ని జాగ్రత్తగా బండి కెత్తించారు. తిరిగి ఆ గరుడుడు ఆకాశమార్గాన పయనిస్తూ ఆలయనిర్మాణానికి సరియైన ప్రదేశాన్ని చూపించాడు. ఆ గరుడుణ్ణి అనుసరిస్తూ గోపాలరావు పరివారంతో బయలుదేరాడు. చివరికి అది కొరివిపాడు అనే గ్రామసమీపంలో గల ఒకగుట్టపై నిలిచి, ఆ తర్వాత అంతర్ధానమైంది. ఈ గుట్టపై గరుడుడు అంతర్ధాన మైనందున ఆగుట్టను గరుడాద్రి అని పిలుస్తున్నారు. అక్కడే విగ్రహం ప్రతిష్ఠించారు. క్రీ.శ.1670 సం॥లో ఆలయనిర్మాణం ప్రారంభించాడు– గోపాలరావు. తర్వాత ఈ గ్రామం శ్రీరంగా పురంగా ప్రసిద్ధి కెక్కింది.

గోపాలరావు తర్వాత రాణిశంకరమ్మ, రామేశ్వరరావు శ్రీరంగాపురఆలయనిర్మాణంలో అత్యంతాసక్తిని ప్రదర్శించి, తమిళనాడునుండి శిల్పులను రప్పించి, వివిధరకాలై శిల్పాలతో ఇరవైఅడుగులఎత్తుగల, మూడంతుస్తుల గోపురం, అరవై అడుగులు ఎత్తు, ఐదుఅంతస్తుల గాలిగోపురాలను నిర్మింప జేశారు. గర్భగుడిప్రక్కనే శ్రీమహాలక్ష్మీఆలయాన్ని నిర్మించారు. ఆలయానికి అరకిలోమీటరు దూరంలో గోదాదేవిఆలయాన్ని, కోనేరు, తోట నిర్మించారు.

ఆలయంలో అంగుళంస్థలంకూడా వృథా కాకుండా చక్కనిశిల్పాలు చెక్కారు. శ్రీలక్ష్మీదేవిఅమ్మవారి ఆలయం ముందు అద్భుతశిల్పకళారీతులలో కల్యాణమండపాన్ని నిర్మిం చారు.

దీనిప్రక్కనే పన్నిద్దరాళ్వారుల ఆలయం ఉంది. ఈ విధంగా శ్రీరంగనాయకస్వామి ఆలయంలో గర్భగుడి, శుకనాసిక మండపం, చతుర్భుజ తాయారు (లక్ష్మీదేవి) కోవెల, శ్రీసీతారామ చంద్రస్వామిఆలయం, వైకుంఠద్వారం, ధ్వజస్తంభం, హోమ శాల, పాకశాల, వాహనశాల, నేలమాళిగ, కొఠాయి మండపం మొదలగు అనేకవిశేషాలు ఉన్నాయి.

ఆలయంలో శ్రీరంగనాథస్వామికి నిత్యారాధన, షోడ శోపచారపూజలతో పాటు, వివిధపర్వదినాలలో విశేషపూజలు, ధనుర్మాసఉత్సవాలు, అధ్యయనోత్సవాలు, బ్రహ్మోత్సవాలు వైభవంగా నిర్వహిస్తారు.

ప్రతిసంవత్సరం ఫాల్గునమాసం శుక్లపక్షదశమినుండి కృష్ణపక్షంవిదియవరకు స్వామివారిబ్రహ్మోత్సవాలు నిర్వ హిస్తారు. ఈ రోజులలో వచ్చే పుబ్బనక్షత్రంరోజున స్వామివారి రథోత్సవాన్ని నిర్వహిస్తారు. ఇది ఇంచుమించుగా పౌర్ణిమకు ఒకరోజు ముందుగాగాని, పౌర్ణమిరోజున గాని వస్తుంది. నేటికీ వారివంశస్థులు కృష్ణదేవరావుగారు ఆలయఅభివృద్ధికి తోడ్పడు తున్నారు.

శ్రీరంగానికి చుట్టూఉన్న కావేరీనదిలా ఈ ఆలయం చుట్టూ రంగసముద్ర మనే చెరువుంది. ఈ విధంగా విశేషమైన శిల్పకళాచాతుర్యంతో, విలక్షణమైన చారిత్రకవిశేషాలతో, ఉత్తర శ్రీరంగంగా ప్రసిద్ధికెక్కిన శ్రీరంగనాయకస్వామిదేవాలయం ప్రతి ఒక్కరూ దర్శించవలసిందే!

## రిజిస్ట్రేషను ఫీజు....... ..... మినహాయింపు

***తిరుమల శ్రీవారికి భక్తులు మన రాష్ట్రంలో విరాళంగా సమర్పించే ఆస్తికి గాని / స్థలాలకు గాని రిజిస్ట్రేషన్ ఫీజు మిన హాయిస్తూ రాష్ట్ర ప్రభుత్వం ఉత్తర్వులు జారీ చేసింది.***

***దాతలు ఈ విషయాన్ని గమనించి, మినహాయింపు పొందవలసిందిగా విజ్ఞప్తి.***

# శ్రీవేంకటేశ్వర శతకం - బసవయ్య వర్ణన

డా॥ యం.మునిరత్నం

సంస్కృతంలో శతకప్రక్రియ ఆధునికమైందిగాని, తెలుగులో శతకరచనకు నన్నయగారే శ్రీకారంచుట్టినా రని చెప్ప వచ్చు. మహాభారతంఆదిపర్వంలో ఉదంకకృతనాగస్తోత్రంలో **"అనంతుడు మాకు ప్రసన్ను డయ్యెడున్"** అనే మకుటంతో వరుసగా నాల్గుపద్యాలు శతకపద్యాల కొకనమూనాను సంతరించిపెట్టిన ట్లయింది. సంస్కృతమహాభారతంలో లేని ఈపద్యభావాలు, మకుటనిర్మాణం అంతా నన్నయగారిఉపజ్ఞమే!

తెలుగులో భక్తిరసస్థాపనకోసమే శతకప్రక్రియ ప్రాదుర్భ వించిం దని చెప్పడంలో తప్పులే దనిపిస్తుంది. తక్కిన వివిధవిష యాలపై గలశతకాలు ఆ తర్వాతికాలంలో దేశకాలపరిస్థితుల ప్రభావానుగుణంగా పుట్టా యని చెప్పాలి. ప్రధానంగా భగవ ద్భక్తివ్యక్తీకరణంకోసమే శతకం తెలుగులో జన్మించిం దనడం వాస్తవం. దీనికి భక్తిరసం తీసుకొన్నపొడిగింపు పదాలు, తత్త్వ గీతాలు, సంకీర్తనలు, త్యాగరాజుకృతులు - ఇవన్నీ భక్తిరసాన్ని స్థాపించినసంగీతరచనలు.

తెలుగులో తొలిసారిగా భక్తిని 'రసం'గా పేర్కొన్న శివ కవి పాల్కురికిసోమనాథుడు.

బసవయ్య బహుముఖాలుగా శ్రీవేంకటేశ్వరశతకంలో ఈ భక్తితత్త్వాన్ని ఆవిష్కరింపజేయడానికి ప్రయత్నించాడు. బసవయ్యవేంకటేశ్వరస్వామి భక్తుడు. వేంకటేశ్వరుణ్ణి నిత్యం ఆరాధించే కవీశ్వరుడు. తన శతకంలోని సుగుణాలను కవి ఒకపద్యంలో ఇలా చెప్పాడు.

"వలసిన యర్థముల్, మధురవాక్కులు, పండితపామ రాళికిన్ దెలిసిన భావముల్, తెనుగుతేటయు, సంస్కృతపాట వంబు సద్విలసితరూపరేఖలు సవిస్తరభక్తిభావసంకలనము కాగ నాదుశతకంబును గూర్చుము వేంకటేశ్వరా!" (ప-4) పుట-5)

1)అర్థస్పష్టత 2)మధురవాక్కు 3)పరిచయభావపరిధి 4)తెనుగుతేట 5)సంస్కృతపాటవం 6)సుస్థిరభక్తిభావసంకలనం- ఈ శతకంలో కవి, భక్తి భావాలను సుస్థిరపరచడానికే రచించి నట్లు మనం చెప్పవచ్చు. మహాకవికాళిదాసు విక్రమోర్వశీయ నాటకనాందీశ్లోకంలో -

**సస్థాణు: స్థిరభక్తియోగసులభో నిశ్శ్రేయసాయాస్తు వ:**

- అని శివునిపరంగా 'శివుడు స్థిరభక్తియోగ సుల భుడు'! అతడే మోక్షప్రదాత! (నిశ్శ్రేయ మంటే మోక్షం) అని చెప్పాడు. శ్రీదాసిబసవయ్యగారి శతకసుగుణాలను పరామర్శించి నట్లయితే శ్రీవేంకటేశ్వరస్వామిపై గల భక్తిభావం తేట తెల్లమవు తుంది.

**1)అర్థస్ఫూర్తి / అర్థస్పష్టత**

నిలిపితి నాదుభారమును నీపయి, ప్రాపయి నన్ను గానగా పిలిచితి నిన్ను, మాకు నిలువేలుపువై కరణింతు వంచు నే దలచితి, నీ శుభాశిషము తావకభక్తునిపై వెలార్చగా కొలిచెద నెల్లవేళల నకుంఠితభక్తిని వేంకటేశ్వరా! (6వ పద్యం) పుట:6.

భక్తజనరక్షకుడు శ్రీవేంకటేశ్వరుడు. భక్తుడు తనయోగ క్షేమాలు, మంచిచెడ్డలు తాను తెలియనివాడు. గతము అస్పష్టం. వర్తమానం సందిగ్ధం. భవితవ్యం-అగమ్యగోచరం. ఈ పరి స్థితిలో తన కేది మంచి, ఏది చెడు అనేవిషయాన్ని ఆ శ్రీవేంకటేశ్వరుని నిర్ణయానికే వదలివేసి, తాను విధ్యుక్తధర్మాన్ని నెరవేర్చడమే భక్తుడు చేయగలిగిన పని. ఈ విధంగా తనదైన భారాన్ని భగవంతునియందు విన్యస్తం చేయడాన్నే "భరన్యాసం లేదా ప్రపత్తి" అంటారు. పారిభాషికపదాలు వాడకుండా దాని అర్థాన్ని వివరించారు-బసవయ్య. "ప్రాపు" అంటే ఏడుగడ-దిక్కు.

**"ప్రాపయి నన్ను గానగా పిలిచితి నిన్ను"**

"ఓ వేంకటేశ్వర! అన్నింటికీ నీవే దిక్కయి నన్ను చూడా లని నిన్ను పిలిచితి" నని చెప్పారు. ఈ పద్యపాదాన్నే "నన్ను గావగా పిలిచితి నిన్ను" అని చెబితే మరింత అర్థమవుతుంది.

1. **చూచుట - కరుణ, దయ / కాచు - కావు - రక్షించుట, రక్షణ**
2. **కాచుట - రక్షించుట**

ఆ భగవంతుడైన శ్రీవేంకటేశ్వరుణ్ణి భక్తుడు చూచు టయే మోక్షం. శ్రీమన్నారాయణుడే మోక్షప్రదాత. భక్తుణ్ణి

## తోడునీడ!

వేంకటపతికన్న వేరుదైవము లేదు
మొక్కుకున్నచాలు దిక్కు అగును
గొంతుగుండె కలిపి గోవింద యన చాలు
కోర్కెలన్ని దీర్చు కోరి అతడు -

. . . . . . .

అక్షరాలు కూర్చ ఆరాటపడుచుంటి
భాషరాదు నాకు భావ ముంది
ఆదిపురుష (దేవు) గొలువ అక్షరా లెందుకు?
ఆత్మసీమ నీకు ఆలయమ్ము

. . . . . . .

మట్టిపూల తోడ మరియాద చేసినా
కరుణ జూపుతాడు కలిమిరేడు
మనసుపుష్ప మిచ్చి మనసార ప్రార్థించు
మోహబంధ మిప్పి మోక్ష మిచ్చు

. . . . . . .

వేడినంత చాలు వేదనల్ పాపును
దిక్కు నీవె యన్న దీవె నిచ్చు
తోడు నీడ తానె ఏడుకొండలవాడు
ఎల్లవారి కెపుడు కల్లగాదు!

– *డా॥ సి.శైలకుమార్*

ఎల్లవేళల రక్షించును. భగవంతుడు ఆర్తత్రాణపరాయణుడు గజేంద్రునిప్రాణాలను రక్షించి ముక్తి నొసంగినవాడు.

3. ఇలువేలుపు అంటే కులదైవం, గృహదైవం కులదేవత ఆ కులంలోనివారి నందరినీ కరుణించి రక్షించేవాడు. ఇలు వేలుపు/ఇలువేల్పు చక్కనితెలుగుపలుకుబడి.

4. భక్తునిపై భగవంతుడు శుభాశీస్సులు కురిపిస్తాడు. అశుభా లను తొలగించి, శుభాలను కలుగజేసేవాడు దేవుడు. ఆయనే ఇక్కడ వేంకటేశ్వరుడు. సర్వేశ్వరుడు, సర్వాంత ర్యామి. అందుకే ఆయనను భక్తులు "వెంకటరమణ! గోవిందా!

సంకటహరణగోవిందా!" అని గొంతెత్తి ఆర్తితో పిలుస్తు న్నారు. భక్తిగా కొలుస్తున్నారు.

5. "కొలిచెద నెల్లవేళల నకుంఠితభక్తిని వేంకటేశ్వరా!" ఈ పద్యంలో కఠినపదాలే లేవు. సంస్కృతశబ్దాలు రెండే వాడాడు. "శుభాశిషము", "అంకుంఠితభక్తి"– తక్కిన వన్నీ తెలుగుమాటలే!

ఇక్కడ కుంఠితము కానిది అకుంఠితము,"మొక్కవోని భక్తి, ధారాపాతమైన భక్తి. భక్తిలో నిమగ్నమైన వాడు భగవంతుని స్మరణంలో ఉంటాడు. భగవంతునిమీదేధ్యాస, భగవంతుని మీదే శ్వాసగా ఉండడం – అకుంఠితభక్తి.

భగవంతునికరుణాకటాక్షవీక్షణంకోసం బసవయ్య కవి పరితపిస్తున్నాడు. తప్పులు చేయడంలో నేను తక్కువవాడను కాను! అని కవి అందరుభక్తులతో కలిసి విన్నవిస్తున్నాడు.

"దురితము లెన్నొ చేసితిని, దూఱితి బెద్దల నంధకార బంధురమగు జీవితాధ్వమున దొర్లితి, నేటికి కన్నువిప్పి, నీ సురుచిరశుభ్రమూర్తిరుచి జూచితి, వేచితి ప్రేమకోసమై తిరుపతివాస! నీసదయదృక్కులు నింపుము వేంకటేశ్వరా! (పుట 6, 12వ పద్యం)

"ఈనాడు కన్ను విప్పి, నీదివ్యమంగళసుందర విగ్రహాన్ని కళ్లారా చూచాను. నీప్రేమకోసం వేడుకున్నాను. ఓతిరుపతివాస! వేంకటేశ్వరా! దయాపూరితమైన చూపులు నాపై ప్రసరింప చేయవలసింది" అని బసవయ్యకవి ప్రార్థిస్తున్నాడు.

శ్రీవేంకటేశ్వరశతకంలో కవి భక్తిభావాన్ని, రసస్ఫో రకంగా కూర్చాడు. శ్రీవేంకటేశ్వరనామస్మరణ ధ్యేయంగా జీవిం చాడు. "ఏడుకొండలవాడా! వెంకటరమణా!, అని హృద్యంగా శతకం రచించాడు. ఆ శతకాన్ని వేంకటేశ్వరస్వామికే అంకిత మిచ్చాడు. ఇప్పుడు ఆయన 90 వసంతాలు నిండినవాడు.

ప్రతినిత్యం శ్రీవేంకటేశ్వరస్వామిని తలుచుకుంటూ జీవిస్తున్న కవిపుంగవుడు–బసవయ్య.

'శ్రీనివాసో రక్షతు'




వాలి, సుగ్రీవుడు అన్నదమ్ములు. వాలి సుగ్రీవుణ్ణి రాజ్యభ్రష్టుణ్ణి చేసి, కిష్కింధనుండి తరిమేశాడు. ఒకానొక సమయంలో వాలి దుందుభి అనే రాక్ష సునితో యుద్ధం చేసి, అతనిశరీరాన్ని విసిరి వేయగా అది ఋష్యమూకపర్వతంపై తపస్సుచేసుకుంటున్న మతంగమహర్షిపై పడి, అతని శరీరమంతా ఆ రాక్షసునిరక్తంతో తడిసింది. ఆ మహర్షి 'ఈ శరీరమును ఇక్కడికి విసిరేసినవాడు ఈ కొండ ఎక్కితే తల పగిలి మరణించుగాక!' అని శపించాడు.

ఇది తెలుసుకున్న సుగ్రీవుడు 'వాలినుండి రక్షణ కోసం ఆ పర్వతంపైకి పోయి, తలదాచుకున్నాడు. సుగ్రీవుని మంత్రి హనుమంతుడు ఒకరోజున ఆ పర్వతముపైనుండి చుట్టూ చూచేసరికి రామలక్ష్మణులు అటే వస్తున్నారు. హనుమంతుడు సుగ్రీవునిఆజ్ఞమేరకు ఒకబ్రహ్మచారిగా వెళ్ళి, నేర్పుగా సంభాషించి, వారితో స్నేహం కుదుర్చుకొని, వాళ్లను సుగ్రీవుని దగ్గరకు తీసుకువచ్చాడు.

రాముడు సుగ్రీవునిరాజ్యాన్ని ఇప్పిస్తా నని వాగ్దానం చేశాడు. సుగ్రీవుడు సీతాన్వేషణలో రామునికి సహాయం చేస్తా నని మాటిచ్చాడు. సుగ్రీవునికి కొండంతబలం వచ్చింది.

మరుసటిరోజు సుగ్రీవుడు రామునిసూచనమేరకు కిష్కింధకు వెళ్ళి, యుద్ధానికి రమ్మని పిలుస్తూ ఒకపెద్దకేక వేశాడు. వాలి మహాక్రోధంతో బయటికి పరుగెత్తుకొని వస్తు న్నాడు. ఆ సమయంలో మహాపత్రివత ఐన అతనిభార్య తార అతనిరెండుచేతులు పట్టుకొని 'మీ రిప్పుడు వెళ్లటం మంచిది కాదు. సుగ్రీవుని కేదో గొప్పబలం వచ్చింది. ఎవరో రాజకుమా రులు అతనికి సహాయంగా వచ్చారట! అని బ్రతిమాలింది. ఆ విధంగా ఆ రోజున ఆమె తనభర్తను కాపాడింది. కానీ రెండవరోజున వాలి తనమాటలు వినలేదు. వాలిసుగ్రీవులమధ్య భయంకరమైనయుద్ధం జరిగింది. సుగ్రీవునిశరీరమంతా రక్త సిక్తమైపోయింది. వాలి, సుగ్రీవుల్లో ఎవడు సుగ్రీవుడో గ్రహించ డానికి సుగ్రీవునిమెడలో ఒక మాల వేశాడు - రాముడు.

మరుసటిరోజు వారిమధ్య పోరు ప్రారంభమైంది. సమయం చూచుకొని రాముడు ఒకబాణం వేశాడు. తక్షణమే వాలి క్రిందపడిపోయాడు. ఆ సమయంలో వాలితో జరిగిన సంవాదంలో రాముడు ఎన్నో ధర్మసూక్ష్మాలు వాలికి తెలియ జేశాడు.

"ఓ వాలీ! నీవు సుగ్రీవుడు చేయనితప్పుల్ని చేసినట్లుగా భావించి, అతనిపై వైరం పూనావు. నిజానికి, ఈ కారణంచేతనే నిన్ను హతమార్చి, నీ తమ్మునికి సహాయపడా లని నేను వచ్చాను" - అన్నాడు - శ్రీరాముడు.

"రామచంద్రా! నీవు చెప్పేధర్మాలన్నీ మానవులకు మాత్రమే వర్తిస్తాయి. కానీ, అరణ్యంలోని మృగాలకు వర్తించవు- అన్నాడు- వాలి. అప్పుడు రాముడు "నేను రాజు నని, నీవొక మృగ మని నీవే ఒప్పుకున్నావు. రాజులు మృగాల్ని వేటాడడం సహజధర్మం. కనుక, నేను ఆ దృష్టితో నిన్ను చంపినట్లుగా నీవు భావించవచ్చు కదా!" అన్నాడు.

సుగ్రీవునియందలి సత్యాన్ని, ధర్మాన్ని, న్యాయాన్ని ఆధారంగా చేసుకొనియే నిన్ను ఈ రీతిగా వధించడమైంది - అన్నాడు- శ్రీరాముడు.

శ్రీరాముడు ఏ పనిచేసినా అందులో ధర్మం, సత్యం, న్యాయం ప్రకాశిస్తూనే ఉంటాయి.



**టి.చరణ్‌కుమార్,**
9వ తరగతి, ప్రసన్న భారతి హైస్కూల్,
కొర్లగుంట, మారుతినగర్,
తిరుపతి.

## కదంబం

### సప్తమాతలు (మాతృసమానలు)

1) తల్లితల్లి
2) మేనమామభార్య
3) తల్లిసోదరి
4) భార్యతల్లి
5) తండ్రితల్లి
6) అన్నభార్య
7) గురుపత్ని

## పిల్లలూ జతచేయండి!!

| | |
|---|---|
| 1) విష్ణువుశంఖం | అ) గాండీవం |
| 2) శ్రీరాముడిధనుస్సు | ఆ) పాంచజన్యం |
| 3) అర్జునుడిధనుస్సు | ఇ) దేవదత్తం |
| 4) నారదునివీణ | ఈ) కోదండం |
| 5) అర్జునుడిశంఖం | ఉ) మహతి |

జవాబులు:
1-(ఆ); 2-(ఈ); 3-(అ); 4-(ఉ); 5-(ఇ)

## మీకు తెలుసా?

1) విష్ణుసహస్రనామస్తోత్రాన్ని ధర్మరాజుకు చెప్పిం దెవరు?
2) 'ఎందరో మహానుభావులు అందరికీ వందనం' అని కీర్తించిం దెవరు?
3) కౌరవుల దగ్గరకు మొదట రాయబారిగా వచ్చిం దెవరు?
4) రావణునివద్దకు మొదట రాయబారిగా వెళ్లిన వానరవీరు డెవరు?
5) మేఘసందేశకర్త?
6) గీతగోవిందకర్త?
7) అజ్ఞాతవాసంలో ద్రౌపదిపేరు?

జవాబులు:
1) భీష్ముడు
2) త్యాగయ్య
3) ద్రుపదపురోహితుడు
4) అంగదుడు
5) మహాకవి కాళిదాసు
6) జయదేవుడు
7) మాలిని

## కనుక్కోండి...!

ఈ అక్షరాలతో ఒక 'సూక్తి' వస్తుంది.

రా న న వు కి లు ప దే ని వు వా మ్మి ఏ రి అ ద

జవాబు: దేవుని నమ్మినవారికి ఏ ఆపదలు రావు

## ఈ శ్లోకం.. మీ కోసం..

**దీపో జ్యోతిః పరం బ్రహ్మ, దీపః సర్వతమోఽ పహః।**
**దీపేన సాధ్యతే సర్వం సంధ్యాదీప నమోఽ స్తు తే ॥**

**భావం–** దీపం జ్యోతిస్స్వరూపమైంది; అదే పరబ్రహ్మం. దీపం చీకటి నంతా పారద్రోలుతుంది. ఈ దీపంవల్లనే సర్వకార్యాలూ సుగమం అవుతున్నాయి. అట్టి సంధ్యాదీపమా! నీ కివే నా నమస్సులు.

భారతీయులకు దీపం సర్వవేళలా ఆరాధ్యతేజస్సు. దీపలక్ష్మిగా దీపాన్ని పూజిస్తారు. ఎవరిఇంటిలో ఎప్పుడూ దీపాలు వెల్గుతుంటాయో వాళ్లే నిజమైన ఐశ్వర్యవంతు లన్నారు – మహాత్ములు. అజ్ఞానం=చీకటి; జ్ఞానం=వెలుతురు. మనలోని అజ్ఞాన మనేచీకటిని పోగొట్టి, జ్ఞాన మనేకాంతిని సర్వత్ర ప్రసరింపజేసే పరమాత్మ స్వరూపం – దీపం!



బాలప్రబోధం

# భక్తురాలికోసం ఆగినరథం

పి. హేమచంద్రబాబు

ఆ వేళ మూడవశ్రావణశనివారం. తాతయ్య పెందలాడే లేచి, స్నానసంధ్యాదులు పూర్తిచేసుకుని, పూజ గదిలో అడుగుపెట్టాడు. వేంకటేశ్వరస్వామిపటానికి పూలహారం వేస్తూ ఉండగా రాము, సీత, జానకి, యశోదలు భక్తితో చేరి మనసులో సుప్రభాతం చెప్పుకొంటున్నారు. ఈ లోగా పూజ పూర్తయింది.

తాతయ్యా! వేంకటేశ్వరస్వామి తెలుగువారిఇలువేల్పు కదా! అయినా ఇంతవరకూ తమిళభక్తులగురించే చెప్పావు. స్వామిని సేవించిన తెలుగుభక్తులు లేరా? అని అడిగాడు-రాము.

"ఒరే రామూ! దేవుడు తమిళులకని, తెలుగువారికని ప్రత్యేకంగా లేడు. అందరికీ దేవు డొక్కడే! కో అంటే కొండల్లో పలికే కొండంత దేవుడు– ఆ శ్రీనివాసుడు. చాలాకాలం తిరుపతి తమిళరాజులపాలనలో ఉండడంవల్ల తిరుపతిలో తమిళశాస నాలు కన్పిస్తాయి. అదీగాక వైష్ణవానికి, తమిళానికి దగ్గర చుట్టరికం కావడంవల్ల దేవాలయాల్లో తమిళానిదే పైచేయి. తెలుగువల్లభుడైన శ్రీకృష్ణదేవరాయలు ఏడుసార్లు తిరుమల సందర్శించి విలువయినకానుకలు సమర్పించాడు. తెలుగువారు ఎందరో తమదేవు డంటూ చేతులు జోడించారు. అలాంటి వారిలో అన్నమయ్య, తరి గొండ వేంగమాంబ ప్రసిద్ధులు. అన్నమయ్యను గురించి మీకంతా తెలుసు. ఇవాళ వేంగమాంబను గురించి చెబుతాను" అన్నారు– తాతయ్య.

చిత్తూరు జిల్లాలో వాయల్పాడు అనే తాలూకాకేంద్రం ఉంది. ఆ ఊరికి దగ్గరలో తరిగొండ అనే గ్రామం ఉంది. ఆ గ్రామంలో నరసింహస్వామిదేవాలయం ఉంది. ఆ దేవుడు సత్యానికి పెట్టిన పేరు. ఎవరిమధ్య అయినా ఆస్తికోసంగాని, మరో కారణంవల్లగాని తగాదా వస్తే అక్కడ సత్యం చేస్తారు. కోర్టు కూడా ఈ సత్యాన్ని గౌరవిస్తుంది.

తరిగొండలోనే వేంగమాంబ పుట్టింది. ఆమెతండ్రి కానాల కృష్ణయ్య. వారిది నందవరీకశాఖ. వేంకటేశ్వరస్వామి అనుగ్రహంవల్ల పుట్టింది కనుక ఆమెకు తల్లిదండ్రులు వేంగ మాంబ అనేపేరు పెట్టారు. చిన్నతనంనుండి వేంగమాంబ స్వామిభక్తురాలుగా రాణించింది. ఎంతసేపూ పాటలు పాడు కోవడం, పరవశించి నాట్యంచేయడంతప్ప వేంగ మాంబకు పనేమీ లేకపోయింది.

"పిచ్చి చేష్ట" లని ఊళ్లోవాళ్ళనుకొన్నారు.

"ఏదో చిన్నతనం" అని సమర్థించారు-కొందరు.

"అమ్మాయి కివేం బుద్ధిలో" అంటూ పెదవివిరిచారు - ఆడ వాళ్ళు.

"తల్లీదండ్రుల అదుపు లేకపోతే పిల్ల లింతే" అని ఊళ్లో వాళ్ళు గట్టిగానే గొణిగారు.



ఈ మాట లన్నీ విన్నాడు–కృష్ణయ్య. పెళ్ళి అయితే పిచ్చి కుదురుతుం దని అనుకొన్నాడు. ఈలోగా చిత్తూరు దగ్గరలోని నారగుంటపాలెంవాళ్ళు అమ్మాయిని చూడడానికి వచ్చారు. పెళ్ళిచూపులు జరిగాయి. వరుడు ఇంజేటి వేంకటాచలపతి. వేంగమాంబను చూచి మురిసిపోయాడు. పెళ్ళి చేసుకొంటే ఆవిడనే చేసుకోవా లని నిశ్చయించుకున్నాడు. ఇరుపక్షాలవారు మాట్లాడుకోవడంతో పెళ్ళి సంబరంగా జరిగింది. అయితే పెళ్ళయినా వేంగమాంబలో మార్పు కనిపించలేదు. సంసార బాధ్యతపడితే సర్దుకుంటుం దని అనుకొన్నారు.

తండ్రి కృష్ణయ్య వెంగమ్మకు నిషేకముహూర్తం నిర్ణయించాడు. వేంకటాచలపతి ఎంతో సంతోషించాడు. కాని అతనిసంతోషం ఎంతోసేపు నిలవలేదు. గదిలో వేంగమాంబ సామాన్యస్త్రీగా కనబడలేదు. చౌడేశ్వరిగా కనిపించింది. వెనకడుగు వేశాడు– వేంకటాచలపతి. తాను ఆవిడతో సంసారం చేయలే నని తన ఊరికి వెళ్ళిపోయాడు. కొంతకాలానికి అతడు స్వర్గస్థుడయ్యాడుకూడా. తనకూతురి జీవితం బూడిదలో పోసిన పన్నీరయినందుకు తల్లిదండ్రు లెంతో చింతించారు. చివరకు తమకు సన్నిహితుడైన సుబ్రహ్మణ్యయోగితో తమబాధ చెప్పుకున్నారు. ఆ యోగి ఈమెలోని గొప్పతనాన్ని గుర్తించాడు. ఆవిడకు యోగోపదేశం చేశాడు. అప్పటినుండి వేంగమాంబ నరసింహస్వామిఆలయంలోనే గడిపేది.

ఈవిడచేతలు ఊరివారికి వింతగా అనిపించేవి. భర్త మరణించినా ముత్తయిదువులాగా అలంకరించుకోవడం సనాతనులకు గిట్టలేదు. అందువల్ల వారు మఠాధిపతికి తమ విన్నపం విన్నవించుకొన్నారు.

ఆ రోజుల్లో మఠాధిపతులదే సర్వాధికారం. వారు ఎంత చెబితే అంత. ఎదురుతిరగడానికి వీల్లేదు. ఎదురు తిరిగితే బహిష్కారం తప్పదు. అందువల్ల ఎవరూ మాట్లాడేవారు కాదు.

ఒకఆడదానివల్ల మతంకట్టుబాట్లు మంట కలసి పోవడాన్ని మఠాధిపతులు సహించలేకపోయారు. తామే వచ్చి దండిస్తా మని ఆ మఠాధిపతులు కబురు పంపారు. స్వాముల వారు తరిగొండకు వేంచేశారు. వెంగమాంబకు శ్రీముఖం జారీ అయింది.

వెంగమాంబ తనలో తాను నవ్వుకొంది. చివరకు పెద్దలదగ్గరికి వట్టిచేతులతో పోరా దని కొబ్బరికాయ తీసుకొని వెళ్ళింది. అనాచారవంతుల్ని ఆచారవంతులు చూడకూడ దనే నియమంప్రకారం వారిద్దరిమధ్య ఒకతెర కట్టారు.

"ఈ రోజుతో పీడ విరుగ డవుతుంది" అని అను కొన్నారు– ఛాందసులు.

స్వాములవారు తెరవెనుకనుండి గర్జించారు.

"హిందువులకు– ప్రత్యేకించి, బ్రాహ్మణులకు ఆచార పాలన అవశ్యకర్తవ్యం. ఆచారాన్ని పాటించకపోతే నరకవాసం తప్పదు. పెద్దలమాటల్ని, కాలానుగతంగా వస్తున్న సంప్రదా యాల్ని కా దనేధైర్యం ఎవ్వరికీ లేదు. నీభర్త మరణించాడు. నీవు విధవవి. ఆచారంప్రకారం నీవు ముత్తయిదువుగా ఉండడానికి వీల్లేదు. శిరోముండనం చేసుకోవాలి. పసుపు కుంకుమలు వదిలేసుకోవాలి. ఇందుకు విరుద్ధంగా ఉండడం మేం ఏ మాత్రం సహించం. ఇప్పుడు ఈ కర్మ జరగవలసిందే" అంటూ క్షురకులవైపు చూశారు. క్షురకులు వేంగమాంబకేసి నడిచారు.

"ఆగండి! నేను ఎప్పుడూ ముత్తయిదువునే. శ్రీనివాసుడే నాపతి" అని గద్దించింది.

"స్వామీ! మీరు మఠాధిపతులు. అన్నీ తెలిసినవారు. శ్రీనివాసుని భక్తురాలిని. విధవ ఎలా అవుతాను? ప్రాపంచిక పురుషులు భర్తలు కారు. అదీగాక నేను పతివ్రతను. పతివ్రతను పరపురుషులు తాకరాదు. ఇది మహాపాపం. క్షురకుడు పరపురు షుడు కదా! అత డెలా నన్ను తాకగలడు? అంతమాత్రమే కాదు. శిరోముండనం చేసుకొన్నంతమాత్రాన మరల వెంట్రుకలు రా వని మీరు హామీ ఇవ్వగలరా? తలలు బోడులయితే తలపులు బోడులవుతాయా! ఇవన్నీ లౌకికాచారాలు, శాస్త్రఆచా రాలు కావు" అని సమాధానం చెప్పింది.

స్వామివారు నిరుత్తరు లయ్యారు. తమ పన్నాగం విఫల మవుతున్నందుకు ఛాందసులు దిగాలు పడ్డారు. ఎలాగైనా మఠాధిపతికి కోపం తెప్పించా లనుకొన్నారు.

స్వామీ! ఈ విధవ గర్విష్ఠి. తమవయసును, స్థానాన్ని గుర్తించకుండా అవాకులు చవాకులు మాట్లాడుతూ ఉంది. కనీసం నమస్కారంకూడా చేయడం లేదు. ఈమెను శిక్షించా ల్సిందే! అని పట్టుబట్టారు.

వేంగమాంబ జోక్యంచేసుకొంటూ "స్వామీ! నాకు మఠంపై గౌరవ ముంది. మఠాధిపతు లంటే పూజ్య భావ ముంది. అయితే నేను నమస్కరిస్తే మీ రేమైపోతారో అని దిగులుంది" అనింది.

'ఏమిటా పొగరు?' అన్నారు - ఛాందసులు. 'నమస్క రించు చూద్దాం!' అని గద్దించారు.

"దయచేసి తమరు సింహాసనం వదలి దూరంగా నిలవండి. నేను తప్పక నమస్కారం చేస్తాను"అంది వేంగమాంబ.

ఆడ దేం చేస్తుం దని అనుకొన్నా రందరూ.

ఎందుకైనా మంచి దని పీఠాధిపతులు లేచి ప్రక్కకు నిలబడ్డారు.

వేంగమాంబ రెండుచేతులు జోడించింది. ఉన్నట్టుండి ఫెళఫెళమనే చప్పుడు వినబడింది. మంటలు లేచాయి. సింహా సనం బుగ్గిపాలయింది.

పీఠాధిపతులు భయపడ్డారు. ఆమె నమస్కారం ఆగ్నే యాస్త్ర మని అర్థమైపోయింది.

ఛాందసుల్ని మందలించి, సెలవు తీసుకొన్నారు.

స్వాములవారు వెంగమాంబగొప్పతనం గుర్తించినా ఛాందసులు తమబుద్ధి పోనిచ్చుకున్నారు కాదు. వేంగమాంబ కుటుంబాన్ని వెలివేసినట్టుగా చూశారు.

చివరికి విసిగి వేంగమాంబ తిరుమల చేరుకొంది.

వేంగమాంబ శ్రీనివాసుణ్ణి తనివితీరా దర్శించింది. ఉదయం లగాయతు, ఏకాంతసేవ దాకా పాటలు పాడుకొంటూ కాలం గడిపింది.

ఆ పాటలకి మురిసిపోయినవారు- కొందరు.

ఆ ఆవేశానికి పరవశించినవారు- కొందరు.

'ఇంత చిన్నవయసులో ఇంతనిష్ఠా' అని ఆశ్చర్య పడ్డవాళ్ళు- కొందరు.

రోజులు గడుస్తూనే ఉన్నాయి. వెంగమాంబ భక్తిశ్రద్ధల్ని తాళ్లపాకకుటుంబీకులు గుర్తించారు.

భక్తులకు భక్తులే రక్షకులు కావడంవల్ల తామే వేంగ మాంబకు నివాసం ఏర్పాటు చేశారు. అప్పటినుండి వేంగమాంబ అక్కడే ఉంటూ స్వామిని సేవిస్తూ కాలంగడిపేది. రోజూ కూడా స్వామివారికి పూలమాలలు, హారతి పట్టుకుని వెళ్ళేది.

ఆ రోజుల్లోని ఆలయార్చకులు అహంకారులు. దేవాలయానికి విధవ ఉదయమే రావడం సహించలేకపోయారు. "ఒక విధవకి ఇంత గౌరవమా?" అని మండిపడ్డారు.



## శ్రీ వేంకటేశ్వర స్తుతిరత్నమాల

**మ ॥ తిరుమంత్రాఖ్యహలంబు పూని, కృషికద్ధీమంతు డాత్మీయహృ**
**ద్ధరణిన్ దున్ని, ద్వయార్థబీజములు నిండం జల్లు, నంకూరమై**
**పరగన్ బూచిన మోక్షశాలికిని పైపై సత్తువల్ నింపు, దా**
**నెరువై శేషగిరీంద్రపాదరజ మూహింపంగ నిద్ధారుణిన్.**

*(శ్రీపాదరేణుమాహాత్మ్యం- రేవణూరి వెంకటాచార్యులు)*

అందువల్ల వేంగమాంబను గుడిలోనికి రానీయకుండా కట్టడిచేశారు.

వేంగమాంబ స్వామిదర్శనం చేసుకోలేక ఇంటికి మరలి పోయింది. ఆ మరుసటిరోజే రథోత్సవం.

వేంకటేశ్వరస్వామిరథం తిరువీథులలో కదిలింది. భక్తులు గోవిందా గోవిందా అంటూ పగ్గం లాగుతున్నారు.

ఆ రథం వేంగమాంబఇంటికి వచ్చేసరికి ఆగి పోయింది. అధికారు లెంతో ప్రయత్నం చేశారు. ప్రజా సమూహం ఎంతలాగినా లాభం లేకపోయింది.

'పూజలో ఏదో అపచార, మని ఎవరో సన్నగా గొణి గారు.

అప్పటికిగాని అర్చకులకు ముందురోజు జరిగిన వృత్తాంతం గుర్తుకు రాలేదు. ఇదంతా వేంగమాంబమాయ అని అనుకొన్నారు.

రథం కదల్లేదు. పొద్దు సాగిపోతూ ఉంది. సాయం త్రంలోగా రథం మంటపం చేరుకోవాలి. అర్చకులు దిగాలు పడ్డారు. చివరకు అర్చకులు వేంగమాంబఇంటిలోకి ప్రవే శించారు.

వెంగమ్మ ధ్యానంలో మునిగి ఉంది.

"అమ్మా! మమ్మల్ని క్షమించు, నీవు సామాన్యురాలివి కావు. పరమభక్తురాలివి. నిన్ను ఆలయప్రవేశం చేయకుండా అడ్డగించినందుకు మాకు తగిన శాస్తి జరిగింది. రథం కదలడం లేదు. రథం గమ్యం చేరకపోతే స్వామినిత్యపూజలకు ఆటంకం కల్గుతుంది. ఒకసారి మామీద కరుణించి, రథం కదిలేటట్టు చేయవమ్మా" అంటూ చేతులు జోడించారు.

వేంగమాంబ కళ్ళుతెరచింది. ఎదురుగా అర్చకులు నిలబడి ఉన్నారు. వా రేం చెప్పారో తనకు అర్థం కాలేదు. వాకిట్లో జనాన్ని చూసి ముందుకు నడిచింది. స్వామిరథోత్సవాన్ని కనులారా దర్శించింది. రథం లాగుదా మని తానుకూడా పగ్గంపై చేయివేసింది.

'గోవిందా' అంటూ ప్రజలు హోరుమని సంకీర్తనలు చేశారు.

రథం కదిలింది. అర్చకులు ఊపిరి పీల్చుకున్నారు. అధికార్లు సంబరపడ్డారు.

అప్పట్నుండి వేంగమాంబకు ఆలయప్రవేశంలో అడ్డు లేకపోయింది.

ఏకాంతసేవలో స్వామిని దర్శించడానికి ప్రత్యేక అవకాశం దొరికింది. ఇప్పటిక్కూడా ఏకాంతసేవలో జరిగే హారతిని 'తరిగొండహారతి' అంటారు అని– కథ ముగించాడు – తాతయ్య.

"ఏకాంతసేవ అంటే ఏమిటి తాతయ్యా!" అంటూ కుతూహలంగా అడిగింది– జానకి.

"చెబుతా! స్వామివారికి ఉదయం పూట చేసేసేవ సుప్రభాతసేవ. సుప్రభాతంతో గుడి కార్యక్రమాలు మొదలవు తాయి. చివరగా జరిగేది ఏకాంతసేవ. దీనినే 'పవళింపు సేవ' అని కూడా అంటారు.

స్వామిఅమ్మవార్ల ఉత్సవవిగ్రహాలను ఉయ్యాలలో పెట్టి హారతి ఇస్తారు.

స్వామి ఉదయం లగాయతు భక్తుల్ని కరుణించి, పవళింపు చేస్తా దని అభిప్రాయం.

ఆ కార్యక్రమంలో సాధారణంగా అర్చకుడు, ఆలయా ధిపతులుమాత్రమే ఉంటారు.

శ్రీవారు ఏకాంతంగా శయనించే సేవ కనుక దీన్ని 'ఏకాంతసేవ' అంటారు – అన్నాడు.

"తాతయ్యా! మనం కూడా ఏకాంతసేవ చూడొచ్చా?" అని కుతూహలంతో అడిగింది – యశోద.

"అలాగేనమ్మా! ఇప్పు డది ఆర్జితసేవకూడా! అందు చేత ఈసారి తిరుమలకు వెళ్ళినపుడు ఏకాంతసేవ చేసుకొందా మన్నాడు" – తాతయ్య.



# తిరుమల ఆలయం



ఆంగ్లమూలం : డా॥ రమేశన్, తెలుగు అనువాదం : డా॥ కోరాడ రామకృష్ణ

*(సవాల్ జవాబ్ పట్టి తిరుమల ఆలయచరిత్రలో ఒక ప్రధానఘట్టం గురించి విపులంగా వివరించే దాఖలా. ఆర్కాటు నవాబుల కాలంలోని కోలాహలభరిత నిర్వాకం తరువాత స్వల్పకాలం ప్రశాంత వాతావరణంలో ఆలయ వ్యవహారాలను నేర్పు చేసేందుకు కుంపణీ ప్రభుత్వం ప్రయత్నించిన వైనాన్ని ఇక్కడ చూడవచ్చు.)*

## సవాల్ జవాబ్ పట్టి వివరాలు

ఏడవప్రశ్నకు ఉత్తరంగా ఆలయసిబ్బంది పేర్లు, విలాసం, కర్తవ్యం, అధికారం, మున్నగు వివరాలను దాఖలు చేసారు. ఆలయంలో మొత్తం ఉద్యోగులు–ప్రధాన, ఉప, శాశ్వత, తాత్కాలిక – అందరూ కలిసి మొత్తం 92 మంది ఉండేవారు.

బంగారువాకిలి ద్వారపాలకులు ఇద్దరు. వీరి నడుమ ఉన్న బంగారంపూత పూసినరేకు కప్పిన వాకిలితాళంచెవులు ఒక సుత్తు మరియు ఆభరణాలు పెట్టె, ఒక తాళంచెవి జీయం గారు సుపర్దులో ఉండేది. ఇపుడూ అలాగే ఉంది. (1980) అంతరాళం వాకిలి తాళంచెవి మరియు నగలపెట్టె తాళంచెవి అర్చకుల వశంలో ఉండేవి. ఆలయం వాకిలి పొద్దున్నె ఎనిమిది గంటలకు తీస్తారు. దీనికి మొదలు ఒక సేవకుడు జీయంగారు లను పిలిచుకుని రావడానికి, మరొకతను అర్చకులను పిలిచేందుకు వెళ్ళేవారు. పారుపత్యదారుడూ ఇతరఆలయ సిబ్బంది ఆలయద్వారందగ్గర నిలిచి ఉండేవారు. బంగారు వాకిలి తెరిచినఅనంతరం అర్చకులు, ఏకాంగి మరియు గొల్లవాడు లోపలికి పోయి, వాకిలిని బంధించుకొని, లోపల అఖండ దీపాన్ని సరిచేసి, అంతరాళం వాకిలి తీసి, తదనంతరం బంగారు వాకిలిని తెరిచి, జీయంగారులను లోపలికి ఆహ్వానించు దురు. జీయంగారు చిన్నహారతిని వెలిగించి అర్చకులకు ఇస్తే – అర్చకులు దానితో స్వామికి హారతి ఇచ్చెదరు. ఈ లోగా తాళ్లపాక వంశంవారిచే సుప్రభాతపఠనం గావించబడును. 9 గం॥లకు తోమాలసేవ మరి ఇతరసేవలు పూర్తి అయి నైవేద్యసమయం ఆసన్నమౌతుంది. మొదటినైవేద్యం పెద్దగంటారావంతో సమ ర్పింపబడును. అనంతరం వివిధపూజలు జరిగి ధర్మాల నివేదనల సమర్పణ జరుగును. అనంతరం మహామంగళారతి జరిగి, యాత్రికులను స్వామిదర్శనానికి అనుమతిస్తారు.

7వ ప్రశ్నకు బదులుగా ఆలయంసిబ్బంది కర్తవ్య వివరాలను పట్టిచేసిన పిదప ప్రాతఃకాలం 9 గంటలకు మునుపే తోమాలసేవ సమాప్తియై ఇతర ప్రాతఃకాలపు పూజలు ప్రారంభం కావాలి అని చెప్పబడి, పదిగంటలసమయంలో మాత్ర, దధ్యోదనం భాకళభాత్, చప్పిడి (శుద్ధాన్నం) ల నివేదనం జరగాలి అనియూ, తదనంతరం 12 గంటలవరకూ యాత్రికు లను స్వామిదర్శనానికి అనుమతించాలి అని చెప్పడమైనది. రెండవపూజ మధ్యాహ్నం 1 గంటలోపల జరగాలి. రెండవ నివేదనం కావాలి. (రెండవగంట) సూపరసముల అలంకా రాన్నం, పాయసం ఇక్కడ నైవేద్యమగును. తిరిగి రాత్రి 8.30–9.00గం॥ లోపల తోమాల సేవ జరిగి, మిళగోగరె (మిరియాల అన్నం) పరమాన్నం (బియ్యం పాయసం) తిరువీస–శుద్ధాన్నాన్ని దేవుడికి నివేదించాలి. అనంతరం యాత్రికులకు దర్శనావకాశం. మళ్లీ రాత్రి 10.00 గం॥కి మంచపుసేవ. ఈ అన్నిసేవల లోనూ తత్సంబంధం ఉద్యోగులు హాజరై తమ సేవలను అందిం చాలి. దీనిచే తెలియవచ్చే అంశ మేమనగా సర్వదర్శనం ఉదయం 10 నుండి 12 గం॥ వరకుమాత్రమే ఉండి, అనంతరం రాత్రివేళ ఉండేది కాదు.

గర్భగుడి ముందు ఒక పెద్దతళిగను (తట్టి) పెట్టి ఉంచేవారు. బంగారువాకిలిదగ్గర యాత్రికులను కూర్చోబెట్టి, వారికానుకలను ఎంచి ఒకగుడ్డలో కట్టి, దానిపై తన ముద్ర వేసిన పారుపత్యదారు, యాత్రికులచేతికే ఈ కానుక మూటను ఇచ్చి, వారిని దర్శనానికి అనుమతించుదురు. వారు స్వామిని దర్శించుకొని, కానుకమూటను గర్భగుడిముంగిట ఉంచిన పెద్దహరివాణంలో (తట్టలో) వేసేవారు. దర్శనానంతరం యాత్రికులకు ప్రసాదం (వడ మరి ఇతర నివేదనలు) ఇవ్వ బడును. దర్శనసమయం అయినతర్వాత, తట్టలో వేసిన కానుకలనంతా బంగారువాకిలి బయట ఉండే రంగమంటపానికి తెచ్చి, జీయంగార్ పారుపత్యదారుల సమక్షమంలో దాఖలా చేసి, సంచులలో వేసి ఆలయముద్రను వేయుదురు. ఆర్జితం పట్టికను తయారు చేసి, జీయంగారికరణం మరియు పారుపత్య దారు చేవ్రాలు వేస్తారు. కొప్పరాన్ని బిగించిన తరువాత వాటిని జాగ్రత్తగా రక్షించాలి అని రక్షక భటులకు తెలిపి, పారుపత్య దారు ఇంటికి పోతారు. అంతరాళంవాకిలి బంధించి అర్చకుడు ఇంటికి వెళతారు. రాత్రి ఎనిమిదిగంటల సమయంలో అర్చకులు జీయంగారుతో వచ్చి, ఆలయసేవకులతో కలిసి, తొమ్మిది గంటల వేళకు రాత్రిపూజాకైంకర్యం పూర్తి చేయుదురు. నైవేద్య సమర్పణ జరుగును. తర్వాత యాత్రికులు దర్శనం చేసుకోవచ్చు. దర్శనం తర్వాత రాత్రి 10 గం॥లకు మంచపు సేవ జరుగును. లోపలిఅంతరాళంవాకిలిని అర్చకులు మూయుదురు. వారు వెళ్ళిన తర్వాత బంగారువాకిలికి బీగములు వేయడం జరుగును.

ఆలయంలో జీయంగారు లేక అతనిసహాయక ఏకాంగి హారతిని వెలిగించి, అర్చకునికి ఇవ్వడం వాడుక. భగవదలం కారానికీ ఇలాగే పూలమాలలు, నగలు, రకరకాల వస్త్రములను జీయంగార్ చేతులపై నడిచేరీతిగా చూడాలి. రాత్రిదర్శనం సమ యంలోనూ మధ్యాహ్నంలాగే పారుపత్యదారుయాత్రికుల కానుక లను పరిశీలించి, మూటగట్టి, తనముద్ర వేయడం జరుగును.

అక్కడ ఏడుమంది ఆచార్యపురుషు లున్నారు. వారిలో ఒకరైన తోళప్పాచార్యకుటుంబంవారు భగవంతుని పూజా సమయంలో వేదపారాయణం చేసేవారు. స్వామిఅభిషేకానికి ఆకాశగంగనుండి నీళ్ళను తమవారే అయిన ఒకరిచే తెప్పించే వారు. ఏడుమంది ఆచార్యపురుషులలో వీరికి మొదటితీర్థ మర్యాద జరిగేది. వీరే అర్చనసమయంలో మంత్రపుష్పాన్ని, సహస్రనామపారాయణాన్ని చేసేవారు. తక్కిన ఆరుమంది ఆచార్యపురుషులూ ప్రబంధాలను చెప్పేవారు.

సామవేదగాయకుడు ప్రతిరోజూ సామవేదగానం చేసేది గాక– పలుయాత్రికులు ఏర్పాటు చేసినట్టు ప్రతి శుక్ర వారం స్వామిఅభిషేకసమయానికి స్వామికై నూతనయజ్ఞోపవీ తాన్ని సరఫరా చేసేవాడు. (యజ్ఞోపవీతసమర్పణ మరియు దేవుడి యజ్ఞోపవీతధారణ ప్రక్రియకలు తాళ్లపాకపెద్దతిరుమలా చార్యులచే క్రీ.శ.1532 సంవత్సరం మార్చినెలలో ఆరంభం అయింది–తి.తి.588). గ్రామతోటి పారుపత్యదారు చెప్పినపను లను చేసేందుకు వెళ్ళేవాడు. ఉగ్రాణంలో పనిచేయు మరొక సేవకుడు యాత్రికులు సమర్పించిన వక్క తమలపాకులను (తాం బూలం) సంగ్రహించి, బజారుధరలకు విక్రయం చేసి, వచ్చిన ధనాన్ని సర్కార్ (ఆలయ భండారం) లెక్కకు చేర్చేవాడు. ఉత్సవ మూర్తులు ఊరేగింపులో వెళ్లేసమయంలో వీరు ఆయుధపాణులై రక్షణ కల్పించేవారు.

గొల్లచారుడు ఇరవైమంది సేవకులతో తహసీల్దారు దగ్గర పనిచేస్తూ, అధికారి సేవకులతో కలిసి, తిరుమల ఆలయం కానుకలనూ, వస్తువులనూ సంచులలో వేసి, దారంతో కుట్టి ముద్ర వేసి, రక్షణకార్యం చేసేవాడు. తోడుకు గోవిందరాజ స్వామి, రామస్వామి ఉత్సవవిగ్రహాలు పారువేటకు, తీర్థవారికి పోయేటపుడు అశ్వారోహియై ఆయుధాన్ని ధరించి, కాపలా పనీ చేసేవాడు.

గజశాలలో 14మంది పనివారు ఉన్నారు. పైన ఒక దరోగా ఉన్నాడు. తోడుకు నలుగురు గదాధారులు, ఐదుమంది గడ్డివేసేవారు. అశ్వశాలలో ముగ్గురుమాత్రమే ఉన్నారు. గోశాలలో ముగ్గురు సేవకు లున్నారు. ఇక్కడున్న పశువుల సంఖ్య చెప్పలేదు. ఐతే పనివారిసంఖ్య లెక్కలో నాలుగు ఏనుగులు, మూడుగుర్రములు, ఉండి ఉండవచ్చు. వీటిని తిరుపతిలోనే ఉంచి, ఉత్సవసమయాలలో స్వామివైభవాన్ని చాటి చెప్పేందుకు తిరుమలకు తీసుకువెళ్లేవారు.

8వప్రశ్నకు జవాబుదాఖలా అయినట్టు ఖాయలా అయినవారు. కర్తవ్యాలకు గైరుహాజరైనవారికి విరుద్ధంగా ఎటువంటి క్రమమూ జరిగేది కాదు. చిన్నా చితక తప్పులకు చిన్న చిన్న శిక్షలు, జుల్మానాలు వేయబడుతూ ఉండేవి. పెద్ద తప్పులు సంభవించిన హుజూరు ఖావందులకు నివేదిక పంపి వారి ఉత్తర్వులప్రకారం క్రమం జరిగేది. పన్నెండవప్రశ్నకు బదులుగా చూస్తే– శ్రీ వేంకటేశ్వరస్వామిఆలయం అనాదినుండి ఉండిన ఆలయం అని చెప్పబడింది. ఇతనిని మొదట బ్రహ్మ ఆరాధించాడు. అనంతరం ఇతడు తొండమాన్ చక్రవర్తికి ప్రత్యక్షమయ్యెను. ఇతనికై తొండమానుడు ఆలయాన్ని నిర్మించాడు. ఆ కారణాన ఆనాటి ఆయవ్యయాల వివరములు తెలిసిరాలేదు. తర్వాతికాలంలో శాలి వాహనశకం 939వ పైంగళినామసంవత్సరంలో పుట్టిన రామానుజాచార్యులు తమకాలంలో అన్నిదివ్య దేశాలలో (విష్ణుక్షేత్రాలలో, మాదిరిగానే ఇక్కడకూడ పూజా విధులను వ్యవస్థితంగా కట్టుదిట్టం చేశారు. ఆయన ఇక్కడికి వచ్చి, ధర్మకర్త జవాబుదారిని చేపట్టి, గోపురం ప్రాకారం మరి ఇతరమంటపాలను నిర్మించి, ధర్మకార్యనిర్వహణ చేసా రని చెప్పబడింది. ప్రస్తుతం (19వ శతాబ్దం) జీయరు వీరిశిష్యవారసులని వీరిఆదాయాన్ని ప్రత్యేకంగా గుర్తించబడింది. నవాబుల కాలం నుండి వేర్వేరు కార్యకలాపాలలో అయ్యే ఖర్చులను పట్టి చేసి, వాటిపరిశీలన చేసి, తసదీకు ధనం (సాధారణవెచ్చాలకై ఇచ్చే ధనం) నిర్ణయించి, దాని ప్రకారం జరిగే దని చెప్పబడింది.

## శ్రీగోవిందరాజస్వామిఆలయం

సవాల్ జవాబ్ పట్టిలో దాఖలా అయినరీతిలో ఈ ఆలయం ఆయవ్యయాలు క్రింద చెప్పబడ్డట్టుగా ఉంది.

| | పులివరహం | మైలి | కాసులు |
|---|---|---|---|
| సాధారణ ఆదాయం | 563 | 28 | 40 |
| కానుక–జీమీను ఆదాయం | 26 | 2 | 66 |
| **మొత్తం** | **589** | **31** | **26** |
| ఆలయ సేవకులచే కలిగిన ఆదాయం ధర్మములు | 131 | 31 | 14 |
| కానుకలు మరియు ఆర్జితములు | 900 | | |
| **మొత్తం** | **1031** | **15** | **14** |

*(లేక) స్థూలంగా 4,120 రూపాయలు*

ఇక్కడ కూడ శ్రీ వేంకటేశ్వరస్వామి ఆలయం రీతిలోనే ఈస్ట్ ఇండియా కంపనివారు ఆర్జితం మరియు కానుకలను గుత్తకు వదలి గుత్తాదారులనుండి నిర్ణీతకాలంలో నిర్ణీత మొత్తాన్ని వసూలు చేసేవారు. పై పట్టికలో ధర్మం ఖాతాలోని ధనం ఆలయంలో అన్నప్రసాదాలకొరకు వస్తురూపేణ ఇవ్వబడ్డది.

ఆలయం అందాజు పత్రంలో మేళంవారికి మరియు గొల్లవారికి సంభావన తెలుపలేదు. కంపనినుండి గుత్తకు తీసుకున్నవారు ఈ బాబత్తులో తమచేతిధనాన్ని ఖర్చు పెట్టేవా రని తెలుస్తుంది. సవాల్ జవాబ్ పట్టి ద్వారా తెలిసివచ్చు వివర మంటే తిరుమల ఆలయంలో పూజాదికాలను నిర్వహించే నాలుగు కుటుంబాలలో రెండు కుటుంబాలవారు మాత్రమే గోవిందరాజ స్వామి ఆలయంలో పూజాదికాలను చేసే హక్కు పొందియుండినవి. ఇంకనూ చెప్పబడ్డ విషయ మంటే తిరుమల ఆలయంలో పనిచేసే 7 మంది ఆచార్యపురుషులు, ఏకాంగులు, పెరియ మరియు చిన్నజీయంగారులు ఈ ఆలయంలోనూ కర్తవ్య నిర్వహణ చేయాల్సి ఉండింది. అర్చకులు సహస్రనామార్చననూ, అధ్యాపకుడు ప్రబంధపఠనాన్ని చేయవలసి ఉండింది. పురోహిత, గొల్లచార, కైకలి (నేకారుడు), కామాటి (కొయ్య పనివాడు), దర్జి, గీణిగిరి (గారపనివాడు), బొక్కసం (ఎదురు చూచువాడు), వస్త్రంవాడు, వంటవాడు – మొత్తం 27 మంది ఉండిరి. ఎనిమిదిమంది ముద్రామనుషులు అనే పర్యవేక్షణ అధికారు లున్నారు. గొడుగు పట్టేవా ళ్లుండిరి. చాలా మటుకు తిరుమలలో పనిచేసేవారే ఇక్కడనూ పనిచేసేవారు. 19వ శతాబ్దం ఆరంభంలో ఏనుగుల, హయముల పాలనకు సంబంధించిన వెచ్చాలను తిరుమల ఆలయంనుండే ఇచ్చేపద్ధతి ఉండేది.

***(ఇంకా ఉంది)***

# గ్రంథసమీక్ష

సంస్కృతభాషలో అందంగా నిర్మించబడిన కావ్యం రామాయణం. భారతీయ సాహిత్యంలో అది ఆదికావ్యం కూడా! ఆ కావ్యం ప్రపంచభాష లన్నింటిలోకి అనువదించబడింది. మనతెలుగులోనే దాదాపు రెండువందలమందికవులు రామాయణాన్ని తెనిగించారు. అయినా ఇంతటితో ఈ ప్రస్థానం ఆగిపోవడం లేదు, ఆగిపోదు. యథాతథానువాదంగా కొందరు, భావానువాదంగా ఇంకొందరు చేశారు. మరికొందరు రామకోటి వ్రాసి తరిస్తున్నారు. వీటన్నింటికీ భిన్నంగా, వినూత్నంగా చాలామందికవులు శ్రీరామునిగుణగలీలను కీర్తిస్తూ శతకాలు వ్రాశారు. ఆ పరంపరలో వెలువడినదే ఈ 'శ్రీరామశతకము'. ఇందులో 101 కందపద్యా లున్నాయి. ప్రతిపద్యం రామనామఔన్నత్యాన్ని శ్లాఘించేదే!

గాయత్రీమంత్రహృదయధ్వనితో సాగిన ఈ శతకం పాఠకులకు మంత్ర మకరందం! దీనిపఠనంవల్ల అప్రయత్నంగానే గాయత్రీమహామంత్ర మాతృకను సంభావించినట్లు అవుతోంది. పాకెట్ సైజులో ఉండుటవల్ల పఠితలు తమజేబులో ఉంచుకొని, తమ కిష్టమైనపుడు చదువుకోవచ్చు. ఈ శతకం ఆదరించతగిందే! **- డా॥కె. ఆర్. శ్వేత.**

## శ్రీరామశతకము

**రచయిత:** టి.వి.జనార్దనరావు,
**పుటలు:** 30; **వెల:** రూ.10-;
**దొరుకుచోటు:** టి.వి.జనార్దనరావు, తేజోవతి ప్రచురణలు, దమ్మాయిగూడ, నాగారంపోస్ట్, హైదరాబాదు-83

**సంపాదకులు:**
డా॥ టి.శ్రీరంగస్వామి-
'శ్రీలేఖసాహితి'
(సాహిత్యసాంస్కృతికసంస్థ),
ఇ.నెం. 14-5/2,
మండల కార్యాలయం ఎదురుగా,
హసన్‌పర్తి, వరంగల్లు-506 371.
**సైజు:** 1/8 డెమ్మి; **పుటలు:** 12+339;
**వెల:** రూ. 250/-;
**ప్రతులకు:** విశాలాంధ్ర పబ్లిషింగ్‌హౌస్, అన్నిబ్రాంచీలలో మరియు ఇంటిఅడ్రస్సుకు.

## వంశీమోహనము- శ్రీకృష్ణసర్వస్వము

వంశీమోహనుడైనశ్రీకృష్ణుణ్ణి గూర్చిన 32 వ్యాసాలసంకలన గ్రంథ మిది. సంకలన కర్త డా॥టి.రంగస్వామి ఇప్పటికే తెలుగు సాహిత్యంపై ఎన్నో సంకలనగ్రంథాలు వెల్వరించి, సాహితీహృదయులకు సన్మిత్రుడయ్యాడు. 'శ్రీకృష్ణోపనిషత్' వ్యాసంతో మొదలై, 'పర్యావరణం- కాలుష్యం- శ్రీకృష్ణుడు' వ్యాసంతో మంగళాంతమైన ఈ వ్యాససంపుటిలో వైదిక, ఇతిహాస, పురాణ, కావ్య, నాటక, స్తోత్ర, శతక, సంగీత, నవలా, చలనచిత్రరంగ, జానపదాలతో శ్రీకృష్ణుడు - పరమాత్మ, ధర్మ, నిస్స్వార్థ రాజకీయ, సాకారభగవన్మూర్తిగా గోచరిస్తున్నాడు. ప్రతివ్యాసంలో శ్రీకృష్ణుని విశ్వమోహనరూపం ఒక విశిష్టభంగిమలో పాఠకులమనోనేత్రాలకు గోచరిస్తుం దనడంలో సందేహం లేదు. శ్రీకృష్ణుని అందం ప్రతిసన్నివేశంలో నూత్నపద్ధతుల్లో వివరించడం- ఈ సంకలనం ప్రత్యేకత. వ్యాస రచయిత లందరూ శ్రీకృష్ణోపాసకులే అనిపిస్తుంది. తెలుగుపాఠకులందరూ ఆసక్తితో చదివి, ఆనందించి, జగన్మోహనుని వంశీనాదామృతపానంతో తన్మయులు కాగలరని ఆశిస్తున్నాను.

**- పి.విజయలక్ష్మి**

శ్రీవారితరువాత అంతటిస్థానాన్ని పొందిన శ్రీగోవిందరాజస్వామివారి చరిత్రనుగూర్చి డా॥పి.నారాయణగారు ఈ గ్రంథంలో ఆమూలాగ్రంగా వివరించారు. తిరుపతి అవిర్భావము, వికాసము, ఆగమవాఙ్మయము, శ్రీగోవింద రాజస్వామి ఆలయ-ఆవిర్భావవికాసములు, శ్రీగోవిందరాజస్వామి ఆలయం-ఉత్సవాలు, శ్రీగోవిందరాజస్వామిదేవాలయం-సంవత్సరోత్సవాలు, శ్రీగోవిందరాజ స్వామిఆలయం- సామాజికఆర్థికతత్త్వప్రాధాన్యం, అన్నమయ్య కీర్తనలువంటి ఏడుఅధ్యాయాలుగా ఈ గ్రంథం విభజించబడి ఉంది.

ఈ గ్రంథం కేవలం ఆధ్యాత్మిక పరంగానేగాక చారిత్రకపరంగాకూడా అనేకవిషయాలను తెలియజేస్తున్నది. ఈ గ్రంథంద్వారా తిరుపతిక్షేత్రచరిత్రే గాకుండా, ఆ దేవదేవునికి నిత్యం జరుగుతున్నపూజలు, వాటివైశిష్ట్యంవంటి చాలా అంశాలు వివరంగా తెలుస్తున్నవి. ఆధ్యాత్మికవేత్తలకు, పరిశోధకులకు ఇది చక్కటి కరదీపకగా ఉపయోగపడుతుం దని చెప్పవచ్చు. **- డా॥కె. రెడ్డప్ప.**

## తిరుపతి- శ్రీ గోవిందరాజస్వామి దేవాలయము

**రచయిత:** డా॥ పి.నారాయణ,
**సైజు:** 1/8 డెమ్మి; **పుటలు:** 230;
**వెల:** రూ. 100/-;

**ప్రతులకు:** పి.సంధ్య,
C/o పి.నారాయణ,
ఇ.నెం.18-4-150,
5వ క్రాస్, రైల్వేకాలనీ ఎక్స్‌టెన్షన్,
తిరుపతి - 517507.
సెల్-9160727374.

# రాశిఫలాలు

## డిసెంబరు, 2013



జె.చంద్రశేఖరశర్మ



### మేషం

ఈ మాసంలో ఈ రాశివారికి ఆదాయక్షీణత, విచారం, ధననష్టం, అధికశ్రమ, ఉద్యోగభయం తదితరఅశుభఫలితాలు కల్గుతాయి. ఆకస్మికప్రమాదాలవల్ల అనారోగ్యం ఏర్పడుతుంది. ప్రయాణాల్లో జాగ్రత్త అవసరం. ప్రభుత్వఉద్యోగులకు స్థాన చలనంవల్ల సమస్యలు. మొదటివారం అనారోగ్యం, రెండోవారం ఆనందం, మూడోవారం దైవానుకూలత, నాలుగోవారం ప్రమాదం.



### వృషభం

ఈ రాశివారికి ఈ నెలలో వృత్తిఉద్యోగాల్లో లాభం, వ్యవహారాల్లో విజయం. బంధుమిత్రుల కలయిక. స్నేహితుల మూలంగా నష్టం జరిగేఅవకాశం. మొదటివారం వ్యవ హారవిజయం, రెండోవారం ధనలాభం, మూడోవారం క్షేత్ర దర్శనం, నాలుగోవారం ఆనందం.



### మిథునం

ఆ నెలలో వీరికి అనారోగ్యం, వాహనప్రమాదాలు, వృథాసంచారం. అధికవ్యయం తదితరఫలితా లుంటాయి. వ్యాపారాల్లో తిరుగులేనివిజయం లభించినా శత్రువుల మూలంగా కష్టనష్టాలు కల్గుతాయి. ఆధ్యాత్మికచింతన ఎక్కువ. అధికప్రయాణాలవల్ల అనారోగ్యం. ఒంటరిగా వాహనాల మీద ప్రయాణం చేయటంవల్ల ప్రమాదాలు కలిగే అవకాశా లున్నాయి. మొదటివారం ప్రమాదం, రెండోవారం అధికవ్యయం, మూడోవారం ధనలాభం, నాలుగోవారం ఆధ్యాత్మికచింతన.



### కర్కాటకం

ఈ మాసంలో ఈ రాశివారికి మనశ్చింత, కార్య విఘ్నత, బంధువిరోధం, శారీరకశ్రమ, దుష్టులతో కలహం తదితరఅశుభాలు కలుగుతాయి. మొదటివారం ద్రవ్యనాశనం, రెండోవారం ధనలాభం, మూడోవారం అనారోగ్యం, నాలుగో వారం భయాందోళనలు.



### సింహం

ఈ మాసం ఈరాశిస్త్రీలకు అనుకూలం. ఆకస్మిక ధనలాభం. సోదరసోదరీమణులవల్ల కుటుంబంలోనూ, వ్యాపారంలోనూ ఇబ్బందులు. మొదటివారం జయం, రెండో వారం కార్యసిద్ధి, మూడోవారం స్వల్పశ్రమ, నాలుగోవారం ధనప్రాప్తి.



### కన్యారాశి

ఈ నెలలో ఈ రాశివారు దూరప్రయాణాలకై చేసే ప్రయత్నాలు ఫలిస్తాయి. పండ్లు, పూలవ్యాపారులకు కష్టకాలం. ప్రేమానుబంధాలు బలపడతాయి. ముఖ్యులతో సంభాషించే టప్పుడు మెలకువ వహించండి. సంబంధీకులనుంచి ఆహ్వానం సంతృప్తి నిస్తుంది. దైవకార్యక్రమాలపట్ల ఆసక్తి పెరుగుతుంది. మొదటివారం అధికధనవ్యయం, రెండోవారం మానసికచింత, మూడోవారం ఆనందం, నాలుగోవారం ధనలాభం.



### తుల

ఈ మాసంలో ఈ రాశివారికి నూతనవ్యక్తుల పరి చయం ఎంతో సంతృప్తి నిస్తుంది. స్నేహితులు మిమ్మల్ని ఉద్రేక పరచి, లబ్ధిపొందడానికి ప్రయత్నిస్తారు. సాహితీరంగాలలో ఇష్టాగోష్ఠిగా పాల్గొంటారు. రాజకీయనాయకులకు ఆందోళనలు. మొదటివారం స్థానచలనం, రెండోవారం ఆనందం, మూడో వారం ధననష్టం, నాలుగోవారం కార్యానుకూలత.



### వృశ్చికం

ఈ రాశివారికి ఈమాసంలో గృహంలో మార్పులు, చేర్పులకు అనుకూలమైనకాలం. మిత్రుల సహాయసహకారాల వల్ల కార్యానుకూలత. వివాహప్రయత్నాలు ఫలిస్తాయి. ఇతరుల జోక్యంవల్ల దీర్ఘకాలికసమస్యలు కొలిక్కివస్తాయి. మొదటివారం



## శ్రీలక్ష్మీకరుణ

**చంద్రసహోదరి సాగరతనయా పుండరీకాక్షుని పట్టపుమహిషి**
**ఐశ్వర్యదాయిని సౌభాగ్యదాయిని పాలించుశ్రీలక్ష్మి నమ్మతి నమామి**

**హేమమాలిని వరదహస్తము కమలాసనము మంగళరూపం**
**నిత్యసుమంగళి శాంతిదాయిని కమలలోచని కల్మషనాశిని**
**శ్రీహరికరుణ నొసగేదేవీ దయజూడమ్మా వరముల నిమ్మా**

**పాలకడలిలో పద్మనాభునికి నిత్యసేవలతో నలరేతల్లికి**
**పాపవిమోచని మోక్షప్రదాయిని ప్రసన్నమూర్తీ మాఇలువేల్పు**
**నీరాజనములు వేల్పులతల్లికి వందన మిదిగో నమామి నమామి**

**అష్టలక్ష్మిగా అన్నికోరికలు అనుగ్రహించే అనురాగవల్లీ**
**గైకొనుమమ్మా నైవేద్యములు సిరిసంపదల నొసగుము తల్లీ**
**అందుకోశ్రీలక్ష్మీ! అంజలి మాతా! సిద్ధింపజేయుము భక్తులకోరిక**

*- ఆర్. చంద్రశేఖరరావు*

కార్యానుకూలత, రెండోవారం గౌరవం, మూడోవారం అనారోగ్యం, నాలుగోవారం ఆనందం, ధనప్రాప్తి.



### ధనుస్సు

ఈరాశివారికి ఈమాసంలో ముఖ్యమైన కార్యక్రమాలు వాయిదాపడతాయి. గృహంలో ఏవైనా విలువైనవస్తువులు పోవడానికి ఆస్కారం ఉంది. సుదూరప్రయాణాలకై చేసే ప్రయత్నాలు ఫలిస్తాయి. బంధువులు మిమ్మల్ని ఆర్థికసహాయంకోసం, హామి ఉండ మని కోరతారు– జాగ్రత్త వహించండి. మొదటి వారం చిక్కులు, రెండోవారం మానసిక అశాంతి, మూడోవారం ధనలాభం, నాలుగో వారం కార్యవిఘ్నత.



### మకరం

ఈ రాశివారికి వివాహశుభప్రయత్నాలు ఫలిస్తాయి. నూతనవిషయాలపట్ల ఆసక్తి పెరుగుతుంది. పుణ్యక్షేత్రదర్శనాలు. బంధువర్గంలో కొందరు మిమ్మల్ని చూసి అసూయ పడతారు. చిన్ననాటిమిత్రుల రాకపోకలు మనశ్శాంతి నిస్తాయి. నూతన వాహనం కొనుగోలుకు చేసే ప్రయత్నాలు ఫలిస్తాయి. మొదటివారం ధనలాభం, రెండోవారం కలహాలు, మూడోవారం ఆందోళన, నాలుగోవారం దైవదర్శనాలు.



### కుంభం

ఈమాసం ఈరాశివారికి ఆధ్యాత్మిక చింతన పెరుగుతుంది. కొందరు మిత్రులవల్ల ఆవేశం, ఆందోళనలు పెరుగుతాయి. నమ్మిన వ్యక్తుల సలహాలవల్ల ఆపదలనుండి విముక్తి పొందుతారు. ఆరోగ్యం సంతృప్తికరంగా ఉంటుంది. ఒంటరిగా ప్రయాణాలు అచ్చిరావు. మొదటివారం ఆపదలనుండి విముక్తి, రెండోవారం క్షేత్రదర్శనాలు, మూడోవారం ఆనందం, నాలుగోవారం స్థిరాస్తిలాభం, ఆకస్మికధనలాభం.



### మీనం

వాహనప్రమాదాలు, మనశ్చింత, కార్యవిఘ్నత, అధికారులతో కలహాలు తదితర అశుభఫలితాలు ఈ మాసంలో ఈ రాశివారికి ఉంటాయి. వాహనప్రమాదాలు, వృత్తివ్యాపారాల్లో స్నేహితులవల్ల నష్టం కలుగుతుంది. జాగ్రత్త. నూతనగృహనిర్మాణాలు, స్థానచలనప్రయత్నాలు కష్టసాధ్యాలు. మొదటివారం మానసిక చింత, రెండోవారం ఆర్థికలాభం, మూడోవారం కార్యాను కూలత, నాలుగోవారం ధనలాభం.




# ఎంత మాత్రము ఎవ్వరు తలచిన...

కె.ఎస్.ఎన్.రావు, ప్రొద్దుటూరు

క్షీరసాగరమందు పవళించే శ్రీవారు ఎంత కరుణాసముద్రుడో నాకు అనుభవంలోనికి వచ్చినఘటన మీకు విన్న వించే చిన్నప్రయత్నమాలిక.

నేను గుజరాత్‌నుండి స్వగ్రామానికి, బదిలీ అయినసందర్భం పురస్కరించుకుని శ్రీవారికి మొక్కు (మన్నత్) తీర్చు కోవాలని సంకల్పించినాను. ఆగష్టు, 2012లో నాకు బదిలీ అయింది. అప్పటినుండి, శ్రీవారి దర్శనం మొక్కు ఎప్పటి కప్పుడు వాయిదా పడుతూనే ఉంది. కానీ, విచిత్రంగా నెలనెలా శ్రీవారిదివ్యప్రసాదమైన లడ్డూ నాకు ఏదో ఒకవిధంగా అందుతూ ఉండేది.

ఎట్టకేలకు శ్రావణశుద్ధపాడ్యమి నాడు నేను, నా కుటుంబసమేతంగా తిరుమల చేరుకుని, ఉదయం 8.30కి కంపార్టుమెంట్‌లోనికి చేరుకున్నాము. దర్శనసమయం సాయంకాలం 5 గంటలకు అని తెలియ చేశారు. కనుక 'పాస్' తీసుకుని బయటికి వెళ్ళి– 'పాపనాశనం', 'ఆకాశగంగ' దర్శించాము. తిరిగి 4 గంటలకు కంపార్టుమెంట్ లోనికి వెళ్లగా– మళ్ళీ రాత్రి 9 గంటలకు దర్శనం అని చెప్పారు. శ్రీవారు ఇలా ఎందుకు దర్శనం ఆలస్యం చేసి, సహనపరీక్ష పెట్టారో – అని కాస్తకలతచెంది, ఇక ఓపిక లేదు.... మరలి పోదాం అని మా వాళ్ళతో చెప్పి, మళ్ళీ పాస్ తీసుకుని కంపార్టు మెంట్‌నుంచి బయటకు వచ్చామో లేదో శ్రీవారు ఉభయదేవేరులతో కలిసి పల్లకిలో మాడవీథిలో వస్తూ ఉన్నారు. ఒకప్రక్కగా నిల్చొని, స్వామివారిని తన్మయత్వంతో తాదాత్మ్యంగా చూస్తూ ఉన్నాను. అంతలో శ్రీవారిసేవకులు నన్ను పిలిచి, మోయమన్నారు. అక్కడ అంత మంది ఉండగా నన్నుమాత్రమే పిలిచారంటే మరి సాక్షాత్తు శ్రీవారే ఎంతో కరుణతో నన్ను ఊరడించాడేమో అన్పించింది. ఆ ఆనందపరవశంతో నా నయనాలు ఆనందాశ్రువులు జాలువార్చాయి. తదుపరి శ్రీవారిదర్శనం త్వరగా లభించింది. కానీ రెప్పపాటు సమయం మాత్రమే!

ఆనందనిలయం వెనుకవైపు తి.తి.దేవస్థానంవారు నిర్మించినమ్యూజికల్ ఫౌంటేన్–ఒక అద్భుతమైనఆలోచన. అక్కడ అన్నమయ్యకీర్తనలకు లయబద్ధంగా గంగ నాట్యమాడుతుంటే– శ్రీవారిఅభయహస్తమే దీనివెనకాల ఉండి, అలా చేయిస్తోందోమో – అనే మధురానుభూతికి లోనయ్యాం. అందులకు తి.తి.దే. వారికి సదాకృతజ్ఞతలు. ఢిల్లీలోని 'అక్షరధామ్'లో కూడా మ్యూజికల్ ఫౌంటేన్ ఉంది. కానీ, అక్కడ అన్నమయ్యకీర్తనలు ఉండవు కదా....!

అన్నమయ్య సెలవిచ్చినట్లు.....

**ఎంతమాత్రమున ఎవ్వరు తలచిన అంతమాత్రమే నీవు**
**అంతరాంతరము లెంచి చూడ పిండంతే నిప్పటి అన్నట్లు**

ఆ శ్రీవారినామస్మరణలో సదా తదేకంగా ఓలలాడుదాం! శ్రీవారిఅభయహస్తం మనల్ని సదా వెన్నంటి కాచునట్లు.. ఒక్కసారి 'సుప్రభాతసేవ'లో శ్రీవారిని కరవుతీరా కాంచి, ఈ జన్మలక్ష్యాన్ని సాధించా లని ఉవ్విళ్ళూరుతూ....

## రచయితలకు విజ్ఞప్తి

రచయిత(త్రు)లు సప్తగిరి మాసపత్రికకు తమరచనలతో పాటు... ఇకమీదట తమ బ్యాంకుపాస్‌బుక్కు ముందుపేజీ, పాన్‌కార్డు జిరాక్స్ ప్రతులను జతపరచి పంపాలి.

**ఇకమీదట రచనలకు పారితోషకాలు డి.డి. రూపంలో చెల్లించబడవు**

ఆన్‌లైన్ ద్వారా నేరుగా తి.తి.దేవస్థానంనుండి రచయిత(త్రు)ల అకౌంటుకు పారితోషికం జమచేయబడుతుంది. రచయితలు దీనిని గమనించగలరు.

– ప్రధానసంపాదకుడు



శ్రీమాన్ పురిశై శ్రీరంగాచార్యస్వామివారిచే ప్రణీతమైన

# శ్రీలక్ష్మీగద్యమ్ (11)

"శ్రీచరణపరిచరణ" వ్యాఖ్య వ్యాఖ్యాత – డా॥ ఈ.ఏ.శింగరాచార్యులు

**12. సముజ్జ్వలతర మణితర్జిత తరణితాటంక నిరాటంకకంద ళిత కాంతిపూర కరంబిత కర్ణశష్కులీవలయే!**

సముజ్జ్వలతర = మిక్కిలిగా ప్రకాశించు, మణి = రత్నము లచే, తర్జిత = భయపెట్టబడిన, తరణి = సూర్యుని కల, తాటంక = తాటంకములు (దుద్దులు) అను కర్ణభూషణముల నుండి, నిరాటంక = అడ్డు లేకుండ, కందళిత = దీపకళికలై పుట్టిన, కాంతిపూర = కాంతిప్రవాహములచే, కరంబిత = కూడుకొనిన, కర్ణశష్కులీవలయే = శష్కులములవంటి (చక్కి లములవంటి) గుండ్రని కర్ణరంధ్రములను కల్గినదానా!

పద్మావతీదేవికర్ణములను వర్ణించుట ఇందలిఅంశము. పద్మావతీదేవి కర్ణములందు అలంకరింపబడినతాటంకములలో (దుద్దులలో) గొప్పగా ప్రకాశించుమణులు కలవు. కాంతిలో అవి సూర్యుని మించి ప్రకాశించుచున్నవి. వీనినుండి నిరాఘా టముగా దీపకళికలై వెలువడి ప్రవహించుకాంతులతో చక్కి లములవంటి కర్ణరంధ్రములు వెలుగుచున్నవి.

**13. బహిరుపగత స్ఫురణాధిగతాంతరంగణ భూషణగణ వదన కోశసదన స్ఫటికమణిమయభిత్తి శంకాంకురణచణ ప్రతిఫలితకర్ణపూర కర్ణావతంసతాటంక కుండలమండన నిగనిగాయమాన విమలకపోలమండలే!**

బహిః ఉపగత = బయటకు వచ్చిన, స్ఫురణ = కాంతు లచే, అధిగత = తెలియబడిన, అంతః+అంగణ = లోపలి భాగములోని, భూషణగణ = నగల సమూహములను కల, వదన = ముఖము అనెడి, కోశసదన = కోశాగారముయొక్క, స్ఫటికమణిమయ = స్ఫటికమణులతో నిర్మించిన, భిత్తి = గోడలు అను, శంకా = సందేహము, అంకురణ = కల్గుటలో, చణ = సమర్థమై, ప్రతిఫలిత = ప్రతిఫలించిన, కర్ణపూర = కర్ణ పూరములు (వలయాకారములోని కర్ణాభరణములు), కర్ణ+ అవతంస = కర్ణావతంసములు (చెవుల పైభాగములోని ఆభర ణములు, చెంపసరములవంటివి), తాటంక = తాటంకములు (దుద్దులు), కుండల = కుండలములు అను, మండన = అలం కారములచే, నిగనిగాయమాన = నిగనిగ మని వెల్గుచున్న, విమల = స్వచ్ఛములైన, కపోలమండలే = గుండ్రనికపోలము లను కల్గినదానా!

ఇందు కర్ణభూషణముల కాంతిచే వెలుగొందు పద్మావతీ దేవికపోలయుగళి స్తుతింపబడుచున్నది.

పద్మావతీదేవిముఖము అద్భుతమైన కాంతితో వెలుగొందు టకు ఒక హేతువు ఉత్ప్రేక్షింపబడుచున్నది. ఆమెమోము ఒక భూషణగణకోశాగారము. దానిలోపల గల భూషణముల కాంతి బయటకు ప్రసరించుటచే అది ఉజ్జ్వలముగా నున్నది. ఆ భూషణకోశాగారమునకు ఇరువైపులనున్న మణిమయములైన గోడలా ఇవి ! అను శంకను ఆమె ముఖములోని విశాలమైన, నున్నని గుండ్రని కపోలములు కల్గించుచున్నవి. పద్మావతీదేవి కర్ణములకు అలంకరింపబడియున్న కర్ణపూర– కర్ణావతంస– తాటంక – కుండలాదిఅలంకరణములకాంతులచే ఆమె కపోలములు నిగనిగమని ప్రకాశించుచున్నవి.

**14. నిజభ్రుకుటీభటీభూత త్ర్యక్షాష్టాక్షద్వాదశాక్ష సహస్రాక్ష ప్రభృతి సర్వసుపర్వ శోభనభ్రూమండలే!**

నిజభ్రుకుటీ = తనకనుబొమల ముడికి, భటీభూత = భటులైన, త్ర్యక్ష = పరమేశ్వరుడు, అష్టాక్ష = చతుర్ముఖుడు, ద్వాదశాక్ష = షణ్ముఖుడు, సహస్రాక్ష = దేవేంద్రుడు, ప్రభృతి = మొదలగు, సర్వ = సమస్త, సుపర్వ = దేవతలను కల, శోభన = అందమైన, భ్రూమండలే = భ్రూమండలములను కల్గినదానా! (కనుబొమలు కలదానా!)

పద్మావతీదేవికనుబొమలకదలికలకు పరమేశ్వరుడు, బ్రహ్మ, కుమారస్వామి, ఇంద్రుడు మొదలగు దేవతలందఱు వశులై వర్తింతురు. ఇందులకు లక్ష్మీస్తుతిలోని **"దాసీభూతసమస్త దేవవనితాం బ్రహ్మేంద్రగంగాధరామ్"** (సమస్తదేవకాంతలను దాసీజనంగా కల్గినది) అను సూక్తి స్మరణీయము. అట్లే, **"బ్రహ్మే శాదిసురవ్రజ స్సదయిత స్త్వద్దాసదాసీగణః"** (బ్రహ్మ, ఈశ్వరుడు మొదలైన దేవతలు తమపత్నులతో పాటుగా నీకు దాసదాసీ జనాలు) అను యామునసూక్తి, **"యద్భ్రూభంగాః ప్రమాణం స్థిరచరరచనా తారతమ్యే మురారేః"** (ఏలక్ష్మీదేవియొక్క కనుబొమ్మల కదలికలు లోకాలహెచ్చుతగ్గులకు ప్రమాణమో) అను భట్టర్ సూక్తి మొదలగు ప్రమాణముల భావములు ఇచట అనుసంధేయములు.

**15. నిటలఫలక మృగమదతిలకచ్ఛల విలోకలోకవిలోచన దోషవిరచిత విదళన వదనవిధుమండల విగలితనాసికా ప్రణాళికా నిగూఢనిఃసృత నాసాగ్రస్థూల ముక్తా ఫలచ్ఛలాభివ్యక్త వదనబిలనిలీన కంఠనాళికాంతఃప్రవృత్త గ్రీవామధ్యోచ్చ భాగకృత విభాగగ్రీవాగర్తవినిఃసృత పృథులవిలసదురోజ శైలయుగళ నిర్ఝరజర్ఝరీభూత గంభీరనాభిహ్రదావగాఢ నిలీనదీర్ఘతర పృథులసుధాధారా ప్రవాహయుగళ విభ్రమాధార విస్పష్టవీక్ష్యమాణ విశుద్ధస్థూల ముక్తాఫలమాలా విద్యోతిత దిగంతరే!**

నిటలఫలక = ఫలకమువంటి ఫాలమునందు, మృగమద తిలకచ్ఛల = కస్తూరీతిలకము అను మిషచే, విలోకలోక = ప్రేక్షకజనుల, లోచనదోష = దృష్టిదోష కారణముచే, విరచిత = రచింపబడిన (చేయబడిన), విదళన = పగులును కల, వదనవిధుమండల = ముఖ మనుచంద్రమండలమునుండి, విగలిత = స్రవించినది, నాసికాప్రణాళికా = నాసిక అను కాలువద్వారా, నిగూఢ = మిక్కిలిగూఢముగా, నిఃసృత = బయటకు వచ్చినది, నాసా+అగ్ర = నాసికచివరగల, స్థూల ముక్తాఫలచ్ఛల = దిటవు అయిన ముత్యము అను నెపమున, అభివ్యక్త = బయటకు వ్యక్తమైనది, వదనబిల = నోరు అను బిలమునందు, నిలీన = లోపల అణగినదై, కంఠ+నాళికా అంతఃప్రవృత్త = కంఠనాళికలోపల ప్రసరించినదై. గ్రీవామధ్య+ ఉచ్చభాగకృతవిభాగ = కంఠమధ్యమునందు ఉన్నతప్రదేశమున విభాగింపబడినదై, గ్రీవా గర్త వినిఃసృత = కంఠ మను గుంటనుండి బయటకు వచ్చినది. పృథుల= పెద్దవై, విలసత్= ప్రకాశించు, ఉరోజ శైలయుగల = స్తవములనెడి రెండు పర్వతములలోని, నిర్ఝరజర్ఝరీ = కొండవాగుల ప్రవాహముల వలెనున్నది, గంభీరనాభిహ్రద = లోతైన నాభి అను చెఱువులో, అవగాఢనిలీన= మిక్కిలి గాఢముగా అణగియున్నది, దీర్ఘతర= మిక్కిలిపొడుగైన, పృథుల = విస్తృతమైన, సుధాధారా = అమృతధారయొక్క, ప్రవాహయుగళ = ప్రవాహద్వయము అనెడి, విభ్రమ+ఆధార = గొప్పభ్రమకు ఆధారమై, విస్పష్ట వీక్ష్యమాణ = మిక్కిలి స్పష్టముగా చూడబడుచున్న, విశుద్ధ = మిక్కిలి స్వచ్ఛమైన, స్థూల= పెద్దదైన, ముక్తాఫల = ముత్యముల (చేకూర్చబడిన), మాలా = మాలికచే, విద్యోతిత = గొప్పగా ప్రకాశింపచేయబడిన, దిగంతరే = దిక్కులమధ్యభాగమును కల్గినదానా!

పద్మావతీదేవి ధరించియున్న గొప్పముత్యాలహారము ఆమెకంఠములో అలంకరింపబడి నాభిపర్యంతము విస్తరించియున్నది. నాసికకు ముక్కెర అలంకరింపబడియున్నది. వీటి యొక్కశోభను రూపకానుప్రాణితమైనఉత్ప్రేక్షతో ఇచట వర్ణించుచు, లక్ష్మీదేవిఫాలభాగమునుండి నాభివరకు గల దివ్య రూపవర్ణనను స్తుతికర్త నిర్వహించుచున్నారు.

పద్మావతీదేవిముఖములోని విశాలమైనఫాలప్రదేశములో నల్లనికస్తూరీతిలకము రచింపబడియున్నది. దానిని చూడగా, ఆమెను చూచువారిదృష్టిదోషమువలన ఏర్పడిన విదళనమువలె (పగులువలె నున్నది). పద్మావతీముఖము చంద్రబింబము వంటిది. చంద్రుడు సుధానిధికదా! కావున అందు అమృతము ఉండుట సహజము. చూచువారి దృష్టిదోష ఫలితముగా ఏర్పడిన ఆ పగులుద్వారా చంద్రబింబసదృశమైన పద్మావతీదేవి ముఖములోనుండి ఒకతెల్లనిఅమృతధార స్రవించినది. ప్రవాహము ఎత్తైనచోటునుండి క్రిందకు ప్రవహించుట సహజము. అట్లే, ఈ అమృతధార ఎట్లు క్రిందకు ప్రవహించినదో ఇక తెలుపబడుచున్నది. పద్మావతీదేవిముఖము నుండి స్రవించిన అమృతప్రవాహము నాసిక అను కాలువద్వారా

గూఢముగా ప్రవహించి, ఆ నాసికచివరలో అలంకరింపబడిన ముక్కెర అనుభూషణములో పొదగబడిన పెద్దముత్యము రూపమున అభివ్యక్తమగుచున్నది. పిమ్మట ఆ ప్రవాహము క్రిందకు సాగి, వదనము (నోరు) అను బిలమున అణగిపోయి నది. అది మఱింతక్రిందకు ప్రవహించి, అది కంఠనాళము ద్వారా ఆ కంఠముయొక్క అగ్రభాగమున రెండుగా చీలి, క్రిందకు జారినది. పిమ్మట ఆ ప్రవాహము ఎత్తైన, పెద్ద కొండలవంటి స్తనద్వయము పైనుండి ప్రవహించి, అచటినుండి రెండు కొండవాగులవలె క్రిందకు సాగినదై, లోతైన నాభి అను చెఱువులో లీనమైనది. ఇట్లు ప్రవహించిన అమృతధారాప్రవాహ యుగళమా! అనుశంకను పద్మావతీదేవి ధరించిన, ఆమె నాభివరకు విస్తరించిన పెద్దముత్యములతో కూర్చబడిన హారము కల్గించుచున్నది. ఆ హారముయొక్క కాంతివలన దిగంతరములు దీప్తిమంతములైనవి- అని తాత్పర్యము.

**16. సకలాభరణ కలావిలాసకృత జంగమచిరస్థాయి సౌదామనీ శంకాంకురే !**

సకల+ఆభరణ= సమస్తభూషణములయొక్క, కళావిలాస= కాంతివిలాసముచేతనే, కృత = కల్పింపబడినది (ఏర్పడినది), జంగమ = కదలునట్టిది, చిరస్థాయి = చిరకాలము ఉండునది అగు, సౌదామనీ = మెఱపుతీగయొక్క, శంకా = సందేహము యొక్క, అంకురే = అంకురమును (కారణమును) కల్గినదానా!

పద్మావతీదేవి దాల్చినపలుఆభరణములకాంతి, సహజము గానే **"హిరణ్యవర్ణ"**గా ప్రసిద్ధిజెందిన ఆమెయొక్క శోభను మఱింత వృద్ధి చేయుచున్నది. అందుచే ఆమె జంగమ మైన, చిరకాలము నిలచియుండుమెఱపుతీగయా! అను సందేహము నకు కారణమగుచున్నది. **"జంగమ, చిరస్థాయి"** విశేషణములు లోకములోని మెఱపుతీగకంటె పద్మావతీదేవి అను మెఱపుతీగకు కల వైలక్షణ్యమును ప్రతిపాదించుచున్నవి. శంకాశబ్ద ప్రయోగముచే ఇచట భ్రాంత్యలంకారము కలదు.

లక్ష్మీదేవియొక్క వివిధ భూషణశోభను **"అణియార్ మలర్ మజ్గై"** (ఆభరణాలను నిండుగా కల లక్ష్మీదేవి)అని నమ్మాళ్వార్లు కీర్తించిరి. **"విద్యుల్లేఖేవ భాస్వరా"** అని శ్రుతి, **"పొలిన్దు ఇరుణ్డ కార్వానిల్ మిన్నేపోల్ తోన్టి"** (నీలవర్ణాన్నికల ఆకాశంలో మెఱుపువలె ప్రకాశించి) అని, **"కారార్న్ద వాళ్ అమరుమ్ మిన్నిమైక్కుమ్ వణ్డామరై నెడుజ్గణ్ తేన్ అమరుమ్ పూమేల్ తిరు"** అను పేయాళ్వార్లు లక్ష్మిని విద్యుల్లతగా కీర్తించిరి.

**17. కనకరశనా కింకిణీ కలనాదిని !**

కనకరశనా = బంగారు మొలనూలులోని, కింకిణీ = మువ్వలయొక్క, కల= మనోహరమైన, నాదిని = నాదమును కల్గినదానా !

పద్మావతీదేవి ధరించినమొలనూలులోని చిఱుమువ్వల సవ్వడి శ్రావ్యముగా నున్నది. **"అరైశెయ్ మేకలై అలర్మకళ్"** (నడుమున మేఖలను కల లక్ష్మీదేవి) అనుచు పెరియ తిరు మొళిలో (1-2-5) తిరుమంగై మన్నన్ లక్ష్మీదేవి ధరించిన మేఖలనుగూర్చి నుతించిరి.

**18. నిజజనతాగుణ నిజపతినికట నివేదిని !**

నిజ=తనయొక్క, జనతా= ఆశ్రిత జనసమూహముయొక్క, గుణ = గుణములను, నిజ పతినికట = తన భర్తసమీపము నందు, నివేదిని = నివేదించుదానా!

తనను ఆశ్రయించిన భక్తుల గుణములను స్వామియగు నారాయణుని సన్నిధిలో నివేదించి పురుషకారమును చేయును. తద్వారా వారిని కాపాడును. ఆశ్రితజనుల దోషములను భగ వానుడు చూడకుండ చేసి, వారిని లక్ష్మీదేవి కాపాడును అనుటకు శ్రీరామాయణములోని **"కార్యం కరుణ మార్యేణ న కశ్చిన్నా పరాధ్యతి"**(ఆర్యుడవైన నీవు దయ చూపాలి. తప్పు చేయవా డెవడు?) అను సూక్తి, **"నిర్దోషః క ఇహ జగతి?"** (ఈలోకంలో దోషం లేనివా డెవడు?)అను భట్టర్ శ్రీగుణరత్నకోశసూక్తి మొదలగునవి స్మరణీయములు.

**19. నిఖిలజనానుమోదిని !**

సమస్తజనులను అంగీకరించి అనుగ్రహించుదానా !

*(ఇంకా ఉంది)*

वेङ्कटाद्रिसमं स्थानं ब्रह्माण्डे नास्ति किञ्चन,
वेङ्कटेशसमो देवो न भूतो न भविष्यति।



भगवतः श्रीनिवासस्य सन्देशवाहिनी सप्तगिरिमासपत्रिका तिरुमल-तिरुपति देवस्थानेन पञ्चभाषासु (तेलुगु-तमिल-कन्नड-हिन्दी-आङ्गलभाषासु) प्रकाश्यमाना वर्तते। तथैव संस्कृताभिमानिनाम् इच्छाम् उररीकृत्य संस्कृतभाषायामपि मासपत्रिकामेनां समानेतुं तिरुमल-तिरुपति-देवस्थानेन सङ्कल्पिता। तेलुगु-हिन्दीभाषयोः सप्तगिरिपत्रिकायाः अभ्यन्तरे सञ्चिका प्रकाश्यमाना वर्तते। अचिरादेव एषा पत्रिका स्वतन्त्रतया संस्कृताम्बरे विहरिष्यति। संस्कृतज्ञाः संस्कृताभिमानिनश्च एनां पत्रिकां स्वागतीकरिष्यन्तीति विश्वसिमः।

- प्रधानसंपादकः




# सप्तगिरिः
## तिरुमल-तिरुपति-देवस्थानम्
सचित्रमासपत्रिका
**नवंबर् - २०१३**


# तिरुचानूरु - पद्मावतीप्रशस्तिः


श्री एम्.जी.नन्दन राव्


**पद्मसरः**

तीर्थाद्रिरिति प्रसिद्धः वेङ्कटाचलः बहूनां तीर्थाना माश्रयः। सुवर्णमुखरीतीरे प्रतिष्ठिते अस्मिन् पर्वते विद्यमानानि तीर्थानि सर्वपापहारकाणि। तेषु तीर्थेषु पद्मसरोवरोऽपि अन्यतमः। पद्मपुराणे अस्य तीर्थस्य शोभा एवं वर्णिता वर्तते–

**प्रसन्नं सन्मन इव वैडूर्यविमलोदकम्।**
**उत्फुल्लैः पुण्डरीकैश्च कल्हारैः कनकाम्बुजैः।**
**नीलोत्पलैः कुवलयैः रक्ताब्जैरञ्चितान्तरम्।**
**मकरन्दमदोन्मत्तमधुरालिकुलोज्वलम्।।**

इति। शुभोदकपूर्णमिदं तीर्थं पद्मसमुच्चयैः सार्थकनाम्ना शोभते स्म। अस्य तीर्थस्नानस्य माहात्म्यं महालक्ष्म्या देवेभ्यः एवमुपदिष्टमस्ति।

**इदं पद्मसरोवरो देवा ये केचन नरा भुवि।**
**प्राप्य स्नानं करिष्यन्ति मांस्तुत्वा विष्णुवल्लभाम्।**
**तेऽपि श्रियं दीर्घमायुः विद्यां पुत्रान् सुवर्चसः**
**लब्ध्वा भोगांश्च भुक्त्वान्ते नरा मोक्षमवाप्नुयुः।**

ये नरा अत्र श्रद्धया स्नान्ति ते इह लोके सर्वसम्पदः प्रप्य, परत्र मोक्षमपि प्रप्नुवन्ति।

**महालक्ष्म्याः आविर्भावः**

अस्मिन्नेव तीर्थे महालक्ष्मीः कलिदोषपीडितानाम् अस्माकम् अनुग्रहार्थम् आविर्भूता वर्तते। नित्यं भगवनुस रणशीला महालक्ष्मीः भगवदवारेष्णु केनचिदपि प्रकारेण भगवन्तमनुसृत्य अवतरति। श्रीरामावतारे सीतेति, कृष्णावतारे रुक्मिणिनाम्ना च अनुसरणमकरोत्। तथैव श्रीनिवासावतारे अस्मिन् पद्मसरोवरे समुत्थिता महालक्ष्मीः पद्मावतिनाम्ना प्रतिष्ठिता अभवत्।

पद्मावत्याः आविर्भावविषये काचन कथा पुराणे श्रूयते। त्रिमूर्तीनां श्रोष्ठत्वनिर्णयार्थं नियुक्तः भृगुमहर्षिः वैकुण्ठलोकं प्रविशति। लोकरक्षणदीक्षामपि विस्मृत्य निद्रामुद्राभिरामम्, रमालोलम् महाविष्णुम् वीक्षय क्रोधमूर्छितस्सन् पदा विष्णुमूर्तेः वक्षसि प्रहरति।

भृगुमहर्षेः पादघातेन कुपिता विष्णुवक्षस्थलालया कमला तं स्थानं परित्यज्य भूमण्डलस्य करवीरपुरं समागच्छति / लक्ष्म्याः विरहेण तप्तः महाविष्णुः करवीरपुरं गत्वापि लक्ष्म्याः दर्शनं न प्राप्नोति। लक्ष्म्या तिरस्कृतः श्रीनिवासः पद्मसरोवरतटे तपः अकरोत्। देवलोकात् सुवर्णपद्मं समानीय सरसि प्रतिष्ठाप्य, तद्विकासार्थं सरसःतटे सूर्यनारायणस्य प्रतिष्ठापनमप्यकरोत्।

द्वादशवत्सराणामन्ते श्रीनिवासस्य तपसा सुप्रसन्ना भूत्वा पद्मसरोवरस्य सुवर्णपद्मे सर्वाः दिशः दीपयन्ती आविरभूत्। तथैव भक्तानामनुग्रहार्थम् तिरुचारनूरू क्षेत्रे सुप्रतिष्ठिता अभवत्।

तिरुमलक्षेत्रस्य यात्रावसरे बहवःभक्ताः पद्मावत्याः दर्शनं प्राप्यैव श्रीनिवासदर्शनार्थं तिरुमलक्षेत्रम् प्राप्नुवन्ति। पूर्वं दूरप्रान्तेभ्यः समागताः भक्ताः अस्मिन् क्षेत्रे विश्रम्य, दिवाकाले भगवतः वेङ्कटेश्वरस्य दर्शनार्थं यात्रा मनुवर्तयन्ति स्म। तिरुमलक्षेत्रम् तदा यात्रिकाणाम् निवासयोग्यम् न आसीत्। गभीरकानने न,आरण्यकप्रणिभिश्च तिरुमलयात्रा प्रयास

## देवादिकृतपद्मावतीस्तुतिः

नमः श्रियै लोकधात्र्यै ब्रह्ममात्रे नमो नमः।
नमस्ते पद्मनेत्रायै पद्ममुख्यै नमो नमः।।
प्रसन्नमुखपद्मायै पद्मकान्त्यै नमो नमः।
नमो बिल्ववनस्थायै विष्णुपत्न्यै नमो नमः।।
विचित्रक्षौमधारिण्यै पृथुश्रोण्यै नमो नमः।
पक्वबिल्वफलापीनतुङ्गस्तन्यै नमो नमः।।
सुरक्तपद्मपत्राभकरपादतले शुभे।
सुरत्नाङ्गदकेयूरकाञ्चीनूपुरशोभिते।।
यक्षकर्दमसंलिप्तसर्वाङ्गे कटकोज्वले।
माङ्गल्याभरणैश्चित्रैः मुक्ताहारैर्विभूषिते।।
ताटङ्कैरवतंसैश्च शोभमानमुखाम्बुजे।
पद्महस्ते नमस्तुभ्यं प्रसीद हरिवल्लभे।।
ऋग्यजुस्सामरूपायै विद्यायै ते नमो नमः।
प्रसीदास्मान् कृपादृष्टिपातैरालोकयाब्धिजे।।
ये दृष्टास्त्वया ब्रह्मरुद्रेन्द्रत्वं समाप्नुयुः।।
इति स्तुता तदा दैवैः विष्णुवक्षस्थलालया।
विष्णुना सह सन्दृश्या रमा प्रीताऽवदत्सुरान्।।
सुरारीन् सहसा हत्वा स्वपदानि गमिष्यथ।
ये स्थानहीनाः स्वस्थानाद्भ्रंशिता ये नरा भुवि।।
ते मामनेन स्तोत्रेण स्तुत्वा स्थानमवाप्नुयुः।
अखण्डैर्बिल्वपत्रैर्मामर्चयन्ति नरा भुवि।।
स्तोत्रेणानेन ये देवा नरा युष्मत्कृतेन वै।
धर्मार्थकाममोक्षाणाम् आकरास्ते भवन्ति वै।।

**अस्य स्तोत्रस्य पठनेन स्थानभ्रष्टाः पुनः तत् स्थानं प्रप्नुवन्ति। स्थिरपदकांक्षिणः स्थिरपदं प्राप्तुम् अस्य स्तोत्रस्य पारायणं कुर्युः।**

भूयिष्ठा आसीत्। तदा तिरुचानूरुक्षेत्रमेव भक्तानाम् आश्रयस्थानमासीत्।

तिरुपतिनगरादपि प्राचीनत्वं तिरुचानूरुक्षेत्रस्य विद्यते। श्रीमद्रामानुजाचार्यैः कृतगोविन्दराजस्वामिनः प्रतिष्ठापनानन्तरमेव तिरुपतिः नगरत्वमवाप। तदारभ्य तिरुपतिनगरे यात्रिकाणां निवासार्थं सत्राणि निर्मितान्यभवन्।

**पूजापद्धतिः**

तिरुचानूरुक्षेत्रे पाञ्चरात्रागममनुसृत्य नित्यपूजाः, उत्सवान् च निर्वहन्ति। प्रतिवत्सरम् वार्षिकब्रह्मोत्सवं, वसन्तोत्सवं, पवित्रोत्सवं, पुष्पयागं, प्लवोत्सवं, वरलक्ष्मीव्रतं च महता वैभवेन आचरन्ति।

**ब्रह्मोत्सवः**

श्रीनिवासस्य तपसा सन्तुष्टा महालक्ष्मीः कार्तिक मासस्य शुक्लपञ्चम्याम् शुक्रवासरे उत्तराषाढनक्षत्रे, मन्त्रसंज्ञके मुहूर्ते आविर्भूता।

**ततस्त्रयोदशेवर्षे कार्तिके शुक्लपक्षके।**
**पञ्चम्यां शुक्रवारे च मूहूर्ते मन्त्रसंज्ञके।।** श्रीपद्मपुराणम्

पद्मावतीदेव्याः आविर्भावासरं संलक्ष्य प्रतिवत्सरं कार्तिकमासस्य पञ्चम्यां यथा समाप्तः स्यात् तथा नवदिनात्मकम् वार्षिरोकत्सवं सङ्कल्प्य महता वैभवेन उत्सवं निर्वहन्ति। पाञ्चरात्रागमविधिपूर्वकं मृत्संग्रहणादिभिः उत्सवं समारभ्य रथवीथिकासु विविधवाहनसेवाः निर्वर्तयन्ति।

**वाहनसेवाः**

तिरुमलक्षेत्रे यथा प्रातः रात्रौ च वाहनसेवाः निर्वर्त्यन्ते तथैव अत्रापि प्रतिदिनं वाहनसेवाद्वयं सञ्चाल्यते। वाहनसेवासु पञ्चमदिनस्य गजवाहनसेवा प्रधाना भवति। महारथोत्सवेऽपि अधिकसङ्ख्याकाः भक्ताःभागम् गृह्णन्ति। सुवर्णरथोत्सवे स्त्रियः एव रथाकर्षणे भागं गृह्णन्तीति विशेषः।

**पञ्चमीतीर्थम्**

ब्रह्मोत्सवस्य अवभृथस्नानं पञ्चमीतीर्थमिति प्रसिद्धम्। अस्मिन् दिने लक्षशः भक्ताः पद्मसरसि स्नत्वा पुनीता भवन्ति।



विविधस्थानेभ्यः समागताः भक्ताः अहमहमिकया तीर्थावगाहनं कुर्वन्ति।

**पद्मसरोवरस्नानफलम्**

मरीच्यत्र्यादिमुनयः पद्मसरोवरस्नानफलम् अवर्णयन्।

**मरीचिः-** सुवर्णमुखरीकूले स्नातः पद्मसरोवरे।
महापातकयुक्तो यः स मुच्येतांहसः क्षणात्।।

**वसिष्ठः-** रुक्माब्जसरसि स्नातो रुक्मनद्यास्तटोद्भवे।
कोटिजन्मकृतैः पापैः मुच्यते श्रियमाप्नु यात्।

**अत्रिः-** अत्र पद्मसरःस्नातो यो रुक्मतटिनीतटे।
स सर्वपापनिमुक्तः श्रियमाप्नोत्यसंशयम्।।

**तिरुमलतिरुपतिदेवस्थानस्य निर्वहणम्**

तिरुमल तिरुपति देवस्थानम् अस्यक्षेत्रस्य सर्वानपि कार्यक्रमान् महता वैभवेन निर्वहति। ब्रह्मोत्सवसन्दर्भे तिरुचानूरुक्षेत्रम् विशेषतया अलङ्कुर्वन्ति। विविधस्थानेषु विविधप्रकारकाः सांस्कृतिकधार्मिककार्यक्रमाः आयोज्यन्ते। वाहनसेवासन्दर्भे पुरवीथिकासु आयोज्यमानाः भजनादि कार्यक्रमाः भक्तेभ्यः नेत्रोत्सवम् जनयन्ति। सर्वेभ्यः भक्तेभ्यः निश्शुल्कभोजन व्यवस्था वर्तते। श्रीवेङ्कटेश्वरभक्तिवाहिन्या अत्रत्यब्रह्मोत्सवस्य विविधसेवाः प्रत्यक्षतया प्रसार्यन्ते। अस्य मासान्ते पद्मावतीदेव्याः वार्षिकब्रह्मोत्सवः भविष्यति। भक्ताः उत्सवसन्दर्भे समागत्य जगन्मातुः दिव्यदर्शनं प्राप्य पुनीताः भवेयुः।

# प्रणवे लक्ष्मीवैभवम्

- डॉ.ई.ए.सिङ्गराचार्युलु

''मातृदेवो भव पितृदेवो भव'' इत्यादिविधिवाक्येन वेदो मातापित्रोः मध्ये मातुः प्राथम्यमुपदिशति। अत्रोपात्तेन मातृशब्देन न केवलं लोके विद्यमानाः सोपाधिकमातरः निर्दिश्यन्ते, अपि च निरुपाधिकमाता सर्वजगज्जननी लक्ष्मीरपि च इति पूर्वाचार्याणामभिसन्धिः। एतादृशानि लक्ष्मीवैभव प्रतिपादकानि वैदिकप्रमाणानि बहूनि सन्ति। सर्वस्यापि वेदराशेः मूलभूते प्रणवे तस्याः महिमा कथं निधिवत् निक्षिप्त इति संग्रहेणात्र प्रस्तूयते।

**प्रणवस्वरूपम्**

वैदिकं तथा लौकिकञ्च वाङ्मयं सर्वं प्रणवादेवोद्भूतमिति ''प्रणवाद्याः तथा वेदाः प्रणवे पर्यवस्थिताः, वाङ्मयं प्रणवं सर्वं तस्मात् प्रणवमभ्यसेत्'' इति, ''ओङ्कारप्रभवो वेदाः ओङ्कारप्रभवाः स्वराः, ओङ्कारप्रभवं सर्वं जगत् स्थावरजङ्गमम्'' इत्यादीनि बहूनि प्रमाणानि उद्घोषयन्ति । अयं प्रणवः संहिताकारेण (''ओम् इति'') एकाक्षरात्मकः, असंहिताकारेण अक्षरत्रयात्मकश्च। असंहिताकारः प्रणवः अकार-उकार-मकार रूपांशत्रयेण अक्षरत्रयात्मको भवति। एते त्रयो वर्णाः क्रमेण ऋग्यजुस्साम्नां त्रयाणां वेदानां सारभूताः। ''भूरिति ऋग्वेदादजायत, भुव इति यजुर्वेदात्, सुवरिति सामवेदात्, तानि शुक्राण्यभ्यतपत्, तेभ्योऽभितप्तेभ्यः त्रयो वर्णा अजायन्त अकार-उकार-मकार इति, तानेकधा समभरत् तदेतदोमिति'' इति श्रुतिवचनात् भूः, भुवः सुवरिति तिस्रो व्याहृतयः वेदेभ्यः ऋग्यजुस्सामभ्यः सञ्जाता इति, अभितप्ताभ्यः ताभ्यः क्रमात् अकार-उकार-मकाराः तत्सारत्वेन उदभवन् इति, तेषां त्रयाणां वर्णानां समीकरणेन प्रणवः समजायत इति च अवगम्यते। एवम् असंहिताकाररूपे प्रणवे विद्यामानाः अकारादयः त्रयो वर्णाः अर्थवशाद्वा, शब्दतो वा भगवद्वैभवमिव भगवत्याः लक्ष्म्या अपि वैभवं व्यञ्जयन्ति इति श्रुतिस्मुतिपुराणेतिहासदिव्यसूरिपूर्वाचार्यसूक्तिसिद्धम्। तदेतत् अत्र किञ्चित् विज्ञाप्यते

**अकारे लक्ष्मीवैभवम्**

''अ इति ब्रह्म'' इति श्रुतिवचनम् अकारस्य ब्रह्मात्मकत्वं बोधयति। अतः अकारः जगत्कारणत्वेन, सर्वरक्षकत्वेन, सर्वशेषित्वेन, सर्वशरण्यत्वेन च स्थितस्य परमात्मनः श्रीमन्नारयणस्य श्रीनिवासस्य वाचको भवति। '' अ इति भगवतो नारायणस्य प्रथमाभिधानम्'' इति वदन् भगवान् पतञ्जलिः महाभाष्ये अमुमशं सुस्पष्टम् अनुजग्राह। आदिशेषावतारभूताः भगवद्रामानुजाचार्या अपि वेदार्थसंग्रहे ''यद्वेदादौ स्वरः प्रोक्तो वेदान्ते च प्रतिष्ठितः, तस्य प्रकृतिलीनस्य यः परः स महेश्वरः'' इति वैदिकप्रमाणं विवृण्वन्तः - ''सर्वस्य वेदजातस्य प्रकृतिः प्रणवः, प्रणवस्य च प्रकृतिः अकारः, प्रणवविकारो वेदः स्वप्रकृतिभूतप्रणवे लीनः, तस्य प्रणवप्रकृतिभूतस्याकारस्य यः परः वाच्यः स महेश्वरः'' - इति ऊचुः। एवमेव ''समस्तशब्दमूलत्वात् ब्रह्मणोऽपि स्वभावतः, वाच्यवाचकसम्बन्धस्तयोरर्थात् प्रतीयते'' इति पाराशरस्मृतिप्रमाणवशादपि यथा स्वभावत एव अकारस्य समस्तशब्दमूलत्वं स्वाभाविकं, तथैव अकारवाच्यस्य परब्रह्मणः समस्तवाच्यमूलकत्वं स्वाभाविकम्। अतः अकारपरमात्मनोः मध्ये वाच्यवाचकरूपसम्बन्धः स्वत एव सिद्ध्यति। एवम् अकारः सर्वजगत्कारणभूतस्य परमात्मनः वाचको भवतीति प्रणवे विद्यमानेन अकारेण परमात्मनः सकलजगत्कारणत्वम् अर्थवशात् अवगम्यते।

एतादृशकारणावस्थायामपि परमात्मा सलक्ष्मीको वर्तते इति वेदो बहुत्र सूचयति। ''सर्वे निमेषा जज्ञिरे विद्युतः पुरुषादधि'' इति श्रुतिप्रमाणम् निमेषादिरूपेण कालेन उपलक्षिताः सर्वेऽपि पदार्थाः विद्युद्वर्णात् पुरुषादेव उद्भूता इति अवगमयति। अस्मिन् प्रमाणे विद्युत्पदेन साक्षात् लक्ष्मीरेव बोध्यते, नान्या इति पूर्वाचार्याणाम् विवरणम्। एवमेव, ''यः

पूर्व्याय वेधसे नवीयसे, सुमज्ज्ञानये विष्णवे ददाशति'' इत्यादि वेदवाक्यम् सृष्ट्यादौ यः सर्वकारणरुपेण आसीत्, सः सुमज्ज्ञानिः-अर्थात् लक्ष्मीशः एव इति विशदीकरोति। वादिकेसरिणः सुन्दरजामातृमुनयोऽपि तत्त्वदीपाख्ये रहस्यग्रन्थे सुमज्ज्ञानिपदस्य ''जानिः जाया, सुमतिः जाया यस्य सः सुमज्ज्ञानिः, अथवा, सुमदा शोभनाऽनन्दा, यद्वा, सुमती शोभनवती जाया यस्य सः'' इति विवृतिं अकार्षुः इत्येतदत्र स्मरणीयम्। प्रलयसमयेऽपि भगवान् लक्ष्मीविशिष्ट एवेति ''आनीदवातम् स्वधया तदेकम्'' इति अन्येन श्रुतिवाक्येन ज्ञायते। अत्र वाक्ये विद्यमानः स्वधाशब्दः लक्ष्मीवाचक एव।

''अव-रक्षणे'' इति धातोः ''अ'' इति पदं निष्पद्यते। अतः प्रणवे विद्यमानः अकारः न केवलं वर्णात्मको भवति, अपि च पदम्। अस्य अकाररूपस्य पदस्य को वा अर्थ? इत चेत्, अस्य रक्षणार्थकधातोरुत्पन्नत्वात् रक्षकः इत्यर्थः पर्यवस्यति। एवम् अकारेण बोध्यमानः सर्वरक्षकः श्रीमन्नारायण एवेत्ययमंशः 'लक्ष्म्या सह हृषीकेशो देव्या कारुण्यरूपया, रक्षकः सर्वसिद्धान्ते वेदान्तेषु च गीयते'' इत्यादिबहुप्रमाणसिद्धः यद्यपि सर्वरक्षकत्वं परमात्मन एव युज्यते, अथापि अस्य रक्षकत्वस्य पूर्तिः लक्ष्मी विशिष्टस्यैव भवितुमर्हति इति पूर्वाचार्याः अभिप्रयन्ति। श्रीमन्तः पिळ्ळैलोकाचार्यपादाः मुमुक्षुप्पडिनाम्नि दिव्यरहस्यग्रन्थे ''रक्षणे लक्ष्मीसान्निध्यस्य आवश्यकत्वात्, प्रणवगते अस्मिन् अकारे श्रीसम्बन्धोऽपि अनुसंन्धेय'' इति सूत्रीचक्रुः। एतत् सूत्रं व्याकुर्वन्तो गुरवः श्रीमद्वरवरमुनीन्द्राः ''सर्वरक्षकोऽपि ईश्वरः चेतनानामपराधबाहुल्याद्वा, स्वस्य निरङ्कुशस्वातन्त्र्यवशाद्वा कदाचित् चेतनपराङ्मुखो भवेत्। तदा इयं जगन्माता विष्णुपत्नी लक्ष्मीः साधुवादैः तन्मः प्रसन्नं कृत्वा, चेतनविषये परुषकारं विधाय, भगवन्तं समाश्रितोन्मुखं करोति। अतः पुरुषकाररूपिण्याः अस्याः सन्निधिः अवश्यमपेक्षिता इति अकारे लक्ष्मीसम्बन्धोऽप्यनुसन्धेयः''- इति व्याचक्रुः।

प्रणवे विद्यमानस्य अकारस्य अष्टाक्षरीमन्त्रघटितनारायण पदस्य संग्रहरूपत्वात् नारायणपदे इव अकारेऽपि चतुर्थी (तादर्थ्यी) विभक्तिः आगता इति स्थानप्रमाणेन ज्ञायते। किन्तु अकारस्योपरि आगतायाः चतुर्थीविभक्तेः ''सुपां सुलुक्'' इति सूत्रेण लोपात् ''अ'' इत्येव रूपं शिष्यते। इयं चतुथीविभक्तिः ''सर्वे जीवात्मनः भगवतः शेषभूताः'' इत्यर्थं व्यञ्जयति। एतत् चेतनशेषत्वं ''यस्यास्मि न तमन्तरेमि'' इत्यादि श्रुतिप्रमाणसिद्धं हि। अत्र प्रतिपाद्यमानं जीवशेषत्वं दिव्यदम्पत्योः शेषित्वसूचकमिति अर्थात् अवगम्यते। कथमिति चेत्, लोके कस्यचित् गृहिणः शेषभूताः दासदासीजनाः सर्वेऽपि न केवलं तस्य सेवां कुर्वन्ति, तत्पत्न्या अपि। अयमंशः पतिपत्नीन्ययेन लोके प्रसिद्ध एव। ''जयापत्योरविभागः'' इति आपस्तम्बीयधर्मसूत्रमपि एनमर्थमुपबृंहयति। ''अस्येशाना जगतो विष्णुपत्नी'' इत्येतत् श्रुतिवचनं लक्ष्म्याः सर्वलोकेश्वरीत्वं, विष्णुपत्नीत्वंच बोधयति। अतः एतत् विष्णुपत्नीत्वनिबन्धनं लक्ष्म्याः शेषित्वं श्रुतिप्रमाणसिद्धम्। परमार्थविदो दिव्यसूरयोऽपि अमुमर्थं ''तिरुमाले! नान् उनक्कु पळवडियेन्'' (हे लक्ष्मीनाथ! निसर्गतया अहं तव दासभूतोऽस्मि) इत्यादिभिः सूक्तिभिः अनुसन्धधुः।

यः सर्वजगत्कारणम्, सर्वजगद्रक्षको भवति स एव ध्येयः, समाश्रयणीयश्च। ''कारणन्तु ध्येय'' इति खलु वैदिकी सूक्तिः। ''यो ब्रह्माणं विदधाति पूर्वं यो वै वेदांश्च प्रहिणोति तस्मै, तं ह देवमात्मबुद्धिप्रसादं मुमुक्षुर्वै शरणमहं प्रपद्ये'' इति वेदपुरुषोऽपि तथैव उपदिशति। एवं सर्वशरण्यत्वेन उपदिश्यमानो देवः लक्ष्मीसहितो नारायण एवेति पूर्वोदाहृतं ''यो ब्रह्माणम्'' इत्यादि श्रतिवचनं व्यनक्ति। ''श्रद्धया देवो देवत्वमश्नुते'' इत्यन्येन त्रयीवाक्येनापि श्रद्धास्वरूपिण्या श्रिया सहितो नारायण एव सर्वशरण्य इत्यर्थः स्फुरति। अमुमर्थं दिव्यसूरिसूक्तिष्वपि द्रष्टुं शक्यते इति पूर्वमेवोक्तम्।

एतानि दिव्यदम्पत्योः कारणत्व - रक्षकत्व-शेषित्व-शरण्यत्वानि तयोः उपायोपोयत्वव्यञ्जकानि। अस्मिन् विषये वादिकेसरिणः सुन्दरजामातृमुनयः तत्वदीपाख्ये ग्रन्थे एवमूचुः – ''तत्र रक्षकत्वमेवोपायत्वम्। तस्य रक्षणविशेषभूतार्थि तार्थकरणरूपत्वात्। कारणत्वं च आश्रयाणार्थकरणकलेवरप्रदा नादि-रूच्युत्पादनज्ञानवैराग्य-भक्ति-परभक्ति-परज्ञान-पारमभक्तिजनन-स्वरूपाविर्भावपूर्वकनिरतिशयानन्दोद्भावयितृ

त्वपर्यन्त स्वभाव सूचनेन उपायत्वोपयुक्तम्। ''कारणन्तु ध्येयः'', ''यो ब्रह्माणं विदधाति'' इत्यादिषु वाक्येषु कारणभूत एव आश्रयणीय इत्युच्ते। शेषित्वं च किञ्चित्कार प्रतिसम्बन्धिरूपत्वात् उपेयत्वमेव।.... श्रियःपतित्वं च शेषिणः सर्वप्रकारातिशयद्योतकत्वात् उपेयत्वं पूरयति। एवं सति, उपायोपेयत्वं हेयप्रत्यनीक कल्याणैकतानत्वयुक्तस्य शेषिणः श्रियःपतेः स्वरूपतया एव प्रतिपादितं भवति''। अयमे वसिद्धान्तः द्वयमन्त्रस्य पूर्ववाक्ये, उत्तरावाक्ये च विद्यमानेन श्रीमत्पदेन स्पष्टीकृतः। किन्तु श्रियः उपायावस्थायां पुरुषकारात्मकत्वेन अन्वयः, उपेयदशायान्तु कैङ्कर्यप्रति सम्बन्धित्वेनेति अवगन्तव्यम्। इत्थं प्रणवघटितेन अकारेण प्रतिपादितानंशान् मनसि निधायैव अष्टश्लोकीव्याख्यातारः श्रीमन्तः अम्पन् श्रीनिवासार्चायाःएवमूचुः - ''सर्वकारणभूतस्य, सर्वरक्षकस्य, सर्वशेषिणः, अकारवाच्यस्य भगवतः स्वरूपम् लक्ष्मीसम्बन्धं पुरस्कृत्यैव निरूपणीयमिति हेतोः, अकारे प्रतिपाद्यमानस्य भगवतः रक्षकत्वनिरुपणे, त्तपूर्तौ च अस्याः पुरुषकार रूपिण्याः सान्निध्यमपेक्षित मिति, प्रणवे विद्यमाने अकारे लुप्ताया तादर्थ्यचतुर्थीविभक्त्या बोध्यमानस्य जीवात्मनः शेषत्वस्य प्रतिसम्बन्धि मिथुनमेव भवतीति अवगम्यते। एवं, ''पिता च रक्षकः शेषी'' इत्यादि सूक्तिदिशा प्रणवघटितेन अकारेणोच्यमानेषु भगवतःकारणत्व-रक्षकत्व-शेषित्वेषु, तथा तैः व्यज्यमाने शरण्यत्वेच सर्वत्र लक्ष्मीसन्बन्धः अर्थवशादुक्तः इति अवगन्तव्यम्''।

## उकारे लक्ष्मीवैभवम्

प्रणवे विद्यमाने उकारे स्थितं लक्ष्मीवैभवं शब्दत एव सिध्यति। ''अकारः चित्स्वरूपस्य विष्णोः वाचक इष्यते, उकारः चित्स्वरूपायाः श्रियो वाचि तथा विदुः, मकारस्तु तयोर्दस इति प्रणवलक्षणम्'' इति, ''अकारेणोच्यते विष्णुः सर्वलोकेश्वरो हरिः, उद्धृता विष्णुना लक्ष्मीः उकारेणोच्यते सदा, मकारस्तु तयो र्विप्र! श्रीनारायणयोस्सदा, आत्मनः शेषभूतस्य वाचकः श्रुतिचोदितः'' इत्यादिकैश्च प्रमाणवचनैः अकारो विष्णुवाचकः, उकारो लक्ष्मीवाचकः, मकारस्तयोः दिव्यदम्पत्योः दासभूतं जीवं बोधयति इति अवगम्यते। अस्मिन् अन्वये ''अश्च उश्च ऊ, वोः दिव्यदम्पत्योः मकारवच्यो जीवः शेषभूतः'' इति विवरणं ग्राह्यम्।

एनमर्थम् इतिहासरत्नं श्रीरामायणमपि उपबृंहयति इति पूर्वाचार्येषु अन्यतमाः ''सोमाशियाण्डान्'' नामधेयाः प्रोचुः। श्रीरामस्य सीतालक्ष्मणाभ्यां सह दण्डकारणप्रवेशं कृतमिति वदन् वाल्मीकिभगवान्'' अग्रतः प्रययौ रामः सीतामध्ये सुमध्यमा, पृष्ठतस्तु धनुष्पाणिः लक्ष्मणोऽनुजगाम ह'' इति श्लोकं रचयामास। अमुं श्लोकं व्यकुर्वाणाः पूर्वाचार्याः श्रीकृष्णसूरिवराः ''अनेन श्लोकेन प्रणवार्थः प्रकाशितः इति सम्प्रदायः। तत्र-अग्रत इति अर्वणप्राथमिकत्वम्,...... सुमध्यमेति प्रणवद्वितीयवर्णश्च, मद्य इति तस्य वर्णद्वयमध्यवर्तित्वम्, सीतामध्ये इति लक्ष्म्याः पुरुषकारत्वम् ....'' इत्यादिवचनैः एतद्विषयं सुस्पष्टमूचुः। अतः प्रणवे स्थितः उकारः पुरुषकाररूपिण्याः लक्ष्म्याः वाचक इति इतिहाससूक्तिसिद्धमपि।

## मकारे लक्ष्मीवैभवम्

लक्ष्मीः जोवकोट्यामान्तर्भवति इति भगवद्रामानु जसिद्धान्तः। प्रणवघटितस्य मकारस्य जीववाचकत्वात्, तेन मकारेण जीवभूता लक्ष्मीरपि निर्दिश्यते। एवं जीववाचकस्य मकारस्य लक्ष्मीवाचकत्वानुसन्धानेन को वा विशेषः स्फुरति? इति चेत्, इयं श्रीः ''नित्यैवैषा जगन्माता'' इत्यादि विष्णुपुराणसूक्त्यनुरोधेन सर्वेषां जीवात्मनां माता भवति इति हेतोः, तस्याः मातृत्वरूपसम्बन्धं पुरुस्कृत्य स्वसन्ततिभूतान् स्वेतरान् जीवान् पुरुषकारं कृत्वा अवति इत्यर्थः पर्यवस्यति इति पूर्वाचार्याः वदन्ति। अस्मिन् अन्वये प्रणवमध्यगतस्य उकारस्य अवधारणार्थत्कवं उकारस्य अवधारणार्थकत्वमं ''तदेव भूतं तदु भव्यमा इदम्'' इत्यादि श्रुतिवाक्यसिद्धम्। एवं प्रणवे विद्यमानाः अकार-उकार-मकाराः सर्वेऽपि लक्ष्म्याः वैभवं सम्यक् बोधदयन्तीति साधीयानर्थः। ईदृशं वैभवं भगवतो वा जीवात्मनो वा न दृश्यते इति किमु वक्तव्यम्?- इति शम्।

**अकारोकारमकारैः प्रणवे या प्रगीयते।**
**सेयं रक्षतु मां पद्मा लक्ष्मीः कारुण्यरूपिणी।।**

# श्रीवेङ्कटेश्वरमानसपूजा

- श्री दोर्बल प्रभाकरशर्मा

आचार्यः श्रीश्रीश्रीमच्छङ्करभगवत्पूज्यपादाः श्रीदेव्या विषये चतुष्षष्ट्युपचारयुतां मानसपूजां काव्यलक्षणशोभितां रसमयीं विधाय भक्तानां हृदयेषु देवीभक्तिं व्यवर्धयन्। कदाचित् देवीमानसपूजायास्तस्या अर्थं विवृण्वता लिखता मया चिन्तितं यत् श्रीभगवतः शेषाद्रिशेखरस्य श्रीनिवासस्याऽपि विषये, एवमेव मानसपूजा लेखनीया कवितामयीति काऽपि कल्पना मनसि जाता। सद्यः केचन श्लोकाः मुखान्निर्गता एव। अनुपदमेव द्विसप्तत्युपचारमयी काऽपि मानसपूजारूपा स्तुतिकविता आविर्भूता। साऽत्र ''सप्तगिरौ'' सप्तगिरीशितुः पादपद्मयोः समर्प्यते, प्रकाश्यते चार्थव्याख्यान पुरस्सरम्।

**उषसि मङ्गलवाद्यविशेषकैः (र्)**
**जनशुभोदयलोकहितस्वनैः।**
**''रमण'' ''वेङ्कटनाथ'' सुघोषणैः(र्)**
**झटिति जागृहि सप्तगिरीश्वर।।**

हे सप्तगिरिनिवास प्रभो! श्रीनिवास! सूर्योदयात् पूर्वमेव उषःकाले तव जागरणसेवा सुप्रभातसेवा प्रथमं कल्पिता। अस्यां सेवायां केचन भक्ताः भवतः जागरणाय मङ्गलवाद्यानि वादयन्ति। तत्र केचन तूर्याणि वादयन्ति। केचन मर्दलानि वादयन्ति। केचन तालान् वादयन्ति। केचन श्रुतिसहकारं कुर्वन्ति।

केचन तु भवतः सुप्रभातम् अभिगायन्ति। सौम्यजा मातृमुनिना 'शेषाद्रिशेखरविभो तव सुप्रभातम्, श्रीवेङ्कटाचलपते तव सुप्रभातम्' इति सुप्रभातस्तोत्रं विरचितम्। प्रतिदिनम् अर्चकाः भक्ताः गायकाः भवतः सुप्रभातसेवायाम् एतत् स्तोत्रं पठन्ति। आरात्रि जागरणं कृत्वा स्नात्वा शुद्धवस्त्राणि धृत्वा अलङ्कृत्य सन्ध्याम् उपास्य सप्तगिरिवास! वेङ्कटरमण! श्रीनिवास! गोविन्द! गोविन्द! इति जयघोषणानि आर्तिघोषणानि कुर्वन्तः भक्तजनाः अपि भवतः सुप्रभातसेवायां भागं गृह्णन्ति। अतः प्रभो वेङ्कटेश्वर! शुभे अस्मिन् सूर्योदयपूर्ववेलासमये जागरणं प्राप्नुहि। प्रभो! एवं वयं स्वस्वगृहेष्वपि भवतः सुप्रभातजागरणसेवां कल्पयामः।

जागरणानन्तरं भगवतः प्रबोधसेवा। जागरणकाले भगवान् भक्तानां वचनानि शृणोति। प्रबोधसमये तु भगवान् नेत्रे उन्मीलयतीति विशेषः। अतः जागरणसेवानन्तरं प्रबोधसेवा।

**विपञ्चीषु तन्त्रीस्वनैः सुप्रभातैः(र्)**
**मुखोद्गीर्णगोविन्दगोविन्दनादैः ।**
**श्रुतिस्मृत्युदारस्वरश्लोक्यमन्त्रैः**
**समुत्तिष्ठ शीघ्रं प्रभो! वेङ्कटेश! ।।**

हे प्रभो! वेङ्कटेश्वर! तव प्रबोधनार्थं केचन वीणावादनं कुर्वन्ति। तासां वीणानां तन्त्रीणां स्वराः अत्यन्तं मनोहराः। केचन सुप्रभातस्तोत्रं पठन्ति। केषाञ्चन भक्तानां मुखेभ्यः ''गोविन्द गोविन्द'' नामानि निर्यान्ति। भक्तिपूर्णाः तेषां नाम्नां नादाः श्रवणसुभगाः। केचन वेदशास्त्रसाहित्यकाव्यपण्डिताः भवतः प्रबोधनाय वेदमन्त्रान् धर्मशास्त्रबद्धान् अंशान् श्रावयन्ति। केचन भक्तास्तु उदारोच्चश्राव्यस्वरैस्तवनीयान् मन्त्रान् श्लोकांश्च पठन्ति। सर्वमेतत् सुप्रभातकाले भक्ताः प्रबोधसेवायां कुर्वन्ति। अतः हे प्रभो! त्वम् उत्तिष्ठ। इत्येवं वयं गृहेष्वपि प्रबोधसेवायां भवतः सन्निधौ भागं गृह्णीमः।

भगवतः श्रीनिवासस्य प्रबोधानन्तरं स्वामी हरिः मञ्चतः उत्थाय भूमौ पादं कर्तुं निश्चिनोति। ततः पूर्वमेव वयं भगवतः पर्यङ्कावतरणाय पादपीठं परिकल्पयामः।

**त्वदीया प्रिया देव विश्वंभरेयं**
**क्षमा मातृसर्वंसहा रत्नगर्भा।**
**भगवत्पादपद्माश्रयः पादपीठी भवन्ती**
**स्वयं सेवितुं त्वामुपेता॥**

हे प्रभो! प्रकाशदानस्वभाव देव वेङ्कटेश! तव इयं त्वदीया प्रिया प्रीतिपात्रं विश्वं जगद्बिभ्रती विश्वम्भरा, इयं प्रत्यक्षा क्षमा सहनगुणशालिनी माता च सर्वं सहमाना च मातृसर्वंसहा, रत्नानि गर्भे यस्या सा रत्नगर्भा, भूदेवी भवतः पादपद्मयोः कमलसदृशपादयोः आधारभूता भवितुम् इच्छन्ती पादपीठं भवन्ती पादपीठरूपेण तिष्ठन्ती पादपीठावतारं दधती सा स्वयं सेवितुकामा त्वां प्राप्तवती। अतः एषा भूमिरेव तव पादपीठम् अभवत्।

इत्येवं भगवतः जागरणप्रबोधनानन्तरं पादपीठपरिकल्पनम् इति तृतीयः उपचारः। *(....अनुवर्तते।)*

# श्रीपद्मावतीदेव्याः आलयः
## तिरुचानूरु, तिरुपति

१. तिरुमलक्षेत्रस्य श्रीवेङ्कटेश्वरस्य वक्षस्थलविहारिणी महालक्ष्मीः तिरुचानूरु क्षेत्रे विराजते।

२. तिरुपतिनगरस्य आग्नेयदिशि ३ कि.मी. दूरे एतत् क्षेत्रं विद्यते।

३. शुकमहर्षिः पूर्वम् अत्र निवासमकरोत्। अतः श्रीशुकपुरमिति प्रसिद्धमिदं क्षेत्रं, तमिळभाषायां 'तिरुशुकनूरु' इति, कालक्रमे 'तिरुचानूरु' इति च व्यवहृतम् अभवत्।

४. आलयस्य प्रधानगोपुरस्य पुरतः विद्यमानः श्रीकृष्ण बलरामालयः अत्रत्य प्रधानदेवालयेषु अन्यतमः।

५. आलयस्य दक्षिणभागे पूर्वाभिमुखः सुन्दरराजदेवालयः विद्यते।

६. पद्मसरोवरस्य तटे विद्यमानः श्री सूर्यनारायणदेवालयः अस्य क्षेत्रस्य विशिष्टदेवालयः।

७. तिरुक्कुडवूरु - तिरुच्चोकिनूरु - अलर्मेल्मङ्गापुरम् - इत्यादि नामान्यासन्। इदानीमपि अलमेलुमङ्गापुरमिति नाम व्यवहारे वर्तते।



# తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి



## తిరుమలలో భక్తులు చేయవలసినవి

☑ తిరుమలకు బయలుదేరేముందు మీమీ ఇష్టదేవతలను పూజించండి.

☑ శ్రీవేంకటేశ్వరస్వామిని దర్శించే ముందు శ్రీవారిపుష్కరిణిలో స్నానంచేసి, శ్రీవరాహస్వామిని పూజించండి.

☑ ఆలయంలో పూర్తిగా నిశ్శబ్దాన్ని పాటిస్తూ "**ఓం శ్రీ వేంకటేశాయ నమః**" అని మీలో మీరు శ్రీవారిని స్మరించండి.

☑ ఆలయంలో ఉన్నపుడు స్వామివారిపైనే మీ ధ్యానం ఉంచండి.

☑ తిరుమల సమీపంలో ఉన్న ఆకాశగంగ, పాపవినాశనం తీర్థాలలో స్నానం చేయండి.

☑ తిరుమలలో ఉన్నపుడు మన సనాతనసంప్రదాయాలు, ఆచారవ్యవహారాలను విధిగా పాటించండి.

☑ మీ కానుకలు శ్రీవారి హుండీలోనే సమర్పించండి.

☑ తిరుమల పరిసరాలను శుభ్రంగా ఉంచండి. బయోడీగ్రేడబుల్ ప్లాస్టిక్‌కవర్లనుమాత్రమే వినియోగించండి.

## తిరుమలలో భక్తులు చేయకూడనివి

☒ విలువైనఆభరణాలు, ఎక్కువ డబ్బు మీవద్ద ఉంచుకోకండి.

☒ శ్రీవారిదర్శనంకోసం కాకుండా ఇతరఉద్దేశాలతో తిరుమలకు రాకండి.

☒ శ్రీవారిదర్శనంకోసం త్వరపడకండి. క్యూలో మీవంతు వచ్చేవరకు ఆగండి.

☒ ఆచారవ్యవహారాలప్రకారం ఆలయార్హత లేని సందర్భాలలో ఆలయంలోకి రాకండి.

☒ తిరుమలలో పువ్వులు అలంకరించుకోరాదు. తిరుమలగిరులలోని విరులన్నీ శ్రీవారి సేవకే.

☒ నీరు, విద్యుత్తు వృథా చేయకండి.

☒ అపరిచితులను వసతిగృహాలలోకి అనుమతించకండి, వారిని నమ్మిగది తాళాలు ఇవ్వకండి.

☒ బయోడీగ్రేడబుల్ ప్లాస్టిక్‌కవర్లను తప్ప ఇతరాలను వినియోగించకండి.

☒ నాలుగుమాడవీథుల్లో పాదరక్షలు ధరించకండి.

## తిరుమలలో భక్తులు నిషేధించదగినవి

⊘ తిరుమలలో ధూమపానం, మద్యపానం, మాంసాహారం మొదలైనవి పూర్తిగా నిషేధం.

⊘ శ్రీవారిదర్శనం, వసతికోసం దళారీలను ఆశ్రయించకండి.

⊘ వీథివర్తకులనుంచి నకిలీప్రసాదాలు కొనకండి.

⊘ ఆలయప్రాంగణంలో ఉమ్మివేయుటవంటి అసహ్యకరమైనపనులు చేయకండి.

⊘ అన్యమతప్రచారం నిషేధం.

⊘ వివిధరాజకీయసభలు, బ్యానర్లు, ధర్నాలు, రాస్తారోకోలు, హర్తాళ్‌లు మొదలైనవి తిరుమలలో నిషేధం.

⊘ తిరుమలలో పేకాట, జూదం వగైరాలు పూర్తిగా నిషేధం.

⊘ ఆలయంలోకి సెలఫోన్, కెమెరా వంటి పరికరాలను తీసుకువెళ్లకండి. ఆయుధాలను తీసుకురాకండి.

⊘ జంతువధ నిషేధం.

⊘ భిక్షకులను ప్రోత్సహించకండి.

కార్యనిర్వహణాధికారి

ఈ కూపను కత్తరించండి

తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి



# సప్తగిరి

(ఆధ్యాత్మిక మాసపత్రిక)

## చందా నమోదు పత్రం

1. పేరు మరియు చిరునామా : ______________________
   (విడి విడి అక్షరాలలో అర్థమయ్యేలా వ్రాయండి. మరియు పిన్‌కోడ్ తప్పక వ్రాయండి)
   ______________________
   ______________________
   ______________________
   ______________________
   (పిన్‌కోడ్ తప్పని సరి) ☐☐☐☐☐☐

2. కావలసిన భాష : ☐ తెలుగు ☐ తమిళం ☐ కన్నడం ☐ హిందీ ☐ ఇంగ్లీషు

3. సంవత్సర/జీవిత చందా : ☐ రూ. 60/- ☐ రూ. 500/-

4. చందా పునరుద్ధరణ :
   (అ) చందా నెంబరు :
   (ఆ) భాష :

5. చెల్లించిన మొత్తం :
   డి.డి.నెం. : తేది :
   (చెక్కులు స్వీకరించబడవు)

ప్రదేశం :

తేది : చందాదారుని సంతకం

## మోసపోకండి !

మన రాష్ట్రంలోని కొన్ని నగరాలలో కొందరు వ్యక్తులు అనధికారికంగా **సప్తగిరి మాసపత్రికకు** చందాల రూపంలో అధిక మొత్తాలు వసూలు చేస్తున్నారని, తద్వారా శ్రీవారి దర్శనం చేయిస్తా మని నమ్మిస్తున్నా రని తెలిసింది. అలాంటివారిమాటలకు మోసపోకండి. సప్తగిరి చందాకు, శ్రీవారి దర్శనానికి మరియు ప్రసాదాలకు ఎటువంటి సంబంధం లేదు. చందా మీరు నేరుగా "ప్రధాన సంపాదకుడు, సప్తగిరి, తి.తి.దేవస్థానం, తిరుపతి" వారికి పంపించాలి. (లేదా) తిరుపతిలోని శ్రీనివాసం యాత్రికుల వసతి సముదాయంలో కూడా మీచందాలను కట్టవచ్చు. సప్తగిరికి చందాలు వసూలుచేయుటకు దేవస్థానం బయటివ్యక్తులను ఎవరినీ నియమించలేదు.

**అధిక మొత్తాలు చెల్లించకండి!**
**వారి మాటలకు మోసపోకండి!!**

సంప్రదించండి...!
సప్తగిరి చందాల విచారణకు
0877 - 2264359
0877 - 2264543

- సప్తగిరి సంవత్సర చందా రూ.60/-, జీవితచందా రూ.500/-లు; డి.డి. / ఎం.ఓ. ని **'చీఫ్ ఎడిటర్, 'సప్తగిరి', తి.తి.దే., తిరుపతి'** వారిపేరున తీయాలి.
- సప్తగిరిచందాదారులుగా చేరదలచుకొన్నవారు/ తమచందాను పునరుద్ధరించుకోదలచినవారు ఈ కూపనులో గానీ లేక తెల్లకాగితంలోగానీ పైన పేర్కొన్నవిధంగా వివరాలు వ్రాసి, పంపవచ్చు. క్రింద ప్రచురించిన చిరునామానుమాత్రమే సంప్రదించండి. **తి.తి.దే. ప్రధాన సంపాదక కార్యాలయం, తిరుపతికి తప్ప-మీరు ఎవరిదగ్గర డబ్బులు కట్టి, మోసపోకండి.**
- మనిఆర్డరు పంపేవారు అందులోనే మీయొక్క చందావివరాలు వ్రాసి, ఈ క్రిందిచిరునామాకు పంపాలి.
- మా చిరునామా **"ప్రధానసంపాదకుడు, సప్తగిరి కార్యాలయం, టి.టి.డి.ప్రెస్ కాంపౌండ్, కె.టి.రోడ్డు, తిరుపతి - 517 507".**

Edited and published on behalf of T.T. Devasthanams by **Dr. C. Saila Kumar,** M.A.,Ph.D., Chief Editor, T.T.D. and printed at T.T.D. Press by **T.Ravi,** (i/c Manager), P.R.O., T.T.D. Press, Tirupati - 517 507.

## మీ మాట

### పరమోత్సాహం

ప్రతినెలా మాకు ఆ దివ్యమంగళస్వరూపుని దర్శనభాగ్యం కల్గిస్తున్న మీకు వేలవేలకృతజ్ఞతాభి వందనాలు. అభినందనాలు.

సప్తగిరి పత్రికను చూస్తుంటే కలియుగదైవం ప్రతినెలా సాక్షాత్కరిస్తున్నంత ఆనందం కలుగుతోంది.

చదువుతుంటే మనసుకి పరమోత్సాహంగా ఉంటోంది. జన్మసాఫల్యత చెందుతోంది.

*– ఎ.పురుషోత్తం రెడ్డి, నడింపల్లి.*

### కల్పవృక్షం

సప్తగిరి ఆధ్యాత్మికమాసపత్రికలో మీరు ప్రచురిస్తున్న ఎన్నో అమూల్యమైన వ్యాసాలు, మాకు తెలియని ఎన్నో విషయాలను తెలియజేస్తున్నాయి. సప్తగిరి మా ఇంటిల్లి పాలిటి కల్పవృక్షం లాంటిది. ప్రతినెలా సప్తగిరి చదవడం ఒక అందమైన అనుభూతి. సప్తగిరి మాకు ఎంతో జ్ఞానాన్ని అందిస్తోంది. అందరికీ అందుబాటు ధరలో అతితక్కువ ధరకే అందిస్తున్నందుకు నా ధన్యవాదాలు.

*– రెడ్డిశేఖర్, కలకడ.*

### తనివి తీరదు

ప్రతినెలా సప్తగిరి మాసపత్రికవల్ల మాకు తెలీని ఎన్నో విషయాలు మాకు తెలిశాయి. తిరుమలలో జరిగే విషయాలను వార్తాలహరిలో చాలా విపులంగా అందిస్తున్నారు. సప్తగిరి పత్రిక ఎన్నిసార్లు చదివినా తనివి తీరదు.

*– రాజీవరంజని, చంద్రగిరి*

### పులకించాం

అక్టోబరు సంచిక మమ్మల్ని విశేషంగా అలరించింది. ముఖ్యంగా గరుడోత్సవం, పల్లవరాణి సామవై శాసనం, నవరాత్రులు–విజయదశమి, సా మాం పాతు సరస్వతీ, బొమ్మలకొలువు వంటి వ్యాసాలు చదివి మేమెంతగానో పులకించాం. మేము ఆధ్యాత్మికంగా ఎదగడానికి సప్తగిరి పత్రిక ఎంతో ఉపయోగపడుతుంది.

*– అమ్మినేని వేణు, బెంగళూరు*

### మా అదృష్టం

ప్రతినెలా సప్తగిరిపత్రిక సకాలంలో మాకు అందుతున్నది. స్వామివారిపత్రిక మా ముంగిట్లో వాలితే స్వామివారిదర్శనము మాకు కలిగినట్లే అని మేము భావిస్తాం. అది మా అదృష్టంకూడా. మాకు సప్తగిరి మాసపత్రిక పరమపవిత్రమైన గ్రంథము. మా దగ్గర ఎన్నోసంవత్సరాలనుండి సప్తగిరి పత్రికలు అతిభద్రంగా జాగ్రత్త చేయబడి ఉన్నాయి.

*– పి.ప్రభాకర్, ఏలూరు.*

### మధురాతి మధురం

సప్తగిరి మాసపత్రిక జనరంజకం, మనోరంజకం. ప్రతిపేజీ ఎంతో మధురాతిమధురం. పత్రికలో ధారావాహికలు, ప్రత్యేకవ్యాసాలు చాలా బాగుంటున్నాయి. 'సందేహాలు–సమాధానాలు' మాకు ఎన్నో విషయాలు తెల్సుకొనే అవకాశాన్ని ఇస్తున్నాయి.

*– ఎం.విజయలక్ష్మి, విశాఖపట్నం.*

### ధన్యవాదాలు

ప్రతినెలా సప్తగిరి మాసపత్రికలో వస్తున్న సంపాదకీయాలు పత్రికకే ఆయువు పట్టులాంటివి. మమ్మల్ని ఎంతో ఆలోచింపచేస్తున్నాయి. ప్రధానసంపాదకులకు ధన్యవాదాలు.

*– కె.లక్ష్మీరెడ్డి, అనంతపురం.*

### 2014, జనవరి నెలలో తి.తి.దే. ఉత్సవ విశేషాలు

**11** – వైకుంఠ ఏకాదశి

**14** – భోగిపండుగ

**15** – మకరసంక్రాంతి

**16** – కనుమపండుగ

**26** – గణతంత్రదినోత్సవము

వేంకటాద్రిసమం స్థానం బ్రహ్మాండే నాస్తి కించన,
వేంకటేశసమో దేవో న భూతో న భవిష్యతి.



రాబడికి లోబడి బ్రతికేవారు
సుఖసంతోషాలతో ఉంటారు

గౌరవ సంపాదకుడు :
ఎం.జి.గోపాల్, ఐ.ఏ.ఎస్.,
కార్యనిర్వహణాధికారి, తి.తి.దేవస్థానములు.

ప్రచురణకర్త-ప్రధాన సంపాదకుడు :
డా॥ సి.శైలకుమార్

సంపాదకుడు : డా॥ కె.రాధారమణ

ఉపసంపాదకుడు : డా॥ కె.రవిచంద్రన్

ముద్రాపకుడు : టి.రవి, (ఇన్‌ఛార్జి మేనేజరు) పౌరసంబంధాధికారి, తి.తి.దే.

డి.టి.పి. : ప్రధాన సంపాదకులవారి కార్యాలయం, తి.తి.దే., తిరుపతి

వర్ణచిత్రాల లే-అవుట్ : పి.శివప్రసాద్

***వివరాలకు :***
ప్రధాన సంపాదకుడు,
సప్తగిరి, తి.తి.దేవస్థానములు,
తిరుపతి - 517 507.
ఫోను : 0877-2264543, 2264359

సప్తగిరి మాస పత్రిక

విడి ప్రతి : రూ. 5/-
సం॥ చందా : రూ. 60/-
జీవిత చందా : రూ.500/-
విదేశాలకు సం॥చందా : రూ. 850/-

# సప్తగిరి

**తిరుమల తిరుపతి దేవస్థానముల సచిత్ర మాసపత్రిక**

**సంపుటి : 44 డిసెంబరు, 2013 సంచిక : 07**



**ముఖచిత్రం : శ్రీ పద్మావతీ అమ్మవారు, తిరుచానూరు**
**చివరి పుట : 'తేనె' అభిషేకంలో శ్రీపద్మావతీఅమ్మవారు, తిరుచానూరు**

# సంపాదకీయం

## కాలం భగవత్స్వరూపం

సర్వమూ కాలాధీనం. కాలానికి రూపంలేకున్నా అనంతశక్తిసామర్థ్యాలూ మహాగుణ సంపద కలిగిన మహోన్నత భగవత్‌తత్త్వం– కాలం. అందుకే భగవద్గీతలో శ్రీకృష్ణపరమాత్ముడు 'కాలోఽస్మి', 'కాలఃకలయతాఽస్మి'– నేనే కాలస్వరూపుణ్ణి, దాన్ని నడిపించే వాణ్ణి నేనేనంటూ కాల స్వరూపాన్ని, కాలప్రభావాన్ని నిరూపించాడు. కాలానికి ఆద్యంతాలు లేవు. పరమాత్మ స్వరూపమూ అట్టిదే. ప్రతిజీవి ప్రతివస్తువూ కాలానికి లోబడే ఉంటాయి. భగవంతుని వ్యక్త రూపమే విశ్వం. కనుక కాలం వ్యక్తావ్యక్త రూపాలు రెండింటిపై తన ప్రభవాన్ని, ఆదిపత్యాన్ని చాటిచెప్తూ ఉంటుంది. అందుకే మనం ప్రతివిషయానికి 'కాలం బాగలేదు', 'కాలం కలిసొచ్చింది', 'అంతా కాలప్రభావం' అంటూ ప్రతివిషయంలో కాలాన్ని సాక్షీభూతంగానూ, కారణంగానూ పేర్కొంటుంటాం.

కాలం ఎన్నడూ తన పరిధులు దాటదు. కనుకనే ప్రకృతి ఆయా ఋతువుల్లో తన ధర్మాలు తు.చ. తప్పకుండా అనుసరిస్తూనే ఉంది. పంచభూతాలన్నీ కాలానుగుణంగానే ప్రవర్తి స్తాయి. మానవుల ప్రవర్తనలూ, మనస్తత్త్వాలూ ఒక్కొక్కమారు వికటించినపుడు కాలమే అందుకు సమాధానంగా ప్రతిక్రియలతో విజృంభిస్తుంది. సుఖశాంతులకు కాలాన్ని సద్వినియోగం చేసుకోవడం, తగిన ఆహారవిహార సంప్రదాయాలు పాటించడం, ప్రతిక్షణాన్ని, ప్రతికణాన్ని, భగవత్స్వరూపంగా భావించి జ్ఞానానికి, సుఖశాంతులకు వినియోగించినపుడు మనం కాలతత్త్వాన్ని చక్కగా గుర్తించిన వాళ్ల మౌతాం. అందుకే 'సంకల్పం'లో 'మహావిష్ణోః ఆజ్ఞయా ప్రవర్తమానస్య....' అంటూ కాలం భగవదాజ్ఞతో ప్రవర్తిస్తుందని స్మరించడం హైందవ సంప్రదాయం. కనుక కాలాన్ని ఒక దివ్యతత్త్వంగా, తదనుగుణంగా ప్రవర్తిస్తే మనిషి మనీషియై ఉత్తమ మానవుడుగా రాణిస్తాడు!

పురాణప్రవచనాలు, హరికథలు, ఆధ్యాత్మిక ఉపన్యాసాలు మొదలగు సద్విషయ సత్సం గాలు జరిగేచోట 'కాలక్షేపం' అంటారు. అంటే కాలాన్ని సత్కార్యాల్లో నిక్షేపించుట అని ఒక అర్థం, కాలశబ్దానికి మృత్యువనే అర్థం కూడా ఉంది కనుక అట్టి కాలుణ్ణి అణచడమూ అనే అర్థం కూడా ఉంది. అంచేత సద్విషయ కాలక్షేపం ఇహపరసుఖాలకు పెన్నిధి!

# గోదాదేవి

డా॥ కె. రెడ్డెప్ప

గోదాదేవి విల్లిపుత్తూరువాసి అయిన విష్ణుచిత్తునికి తులసీ వనంలో దైవదత్తంగా లభించింది. అత డామెను కన్నకూతురి కన్నా మిన్నగా భావించి, పెంచాడు.

మధురకు యాభైమైళ్ల దూరంలో శ్రీవిల్లిపుత్తూ రనే చిన్న నగర ముంది. పూర్వం విల్లి అనే రాజు పరిపాలించటంచేత దాని కాపేరు వచ్చింది. భూదేవిని హిరణ్యాక్షునిబారినుండి ఉద్ధరించిన వరాహస్వామి ఆ దేవికోరికపై వటపత్రశాయియై అక్కడ అవతరించా డని పెద్దలు చెబుతున్నారు. ఆ ఊరిప్రజలు ఆ స్వామిసేవే తమజీవితపరమావధిగా భావించేవారు. ఆ దేవ దేవుని కైంకర్యంలోనే తమజీవితాన్ని ధన్యం చేసుకొనేవారు. ఆ కోవలో మొదటగా చెప్పుకోదగ్గవ్యక్తి ముకుందార్యుడు. ఆయన ధర్మపత్ని పద్మావతి. ఆ దంపతులపుత్రుడే భట్టనాథుడు. అతడు ఎప్పుడూ విష్ణువునే తనచిత్తపద్మంలో నిలుపుకొని, స్మరి స్తుండేవాడు. అందుకే అతణ్ణి అందరూ విష్ణుచిత్తుడు అన్నారు. అప్పటికప్పుడు పూచినపూలను మాలగా కట్టి, స్వామికి సమర్పించి, అర్చించడం అతడు విధిగా పెట్టుకున్నాడు. పూలమాలలతోబాటు చక్కనికవిత్వంతో స్వామివారిగుణగణాలను, లీలలను కీర్తిస్తుండేవాడు. ఒకరోజు తనపూల తోటలో పాదులు సరిచేస్తుండగా ఒక తులసి చెట్టుమొదట ఒకపాప దొరికింది. ఆపాపను విష్ణుప్రసాదంగా భావించాడు. ఆ బిడ్డకు 'కోదై' అని పేరుపెట్టాడు. అరవంలో 'కోదై' అంటే పూలమాల అని అర్థం. అందాలబరిణ అయిన ఆ బాలిక విదియనాటిచంద్రునివలె దినదినాభి వృద్ధి చెందసాగింది.

కోదై భూదేవి అవతార మని విష్ణుచిత్తుడు కొద్దిరోజుల్లోనే గ్రహిం చాడు. అందువల్ల ఆబాలికకు 'గోదాదేవి' అని పేరు పెట్టాడు. గో అనగా భూదేవి అని అర్థం. ఆ బిడ్డ భూమిలో దొరకటంచేత భూదేవి ఇచ్చినబిడ్డ అని ఆ మాట కర్థం. భూదేవిఅంశతో అవతరించిం దని ప్రజ లామె నెంతో గౌరవంతో చూడసాగారు. తండ్రిలాగా కూతురుకూడా భక్తిజ్ఞానవైరాగ్యాదిసుగుణసంపదతో, వయసుతో బాటు వృద్ధి చెందసాగింది. విత్తు ఒకటి వేస్తే చెట్టు వేరొకటి మొలవనట్లు- ఆ తండ్రిసుగుణాలే ఆబిడ్డకూ అలవడినాయి. ఉదయమే తండ్రితో బాటు నిద్రలేవడం, నామ సంకీర్తనలో పాల్గొనడం, తండ్రి నిర్వ ర్తించే భాగవతతదీయారాధనకు తానుగూడా త్రికరణాలతో సహకరించడం ఆ బాలికకు నిత్యకృత్యా లయ్యాయి. తండ్రి భాగవతంనుంచి శ్రీకృష్ణ లీలలు వినిపిస్తుంటే ఆమె దానిలో లీనమయి తనను కూడా ఒక గోపికగా భావించి, పరవశించిపోతుండేది.



గోదాదేవి ప్రతిదినం వేకువ జామువనే నిద్రలేస్తుంది. మౌనవ్రతాన్ని పాటిస్తుంది. చెలులు బంగారుపల్లెంలో పసుపు మొదలగునవి- స్నానానికి అవ సరమైనవస్తువులూ, తడి తుడుచు కొనుటకు మంచివస్త్రాలూ తీసుకొని వస్తారు. ఆమె తోటలోని దిగుడు బావిలోనికి

దిగి, ద్రావిడవేదాన్ని పఠించి, స్నానం చేస్తుంది. శరీరానికంతటికి పసుపు రాసుకుంటుంది. నీరెండలో తలవెంట్రుకలను ఆరబెట్టు కుంటుంది. అటుపిమ్మట శుచిగా శ్రీరంగేశుణ్ణి దర్శించు కుంటుంది. తండ్రిలాగా భక్తిగీతాలు పాడుతుంది. కూతురిభక్తి ప్రపత్తులకు విష్ణుచిత్తుడుకూడా ముగ్ధ దయ్యాడు.

పరువం, తెలివి, అందం అనే ఈమూడూ హెచ్చు తగ్గులు లేకుండా ఆమెలో పెరగసాగాయి. వీటితో బాటు శ్రీరంగే శునివైపు ఆమెమనసు పరుగులు తీయసాగింది. ఐహిక విషయాలపట్ల గోదాదేవికి విముఖత ఏర్పడింది. శ్రీరంగేశుని ప్రేమను ఎప్పుడు చూరగొనగలనా అని అహర్నిశలు తహతహ లాడసాగేది. ఒకసారి ఆమె విలువైనవస్త్రాలు ధరించి, ఒంటి నిండా నగలు పెట్టుకొని, మంచిపూలతో సింగారం చేసుకొని, శ్రీకృష్ణునిఅందానికి నేను తగుదునా! తగనా! అని నిలువు టద్దంలో తనఅందం చూచుకునేది. ఎన్నో విధాల పరితపించిన పిమ్మట తాను 'త్రిజగత్పతికి తగినపతినే' అని గట్టిగా నిర్ణ యించుకుంటుంది. ఆనాటినుండి ఆమెకు కృష్ణునిపై మరింత ప్రేమ ఇనుమడించింది. ఆజగదేకసుందరునిప్రక్కన చేరితే ఎలా ఉంటుందోగదా! తనతండ్రి సమర్పించేమాలలు తానుకూడా సిగలో తురుము కోవచ్చుగదా! తన కంఠంలో ధరింపవచ్చు గదా! కానీ, అంతఅదృష్టం నా కీ జన్మలో ఉందో లేదో గదా! అంటూ గోదాదేవి మథనపడేది. తనతండ్రి సిద్ధం చేసినమాల లను ముందుగా తానే ధరించేది. ఆ విషయం ఆమెతండ్రికి తెలియదు. ప్రతిదినం పూలమాలలు ధరించి, నిలువుటద్దంలో తనసౌందర్యాన్ని తిలకించి, తన ప్రియునికి తాను తగిన దాన్నే నని నిర్ధారించుకొనేది. తరువాత గుట్టుచప్పుడు కాకుండా పూలదండలు సజ్జలో ఉంచి, ఏమీ తెలియని దానివలె ఉండడం ఆమెకు నిత్యకృత్యమయింది.

ఒకరోజు గోదాదేవి పూలమాలలు ధరించి, నిలువు టద్దంలో చూచుకుంటుండగా తండ్రి చూశాడు. తనకూతురు చేసినపనికి నిశ్చేష్టు దయ్యాడు. ఆ అమ్మాయిని నానాభీవాట్లతో నిందించాడు. జరగరాని ఘోరం జరిగిపోయినట్లు బాధపడ్డాడు. సాక్షాత్తు వటపత్రశాయి అయినశ్రీరంగేశునికి సమర్పించుటకు సిద్ధంచేసినపూలమాలలు కూతురు ధరించడంవల్ల పెద్దఅపచారం జరిగినట్లు భావించాడు. ఈచెడ్డపని చేయడానికి ధైర్య మెలా వచ్చిం దని కూతుర్ని నిలదీశాడు. అప్పుడు తండ్రితో స్వామి ఇలా అన్నారు – "ఓ విష్ణుచిత్తుడా! నీకూతురు మాకు అపచారం చేసిం దని భావించడం నీ అవివేకం. కేవలం నీ ఇంట్లో పెరిగిం దని ఆమె సామాన్యమానవకాంత అని నీవు తలస్తున్న ట్లుంది. అది నీభ్రమ. ఆమె సాక్షాత్తు భూదేవిఅవతారం. తాను ధరించిన పూలమాలలను, స్వయంగా కవితకట్టినపద్యమాల లను నాకు సమర్పించడానికే ఆమె భూమిమీద అవతరించింది. కనుక ఆమె ధరించినమాలలే నాకు సువాసన, సొగసు నిన్నటివరకు ఇచ్చాయి. నేడు నీవు తెచ్చినవి ఆమెసిగలో తురుము కోనివి, కంఠంలో ధరించనివి. అందువల్ల, సుగంధ రహితాలై నిస్తేజంగా ఉన్నాయి. ఇప్పటికైనా ఆమెగొప్పతనం గ్రహించి, పూర్వంలాగా ఆమె ధరించిన తరువాతనే నాకు

మాలలు తెచ్చి ధరింపజేస్తూండు" అని హితవు పలికి అంతర్ధాన మయ్యాడు. స్వామివారిమాటలు విన్నాక విష్ణుచిత్తునికి కనువిప్పు కలిగింది. వెంటనే బిడ్డను సమీపించి "తల్లీ! నీవు కేవలం ఆండా ళువే" అంటూ ఆనందబాష్పాలు రాల్చాడు. ఆండాళ్ అనగా కాపాడునది అని అర్థం. తననూ, తనకుటుంబాన్నీ తరింప జేయటానికి ఆ బాలిక తనఇంట పుట్టిం దని భావించాడు.

కొన్నాళ్లకు ఆండాళ్ విరహాన్ని గుర్తించాడు- విష్ణు చిత్తుడు. హరిసంయోగానికై తనబిడ్డ పడేపాట్లను విరాగియైన తండ్రి హృదయాన్నిగూడా కదిలించాయి. ఆ బాలిక కార్యసిద్ధి సాఫల్యతకోసం ఇలా ఉపాయాన్ని బోధించాడు. "అమ్మా! నీ వలెనే పూర్వం గోపికలుకూడా శ్రీకృష్ణుణ్ణి చేరడానికి కొన్ని ఉపా యాలు చేశారు. కాని అవి ఏవీ ఫలించలేదు. చివరికి వారు ధనుర్మాసంలో గౌరీదేవినిగురించి నెలదినాలపాటు **కాత్యాయనీ వ్రతం** చేశారు. దాన్ని నీవుకూడా ఆచరిస్తే నీకోరిక తప్పక నెరవేరుతుంది" అన్నాడు. తండ్రిఉపదేశంప్రకారం ఆ బాలిక ఉషఃకాలంలో లేచి, కావేరినదిలో స్నాన మాచరించి, భగ వంతుణ్ణి సేవించి, ఒంటిపూట ఆహారం తీసికొని, కటికనేలపై శయ నించింది. దినాని కొకటి చొప్పున ముప్పైపాటలు పాడింది. వాటిల్నే **తిరుప్పావు** అంటారు. తిరుప్పావై అనగా 'శ్రీవ్రతము' అని అర్థం. ఈకావ్యాన్ని పఠిస్తూ విష్ణువును అర్చిస్తే కోరికలు నెరవేరుతా యని భక్తుల విశ్వాసం. ఆమెభక్తికి మెచ్చిన శ్రీరంగేశుడు కలలో కనిపించి ఇలా అన్నాడు- "ప్రియా! నీ తపస్సుకు, హృదయపరిపక్వతకు మెచ్చాను. నిన్ను తప్పక పెళ్లాడ తాను. కనుక నీ తపోనియమాలు వీడి, నేడు సర్వభోగాలు అనుభవించు" అని పలికి అంతర్ధాన మయ్యాడు. ఆమె సర్వభోగా లను అనుభవించినఆరోజుకు 'భోగి' అని పేరువచ్చింది. అటు తరువాత రంగనాథునిఆజ్ఞప్రకారం ఆలయాధికారులు మంగళ వాద్యాలతో ఛత్రచామరాదులతో విష్ణుచిత్తునిఇంటికెళ్లి 'రంగ నాథుడు మీకుతుర్ని శ్రీరంగంలో వివాహం చేసుకొంటా ననీ, మిమ్మందరను తోడితె మ్మనీ మమ్ము పంపా డనీ" చెప్పారు. వారిమాటలు విన్నతండ్రీకూతుళ్ల ఆనందానికి అవధులు లేకుండాపోయాయి. సుముహూర్తంలో రంగనాథుడు గోదాదేవిని పాణిగ్రహణం చేశాడు.

శ్రీరంగేశునిఅర్ధాంగలక్ష్మి అయిన ఆండాళ్‌దేవి శేష తల్పాన శయనించినమూలవిరాట్టును చేరి, సేవించడానికి చాలా కుతూహలపడింది. శ్రీరంగేశునివిమానానికి ప్రదక్షిణం చేసి, శేషశయ్యను సమీపించింది. శ్రీరంగనాథునిఅద్వితీయ సౌందర్యలావణ్యాలను మనసార అనుభవించిన ఆసాధ్వీమణి శేషశయ్యను ఆరోహించి, ఆదేవదేవునిపాదమూలానికి చేరు కొన్నది. తన బిడ్డను తలచుకొంటూ విష్ణుచిత్తుడు దుఃఖించాడు. అతణ్ణి శ్రీరంగేశుడు ఊరడించాడు. అటు తరువాత ఆమెకు తన సన్నిధిలో ఒకఆలయం కట్టించి, నిత్యోత్సవాదులతో ఆమె అర్చనకు ఏర్పాటుచేశాడు. ఆనాటినుండి ప్రతివిష్ణు ఆలయం లోనూ గోదాదేవినికూడా అర్చించడం ఆచారమయ్యింది.



## శ్రీ వేంకటేశ్వర స్తుతిరత్నమాల

ఉ॥ పల్లవరాణి! విశ్వగురుభామిని! యిట్టి ప్రపంచ మంతకున్
దల్లి! సమస్తజీవులనిదానమ! శ్రీయలమేలుమంగ! నీ
చల్లనిచూపు చిల్కి వెదలచల్లఁగఁ బుణ్యులమైతి మంద్రు భూ
మెల్లను నీ వధూమణి ననేకవిధంబుల వేంకటేశ్వరా!

*(శ్రీవేంకటేశ్వరశతకము- తాళ్లపాకఅన్నమాచార్యుడు)*

# ఆలయాలకు వెళ్దాం..

డా॥ అప్పజోడు వేంకటసుబ్బయ్య

ఈ నేలమీద మానవకృతనిర్మాణాల్లో వాస్తుశాస్త్రనిబద్ధత, శిల్పకళావైభవం, సౌందర్యశోభ, ఆధ్యాత్మికవాతావరణం రాశీభూతమైన ఒకరమణీయమహాద్భుతనిర్మాణం – మనదేవాలయం. అందుకే భారతీయసంస్కృతిలో దేవాలయానికి అంత ప్రాధాన్యం! ఆకాశాన్ని తాకుతున్న ట్లుండే ఆలయధ్వజస్తంభం ఉన్నతోన్నతదృష్టి నిస్తుంది. ఆలయాల్లో ఉదాత్తమనోహరంగా వినిపించే వేదనాదం విశ్వకల్యాణగీత మనిపిస్తుంది. సమలంకృతదేవతావిగ్రహాలశోభ, పూజావిధానాలవైభవం, వివిధోత్సవాలప్రాభవం నిర్గుణోపాసకుల దృష్టినేకాక, నిరీశ్వరవాదులదృష్టినికూడ ఆకర్షిస్తాయి. ఆలయాల్లో వెల్లివిరిసే ఆధ్యాత్మికతమానవజీవితపరమార్థసాధనకు మార్గ దర్శకంగా ఉంటుంది.

అందుకే దేవాలయాన్ని చూడగానే భారతీయుడి మేను పులకిస్తుంది. హృదయం భక్తిభావంతో పరవశిస్తుంది. శిరస్సువంగుతుంది. చేతులు నమస్కరిస్తాయి. ఎప్పుడూ కంచంచుట్టూ, మంచంచుట్టూ, ఇంటిచుట్టూ, ఈ నేలచుట్టూ తిరిగే అతనిమనస్సు– ఆలయాన్ని ఆలంబనంగా చేసుకొని, ఆకాశాన్ని దాటుకొని, ఆవలిదివ్యలోకాలకు ఎగబ్రాకుతుంది. అందులో కొందరిమనస్సు ఎగబ్రాకి ఎగబ్రాకి, అలోకంబైనపెంజీకటికి ఆవల ఏకాకృతిగ వెలిగేపరమాత్మలో లీనమౌతుంది. మోక్షాన్ని పొందుతుంది.



దేవాలయం మనిషికి పరిశుభ్రతను నేర్పింది. అన్నప్రసాదాలతో మనిషిఆకలిని తీర్చింది. కళావిన్యాసాలతో కనువిందు చేసింది. పామరులకు పురాణపాఠాలు చెప్పింది. హరికథలు వినిపించింది. అందరిచేత హరినామ సంకీర్తనం చేయించింది. మానసికఅశాంతులను తగ్గించింది. ఆత్మవిశ్వాసాలను పెంచింది. ధర్మమార్గాన్ని చూపింది. వివిధవర్గాలను ఒకత్రాటిమీదికి తెచ్చింది. పరస్పర సహకారభావస్ఫూర్తికి, జీవితపరమార్థసాధనకు విశేషంగా దోహదంచేసింది. అన్నింటినిమించి హైందవాన్ని ఒకమతంగా కాక, భారతీయునిజీవనవిధానంగా రూపొందించింది.

అందుకే ఎందరెందరో విజాతీయులు, ఎన్నెన్నో విజాతీయసంస్కృతులు మనదేశంమీద, మనసనాతనధర్మం మీద, మనసంస్కృతీసంప్రదాయాలమీద ఎన్నెన్నిదండయాత్రలుచేసినా, మనదేశాన్ని ఎన్నేళ్ళు పాలించినా – ఈనాటికీ ఆసేతుహిమాచలం, పూర్వపశ్చిమసాగరపర్యంతం మనం మనంగా నిలిచి ఉన్నామంటే, మనసనాతనధర్మం చెక్కుచెదరకుండా సమున్నతంగా నిలిచి ఉన్నదంటే, మనసంస్కృతీసంప్రదాయాలు, ఆచారవ్యవహారాలు, పండుగలు, పర్వదినాలు ఊరూరా, ఇంటింటా కనులపండువుగా కొనసాగుతున్నాయంటే, అందుకు ప్రధానకారణం మన దేవాలయాలే! మనజీవనవిధానంమీద ఆ దేవాలయాలు పరపినప్రభావమే!

సనాతనధర్మం పునాదిగా ప్రభవిల్లినహైందవ సంస్కృతిని, సంస్కారాన్ని దేవాలయాలు మనఇంట్లో భాగంగా, మనఒంట్లో భాగంగా చేశాయి. అలాంటప్పుడు మన సంస్కృతిని, సంస్కారాన్ని ఎవరు తుడిచి వేయగలరు? ఎలా తుడిచి వేయగలరు?

ఈ విధంగా మనజీవితాన్ని ప్రభావితం చేస్తూ, మాన వుడు ఉన్నతోన్నతస్థితిని అందుకోవటానికి బలమైన ఆలం బనంగా నిలిచేదేవాలయాన్ని ప్రతిభారతీయుడు దర్శించాలి. దేవుణ్ణి భక్తిభావంతో పూజించాలి. దేవాలయసందర్శనం, దైవపూజ అతనిజీవితంలో భాగం కావాలి. ఒకదైనందిన కార్య క్రమంగా రూపొందాలి. అందుకే మనదేశంలో ఊరూరా దేవాలయాలు! వీథివీథికీ దేవాలయాలు!

ఈ దేవాలయాల్లో విష్ణ్వాలయా లున్నాయి. శివాలయా లున్నాయి. శక్త్యాలయా లున్నాయి. మహాపురుషులపేర మరి కొన్ని ఆలయా లున్నాయి.

మనవేదం "ఏకం సత్" అని చెపుతుంటే మనకు ఇందరుదేవు ళ్ళేమిటి? ఇన్నిరకాలదేవాలయా లేమిటి? శైవ వైష్ణవవైషమ్యా లేమిటి? అని ఎవరికైనా అనిపించవచ్చు. అంతేకాదు. 'ఏకం సత్' అని చెప్పినఆపరమాత్మను వేదమే పరబ్రహ్మ మని, మహావిష్ణు వని, పరమేశ్వరు డని వ్యవ హరించట మేమిటి? అనికూడ అనిపించవచ్చు.

ఉన్న దొక్కటే - అదే సత్యం; అదే నిత్యం; అదే బ్రహ్మం; అదే నిర్గుణనిరాకారవిశుద్ధవిశ్వచైతన్యం; అదే పరమాత్మ అని వేదం చెప్పినమాట నిజమే! ఆ పరమాత్మను పరబ్రహ్మ మని, మహావిష్ణు వని, పరమేశ్వరు డని వ్యవహరించినమాట కూడ నిజమే. కానీ, ఆ పరమాత్మను పరబ్రహ్మ మని అన్నంతమాత్రాన ఆయన సత్యలోకనివాసి, సరస్వతీపతి అయిన బ్రహ్మ కాదు. అన్నింటికంటె, అందరికంటె గొప్పవా డని భావం. అలాగే, ఆయనను మహావిష్ణు వని వ్యవహరించినంతమాత్రాన ఆయన వైకుంఠవాసి, లక్ష్మీపతి కాదు. అంతటా వ్యాపించి ఉండేవా డని అర్థం. అలాగే పరమేశ్వరు డని అన్నంతమాత్రాన ఆ పరమాత్మ కైలాసవాసి, పార్వతీపతి కాదు. సర్వానికి ప్రభు వని తాత్పర్యం.

పరమాత్మ ఈముగ్గురిలో ఏఒక్కరో కానప్పుడు హైందవంలో ఆశ్చర్యకరంగా బహుదేవోపాసన విశేషంగా రూపొందట మేమిటి? కొందరివిమర్శలకుకూడ గురికావట మేమిటి? ముఖ్యంగా ఈ త్రిమూర్తు లెవరు?

పరమాత్మ నిర్గుణనిరాకారవిశుద్ధవిశ్వచైతన్యశక్తిగానే ఉంటే ఈ సృష్టే లేదు; ఈ జగత్తే లేదు; ఈ జీవుడే లేడు. పరమాత్మ సగుణం కావటంవల్లనే- అంటే సత్త్వరజస్తమోగుణా లను పొందటంవల్లనే ఇవన్నీ! అయితే అంతా పరమాత్మే అయినపుడు ఈ త్రిగుణాలు ఎక్క డున్నాయి?

ఇవి ఆయనను ఆశ్రయించే ఉన్నాయట! ఆయన సంకల్పానుసారమే ప్రవర్తిల్లితుంటాయట! ఈ త్రిగుణాలసమా హారమే మాయ. నిర్గుణనిరాకారపరబ్రహ్మస్వయంసంకల్పాను సారం ఈ మాయాశక్తిని- అంటే సత్త్వరజస్తమోగుణాలను గ్రహించినపుడు- సృష్టి, స్థితి, లయాలు జరుగుతాయి. అప్పుడు రజోగుణంతో సృష్టిచేసే పరమాత్మ-బ్రహ్మ. ఈ బ్రహ్మ సత్యలోకనివాసి; సరస్వతీపతి. సృజించిన ఈ జగత్తునంతా సత్త్వ గుణంతో పోషించి, పాలించే పరమాత్మ విష్ణుమూర్తి. ఈ విష్ణు మూర్తే వైకుంఠవాసి; లక్ష్మీపతి. తరువాత తమోగుణంతో ఈ సృష్టినంతా లయంచేసే పరమాత్మే పరమేశ్వరుడు-రుద్రుడు. ఈయనే కైలాసవాసి; పార్వతీపతి.

అందుకే వేదం పరమాత్మను 'త్వం బ్రహ్మ త్వం విష్ణు స్త్వం రుద్ర స్త్వం... ప్రజాపతిః' అని ప్రవచించింది. అంతేకాదు 'శివాయ విష్ణురూపాయ। శివరూపాయ విష్ణవే। శివస్య హృదయగ్ం విష్ణుః విష్ణోశ్చ హృదయగ్ం శివః। యథా శివ మయో విష్ణుః। ఏవం విష్ణుమయ శ్శివః।' అని శివకేశవఅభేదాన్ని కూడా చెప్పింది. అందేకాదు. 'యథాంతరం న పశ్యామి తథా మే స్వస్తి రాయుషి'- శివకేశవు లిద్దరిని తేడాగా చూడనంతవరకే క్షేమము. ఆయుర్వృద్ధి- అనికూడ మానవాళిని హెచ్చరించింది.

అందువల్ల మనం శివకేశవభేదాన్ని పాటించ నక్కర లేదు. ఇవి శివాలయాలు, ఇవి విష్ణ్వాలయాలు అని తేడాగా చూడ నక్కరలేదు. శ్రీకృష్ణదేవరాయలు తాను వైష్ణవుడైనా- తిరుమల వేంకటేశ్వరస్వామిఆలయాన్నేకాక, శ్రీకాళహస్తీశ్వర స్వామిఆలయాన్నికూడా అభివృద్ధి చేశారుకదా!

బ్రహ్మవిష్ణుమహేశ్వరులు ముగ్గురూ ఆ పరమాత్మ స్వరూపులే కనుక, ఆ ముగ్గురిలో ఎవరికి నమస్కరించినా ఆ పరమాత్మకు నమస్కరించినట్లే!

ఈ ముగ్గురివిషయం సరే! ఈ ముగ్గురితోపాటు మనం మరెందరో దేవుళ్ళకు గుడులు కట్టుతున్నాము. వాళ్ళను పూజిస్తున్నాము. ఇదేమిటి?

మహాద్రష్టలైనభారతీయమహర్షులదృష్టిలో అగుపించే ఈజగత్తంతా పరమాత్మవ్యక్తరూపం. విశుద్ధవిశ్వచైతన్యశక్తి పొందినవికారం. "ఏకో విష్ణుః మహద్భూతం పృథగ్భూతా న్యనేకశః" మొదలైన వేదవాక్యా లన్నీ- ఏకత్వం పొందినఅనేకత్వాన్ని తెలియచేప్పేవే! విశ్వవ్యాప్తవిశుద్ధచైతన్యశక్తి సగుణమై వివిధ పదార్థరూపాన్ని పొందినవైనాన్ని వివరించేవే! విశ్వవిఖ్యాత విజ్ఞానశాస్త్రవేత్త, మహాద్రష్ట అయిన ఐన్‌స్టీన్ మహాశయుదు కూడా $E=MC^2$ అనేసూత్రంద్వారా శక్తి, పదార్థం రెండూ పరస్పరం మార్పుచెందుతా యని చెప్పాడుకదా!

అందువల్ల భారతీయులదృష్టిలో అన్నింటా, అంతటా నిండి ఉండేది- ఆపరమాత్మే! 'ఇందు గలఁ డందు లేఁ డని సందేహము వలదు, చక్రి సర్వోపగతుండు' అని అనటంలోని అంతరార్థంకూడ ఇదే! అందుకే భారతీయులు వేపచెట్టుక్రింద బొట్లు పెట్టి నిలబెట్టినరాతిబొమ్మను మొదలు, కైలాసశిఖరం మీది ఆత్మలింగందాకా; గాటిగుంజకు కట్టి ఉంచినగోవును మొదలు, దేవలోకంలోని కామధేనువుదాకా; పుట్టలో ఉన్న నాగుపామును మొదలు, విష్ణులోకంలోని ఆదిశేషునిదాకా అన్నింటినీ దైవస్వరూపాలుగా భావిస్తున్నారు. ఎవరికి ఇష్టమైన దైవస్వరూపాన్ని వారు పూజిస్తున్నారు.

అందుకే హైందవంలో బహుదేవోపాసన; రకరకాల పూజావిధానాలు!

భగవదారాధనవిషయంలో హైందవం వ్యక్తి కిచ్చిన స్వేచ్ఛ ప్రపంచంలో ఏమతమూ ఎవ్వరికీ ఇవ్వలే దని అనిపిస్తుంది.

పైగా, బహుదేవోపాసనకు పరమార్థంగా హైందవం ఒక పరమసత్యమైనమాట చెప్పింది. ఆకాశంనుండి పడిననీరు ఏ విధంగా చివరకు సముద్రాన్ని చేరుకుంటుందో, అదే విధంగా మనం ఏ దేవుడికి నమస్కరించినా, ఆ నమస్కారం చివరకు పరమాత్మను చేరుతుం దని చెప్పింది.

**ఆకాశాత్పతితం తోయం । యథా గచ్ఛతి సాగరమ్**
**సర్వదేవనమస్కారః । కేశవం ప్రతిగచ్ఛతి ॥**

భారతీయుల సువిశాల దృష్టికి, సమన్వయదృష్టికి ఇది ధ్వజప్రాయమైన మాట.

అంతేకాదు. భగవద్భక్తుడు ఎవరైనా సరే- ఎంతనిరుపేద అయినా సరే- తాను భగవంతునికి విలువైన కానుకలు సమర్పించుకోలేననో, గొప్పగొప్పగా ఖర్చుపెట్టి విశేషసేవలు చెయ్యలేననో న్యూనతాభావాన్ని పెంచుకో నక్కర లేదు; బాధపడ నక్కరలేదు. సాక్షాత్తు శ్రీకృష్ణభగవానుడే -

**పత్రం పుష్పం ఫలం తోయం । యో మే భక్త్యా ప్రయచ్ఛతి**
**తదహం భక్త్యుపహృత । మశ్నామి ప్రయతాత్మనః ॥**

అని అర్జునునితో చెప్పాడు. పరిశుద్ధమైనమనస్సుతో, పరమభక్తితో ఒక ఆకు నిచ్చినా, పువ్వు నిచ్చినా, పండు నిచ్చినా, కడకు కొంచెంనీ ళ్ళిచ్చినా పరమాత్మ స్వీకరిస్తాడట! అందువల్ల దేవాలయానికి వెళ్ళే భక్తునికి ఉండవలసింది పరిశుద్ధమైన మనస్సు, పరిపూర్ణమైనభక్తేకాని, ధనకనకవస్తుసమూహాలు కాదు.

భారతీయుడు ఏ దేవాలయానికైన వెళ్ళవచ్చు. ఏదేవతా మూర్తినైన పూజించుకోవచ్చు. తనమనస్సును అర్పించుకోవచ్చు.

**ఇక, విగ్రహారాధన -** హైందవంలో విగ్రహారాధన ఒక విశేషం. ఇదికూడ కొందరివిమర్శకు తా విచ్చినఅంశమే.

విగ్రహం పరమాత్మకు ప్రతీక. నిర్గుణుదు, నిరాకారుదు, విశ్వవ్యాపి అయిన పరమాత్మను మహాయోగులు దర్శించగల రేమోగాని, సామాన్యులు దర్శించలేరు. మహాయోగులు అర్చించి తరించగలరేమేగాని, సామాన్యుల కది సాధ్యం కాదు. అట్లని సామాన్యులకు ముక్తే అక్కరలేదా? వాళ్ళు ఈ జన్మపరంపరలో చిక్కుకొని - జననమరణాలతో, సుఖదుఃఖాలతో, అలజడులతో, అశాంతులతో సతమతమౌతూ జీవితం సాగించవలసిందేనా? వాళ్లల్లో అంతర్లీనంగా ఉన్న ఆధ్యాత్మికశక్తి నిరర్థకంగా ఉండి పోవలసిందేనా? తక్కినప్రాణుల్లా వాళ్ళజీవితాలు తినటానికి, కనటానికి, మరణానికిమాత్రమే పరిమితమై పోవలసిందేనా?

అలా కాకుండ, వాళ్ళమనస్సులు – పరమాత్మ స్వరూపంగా భావించి, విగ్రహాలమీద లగ్నం కావటానికి, క్రమ క్రమంగా వాళ్ళలోని ఆధ్యాత్మికశక్తి ఆవిష్కృతమై ఐహికంగా చిత్తశాంతిని పొందటానికి, సగుణోపాసననుండి నిర్గుణోపాసనకు చేరుకొని, ఆముష్మికంగా మానవజీవితపరమార్థమైనమోక్షాన్ని పొందటానికి హైందవసంస్కృతి రూపొందించినఎ ేమహిమా న్వితాలైనదేవాలయాలు! మహాశక్తిసంపన్నాలైన విగ్రహాలు!

విగ్రహ్ లంటే విశేషంగా గ్రహించేవి – మనస్సును, దైవశక్తిని విశేషంగా గ్రహించేవి. ఆధ్యాత్మికంగా మనిషి అత్యున్న తంగా ఎదగటానికి అద్భుతంగా ఉపకరించేది దేవాలయం అయితే ప్రాపంచికవిషయాలచుట్టూ పరిభ్రమించేమనస్సు పరమాత్మను చేరుకోవటానికి ఆలంబనంగా నిలిచేఅద్భుత దివ్య సాధనం విగ్రహం.

పంచవిధభగవత్స్వరూపాల్లో అర్చాస్వరూపం విగ్రహం. అందుకే మనం అర్చామూర్తి అయిన విగ్రహాన్ని పూజిస్తున్నాము.

కాగా, ఆధ్యాత్మిక కేంద్రాలు, మహిమాన్వితాలైన దేవా లయాలను ఎక్కడంటే అక్కడ నిర్మించకూడదు. ఎలాగంటే అలా నిర్మించకూడదు. ఆలాగే, పరమాత్మకు ప్రతీకలు మహాశక్తి సంపన్నాలైన దేవతావిగ్రహాలనుకూడ దారు, శిలా, లోహ, సుధారూపాల్లో ఎలాగంటే అలా తయారుచేయకూడదు. ఎలా పడితే అలా ప్రతిష్ఠించకూడదు.

అనేక భౌగోళిక, గ్రహ, నక్షత్ర దైవికాంశాలను దృష్టిలో ఉంచుకొని – నిర్మాణాలకు సంబంధించిన అనేకానేకాంశాలను సూక్ష్మంగా, సమగ్రంగా పరిశీలించి, మనమహర్షులు వాస్తు శాస్త్రశిల్పశాస్త్రాలను రూపొందించారు. వాటిలో కాశ్యపశిల్ప శాస్త్ర, మయమత, మానసారవాస్తుశాస్త్రాలు అతిప్రసిద్ధాలు. ఈ మూడింటిని పండితులు రత్నత్రయంగా పేర్కొంటారు.

మనవాస్తుశిల్పశాస్త్రాలు–దేవాలయాలకు ఏలాంటి స్థలాలను ఎంపిక చేయాలో, ఏయే పరీక్షలు జరిపి స్థలాన్ని స్థిరీకరించాలో, శంకుస్థాపనలు ఎలా చేయాలో, ఎన్ని అంతస్తుల దేవాలయాన్ని ఎలా నిర్మించాలో, ఆలయగర్భగుడిని, విమానాన్ని ఎలా రూపొందించాలో, ఆలయస్తంభాలప్రమాణాలు ఎలా ఉండాలో, ఏయే కొయ్యలను, రాళ్లను ఎలా అతికించాలో, స్తంభప్రతిష్ఠలు ఎలా జరగాలో, ఆలయానికి బలము, రక్షణ, శోభ కలుగటానికి, పరివారదేవతలను నిలుపటానికి ప్రాకారాలు ఎలా నిర్మించాలో– అన్నింటిని మించి వివిధవిగ్రహాలప్రమా ణాలు, లక్షణాలు, మూర్ధాదిపాదపర్యంతం అవయవాలకొలతలు, అంతేకాక విగ్రహాలకు అమర్చేఆభరణాలప్రమాణాలు ఎలా ఉండాలో– స్పష్టంగా నిర్దేశించాయి. అన్నిదేవాలయాలు, అన్ని విగ్రహాలు ఆయాశాస్త్రనియమాలప్రకారం ఉండవలసిందే! విశే షించి విగ్రహప్రతిష్ఠ ఒకగొప్పఆగమప్రక్రియ. మంత్ర పూతంగా, యంత్రసహితంగా, ఆగమోక్తపద్ధతిలో వివిధపూజలతో, హోమా లతో విగ్రహప్రతిష్ఠలు జరగాలి.

అందుకే మనదేవాలయాలు మహిమాన్వితాలు; విగ్రహాలు శక్తిసంపన్నాలు.

మనదేశంలో కొన్ని ప్రసిద్ధదేవాలయాలు కొండలమీద ఉన్నాయి. కొన్నికొండగుహల్లో ఉన్నాయి. మరికొన్ని నదీ తీరాల్లో ఉన్నాయి. ఇంకకొన్ని, ప్రకృతిఅందాలు పరిఢవిల్లే అరణ్యప్రాంతాల్లోకూడ ఉన్నాయి. ఆయా స్థలమాహాత్మ్యాలను బట్టి కొన్నింటిని మహర్షులు ఏర్పరచారు. కొన్నింటిని మహా రాజులు కట్టించారు. పెక్కింటిని ప్రజలే నిర్మించుకొన్నారు. అయినా అన్నిదేవాలయాలు పవిత్రాలే! అన్నిదేవాలయాలు మహిమాన్వితాలే!

**మానవోద్ధరణ కేర్పడిన మనదేవాలయాలను** మనం పరిశుభ్రంగా ఉంచుకోవాలి. వాటిపవిత్రతను కాపాడుకోవాలి. కాలక్రమేణ శిథిలమైతే వాటిని మనమే పునర్నిర్మించుకోవాలి. ఆయా దేవాలయాల పౌరాణిక, చారిత్రక, సాంస్కృతిక, ఆధ్యాత్మిక విశేషా లేమిటో తెలుసుకోవాలి. పదిమందికి తెలియ చెప్పాలి. అన్నిదేవాలయాలకు వెళ్లాలి. పుష్కరుణుల్లో, పుణ్యనదుల్లో స్నానాలు చేయాలి. దేవతామూర్తులను పూజిం చాలి. అంతర్గతంగా ఉన్నఆధ్యాత్మికశక్తిని ఆవిష్కరించుకోవాలి. ఐహికంగా మానసికప్రశాంతతను, ఆముష్మికంగా ఉన్నతోన్నత స్థితిని పొందాలి.

**ఆలయాలకు వెళ్దాం పదండి.**
**దేవాలయాలకు వెళ్దాం పదండి.**

# సందేహాలు? సమాధానాలు!!

విద్వాన్, డా॥ పమిడికాల్వ చెంచుసుబ్బయ్య

**ప**ద్మసరోవరంలో అలర్‌మేల్‌మంగ పద్మావతిఅమ్మవారు ఏమాసంలో, ఏతిథిలో, జన్మించారు? అమ్మవారి ప్రసన్నమంత్రం ఏది? *– జోగిమహంతి సుధాకరరావు, కాకినాడ.*

☛ భృగుమహర్షిచర్యకారణంగా శ్రీమహాలక్ష్మి కోపంతో వైకుంఠాన్ని వదిలి, భూలోకంలోని కొల్హాపురికి చేరింది. విష్ణువు మహాలక్ష్మికై వెదకుతూ భూలోకానికి వచ్చాడు. కొల్హాపురిలో అమ్మవారు కన్పించింది. అక్కడ అగస్త్యమహర్షిప్రతిష్ఠించిన మహాలక్ష్మిని పూజిస్తూ, విష్ణువు పదిసంవత్సరాలు ఉండినాడు. ఒకనాడు ఆకాశవాణి "దేవదేవా! మహావిష్ణూ! మహాలక్ష్మి దర్శనం కావాలంటే సువర్ణముఖినదికి కొంతదూరంలో సరస్సును త్రవ్వి, అక్కడ దేవలోకంనుంచి తెప్పించిన బంగారు కమలాలను నాటి, లక్ష్మీదేవిని సమంత్రకంగా జపిస్తూ, నిత్యం కమలాలతో పూజిస్తూ, 12 సంవత్సరాలు తపస్సుచేస్తే – ఆ మహాలక్ష్మి నీకు కన్పిస్తుంది" అని విన్పించింది. అదేప్రకారం ప్రస్తుతం తిరుచానూరులో పుష్కరిణి ఉన్నప్రదేశంలో సరస్సు చేసి, దివ్యకమలాలతో పూజిస్తూ, 12 ఏండ్లు తపస్సుచేయగా – అమ్మవారు – 13వ సంవత్సరంలో కార్తికశుక్లపంచమి, శుక్రవారం– ఉత్తరాషాఢనక్షత్రంలో, 'మంత్ర' అనే సుముహూర్తంలో – సరస్సునుండి ఆవిర్భవించి, దర్శన మిచ్చింది. ఈ ఆవిర్భావ విషయం పద్మపురాణంలో

**తత స్త్రయోదశేవర్షే కార్తికే శుక్లపక్షకే।**
**పంచమ్యాం శుక్రవారేచ ముహూర్తే మంత్రసంజ్ఞికే॥**
**వపుః పుణ్యా సుఖావాతాః ఉత్తరాషాఢతారకే ।**
**ప్రసన్నం సలిలం సర్వం త్రైలోక్యాంతర్గతద్విజా ॥**
**సుప్రభో భానుమా నాసీత్ ప్రసన్నాని మనాంసిచ ।**
**తతః పద్మసరోమధ్యే తేజోరాశిః మహా నభూత్ ॥**

– అని పేర్కొనబడింది.

అమ్మవారిప్రసన్నమంత్రం ***"ఓం శ్రీం కమలవాసిన్యై నమః"*** అనే తొమ్మిదిఅక్షరాలు కలది. ఈ మంత్రాన్ని రోజూ 108 మార్లు జపించడంవల్ల ఇష్టసిద్ధి కల్గుతుంది.

**వేం**కటేశ్వరుడు-వెంకటేశ్వరుడు - అనేవాటిలో ఏది సరైంది? పదానికి అర్థంకూడా తెల్పండి? *– జి.మనోహర్, కడప.*

☛ **శ్రీవైకుంఠవిరక్తాయ స్వామిపుష్కరిణీతటే ।**
**రమయా రమమాణాయ వేంకటేశాయ మంగళమ్॥**

– అనేమంగళాశాసనంలో స్థిరనివాసం కారణంగా వైకుఠంపై విరక్తి కల్గి, తిరుమలపుష్కరిణీతీరంలో లక్ష్మీదేవితో విహరించడానికై మహావిష్ణువు వేంకటాచలానికి వచ్చాడు. వేంకటేశమాహాత్మ్యంలో భక్తుల్ని అనుగ్రహించేందుకే స్వామి ఇలా వచ్చా డని ఉంది. ఇక్కడిస్వామివారిపేరు 'వేంకటేశుడు–వేంకటేశ్వరుడు'. వేంకట+ఈశుడు (ఈశ్వరుడు). ఈశ, ఈశ్వర శబ్దాలు స్వామివారు సర్వానికీ 'ప్రభువు' అనే అర్థాన్ని సూచిస్తాయి. 'వేంకట' – శబ్దానికి అనేకార్థా లున్నాయి. 'సర్వపాపాని వేం ప్రాహుః, కట స్తద్దాహ ఉచ్యతే' (భవిష్యోత్తరపురాణం 1–220–221) సమస్తపాపాలకు 'వేం' అని పేరు. కటః– అంటే దహింపజేయడం. కనుక 'వేంకటః' అంటే సర్వపాపాలను దహింపజేసేవాడు. అట్టి ప్రభువు కనుక వేంకటేశుడు. ఇంతేగాక 'వకారోఽమృతబీజం స్యా దైశ్వర్యం కట ముచ్యతే। అమృతైశ్వర్య దేవత్వాత్ వేంకటేశం హరిం విదుః" – 'వ' కారం అమృతబీజం. కట– ఐశ్వర్యం. అమృతైశ్వర్యాలకు స్వామికావడంవల్ల 'వ్యంకటేశుడు' ఆయనే వేంకటేశుడు. గరుడపురాణంరీత్యా– 'వ' కారం ఉత్తమత్వాన్ని తెల్పుతుంది. యకారం జ్ఞానవాచకం. కకారం=సుఖం, టకారం చిత్ (చిత్తు)–ఈశ= ఆత్మ– కనుక పూర్ణజ్ఞానానందచిద్రూపుడై, సర్వస్వామి కనుక 'వ్యంకటేశుడు', వ్య=ఇంద్రియాదులు. కట=సముదాయం. వీటికి ప్రేరకుడు కనుక 'వ్యంకటేశుడు'. లింగశరీరయుక్తులైన జీవులు వ్యంకటులు. ఆ జీవులకు స్వామి కనుక వ్యంకటేశుడు. ఆనందానికి విరుద్ధాలైన కామక్రోధాదులు వ్యంకటాలు. వాటిల్ని కటః= నాశం చేసేవాడు కనుక వ్యంకటేశుడు. ఇలా 'వ్యంకటేశ' శబ్దమే 'వేంకటేశ'గా రూపొందింది– అనీ చెప్పవచ్చు.

'వేంకటేశ, వేంకటేశ్వర' అనేరూపాలే సరైనవి. 'వెంకటేశ, వెంకటేశ్వర' అనేరూపాలు సరైనవి కావు.

**‘శివుని నెత్తిమీద అర్జునుడు దెబ్బవేశాడు’ అని సెప్టెంబర్ 2013 ‘బాలప్రబోధం’-‘తటాక కైంకర్యం’లో ఉంది. ఇది ఎప్పుడు ఏ సందర్భంలో జరిగిందో తెల్పకోరినాను?**

***- ఎం.మురళీనాథ్, వడమాలపేట, చిత్తూరు జిల్లా.***

☛ ఈ సన్నివేశం-మొన్నటి ద్వాపరయుగంలో జరిగింది. పాండవులు అరణ్యవాసం చేస్తున్న రోజుల్లో- ఇంద్రుడు అర్జునునికి “పాశుపతాస్త్రాన్ని పొందితే సకలశత్రువుల్ని జయించగలవు, కనుక పశుపతినిగూర్చి తపస్సుచేయుము. శివునికృపవల్ల సర్వత్రజయం కల్గుతుంది’ అని చెప్పాడు. ఇంద్రునిసూచనమేరకు అర్జునుడు పాశుపతదీక్ష గైకొని, శివుణ్ణిగురించి తీవ్రంగా తపస్సు చేయసాగాడు. అర్జునునిబలపరాక్రమాలు పరీక్షింప దలచి, శివపార్వతులు చెంచు-చెంచెతలై అర్జునునిఆశ్రమ ప్రాంతానికి - అనేకక్రూరమృగాలతోపాటు వచ్చారు.

శివునిఆజ్ఞతో ‘మూకు’ డనే రాక్షసుడు వరాహరూపం దాల్చి వచ్చి, అర్జునునిఆశ్రమప్రాంతాన్ని అశాంతిపాలు చేశాడు. కిరాతరూపుడైన శివుడూ, గాండీవం ధరించినఅర్జునుడూ ఆ వరాహంపై బాణాల్ని వేశారు. ఇరువురిబాణఘాతాలతో వరాహం నేలకూలింది. ‘నాబాణాలవల్లనే వరాహం కూలిం’దని శివుడు, ‘నాబాణాలవల్లనే కూలిం’దని అర్జునుడూ- ఒకరికొకరు పంతాలకు దిగారు. ఇద్దరిమధ్య వాగ్వాదం పెరిగి, చివరకు కయ్యానికి సిద్ధమయ్యారు. ఇరువురూ బాణయుద్ధం భయంకరంగా చేశారు. పరమశివునిమాయాశక్తివల్ల అర్జునునిఅంపపొదిలో బాణాలు అదృశ్య మయ్యాయి. అపుడు అర్జునుడు ఏం చేయాలో తోచక, శివునితలపై గాండీవంతో గట్టిగా కొట్టాడు. ఆ దెబ్బతో గంగ విలవిలవాడింది. తర్వాత ఇద్దరూ మల్లయుద్ధానికి దిగారు. ఆ యుద్ధంలో ఇరువురూ తీవ్రస్థాయిలో కొట్టుకొన్నారు. దయాహృదయుడైన శివుడు కనికరించి, నిజరూపంతో అర్జునునియెదుట సాక్షాత్కరించాడు. తనతప్పును గ్రహించిన అర్జునుడు పరమభక్తితో శివుణ్ణి ప్రస్తుతించాడు. శివుడు అర్జునునికి తనపాశుపతాస్త్రాన్ని అనుగ్రహంతో ఇచ్చాడు. (ఈ విషయం శ్రీనాథుడు రచించినహర విలాసంలో ఉంది)

(ఆంధ్రమహాభారతంలో అర్జునుడు శివునితలపై కత్తితో కొట్టా డనీ, అది వృథా అయిం దనీ, తర్వాత బాహుయుద్ధానికి దిగా రనీ ఉంది.)(అరణ్యపర్వం - ప్రథమాశ్వాసం 316 పద్యం)

**ఏకాదశరుద్రులు, ద్వాదశాదిత్యులు, అష్టవసువులు, సాధ్యులు, విశ్వదేవతలు - వీరిని గురించిన వివరాలు తెల్పండి?** ***- పి.ఆర్.భాస్కరరాజు, హోసూరు, తమిళనాడు.***

☛ **ఏకాదశరుద్రులు:** వీరు 11 మంది. కశ్యపబ్రహ్మవల్ల సురభియందు జన్మించినవారు. 1)అజైకపాదుడు 2)అహిర్బుధ్న్యుడు 3)త్వష్ట 4)రుద్రుడు 5)హరుడు 6)త్ర్యంబకుడు 7)వృషాకపి 8)శంభుడు 9)కపర్ది 10)మృగవ్యాధుడు 11)శర్వుడు.

**ద్వాదశాదిత్యులు:** వీరు 12 మంది. కశ్యపునికి అదితియందు కల్గిన తుషితు లనబడే దేవతలు. 1)ఇంద్రుడు 2)ధాత 3)పర్జన్యుడు 4)త్వష్ట 5)పూషుడు 6)అర్యముడు 7)భగుడు 8)వివస్వతుడు 9)విష్ణువు 10)అంశుమంతుడు 11)వరుణుడు 12)మిత్రుడు

**అష్టవసువులు:** వీరు 8 మంది. 1)ఆపుడు 2)ధ్రువుడు 3)సోముడు 4)అధ్వరుడు 5)అనిలుడు 6)ప్రత్యూషుడు 7)అనలుడు 8)ప్రభాసుడు. వీరు దక్షప్రజాపతికూతురైన వసువుకు ధర్మునియందు కల్గినపుత్రులు. అష్టవసువులతల్లి వసువు. తండ్రి ధర్ముడు.

**సాధ్యులు:** గణదేవతలలో ఒకతెగవారు. ధర్మునికి సాధ్య అనేభార్యయందు పుట్టినవారు. వీరు 12 మంది. 1)మనువు 2)మంతుడు 3)ప్రాణుడు 4)నరుడు 5)నారాయణుడు 6)వృత్తి 7)తపుడు 8)హయుడు 9)హంసుడు 10)ధర్ముడు 11)విభుడు 12)ప్రభుడు.

**విశ్వదేవతలు:** శ్రాద్ధకాలంలో అర్చించబడేదేవతలు. శ్రాద్ధయాగంలో ప్రవేశించేవా రని వ్యుత్పత్తి. వీరు 10 మంది. 1)క్రతువు 2)దక్షుడు 3)వసువు 4)సత్యుడు 5)కాలుడు 6)కాముడు 7)ధురి 8)కురువు (విరోచనుడు) 9)పూరూరవసు 10)మాద్రవస్సు.

***గమనిక :*** *ఇందు పేర్కొన్నక్రమంలో కొన్నిభేదాలు ఉన్నాయి. అయినా ఎక్కువమంది పేర్కొన్నక్రమం ఇందు స్వీకరించడమైనది.*

# శ్రీసీతారామాంజనేయ సంవాదం - తారకయోగం

డా॥ కంపల్లె రవిచంద్రన్

మహోన్నతవేదసంప్రదాయభావసంపదను, సత్యాహింసాత్మకప్రగాఢానురాగభావజలధారలను, ప్రపంచాని కందించుటలో తనకన్న మరెవ్వరూ లే రని చాటి చెప్పింది – మన భరతమాత. అందుకే ఒకప్రక్క మహోన్నతహిమ శిఖరాలను, మరో ప్రక్కన అంతు తెలీని అంబుధిజలాలను సాదృశ్యంగా ఉంచుకుని చిరకీర్తి నార్జించింది–భరతమాత.

భగవంతుడు నరనారాయణరూపంలో భారతదేశానికి అధిదేవతయై, ఆత్మనిష్ఠులకు ఆదర్శంగా, వారిపట్ల కృపాకటాక్షాలతో, ధర్మజ్ఞానవైరాగ్యాదిసంపదను పెంపొందించి, పరమాత్మ సిద్ధిని కలిగించేంతటి తపస్సును, అదృశ్యరూపుడై, ఆకల్పాంతం హిమవత్పర్వతంలో, బదరికాశ్రమమంలో ఆచరించు తున్నాడని భాగవతం చెబుతోంది. మర్త్యశరీరంతో క్షణకాలకృతమైన కర్మను భగవంతునికి సమర్పించడం వల్ల, వివేకవంతులు ఈ దేశంలో అభయమగు హరిపదాన్ని పొందు తున్నారు. శ్రీరాముడు, శ్రీకృష్ణుడువంటి అవతార మూర్తులపాద పద్మస్పర్శతో పునీతమైనదివ్యధాత్రి మన భారతమాతే!

అందుకేనేమో ఆంధ్రమహాభాగవతంలో పోతన –

**భారతవర్షజంతువుల భాగ్యము లే మని చెప్పవచ్చు నీ**
**భారతవర్షమందు హరి పల్మరుఁ బుట్టుచు జీవకోటికిన్**
**ధీరత తోడఁ దత్త్వ ముపదేశము సేయుచుఁ జెల్మి జేయుచు**
**న్నారయ బాంధవాకృతిఁ గృతార్థుల జేయుచు నుండు నెంతయున్.**

**(ఆంధ్ర.భాగ.5-2.56)**

భారతదేశపుసిరిసంపదలు వేదాలు. వేదాలు అఖిల ధర్మాలకు మూలాలు. మనసంస్కృతిని మనం నిలుపుకోవాలంటే వేదవాఙ్మయాన్ని మనం రక్షించుకోవాలి. రాబోయే తరాలు, మనుష్యులుగా మిగలాలంటే స్వార్థంస్థానంలో త్యాగాన్ని, ద్వేషం స్థానంలో ప్రేమను స్థాపించే ఆర్షసంస్కృతిని మనం పరిరక్షించుకోవాలి. ఒక్కమాటలో చెప్పాలంటే మానవత్వాన్ని, లోక కల్యాణాన్ని ఉద్బోధించే వేదసంహితల్ని, బ్రాహ్మణాల్ని, ఆరణ్యకాల్ని, ఉపనిషత్తుల్ని మనం కాపాడుకోవాలి.

'అరణ్యే పాఠ్యత్వాత్ ఆరణ్యకమ్' అంటాడు–సాయణుడు. అరణ్యంలో చదువతగినవి కనుక ఆరణ్యకాలు అయ్యాయి. పాలనుండి తీసినవెన్నలాంటిది ఆరణ్యకం. మొదటి నుండి గమనిస్తే ప్రతివేదం నాలుగు భాగాలుగా విభజింపబడింది. మంత్రభరితమైన మొదటిభాగానికి సంహిత అని పేరు. దీన్ని పాలు అనుకుందాం. రెండోభాగం – ఆ మంత్రాలకు వివరణగా కొనసాగినబ్రాహ్మణాలు, ఇది పెరుగు. వీటినుండి ఇంకా సూక్ష్మాంశాల్ని ప్రోదిచేసి చర్చించినభాగాలు ఆరణ్యకాలు. ఇది వెన్న. ఇక నాల్గోభాగంగా చేయబడినవి ఉపనిషత్తులు. ఇది నెయ్యి. వేదసారం. వానప్రస్థాశ్రమాన్ని స్వీకరించినవాళ్లు ఆచరించాల్సినయజ్ఞాలు, వ్రతాలుకూడా ఆరణ్యకాలలో వివరించబడ్డాయి. ఉపనిషత్తులకు ఆరణ్యకాలు మూలం. ఆరణ్యకాలకు బ్రాహ్మణాలు మూలం. బ్రాహ్మణాలకు వేదమంత్రభాగా లైనసంహితలు మూలం. రసాలకు ఫలాలు, ఫలాలకు పుష్పాలు, పుష్పాలకు కోరకాలు, కోరకాలకు కొమ్మలు, కొమ్మ లకు వృక్షాలు ఆధారమైనట్లు ఇవన్నీ ఒకదాని కొకటి పూరకకారకా లౌతున్నాయి.

వేదాలకున్నఈనాలుగుభాగాల్లోనూ, మనదురదృష్టం కొద్దీ ఎంతోవిషయం కాలగర్భంలో కలిసిపోయింది. మనకు పెన్నిధిలా మిగిలినవేదవాఙ్మయంకూడా, మనసౌభాగ్యం కొద్దీ మానవత్వాన్ని, మహనీయత్వాన్ని సాధించడానికి అవసరమైన దానికంటే వెయ్యిరెట్లు ఎక్కువగానే ఉంది. ఆచరించనపుడు అనంతజ్ఞానంవల్లకూడా ఒరిగేదేమీ ఉండదు. ఆచరణకు నోచుకునేది అణువైనా, కణమైనా సత్ఫలితా న్నిస్తుంది. మనం తరించడానికి లుప్తమైపోగా మిగిలినవేదవాఙ్మయమే చాలు.

ఈ విధమైనవేదాల్లో, తిలల్లో తైలంవలే ఉపనిషత్తులు (వేదాంతాలు) ప్రతిష్ఠితా లని ముక్తికోపనిషత్తునందు చెప్పడం జరిగింది. ఈ ఉపనిషత్తులు, లేక వేదాంతాలు జ్ఞానమార్గాన్ని బోధిస్తాయి. ఈ సర్వవేదాంతాలు, బ్రహ్మసూత్రాలు, భగవద్గీత, మహానిర్మాణాలైన రామాయణం, యోగవాసిష్ఠం, అధ్యాత్మరామాయణం, భారతభాగవతాలు ఇతరపురాణేతిహాసకావ్యాలు, శ్రుతులు... అన్నీ జీవేశ్వరైక్యరూపమైనబ్రహ్మజ్ఞానాన్నే పరమార్థంగా ఉపదేశిస్తున్నవి. దర్శనాల పరమార్థంకూడా ఇదే! కాళిదాసు, భవభూతి, భర్తృహరి, శంకరుడు, జయదేవుడు మొ॥ వారికృతు లైతేనేమి, ఇతరసౌందర్యసౌభాగ్యబంధురాలైన దృశ్య, శ్రవ్యకావ్యాలైతేనేమి, ధమ్మపదం, జాతకకథలు, చివరకు పంచతంత్రహితోపదేశాలు – అన్నీ పరమపురుషార్థరూప మైనధర్మాన్నే ప్రధానంగా నిర్దేశించాయి.

ధర్మం మానవుణ్ణి అభ్యుదయంవైపు నడుపుతుంది. ధర్మం దైవంతో ప్రత్యక్షసంబంధం కలిగింది. ధర్మం మానవుని మనుగడకు మూలాధారం. ధర్మం మానవజాతికి సర్వస్య శరణాగతి. ధర్మం సమస్తప్రాణకోటికి సర్వస్వమైంది.

ధర్మం సుస్థిరమైంది, శాశ్వతమైంది అని వీళ్లందరూ ఎలుగెత్తిచాటారు. ధర్మాన్ని ఎవరూ నాశనం చేయలే రని, అసత్యవర్తనులు ధర్మానికి కేవలం గ్లాని అంటే బాధనుమాత్రమే కలిగించగల రని చెప్పారు. భగవద్గీతలో కృష్ణుడుకూడా –

**యదా యదా హి ధర్మస్య గ్లాని ర్భవతి భారత !**
**అభ్యుత్థాన మధర్మస్య తదాఽత్మానం సృజా మ్యహమ్ (4-7)**

అని ధర్మానికి గ్లాని కలిగినపుడే తనను తాను సృజించుకుంటా నని చెప్పాడే తప్ప– ధర్మాన్ని సృష్టిస్తా నని చెప్పలేదు.

ఇలాంటి ప్రధానమైనధర్మం సృష్టిలో సమస్తప్రాణకోటికి మూలాధారమైనప్పుడు ధర్మానుసరణ కేవలం మానవునికే ఎందుకు విధించబడింది? ఇతరప్రాణులకు ధర్మానుసరణ అవసరం లేదా? అనేప్రశ్నలు తలెత్తుతాయి. 'మానవుడు బుద్ధిజీవి కావటమే కారణం' అని ఈ ప్రశ్నలకు సమాధానం చెప్పవలసిఉంది.

సమాజధారణమే ధర్మంయొక్క ముఖ్యమైనబాహ్యోపయోగమైనా మోక్షరూపమగు పరమపురుషార్థమే దానియథార్థస్వరూపం. ఆత్మకల్యాణం, లేక మోక్షమే సర్వధర్మాల్లో శ్రేష్ఠం. భక్తిజ్ఞానయోగాల్ని సంస్కృతభాషలో బోధించినవాల్మీకివ్యాసాదులయొక్క, పురాణేతిహాసాలయొక్క, శంకరాదులగుమహాచార్యులఅనంతరం సంస్కృతప్రాకృతభాషలు సమానంగా అపభ్రంశభాషలకు అవకాశ మొసగుచున్నకాలంలో, ఆధునిక భారతీయభాష లింకా పూర్తిగా రూపొందని కాలంలో, భారతావనిలో సర్వత్ర భగవత్కృపాపాత్రమైన మహానుభావ పరంపర ఆవిర్భవించింది. ఈ మహాత్ములు, అతిపురాతన 'వారసత్వానికి', భావితరాలకు మధ్య అమృతసేతువును నిర్మించారు. వేదోపనిషత్ పురాణేతిహాసకావ్యగీర్వాణహిమాలయ మహోన్నతశిఖరాల నుండి, తొలినాటి 'వారసత్వపు' జ్ఞానగంగను, మైదానాలకు వీళ్లు ప్రవహింపజేశారు. జనసామాన్యానికి వాళ్ల వాళ్లవాడుకభాషల్లో మార్గదేశిచ్ఛందాల్లో అభ్యుదయనిశ్రేయసాలను నిరూపించి, పరమార్థాన్ని, జీవితవిజయాన్ని బోధించారు. మహారాష్ట్రంలో భక్తిజ్ఞానయోగాత్మకమైనఆధ్యాత్మజ్ఞానాన్ని, ధర్మాన్ని జ్ఞానేశ్వర, జనార్దన, ఏకనాథ, నామదేవ, తుకారామ, సమర్థరామదాసాదులు జనసామాన్యభాషలో పాకృతభాషల్లో వేదోపదేశాల్ని బోధించి, ఆధ్యాత్మికక్షేత్రంలో బంగారుపంటలు పండించారు. ఆ పరంపరలోనే వాల్మీకివ్యాసులు బోధించిన పరమార్థాన్ని, వేదధర్మాల్ని, తెలుగుభాషలోనూ జనసామాన్యమునకు అందేజేశారు. అలా రామాయణగాథల్ని సామాన్యులకు అందజేసినవాళ్లలో పరశురామపంతుల లింగమూర్తి గురుమూర్తిగారు ప్రముఖులు. ఈయన సీతారామాంజనేయ సంవాద కావ్య కర్త. గురుమూర్తిగారిజీవితచరిత్ర మాన్యు లందరికీ విదితమే! వీరు రచించినగ్రంథాల్లో రతిమన్మథ విలాసం, జీవన్ముక్తి ప్రకరణం, తారకయోగం, ఆత్మారామశతకం, సాంఖ్యయోగం, నారదపరమేష్ఠిసంవాదం, గోవిందశతకం, సీతారామాంజనేయ సంవాదకావ్యం ముఖ్యమైనవి.

ఇక ప్రస్తుతవ్యాసానికి ఊతమైన సీతా రామాంజనేయ సంవాదం ఒక భక్తికేదారం.

గురుమూర్తికవి ముముక్షుజనహితాన్ని, దుఃఖసంసార తారకాన్ని, బ్రహ్మైక్యసాక్షాత్కారహేతుకమైన తారకసాంఖ్య అమనస్క యోగాత్మకమైన రాజయోగాన్ని, ప్రబంధంగా రచింపదలచి ఏకాంతప్రదేశంలో ధ్యానయోగనిష్ఠుడై ఉండగా ఆయనఇష్టదైవం శ్రీరామచంద్రమూర్తి మహాదేవగురుస్వరూపంలో ప్రత్యక్షమైనాడు.

**సీ. కమనీయవరదివ్యకాంచనచేలంబుఁ గాషాయవస్త్రంబుగా ధరించి,**
**చాపబాణంబులు చంచత్కమండలుదండము ల్గాఁగ హస్తములఁ బూని,**
**రమణీయరత్నహారంబు రుద్రాక్షమాలికగా గళంబున లీలఁ దాల్చి,**
**సీతావధూటిని శ్రీరాజయోగాహ్వయాధ్యాత్మవిద్యగా నవధరించి.**

**తే. ప్రేమ మీఱంగ శ్రీరామ రామ రామ**
**యనుచుఁ దనపేరు నుడువుచు నద్భుతముగ**
**శ్రీమహాదేవగురుఁడైన రామవిభుడు**
**గరుణతోడుత నెదుర సాక్షాత్కరించె.**

పై పద్యంలో, శ్రీరాజయోగాహ్వయాధ్యాత్మవిద్య లేక బ్రహ్మవిద్యయే జానకీదేవియని అభివర్ణించడం విశేషం.

ఈ గ్రంథంలో మనకు తెలియవచ్చేది – మోక్షం. పరమాత్మను చేరుకోవడానికి జీవాత్మ పడేతపన. ఆ తపనలో జరిగే తర్జనభర్జనలే ఇందులో ప్రధానాంశాలు. అయితే ఇవ్వన్నీ సాధారణజీవులమధ్యగాక, దివ్యాత్మలమధ్య జరగడం విశేషం.

ఒకరోజు పార్వతీదేవి, పరమేశ్వరుణ్ణి – "స్వామీ! సకల పాపాలను నిర్మూలింపజేసి, ఐహికాముష్మికభోగాల్ని అనుగ్రహించేది, శాశ్వతబ్రహ్మానందాన్ని ప్రత్యక్షంగా ఇచ్చేది, ఉపాసకుల్ని తరింపజేసేది అయిన మహామంత్రాన్ని నాకు ఉపదేశించండి" అని అడుగుతుంది. అంటే దేనితో జనన, మరణదుఃఖ రూపమైన ఈ సంసారం నివృత్తి అవుతుందో, యోగులు సంసార నివృత్తికై దేన్ని కొలుస్తారో, ఏది పాపం లేనిదో, ఆ విధమైన సంసార సాగరంనుండి తరింపజేసే మంత్రరాజాన్ని బోధించుమని అడుగుతుంది. అందుకు పరమేశ్వరుడు ఆమెకు శ్రీరామ మంత్రాన్ని ఉపదేశిస్తాడు –

**శ్రీమనోరామ! 'శ్రీరామ రామ రామ'**
**యనుచు రమియింతు రామునియందు రామ**
**నామము వరానన! సహస్రనామతుల్య**
**మట్లుగావున దీనిని నవధరింపు.... (1-46)**

అని చెప్తాడు. అంటే శ్రీరామదివ్యనామం విష్ణుసహస్ర నామంతో సమానమైంది అని. అంతేకాకుండా రామనామం సర్వజీవులకు తారకమంత్ర మని తెలియజేశాడు.

**తే. రామతారకపావనరామనామ**
**మెంత పాపంబు నడగించు నంతయఘము**
**శ్వపచుఁ డైనను జేయఁగాఁ జాల దనఁగ,**
**తత్ప్రభావంబు నెన్నంగఁదరమె నాకు ॥ (1-50)**

ఓ పార్వతీ! ఈ పద్నాలుగుభువనాల్లో ఎక్కడ కోరి వెదకి చూచినా మహాపావనకరమైన శ్రీరామతారకమంత్రంచే నశింపబడనిపాప మేదీ కానరాదు. అనగా ఎలాంటి ఘోర పాపాలైనా శ్రీరామమంత్రప్రభావంవల్ల నిర్మూలనచెందుతాయి అని దీనితాత్పర్యం.

అలా పరమశివుడు పార్వతీదేవికి శ్రీరామమంత్రదేవత యైన శ్రీరామునిప్రభావం ఎరిగింపతలంచినవాడై, ఆ మహాను భావునిచరిత్రను వచించడంతో కథ, సీతారామపట్టాభిషేకానంతరం, శ్రీరాముడిఆజ్ఞానుసారం సీతాదేవి, అంజనాతనయుడైన ఆంజనేయునికి సత్, చిత్, ఆనందనిత్యనిర్మలత్వా లనే పంచ లక్షణాలు గల శ్రీరామస్వరూపాన్ని బోధించడమే యిందులోని అసలు కథ.

అలా భూజాత, అనిలజునికి బోధించిన అనేకకాలైన యోగాల్లో తారకయోగాన్ని విశ్లేషించడం ఈ వ్యాసలక్ష్యం.

ఈ సంవాదకావ్యంలో ఉన్నప్రధానతర్కం గురుమూర్తి కవిగారు సీతాదేవిఉపదేశంనుండి, ప్రశ్నబీజం జిజ్ఞాసువైన ఆంజనేయునికి కల్గిం దని చెప్పి, తనతారకయోగా నుభవవిచారానికి నాంది కల్గించడం –

**తే॥ రామచంద్రుడు తారకబ్రహ్మ మగుట**
**సత్యమగుఁ గాని, యిమ్మహాసర్వమయుని**
**సులభముగఁ గాంచు పరమసుసూత్ర మెద్ది?**
**నా కెఱింగింప వమ్మ లోకైకజనని! (1-84)**

అని హనుమంతుడు అడిగితే – అందుకు సీతాదేవి–

**తే॥ ప్రత్యగాత్మస్వరూపుఁడై పరుఁగు తనకు**
**రమణ పరమాత్ముఁడైన శ్రీరామునకును**
**సమరసైక్యానుసంధానసరణి యెద్ది**
**అదియ యోగంబు సదుపాయ మాంజనేయ!**
**(సీ.రా.సం.1-84.86)**

అని జవా బిస్తుంది. జీవబ్రహ్మైక్యజ్ఞానసిద్ధికి, తగిన మార్గం యోగ మనీ, అదే చక్కని ఉపాయ మనీ, సీతాదేవి తారకయోగాన్ని మారుతికి ఉపదేశించింది. గురుమూర్తికవి స్వానుభవవిచారరూపమే ఇది.

నిజమే! ఎందుకంటే భగవంతుడే మనకు ఆఖరి మజిలీ. మనమేమో మనయోగ, ధ్యానాల ఆరంభాన్నే భగవం తునితో మొదలు పెడతాం. ఇది చివరిఘట్టంతో ప్రారంభోత్స వాన్ని జరుపుకోవడంలాంటిది. ఇంతకు మించినప్రహసనం మరొకటి ఉండదు. భగవంతుణ్ణి చేరుకోవడానికి ముందు- మనిషి ప్రేమికుడు కావాలి. కరుణామయుడు కావాలి. రసహృదయుడు కావలసి ఉంది. మానవతాపరిమళాలలతో నిండిపోవాలి. ఇవన్నీ జరిగాకే నేరుగా భగవంతునితో మనం సంబంధబాంధవ్యాల్ని ఏర్పరచుకోవడానికి వీలవుతుంది.

ఒకవ్యక్తి నిజంగా భక్తుడే అయితే, ప్రేమానురక్తుడే అయితే ఒక అద్భుతాన్ని అతడు దర్శించగలుగుతాడు. ఒక భక్తుడు ఒక దేవతనుగురించి గానం చేస్తున్నా డనుకుందాం! అతడు తిరిగీ అదే భావగీతాన్ని దేవతనుండి వినగలుగుతాడు. అంటే దేవతకూడా భక్తుణ్ణిగురించి గానం చేస్తుందా? చేస్తుంది. ఎప్పుడో తెలుసా? నువ్వు నిజంగా నీ నిర్మల ప్రేమహృదయాన్ని ఆదేవతపాదాలదగ్గర సమర్పించినపుడు. ప్రేమ అన్నా, భక్తి అన్నా బాహ్యాభ్యంతరశక్తులసంయోగమే! ప్రకృతిధర్మం పర మాత్మకుకూడా వర్తించితీరుతుంది. నువ్వు ఒక దేవతాతత్త్వంతో రమించి పరవశిస్తున్నపుడు, ఆ దేవతకూడా నీతో రమించి పరవశిస్తుంది. అయితే దేవత నీకంటే సున్నితశక్తి, కారుణ్య శక్తి- అనే సంగతి మరిచిపోగూడదు.

మనఅహంభావం తీసివేతఅయితే భగవంతుడు కూడిక అవుతాడు. తీసివేత కూడికలో లయించిపోతుంది. ప్రారంభం ఒకదానికి అంతం అవుతుంది. అంతం మరొకదానికి ప్రారంభం అవుతుంది. ఆత్మ, పరమాత్మల కలయిక కల్యాణకారి అవు తుంది.

యోగం, అష్టాంగరూపమైనఅభ్యాసయోగ మనీ, జ్ఞానయోగ మనీ రెండురకాలు. తారకయోగం అభ్యాసయోగ స్వరూపమే! జ్ఞానయోగం సాంఖ్య అమనస్కయోగాలతో కూడు కున్నది.

**తే॥ తారకంబు మనఃశుద్ధికారకంబు**
**సాంఖ్య మాత్మస్వరూపవిచారకంబు,**
**అనుభవజ్ఞాన మమనస్క మట్లుగాన**
**నాద్య మెఱిఁగింతు మొదల నీ వవధరింపు (సీ.రా.సం.1-92)**

ఈ యోగా లన్నిటికి వైరాగ్యమూలమైన శ్రీరామచరణ కమలభక్తే కారణ మని చెప్పబడింది.

1) తారకయోగాన్ని సీతాదేవి ఉపదేశించింది.

2) సాంఖ్య అమనస్కయోగాల్ని శ్రీరాముడు ఉపదే శించాడు.

### తారకవివరణ

తారకయోగం యోగోపనిషత్తులలో ముఖ్యంగా అద్వయ తారక, మండలబ్రాహ్మణోపనిషత్తులలో, రాజయోగంయొక్క పూర్వార్ధంగా వర్ణింపబడింది.

'తారయతీతి తారకం, తరణోపాయమ్' అని చెప్ప బడింది. ప్రకృతిపురుషవివేకసంభవమైన జ్ఞానాన్ని, తారక మని యోగదర్శనం చెప్పడం అందరికీ తెలిసినవిషయమే.

తారకయోగం పూర్వోత్తరవిధానంవల్ల, తారకామనస్కం అనబడుతోంది. దీన్నే మూర్తితారక మనీ, అమూర్తితారక మనీ

అంటారు. మూలాధారం ఆదిగా– ఆజ్ఞాచక్రపర్యంతం, ఆయాచక్రాలకు అధిదేవతలైన గణపతి మొ॥వారిమూర్తుల దర్శనం కలిగించేది మూర్తితారకం. ఆజ్ఞాచక్రం తర్వాత, సహస్రారపర్యంతం, మూర్తిరహితతేజోమయబ్రహ్మదర్శనం కల్గించేది అమూర్తితారకం.

తారకయోగం ముఖ్యంగా హఠయోగ సంబంధమైంది. పారమార్థికంగా యోగం ఏకమైనా అది మంత్ర, లయ, హఠ, రాజయోగభేదాల, సాధనవైచిత్ర్యాన్ని, పురస్కరించుకొని శోభిస్తూంది.

ప్రాణం, చిత్తానికి వాహక మని యోగు లంటారు. వాయువుయొక్కచలాచలత్వాలపైన్నే చిత్తంయొక్క చలాచత్వాలు ఆధారపడిఉంటాయి. కాబట్టి చిత్తనిశ్చలత్వానికి ప్రాణాన్ని నిరోధిం చడం ముఖ్యం.

చిత్తజయానికి ప్రాణజయం హేతు వవడంచేత చిత్తశుద్ధికారకఅభ్యాసయోగమైన ఈ తారకయోగంలో ప్రాణాయామం ప్రాధాన్యం వహిస్తున్నది. ప్రాణ+ఆయామం= ప్రాణాన్ని నిగ్రహించుకోవడం అని అర్థం. ప్రాణాయామం ప్రాకృత, వైకృత, కుంభకా లని మూడురకాలు. స్వభావనియత రేచక పూరక కుంభక క్రమాలచేత 21600 సంఖ్యతోడి, అజపా (హంస) మంత్రానుష్ఠానం మంత్రయోగం, ప్రాకృతం. ప్రాణమునందు అపానాన్ని, అపానమందు ప్రాణాన్ని లయింపజేయడం లయయోగ మని గురుమూర్తికవి వివరించాడు. ఇది ప్రయత్నపూర్వకంకావడంవల్ల వైకృతప్రాణాయామ మనబడుతుంది.

ప్రాణాయామశబ్దంలో ఉన్న ప్రాణశబ్దానికి శ్వాసం, ఉచ్ఛ్వాసం అనే క్రియ లని అర్థం. కానీ, ప్రాణ మని, అపాన మని భేదం చెప్పినపుడు ప్రాణ మనగా పైకి, బయటకు బోవు వాయు వని, అపాన మనగా లోపలికి పోయేశ్వాస అని అర్థం గ్రహించాలి. అపానమందు (లోపలికి తీసికొనేశ్వాసయందు) ప్రాణాన్ని (ఉచ్ఛ్వాసము) హోమం చేస్తే పూరక మనే పేరుగల ప్రాణాయామ మవుతుంది. ప్రాణమందు, అపానాన్ని హోమమొనర్చిన రేచక ప్రాణాయామ మనబడుతుంది. ప్రాణాపానాలు రెండూ నిరోధింపబడితే కుంభకప్రాణాయామ మనబడుతుంది. కేవలకుంభకం హఠయోగ మనబడుతుంది.

పూరకరేచకాలు లేనికుంభకం కేవలకుంభక మనబడుతుంది. కేవలకుంభకాన్ని వాసిష్ఠసంహితలో శంకరుడు ప్రశంసించాడు. లక్ష్యాలు, ప్రాణాయామం, నాదబిందుకళా సాక్షాత్కార హేతువులు కాబట్టి ముద్రల్నిగురించి తెలుసుకుందాం–

**వరుసన్ ఖేచరి యన భూ**
**చరి యన మధ్యమ యనంగ షణ్ముఖి యనఁ గా**
**వర శాంభవి యనఁగల వీ**
**ధరలోపల ముద్ర లైదు తారకమునకున్ (సీ.రా.సం.1-104)**

ఖేచరి అంటే కనులు మూసైనా, విచ్చియైనా భ్రూమధ్యంలో దృష్టి నిలిపి, ధ్యానించడం. భూచరి అనగా నాసికాదృష్టి కలది.

### మధ్యమ

నాసికామధ్యమున అరమోడ్పుకన్నులతో దృష్టి నిశ్చలంగా నిలిపి, మీద ఉండే నుదుటిని చూడడం.

### షణ్ముఖి

రెండుబొటనవ్రేళ్లతో రెండుచెవుల్ని, రెండుతర్జనీ మధ్యమాలతో రెండుకన్నుల్ని, రెండు అనామికలతో రెండు ముక్కు రంధ్రాల్ని మూసి, భ్రూమధ్యమున నిశ్చలదృష్టి గల్గి నాదబిందు కళల్ని గాంచుట షణ్ముఖీముద్ర.

### శాంభవి

అంతర్లక్ష్యం గల్గి, పైకి ఇంచుకయు చలింపనిదృష్టి కల్గి, వాయుచలనమనోవికారాలు లేకుండడం శాంభవీముద్ర. ఇక నాదబిందుకళలస్వరూపాన్ని పరిశీలిద్దాం –

అన్నమయ్య ప్రాణమయమనోమయకోశాలకు అగ్రభాగంలో ఉన్న విజ్ఞానమయకోశమే – బుద్ధితత్త్వమే–బిందు వని చెప్పబడుతుంది. ఈ బిందువునందు ప్రతిఫలించిన పరమాత్మ కళయే చిత్కళ; ప్రాణవాయువులయొక్క ఘోషయే దశవిధప్రణవ నాదాలు.

**సీ॥ అట్టి శ్రీరామతత్త్వాభాసకళతోడ**
**నెనసిన యా బిందు వెల్లప్రొద్దు**
**మార్తాండచంద్రాగ్నిమండలాన్వితసూక్ష్మ**
**చక్షురగ్రమునకు సరి నధోము -**

ఖంబుగా నున్న హృత్కమలంబుతో బహి
ర్ముఖమై స్వవిషయానుభూతిఁ దగిలి
మానక పవమాన మానసేంద్రియదేహ
సంగతి నూరక సంచరించు
................................ (సీ.రా.సం.1-169)

### చిత్కళామండలములు

కన్నులు మూసి, భ్రూమధ్యమండలి ఆజ్ఞాకమలంలో దృష్టి నిల్పి ధ్యానిస్తే, చిత్తాకాశరూపమైన ఆకాశపంచకం (వియన్మండలం) యోగికి తోస్తుంది. (సీ.రా.సం.1-137-139) తర్వాత తమోమండల, మేఘమండల, విద్యున్మండల, తారా మండల, జ్యోతిర్మండల, సూర్యమండల, చంద్రమండల, వహ్ని మండల, హిరణ్యమండలాలు కన్పిస్తాయి. మండల మంటే సమూహ మని అర్థం.

ఈ విషయాన్ని గురుమూర్తిగారు ***మందాకినీసుధా సందోహదుగ్ధాబ్ధి...*** అనే సీసపద్యంలో వర్ణించారు.

### అంతర్యాగనిరూపణం

చిచ్చంద్రమండల సాక్షాత్కారానంతరం, వహ్నిమండల సాక్షాత్కార మవుతుంది. అనాదికాలంనుండి చేసిన సమస్తకర్మలు, ఆ అగ్నియందు భస్మమవుతాయి. యోగి, ఈ అగ్నియందు, అంతర్యాగంచేసి, సౌఖ్యరస మనే సోమపాన మొనర్చి, ఆధ్యాత్మికంగా సోమయాజి అవుతాడు. (సీ.రా.సం.1-154).

### అద్వైతసిద్ధి

ఈదర్శనంవల్ల, ప్రకృతిరూపాలైన నాదబిందుకళ లన్నిటినీ అతిక్రమించి, వాటి కాధారమైన పరమాత్మయందు అధివృత్తిని పొందినయోగి, సూర్యాతపంమధ్యనుండే దీపకళికలాగా జ్ఞానేంద్రియకర్మేంద్రియపవనమనోవృత్తు లన్నీ విల యించిపోగా, అద్వైతస్థితి నొంది, సర్వవికారహితుడై, నిర్వికల్పానందస్వరూపుడై, బాహ్యాభ్యంతరాలు లేని నిరుపమరాజ యోగతురీయసమాధిని పొందుతాడు. (సీ.రా.సం.1-160)

### తారకయోగసంగ్రహం

సీతాదేవి, తారకయోగాన్ని మళ్లీ సంగ్రహించి, ఈ విధంగా ఉపదేశించింది.

సీ॥ పరమహంసంబు రే పగలు చింతింపగ
బిందు విందదుఁ గంపింపకుండు
దశవిధప్రణవనాదము లాలకింపంగఁ
దుదను ఘంటానాద మొదవి మ్రోయు
బహులక్ష్యలక్ష్యముల్ పరికించి చూడంగ
సురుచిరంబై స్వయంజ్యోతి యొప్పు
యామద్వయంబు యోగారూఢుడై వాని
ధ్యానింపఁ దన్మయత్వంబు గలుగు

తే॥ నట్టియున్మనియందు మనోఽనిలములు
వివిధవిషయేంద్రియములతో విలయమొందు
నిదియె సూ సర్వవేదాంతవిదితపరమ
రాజయోగంబు దేవతారాజివినుత! (సీ.రా.సం.1-192)

ప్రతిదినం ఈ తారకయోగాన్ని రెండుజాములు అభ్యసిస్తే నిర్మలచిత్తునికి, ఆరుమాసాలలో, మందబుద్ధికి ఒక సంవత్సరంలో కేవలమూఢాత్మునికి 12 సంవత్సరాలలో ఈ తారకసిద్ధి అవుతుం దని సీతాదేవి తనఉపదేశానికి స్వస్తి పలికింది.



# కార్తికదీపం

కె. మల్లికార్జున

మనభారతదేశం వేద భూమి, పుణ్యభూమి, కర్మభూమి, భక్తితత్త్వానికి పుట్టినిల్లు, మనపూజా విధానంలో మనకున్నరోజులు, తిథులు, వారాలు, నక్షత్రాలు, మాసాలు అన్నీ పూజనీయాలే! అటువంటివాటిల్లో అత్యంతమహిమాన్వితమైంది కార్తికమాసం.

చాంద్రమానంలో ఎనిమిదవమాసం కార్తికమాసం. ఆధ్యాత్మికంగా ఎంతో విశేషమైంది. ఈ మాసంలోని పౌర్ణమినాడు చంద్రుడు కృత్తికానక్షత్రానికి దగ్గరగా ఉండటంచేత ఈ మాసం కార్తికమాసంగా పేరొందింది. శరదృతువులో రెండవమాసమైన ఈ కార్తికానికి 'కౌముదీమాసం' అనే పేరుకూడా ఉంది. 'కౌముది' అంటే 'వెన్నెల' అని అర్థం.

'న కార్తికసమో మాసః' అంటూ కార్తికమాసంతో సమానమైన మాసం లే దని స్కాందపురాణం చెబుతోంది. జన్మజన్మల్లో చేసినపాపాలను పటాపంచలు చేసి, మోక్షాన్ని ప్రసాదించేమాసంగా, అనంతమైన పుణ్యఫలాలను కలిగించే మాసంగా చెప్పబడుతున్న కార్తికమాసం శ్రీమహావిష్ణు పరమశివులకు ఇద్దరికీ అత్యంతప్రీతికరమైంది. ముప్పైపుణ్యదినాలు కలిగిన ఈ మాసంలో ఆచరించాల్సిన విధులు పురాణగ్రంథాలలో వివరించబడ్డాయి. ముఖ్యంగా స్నానజపాదులు, దీపారాధన, దీపదానం, పూజలు, వనభోజనాలువంటివి ఈ మాసంలో ఆచరించాల్సిన విధులుగా పురాణగ్రంథాలలో వివరించబడ్డాయి. వీటిల్ని ఈ మాసంలో ఆచరించడం వల్ల ఆధ్యాత్మికఫలితాలతో పాటు ఆరోగ్యఫలితాలుకూడా సిద్ధిస్తాయి.

కార్తికమాసంలో శివారాధన విశేషఫలితా న్నిస్తుంది. ఈ నెలలో 'నక్తవ్రతాన్ని' అంటే పగలు ఉపవసించి, రాత్రి భుజించడం చేస్తూ ప్రదోషసమయంలో (సాయంసంధ్యాసమయంలో) శివుణ్ణి ఆరాధించడంవల్ల శివానుగ్రహం లభించడంతో పాటు సర్వదేవతలనూ పూజించినఫలితం లభిస్తుం దని పురాణాలు చెబుతున్నాయి. ఈ నెలలో పరమశివుణ్ణి మారేడుదళాలతో అర్చించడంతో పాటు, తుమ్మిపూలతో పూజించడం విశేషఫలదాయకం. కార్తికమాసంలో నిత్యం విష్ణుదేవుణ్ణి తులసీదళాలతో అర్చించడం మహాఫలదాయకం. ఈ నెలలో విధిగా అవిసెపూలతో విష్ణువును పూజించాలి.

కార్తికవ్రతాచరణంలో కార్తికస్నానం ముఖ్యమైంది. ఈ మాసంలో తెల్లవారు జాముననే స్నానమాచరించాలి. ఈ మాసంలో నదీస్నానం ఉత్తమమైందిగా చెప్పబడుతుంది. అందుకు అవకాశం లేనిస్థితిలో గంగా, గోదావరివంటి పుణ్యనదులను స్మరించుకుంటూ కాలువల్లోగానీ, బావులవద్దగానీ, చెరువులో గాని స్నానం చేయాలి. కార్తికస్నానాలను ఆచరించడంవల్ల కాయిక, వాచిక, మానసికదోషాలు తొలగిపోతా యని పురాణాలు చెబుతున్నాయి.

## కార్తికమాసం - దీపప్రాశస్త్యం




'దీపం' జ్ఞానానికి, సద్గుణసంపత్తికి, ఆనందవికాసానికి ప్రతీక. మనసంస్కృతిలో దీపాన్ని పరబ్రహ్మస్వరూపంగా భావించి, పూజిస్తాం. 'దీపం' వెలుగుకు, విజ్ఞానానికి చిహ్నం. అజ్ఞానం అనే అంధకారం జ్ఞానం అనే– దీపకాంతితో తొలగిపోతుంది.

ప్రతిశుభకార్యానికీ ముందు జ్యోతిని వెలిగించడం సంప్రదాయం. దేవాలయాలలో నిత్యం దీపారాధన జరుగుతూంటుంది.

దైవసన్నిధిలో నిరంతరం వెలిగేదీపాలను 'అఖండజ్యోతులు' అంటారు. మలిసంధ్యనుండి తొలిసంధ్య దాటేవరకూ ఏ ఇంటిలో దీపం వెలిగితే, ఆ ఇంటిలో లక్ష్మీదేవి నిరంతరం కొలువై ఉంటుంది.

భగవంతునికి భక్తులు సమర్పించే షోడశోపచారాలలో దీపసమర్పణకూడా ఒకటి. దీపాన్ని వెలిగించినతర్వాతనే దేవతార్చనను ప్రారంభిస్తాం. జ్యోతిఃస్వరూపంగా భావించే ఈ దీపం సిద్ధశక్తులను ప్రసాదిస్తుం దని అంటారు.

దీపంకాంతి త్రిమూర్తులకు ప్రతీక, దీపంలో అంత ర్లీనంగా కన్పించే నీలకాంతి స్థితికారకుడైన విష్ణుమూర్తికీ, తెల్లనికాంతి లయకర్త పరమశివునికీ, ఎరుపుకాంతి సృష్టికర్త బ్రహ్మదేవునికీ సంకేతం. అదేవిధంగా ఈ దీపకాంతి విద్య, శక్తి, ఐశ్వర్యాలను ప్రసాదించే సరస్వతి, గౌరీ, లక్ష్మీదేవులకు ప్రతీక లనికూడా చెబుతారు.

దీపం పంచబ్రహ్మాత్మకం. దీపం క్రిందిభాగం- బ్రహ్మ, స్తంభం-విష్ణువు, ప్రమిద-శివుడు. దీపతైలం నాదం, వత్తి బిందువు. అట్టి దీపాన్ని కార్తికమాసంలో దీపారాధన, దీపదానం చేయడం ఎంతో ఫలప్రదం!

**దీపజ్యోతిః పరబ్రహ్మ । దీప స్సర్వతమోఽపహః।**
**దీపేన సాధ్యతే సర్వమ్ । సంధ్యాదీప నమోఽస్తు తే॥**

అంటూ దీపాన్ని వెలిగించినఅనంతరం దీపానికి నమస్కరించడం మనఆచారం. అంతేకాకుండా సాయం సమయంలో దీపాన్ని దర్శిస్తూనే -

**దీపజ్యోతిః పరబ్రహ్మ దీప జ్యోతిర్ జనార్దనః।**
**దీపేన హరతే పాపం। సంధ్యా దీప నమోఽస్తు తే॥**

అనే శ్లోకాన్నీ పఠించా లని శాస్త్రవచనం.

నిత్యం దీపాన్ని వెలిగించడం, ఆరాధించడం, దీపాన్ని కార్తికమాసంలో వెలిగించడం, నదిలో దీపాలను వదలడం, ఆకాశదీపాలను వెలిగించడం, దీపదానం చేయడంవంటి ఆచారాలను పాటించడం అత్యంతపుణ్యప్రద మైన కార్యాలుగా పురాణాలు పేర్కొన్నాయి.

కార్తికమాసంలో దీపారాధనకు ఎంతో ప్రాముఖ్యం ఉంది. కార్తికమాసమంతా ఇంటిముంగిట- ద్వారానికి ఇరు వైపులా దీపాలను వెలిగించడం మనఆచారం. అలాగే సాయం కాలం కార్తికదీపాలను శివాలయాల్లోనూ, వైష్ణవాలయాల్లోనూ, గోపురంవద్ద, దేవునిసన్నిధానంవద్ద, ఆలయప్రాంగణంవద్ద, ఇంటిలోని తులసికోటవద్ద, దీపాలు వెలిగించవచ్చు. ఈ దీపారాధనవల్ల కష్టాలు నివారింపబడటమే కాకుండా- ఐశ్వర్యం లభిస్తుంది. ఇంకా సర్వపాపాలు తొలగిపోయి, వైకుంఠప్రాప్తి కలుగుతుంది. ముఖ్యంగా స్త్రీలకు ఈ దీపారాధన సౌభాగ్యకరం. కార్తికదీపాలను ఆవునెయ్యితో వెలిగించడం ఉత్తమం. ఇతరులు వెలిగించిన దీపాన్ని ఆరిపోకుండా చూడడంకూడా ఉత్తమమైన ఫలితా న్నిస్తుంది. కార్తికపౌర్ణిమనాడు కానీ, సోమవారాలలోగానీ లేకుంటే మరేరోజులలోనైనా సరే సాయంకాలంపూట శివా లయాలలో ఉసిరికాయపైన ఆవునెయ్యితో తడిపిన వత్తులను ఉంచి, దీపం వెలిగించడం అత్యంతశ్రేష్ఠం. అరటిదొప్పలలోగానీ, ఆకుమీదగానీ దీపాల్ని ఉంచి, నదులలో వదలడంకూడా పుణ్యప్రదం!



ఈమాసంలో ముప్పైరోజులు దీపంపెట్టలేనివారు కనీసం శుద్ధద్వాదశి, చతుర్దశి, పూర్ణిమరోజుల్లో దీపాలు పెట్టాలనీ, అందులోనూ ద్వాదశినాడు పెట్టేదీపంవల్ల వైకుంఠప్రాప్తి కలుగుతుం దని పురాణకథనం. ఆవునెయ్యితో దీపం వెలిగించడం ఉత్తమం.

ఈ మాసంలో దీపారాధనే కాక, దీపదర్శనంకూడా ఎంతో పుణ్యదాయకం! కార్తికదీపదర్శనంవల్ల జాతిభేదం లేకుండా మానవులందరికీ, ఇంకా పక్షులు, కీటకాలు, దోమలు, జలచరాలైన చేపలు మొదలైనవాటికీ, వృక్షాలువంటివికూడా ముక్తి నొందుతా యని పురాణాలు పేర్కొంటున్నాయి.

కార్తికమాసంలో చేసేదీపదానం ఎంతో మహిమాన్వితంగా చెప్పబడింది. దీపదానంవల్ల ఉత్తమఫలితాలు కలుగుతా యని అగ్నిపురాణంలోని "లలితకథ" విశదపరుస్తుంది.

## జ్వాలాతోరణోత్సవం

శివాలయాలలో కార్తికపౌర్ణమినాడు జ్వాలాతోరణోత్సవం చాలావిశేషంగా జరుపుకొంటారు. శివపార్వతులను పల్లకీలో ఉంచి, జ్వాలాతోరణంక్రింద త్రిప్పుతారు. ఈ జ్వాలాతోరణోత్సవం అమల్లోకి రావడంవెనుక అనేకపురాణగాథలు ప్రచారంలో ఉన్నయి. ఈ ఉత్సవం పార్వతిదేవితో ముడిపడి ఉంది. అమృతంకోసం దేవదానవులు కలిసి, క్షీరసాగరాన్ని మథించినప్పుడు, ముందుగా హాలాహలం వెలువడింది. ఆ హాలాహలాన్ని మ్రింగినశివుడు ఆగండంనుండి తప్పించుకొని బయటపడితే పార్వతి, జ్వాలాతోరణం క్రిందినుండి మూడు మారులు దూరివస్తా నని మ్రొక్కుకున్నదట.

**ప్రశ్నలు సంగ్రహంగా ఉండాలి !**

**సందేహాలు - సమాధానాల శీర్షిక క్రింద అడిగే ప్రశ్నలు ఒకటి రెండు పంక్తులలో ఇమిడేటట్లు సంగ్రహంగా ఉండాలి. వ్యక్తిగత మైన ప్రశ్నలు, అన్యమత ప్రసక్తి ప్రశ్నలు దయచేసి పంపకండి.**

**- ప్రధాన సంపాదకుడు**

అలాగే మరో కథ. శివుడు రాక్షససంహారానికి వెళ్లి, చాలారోజులు గడిచాయి. దాంతో పార్వతి తనభర్త మరణించాడని తలచి, కార్తికపూర్ణిమనాడు ప్రాణత్యాగం చేయడానికి పూనుకొన్నది. చితి పేర్చింది. ఇంతలో శంకరుడు వచ్చాడు. దాంతో ఆ చితిని జ్వాలాతోరణోత్సవంగా మార్చింది– పార్వతి. ఇది శివుడిదృష్టిదోషపరిహారార్థం!

దేవాలయాలలో మనకు దీపస్తంభాలు, వృక్షదీపాలు, వ్రేలాడేదీపాలు ఉంటాయి. కార్తికమాసంలో వీటిలో దీపాలను వెలిగిస్తారు. ప్రతిదీపాకృతి కనువిందు చేస్తుంటుంది.

కార్తికమాసంలో తులసి (పూసల) మాల ధరించడం ఉత్తమం. ఈ మాలను విష్ణుదేవునికి అర్పించి తులసీమాతను, విష్ణుదేవుణ్ణి స్మరిస్తూ, ధరించాలి.

ఈ మాసంలో ఉసరికచెట్టునీడలో విష్ణుస్వరూపుడైన కార్తికదామోదరుణ్ణి అర్చించి, సాలగ్రామాన్ని దానంచేయడం ఎంతోపుణ్యాన్ని కలిగిస్తుంది. అదేవిధంగా ఈ నెలలో చేసే అన్నదానంకూడా విశేషఫలితాలను ఇస్తుంది.

ఈ మాసంలో ఉల్లి, వెల్లుల్లి, గుమ్మడి, వంగ, ఇంగువ, శనగ, పెసర, అలసందులు వంటి పప్పుదినుసులు మొదలైనవి తినరా దని శాస్త్రం!

కార్తికపౌర్ణిమ సాయంసమయంలో ప్రతిఇంటివాకిలి ముందు ప్రమిదలలో దీపాన్ని వెలిగించడం మనసంప్రదాయం. ఆరోజు ఎవరు ఈ దీపంలో ఆవాహనచేసినదేవతామూర్తిని స్మరిస్తూ, దీపదర్శనం చేస్తారో, ఆదీపజ్యోతి ఎవరిపై ప్రసరిస్తుందో, వారు పాపవిముక్తులై, పునర్జన్మలేనిస్థితిని పొందుతారు.

మనలోని అజ్ఞాన మనేచీకటిని తొలగించుకొని, జ్ఞాన మనే దీపాన్ని వెలిగించుకోవా లన్నదే ఈ దీపారాధన మనకిస్తున్న సందేశం! కార్తికమాసంలో సువాసినులు 'ఆకాశదీపం' వెలిగిస్తారు. ఆ సమయంలో లక్ష్మీదేవిని "ఓం లక్ష్మ్యైనమః" అని స్మరించి, పూజిస్తారు. దీపలక్ష్మీపూజవల్ల అమ్మవారిఅనుగ్రహం కలిగి, అష్టైశ్వర్యాలు లభిస్తాయి. అన్నికోరికలు నెరవేరుతాయి. మానవుడు భౌతికంగా, మానసికంగా పవిత్రుడు కావడానికి కార్తికమాసం ఎంతో దోహదకారి!

# డయల్ యువర్ ఈ.ఓ. కార్యక్రమం - 04-10-2013

## భక్తుల సమస్యలు - సూచనలు - ఈ.ఓ. గారి ప్రతిస్పందన - కార్యప్రణాళిక

*(ప్రతినెల మొదటిశుక్రవారం తిరుమల తిరుపతి దేవస్థానం కార్యనిర్వహణాధికారితో **'డయల్ యువర్ ఈ.ఓ.'** కార్యక్రమంద్వారా భక్తులు ఫోనులో మాట్లాడేఅవకాశం ఏర్పాటుచేసింది. వివిధప్రాంతాల భక్తులు కార్యనిర్వహణాధికారిగారికి చేసినసూచనలు, వివరాలు కొన్ని, ఇక్కడ పొందుపరుస్తున్నాం.)*

**కొండమీద తిలకధారణ (తిరునామము) యాత్రికులు తప్పకుండా ధరించా లని స్వయంసేవకులతో పెట్టిస్తున్నారు. దానితోపాటు కాలినడకన వచ్చేభక్తులకుకూడా అలిపిరి, శ్రీవారిమెట్టు దగ్గర తిరునామము యాత్రికులు పెట్టుకోవడానికి వీలుగా ఏర్పాటు చెయ్యండి. కనీసం ఈ బ్రహ్మోత్సవాలలోనైనా ఏర్పాటు చేయండి.** *- మణి, తిరుపతి.*

**కార్యనిర్వహణాధికారి :** మంచి ఆలోచన తప్పకుండా అమలు పరుస్తాం.

**రూ. 50/- టోకన్లను అన్ని జిల్లాలోని కౌంటర్లలో ఏర్పాటు చెయ్యండి.** *- ప్రభాకరరెడ్డి, హిందూపూర్.*

**కార్యనిర్వహణాధికారి :** సుమారు 86 ఇ-దర్శన కౌంటర్లలో 60 రోజులకు ముందుగా పొందుటకు 9000 టికెట్లను మంగళ, బుధవారాలలో ఏర్పాటు చేయడమైనది. అంతకు మించి చేయడం కష్టం.

**తిరుపతి బస్టాండ్, రైల్వేస్టేషన్లనుండి అలిపిరివరకు బస్సు సౌకర్యం లేదు. ఆ మార్గంగా వెళ్ళేబస్సులలోకూడా యాత్రికులను ఎక్కించుకోవడం లేదు.** *- శ్రీనివాస, కోలారు.*

**కార్యనిర్వహణాధికారి :** ఆర్.టి.సి. యాజమాన్యంవారితో మాట్లాడి, తగుచర్యలు తీసుకొంటాము.

**తిరుమలనుండి తిరుపతికి రావడానికి రాంబగీచ దగ్గర బస్సులు అధికంగా ఉన్నా టిక్కెట్‌కౌంటరు ఒక్కటే ఉండడంవల్ల యాత్రికులకు ఇబ్బందిగా ఉంది. మరిన్ని కౌంటర్లు ఏర్పాటు చేస్తే బాగుంటుంది.** *-బాలవేంకటేశ్వరులు, ఇండోరు.*

**కార్యనిర్వహణాధికారి :** ఆర్.టి.సి. వారితో చర్చించి, చర్యలు తీసుకొంటాము

**సుమారు 500 కి.మీ. దూరంనుండి ప్రతిసంవత్సరం పాదయాత్రగా కొండకు వస్తున్నాము. అయితే చిత్తూరులోని తి.తి.దే. కళ్యాణమండపంలో సేద తీర్చుకోవా లంటే అనుమతించడం లేదు. అలాగే శ్రీనివాసమంగాపురంలోకూడా వసతి ఏర్పాటు లేదు.** *- సెల్వరాజు, కరూరు.*

**కార్యనిర్వహణాధికారి :** చిత్తూరు కల్యాణమండపంలో ఏ కార్యక్రమాలు లేకుంటే తప్పకుండా వసతి కల్పిస్తారు. ఆవిధంగా చెయ్యమని అధికారులకు మరోమారు ఆదేశాలు జారీ చేస్తాం. శ్రీనివాసమంగాపురంలోకూడా వసతి కల్పించ మని అధికారులకు ఆదేశాలు జారీచేస్తాము.

**కాలిబాటలలో తినుబండారాలు అధికధరలకు అమ్ముతున్నారు. తి.తి.దే. వారు అక్కడక్కడా ప్రసాదాలు ఇచ్చేటట్లు ఏర్పాటు చెయ్యండి.** *- బాబయ్య, కడప.*

**కార్యనిర్వహణాధికారి :** నియంత్రిస్తాం. కాలిబాటలో ఉచితంగా తి.తి.దే. వారు యాత్రికులకు అన్నప్రసాదాలను ఇస్తున్నారు.

**1. అలిపిరి తనిఖీ కేంద్రంలో వయోవృద్ధులు, అంగవికలులు, అనారోగ్యంగా ఉన్నవారిని తనిఖీకొరకు వారిలగేజి తీసుకొని బస్సుదిగి వెళ్ళి, ఆ తర్వాతబస్సులో తిరిగి ఎక్కడం చాలా ఇబ్బందిగా ఉంది. అటువంటివారికి కొంత సడలింపు ఇస్తే బాగుంటుంది.**

**2. ఆలయంలో తోపులాటవలన వయస్సుమళ్ళిన వారికి చాలా ఇబ్బందిగా ఉంది.** *- దుర్గ, హైదరాబాదు.*

**కార్యనిర్వహణాధికారి : 1.** భద్రతదృష్ట్యా అందరిని తనిఖీ చెయ్యవలసి ఉన్నది. వారి లగేజీలను తీసుకెళ్ళడానికి, శ్రీవారి సేవకులను ఏర్పాటు చేస్తాము. మరి వీలుకానివాళ్ళు ఉంటే వారిని బస్సులోనే ఉంచి, తనిఖీ చేయవలసిందిగా భద్రతా సిబ్బందికి ఆదేశాలు జారీచేస్తాము.

**2.** రద్దీ ఎక్కువగా ఉన్నప్పుడు ఇలా జరిగేందుకు వీలుంది. అక్కడ పనిచేసే సిబ్బందికి వీలైనంతవరకు ఇటువంటివి పునరావృతం కాకుండా ఉండేటట్లు చూడ మని తెలుపుతాము.

**కొండకు వెళ్ళే ప్రైవేటు వాహనాలవాళ్ళు అధికంగా డబ్బులు వసూలు చేస్తున్నారు. మీరు రూ. 60/- మాత్రమే ఇవ్వండి అని బోర్డులు పెట్టినా, ఎక్కువగా వసూలు చేస్తున్నారు.** *- ధనంజయ, చిత్తూరు.*

**కార్యనిర్వహణాధికారి :** చర్యలు తీసుకొంటాము.

## కదంబం

### అష్ట అర్చన విగ్రహాలు

1) శైలి - శిలావిగ్రహాలు
2) దారుమయీ - కఱ్ఱ విగ్రహాలు
3) లౌహి - లోహ విగ్రహాలు
4) లేఖ్య - లిఖింపబడినవి
5) లేప్య - లేపనము (రంగులతో) చేయబడినవి
6) సైకతి - ఇసుకతో చేయబడినవి
7) మృణ్మయి - మట్టితో చేయబడినవి
8) మణిమయి - మణులతో చేయబడినవి

## పిల్లలూ జతచేయండి!!

| | |
|---|---|
| 1) శ్రీరామచంద్రుడు | అ) కృతయుగం |
| 2) శ్రీకృష్ణుడు | ఆ) త్రేతాయుగం |
| 3) శ్రీవేంకటేశ్వరస్వామి | ఇ) ద్వాపరయుగం |
| 4) కూర్మావతారం | ఈ) కలియుగం |

జవాబులు:
1-(ఆ); 2-(ఇ); 3-(ఈ); 4-(అ)

## మీకు తెలుసా?

1) హనుమంతుని తల్లి ?
2) భీష్ముడితండ్రి ఎవరు?
3) కౌరవులచెల్లెలు ఎవరు?
4) కౌరవ, పాండవుల బాల్యగురువు ఎవరు?
5) ఆదిత్యహృదయాన్ని రాముడికి ఉపదేశించిన దెవరు?
6) భాగీరథి అని ఏ లోకంలో ఉన్న గంగకుపేరు?
7) సంస్కృతంలో పంచతంత్రాన్ని చెప్పిం దెవరు?

జవాబులు:
1) అంజనాదేవి
2) శంతనుడు
3) దుస్సల
4) కృపాచార్యుడు
5) అగస్త్యుడు
6) పాతాళలోకంలో..
7) విష్ణుశర్మ

## కనుక్కోండి...!

ఈ అక్షరాలతో ఒక 'సూక్తి' వస్తుంది.

సా సే ద ప జీ న్ని స పు ధ కా తా నా ర్శిం స్త గా లు వి లు జే మ గ్రం

జవాబు: పుస్తకాలు జీవితాన్ని సమగ్రంగా దర్శింపజేసే సాధనాలు

## ఈ పద్యం.. మీ కోసం..

**ఉ॥ దాసిన చుట్టమా శబరి? దాని దయామతి నేలినావు, నీ**
**దాసునిదాసుఁడా గుహుఁడు? తావకదాస్య మొసంగినావు, నేఁ**
**జేసిన పాపమా? వినుతి చేసినఁ గావవు, కావు మయ్య! నీ**
**దాసులలోన నే నొకఁడ, దాశరథీ! కరుణాపయోనిధీ!**

భావం- దయాసముద్రుడవైన ఓ దశరథరామా! ఆటవికజాతిలో జన్మించిన శబరి నీకు దగ్గరిబంధువా? కాదే! మరి ఆమెపై దయగల్గి మోక్ష మిచ్చినావు. పడవ నడిపేగుహుడు నీ దాసానుదాసుడా? కాదే! అతనికి నీ సేవాభాగ్యం ప్రసాదించినావు. మరి నేను ఏ పాపంచేశానో తెలీదు. ఎంతగా ప్రార్థించినా నన్ను మాత్రం కాపాడడం లేదు. స్వామీ! నేను నీసేవకుల్లో ఒకణ్ణేకదా! నన్నూ కాపాడు శ్రీరామా!

బాలప్రబోధం



# నిత్యకల్యాణం పచ్చతోరణం

పి. హేమచంద్రబాబు

ఆ వేళ నాల్గవశ్రావణశనివారం. తాతయ్య పూజా పునస్కారం పూర్తిచేసి

**వేంకటాద్రి సమంస్థానం బ్రహ్మాండే నాస్తి కించన,**
**వేంకటేశసమో దేవో న భూతో న భవిష్యతి.**

– అని సన్నగా చెబుతూంటే; "ఏమిటి తాతయ్యా! నీలో నీవు గొణుక్కుంటున్నావు" అన్నాడు – రాము.

"అది కాదురా! అండపిండబ్రహ్మాండాదులలో వేంకటాద్రికి సమానమైన పవిత్రక్షేత్రం లేనేలేదు. ముక్కోటి దేవతలున్నా వేంకటేశ్వరునితో సమానమైనదేవుడు గతంలో లేదు. భవిష్యత్తులోనూ ఉండదు" అని అన్నారు.

"అలాగైతే తాతయ్యా! కర్నాటంలో వీరశైవం ఎక్కువ కదా! ఆ ప్రాంతంవాళ్ళు ఎవరైనా స్వామిని సేవించి తరించారా?" అని కుతూహలంతో అడిగింది– జానకి.

'అది కాదమ్మా! మనకంటే కన్నడిగులకే స్వామి అంటే భక్తి ఎక్కువ. వారిదృష్టిలో "దేవరందరె తిమ్మప్ప– గురువందరె మంత్రాలయా రాఘవప్ప' అన్నారు.

"ఏమిటి తాతయ్యా! మమ్మల్ని తిట్టుతున్నావు" అని నవ్వుతూ అడిగాడు– రాము.

"అది కాదురా! కన్నడంలో దేవు డంటే తిమ్మప్ప ఒకడే అని, గురు వంటే మంత్రాలయ రాఘవేంద్రస్వామి ఒకడే అని పై మాటలకి అర్థం".

"అదికాదు తాతయ్యా! తిమ్మప్ప అంటుంటేను" సన్నగా నవ్వాడు.

"ఓ! అదా నీ సందేహం? తిమ్మప్ప అంటే కోతికాదు. తిరుమల + అప్ప = తిరుమలప్ప. అంటే తిరుమల మీద ఉన్న స్వామి అని అర్థం. ఒకప్పుడు కొండల్లో కోతులెక్కువ కనుక తిమ్మప్ప అంటే ఆంజనేయస్వామి అని రూఢి అయ్యింది. భగవంతునికి, భక్తునికి అభేదం కనుక శ్రీనివాసుడుకూడా తిమ్మప్ప అయిపోయాడురా. ఓరోరి తిమ్మప్పా" అన్నారు నవ్వుతూ తాతయ్య.

"తప్పమ్మా! ఇకపైన తిమ్మప్ప అనకు. అన్నా! నవ్వకు" గట్టిగా మందలించింది–యశోద. స్వామిపటంచూసి చెంపలేసుకొన్నాడు– రాము.

"తాతయ్యా! కన్నడిగులకు స్వామి అంత ఇష్టదైవమా? మరి స్వామిని సేవించినకన్నడభక్తు లెవరో చెప్పరూ?" అంది జానకి. "కాస్త ప్రసాదం తీసుకో తల్లీ! ఆ తరువాత తీరిగ్గా విందువుగాని" అని ప్రసాదం పంచిపెట్టాడు – తాతయ్య. అందరూ భక్తితో ప్రసాదం పుచ్చుకొన్నారు.



"కన్నడదేశంలో హరిదాసు లనేవారు ఎందరో ఉన్నారు. వారిలో వ్యాసరాయలు, పురందరదాసు, కనకదాసు చాలా

ప్రసిద్ధి పొందినవారు. వీరు ముగ్గురూ చాలాగొప్పవారు.” అని కాసేపు ఆగారు.

“తాతయ్యకు అందరూ గొప్పవాళ్ళే. మంచోళ్ళే” సీత చెవిలో ఊదాడు– రాము.

“ఓరే! ఏమిట్రా గొణుగుడు”

“అదిగాదు తాతయ్యా! మీకందరూ మంచివాళ్ళేనట అంది” – జానకి.

“ఆఁ ఆఁ రామూ! ఈ కథ విన్న తర్వాత నీవుకూడా చెబుదువులే వీరెంత గొప్పవాళ్ళో” అని.

“తాతయ్యా! రాముమాటలు పట్టించుకోకేం. కథ చెప్పూ” అని ప్రాధేయపడుతూ అంది జానకి.

“వ్యాసరాయ లంటే ఎవరనుకున్నావ్? పన్నెండు సంవత్సరాలు వేంకటేశ్వరస్వామిని పూజించిన మహానుభావుడు. కృష్ణదేవరాయలవారికి కుహుయోగం వస్తే తీర్చిన మహాను భావుడు. తనశిష్యుడైనపురందరదాసును ఘనంగా కీర్తించిన గురూత్తముడు.”

“పురందరదాసంటే నవకోటి నారాయణుడే కదా! మొన్న దాసులవారు హరికథ చెప్తుంటే విన్నాను. నవకోటి ధనరాశిని వదలిపెట్టి, హరిదాసుడైన మహాభక్తుడు.”

“కనకదాసంటే ఎవరు తాతయ్యా?”

“చెబుతా చెబుతా! కనకం అంటే బంగారం. కనక దాసు అంటే బంగారుకు దాసు దని కాదు. ఇల్లు త్రవ్వుతుంటే తిమ్మప్పకు బంగారం దొరికింది. ముం దతడు కనక నాయ కుడే. ఒక పెద్దపాళెగాడుకూడా! అయినా స్వామిఅనుగ్రహం వల్ల కనకనాయకుడు కనకదాసు అయ్యాడు. దాసుడైన తర్వాత కనకదాసు తిరగని ఊరు లేదు. కీర్తించని దేవుడు లేడు. ఆ దాసునికి ‘కాగినెల’ కర్నాటకంలోని ఆదికేశ్వరస్వామి, తిరుమల లోని తిమ్మప్పుడు ఆరాధ్యదైవం. తిమ్మప్పమీద ఆయన వ్రాసిన కీర్తన లెన్నో! ఎందుకోగాని ఏటేటా తిరుమలకు వెళ్ళే కనకదాసు ఓసారి తిరుమలకు వెళ్ళలేదు. భక్తు లెందరో కనిపించినా కనకదాసు కనబడకపోయేసరికి స్వామికి ఆందోళన కలిగింది. కనకదాసుకోసం కళ్ళింతచేసుకొని తిరుమలంతా గాలించాడు. అయినా కనకదాసు ఆచూకీ స్వామికి అంతుబట్టలేదు. సరాసరి కనకదాసు దగ్గరకే వెళ్ళాడు. అప్పుడు కనకదాసు అదమరచి నిద్రపోతున్నాడు.

“కనకా! ఎందుకయ్యా అలిగావు? తిరుమలకు నీవు రాలేదేమి? నీవు పిలిచినప్పుడల్లా నేను వచ్చానుగా! నీవు తిరుమల కొండకు వచ్చి, నా కల్యాణోత్సవాన్ని తనివితీరా తిల కించి, ఆనందించు” అన్నాడు – స్వామి.

తెల్లవారింది. కనకదాసు తిరుమలకేసి ప్రయాణం సాగించాడు.

ఈలోగా శ్రీనివాసుడు ఆలయధర్మకర్తలైన మహంతుల వారికి కనిపించాడు. “ధర్మకర్తలారా! ఈరోజు నా భక్తుడు కనక దాసు సుదూరప్రాంతంనుండి వస్తున్నాడు. ఆ భక్తునికి స్వాగత సత్కారాలు చేయండి. ఇది నా ఆజ్ఞ” అని చెప్పి, స్వామి అంతర్ధానమయ్యాడు.

మహంతులవారు మేళతాళాలతో తిరుమల ప్రధాన మంటపం దగ్గర కాచుక కూర్చున్నారు. భక్తులెందరో వస్తు న్నారు. పోతున్నారు. కనకదాసు ఎలా ఉంటాడో మహంతుల వారికి తెలియదు. స్వామికూడ పేరు చెప్పాడుగాని రూపురేఖల్ని చెప్పలేదు. మహంతులవారికి ఏం చేయాలో తోచలేదు. ఈలోగా భుజాన గొంగళి, పెరిగిన గడ్డం, చేతిలో తంబురాతో కనకదాసు వస్తున్నాడు.

మహంతులవారు కనకదాసు దగ్గరికి వెళ్ళి, మీరెక్కడి నుండి వస్తున్నా రని అడిగారు.

కనకదాసు ఒక్కసారి తేరిపార చూశాడు.

“ఎక్కడినుండేమిటి? వెళ్ళిపోయినవారికి వెనక, వచ్చే వారికి ముందూ ఉన్నాను” అంటూ తంబూరా మీటాడు.

"లోకంలో ఎవరికీ ఎవరూ హితులు కారు. తండ్రి హితు దందుమా? ప్రహ్లాదునికి ఎలాంటి తండ్రో! తల్లి హితాన్ని కోరుతుంది అని అందామా? కుంతి కర్ణునికి ఏం చేసింది? సోదరులు హితు లందామా? సుగ్రీవుడు చేసినపనేమిటి?

"లోకంలో ఎవరికీ ఎవరూ హితులు కారు. 'కాగినెలె' అనే ఊర్లోని ఆదికేశవు డొక్కడే హితుడు" అనే అర్థం వచ్చే పాట పాడుతూ వెళుతుంటే ఎవరో పిచ్చివా డనుకొన్నారు.

కల్యాణోత్సవ సమయం దగ్గరపడడంతో కనకదాసు ప్రయాణం మానుకొన్నాడేమో ఇక లాభం లేదనుకొని మహం తులు ఆలయానికి వెళ్ళిపోయారు. కల్యాణోత్సవం కావడంతో కొండమీద రద్దీ విపరీతంగా ఉంది.

కనకదాసుకు స్వామిదర్శనం కాలేదు. ఆకలి, చలి రెండూ కనకదాసును ఉక్కిరిబిక్కిరి చేశాయి. చివరకు ఒక మంటపంలోని గోడకు ఆనుకొని కనకదాసు –

"ఓ శ్రీనివాసా! ఏమిటయ్యా న్యాయం? ఎంతపేద వాణ్ణైనా పెళ్ళికి పిలిచి, సత్కరించకుండా ఉండరు కదా!"

శ్రీనివాసునిపెళ్ళికదా అని వచ్చినందుకు తగినశాస్తి జరిగింది.

కొండెక్కి కూర్చున్న వేంకటేశా! తాటిచెట్టు నీడలోనైనా నిలబడవచ్చును కాని తగుదునమ్మా అంటూ కలవారిపెళ్ళికి మాత్రం వెళ్ళకూడదు అని చెంపలు వాయించుకొన్నాడు.

ఆకలితో కనకదాసు తిరిగీ కళ్ళు ముడుచుకొని పడు కొన్నాడు. ఈలోగా స్వామి బంగారుపాత్రలో పాలు, పళ్ళెంలో నైవేద్యం తీసుకొచ్చాడు.

"కనకా! ఇదిగో చాలా అలసిపోయావు. అధికారు లడుగుతుంటే పేరు చెప్పడానికి నామోషి ఎందుకయ్యా! ఇదంతా స్వయంకృతాపరాధం. ఇదిగో స్వామిప్రసాదం స్వీకరించు" అని పళ్ళెం ముందుకు త్రోశాడు.

కనకదాసు మేల్కొన్నాడు. ఆకలి కావడంతో ప్రసాదం అందుకోబోయాడు.

ఈలోగా కలకలం రేగింది. బాలునిరూపంలో వచ్చిన స్వామి అంతర్ధానమయ్యాడు.

"ఇదిగో! ఇదిగో! గుడినుండి బయటపడినదొంగ ఇటే వెళ్ళాడు" అని బిలబిలమంటూ ఆలయార్చకులు కనకదాసు దగ్గరికి వచ్చారు.

దగ్గరలో బంగారు పళ్ళెం–పైగా ప్రసాదం కన బడడంతో కనకదాసే దొంగ అని నిర్ధారించారు.

"అప్పుడే అనుకొన్నాం అంతా దొంగవేషాలే! పైగా లోకాన్ని మోసగించడానికి చేతిలో తంబురా ఒకటి" అని తంబురా లాక్కున్నాడు – ఒకభటుడు. "గొంగళిలో ఏముందో చూడు. ఇంకేమైనా దాచా డేమో" అన్నా డొక భటుడు.

ఈలోగా మహంతులు రానే వచ్చారు. ఉదయం కనకదాసును చూడడం స్మృతికి తెచ్చుకున్నారు. అతనిమాటల్ని మరోసారి అన్వయించి చూసుకొన్నారు. అతడే కనకదాసని అర్థమైపోయింది. ఆలయాధికారులు పట్టించుకోకపోతే, స్వామి స్వయంగా భక్తుణ్ణి పట్టించుకొన్నా దని అర్థమయింది.

"స్వామీ! అపచారం జరిగిపోయింది. అజ్ఞానంతో మహాపచారం చేశాము. క్షమించండి! స్వామివారిఏకాంతసేవకు విచ్చేయండి" అంటూ సాదరంగా ఆహ్వానించారు.

"అంతా శ్రీనివాసునిదయ" అని కనకదాసు గుడికేసి నడిచాడు–అంటూ కథ చాలించాడు–తాతయ్య.

"ఉడిపిలో శ్రీకృష్ణుడు తనకు తానే కనకదాసుని వైపు తిరిగా దని అంటారు కదా!" అని కుతూహలంతో అడిగింది – పక్కింటి పార్వతమ్మ.

"అవునమ్మా! అర్చకులు ఆలయప్రవేశం చేయించ నప్పుడు కనకదాసు పాటపాడితే స్వామి పశ్చిమానికి తిరిగా డని ప్రతీతి. భగవంతునికి కలవారికంటే లేనివారంటేనే ఇష్టం. కలవారినైనా బికారిని చేసి, తనదగ్గరికి చేర్చుకోవడం అలవాటు" అని కథ ఆపాడు.

"మనమందరం భగవంతునిదృష్టిలో సమానులం. జాతిమతవిభేదాలు లేవు. కలసికట్టుగా స్వామిని సేవిద్దాం"

నిజంగా కనకదాసు చాలా గొప్పవాడేరా! అంటూ చకచకా బయటికి వెళ్ళారు– పిల్లలు.

# స్వామితిరునాళ్లలో వాహనాలు

ఉదధిలోపలనే నింక నుండ నయ్య
అనుచు శేషుడు నీ వున్న అద్రి జేరి
నేడు నీదు వాహనమయి, నిన్ను మోసి-
కొనుచు, నీగుడిన్ గాంచెను కోర్కితీర.

నాగవంశమునకు మహానంద మొసగ,
నాగరాజు వాసుకిని ఈనాడు వాహ-
నమ్ము చేసికొంటివి గద నళిననేత్ర
సర్వలోకపాలక! నీసాటి ఎవరు?

స్వామి! నీసుతుడు విరించి భక్తి జూడు;
ఒక్కనాడు నా వాహన మెక్కు మనుచు
పంపెనా హంస! నద్దాని వాహనమ్ము
చేసికొని పోవుచున్నావ! శ్రీనివాస!

నాడు సింహముఖము దాల్చి, నారసింహ-
రూపమున, దైత్యనాయకు రూపుమాపి
తీవు. సింహవాహనుడవై తెరలి నేడు,
వెలిగి ఊరేగుచుంటివా? వీథులందు.

మామ ప్రేమతో పంపిన మౌక్తికముల
విశ్వకర్మచే దివ్యమౌ వెలుగులీను
పందిరిగ సృష్టి గావించి పద్మనాభ!
అందు నూరేగుచుంటివా, అందమొలుక.

జలనివాసి కల్పాగమున్, స్వర్గమందు
నాటినా వయ్య నాడు కోనేటిరాయ!
తరుకృతజ్ఞత జూడుమా, మురిసి నీకు
శీతలచ్ఛాయతో నేడు సేవ జేసె.

ప్రభువులకు కల వెన్నయో వాహనాలు;
కాని నీ వున్నగిరి జేరి కలిసి మెలసి
నిన్ను మోయుచున్నారయ్య! నీకు మ్రొక్కి
వారిజన్మములు తరింప వారిజాక్ష!

సుధను పంచునాడు సుదతిరూపము దాల్చి
సొబగు శివుడు మెచ్చ చూపినావు
నాటి సుందరతను నేటి వారలు చూడ
అందగత్తె వైతి అంబుజాక్ష!

నిన్ను నెచ్చోటికైనను నేర్పుతోడ
తీసికొనిపోవు గరుడుడు దేవదేవ!
రాజసముతోడ నిట ఖగరాజు నెక్కి
వెలుగుచున్నావు తిరుమాడ వీథులందు

మెచ్చి కౌగిలి భాగ్యమ్ము నిచ్చినావు
హనుమ కా నాడు, వానరు లలరు పొంద;
తనదు భక్తిని చూపింప, హనుమ నేడు
వాహన మ్మయ్యె శేషాద్రివాస! నీకు

మకరిబారినుండి మదగజమున కీవు
ముక్తి నొసగినావు భక్తి గాంచి
ఆగజమ్ము భళిర! ఆనందహేలతో
నీకు వాహనమ్ము నేడు స్వామి!

ఇనునిపుత్రిక కాళింది నీవు వైభ
వముగ పరిణయమాడితి వాసుదేవ!
మామ ఆనంది యై నీకు ప్రేమ మీర
ప్రభను కల్పించి నీచుట్టు పరచె నయ్య!

నాదుబావ, లక్ష్మీదేవి నాథు డలసి
పోయె, తిరునాళ్ల సమయాన పొంగి పొంగి
సేవ జేసెద ననుచు శశి, దివి నుండి
వచ్చి, శీతప్రభను కూర్చె, వరదరాజు

నాడు సూకరరూపాన నన్ను మోసె
నేడు మోసెద స్వామిని చూడు డనుచు
తేరు రూపమ్ము తాల్చె భూదేవి, కనుమ
ప్రీతియై విహరింపుమా విష్ణుదేవ!

అశ్వమేధయజ్ఞమ్ముల, అశ్వ మిచ్చె
ప్రాణ మనుచు, కరుణ జూపి, పద్మనేత్ర!
అశ్వవాహన మెక్కి ఈ అంజనాద్రి
యందు, విహరించు చుంటివా! అమరచరిత!

– కనమలూరు వెంకటశివయ్య



# తిరుమల ఆలయం



ఆంగ్లమూలం : డా॥ రమేశన్, తెలుగు అనువాదం : డా॥ కోరాడ రామకృష్ణ

*(సవాల్ జవాబ్ పట్టి తిరుమల ఆలయచరిత్రలో ఒక ప్రధానఘట్టం గురించి విపులంగా వివరించే దాఖలా. ఆర్కాటు నవాబుల కాలంలోని కోలాహలభరిత నిర్వాకం తరువాత స్వల్పకాలం ప్రశాంతవాతావరణంలో ఆలయ వ్యవహారాలను నేర్పు చేసేందుకు కుంపణి ప్రభుత్వం ప్రయత్నించినవైనాన్ని ఇక్కడ చూడవచ్చు.)*

శ్రీగోవిందరాజస్వామిఆలయంలో పూజాదికాల సమయసూచి తిరుమల ఆలయంలాగానే ఉన్నా – కొంచెం ముందుగా జరిగేవి. సేవకుడు వచ్చి, పిలిచినపుడు ప్రాతః కాలం 7 గంటలకు అర్చకులు, జీయంగారులు, ఏకాంగులు అందరూ ఆలయానికి వచ్చేవారు. ముద్రామనుషుల సమక్షంలో ఆలయమహాద్వారాలను జీయంగారులు తెరిచేవారు. లోపల వాకిళ్ళను అర్చకులు తెరిచేవారు. ఏకాంగి మరియు కైకాల సేవకులు అర్చకులతోపాటు ఆలయం ప్రవేశించి,నందాదీపాన్ని సరిచేసి, ఆలయంలోని అన్నివస్తువులూ యథాస్థానంలోనే ఉన్నాయి– అని నమ్మకం కుదిరినతర్వాత జీయంగారులు ప్రవేశించేవారు. పూజ అంటే అర్చన, తోమాలసేవ మున్నగువాటిని (నైవేద్యంతో సహా) ప్రాతఃకాలం 9 గం॥లకు మునుపే చేసి, ముగించేవారు. తదనంతరం యాత్రికులను దర్శనానికి అనుమతించేవారు. దర్శనంసమయంలోనే గుత్తాదారుడు యాత్రికుల కానుకలను వసూలు చేసి, దానికంటూ ఉన్న చిన్నపెటారిలో వేసేవాడు. దర్శనంసమయం మధ్యాహ్నం 12గంటలవరకూ ఉండేది. మధ్యాహ్నం పూజ జరిగేటపుడు గుత్తాదారుడు పెరుమాళుకు సమర్పించిననివేదనను స్వామికి సమర్పించి, పునః దానిని యాత్రికులకు వితరణ చేసేందుకు గాను అతనికే తిరిగి ఇచ్చేవారు. అనంతరం లోపలివాకిలిని మూసి, అర్చకుడు ఇంటికి వెళ్ళేవాడు. జీయంగారులూ మరి ఇతరులూ ఇళ్ళకు వెళ్ళేవారు. మరల రాత్రి 7 గంటలపుడు రాత్రిపూజకై అందరూ హాజరయ్యేవారు. పూజలు నైవేద్యాలు అయ్యినతర్వాత రాత్రి 10 గం॥ల వరకు యాత్రికుల సర్వదర్శనకార్యక్రమం జరిగేది. అనంతరం బయటివాకిలికి తాళం వేసి, జీయంగారు తాళం చెవిని మఠానికి తీసుకుపోయేవారు.

ఈ ఆలయంలోనే యాదవపెరుమాళ్ (లేక) పార్థసారథి (మహాభారతంలో అర్జునుడికి రథసారథియైనవాడు) ఆలయాన్ని రాయలకాలంలో (విజయనగరరాజులకాలంలో) నిర్మించబడి, తదనంతరం రామానుజులు (వైష్ణవ గురువు) చిదంబరంనుండి అంటే చిత్రకూటంనుండి ఆమొదలే తెచ్చి పెట్టబడ్డ గోవిందరాజ విగ్రహాన్ని పార్థసారథి ఆలయపార్శ్వంలో నిర్మించిన గుడిలో స్థాపించారు. పార్థసారథివిగ్రహం గారతో (సుధా విగ్రహం) చేసినది, ముక్కె పోయినది కాగా దానికి పూజలు లేవు. [ఇక్కడ చరిత్ర తలకిందులైనట్లు కనిపిస్తుంది. పార్థసారథి ఆలయం విజయనగర రాజుల కాలానికి చెందినది కాక పోవడమే కాదు, రామానుజస్వాములవారికంటే ముందు తరానిదై ఉండాలి. స్వతః భగవద్రామానుజులే విజయనగర పూర్వ కాలంవారు. అంటే పార్థసారథి ఆలయం అంతకు ముందే ఉండి ఉండాలి. చిదంబరం నుండి తెచ్చిన గోవిందరాజ స్వామి విగ్రహాన్ని రామానుజస్వాములవారు అనంతరకాలంలో పార్థసారథి ఆలయం ఉత్తరదశలో స్థాపించియుండాలి. పార్థ సారథి ఆలయంలో పూజాదులు 1800 క్రీ.శ. కాలానికి నిలిచి పోయి ఉండాలి. 20 శతాబ్దంలో ఆలయపరిపాలనకు ధర్మకర్తల మండలి ఏర్పడ్డ తరువాత ఇక్కడ పూజాదులు పునఃప్రారంభమయ్యాయి – అనువాదకుడు]

## శాలనాచ్చియార్ కోవిలు

ఈ ఆలయం వనరుల వివరం ఇలా ఉండింది – సాధారణ ఆదాయం 18 పులివరాహం, 2 మైలి, 54 కాసులు. ప్రాయశః కంపని సుపర్దుకు వచ్చి ఏదో ఒక భూమి ఆదాయం నగదు 6 పులివరహం, ధర్మము లేక దానంచే వచ్చిన ఆదాయం 8 పులివరహం 26 మైలి, 41 కాసు. మొత్తం స్థూలంగా 140 రూపాయలు.

ఈ ఆలయం సుసపన్నంగా లేకున్నది స్పష్టంగానే కనబడుతుంది. సవాల్ జవాబ్ పట్టిలో యాత్రికులు సమర్పించిన కానుకలగురించి ఒక స్వారస్యమైన అంశం ఉంది. ఇక్కడ సమర్పణ కానుక ఒక రూపాయకంటే ఎక్కువగా ఉన్నచో అది గోవిందరాజస్వామిఆలయంలెక్కలో చేరి, కానుక ఒక రూపాయి కన్నా తక్కువగా ఉన్నచో శాలనాచ్చయార్ గుడి అర్చకుడి తనకై ఎత్తిపెట్టుకునే పద్ధతి ఉండింది. దీనిచే ఆలయం అమ్మవారు కాణీ లేనిదరిద్రంలో ఉండేటట్టైంది.

శ్రీగోవిందరాజస్వామిఅర్చకుడిగుమాస్త ఇక్కడ ప్రతి రోజు ప్రాతఃకాలం 7 గంటల నుండి 10 గంటల లోపల పూజ చేసేవాడు. అర్ధసేరు బీయం ప్రసాదంగా రోజుకు రెండు మార్లు వండి పెట్టేవారు. ఇక్కడి ఉత్సవరోజులలో (ఏడురోజులు) గోవిందరాజస్వామి ఆలయం మొత్తం సిబ్బంది సహకరించేవారు. నాలుగుచేతుల మహాలక్ష్మిమూర్తి మొదట యాదవ పెరుమాళ్ ఆలయంఉత్తరాన దక్షిణాభిముఖంగా ఉండింది. భగవద్రామానుజస్వామి అక్కడ గోవిందరాజస్వామిని ప్రతిష్ఠించిన తరువాత ఈ మూర్తిని ఆలయం ప్రాంగణంలో ముఖమంటపంలో సమీపాన ఉన్నగదిలో పెట్టారు కాబట్టి శాలనాచ్చియార్ అయింది.



## శూడికొడుత్త నాచ్చియార్

ఈ ఆలయం ఆర్థికపరిస్థితి ఇలా ఉండింది.

| | పులవరహం | మైలి | కాసులు |
|---|---|---|---|
| సాధారణ ఆదాయం | 39 | 16 | 19 |
| కానుకల నుండి ఆదాయం | 32 | | |
| ధర్మం (దానాలు) | 18 | 5 | 62 |
| మొత్తం స్థూలంగా | 200 రూపాయలు | | |

ఈ ఆలయంలోనూ ఒక రూపాయకంటే ఎక్కువైన కానుక గోవిందరాజస్వామి లెక్కలో జమ అయి, ఒక రూపాయ కంటే తక్కువైనదానం అర్చకుడికి చేరేది. గోవిందరాజస్వామి ఆలయంనుండి పూటకు అర్ధసేరు బియ్యంతో రెండుపొద్దుల నివేదనం జరిగేది. పొద్దున్నే 10 గంటల నుండి 12 గంటల వరకు, రాత్రి 7 నుండి 10 వరకు పూజలు జరిగేవి. ఈ ఆలయం రామానుజాచార్యుల వారికాలంలో నిర్మాణం గావించబడింది అని చెప్తారు.

## కోదండరామాలయం

ఈ ఆలయంలో ఆర్థికపరిస్థితి ఇది –

| | పులవరహం | మైలి | కాసులు |
|---|---|---|---|
| సాధారణ ఆదాయం | 145 | 38 | |
| కానుకల మరియు భూమి | 80 | 4 | 2 |
| ఉభయం మరియు దానాలు | 17 | 8 | 42 |
| మొత్తం స్థూలంగా | 600 రూపాయలు | | |

ఇక్కడ సమర్పితకానుకలలో ఒక భాగంగా ఆలయం ఊడిగం చేసేవారు తమ స్వంతానికి వాడుకుని, తక్కిన మిగులు

ఆదాయాన్ని వంట చెరుకకై వాడుతున్నారు. తిరుమల ఆలయం మరి తిరుమల గోవిందరాజస్వామి ఆలయం పద్ధతిలాగనే ఆలయం తేవకులవారు (తేవైయాళ్=వంట వాడు) ఫస్కి (పసిక- వంటల- నైవేద్య ముల ముడిసరుకులు) ని తీసికొని ఈ ఆలయం ధర్మకర్తలైన గుండప్ప మరియు వేంకటరాయలకు గుత్తాధనాన్ని చెల్లించే వారు. అనంతరం 1790-91లో అంటే ఫసలి 1199 సంవత్సరంలో ఫస్కి పద్ధతి సాహేబుచే ఆమోదితమై ముస్త జరు (పరిపాలనాధికారి) రఘునాథాచారి అమలుకు తెచ్చిన విధానంగా నడుస్తూ వచ్చింది.

ఇక్కడ స్థానికులూ, పరాయి వారలూ చేరి, వస్తుసామగ్రి తెచ్చిపెట్టాల్సి ఉండింది. ధర్మకర్తలైన గుండప్ప మరియు వేంకటరాయలపరంగా కానుకలధనాన్ని తీసికొని, దానిలోని ఒక భాగాన్ని ఆలయ సిబ్బంది సంభావనకు వెచ్చించి, మిగులు ధనాన్ని ఆలయానికై వాడడం పద్ధతి. దీనికై ప్రత్యేకమైన లెక్క లున్నాయి. మరియు ఈ ధనం సర్కార్ ఆయ వ్యయాల సీమలో ఉండేది కాదు.

ఇదొక శిలాభవనంపైన విమానగోపురం గారతో నిర్మాణమైంది. దీనిసిబ్బంది అంటే ఒకఅర్చకుడు అతని గుమాస్తా, ఒక వంటవాడు, ఇద్దరు గొల్లవారు, ఒక తోటమాలి. అర్చకుడు ప్రాతఃకాలం 7 నుండి 9 గం॥ వరకు పూజచేసి, మాత్ర మరియు దధ్యోదనం నైవేద్యసమర్పణ చేసేవాడు. అనంతరం మధ్యాహ్నపూజలను ఉదయం 10 నుండి 12 గం॥ల మధ్యకాలంలో, రాత్రి పూజను సాయంత్రం 7 నుండి 9 గం॥ల వరకు చేస్తాడు. తదనంతరం స్వామి శయనసేవ(మంచపు సేవ) నిర్వహించేవాడు. అక్కడికి రోజువారికార్యకలాపాలు కొలిక్కి వచ్చినట్టే! బొక్కసం గుమాస్తా అభిషేకంనీళ్ళు తెచ్చేవాడు. అతడే పూజకై చందనం సిద్ధం చేసి, పూజాపాత్రలను శుభ్రం చేసి, ఇచ్చేవాడు. వంటవాడు నివేదనకై ప్రసాదాలను పక్వం చేసేవాడు. గొల్లవాడు ఆలయానికి కావలసిన వస్తువులను తెచ్చి పెట్టేవాడు. తోడుకు ఆలయరక్షకుడుగా పనిచేసేవాడు. తోట మాలి పూజలకు కావలసివచ్చే పూలను సరఫరా చేయు చుండెను.

చంద్రవంశంలోని జనమేజయుడు ఆలయాన్ని నిర్మించి, విగ్రహాన్ని ప్రతిష్ఠచేశాడు. అయోధ్యా రామానుజయ్యంగార్లు విజయనగరంకాలంలో ప్రాకారం, గోపురం నిర్మాణాన్ని చేపట్టాడు. 1226 ఫసలి (క్రీ.శ.1817-18) సంవత్సరంలో కొత్తగా విమానగోపురనిర్మాణమై, దీనిమహాసంప్రోక్షణ, కుంభాభిషేకం జరిగింది.

***(ఇంకా ఉంది)***

---

**ధారావాహిక 33**

## మందార మకరందాలు

**ఓయమ్మ! నీ కుమారుడు**
**మా యిండ్లను బాలు పెరుఁగు మననీఁ డమ్మా!**
**పోయెద మెక్కడి కైనను;**
**మా యన్నల సురభు లాన, మంజులవాణీ!**

యశోదమ్మతో ఇరుగుపొరుగు గోపెమ్మల మొర ఇది. తమ ఇండ్లలో పాలూ పెరుగూ కాజేస్తున్నా డని; తాము ఎక్కడికైనా వెళ్లిపోతా మని వారి గోడు. ఎక్కడికి పోతారు? తమ అన్నలున్న చోటికి, అంటే పుట్టింటికి. ఆ పుట్టింటి మీద ఒట్టేసుకోవడంలో వాళ్ళ ఎక్కడికి పోదల్చుకున్నారో తెలుస్తుంది.

ఏముం దీపద్యంలో? 'ఓ యమ్మ నీ కుమారుడు' అని ఎత్తుకోవడంలో ఉంది. ఆ మొరను, వారితొందరను సహజసంభాషణలో చిత్రించడంలో ఉంది.

ఏ అలంకారమూ లేకపోవడమే యీ పద్యానికి అలంకారం.

**- జ్ఞానపీఠఅవార్డు గ్రహీత, పద్మభూషణ్ డా॥ సి. నారాయణ రెడ్డి**

## గ్రంథసమీక్ష

### లలితా లహరి

**రచన:** ఆయలూరి లలితాదేవి;
**సైజు:** 1/8 డెమ్మీ; **పుటలు:** 66; **వెల:** తెలుపలేదు
**దొరకుచోటు:** డా॥ పులిగడ్డ విజయలక్ష్మి, ప్లాట్ నెం.సి-1, విజయప్రతాప్ అపార్ట్‌మెంట్స్, అచ్యుతరెడ్డి మార్గ్, విద్యానగర్, హైదరాబాద్ -44 సెల్-99890 63761

శ్రీమతి ఆయలూరి లలితాదేవిగారిచే విరచితమైన 'లలితాలహరి' అనే ఈ గ్రంథంలో 202 పద్యరత్నా లున్నాయి. వీటిలో లలితాదేవిదివ్య విభూతులను కవయిత్రి వర్ణించారు. నిత్యమూ వీటిని పఠించేవారికి ఆ లలితాదేవీకృపాకటాక్షా లుంటా యని చెప్పవచ్చు.

### నారాయణ ద్విశతి

**రచన:** డా॥పులిగడ్డ విజయలక్ష్మి;
**వెల:** రూ.25/-; **సైజు:** 1/8 డెమ్మీ; **పుటలు:** 80;
**దొరకుచోటు:** 'శ్రీవేంకటేశం' మాసపత్రిక, ఇ.నెం.1-9-1113/30, వి.ఎస్.టి.రోడ్డు, విద్యానగర్, హైదరాబాద్ -44
ఫోన్: 040-27605231, సెల్: 9348212354

వేదవేద్యుడు, కలియుగప్రత్యక్షదైవం శ్రీవేంకటేశ్వరస్వామిలీలలను కన్నులకు కట్టినట్లు 211 పద్యాలలో వర్ణించారు. ప్రతిపద్యం భక్తిభావబంధురం. వీటిని నిత్యపారాయణం చేసినవారు భగవంతుని ఆశీస్సులు పొందగల రని విశ్వసించవచ్చు.

### శ్రీయాదగిరి లక్ష్మీనృసింహముక్తావళి

**రచన:** కుంతీపురం కౌండిన్య తిలక్;
**వెల:** రూ.60/-; **సైజు:** 1/8 డెమ్మీ; **పుటలు:** 50;
**దొరకుచోటు:** ఆముక్తమాల్యదప్రచురణలు, ఇ.నెం.1-7-1/36/ఎస్2, ప్లాట్‌నెం.203, శ్రీసాయి ఎన్‌క్లేవ్, శ్రీనివాసనగర్‌కాలనీ, టెంపుల్ ఆల్వార్, హైదరాబాద్,
ఫోన్: 040-27970203, సెల్: 9441234325

శ్రీకుంతీపురం కౌండిన్యతిలక్‌గారు మంచిపండితులు. సుప్రసిద్ధయాదగిరిగుట్టలక్ష్మీనృసింహస్వామిని శ్లాఘిస్తూ నాంది, నీస్తోత్రం, నీలీలలు, నీఅవతారాలు, నీదారి, నీవె, నీసన్నుతి, నీగిరి, నీనామం, నీకరం, నీపాదం, నాబాధ, నావేదన, నిలదీత, పశ్చాత్తాపం, నా వినతి, జీవితసత్యాలు/తత్త్వాలు, కంటిని/వింటిని, ఉపసంహారంవంటి శీర్షికలతో స్తుతించారు. సులభశైలిలో ఉన్న భక్తిప్రపూరితమైన చిన్న ఉత్తమగ్రంథరాజ మిది.

### ప్రణతి వట్టెం శ్రీవేంకటపతి

**రచన:** కుంతీపురం కౌండిన్య తిలక్;
**వెల:** రూ.60/-; **సైజు:** 1/8 డెమ్మీ; **పుటలు:** 46;
**దొరకుచోటు:** ఆముక్తమాల్యద ప్రచురణలు, ఇ.నెం.1-7-1/36/ఎస్2, ప్లాట్‌నెం.203, శ్రీసాయి ఎన్‌క్లేవ్, శ్రీనివాసనగర్‌కాలనీ, టెంపుల్ ఆల్వార్, హైదరాబాద్,
ఫోన్: 040-27970203, సెల్: 9441234325

సంస్కృతాంధ్రసాహిత్యంలో గట్టి పట్టున్న 'కుంతి' గారు 'వట్టెం' అనే ఊరిలో నెలకొన్న శ్రీవేంకటేశ్వరస్వామివారిని కీర్తిస్తూ 121 పద్యాలలో భక్తిరసగుళికలను భక్తులకు అందించారు. ఒక్కొక్కపద్యం ఒక్కొక్కఅనర్ఘరత్నం. స్వామిభక్తులకు ఇది అవశ్యపఠనీయగ్రంథం.

# రాశిఫలాలు

## జనవరి, 2014



జె.చంద్రశేఖరశర్మ



### మేషం

ఆదాయం : 14 రాజపూజ్యం : 04
వ్యయం : 02 అవమానం : 05

ఈనెలలో వీరికి దీర్ఘకాలికవివాదాస్పద అంశాలు పరిష్కారమవుతాయి. ఉద్యోగంలో స్థానచలనం ఏర్పడే సూచనలున్నాయి. కుటుంబంలో ప్రశాంతత లోపించకుండా జాగ్రత్తలు తీసుకోండి. ఋణప్రయత్నాలు కలిసివస్తాయి. మొదటివారం వివాదాలు, రెండోవారం ఆనందం, మూడోవారం స్థానచలనం, నాలుగోవారం ధార్మికచింతన.



### వృషభం

ఆదాయం : 08 రాజపూజ్యం : 07
వ్యయం : 11 అవమానం : 05

ఈ నెలలో ఈ రాశివారికి ఆదాయవర్గాలు మెరుగుపడతాయి. భవిష్యత్తుగురించి దీర్ఘాలోచనలు చేస్తారు. అందరి అభిప్రాయాలకు భిన్నంగా ఒక శుభకార్యం పూర్తిచేస్తారు. వృత్తి ఉద్యోగవ్యాపారాల్లో చెప్పుకోదగినమార్పు ల్లేవు. చిన్నవిషయాలకు సైతం అమితంగా శ్రమిస్తారు. మొదటివారం శుభకార్యం, రెండోవారం విజయం, మూడోవారం సంతోషం, నాలుగోవారం దైవచింతన.



### మిథునం

ఆదాయం : 11 రాజపూజ్యం : 03
వ్యయం : 08 అవమానం : 01

ఈ రాశివారు ఈ నెలలో నామమాత్రంగా పొదుపు పాటిస్తారు. ప్రత్యక్షంగాగానీ, పరోక్షంగా గానీ కోర్టుతీర్పులు అనుకూలిస్తాయి. వృత్తి ఉద్యోగాలలో శ్రమించి, అనుకూల ఫలితాలు సాధిస్తారు. మొదటివారం కార్యజయం, రెండోవారం దైవచింతన, మూడోవారం క్రయవిక్రయాలు, నాలుగోవారం సంతోషం.



### కర్కాటకం

ఆదాయం : 05 రాజపూజ్యం : 06
వ్యయం : 08 అవమానం : 01

ఈనెలలో ఈరాశివారికి ఆర్థికంలో, వ్యాపారంలో పురోభివృద్ధి సాధిస్తారు. కుటుంబ బాధ్యతలు సమర్థవంతంగా నిర్వహించటానికి అవిశ్రాంతంగా శ్రమిస్తారు. స్వల్పంగా ఏర్పడిన ఆరోగ్య ఇబ్బందులను అధిగమిస్తారు. నిర్మాణం పనులు పట్టుదలతో పూర్తిచేస్తారు. సంతానంపై దృష్టి కేంద్రీకరిస్తారు. మొదటివారం అనారోగ్యం, రెండోవారం కార్యానుకూలత, మూడోవారం శుభవార్తాశ్రవణం, నాలుగోవారం సంతోషం.



### సింహం

ఆదాయం : 08 రాజపూజ్యం : 02
వ్యయం : 02 అవమానం : 04

ఈనెలలో వీరికి గ్రహస్థితి అనుకూలంగా ఉంటుంది. ఉద్యోగానికి ఉన్నతవిద్యకోసం చేసేయత్నాలు కలిసివస్తాయి. వివాదాలకు సాధ్యమైనంత దూరంగా ఉండటానికి ప్రయత్నించండి. కొన్నిముఖ్యసందర్భాలలో మీమాటలు, నిర్ణయాలు కొందరికి నచ్చవు. నరదృష్టి అధికం. మొదటివారం ప్రయత్నఫలం, రెండోవారం అపహరణ, మూడోవారం ఆందోళన, నాలుగోవారం శాంతిపూజలు.



### కన్య

ఆదాయం : 11 రాజపూజ్యం : 05
వ్యయం : 08 అవమానం : 04

ఈ మాసంలో ఈ రాశివారు ఋణాలు ఇవ్వటం, తీసుకోవడం తగ్గించండి. ఇరుగుపొరుగువారితో స్వల్ప ఇబ్బందులు ఏర్పడతాయి. కొన్నిసార్లు కఠిననిర్ణయాలు తీసుకోవాల్సిన పరిస్థితి ఏర్పడుతుంది. మొదటివారం ధనాదాయం, రెండోవారం కలహాలు, మూడోవారం ధార్మికచింతన, నాలుగోవారం స్థానచలనం.



### తుల

ఆదాయం : 08 రాజపూజ్యం : 01
వ్యయం : 11 అవమానం : 07

ఈరాశివారికి ఈమాసంలో సంఘంలో స్థాయి, గౌరవం పెంపొందుతాయి. ముఖ్యమైనకార్యక్రమాలను విజయవంతంగా పూర్తిచేస్తారు. మొదటివారం గౌరవం, రెండోవారం ఆనందం, మూడోవారం శుభవార్తాశ్రవణం, నాలుగోవారం విదేశీయానం.



## వృశ్చికం

ఆదాయం : 14 రాజపూజ్యం : 04
వ్యయం : 02 అవమానం : 07

ఈనెలలో వీరికి గ్రహస్థితి అనుకూలంగా ఉంటుంది. ఉద్యోగానికి, ఉన్నతవిద్యకోసం చేసేయత్నాలు కలిసివస్తాయి. వివాదాలకు సాధ్యమైనంతదూరంగా ఉండటానికి ప్రయత్నించండి. కొన్నిముఖ్యసందర్భాలలో మీమాటలు, నిర్ణయాలు కొందరికి నచ్చవు. నరదృష్టి అధికం. మొదటివారం ప్రయత్న ఫలం, రెండోవారం అపహరణ, మూడోవారం ఆందోళన, నాలుగోవారం శాంతిపూజలు.



## ధనుస్సు

ఆదాయం : 02 రాజపూజ్యం : 07
వ్యయం : 11 అవమానం : 07

ఈ రాశివారికి ఈమాసంలో ఆర్థికవ్యవహారాలు సంతృప్తికరంగా ఉంటాయి. ఉద్యోగపరంగా నెలకొన్న సమస్యలు తొలగిపోతాయి. మొదటివారం ధనాభివృద్ధి, రెండోవారం ధార్మిక చింతన, మూడోవారం శుభవార్త, నాలుగోవారం కార్యజయం.



## మకరం

ఆదాయం : 05 రాజపూజ్యం : 03
వ్యయం : 05 అవమానం : 03

ఈ నెలలో ఈ రాశివారికి ఆర్థికంలో, వ్యాపారంలో పురోభివృద్ధి సాధిస్తారు. కుటుంబబాధ్యతలను సమర్థవంతంగా నిర్వహించటానికి అవిశ్రాంతంగా శ్రమిస్తారు. స్వల్పంగా ఏర్పడిన ఆరోగ్య ఇబ్బందులను అధిగమిస్తారు. సంతానంపై దృష్టి కేంద్రీకరిస్తారు. కొత్తపరిచయాలు లాభిస్తాయి. మొదటివారం అనారోగ్యం, రెండోవారం కార్యానుకూలత, మూడోవారం శుభవార్తా శ్రవణం, నాలుగోవారం సంతోషం.



## కుంభం

ఆదాయం : 05 రాజపూజ్యం : 02
వ్యయం : 05 అవమానం : 06

ఈరాశివారికి ఋణాలు ఇవ్వడం, తీసుకోవడం మంచిది కాదు. వృత్తి, వ్యాపారాభివృద్ధి అంచనాలమేరకు ఉంటుంది. మొదటివారం ధనాదాయం, రెండోవారం కలహాలు, మూడోవారం ధార్మికచింతన, నాలుగోవారం స్థానచలనం.



## మీనం

ఆదాయం : 02 రాజపూజ్యం : 02
వ్యయం : 11 అవమానం : 06

ఈరాశివారికి ఈమాసంలో ప్రతివ్యవహారం నిదానంగా సాగుతుంది. తుదిఫలితాలు అనుకూలంగా వస్తాయి. గతంలో చేసిన ఒక పొరపాటు గ్రహపాటుగా మారి, మానసికవేదనకు గురిచేస్తుంది. మొదటివారం వ్యవహారజయం, రెండోవారం మానసికవేదన, మూడోవారం భూమికొనుగోలు, నాలుగోవారం ధనాదాయం.



# పుణ్యక్షేత్రాల్లో ఆత్మహత్యలు మహాపరాధం



**అన్యక్షేత్రే కృతం పాపం పుణ్యక్షేత్రే వినశ్యతి**
**పుణ్యక్షేత్రే కృతం పాపం బ్రహ్మలోకే న నశ్యతి**

**ఇతర క్షేత్రాల్లో చేసిన పాపం పుణ్యక్షేత్రంలో నశిస్తుంది. కానీ పుణ్యక్షేత్రంలో చేసిన పాపం బ్రహ్మలోకానికి వెళ్ళినా నశించదు. కావున, పుణ్యక్షేత్రంలో ఆత్మహత్యాదిపాపాలు చేయరాదు.**

**ఆత్మహత్య అనేదే మహాపాప మని మనపురాణాలు చెపుతున్నాయి. అలాంటి ఆత్మహత్యలు పుణ్యక్షేత్రాల్లో చేసుకుంటే ఆ పాపం తమకే కాకుండా తమ వంశానికంతా చుట్టుకుంటుం దని ఋషులు ఘోషించారు. కాబట్టి భగవంతుని సన్నిధిలో సత్కార్యాలు చేస్తే వాటి ఫలితం శతాధికంగా ఉన్నట్లే - ఆత్మహత్యల్లాంటివి చేసుకుంటే స్వర్గప్రాప్తి సిద్ధించకపోగా, ఆ పాపఫలం తరతరాలు పట్టి పీడిస్తుంది. కాబట్టి పుణ్యక్షేత్రాల్లో ఆత్మహత్యలు మాని, భగవద్దర్శనంతో ఆత్మానందాన్ని, మనోధైర్యాన్ని పొందండి.**

శ్రీ వేంకటేశ్వర లీలలు

# ప్రాణదాత

డా॥జి.ఎస్.ఎస్.మూర్తి, హైదరాబాదు

మా ది నరసాపురం, పశ్చిమగోదావరి జిల్లా. ఇక్కడ రాస్తున్న సంఘటన 1953 ప్రాంతంలో జరిగింది. అవి నేను రెండవతరగతి చదివేరోజులు. ఊళ్ళో, చాలామంది పిల్లలు టైఫాయిడ్‌వాత పడే వారు. నాకూ టైఫాయిడ్ వచ్చి 15 రోజు లైనా జ్వరం 104–105 డిగ్రీల మధ్యనే ఉండి, అస్సలు తగ్గడం లేదు. జ్వరంతీవ్రతవల్ల సంధిం చడం, అపస్మారకస్థితిలోనికి పోవడం జరిగి, స్కూల్లో నేర్చుకున్న పాఠాలు అప్పచెప్తూతూ, ఇంట్లో ఎవ్వరినీ గుర్తించలేని స్థితిలోకి వెళ్లానట. ఏ రోజు ఎలాగ ఉంటుందో అని భయ పడుతూ ఉండేవారట.

ఈ పరిస్థితుల్లో ఒకరోజు సాయంత్రం మా అక్క దగ్గర నుంచి ఉత్తరం వచ్చిందట. దాని సారంశం, అక్కా, బావగారూ పెద్దతిరుపతి వెళ్లా లని నిర్ణయించారట. వీలుంటే మా అమ్మా, నాన్నగార్లనుకూడా రమ్మన మని ఉత్తరం చదివిన వెంటనే మా అమ్మకు ఏదో గుర్తుకొచ్చి, చటుక్కున లేచి, స్నానం చేసి వచ్చి, నా వేలికున్న ఉంగరాన్ని తీసి, ఒకగుడ్డకు పసుపు రాసి, ఒక రూపాయిబిళ్లా, ఉంగరాన్ని కలిపి ఆ గుడ్డలో కట్టి, పూజామందిరంలో ఉన్నస్వామిఫోటోదగ్గర పెట్టి, కళ్లలో నీళ్ళు పెట్టుకుంటూ వేడుకుందట. 'నా కొడుకును బ్రతికించు నాయనా! నీకొండకు పిల్లవాణ్ణి తీసుకు వచ్చి, మొక్కు తీర్చుకుంటాను. ఒకవేళ నాఅశక్తత, ఆర్థికపరిస్థితి, అనారోగ్యం వల్ల రాలేకపోతే, పిల్లవాడు ఉద్యోగం చేసుకునేటప్పుడైనా వచ్చి, నీ మొక్కు తీర్చుకుంటాడు. పిల్లవాణ్ణి బ్రతికించు నాయన!' అని ప్రార్థన చేసిందట. ఈ విషయా లేవీ మగతలో పడిఉన్న నాకు తెలియదు.

ఆ రాత్రి 75 సంవత్సరాల పైబడిన మా అవ్వగారు రెండు గంటల ప్రాంతంలో ఉలిక్కిపడి లేచి వీధి తలుపు వైపుకు పోతుంటే మా నాన్నగారు కూడా లేచి, ఏమి కావా లమ్మ! అని అడిగితే, వేంటేశ్వర్లు (మాబాబాయిల్లో ఒకరిపేరు) తలుపుకొట్టా దని అన్న దట! తలుపులు తీసి చూస్తే ఎవ్వరూ లేరట! పెద్దావిడకు కల వచ్చిం దని సరిపెట్టుకుని పడుకున్నారట.

మా తాతగారిది (అమ్మ తండ్రి) న్యాయవాదవృత్తి. తెల్లవారిన తర్వాత నాకు స్పృహ వచ్చి, మా అమ్మను నేను ఇలా అడిగాను–'అమ్మా! రాత్రి కల్లో తాతగారు కోర్టుకు వేసుకునే వెళ్లే నల్లకోటు వేసుకుని, నామాలు పెట్టుకుని వచ్చి, నా పక్కన వచ్చి కూర్చున్నారు, తాతగారు నామాలు పెట్టుకున్నా రెందుకే" అని. మా అమ్మకళ్లలో నీరు తిరిగి పూజామందిరం వైపు పరిగెత్తింది. మరికొంతసేపటికి, మా బంధువు ఒకాయన నన్ను



# శ్రీ గోదాస్తుతి



**శ్రీకరమౌ శ్రీనీళామాతా! దేవతా!**
**సుస్తన గిరుల సీమలందు**
**అలసి సొలసి మయి మరచి**
**నిదురించు శ్రీనాథు మేల్కొల్పినావో!**
**నాలుగు వేదాల సారాల నెరుక పరచినావో**
**శ్రుతి దేవతా మాతృశ్రీ సాక్ష్య మిప్పించినావో**
**నీ నీలభ్రమర సుకేశపాశాలలో నొదిగిన**
**సుషమసుప్రసూన హారాలు శ్రీధరునికి**
**అర్పించినావో!**
**సమర్పించినావో!**
**'శూడికొడుత' కోద్రై యాండాళ్**
**సుశుభనామాలతో**
**మము అలరించినావో!**
**శుభనామచరితా!**
**శ్రీరంగరాయ ప్రియతమా! నీకు**
**నీరాజనం! నిత్యశ్రీ నీరాజనం!**

**- కూర్మాచలం వేంకటేశ్వర్లు**

చూడడానికి వచ్చి, మరో ఆశ్చర్యకరమైన విషయం చెప్పాడట. ఆయనకికూడా మా తాతగారు నల్లకోటూ, నామాలు పెట్టకుని కల్లో కనిపించి, నాకు తగ్గిపోతుం దని చెప్పారట. ఆ బంధువుకి మా అమ్మ ముడుపు కట్టిం దన్న విషయం మా ఇంటి నుంచి దూరంగా ఉండడంవల్ల తెలిసేందుకు అవకాశం లేదు. ఆ తర్వాత, డాక్టర్ని మార్చడం, కొత్తమందులు వాడడం, క్రమంగా జ్వరం తగ్గుముఖం పట్టడం జరిగిందట.

ఇది జరిగిన సుమారు 14 సంవత్సరాల తర్వాత, విశాఖలో పిజీ చదువుతూ ఒకసారి యూనివర్శిటినుంచి సెలవులకు ఇంటికి రావడం జరిగింది. అప్పుడే ఆర్.టి.సి.వారు మా ఊరి నుంచి తిరుపతికి కొత్తగా నామాల బస్సులు వేయడం జరిగింది. అప్పుడు నేనూ, మా అమ్మ కలసి బస్సులో వెళ్లి, స్వామివారిదర్శనం చేసుకుని 1953లో మొక్కిన మొక్కును 1967లో తీర్చాము. ఆ తర్వాత స్వామి కృపాకటాక్షాలవల్ల చదువు పూర్తి అయ్యి మంచి గౌరవప్రదమైన పదవిలో ఉద్యోగం చేసి, పదవీవిరమణ పొంది, ఏ లోటూ లేకుండా సుఖశాంతులతో జీవిస్తున్నాను. ఆయనఆజ్ఞ ఇచ్చినప్పుడల్లా ఇప్పటికి 10-15 సార్లు తిరుమలకు వెళ్ళి, ఆ దివ్యమంగళస్వరూపాన్ని అరమోడ్పుకన్నులతో దర్శనం చేసుకుని, ఆనందానికి గురి అయ్యాను.

65 సంవత్సరాల వయస్సు పైబడిన నేను అబద్ధం ఆడాల్సిన పనిలేదు, స్వామికి 'ప్రచారం' అవసరము లేదు. పైన రాసిన సంఘటనలవల్ల ఒక్కవిషయం స్పష్టం అయ్యింది. 'ఆపద్బాంధవుడైన స్వామి ఉన్నాడు, రక్షిస్తాడు' అనే నమ్మికతో ఒక రూపాయికాసు, చిన్ని ఉంగరాన్ని కలిపి ముడుపు కట్టి మ్రొక్కితే, మా అమ్మ వేడుకోలుకు వశుడై, జాలిపడి, స్వామి కొండదిగి వచ్చి, నన్ను రక్షించి, తను వచ్చి వెళ్లా డన్న దానికి నిదర్శనాలు వదిలి, మరీ వెళ్లాడు. ఇవన్నీ కాకతాళీయంగా జరిగా యని అనుకోవడానికి వీల్లేదు. ఈ సంఘటన తలుచుకుంటే గగుర్పాటు చెందుతూ, విశ్రాంత సైంటిస్టుగా జీవిస్తున్న నాకు, ఇది ఆయనమహిమ కాక మరి ఏమిటి? అనిపిస్తుంది.

**శ్రీవారిదయ ఉంటే ఏ బాధలూ ఉండవు.**



శ్రీమాన్ పురిశై శ్రీరంగాచార్యస్వామివారిచే ప్రణీతమైన

# శ్రీలక్ష్మీగద్యమ్

12

"శ్రీచరణపరిచరణ" వ్యాఖ్య  వ్యాఖ్యాత - డా॥ ఈ.ఏ.శింగరాచార్యులు

**20. నిజపతిసమ్మోదిని !**

తనభర్తను ఆనందపఱచుదానా!

ఆశ్రితులపట్ల ఆమె చేయుపురుషకారముతో పతియగు భగవానుని ఆనందపరచును. అట్లే, తనదివ్యసౌందర్యముతో, హావభావములతో, శృంగారలీలావిలాసములతో స్వామిని ఆనందపరచును. **"మర్మస్పృశో రససిరావ్యతివిధ్యవృత్తైః కాంతోపభోగలలితైః లులితాంగయష్టిః, పుష్పావలీవ రసికభ్రమరోపభుక్తా త్వం దేవి! నిత్య మభినందయసే ముకుందమ్"** (మర్మస్థానములను స్పృశించురసనాడులను తాకునట్లుగా సంభవించిన ప్రియుని విలాసములచే నలిగినశరీరమును కల్గినదానవై, రసికుడైన భ్రమరముచేత అనుభవింపబడిన పూమాలికవలె నీవు నీ కాంతుని సదా ఆనందింపజేయుచున్నావు.) అనుచు భట్టర్ లక్ష్మీదేవి భర్తను ఆనందింపజేయు రీతినిగూర్చి మనోహరముగా వచించిరి. **"దశశతపాణిపాదవదనాక్షి ముఖైరఖిలైః అపి నిజవైశ్వరూప్యవిభవై రనురూపగుణైః, అవతరణైరతైశ్చ రసయన్ కమితా కమలే క్వచన హి విభ్రమభ్రమిముఖే వినిమజ్జతి తే"** (లక్ష్మీదేవి వేలాదిచేతులతో, పాదాలతో, ముఖాలతో, నేత్రాలతోను, తన విశ్వరూపవైభవానికి తగినట్లు, తగినగుణాలతో, అవతారాలతో నీతో నీ పతి ఆనందించినా నీ విభ్రమా లనేసుడిగుండంమధ్యంలో ఎక్కడో అతడు మునిగి ఉక్కిరిబిక్కిరి అవుతున్నాడు) అనుచు ఆమెదివ్యలీలా విలాస మనెడి సుడిలో విశ్వరూపుడైన భగవానుడుకూడా మునిగి ఎక్కడో ఒక చోట లీనమైపోవును - అనికూడా చమత్కరించిరి.

**21. మంథరతరమేహి**

మంథరతరం = మిక్కిలి మెల్లగా, ఏహి = రమ్ము.

**22. మంద మిమ మవేహి**

మందం = మందునిగా, ఇమం = ఇతనిని (నన్ను), అవేహి = గ్రహింపుము.

**23. మయి మన ఆధేహి**

మయి = నాయందు, మనః = మనస్సును, ఆధేహి = కల్గింపుము

**24. మమ శుభ మవధేహి**

మమ= నాకు, శుభం = మంచిని, అవధేహి = అవధరింపుము.

**25. మంగళమయి! భాహి**

మంగళమయి! = మంగళస్వరూపిణీ!, భాహి = ప్రకాశింపుము.

**"మంథరతరమేహి"** అను సంబోధననుండి ఇంతవరకు గల ప్రయోగము లన్నియు **"మారిమలైముళఞ్జిల్"** అను తిరుప్పావై పాశురములో గోదాదేవి శ్రీకృష్ణుని ఉద్దేశించి పేరోలగమునకు వేంచేసి, తాము చేయు విన్నపాలను ఆలకించి తమ కార్యమును సఫలము చేయు మని ప్రార్థించుటను స్మరింపజేయుచున్నవి.

**26. అకుంఠవైకుంఠ మహావిభూతినాయకి !**

అకుంఠవైకుంఠమహావిభూతి = అడ్డు లేని, వైకుంఠ లోకవిభూతికి, నాయకి = నాయకురాలా !

**27. అఖిలాండకోటి బ్రహ్మాండనాయకి !**

సమస్తబ్రహ్మాండములకు నాయకీ !

**28. శ్రీవేంకటనాయకి !**

శ్రీవేంకటాచలనాయకీ !

**29. శ్రీమతి ! పద్మావతి !**

శ్రీమతి ! పద్మావతీ !

**30. జయ ! విజయీ భవ !**

సర్వోత్కర్షతో వెలుగొందుము! విజయము నొందుము.

**6. జీయాచ్ఛ్రీవేంకటాద్రిప్రభువరమహిషీ నామ పద్మావతీ శ్రీః జీయాచ్చాస్యాః కటాక్షామృతరసరసికో వేంకటాద్రే రధీశః ।**

**జీయా చ్ఛ్రీవైష్ణవాళీ హతకుమతికథా వీక్షణై రేతదీయైః**
**జీయాచ్చ శ్రీశుకర్షేః పుర మనవరతం సర్వసంపత్సమృద్ధమ్॥**

శ్రీవేంకటాద్రిప్రభువరమహిషీ = శ్రీవేంకటేశ్వరుని పట్టపు రాణి, పద్మావతీ నామ = పద్మావతీ అను పేరుతో ప్రసిద్ధియై, శ్రీః = లక్ష్మీదేవి, జీయాత్ = వర్ధిల్లునుగాక!, అస్యాః = ఈమె యొక్క, కటాక్ష+అమృతరసరసికః = క్రీగంటి చూపులనే అమృత రసముతో ఆనందించువాడైన, వేంకటాద్రేః అధీశః చ = వేంకటా చలపతియును, జీయాత్ = వర్ధిల్లునుగాక ! ఏతదీయైః = వీరిద్దరియొక్క, వీక్షణైః = కటాక్షములచే, హతకుమతికథా = నశించిన దుర్వాదములను కల్గిన (దుర్వాదములను చేయు కుమతులను జయించినవారైన) వైష్ణవాళీ = శ్రీవైష్ణవసమూ హము, జీయాత్ = వర్ధిల్లునుగాక!, శ్రీశుకర్షేః = శ్రీశుకమహర్షి యొక్క, ఏతత్ పురం చ = ఈ పురముకూడ, అనవరతం = ఎల్లప్పుడు, సర్వసంపత్ సమృద్ధం = సకలసంపదలతో నిండినదై, జీయాత్ = వర్ధిల్లునుగాక!

దివ్యదంపతులు, వారిఅనుగ్రహమువలన వెలుగొందు శ్రీవైష్ణవలోకము, సర్వోత్కర్షతో వెలుగొందునుగాక ! ఆమె కటాక్షామృతరసమును గ్రోలు రసికుడగు శ్రీవేంకటేశ్వరుడును జయించునుగాక! వారిద్దరికటాక్షమును పొంది, శ్రీవైష్ణవ లోకముకూడ విరుద్ధవాదములను చేయువారిని జయించిన సర్వోత్కర్షతో నుండునుగాక! శ్రీశుకమహర్షినామముతో పిలువ బడి శ్రీశుకపురి (తిరుచానూరు) ఎల్లప్పుడు సకలసంపదలతో నిండినదై వెలుగొందునుగాక!

ఇందు భగవానునకు నిరూపకముగా లక్ష్మీదేవిని, ఆమెకు నిరూపకముగా భగవానుని నిర్దేశించుట విశేషము. ద్వితీయ పాదములో **"అస్యాః కటాక్షామృతరసికః"** అని భగవానుని ఉద్దే శించి పద్మావతీదేవి కటాక్షామృతమును అనుభవించు రసికు డనుటకు అనుగుణముగా–**"మణైనోక్కముణ్డాన్"** (లక్ష్మీదేవి కటాక్షములను అనుభవించెను) అను మొదలగు దివ్యసూరుల సూక్తులు అనుసంధేయములు.

7. **శ్రీరంగసూరిణేదం శ్రీశైలానంతసూరివంశ్యేన ।**
**భక్త్యా రచితం గద్యం లక్ష్మీః పద్మావతీ సమాదత్తామ్ ॥**

శ్రీశైలానంతసూరివంశ్యేన = తిరుమలై అనంతార్యుల వంశమునకు చెందిన, శ్రీరంగసూరిణా = శ్రీరంగాచార్యుల వారిచే, భక్త్యా = భక్తితో, రచితమ్ = రచింపబడిన, ఇదం = ఈ, గద్యం = గద్యమును, పద్మావతీ = పద్మావతి అనబడు, లక్ష్మీః = లక్ష్మీదేవి, సమాదత్తామ్ = గైకొనునుగాక !

శ్రీశైల అనంతసూరివంశమున జన్మించిన తిరుపతి నగర వాసులైన ఆచార్యపురుషులు పురిశై శ్రీరంగాచార్యులవా రను పండితులచే భక్తితో రచింపబడిన ఈ లక్ష్మీగద్యమును పద్మావతి అను పేరును గల లక్ష్మీదేవి స్వీకరించునుగాక !

**"పత్రం పుష్పం ఫలం తోయం యో మే భక్త్యా ప్రయచ్ఛతి, తదహం భక్త్యుపహృత మశ్నామి"** (పత్రం, పుష్పం, ఫలం, జలం – వీటిలో దేనినైనా భక్తితో సమర్పిస్తే, భక్త్యుపహృతమైన ఆ వస్తువును నేను గ్రహిస్తాను) అని భగవానుడు గీతలో నుడి వెను. **"భగవన్నారాయణాభిమతానురూపస్వరూప"** (భగవానుడైన శ్రీమన్నారాయణునకు అభిమతమైన, తగినరూపాలను, స్వరూపాన్ని కల్గినది) అని, **"తుల్యశీలవయోవృత్తామ్"** (భగవాను నితో తుల్యమైన శీలాన్ని, వయసును, వర్తనను కల్గినది) అని స్తుతింపబడునట్లు సమానస్వభావమును కల లక్ష్మీదేవి తనకు ఈ విధముగా భక్తులు భక్తితో సమర్పించినదానిని దేనినైనను ప్రీతితో గ్రహించునుకదా! కావున కవి భక్తితో సమర్పించిన గద్యప్రబంధరూపమైన ఈ వాక్పుష్పమును లక్ష్మీదేవియొక్క అవతారరూపిణియగు పద్మావతీదేవి తప్పకగ్రహించి, అను గ్రహించు ననుట సిద్ధము.

ఆర్యతమ అగు లక్ష్మిని స్తుతించు ఈ గద్యను **"ఆర్యా"** వృత్తముతో సమాప్తిచేయుట మిక్కిలి యుక్తము కదా!

**హృద్యైః గద్యైః పద్యైః స్వాద్యం శ్రీరంగదేశికేంద్రోక్తమ్ ।**
**లక్ష్మీగద్యం వ్యవృణోత్ దాసః శ్రీశింగరాచార్యః ॥**

**జయతు జయతు పుణ్యం పత్తనం శ్రీశుకర్షేః**
**జయతు జయతు కృష్ణః తత్ర దేవః కృపాళుః ।**
**జయతు జయతు దివ్యం పుష్కరం తత్ర సేవ్యం**
**జయతు జయతు ధన్య స్తన్నివాసీ కృతీ చ ॥**
**జయతు జయతు పద్మా వేంకటేశస్య పత్నీ**
**జయతు జయతు నిత్యం రంగసూరిః కవీంద్రః ।**
**జయతు జయతు గద్యం తత్కృతం దివ్యభవ్యమ్ ।**
**జయతు జయతు భక్తా శ్యత్ర చాసక్తచిత్తా ॥**

***(సమాప్తం)***

वेङ्कटाद्रिसमं स्थानं ब्रह्माण्डे नास्ति किञ्चन,
वेङ्कटेशसमो देवो न भूतो न भविष्यति।



भगवतः श्रीनिवासस्य सन्देशवाहिनी सप्तगिरिमासपत्रिका तिरुमल-तिरुपति देवस्थानेन पञ्चभाषासु (तेलुगु-तमिल-कन्नड-हिन्दी-आङ्गलभाषासु) प्रकाश्यमाना वर्तते। तथैव संस्कृताभिमानिनाम् इच्छाम् उररीकृत्य संस्कृतभाषायामपि मासपत्रिकामेनां समानेतुं तिरुमल-तिरुपति-देवस्थानेन सङ्कल्पिता। तेलुगु सप्तगिरि पत्रिकायाः अभ्यन्तरे सञ्चिका प्रकाश्यमाना वर्तते। अचिरादेव एषा पत्रिका स्वतन्त्रतया संस्कृताम्बरे विहरिष्यति। संस्कृतज्ञाः संस्कृताभिमानिनश्च एनां पत्रिकां स्वागतीकरिष्यन्तीति विश्वसिमः।

**- प्रधानसंपादकः**

**सूचना**

मुद्रितलेखानां विचाराः लोखकानामेव ।
एतद्विषये अस्माकं दायित्वं नास्ति।
*— प्रधानसंपादकः*


# सप्तगिरिः
## तिरुमल-तिरुपति-देवस्थानम्
## सचित्रमासपत्रिका
## डिसेंबर् - २०१३


# मार्गशीर्षव्रतः

*- श्री पी.आर्. रङ्गराजाचार्यः*

**हे**मन्तर्तोः प्राथमिको मासः मार्गशीर्षमासः। भगवता गीताचार्येण ''**मासानां मार्गशीर्षोऽह**''मिति गीताशास्त्रे अभिहितत्वात् अस्य औत्कृष्ठ्यं जानीमो वयम्।

अस्य मासस्यापरं नाम धनुर्मास इति। **'धनुषे धनुराकारः, मकरे कुण्डलाकृतिः'** इति आभाणकं वरीवर्ति। मासेऽस्मिन् शैत्यहेतोः अस्मच्छरीरं धनुरिव परिदृश्यते। पुष्यमासे तु कुण्डलाकारेण शैत्यबाधया निद्रान्ति जनाः।

वृष्टिहेतुभूतानां मेघानां गर्भधारणं धनुर्मासे एव। व्रतानां प्रारम्भं कर्तुं योग्यः मासः धनुर्मासः। केशवादि द्वादशनामसु केशवः मार्गशीर्षमासस्याधिष्ठानदेवता।

श्रीमते रामायणे लक्ष्मणः रामं वीक्ष्य एवं जगाद– **'अयं स कालः सम्प्राप्तः प्रियो यस्ते प्रियंवर'** इति। (अरण्यकाण्डे षोडशसर्गे। नातिशैत्यं नाति तापश्च मासेऽस्मिन् परिदृश्यते।

भगवतः प्रीतिदायके अस्मिन् मासे व्रताचरणं-दानं-स्नानं-पूजादिकं कार्यमिति व्रतानुष्ठानेन शीघ्रं फलं प्राप्नुयादिति च श्रीवैष्णवाचार्यैः वेदान्तदेशिकैः तात्पर्यचन्द्रिकायां प्रतिपादितम्।

लक्ष्मणेन सह रामः स्नानार्थं गोदानदीं गच्छति। तदानीं हेमन्तर्तुं वर्णयति लक्ष्मणः। अस्मिन् काले नूतनव्रीहीणां छेदनं कर्म प्रवर्तते सर्वत्र।

आग्रायणपूजाकरणेन पितृदेवताप्रीतिं सम्पादयन्ति केचन। साधवश्च पापापनोदनाय हेमन्तर्तौ यतन्ते। एवं रीत्या विस्तारेण हेमन्तर्तोः वर्णनं श्रीमद्रामायणे प्रदर्शितम्। उपरिचरवसुः इति कश्चित् राजा मार्गशीर्षमासे भगवत्प्रीत्यर्थम् उत्सवं चकारेति महाभारतं वर्णयति।

भूदेव्याः अंशत्वेनावतीर्णायाः गोदादेव्याः (भगवत्प्राप्त्यर्थं) व्रतानुष्ठानप्रकारः मार्गशीर्षमासे प्रवृत्तः। तत्र च निधानं श्रीमद्भागवतश्लोकः।

**हेमन्ते प्रथमे मासे नन्दगोपकुमारिकाः।**
**चेरुर्हविष्यं भुञ्जानाः कात्यायन्यर्चनव्रतम्।।इति।।**

गोदादेवी मार्गशीर्षव्रतम् अनुकारपद्धत्या आचरितवती। गोपिकास्त्रीणां व्रतानुष्ठानेन सुप्रीतः श्रीकृष्णः तासु अनुग्रहं ववर्ष। गोदादेव्याः व्रतमपि अङ्गीचकार भगवान् श्रीरङ्गनाथः। गोदादेव्याः व्रतविषयको ग्रन्थः ''तिरुप्पावै'' नाम्ना प्रसिद्धिमगात्। भगवता श्रीकृष्णेन 'गीतोपनिषत्' लोकहितार्थमुपदिष्टा। गोदादेव्याः 'गोदोपनिषत्' बहुजनसुखाय बहुजनहितायेत्यत्र न संशयलेशः।



'तिरुप्पावै' ग्रन्थः वेदेतिहासपुराणभगवच्छास्त्रसारः। भगवतः नारायणस्य जगत्कारणत्व - सर्वव्यापकत्व - सर्वज्ञत्व - सर्वशक्तत्वादयः सर्वेप्यंशाः वर्णिताः अस्मिन् ग्रन्थे।

तिरुप्पावै ग्रन्थे तृतीये पद्ये (ओङ्गि इति पद्ये) **'इदं विष्णुःविचक्रमे त्रेधा निदधे पदम्'** इति ऋग्वेदोक्तमन्त्रार्थं प्रादर्शि।

**'ऊळिमुदल्वन्'** (तिरुप्पावै ४) इति पदेन–

**''सकारणं करणाधिपाधिपः न चास्य कश्चित् जनिता न चाधिपः''** इति श्वेताश्वतरोपनिषन्मन्त्रः स्वीकृतः। मायनै (तिरुप्पावै ५) इति पदेन–

**'अस्मान्मायी सृजते विश्वमेतत्'** इति श्वेताश्वतरोपनिषदर्थः प्रदर्शितः।

तत्रैव **'तीयिनिल् तूसागुम्'** इति पदेन–

**'तद्यथा हि इषीकतूलम् अग्नौ प्रोतं प्रदूयेत, एवं हास्य सर्वे पाप्मानः प्रदूयन्ते'** इति छान्दोग्योपनिषन्मन्त्रसारः स्वीकृतः। स्थाली पुलाकन्यायेन दिङ्मात्रप्रदर्शनमेवैतत्।

भगवतः श्रीमन्नारायणस्य स्वामित्व - सौलभ्य - सौशील्य- वात्सल्यादि कल्याणगुणाः तिरुप्पावै मध्ये दरीदृश्यन्ते। वेदान्तपरिज्ञानमपि 'तिरुप्पावै' अध्येतारः प्राप्नुवन्ति।

प्राप्यस्य ब्रह्मणः स्वरूपं - प्रत्यगात्मनः (जीवात्मनः) स्वरूपं, प्राप्त्युपायं-फलं, प्राप्तिविरोधिज्ञानम् एतत्सर्वम् अर्थपञ्चकनाम्ना व्यपदिश्यते। तिरुप्पावैग्रन्थः अर्थपञ्चक मुपदि शति। शरणागतिविषयकं परिज्ञानमपि तिरुप्पावै द्वारा प्राप्नुमः।

**मन्मना भव मद्भक्तो मद्याजी मां नमस्कुरु।**
**मामैवैष्यसि युक्त्वैवम् आत्मानं मत्परायणः ।।**
**(गीता ९.३४)**

इत्युक्तदिशा गोदादेवी भगवत्स्मरणेनैव भगवन्तं श्रीरङ्गनाथं वैवाहिकेन विधिना परिणयं कृतवती।।

# श्रीवेङ्कटेश्वरमानसपूजा
## (श्रीवेङ्कटेश्वरद्विसप्तत्युपचारपूजा)

- *श्री दोर्बल प्रभाकर शर्मा*

**भ**गवतः श्रीवङ्कटेश्वरस्य जागरणप्रबोधनानान्तरं पादपीठ समर्पणानन्तरं चतुर्थं लक्ष्मीवीक्षणोपचारं कल्पयामः

**मुरारे! भवत्पादपद्मे मुखेऽब्जे**
**प्रसन्नेक्षणाब्जा सुधादृकूप्रसारम्।**
**तथाऽस्मासु संचारयत्यब्धिकन्या**
**दयां स्वर्णरत्नप्रसादैः कटाक्षैः।।**

हे मुरनामकराक्षसशत्रो! तद्विनाशकवेङ्कटेश्वर! प्रभो! भूदेवी प्रथमं तव सेवां पादपीठार्पणरूपेण कृतवतीति, माता लक्ष्मीरपि स्पर्धया स्ववीक्षणरुपेणैव तव सेवां कर्तुमिच्छति। अब्धिकन्या अब्धेः-समुद्रस्य, कन्या-पुत्री लक्ष्मीः प्रसन्नेक्षणाब्जा-प्रसादलक्षणवीक्षणा कमला, प्रसन्नकमलविशालविलोचना सती, प्रातरेव भवदुत्थानानुपदमेव भवत्पादपद्मे भवतः तव कमलसदृशे पादे, मुखेऽब्जे कमलसदृशे मुखे च सुधादृक्प्रसारम् अमृतमयदृष्टिप्रसरणं कुर्वती विराजते। केवलं भगवत्येव स्वदृष्टिं न प्रसारयति जगन्माता लक्ष्मीः। किन्तु भगवद्वीक्षणपवित्रतरां स्वदृष्टिम् (भगवति वेङ्कटेश्वरे प्रसारणानन्तरम्) अस्मास्वपि दयामयीं कृत्वा स्वर्णरत्नप्रसादिभिः कटाक्षैः तां निवेशयति। देव्याः दृक्प्रसारः इतस्ततः सञ्चारणेन भगवतः अस्माकं वा शीतलवायुप्रसारकव्यजनवीजनम् अनुभावयति। अतः हे प्रभो! सहजं लक्ष्मीवीक्षणमेव तव चतुर्थोपचारतया कल्पयामः।

एवं भगवतः श्रीनिवासस्य शयनागारे अन्तरेव श्री भूदेव्योर्जागरणोपचारं समापयामः । वयं तु बहिस्तः भावनारुपेणैव एतदुपचारचतुष्टयं परिकल्पयामः। तदनन्तरं द्वारोद्धाटनं मन्त्रप्रबोधं मन्त्रपठनपुरस्सरं जागरणकार्यं साधयामः। तत्र द्वाराद्बहिः अस्माकं कोलाहलं श्रुत्वा देव्यौ श्रीभुवौ स्वयंद्वारमुद्घाटयतः। अतः पञ्चम उपचारः मन्त्रपठननाम सङ्कीर्तनपुरस्सरं द्वारोद्धाटनम्।

**हे गोविन्द मुकुन्द माधव हरे ते सुप्रभातं प्रभो।**
**इत्यामन्त्रणनामकीर्तनपरा भक्ता इतो द्वरपाः।**
**त्वामुत्थापयितुं यतिप्रवरसद्विप्राःसवैखानसाः**
**श्रुत्यन्तश्रुतिमन्त्रसूक्तनिचयस्वस्तिश्रियस्तन्वते।।**

हे प्रभो! वेङ्कटेश्वर! तव भक्ताः द्वाराद्बहिः स्थित्वा हे गोविन्द! नित्यं गोभिः सह वर्तमान इन्द्रियैः सह तिष्ठन् गोपालक! मुकुन्द! मुक्तिप्रद माधव। मायाः लक्ष्माः पते हरे। सर्वहर्तः सर्वे दोषहर्तः सर्वमनोहर्तः सप्तगिरिवास वेङ्कटरमण! तव सुप्रभातम्। हे प्रभो! त्वं जागृहि इति वदन्तः तव नामसंकीर्तनपराः तव प्रबोधनपराश्च भक्ताः त्वाम् उत्थापयितुं यतन्ते। एकतः द्वारपालकाः तव प्रबोधनार्थं तव नामस्मरणाधिकं कुर्वन्तः प्रतीक्षन्ते तव दर्शनार्थम्। एवमेव तव द्वारोद्धाटनाय संन्यासिनः रामानुजीयाः ब्राह्मणोत्तमाः संप्रदायपालकाः अर्चनविधिज्ञाः उपचाराभिज्ञाः अपि तव प्रसादार्थिनः सन्तः वेदान्तवाक्यानि उपनिषन्मन्त्रान् वेदमन्त्रान् विष्णवादि देवतासूक्तानि पठन्तः स्वस्तिवाचनं कुर्वन्तः तव प्रबोधनार्थं प्रतीक्षमाणाः सन्ति। एवं मन्त्रस्तोत्रनामकीर्तनद्वारा तत्र विशेषशोभा काऽपि जायते। अतः प्रभो! द्वारोद्धाटनार्थम् अनुमतिं देहि इत्येवं प्रकारेण स्वामिनो वेङ्कटेश्वरस्य समन्त्रद्वारोद्धाटनं, प्रबोधमन्त्रपठनं चेति पञ्चम उपचारः।



एवं भगवतः प्रबोधानन्तरं प्रबोधो जात इति ज्ञात्वा मङ्गलवाद्यवादनपुरस्सरं बहिरावाहनं, हृदयाद्बहिरुत्सवमूर्तौ, मूलमूर्तेः स्थानाद्बहिरन्तर्हृदयं वा भगवतः स्वागतव्यवस्था कल्प्यते। तदेवावाहनम् इत्युच्यते।

**६. काले काले सदुषसि समे प्रातरर्चाविधिज्ञाः**
**अच्छाकारा अमलहृञ्जया बद्धकेशान्तशोभाः**
**त्वाम् आचार्याः शुभपरिकरा अर्चकाः पुण्ड्रदीप्ताः**
**घण्टाशङ्खं पणवपटहं चोत्स्वनं घोषयन्ति।**

हे प्रभो! वेङ्कटेश्वर! उषःकाले-शुभोदये समये प्रातः कालार्चनविधिज्ञाः आचार्याः अर्चकाः उषस्येव कृतस्नानाः स्वच्छधौतवस्त्रधराः सन्तः बद्धशिखाश्च सन्तः सम्यगूर्ध्वपुण्ड्र धारिणः सन्तः मङ्गलपूजाद्रव्यपुरस्सराः भूत्वा भवत्पूजार्थम् अनुमतिं प्रार्थयन्तः मङ्गलनादमयीं घण्टां, शङ्खं, पणवपटहादिकं वादयन्ति । एतेन मङ्गलवाद्यघोषाख्यः षष्ठोपचारः सम्पन्नः।

*(.... अनुवर्तते)*

## वेङ्कटेश्वरनवरत्नमालास्तुतिः

श्रीमानम्भोधिकन्याविहरणभवनीभूतवक्षःप्रदेशः
भास्वद्भोगीन्द्रभूमीधरवरशिखरप्रान्तकेलीरसज्ञः।
शश्वद्ब्रह्मेन्द्रवह्निप्रमुखसुरवराराध्यमानाङ्घ्रिपद्मः
पायान्मां वेंकटेशः प्रणतजनमनःकामनाकल्पशाखी ॥१॥

यस्मिन् विश्वं समस्तं चरमचरमिदं दृश्यते वृद्धिमेति
भ्रंश्यत्यन्ते च तादृग्विभवविलसितस्सोऽयमानन्दमूर्तिः।
पद्मावासामुखाम्भोरुहमद्(धु)मधुविद्धिभ्रमोन्निद्रचेताः
शश्वद्भूयाद्विनम्राखिलमुनिनिवहो भूयसे श्रेयसे मे ॥२॥

वन्दे देवं महान्तं दरहसितलसद्वक्त्रचन्द्राभिरामं
नव्योन्निद्रावदाताम्बुजरुचिरविशालेक्षणद्वन्द्वरम्यम्।
राजन्मार्ताण्डतेजःप्रसितशुभमहाकौस्तुभोद्भास्युरस्कं
शान्तं श्रीशङ्खचक्राद्यमलकरयुतं भव्यपीताम्बराढ्यम् ॥३॥

पायाद्विश्वस्य साक्षी प्रभुरखिलजगत्कारणं शाश्वतोऽयं
पादप्रह्वाघराशिप्रशमननिभृताम्भोधरप्राभवो माम्।
व्यक्ताव्यक्तस्वरूपो दुरधिगमपदः प्राक्तनीनां च वाचां
ध्येयो योगीन्द्रचेतस्सरसिजनियतानन्ददीक्षाविहारः ॥४॥

आद्यं तेजोविशेषैरुपगतदशदिङ्मण्डलाभ्यन्तरालं
सूक्ष्मं सूक्ष्मातिरिक्तं भवभयहरणं दिव्यभव्यस्वरूपम्।
लक्ष्मीकान्तं खगेन्द्रध्वजमघशमनं कामितार्थैकहेतुं
वन्दे गोविन्दमिन्दीवरनवजलदश्यामलं चारुहासम् ॥५॥

राकाचन्द्रोपमास्यं ललितकुवलयश्यामलाम्भोजनेत्रं
ध्यायाम्याजानुबाहुं हलनलिनगदाशर्ङ्गरेखाञ्चिताङ्घ्रिम्।
कारुण्याञ्चत्कटाक्षं कलशजलधिजापीनवक्षोजकोशा-
श्लेषावाप्ताङ्गरागोच्छ्रयललितनवाङ्कोरुवक्षस्स्थलाढ्यम् ॥६॥

श्रीमन्संपूर्णशीतद्युतिहसनमुखं रम्यबिम्बाधरोष्ठं
ग्रीवाप्रालम्बिवक्षस्स्थलसततनटद्वैजयन्तीविलासम्।
आदर्शौपम्यगण्डप्रतिफलितलसत्कुण्डलश्रोत्रयुग्मं
स्तौमि त्वां द्योतमानोत्तममणिरुचिरानल्पकोटीरकान्तम्॥७॥

सप्रेमौत्सुक्यलक्ष्मीदरहसितमुखाम्भोरुहामोदलुभ्यन्-
मत्तद्वैरेफविक्रीडितनिजहृदयो देवदेवो मुकुन्दः।
स्वस्ति श्रीवत्सवश्राः श्रितजनशुभदः शाश्वतं मे विदध्यात्
न्यस्तप्रत्यग्रकस्तूर्यनुपमतिलकप्रोल्लसत्फालभागः ॥८॥

श्रीमान् शेषाद्रिनाथो मुनिजनहृदयाम्भोजसद्राजहंसः
सेवासक्तामरेन्द्रप्रमुखसुरकिरीटार्चितात्माङ्घ्रिपीठः।
लोकस्यालोकमात्राद्विहरति रचयन् यो दिवारात्रलीलां
सोऽयं मां वेंकटेशप्रभुरधिककृपावारिधिः पातु शश्वत् ॥९॥

श्रीशेषशर्माभिनवोपवक्लृप्ता
प्रियेण भक्त्या च समर्पितेयम्।
श्रीवेंकटेशप्रभुकण्ठभूषा
विराजतां श्रीनवरत्नमाला ॥१०॥

**इति श्रीवेंकटेश्वररत्नमालिकास्तुतिः समाप्ता॥**

(श्रीवेंकटेश्वरकाव्यकलापग्रन्थात् संगृहीतः)

# अन्नमाचार्यसङ्कीर्तनामृतम्
## (सामन्तरागः)

- डॉ. समुद्राल लक्ष्मणय्य

**एवं श्रुतिमतमिदमेव त-**
**द्भावैतु (भावयितु) मतः परं नास्ति** ।।पल्लवी।।

**अतुलजन्मभोगासक्तानां - हितवैभवसुखमिदमेव**
**सततं श्रीहरिसङ्कीर्तनं तद्व्यतिरिक्तं वक्तुं नास्ति** ।।एवं।।

**बहुलमरणपरिभवसक्ताना-मिहपरसाधनमिदमेव**
**अहिशयनमनोहरसेवा तद्विहरणं विना विधिरपि नास्ति** ।।एवं।।

**संसारदुरितजाड्यपराणां-हिंसाविरहितमिदमेव।**
**कंसान्तकवेङ्कटगिरिपतेः प्रशंसैव पश्चादिह नास्ति** ।।एवं।।

**भावः**

हे भक्तजनाः! अधुना मया निवेद्यमानं वेदमतमिदमेव। आलोच्य निर्णेतुम् अतः परं न किञ्चिदस्ति।

पुनः पुनः जन्मसु भोगेषु च आसक्तेभ्यः जनेभ्यः इदमेव मतं हितं तत्प्रयुक्तं वैभवसुखं च प्रददाति। किं तत् मतमिति चेत्, सदा श्रीहरेः नामसङ्कीर्तनमेव, ततो भिन्नं सुखं न किञ्चिद्वर्तते।

भूयो भूयः मरणकृतेनावमानेन पीडितचित्तानां जनानां इह लोके परलोके च आत्मोन्नतिसाधनमिदमेव, किं तत् इति चेत्, शेषशायिनः श्रीमन्नारायणस्य मनोज्ञा सेवैव। तं सेवाविनोदं विहाय अन्यो विधिः नैवास्ति।

संसाररूपेण कालुष्यरोगेण बाधितानां जनानां हिंसाशून्यः उपायः अयमेव। कोऽयमिति चेत्, कंसध्वंसिनः वेङ्कटाचलपतेः नामसङ्कीर्तनमेव, तद्विहाय अन्यः कश्चिदुपायो नास्तीति भावः।



**विशिष्टांशाः**

**'पुनरपि जननं पुनरपि मरणम्'** इत्युक्तया रीत्या जनाः सदा संसारे जनन-मरणग्रस्ताः दुःखमनुभवन्ति। तस्य दुःखस्य निवारणोपायः अत्र अन्नमाचार्येण श्रीवङ्कटेश्वरभक्ताग्रेसरेण उद्घुष्यते।

**'नामसङ्कीर्तनं यस्य सर्वपापप्रणाशनम्'** इति भागवतोक्तिमनुसृत्य श्रीमन्नारायणस्य नाम्नां सङ्कीर्तनमेव सर्वात्मना पापप्रणाशकं भवति। तद्द्वारा जननमरणक्लेशात् निवृत्तिर्लभ्यते।

कलिदोषनिवारणं नामसङ्कीर्तनेनैव सिध्यतीति **''भगवतः श्रीमन्नारायणस्य नामोच्चारणमात्रेणैव निर्धूत कलिर्भवति''** इति कलिसन्तरणोपनिषद्वचनेन स्पष्टं भवति।

नारदमुनिरपि स्वविरचितेषु भक्तिसूत्रेषु- **''सर्वदा सर्वभावेन निश्चिन्तितैर्भगवानेव भजनीयः।'' ''सङ्कीर्त्यमानः शीघ्रमेवावि र्भवति अनुभावयति च भक्तान्''** (७९,८०) इत्युवाच।

भगवातः गुणानां कर्मणां नाम्नां च कीर्तनं सर्वपापनिवारकमिति भागवते अजामिलोपाख्याने पठ्यते-

**एतावताऽलमघनिर्हरणाय पुंसां**
**यत्कीर्तनं भगवतो गुणकर्मनाम्नाम्।**

*(भागवते - ६-३-२४)*

अन्नमाचार्यः कलिसन्तरणोपनिषदि प्रतिपादितया रीत्या भगवन्नामसङ्कीर्तनं कृत्वा मुक्तिमवाप।

द्वात्रिंशत्सहस्रसङ्कीर्तनानि भगवत्सङ्कीर्तनपराणि तेन विरचितानि। तत्र शतसंख्याकानि संस्कृतभाषानिबद्धानि सङ्कीर्तनान्यपि लभ्यन्ते। तादृशसङ्कीर्तनेषु अन्यतममिदम्।

अत्र सङ्कीर्तनमेव संसारविमुक्त्यै अत्यन्तं समुचितः सुलभतरश्चोपाय इति स्वानुभवपूर्वकं पदकवितापितामहेन अन्नमाचार्येण प्रतिपादितमिति ज्ञेयम्।।

# मोक्षस्वरूपविवेचनम्

डॉ.यु.वि. शेषकुमारः

**भा**रतीय शास्त्रानुसारं पुरुषार्थः चत्वारः इति सुविदितः विषयः एव सर्वेषाम् । ते च - धर्मः; अर्थः; कामः; मोक्षः इति। तत्र परमपुरषार्थः मोक्ष इति सर्वमतसारः। किन्तु मोक्षविषये बहूनां दार्शनिकानां मध्ये विप्रतिपत्तिः विद्यते। तद्विषये किञ्चिदत्र विचार्यते।

लोके मानवास्सर्वेऽपि स्वस्य दुःखनिवृत्तिः कथं स्यात्, परमसुखावाप्तिश्च कदा भवेदित्याशयेनैव प्रवर्तन्ते। यतः मानवानां यत्किञ्चित् सुखं प्राप्यते, दुःखं वाऽनुभूयते प्रत्यहम्। परन्तु ऐकान्तिकसुखं संसारे नैव भवति। अतः तेषां प्रवृत्तिः दुःखनिवृत्तौ सुखावाप्तौ च भवति। प्रवत्तिश्चेयं स्वभावत एव भवति आबालगोपालम्।

अत्र प्रथमतः प्रवत्तिः दुःखनिवृत्या एव भवति, पश्चादेव सुखप्राप्त्यर्थम्। यत्र भूयसी दुःखनिवृत्तिः अल्पीयसी च सुखावाप्तिः तत्र सर्वेषामपि प्रथमतो दुःखनिवृत्तये प्रवृत्तिः स्यात् । यत्र तु विपरीतं तत्र भूयान् सुखलाभो भवेदिति केषाञ्चित् प्रथमतः प्रवृत्तिः स्यात्।

यथाकथञ्चित् अस्तु। दुःखनिवृत्तिः, सुखप्रप्तिश्च मानवानामिष्टं भवति। अस्मिन् विषये नास्ति संशीतिलेशोऽपि । परन्तु दुःखनिवृत्तिः, सुखप्राप्तिः इति विषयः कस्मिन् पर्यवस्यतीत्यत्रैव विचारः। मानवानामाशा खलु अकुण्ठिता भवति। इन्द्रियनिग्रहः नास्ति चेत् कथं मानवः आत्यन्तिकसुखमाप्नुयात्। ये हि विषयौन्मुख्येन प्रवर्तन्ते तेषां हि आशा उत्तरोत्तरमभिवर्धते।

अतः केवलविषये प्रवृत्तिमतां सर्वात्मना सुखावाप्तिः न भवेदेव। यत्किञ्चित् सुखं लब्धं चेदपि तदपि दुःखमेव जनयेत्, विषये यत्प्राप्तं तदधिकतया वाञ्छायाः सत्त्वात्। तस्मात् लोकेऽनुभूयमानानां विषयसम्बन्धजन्यानां नानाविधानामपि वैषयिकसुखानां चरमावधिः न ज्ञायते। एवमेव अनुभूयमानेषु वैषयिकसुखेषु कस्य ज्यायस्त्वं, कस्य उपादेयत्वं, कस्य हेयत्वमिति निश्चेतुमपि न शक्यते व्यवहारविद्भिः।

अतः लोके अनुभूयमानाः सर्वेऽपि अल्पाः न्यूनकालिका एव भवन्ति। तेऽपि कदाचित् सुखरूपेण, कदाचित् दुःखरूपेण वा भासन्ते। तस्मात् एतदपेक्षया आत्यन्तिकदुःखनिवृत्तिपूर्वकसुखप्राप्तिः यथा स्यात् तथा मानवैः प्रयत्नः कार्यः। तादृशनिरतिशयसुखत्त्वे किं प्रमाणमिति चेदुच्यते।

एतादृशीमवस्थां प्रप्तवन्तः आत्मनः न किञ्चिदपि वाञ्छनीयं भवति। आह च दैवी उपनिषत् - ''सोऽश्नुते सर्वान् कामान् सह ब्रह्मणा विपश्चितेति, अथ सौऽभयं गतो भवति'' इति। एतादृश्यः श्रुतयः प्रमाणमत्र।

अत्र वाक्ये ''**सर्वान् कामान् अश्नुते**'' इत्यनेन निरतिशयसुखावाप्तिः आपाततः प्रतीयते। ''**अभयं गतो भवति अमृतत्त्वं प्राप्नोति। न स भूयोऽभिजायत**'' इति वाक्येन निरतिशयदुःखनिवृत्तिः उक्ता भवति। अयं हि भाविदुःखानुसन्धानजन्यं चित्तगतविकारविशेषः। स्वल्पदुःखस्यापि सत्त्वे भयं स्यादेवेति तद्रहिततया भाव्यञ्चेत् निरतिशयुदुःखनिवृत्तिः आवश्यकी भवति अत एव श्रुतिः - अथ सोऽभयं गतो भवति इति प्रतिपादयति। अतः सामान्यतः मोक्षः अस्त्येवेति सिद्ध्यति।

अथ मोक्षस्वरूपविचारः। निरतिशयदुःखनिवृत्ति पूर्वकनिरतिशयसुखप्राप्तिः मोक्षः इति विषये सन्दिह्यते। किं निरतिशयदुःखनिवृत्तिरेव मोक्षः उत निरतिशयसुखमेव मोक्षः, आहोस्वित् उभयमपि मोक्ष इति विकल्प्यते।

आत्यन्तिकं निरतिशयं सुखमेव मोक्ष इति चेत् तत्र दोषः भवत्येव। यद्यपि निरतिशयं सुखं भवति तथापि आत्यन्तिकी दुःखनिवृत्तिः नास्ति चेत् कथं निरतिशयसुखत्वं सम्भवति। लेशतःदुःखमस्ति चेदपि दोषायैव स्यात्। निरतिशयं

सुखं चेत्, दुःखासंस्पृष्टं सुखमेव दुःखसंयुक्तसुखापेक्षमतिशेत इति वक्तव्यम्। यत्र दुःखनिर्वृत्तिर्न भवति तत्र कथं मोक्षशब्दवाच्यत्वं भवेदिति दोषः।

केचित्तु - इतरसुखापेक्षया यदधिकं सुखं भवति, तत्र दुःखलेशस्य सत्त्वेपि न दोषः। लेशत एव दुःखं भवतीति तत्र सुखे न्यूनतां सम्पादयति। अधिकसुखस्य सत्त्वात् तदपेक्षया दुःखस्य न्यूनत्वात् तत्र दुःखबुद्धिरेव न प्रतीयत इति। यथा कथञ्चित् निरतिशयसुखमेव मोक्षः इति मोक्षशब्दार्थः वक्तुं शक्यत इति वदन्ति।

अत्रेदं समाधानम् - सर्वत्र शब्दार्थः विना सङ्कोचं ज्ञातव्यो भवति। यदि निरतिशयसुखप्राप्तिवेलायामपि ईषद्दुःखं स्यात्तर्हि निरतिशयसुखशब्दार्थस्य मोक्षशब्दार्थस्य च सङ्कोचः अवश्यं कार्यं स्यात् । प्रामाणिकाः एतन्न सहन्ते। श्रुतिस्तु स्पष्टमाह - ''**अथ सोऽभयं गतो भवतीति।**''

## मोक्षविषये दर्शनकाराणां मतभेदः

नास्तिकदर्शनेषु मूर्धन्या भवन्ति इमे चार्वाकाः, बौद्धाः, जैना इति।

१) चार्वाकाः लोकायतिकाः इति व्यवह्रियन्ते। ते खल्वेवं वदन्ति -

**यावज्जीवं सुखं जीवन्नास्ति मृत्योरगोचरः।**
**भस्मीभूतस्य देहस्य पुनरागमनं कुतः।।**

इति लोकगाथामनुरुन्धाना अर्थकामावेव पुरुषार्थौ मन्यमानाः पारलौकिकमर्थमपह्नुवानाः चार्वाकमतमनुवर्तमाना एवानुभूयन्ते। अत एव चार्वाकमतस्य लोकायतमित्यन्वर्थपरं नामधेयम्।

अत्रैव पुरषार्थः कः? निर्णयः कः? इत्यपि विवृतम् -

**अङ्गनालिङ्गनाज्जन्यसुखमेव पुमर्थता।**
**कण्टकादिव्यथाजन्यं दुःखनित्य उच्यते।।**

भारते शान्तिपर्वणि -

**द्वे ब्रह्मणी वेदितव्ये शब्दब्रह्म परं च तत्।**
**शब्दब्रह्मणि निष्णातः परं ब्रह्माधिगच्छति।।**

अत्र लोकेषु शास्त्रशब्देन शब्दब्रह्मशब्दने च वेदः अभिहितो भवति।

श्रीमद्भगवद्गीतायां श्रीकृष्णः उपदिशति-

**तस्माच्छास्त्रं प्रमाणं ते कार्याकार्यव्यवस्थितौ।**
**ज्ञात्वा शास्त्रविधानोक्तं कर्मकर्तुमिहार्हसि।।**

इति। अतः शास्त्रशब्दवाच्यो वेद एव प्रमाणं भवति। तदनुगृहीततत्त्वस्यैव प्रामाण्यमिति सिद्धम् । एतत्सर्वं समालोच्य श्रीमद्वेदान्तदेशिकैः उदाहृतः श्लोकः-

**असारम् अल्पसारञ्च सारं सारतरं त्यजेत्।**
**भजेत् सारतमं शास्त्रे रत्नाकर इवामृतम् ।।**

इति । शास्त्रमपि उपासकमनोऽनुकूलं सर्वमुपदिशति। तत्र ऐहिकामुष्मिकफलानिसर्वाणि प्रदर्शितानि। तथापि ऐहिकविषयमुख्यानि, पशुफलादिसुखानि, आमुष्मिकस्वर्गफल सुखम्, केवलात्मानुभवसुखञ्च त्याज्यं भवति। मोक्षरूपं सारतममेव फलं प्राप्तव्यमित्युक्तं भवत्यत्र। अतः नास्तिकदर्शनोक्ताः सर्वेऽपि केवलार्थकामपरा इति हेया एव भवन्ति।

## वैदिकमतनिरूपणम्

यद्यपि वैदिकमते सर्वाण्यपि आस्तिकदर्शनानि अन्तर्भवन्ति, तथापि प्रकृते वेदान्तविषयस्यैव विचार्यमानत्वात्, तद्विरुद्धनास्तिकमतनिरसनेन, वैदान्तमतस्थापनेन च इतराण्यपि आस्तिकदर्शनानि सिद्दमिति कृत्वा वेदान्तदर्शनमेव अत्र प्रतिपाद्यते।

## श्रीभगवद्रामानुजीयं विशिष्टाद्वैतदर्शनम्

भगवद्रामानुजमुनिभिः प्रवर्तिते विशिष्टाद्वैतसिद्धान्ते मोक्षः इति शब्दस्य निर्विकारदेशान्तप्राप्तिः, कर्मपरप्राकृतलो

कनिवृत्तिपूर्विकेति अर्थः ऊह्यः। अर्थात् प्रकृतिमण्डले क्लेशान् अनुभूय ततो उपासनेन नर्मुक्तः श्रीवैकुण्ठाख्यं लोकं प्राप्नोतीत्यर्थः। अयं च पर्यङ्कविद्यासिद्धः वेदितव्यः। अत्र श्रुतिरपि - ''तद्विष्णोः परमं पदं सदा पश्यन्ति सूरयः'' इति विष्णुसूक्ते, प्रश्नोपनिषदि - ''यूतत्कनयो वेदयन्ते'' इति, कठोपनिषदि - सोऽध्वनः परमाप्नोति तद्विष्णोः परमं पदम् इति। अत्र स्मृतयः -

**यद्येन कामकामेन न साध्यं साधनान्तरैः।**
**मुमुक्षुणा यत्सारव्येन योगेन न च भक्तिः।।**

**प्राप्यते परमं धाम यतो नावर्तते यतिः।**
**तेन तेनाप्यते तत्तत् न्यासेनैव महामुने।।**

श्रीमद्भगवद्गीतायाम्ः

**मामुपेत्य पुनर्जन्म दुःखालयमशाश्वतम्।**
**नाप्नुवन्ति महात्मानः संसिद्धिं परमां यतः।।**

इतिहाससमुच्चये-

**ब्रह्मणः सदनादूर्ध्वं तद्विष्णोः परमं पदम्।**
**शुद्धं सनातनं ज्योतिः परं ब्रह्मेति तद्विदुः।।**

भारते शान्तिपर्वणि-

**रम्याणि कामचाराणि विमानानि सभास्तथा ।**
**आक्रीडाविविधा राजन् पद्मिन्यश्चालोदमाः।।**

अतः श्रुतिस्मृतिसिद्धस्थानविशेषप्राप्तिरेव मोक्षः इति विशिष्टाद्वैतसिद्धान्तस्थितिः।

## श्रीभगवदानन्दतीर्थीयं द्वैतदर्शनम्

एतेऽपि रामानुजमतवत् श्रीवैकुण्ठमङ्गीकुर्वन्ति। तत्प्राप्तिरेव मुक्तिरित्यपि तेऽङ्गीकुर्वन्ति। परन्तु मोक्षे आनन्दतारतम्यं मुक्तानां परस्परमस्तीति ते स्थापयन्ति। परमया भक्त्या विष्णुपदं लभ्यत इति ते उररीकुर्वन्ति। पापक्षयानन्तरं प्राप्यत इत्यपि माध्वा अभ्युपगच्छन्ति। पञ्चसंस्कारप्रदर्शनमुखेन मुक्तिरपि दर्शिता भवति सर्वदर्शनसङ्ग्रहे।

**चक्रं बिभर्ति पुरुषोऽभितप्तं बलं देवानाममृतस्य विष्णोः**
**स याति नाकं दुरितावधूय विशन्ति यद्यतयो वीतरागाः**
**तद्विष्णोः परमं पदं येन गच्छन्ति लाञ्छिताः**
**उरुक्रमस्य चिह्नैः अङ्किता लोके सुभगा भवामः ।।**

इति।

## श्रीशङ्कराणाम् अद्वैतमतम्

एते अभेदवादिनः। ब्रह्म सत्यं जगन्मिथ्या ब्रह्मैवाहं न चापरः इति दृष्ट्या ऐक्यमेव तेऽङ्गीकुर्वन्ति। अभेदश्रुतय एव मुख्यत्वन तैः स्वीकृताः। महावाक्यसिद्धः अद्वैतपक्षः अन्ते मोक्षेऽपि भवतीति ब्रह्मस्वरूपावाप्तिरेव मोक्ष इति तेषां पक्षः। तथा हि - मोक्षे नापूर्वं किञ्चित् प्रापणीयं भवति। परन्तु मूलस्वरूपेणावस्थानम् । मूलस्वरूपेणावस्थानं बद्धावस्थानामपि यद्यपि भवति तथापि तदा न ज्ञातं भवति। तत्कारणभूताविद्याविनाशेन तज्ज्ञायते। तत्स्वरूपप्राप्तिरपि भवति। तस्मात् अविद्याविनाश एव मोक्षः इति पर्यवस्यति। तादृशनाशश्च विद्यैकसाध्यः भवति। विद्या च आत्मसाक्षात्कार एव। आत्मसाक्षात्कारश्च अद्वैततत्त्वज्ञानाद्भवति। तच्च बद्धदशायामपि भवति। दग्धपटन्यायेन बद्धदशा आत्मसाक्षात्कारं न बाधते। तथा च जीवन्मुक्तो भवति आत्मा। अत्र जीवनम् अमुख्यम्, मुक्तिश्च मुख्या इति इतरसिद्धान्तेभ्यः भिदा। अत्र अविद्या, माया, उपाधिः इति बहुधोच्यते बद्धकारणम्। तदुक्तमात्मोपनिषदि-

**घटे नष्टे यथा व्योम व्योमैव भवति स्वयम्।**
**तथैवोपाधिविलये ब्रह्मैव ब्रह्मवित्स्वयम्।।**

इति। अत्रायमभिसन्धिः । द्वैतिनः, अद्वैतिनः, विशिष्टाद्वैतिनश्च स्वस्वमतप्रवर्तकप्रदर्शितविधया अनुसरन्ति। तत्र दोषप्रदर्शनं गुणप्रदर्शनमित्यादिकं तत्तन्मतग्रन्थेषु बहुधा प्रपञ्चितमिति नात्र प्रबन्धे प्रयत्नो विधीयते।

వార్తాలహరి

# అంగరంగ వైభోగంగా శ్రీవారి సాలకట్ల (వార్షిక) బ్రహ్మోత్సవాలు
## (05-10-2013 నుండి 13-10-2013 వరకు)

ఈ సంవత్సరం అక్టోబరు 05 వ తేదీన శ్రీవారి బ్రహ్మోత్సవాల్లో భాగంగా ధ్వజారోహణాన్ని నిర్వహించారు. ఆలయంలోని ధ్వజస్తంభంపై గరుడధ్వజపటాన్ని ఎగురవేసి, నాలుగుదిక్కులలోని సకలదేవతలను ఈ ఉత్సవాలకు ఆహ్వానించడమే ధ్వజారోహణకార్యక్రమం. అదేరోజు ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీ నల్లారి కిరణ్‌కుమార్‌రెడ్డి శ్రీవారికి పట్టువస్త్రాల్ని ప్రభుత్వం తరపున సమర్పించారు.

రాత్రి 9 గంటలకు శ్రీవారు సప్తశిరసుల పెద్దశేష వాహనంపై విహరించి, భక్తులకు కనువిందు చేశారు. 06.10.2013 అదివారం ఉదయం శ్రీవారి ఉత్సవ మూర్తిని చిన్నశేషవాహనంపై ఊరేగించారు. ఆరోజు రాత్రి శ్రీవారు హంసవాహనంపై ఊరేగారు. 07.10.2013 ఉదయం శ్రీవారికి సింహవాహనసేవ జరిగింది. ఆ సమయంలో స్వామివారు వజ్రఖచితకిరీటంతో, సకలాభరణాలతో కనువిందు చేశారు. ఆ రోజురాత్రి స్వామివారు తమ ఉభయదేవేరులతో కలిసి భోగశ్రీనివాసునిగా ముత్యాలపందిరి వాహనంపై తిరువీథులలో ఊరేగారు. నాలుగోరోజు అంటే 08.10.2013, ఉదయం శ్రీవారు కల్పవృక్షవాహనంలో భక్తులకు దర్శనమిచ్చారు. కామితార్థప్రదాయినిగా కల్పవృక్షానికి మన పురాణాల్లో ఓ విశిష్టస్థానముంది. ఆ కల్పవృక్షాన్నిసహితం తన వాహనం చేసుకోగలిగిన శ్రీవారిని దర్శించుకున్న భక్తుల అదృష్టమే అదృష్టం. ఆ రోజుసాయంకాలం శ్రీవారి సర్వభూపాల వాహనసేవ జరిగింది.

బ్రహ్మోత్సవాలలో ఐదోరోజు అంటే అక్టోబరు 09వ తేదీ బుధవారం శ్రీవారుమోహినీఅవతారంలో భక్తులకు దర్శనమిచ్చారు. అదేరోజురాత్రి శ్రీవారికి గరుడసేవ జరిగింది. వైష్ణవ సంప్రదాయంలో గరుడవాహనసేవకు అత్యంతప్రాధాన్యముంది. ఈ సేవను తిలకించడానికి భక్తులు తండోపతండాలుగా తిరుమలకు తరలివచ్చారు.

ఆరోరోజు, 10.10.2013 గురువారం ఉదయం శ్రీవారు హనుమంతవాహనంపై ఊరేగారు. ఇదేరోజు శ్రీవారి స్వర్ణరథరంగడోలోత్సవం వైభవంగా సాగింది. రాత్రి స్వామివారు గజవాహనంమీద తిరువీథులలో ఊరేగుతూ భక్తుల్ని మురిపించారు.

ఏడోరోజు అంటే 11.10. 2013 శుక్రవారం ఉదయం మల యప్పస్వామి సూర్యప్రభవాహనంలో, సాయంకాలం చంద్రప్రభ వాహనంపై వేంచేశారు. ఈ వాహనంమీద వచ్చే స్వామివారు తెలుపువస్త్రాలు, తెల్లని పుష్పాలు, మాలలు ధరించి రావడం విశేషం.

ఎనిమిదోరోజు, 12.10.2013 శనివారం తిరుమలలో జరిగిన రథోత్సవంలో వేలాదిమంది భక్తజనం పాల్గొన్నారు. భక్తులు ప్రత్యక్షంగా పాలుపంచుకోగలిగే స్వామివారి వాహనసేవ ఇదే. అదేరోజురాత్రి స్వామివారు అశ్వవాహనంపై ఊరేగారు.

బ్రహ్మోత్సవాలలో తొమ్మిదవరోజు, అక్టోబరు 13 ఆదివారం రోజున స్వామివారికి చక్రస్నానం జరిగింది. అదేరోజు సాయంకాలం శ్రీవారిఆలయధ్వజస్తంభంమీద గరుడపతాకాన్ని అవరోహణం చేశారు. ఈ అవరోహణంతో బ్రహ్మోత్సవాలకు విచ్చేసిన ముక్కోటిదేవతలకు వీడ్కోలు పలకడం జరిగింది. దీంతో బ్రహ్మోత్సవాలు మంగళకరంగా పూర్తయ్యాయి.

తొమ్మిదిరోజులపాటు అత్యంత కోలాహలంగా, పండుగ సంరంభంతో వైభవంగా జరిగిన ఈ ఉత్సవాలలో తి.తి.దే. అధ్యక్షులు, పాలకమండలి సభ్యులు, తి.తి.దే. కార్యనిర్వహణాధికారి, తిరుమల, తిరుపతి సంయుక్త కార్యనిర్వహణాధికారులు నిరంతరం భక్తులకు అందుబాటులో ఉంటూ, శ్రీవారిబ్రహ్మోత్సవాలను అత్యంతసమర్థవంతంగా నిర్వహించారు.

ఈ కూపను కత్తరించండి

తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి



# సప్తగిరి

(ఆధ్యాత్మిక మాసపత్రిక)

## చందా నమోదు పత్రం

1. పేరు మరియు చిరునామా : ______________________
(విడి విడి అక్షరాలలో అర్థమయ్యేలా వ్రాయండి. మరియు పిన్‌కోడ్ తప్పక వ్రాయండి)
______________________
______________________
______________________
(పిన్‌కోడ్ తప్పని సరి) ☐☐☐☐☐☐

2. కావలసిన భాష : ☐ తెలుగు ☐ తమిళం ☐ కన్నడం ☐ హిందీ ☐ ఇంగ్లీషు

3. సంవత్సర/జీవిత చందా : ☐ రూ. 60/- ☐ రూ. 500/-

4. చందా పునరుద్ధరణ :
(అ) చందా నెంబరు :
(ఆ) భాష :

5. చెల్లించిన మొత్తం :
డి.డి.నెం. : తేది :
(చెక్కులు స్వీకరించబడవు)

ప్రదేశం :

తేది : చందాదారుని సంతకం

## మోసపోకండి !

మన రాష్ట్రంలోని కొన్ని నగరాలలో కొందరు వ్యక్తులు అనధికారికంగా **సప్తగిరి మాసపత్రికకు** చందాల రూపంలో అధిక మొత్తాలు వసూలు చేస్తున్నారని, తద్వారా శ్రీవారి దర్శనం చేయిస్తా మని నమ్మిస్తున్నా రని తెలిసింది. అలాంటివారిమాటలకు మోసపోకండి. సప్తగిరి చందాకు, శ్రీవారి దర్శనానికి మరియు ప్రసాదాలకు ఎటువంటి సంబంధం లేదు. చందా మీరు నేరుగా "ప్రధాన సంపాదకుడు, సప్తగిరి, తి.తి.దేవస్థానం, తిరుపతి" వారికి పంపించాలి. (లేదా) తిరుపతిలోని శ్రీనివాసం యాత్రికుల వసతి సముదాయంలో కూడా మీచందాలను కట్టవచ్చు. సప్తగిరికి చందాలు వసూలుచేయుటకు దేవస్థానం బయటివ్యక్తులను ఎవరినీ నియమించలేదు.

**అధిక మొత్తాలు చెల్లించకండి!**
**వారి మాటలకు మోసపోకండి!!**

సంప్రదించండి...!
సప్తగిరి చందాల విచారణకు
**0877 - 2264359**
**0877 - 2264543**

- సప్తగిరి సంవత్సర చందా రూ.60/-, జీవితచందా రూ.500/-లు; డి.డి. / ఎం.ఓ. ని **'చీఫ్ ఎడిటర్, 'సప్తగిరి', తి.తి.దే., తిరుపతి'** వారిపేరున తీయాలి.
- సప్తగిరిచందాదారులుగా చేరదలచుకొన్నవారు/ తమచందాను పునరుద్ధరించుకోదలచినవారు ఈ కూపనులో గానీ లేక తెల్లకాగితంలోగానీ పైన పేర్కొన్నవిధంగా వివరాలు వ్రాసి, పంపవచ్చు. క్రింద ప్రచురించిన చిరునామానుమాత్రమే సంప్రదించండి. **తి.తి.దే. ప్రధాన సంపాదక కార్యాలయం, తిరుపతికి తప్ప-మీరు ఎవరిదగ్గర డబ్బులు కట్టి, మోసపోకండి.**
- మనిఆర్డరు పంపేవారు అందులోనే మీయొక్క చందావివరాలు వ్రాసి, ఈ క్రిందిచిరునామాకు పంపాలి.
- మా చిరునామా **"ప్రధానసంపాదకుడు, సప్తగిరి కార్యాలయం, టి.టి.డి.ప్రెస్ కాంపౌండ్, కె.టి.రోడ్డు, తిరుపతి - 517 507".**

Edited and published on behalf of T.T. Devasthanams by **Dr. C. Saila Kumar,** M.A.,Ph.D., Chief Editor, T.T.D. and printed at T.T.D. Press by **T.Ravi,** (i/c Manager), P.R.O., T.T.D. Press, Tirupati - 517 507.